# ఆంగ్లేయవైద్యచింతామణి

ఆంగ్లేయౌషధ గుణదీపిక, ఆధునిక మానసిక చికిత్స, రోగ్యుపచార బోధిని

ముద్దుల మూట

కపటదేశభక్త పట్టాభిషేకము (నాటకము), లవణసత్యాగ్రహ గీతము,
(ఆంగ్లమున - కన్ఫెషన్స్ ఆఫ్ యే బోగస్ పేట్రియట్,
డాక్టర్ పట్టాభి అన్స్వేర్డ్, 200లవ్ మాక్సిమ్స్)

గ్రంథకర్తయగు,

చిల్లరిగె సేతుమాధవరావుచే

రచియింపబడినది.

సికింద్రాబాదు
ప్రిమియర్ ముద్రాక్షర శాలయందు
ముద్రితము.

( పునర్విమర్శ నందిన నాల్గవ కూర్పు )

1947



వెల రూ. 6—0—0



గ్రంథకర్త:

చిల్లరిగె సేతుమాధవరావు

# తొలిపలుకు

ఆంగ్లేయవైద్య చింతామణి యను నీగ్రంథమును సమకూర్చిన యుపకారకులు శ్రీయుత సేతుమాధవరావుగారి శ్రమమెంతయుఁ గృతజ్ఞతాపాత్రము. ప్రస్తుతకాలమున భారతదేశమునం దంతటను అంగ్లేయౌషధశాల లేర్పడి యాంగ్లేయ చికిత్సాలయములును, నాంగ్లేయౌషధవిక్రయశాలలును వెనవేలుగ గానవచ్చుచున్నవి. ఆయుర్వేదమునఁ జికిత్సావిధానములు పెక్కులుగ నుదహరింపబడియున్ననునౌషధములును, తన్మూలకములగు మూలికలును శ్రమప్రాప్యములై విజ్ఞాతలగు వైద్యుల యొద్దగాని, ఆపణవీధులయందుగాని పెక్కుఔషధములు సంసిద్ధముగ లభింపమిచే యిట్టియేర్పాట్లు కావింపవలసియున్నవి. కొన్ని ప్రాంతముల యందు లభించినను, వానినుపయోగించు విధానమును తన్మూల రహస్యములు నెల్లఱకును సులభగ్రాహ్యములుగ గానరాకుండుట శోచనీయము. ప్రభుత్వమువారిచే నేర్పఱుపఁబడిన అన్ని ఔషధాలయములందును నాంగ్లేయౌషధములు వాడఁబడుచున్నవి, ప్రభుత్వమువారిచే నెలకొల్పఁబడిన వైద్య విద్యాలయములందు ఆంగ్లేయ వైద్యబోధ గావింపఁబడుచున్నది. అట్టియిక్కాలమున నాంగ్లేయౌషధములవిజ్ఞానమును బోధించు నీగ్రంథమునకు అసామాన్య ప్రాముఖ్యము గలదనియు, ఇత్యాదియెల్లరకును నత్యంతోపయోగకరమనియు మాయాశయము. ఆయుర్వేదము అనాదియై దేశమున కత్యంతోపయోగకరమైనను, దానికి దోడుగ బరకీయ విద్యావిజ్ఞాన ప్రదాయకమగు నీగ్రంథము అత్యధికోపయోగకరమనుటకు సంశయములేదు.

ఈమహాగ్రంథమును సర్వస్వామ్యములతో మాకొసంగిన శ్రీయుత సేతుమాధవరావుగారి వంశోద్ధారకులకు మా అభివందనములు.

ఇట్లు
కొండా శంకరయ్య
ప్రకాశకులు.

# విషయసూచిక.




మొదటికూర్పు—1909—1,000 ప్రతులు

రెండవకూర్పు—1915—1,500 ప్రతులు

మూడవకూర్పు—1939—1,000 ప్రతులు

నాలుగవకూర్పు—1947—2,000 ప్రతులు,

# Materia Medica

## ఆంగ్లేయౌషధ గుణదీపిక

మా ఆంగ్లేయౌషధ గుణదీపిక ఆంధ్రదేశమందు ప్రజానురాగమును వడయుచుండుటయే ాక, గవర్నమెంటు ఆసుపత్రులయొక్క ఉపయోగార్థమై కూడ నీ గ్రంథము నీ క్రింది ద్యోగస్థులకు సప్లయి చేసియుంటిమి.

| | | | ప్రతులం సంఖ్య. |
|---|---|---|---|
| ప్రెసిడెంట్ | జిల్లాబోర్డు | అనంతపురం | 5 |
| డిటో | తాలూకాబోర్డు | డిటో | 1 |
| డిటో | డిటో | ఆదోని (బళ్ళారి జిల్లా) | 3 |
| డిటో | డిటో | హాస్పేట (డిటో) | 3 |
| డిటో | డిటో | ఏలూరు | 2 |
| డిటో | డిటో | కర్నూలు | 1 |
| డిటో | డిటో | కోయిలకుంట్ల (కర్నూల్) | 1 |
| ర్మన్, | మ్యునిసిపల్ కౌన్సిల్, | అనంతపురం | 1 |
| డిటో | డిటో | ఏలూరు | 1 |
| డిటో | డిటో | శ్రీకాకుళము | 1 |
| డిటో | డిటో | కర్నూల్ | 1 |
| డిటో | డిటో | ఆదోని (బళ్ళారిజిల్లా) | 2 |
| స్ట్రిక్టు మెడికల్ అండ్ శానిటరీ ఆఫీసరు, | | బళ్ళారి | 1 |
| విల్ సర్జన్ | | రాజమండ్రి | 1 |
| పరింటెండెంట్, రిఫర్మెటరీ స్కూల్, | | చెంగల్పట్ | 2 |
| బ్ అసిస్టెంట్ సర్జన్ | | కుడ్లిగి బళ్ళారిజిల్లా | 1 |
| డిటో | | సిరిగుప్ప డిటో | 1 |
| డిటో | | కౌల్ బజార్ డిటో | 1 |
| డిటో | | రాయదుర్గము డిటో | 1 |

# కృతజ్ఞత

ఈ గ్రంథమును సిద్ధపరచుటయం దుపయోగించిన యీక్రింది గ్రంథముల యెడల ఎంతయు కృతజ్ఞతను వహించి యుంటిని.

---

| | |
|---|---|
| ఆస్లర్స ప్రిన్సిపిల్స అండ్ ప్రాక్టీస్ ఆఫ్ మెడిసన్ | Osler's Principles & Practic of Medicine |
| టెక్స్టుబుక్ ఆఫ్ మెడిసన్-జి.ఏ. గిబ్సన్ | Text Book of Medicine G. A. Gibson |
| హైజీన్ అండ్ డిజీజెస్ ఆఫ్ ఇండియా (హెహిర్) | Hygiene and Diseases of India (Hehir) |
| మూర్స ఫ్యామిలీ మెడిసన్ అండ్ హైజీన్ ఫర్ ఇండియా | Moore's Family Medicine and Hygiene for India |
| డాక్టర్ ఫుట్స హోమ్ సైక్లోపీడియా బ్రిటిష్ ఫార్మకోపియా | Dr. Foote's Home Cyclopoedia British Pharmacopoeia |
| ఎక్స్ట్రా ఫార్మకోపియా-మార్టిండేల్ అండ్ వెస్టుకాట్ | Extra Pharmacopeia- Martindale and Westcott |
| ప్రిస్క్రైబర్స ఫార్మకోపియా (కెంప్ అండ్ కో) | Prescribers' Pharmacopoeia (Kemq & Co.) |
| విట్లాజ్ మెటీరియా మెడికా | Whitla's Materia Medica |
| ప్రాక్టికల్ నర్సింగ్-స్టీవార్టు అండ్ కఫ్ | Practical Nursing - Stewart & Cuff |
| మాన్యుయల్ ఫర్ హాస్పిటల్ నర్సెసు (యం. ఏ. నిస్బెట్) | Manual for Hospital Nurses (M. A. Nisbett |
| ఏ. బి. సి. ఆఫ్ నర్సింగ్ (ఇ. యం. క్లార్క) | A. B. C. of Nursing (E. M. Clarke) |
| గోల్డన్ రూల్స ఆఫ్ సిక్ నర్సింగ్ (డబ్లు. యం. డ్రమండ్) | Golden rules of Sick Nursing (W.M. Drummond) |
| హెరాల్డు ఆఫ్ హెల్త్ (మాసపత్రిక) | Herald of Health |
| హౌస్‌హోల్డు ఫిజిషన్ బై జె. యమ్‌గ్రగార్ అండ్ రాబర్ట్సన్ | Household Physician by J. M. Gregor & Robertson |

# మొదటి కూర్పునకు విజ్ఞాపన.

ఏదైన నొకవ్యాధియందు బనిచేయుచుండు గారణము లనేకము లుండుటచే, వైద్యుడు వ్యాధిలోని ప్రధాన అస్వస్థతావయవముపై నెక్కువ శ్రద్ధ నుంచుచు, రోగియొక్క స్థితిగతులన్నిటిని విచారించుట ముఖ్యమయి యున్నదని, అందఱును యొప్పుకొనిన అంశమే అయియున్నది. ఈ హేతుకారణముననే, అధిక సామర్థ్యమును వహించియున్న వైద్యశాస్త్రజ్ఞులుగూడ, వైద్యగ్రంథమును వ్రాయుటయందు, వ్యాధులకు జికిత్సలలో జాలినంతవివరముల నిచ్చుట కశక్తులుగ నున్నారని, ఒకానొక ఆంగ్లేయ వైద్యశాస్త్రజ్ఞుడు చెప్పియున్నాడు ఇట్టిసందర్భమున, నేనువ్రాసియున్న యీగ్రంథము నందలి వ్యాధులయొక్క చికిత్సలు పూర్ణములని చెప్పబూనుట కెంతయు ఆస్పదములేదు. అయినను, ఆంగ్లేయ భాషయందుగల ప్రమాణములగు వైద్యగ్రంథముల బరిశీలించి, అందలి సారాంశముల నవసరమునుబట్టి యెక్కువ విరళముగ నిందుబొందుపరచి యుండుటచే, యీగ్రంథము చాలవరకుపయోగకారిగ నుండగలదని తలంచెదను.

క్రమమైన వైద్యసహాయము లేనప్పుడును, వైద్యసహాయ ముండినను, రోగియును రోగియొక్క పరిచారకులును గమనింపవలసిన అంశములను దెలిసికొనుటకును, యీ గ్రంథముపయోగింపబడుట కుద్దేశింపబడినది. కొన్ని ఉగ్రతవ్యాధులయందు, రోగికి నిచ్చు మందులయందు కంటె, రోగికి జేయు క్రమమగు పరిచారములయందు జికిత్స యెక్కువగ నిమిడియున్నదిగాన, నీ గ్రంథమును విద్యాధికుల గృహములందలి స్త్రీలును, జదువుటవలన బ్రయోజనముగ నుండగలదు. యిరోపియను ఔషధముల వాడుటయందిచ్చగలిగి, అందలి చికిత్సాపద్ధతుల గుర్తెరుంగనట్టియు, ఆంగ్లేయ భాషయందు బరిచయములేనట్టియు, దేశీయ వైద్యులకును యీ గ్రంథము ఉపయోగముగ నుండగలదని చెప్పుటకు సందియములేదు.

ఆంగ్లేయ వైద్యశాస్త్రపఠనమునందు నాకు చిరకాలమునుండియు నుండెడి అభిరుచి నా సంబంధమగు గ్రంథముల దరుచుగ జదువుటయందు గుతూహలుండ నగుటవలనను, అనంతర మొకానొక సందర్భమున నీ ఔషధముల నెక్కువగ వాడుటయందు గొంత అనుభవమును గ్రహించుటవలనను, ఆంధ్రభాషయం దిట్టి గ్రంథముయొక్క కొఱతను గుర్తించి యీ గ్రంథమును రచియించుట కుద్యుక్తుడనై ఆంధ్రులయందు యీవైద్యశాస్త్ర సంపన్నులును, ప్రావీణ్యులును, ఉండియున్నను, నే నీ పనికి సాహసముతో బూనుకొంటిని.

మచిలీపట్టణము, }
15—8—09.

ఇట్లు,
గ్రంథకర్త.

# మొదటి కూర్పునకు పీఠిక.

హిందూదేశ చరిత్రలో గడచిన 10 సం॥ లను దేశీయ భాషలయందు సాహిత్యశాస్త్ర సంబంధములగు గ్రంథములను రచియించుటకుఁ బ్రసిద్ధిఁజెందిన కాలముగ నున్నది. ఈ మహాత్కార్యమునకుఁ బరోపకార బుద్ధిగల ప్రసిద్ధ పురుషులే గాక, ప్రత్యేకముగ భాషాభివృద్ధికై స్థాపింపబడిన సంఘములు గూడ కృషిసల్పుట, ఎంతయు శ్లాఘ్యము. ఆంధ్రభాషయొక్క పునరుద్ధారణమునకై తమ కాలమును, దమ బుద్ధిని, దమ ధనమును వినియోగించుటచే నిట్టి సత్ప్రయత్నమునకు మూలపురుషు లనఁదగిన రావుబహదూరు కందుకూరి వీరేశలింగముగారు సాహిత్యశాఖయందు, దాము రచించిన గ్రంథావళికి దోఁడుగ ప్రకృతిశాస్త్రశాఖయందుఁ గూడ గొన్ని గ్రంథములఁ బ్రచురించిరి. కాని, పాశ్చాత్యవిద్య దేశమం దంతట బ్రబలని మీఁదట దేశభాషలన జనులకెల్లరకు నెక్కువ యభిరుచి లేకుండుటచే శ్రీపంతులుగారి శాస్త్రవిషయిక గ్రంథములు జనుల నాకర్షించకుండుటయే గాక, అప్పటినుండియు, నీవిషయమై పునః ప్రయత్నము లెవ్వియు జరిగియుండలేదు. ఇప్పుడు దేశమం దంతటను గాఢములగు మార్పులు గొన్నిగలిగెను. ఇప్పటివఱకు జీవచ్ఛవంబులై యుండిన దేశభాషలు పునర్జీవము నొంది, నూతన భావములను, నవీన శక్తులను, దేశీయులయందు బ్రసరింపఁజేసి, దేశాభివృద్ధికిఁ దోడ్పడవలెనని సర్వత్ర గ్రహింపఁబడినది. శాస్త్రముల నన్నిటిని, దేశభాషలయందే బాలురకుఁ గఱపవలయునను నంశము గమనింపబడి, విద్యావిధాన మంతయు మార్పు నొందుచున్నది. ఇందు కనుగుణముగ విజ్ఞానచంద్రికా మండలివారు, జీవశాస్త్రమును, పదార్థవిజ్ఞాన శాస్త్రమును, బ్రచురించి యుండిరి. ఆంధ్రభాషాభివర్ధనీ సంఘమువా రారోగ్యశాస్త్రమును ముద్రించుచున్నారు. వీనికి దోడుగ నిప్పుడు మా స్నేహితులగు నీ గ్రంథకర్తగా రాంగ్లేయ వైద్యసంగ్రహము నొకదానిని బ్రచురించిరి. దానికి వీరు నన్ను* పీఠిక వ్రాయ గోరినందున, నే నిందులకు సంతోషపూర్వకముగ నంగీకరించితిని.

ఏదేశములో నైనఁ బ్రకృతి శాస్త్రజ్ఞాన మెంతవఱకు నభివృద్ధిలోనున్నను, లేకున్నను, వైద్యశాస్త్రము మాత్రము సర్వత్ర అనుదిన మభ్యసింపఁ బడుచున్నది. ఈవ్యాధికీ ఔషధమని చెప్పువారు గొందఱైయుండ, నీవ్యాధికీ యౌషధ మిట్టివిధంబునఁ బనిచేయు నని చెప్పఁగలవారు మఱికొంద ఱుందురు. వివిధ దేశములం దాచరణములో నున్న వైద్యవిధానంబుల కిదియే భేదము. హిందూదేశ మందంతట సామాన్యముగ నభ్యసింపబడు వైద్యపద్ధతులు పూర్వోక్త శాఖలలోఁ బ్రథమశాఖకుఁ జేరి యున్నట్లు కన్పట్టుచున్నవి. వైద్యశాస్త్రము ప్రయోగ శాస్త్రములలో నొకటిగ నెంచఁబడుచున్నది. అనగా నొక్కొక్క యౌషధియొక్క గుణములు దాని ప్రయోగము వలననే గమనించవలెను గాని, కేవలము యూహాపద్ధతులచే గ్రహింపఁ బడఁజాలవు. కాని దేహములలోని వివిధావయవముల పైనెరో యౌషధమునిచ్చిన పిమ్మట నూతనముగా గన్పించు దుర్లక్షణములు, ఔషధముల యక్రమసేవచేజనించెనా, లేకవ్యాధియొక్క సహజదోషములా, అను సంశయమును నివారించుకొనఁ

గలదు. ఆంగ్లేయవైద్యమునందు వాడఁబడు నౌషధములలో 'డిజిటాలిసు' అనునొకచెట్టుగలదు. దీనినుండి రసముదీసియు, లేక దీనియాకును, కషాయమును, హృద్రోగములకువాడఁబడును; కొన్నిదినము లుపయోగించిన పిమ్మట, పూర్వము నిమిషమునకు 72–120 సార్లుసంచారముగలనాడి, ఇప్పుడు 35–50 సార్లు మాత్రమే సంచరించుటయు, దెబ్బకు దెబ్బకు నుండు యవకాశ మొకసారి యెక్కువగను, మరియొకసారి తక్కువగను, నుండుటయు, తటస్థించును. ఇట్టినూతన దుర్గుణమునకు కారణమౌషధమే, యనికొన్నిసమయములందు నిర్ధారణముచేయగలము. 'ఫెనాసెటి' నను పదార్థము మరియొకటి గలదు. ఇదిజ్వరములను వెంటనే దగ్గించునను భ్రమచేఁ దీవ్రజ్వరములయందు వాడుటయు, రోగియొక్క శరీరము చలువలు గ్రమ్మటయు, నొక్కొక్కెడ రోగిమృతిజెందుటయు, దటస్థించును. ఆధునిక వైద్యమునందీయౌషధము జ్వరములలో వాడుటయే నిషేధము. ఔషధములునడచు క్రమమును జక్కగగుర్తెరుగకుండుట యిట్టిసందర్భములో నపాయమునకే హేతువగును. ఆంగ్లేయవైద్యశాస్త్రమునందెట్టి లోపములున్నను, వ్యాధులకన్నిటికిని దగిన ప్రతిక్రియలు నియమింపబడినను, లేకున్నను, నౌషధములసంచి విరివిగనున్నను, లేక కొఱఁతగ నున్నను, వినియోగింపబడు నౌషధములన్నియు నడచుక్రమమును, నవి యేయేఅవయవములపయి నెట్టిమార్పులను గలుగఁజేయునదియు, నిట్టిమార్పువలన నేయేవ్యాధులెట్లు చికిత్సనొందునదియు' సవిస్తరముగ బ్రయోగప్రమాణముచే నిర్వర్ణింపబడి యున్నది. ఆయుర్వేదమునందిట్టి వివరణమంతయు నుండియుండవచ్చునుగాని, దేశీయవైద్యులీ శాఖనుగూర్చి యిందుకయిన శ్రద్ధగొనకుండుట ఎంతయు శోచనీయము.

.........

ఆంగ్లేయవైద్యశాస్త్రమును బఠించువిద్యార్థులు ప్రథమమునని శాస్త్రమున కాధారభూతములను బఠింపవలెను. పదార్థవిజ్ఞాన శాస్త్రమును రసాయనిక శాస్త్రమును జదివి, తరువాత శారీరశాస్త్రమునుగూర్చి శ్రద్ధగొనవలెను ఇందు, శారీరనిర్మాణ శాస్త్రమనియు శారీరవ్యాపార శాస్త్రమనియు రెండుశాఖలు గలవు. ఈరెండునుఆరోగ్యదశయందున్న శరీరమునుగూర్చియే బోధించును. వీనితరువాత ననారోగ్యదశయందుండు శారీరనిర్మాణమును, శారీరవ్యాపారములను బఠింపవలెను. ఈపునాదులపై వైద్యశాస్త్రమాధారపడియున్నది. అటుపిమ్మటనే వస్తుగుణదీపిక చదువబడును. ఈశాస్త్రమునందే, ఔషధముగ నుపయోగింపఁబడు ప్రతిపదార్థమును ప్రతిమాలికయును శరీరమునందుండువివిధావయవములపై నెట్టిమార్పులను గలుగఁజేయునదియు, నామార్పులు వ్యాధినెట్లుక్షీణింప జేయునదియు తెలియజేయబడును. దీనికిజతగ నారోగ్యశాస్త్రము చదువబడును. ఆరోగ్యశాస్త్రము, వ్యాధులు దేహమున బ్రవేశించక పూర్వము వానినెట్లు నివారింపఁగలమో యావిధములనుగూర్చి బోధించును. వీనితరువాత వైద్యశాస్త్రము చదువబడును. దీనియందు, వ్యాధియొక్క నిర్వచనమును, కారణములను,

వ్యాధివలన శరీరనిర్మాణ వ్యాపారములందు గలుగుమార్పులును, వ్యాధియందుండు లక్షణములును, వ్యాధివలన రోగికిగలుగు భావిగతియు, వ్యాధిచికిత్సయు, సవిస్తరముగ దెలుపబడును. ఇటులనే శస్త్రశాస్త్రమును, ప్రసవశాస్త్రమును, నేత్రచికిత్సయు, గలుపబడును. ఇట్టిశాస్త్రములన్నియు నాంధ్రభాషలో గలుపుటకు సదుపాయములింకనులేవు. కాని భాషాభివృద్ధికొఱకు ప్రారంభకష్టములే ఎక్కువచిక్కులతో గూడినవిగానుండినవిగావున, నెచ్చటనోయొకస్థలమున యత్నములను బ్రారంభింపవలెను. సహజముగఁ గనుపించు నావశ్యకతను బట్టితక్కినశాస్త్రములన్నియుగూడఁ గాలక్రమమున నాంధ్రీకరింపబడును. ఇట్టి సందర్భమున గ్రంథకర్త గారెంతయు వ్యయప్రయాసముల కోర్చియీగ్రంథపూర్వకముగ నాంగ్లేయవైద్యశాస్త్రసారము నాంధ్రులకందజేసి వారికృతజ్ఞతకు బాత్రులయిరి.

మచిలీపట్టణము,
10-8-09.

భోగరాజు పట్టాభిసీతారామయ్య,
బి. ఏ., యమ్. బి. అండ్ సి. యమ్.



# రెండవ కూర్పునకు పీఠిక.

---

వ్యాధియొక్క విశేష విషయములలో గారణములు ఆత్మీయ లోపఫలితములై యుండును. కొందరు బహు అరుదుగా వ్యాధిగ్రస్తు లగుదురు. దీనికి గారణము వారారోగ్యవంతములగు జీవితముల గడపుచు, తమ పరిసరముల యొక్క ఆరోగ్యస్థితియెడ శ్రద్ధను వహించి యుందురు. అట్టివారు తాము భుజించు ఆహారము యెడలను, తాము త్రాగుజలము యెడలను, తాము లోనకుపీల్చు వాయువు యెడలను, తాము ధరించు దుస్తులయెడలను, జాగ్రత్తలను బుచ్చుకొనుచు, తమ శరీరముల యొక్కయు తమ గృహముల యొక్కయు గృహపరిసరముల యొక్కయు పరిశుద్ధస్థితిని గమనించుచుందురు. ఇండియా దేశమున దింపలకు భిన్నముగా కోటానకోట్లు తరుచుగా వ్యాధిపీడితు లగుచుందురు. ఈస్థితి కొంతవరకు దేశము యొక్క శీతోష్ణస్థితి ఫలితమై యున్నదిగాని, చాలవరకు పైన సూచింపబడిన అంశముల యందలి లోపమువలన గలుగుచున్నదని మనము తెలియదగి యున్నది.

ఈవ్యాధి నాకస్మిక ఫలితముగ నెన్నడు నెంచరాదు. వ్యాధి యెల్లప్పుడును ప్రత్యేక కారణ ఫలితమై యుండును. వ్యాధిని చాలవరకు రాకుండ జేయవచ్చును. మనము క్రమమగు నాహారము లోనికి దీసికొనుచు, వ్యర్థపదార్థముల సకాలములో వెలిబుచ్చుచు, శరీరములోని అవయవము లన్నియు ననుగుణ్యముగ బనిచేయుచుండినయెడల, శరీరమునం దారోగ్యత వర్ధిలుచుండును. ఈకార్య క్రమములయందే లోపము గలిగినను వ్యాధి సంభవించుచుండును; శరీరము వ్యాధిచే బాధ నొందుచున్నపుడు ఆరోగ్య సూత్రముల నతిక్రమించుటవలన గలిగిన శిక్షగా నెంచనగును.

మనిషి వ్యాధిగ్రస్తుడై యున్న ప్రతివిషయమునందును కారణ మెద్దియో యుండి యుండును. ఆకారణ ముండియుండక పోయినయెడల వ్యాధియే లేకపొయ్యెడిది. ఈ కారణములలో ప్రధానమగు వాటివిషయమై; అవిమనల నస్వస్థపరచ కుండుటకు ప్రయత్నింప వలయును. ఈకారణములలో గొన్ని సులభ సాధ్యములై మనుజునియొక్క సామాన్య జ్ఞాన దృష్టివలన దొలగింపనగును. మరికొన్ని కారణములు కష్టసాధ్యములై, అవి యేవిధముగా శరీరముపై బనిచేయునదియు, వాటి నెట్లు దొలగింప వలసినదియు, గనుగొనుటకు కొన్ని సంవత్సరముల సహితము పట్టును. ఇప్పటికిని గొన్ని వ్యాధులలో గారణములు అసంపూర్తిగా మాత్రమే తెలియబడి మరికొన్ని వ్యాధులలో బొత్తుగా దెలియకుండగనే యుండియున్నవి.

ఆరోగ్యసూత్రములనను సరించుటకు పద్ధతుల దెలుపునట్టి శాస్త్రమున కారోగ్యశాస్త్ర మందురు. ఈశాస్త్రవిధులను గమనించుట వలన వ్యాధులను రాకుండజేయుటకు వీలుగానుండుటయేగాక వ్యాధి ప్రవేశానంతరము సులభముగ వ్యాధి నివారణను జేయుటకు అనుకూలముగ నుండును.

వ్యాధియొక్క కారణములను గ్రహించియుండుటవలన నావ్యాధిని బారదోలుటకు క్రమమయిన మార్గమున బనిచేయుటకు వీలుగ నుండును. శాస్త్రీయముగ నీ కారణములను గ్రహించియుండుటవలన వ్యాధిచికిత్స చేయుటయందు మనపూర్వికులకంటె ననేకవిధములుగ మనము మంచిస్థితియం దుండియుంటిమని నమ్మదగి యున్నది. ఇందులకై దృష్టాంతముగ గొన్ని వ్యాధుల గురించి విచారించి చూచెదము.

## చలిజ్వరము.

ఒకవిధమగు క్రిమిజాలములు రక్తమునందు బ్రవేశించి, అందలి రక్తకణములను ప్రతి జ్వరతాపమునందును నశింపునట్లు జేసి, శరీరములోని కొన్ని అల్లికల యందును అవయవములందును యీ జీవాణువులు ప్రవేశించి, వాటి కార్యక్రమ ఫలితముగ చలిజ్వరలక్షణములు కలుగుచున్నవని మనము స్పష్టముగ దెలియనగును. ఈవ్యాధి సంబంధములగు జీవాణువులు దోమలు కుట్టుటమూలమున మన శరీరమునందు బ్రవేశమగుచున్నవి. దోమలు చలిజ్వరవ్యాధి పీడితులను గుట్టుటవలన వారలరక్తమునుండి యీవ్యాధి సంబంధమగు జీవాణువులను గ్రహించి వాటిని మరల వేరుమనుజులయందు బ్రవేశ పెట్టుచున్నవి. ఈకారణమున నీవ్యాధి వ్యాప్తత నందుచుండును. క్వినిన్ను సేవించుటవలన వ్యాధి నివారణ నందుటయేగాక, జ్వరమును గలిగించుటకు జాలినన్ని జీవాణువులు రక్తమునందు వృద్ధిగాకపూర్వ మీయౌషధము నుపయోగించుటవలన వ్యాధి రాకుండగూడ జేయవచ్చును. ఈక్రింది అంశములను గమనించుట వలన చలిజ్వరవ్యాధి సాధ్యమగునంతవరకు వ్యాప్తత నందకుండునటుల జేయవచ్చును.

(1) చలిజ్వర వ్యాధిపీడితులను విడిగా నుంచుట మూలమునను.

(2) వ్యాధి గ్రస్తులనుండి వ్యాధి సంబంధమగు జీవాణువుల గ్రహించిన దోమలను నశింపుజేయుట మూలమునను.

(3) చలిజ్వరవ్యాధి సంభవించిన వారలకు క్వినీన్ను యిచ్చుట మూలమున మరల నావ్యాధి రాకుండజేయుట మూలమునను.

(4) దోమలు ప్రవృద్ధినందునట్టి స్థలములయందు వాటిగుడ్లు మొదలగువాటిని నశింపుజేయుట మూలమునను.

---

## ఆమ విరేచనములు.

ఆమ విరేచనములలో నొకజాతియందు యీ సంబంధమగు వ్యాధిహేతువులగు జీవాణువులు మనుజుడు లోనికి దాగు జలమార్గమున పేగులయందు బ్రవేశించి వ్యాధిని గలిగించును. ఆరోగ్యస్థితియందున్న పేగులలో నేవిధమగు దుష్ఫలితములను గలుగజేయవు. పేగులలోని ఆమ సంబంధమగు పొరలనంటియుండి సహజముగ జిగురుదనమును వహించి యుండు బిలములు యీజీవాణువుల దాడులను లక్ష్యపెట్టవు. కాని, సంపూర్ణపచనము కాని ఆహారమువలన గలుగు రేగుదలవలనగాని, జీర్ణమగుటయందు కాఠిన్యతను వహించిన పదార్థమువలనగాని, అలసట నొందినపుడుగాని, చలిగాలి సోకినపుడుకాని, మిక్కుటముగ భుజించుటవలనగాని, అజీర్ణత ప్రవేశించుటకగు నే కారణమువలనగాని, యీజీవాణువులు పెద్దపేగునందు రేగుదలను గలుగజేసి, ఆమ పదార్థమును వృద్ధిపరచి, ఆమ విరేచనముల బుట్టించును. ఈకారణములనుబట్టి, మనము భుజించు ఆహారముయొక్క స్వభావమును గూర్చియు, దానియొక్క క్రమమగు పచనమును గూర్చియు, జాగ్రత్తలను బుచ్చుకొనుచు, అజీర్ణమునకు సహకారులగు కారణముల నన్నిటిని గమనించుచుండ వలయును.

---

## టైఫాయిడ్ జ్వరము (సన్నిపాతజ్వరము)

టైఫాయిడ్ జ్వరవిషయమున నీవిధమగు జీవాణువు త్రాగు నీటిమూలమున గాని పాలుమూలమున కాని పేగులయందు బ్రవేశించుచుండును. రోగి కుదిరికనందినపిమ్మట గొంత కాలమువరకు నీ సంబంధమగు జీవాణువులు మలమూత్రములగుండ వెలువడుచుండును. ఈ మలమూత్రములు విసర్జింపబడు స్థానములందు యీ జీవాణువులు చాలవారములవరకును తీక్ష్ణభావమును వహించియుండును. గృహములయొక్క గాని గుడారములయొక్క గాని నేలప్రదేశముల యందు ఆరుదల నందియున్న యీ వ్యాధిహేతువులగు మలమూత్రపదార్థములు వాయుప్రచారమునందు దుమ్మురూపమున శ్వాసమార్గములగుండ శరీరమునందు బ్రవేశించుట మూలమునను, ఈగలు అనేక మార్గములగ నీజీవాణువులను వ్యాపింపజేయుటమూలమునను, నీ వ్యాధి వ్యాప్తత నందుచున్నదని మనము తెలియవలయును. జలమును మసలగాచి చల్లార్చి త్రాగుటయం దీ జీవాణువువలన భయమేమియు నుండనేరదు.

కాలరా, మశూచి, ప్లేగ్ మొదలగు నంటువ్యాధుల యందును ఆయా సంబంధములగు జాగ్రత్తలను బుచ్చుకొను చుండుటవలన వ్యాధులయొక్క వ్యాప్తతను తగ్గింపవచ్చును.

## ఈ దేశమునందలి వైద్యశాస్త్ర పరిశోధ నాలయములు.

వ్యాధి రాకుండ జేయుటకును, వ్యాధి సంభవించిన పిమ్మట చికిత్స చేయుటకును, అనుసరింపదగు పద్ధతులను శాస్త్రయుక్తమైనట్టియు నిశ్చితమైనట్టియు రీతుల స్పష్టీకరించుటకై ఇండియా దేశమునందు ఆంగ్లేయవైద్యశాస్త్రజ్ఞులు పరిశ్రమ చేయుచున్నారు. శాస్త్రీ

యను జీవాణుపరీక్ష జేయు స్థాపనాలయములు, బొంబాయిలో లిస్టర్ ఇన్‌స్టిట్యూట్ అనియు, చెన్నపురిలో కింగ్ ఇన్‌స్టిట్యూట్ అనియు, కసౌలీ (పంజాబ్) పట్నమునందు పాస్టూర్ ఇన్‌స్టిట్యూట్ అనియు మూడు గలవు. వీరియొక్క కార్యక్రమ ప్రకటనలనుబట్టి వారు వారొనర్చుచున్న పరిశ్రమ ఫలితముల మనము గనుగొన వచ్చును.

## ఆరోగ్యశాస్త్ర లాభములు.

నాగరిక ప్రపంచమునందు ఆరోగ్యశాస్త్ర సూత్రముల ననుసరించుటవలన లాభముల నింతింతయని చెప్పుట శలవికాదు. ఇందువలన కోటాన కోట్లయొక్క ప్రాణములు రక్షింపబడుటయేగాక, ప్రపంచమునందలి దురవస్థయు తగ్గింపబడినది. ఐరోపియను దేశములయందును తూర్పుదేశముల యందును టీకాలనువేయుట ప్రారంభించిన దాదిగ మశూచి యొక్క వ్యాప్తతయు, అందువలన మరణములును, యెంతగా తగ్గింపబడిన దానిని బట్టియు నీ టీకాలవలని లాభమును మనము గ్రహింపవచ్చును. పూర్వము మశూచివలన వేలకువేలు జనులు ఇంగ్లాండునందు చనిపోవుచుండెడివారు; వ్యాధ్యనంతరము జీవించిన వారలలో జాల మంది వికలాంగు లగుచుండెడివారు. నేత్రదృష్టి పూర్ణముగ నశించినవారును నుండెడివారు.

చలిజ్వరము ఒకకాలమందు నింగ్లాండులో విశేషముగ నుండెడిది. ఇప్పుడింగ్లాండునందీ జ్వరము కానరాదు. జలదారుల విషయమునం దవలంబింపబడిన నవీనాభివృద్ధి పద్ధతుల వలన నీజ్వరము నశింపు నందిన దని యనుకొన వచ్చును.

కుష్ఠరోగ మింగ్లాండునందు పదుమూడు శతాబ్దముల వరకు వ్యాపించి యిప్పుడు మాయమైనది. ఇందులకు సరియైన కారణములు తెలియరాకున్నవి. వృద్ధి నందిన ఆరోగ్యస్థితులు, మంచి ఆహారము, వ్యవసాయమునం దభివృద్ధి, రోగుల ప్రత్యేక ఆసుపత్రుల యందుంచుట—యీ కారణము వలన నీవ్యాధి రూపుమాసి యుండును.

## ఆరోగ్య మన నేమి?

ఆరోగ్యమునందు శరీరమునందలి ప్రతి అవయవమును అందలి అంతర్భాగములును తమ నిర్ణీత కార్యక్రమములను సరిగా జేయుచుండును. హృదయము, మెదడు, శ్వాసకోశములు, ఒడలు (చర్మము,) కాలిజము, జీర్ణావయవములు, స్నాయువులు మొదలగునవి తమ నిర్ణయ కార్యములను ఆరోగ్యస్థితియందు క్రమముగా జేయుచుండును. వ్యాధిస్థితియందు యీ అవయవములలో నొకటిగాని యొకటికంటె నధికముగ గాని తమ నిర్ణయ కార్యక్రమములందు లోపమును సూచించును.

## ఆరోగ్యతవలని లాభము,

శరీరము మనస్సుయొక్క చిత్తవృత్తులను నెరవేర్చుట కేర్పడిన ప్రతినిధియై యున్నది. అట్టిశరీరము అస్వస్థత నందియుండిన యెడల మనస్సుకూడ క్షీణముగ నుండునని వేరుగ జెప్ప నక్కరలేదు. శరీరము ఆరోగ్యస్థితియందుండి సుఖానుభవమునకు దగినటులుండిననే దప్ప యెంతటి బుద్ధివైశాల్యతయును యెంతటి ధనవైభవమును ఉపయోగింపనేరవు, ఆరోగ్యము

దున్న భిక్షుకుడు వ్యాధిగ్రస్తుడగు ధనవంతునికంటె నిజముగ నెక్కువసౌఖ్యముగ నుండును. జీవితసంగరమున దుర్బలుండుగాని వ్యాధిగ్రస్తుడుగాని జయ మంద నేరడు. దృఢమగు మనోబలమునకు దృఢశరీరమే నివాసస్థానముగ నుండనగును. సంపూర్ణారోగ్యములేకుండ సంపూర్ణసౌఖ్య మనుభవించుట కెన్నడును ఆస్పదముండ నేరదు.

ధనవంతు లగువారలు, మిక్కుటముగ భుజించుటవలనను, క్రమమగు శరీరకష్టము లేకపోవుటవలనను, వ్యాధులను గ్రహించు చుందురు. జీవితమునందలి విజయమును ఆనందమును ఆరోగ్యస్థితి ననుసరించియే యుండును.

## వ్యాధుల రాకుండ జేయుట.

మనుష్యులకు సంభవించు వ్యాధులలో జాలవాటిని రాకుండ జేయుటకు వీలుకలిగి యున్నది. ఆరోగ్య సూత్రజ్ఞానమును తదనుచరణమును మనుష్యకోటి అనుభవించు చున్న వ్యాధులయొక్క సంఖ్యను తగ్గించు ననుటకు సందియములేదు. ఇంగ్లాండు దేశము నందలి కొన్ని భాగములలోని బిడ్డలలో సగము అయిదు సంవత్సరములలోపు వయస్సుననే మరణము నందుదురు. ఇండియా దేశమునందు, కొన్ని పట్టణములందును కొన్ని జిల్లాలయందును యీ సగమువంతు ప్రాప్తిని మించియే మరణములు గలుగుచుండును. ఆరోగ్యశాస్త్రసూత్రములను గమనించుటవలన మరణములను దగ్గించుటకు వీలుగ నుండుననుటకు సందియములేదు. నివారింపదగు వ్యాధులనుండి ఇండియా దేశమునందు ప్రతిసంవత్సరమును యిరువది లక్షల జనము చనిపోవుచుందురు. ఆరోగ్యశాస్త్రము, వ్యాధులకు గారణములను దెలిపి, ఆ కారణములు సందర్భపడకుండ నుండుటకు మనమవలంబించ వలసిన మార్గములను మనకుబోధించి, వ్యాధులు మనకు సంభవింపకుండ జేయుచున్నది. కొన్నివ్యాధులలో సరియైన కారణము లింకను దెలిసియుండక పోవుటవలన నీ ఆరోగ్యశాస్త్రము సహాయ మొనర్ప లేకున్నది. కాని, కాలము గతించినకొలదిని యీ ఆరోగ్యశాస్త్రజ్ఞానము అభివృద్ధి నందుచున్నదని మనము తెలిసికొనదగి యున్నది.

---

## వ్యాధి చికిత్స.

వ్యాధిచికిత్సవిషయములో ఇదివర కతిక్రమించిన ఆరోగ్యసూత్రముల గమనించుట గూర్చి ప్రథమమునజాగ్రత బుచ్చుకొనవలయును. వ్యాధిస్థితియందు శరీరము యొక్క స్వాభావికశక్తులు శరీరమును స్వస్థపరచుటకు బ్రయత్నము చేయుచుండును. మందుయొక్క ఉద్దేశము ఆస్వస్థస్థితి వృద్ధిగాకుండ నుండునటుల జేయుటయైయున్నది. స్వస్థపరచుటకై శరీరమునకుగల స్వాభావశక్తి విశేషమైయున్నది. అయినను, వ్యాధులు సంభవించిన పిమ్మట చికిత్సాప్రయత్నముల జేయుటకంటె వ్యాధులు సాధ్యమగునంతవరకు సంభవింపకుండ నుండ ప్రయత్నముల జేయుటయే మంచిది.

నాగరికత, వ్యాపారాభివృద్ధి, విద్య, నాజూకుతనము - యివన్నియు ప్రజలకుకొన్ని లాభములకు దోడుగా నష్టములను గూడ గొనివచ్చినవి. ఈదినములలో గొందరి విషయమున మెదడున కుండెడి పరిశ్రమము శరీరమున కుండదు. ఇందుమూలమున గలిగెడి వ్యాధులు విశేషముగ నుండెను.

## జాగ్రతలు.

ఆరోగ్యశాస్త్రవిధుల ననుసరించి, వాయువు, జలము, ఆహారము- వీటినిగురించి తగు జాగ్రతలను బుచ్చుకొనవలయును. జలమునుగూర్చిఅంటుసోకినటుల ననుమానముండిన యెడల మసలగాచి చల్లారబెట్టి పుచ్చుకొనవలయును. శరీరసాధకము, స్నానము,దుస్తులు — వీటియెడలను శ్రద్ధతో గమనించవలయును. పెంటకుప్పలు, జలదారులు, మొదలగునవి పరిశుభ్రపరచవలయును. ఇట్టిజాగ్రతలు వ్యాధులను తగ్గించుటయందు సహాయముచేయును.

— — —

# విజ్ఞాపన

## (రెండవ కూర్పునకు)

నేటికి సుమారు ఆరుసంవత్సరముల క్రిందట వెలువరించియున్న యీగ్రంథము యొక్క మొదటికూర్పును గురించి ఆంగ్లేయ వైద్యశాస్త్రజ్ఞులును, దేశీయవైద్యులును, మొదలగువా రొసంగియున్న అభిప్రాయములనుబట్టి యీగ్రంథమెంతవరకు నుపయోగించినదియు మాచదువరులే గ్రహింతురుగాక.

ఆంగ్లేయవైద్యపద్ధతుల ప్రజలకు దెలుపుటయందు ఆవశ్యకతనుగూర్చి విశేషించి చెప్పనక్కరలేదు. మనుష్యజాతి అనుదినమును లోనగు వ్యాధులయొక్క కారణములను దెలిసికొననిదే గాని చికిత్సను బూనుకొనిన ప్రయోజన ముండనేరదు. అట్టికారణముల శాస్త్రీయపద్ధతిని దెలిసికొను టెంతయు ముఖ్యమై యున్నది.

ఈరెండవకూర్పునందు అంటువ్యాధులు, వ్యాధిరక్షణశక్తి, మానసికౌషధము, వ్యాధులనుండి కాపాడుకొను విషయములు, మొదలగువాటిగురించి ప్రత్యేక ప్రకరణములయందు విపులముగ వ్రాసి, వ్యాధిచికిత్సల కవసరమగు గొన్ని సులభసూత్రముల వెనుకటికంటె నెక్కువగ విశదీకరించి యుంటిమి.

ఈకూర్పును వెలువరుచుటయందు మాకు దోడ్పడిన విశాఖపట్టణము జిల్లాలోని సాలూరు సంస్థానాధీశ్వరులగు మ. రా. శ్రీ శ్రీ రాజా శ్రీ శ్రీ శ్రీ లక్ష్మీనరసింహ సన్యాసి రాజు పెదబలియారు సింహులు బహద్దర్ వారు ముద్రణవ్యయముక్రింద మాకొసంగియున్న రూ 600 ల విరాళమునకు వారియెడ మేమెంతయు కృతజ్ఞులమై యుంటిమి. మాకృతజ్ఞతా సూచకముగ నీగ్రంథమును శ్రీరాజావారి కంకితమొనర్చియుంటిమి. తమ భాషాభిమానమును కార్యరూపమున జూపువారు ఆంధ్రదేశమునందు అరుదై యున్నారు. అట్టిసందర్భమున నీ రాజావారు గనబరచియున్న ఔదార్యమున కెంతయుసంస్తవనీయము. ఆంధ్రదేశము వంగమహారాష్ట్రదేశములవలె వాఙ్మయాభివృద్ధి నందుటకై వీరింకను సహాయమొనర్చుటకు వలయు నాయురారోగ్యైశ్వర్యముల భగవంతుడు వీరికి ప్రసాదించుగాక!

సెప్టెంబరు 1915

# పీఠిక

ఈగ్రంథప్రకటనమును గూర్చి నేనెంత శ్రద్ధనువహించి తొందరపడినను కార్యసాఫల్యమున కనేక అంతరాయములు కలిగియుండుటచే సకాలములో బ్రచురింప జాలకపోతిని. ఇంతకును నేటికైనను బ్రకటింప గలిగినందులకా పరమేశ్వరునికి నావందనముల సమర్పించుచున్నాడను. నేనురచించియున్న వైద్యగ్రంథములలో "ఆధునిక మానసికచికిత్స"ను గూర్చి మాచదువరులు యద్దాని నిరుపమానోపయోగమును గ్రహించిరట్లు తోచదు. అద్దానిని యిరువదిసంవత్సరముల కాలములో ననేక వైద్యగ్రంథరాజముల బరిశీలించి సిద్ధపరచినదానిగా గుర్తెరుంగ గోరెదను. ఈశాస్త్రము నొక్కదానిననుసరించియే పాశ్చాత్య దేశములయందలి అనేక వైద్యశాస్త్రవేత్తలు చికిత్సాదిగ్విజయముల నందుచున్నారు. ఈ గ్రంథరాజపఠనమును గూర్చియు, తగుచికిత్సానుచరణమును గూర్చియు మాచదువరులు తమ అత్యంత శ్రద్ధను జూపుదురని నమ్ముచున్నాను.

బెజవాడ,
ఏప్రిల్ 1939.

చిల్లరిగె సేతుమాధవరావు.



# ఆఙ్గ్లేయ వైద్య చింతామణి

## వ్యాధిచికిత్సయందలి ముఖ్యాంశములు.

వ్యాధియొక్క సందర్భమును గనిపెట్టుటకు గాని వ్యాధిని నివారణచేయుటకు గాని, ముందుగా నాడి విషయమైనట్టియు, ఊపిరి విషయమైనట్టియు, శరీరముయొక్క ఉష్ణస్థితి విషయమైనట్టియు, నాలుక విషయమైనట్టియు; కొన్ని సంగతులను దెలిసియుండుట మిగుల ఆవశ్యకమై యున్నది. ఈ విషయముల నొక్కొకటిగ విచారించి చూచెదము.

### రోగిని బరీక్షించుట.

రోగిని రెండు విధముల బరీక్షించవచ్చును. మొదటి పద్ధతి యేమన—రోగిని స్వయముగా బ్రశ్నించి తన వ్యాధి యెట్టిదో, తన అరోగ్యమునం దెన్నిదినములనుండి యే మార్పులు కలిగినవో, యేయే అవయవములయం దేయే బాధ కలిగియున్నదో—యీ మొదలగు సంగతుల దెలిసికొనవలయును. ఈ విషయముల నన్నిటిని దెలిసికొనిన పిమ్మట శరీరమును బరీక్షించి అస్వస్థత కగు మరికొన్ని గుర్తులను దెలిసికొనవచ్చును. సంపూర్ణ వ్యాధినిదానము నందు రోగియొక్క స్వచరిత్రయేగాక, కుటుంబ చరిత్రను గూడ—అనగా కుటుంబమునందలి పూర్వికులలో నే ప్రత్యేక వ్యాధికైనను నుద్భృక్తత యుండియున్న సంగతిని గూడ—విచారింపవలయును. ఈ రెండు విధములగు బరీక్షలను సలిపిన పిమ్మట వ్యాధినిగూర్చి కొంతవరకు వివరముల దెలిసికొనవచ్చును.

### శరీరముయొక్క దృష్టి పరీక్ష

శరీరమేగాని, యే ప్రత్యేకావయవము గాని స్వాభావికముగ నుండు రీతిని మారి యున్నదా ? శరీరాకారము, వర్ణము, పరిమాణము మొదలైన భాగిలో అస్వాభావికముగ నేదైన గనబడుచున్నదా ?

## శరీరపు బరువు

చాలా వ్యాధులలో శరీరపు బరువు మారుచుండును. అప్పుడప్పుడు గొను తూనికలలో బరువు హెచ్చుచున్నాదా? తగ్గుచున్నదా? బరువు హెచ్చుచుండిన యెడల సామాన్యగతులలో నారోగ్యమునే సూచించును; తగ్గుచుండిన యెడల వ్యాధి హితమని గ్రహింప వలయును. ఈ క్రింది పట్టికనుబట్టి మనిషియొక్క యెంత యెత్తున కెంత బరువుండవలసినదియు సిద్ధాంతీకరింపబడినది.

| అ. అం. | | అ. అం. | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 4—6 | నుండి | 5—0 | యెత్తువరకు | బరువు | సుమారు | 92 | పౌనులు. |
| 5—0 | ,, | 5—1 | ,, | ,, | ,, | 115 | ,, |
| 5—2 | ,, | 5—3 | ,, | ,, | ,, | 127 | ,, |
| 5—4 | ,, | 5—5 | ,, | ,, | ,, | 139 | ,, |
| 5—6 | ,, | 5—7 | ,, | ,, | ,, | 144 | ,, |
| 5—8 | ,, | 5—9 | ,, | ,, | ,, | 157 | ,, |
| 5—10 | ,, | 5—11 | ,, | ,, | ,, | 170 | ,, |
| 5—11 | ,, | 6—0 | ,, | ,, | ,, | 177 | ,, |
| 6—0 | ,, | పై యెత్తుకు | | ,, | ,, | 218 | ,, |

ఈ తూకములయందు దుస్తులయొక్క బరువు కలిసి యుండదు. 45 సం॥ల వయసు వరకు తూకము కొంచెము హెచ్చుచుండవలయును.

## అవయవ సౌష్ఠవము

కొందరు మనుష్యులు యెముకల పోగువలె నుందురు. కొందరు స్నాయు పటుత్వమును గలిగి దార్ఢ్యముగ గనపడుచుందురు. కొందరు వదులైన స్నాయువులను గలిగి తాకుటకు మెత్తగనుండి స్నాయుపటుత్వము తక్కువగనుండి బలిసినట్లు కనబడుచుందురు. ఇందు మొదటి తరగతివారు సామాన్యముగ వ్యాధిదూరులుగ నుందురు. రెండవ తరగతి వారు తరచు వ్యాధుల కుద్యుక్తులుగ నుందురు.

## వర్ణము

శరీరవర్ణము పాలిపోయి యుండిన యెడల రక్తపరిమాణమునందు లోపమును గాని రక్తశ్రేష్ఠతయందు లోపమునుగాని సూచించును. ఈ సందర్భమున అజీర్ణ వ్యాధిగాని, మూత్రాశయ సంబంధమగు వ్యాధిగాని, రక్తసంబంధమగు వితరమగు వ్యాధి యెద్దియైన గాని, యుండినట్లు సూచించును. పసుపువర్ణము పచ్చగామాల వ్యాధిని సూచించును; యీ పసుపు వర్ణము కండ్లలో నెక్కువగ గనిపించును. నీలవర్ణము శ్వాస కోశాస్వస్థతను సూచించును.

## నంజు వాపులు

ఈ వాపులు తరచుగా పాదములపైనను చీలమండల యొద్దను గనబడుచుండును. ఆయా భాగములలో వ్రేలితో గొంచె మొత్తి వేసిలను దీసినయెడల గుంట పడియుండి క్రమముగా మరల నా గుంట పూడిపోవును. కంటి కడుగు రెప్ప క్రింద నట్టి వాపు గనబడిన యెడల నిట్టి స్థితి మూత్రాశయ వ్యాధి ఫలితమై యుండును. ఉదరము జృంభించి యున్నయెడల నంజు వ్యాధిని సూచించును.

## ముఖ వైఖరి

ముఖ వైఖరి బట్టి వ్యాధియొక్క స్థితిని జాలవరకు గ్రహింపవచ్చును. శరీర వర్ణము గూర్చి పైన చెప్పబడియే యున్నది. కొద్ది కొద్దిగా వచ్చుచుండెడి జ్వరములలో ముఖమానం దట్టి ముకుళదనమును లేక, నిర్వికాసముగ నుండవచ్చును. ముఖముయొక్క యొక వైపున నెట్టి ముడతలు లేక రెండవ వైపున ముడత లుండవచ్చును. ఈ లక్షణము పక్షవాతమును సూచించును. ఓరగా జూచుకొడ మెదడు వ్యాధిని సూచించును. మిడిగ్రుడ్లు గండమాలా (Goitre) వ్యాధిని సూచించును.

## తీరు

నిల్చుండు, కూర్చుండు, చేతులు కాళ్లు ముడుచుకొనియుండు—స్థితులనుబట్టి కొన్ని వ్యాధిగతులను దెలిసికొనవచ్చును. ఉదరభాగము వాచియున్నయెడల నిట్లు ముడుచు కొనుట తటస్థించును. మఱియు బిడ్డలయందు వెన్నుపాముతో సంబంధించిన వ్యాధి యున్న యెడల తలను, మెడను, భుజములను గదలకుండ నుందురు.

## శరీర వేడిమి

శరీర వేడిమి యొకొకసారిగ 103, 104 డిగ్రీలకు హెచ్చి ప్రారంభ జ్వరము వచ్చినప్పుడు సామాన్యముగ నిది చలిజ్వరమో, లేక న్యుమోనియా జ్వరమో అయి యుండును. శ్వాస కోశాస్వస్థత గనబడినచో న్యుమోనియా జ్వరముగ నెంచవచ్చును. ఇంతియేగాకుండ న్యుమోనియా జ్వరమునందు యీ తీవ్రజ్వరము యొకే పట్టుగ నుండును. చలి జ్వరమునందు జ్వరము పూర్తిగా విడిచి మరల వచ్చుచుండును. ఈ రెంటికిని భేద మిదియే. ఆరోగ్యస్థితియందు శరీర వేడిమి 98.4 డిగ్రీలు అయియున్నది. 105 డిగ్రీలు గాని అంతకు మించిగాని శరీర వేడిమి యుండియున్నప్పుడు అత్యుద్రిత జ్వరమనబడును. 104 డిగ్రీలు ఉద్రిత జ్వరము; 102.6 డిగ్రీలు జ్వరమనబడును. 100.4 కొద్దిజ్వరము; 98.4 ఆరోగ్యమందలి వేడిమి; 97.8, పరిమాణముకంటె తక్కువ; 96.8కి తక్కువ, క్షీణస్థితిని సూచించును; ఈ పై కొలతలు తెర్మామెటరను చంకలో బెట్టి చూచుటవలన గననగును. శరీరవేడిమిని కచ్చితముగ కనుగొనవలెనన్న తెర్మామెటరును ఆసనమునందు బెట్టి పరీక్షించవలెను. శరీర వేడిమి 105 డిగ్రీలకు మించియున్నప్పుడు ప్రాణాపాయమని గుర్తించవలయును. 101 గాని దాని సమీపవేడిమిగాని పట్టుగా నొకేతీరుగా నున్నప్పుడు శ్వా

జ్ఞోశాస్వస్థత యుండియున్న దేమో యని అనుమానించవలసి వచ్చును. శరీరవేడిమిని ఉదయమునను సాయంకాలమునను ప్రతిదినమునను ఒకేగంటకు దీసుకొనుచు వ్యాధియొక్క నడతను గుర్తెరుగవలయును.

## నాడి

హృదయమునుండి శరీరమందలి అన్ని భాగములకును రక్తమును గొనిపోవు శుద్ధరక్త నాళములయొక్క త్రిప్పుడువలన నీ నాడి పుట్టుచున్నది. ఈ నాడి సామాన్యముగ ఫిలం ననుసరించి మణికట్టుయొద్ద పరీక్షింపబడుచున్నది. కాని, యీ నాడిని మనము మెడ యొద్దను తుంటియొద్దను ఉపరిభాగమునను దగ్గరగానుండు ఇతర శుద్ధరక్త నాళములయందును కనిపెట్టవచ్చును. ఈ నాడి దెబ్బలయొక్క ప్రతి నిమిషమునందలి సంఖ్య ఆరోగ్య స్థితియందు వయసునుబట్టి మారుచున్నది. ఈ క్రింది ప్రకారము, వయసు ననుసరించిన నాడిదెబ్బల సంఖ్యను, మనలెక్కకు ఆధారముగా తీసికొనవచ్చును. నాడియొక్క ప్రాముఖ్యత శరీర వేడిమికి పిమ్మట నేర్పడుచున్నది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| పుట్టుక మొదలు మొదటి సంవత్సరము చివరవరకును | నిమిషమునకు | 140 దెబ్బలు | | | |
| రెండవ సంవత్సరము మొదలు మూడవ సంవత్సరము అంత్యమువరకును | ,, | 120 దెబ్బలు మొదలు | | 100 వరకును | |
| నాల్గవ సం॥ మొదలు ఆరవ సంవత్సరం అంత్యము వరకు | ,, | 100 | ,, | 90 | ,, |
| 7 సం॥ మొదలు 14 సం॥ వరకును | ,, | 90 | ,, | 75 | ,, |
| 14 ,, 21 ,, | ,, | 85 | ,, | 75 | ,, |
| 21 ,, 65 ,, | ,, | 75 | ,, | 65 | ,, |
| వృద్ధత్వమునందు | ,, | 85 | ,, | 70 | ,, |

కొద్దిజనులలో, ఆరోగ్యస్థితియందున్నను, యీ పైన సూచింపబడిన నాడిదెబ్బల సంఖ్యయందు విశేష భేదము గనిపించవచ్చును. మరికొందరిలో, ఆరోగ్యస్థితియందే, నాడిదెబ్బలు యీ సంఖ్యకు కొంచెముగ భేదింపవచ్చును. అయితే, సామాన్యముగ శరీరపరిశ్రమ లేనిదే, పైన సూచింపబడిన పట్టికకు భిన్నముగా, పది లేక యెనిమిది దెబ్బలు హెచ్చుగాగాని తక్కువగాగాని యుండియుండిన యెడల, శరీరమునం దేదియో జబ్బు ప్రవేశించి యున్నదని మనము నమ్మవచ్చును. సంఖ్య యెక్కువగా నున్నయెడల జ్వర తీవ్రత యున్నదనియు, తక్కువగా నున్నయెడల మాంద్యత వహించి యున్నదనియు మనము ఊహింపవచ్చును.

వైద్యుడు నాడిని చేతితో దాకుటవలన, జ్వరతీవ్రతను మాంద్యతను కనిపెట్టుటయే గాక యితరములగు కొన్ని దేహస్థితులనుగూడ గమనించవచ్చును, నాడి చురుకుగానుండి విశాలముగను మృదువుగను నుండినయెడల జ్వరవ్యాధి రాబోవుచున్నదని సూచించును. నాడియొక్క దెబ్బ క్రమమందున్న ఒక దెబ్బకును మరియొక దెబ్బకును యుండెడి మధ్యకాల

ములు భిన్నములుగా నుండినయెడలను, ఉండిఉండి పోటుపొడిచినట్లుండినను, హృదయ రోగమును సూచించును. అజీర్తివల్లను, తేయాకు నీళ్లు యెక్కువగ త్రాగుటవల్లను, చుట్ట గాల్చుటవల్లను, నాడియొక్క క్రమము హృదయరోగము నందువలెనే మారును. కాలరా మొదలగు త్వరితముగా గృశింపజేయు వ్యాధులయందు నీరసమయినట్టియు దారము నుబోలి సన్నమైనట్టియు నాడిని గనుగొనవచ్చును.

## నాడి పరీక్ష

రోగియొక్క శరీరస్థితినిగూర్చి తెలిసికొనుటకు నాడిపరీక్ష ముఖ్యమయిన ఆధారమై యున్నది. తరుచుగా నీ పరీక్షవలననే రోగికి స్వస్థత గలుగుచున్నదియు లేనిదియు దెలిసికొనుటకు వీలగుచున్నది. విశేషముగా ననుభవమువలననే నాడియొక్క స్థితిని దెలిసి కొనదగియున్నది. దినమునకు దినము రోగి బలమందుచున్నదియు, నీరసమునం దున్నదియు నాడినిబట్టి తెలిసికొనవచ్చును. నాడియొక్క స్థితియందు గలుగుచున్న మార్పులను వైద్యు డేగాని రోగియొక్క పరిచారకులేగాని గమనించవలసియుండును. నాడియొక్క వివిధ ములగు స్థితులను దెలిసికొనుటకు రోగులయొక్క నాడిని దరుచుగను నెక్కువ శ్రద్ధగను బరీక్షించుచుండవలయును. ఒక రోగియొక్క అస్వస్థతావస్థయందున్న నాడియొక్క భేద గుణములను దెలిసికొనుటకై స్వస్థతయందున్న వానియొక్క నాడితో బోల్చి చూచుకొన వలయును; ఇందువలన నట్టి అస్వస్థతయందున్న నాడియొక్క ప్రత్యేక గుణములను దేలికగ గనిపెట్టవచ్చును. చెమటను బుట్టించు బ్రాందీ మొదలగు పదార్థముల నిచ్చిన పిమ్మట నాడిపైన గలుగుచున్న మార్పులను శ్రద్ధతో గమనించుచుండవలయును.

వ్యాధియందుండెడి నాడియొక్క స్థితిని దెలిసికొనటకు ముందుగ నారోగ్యమునందు నాడియందు స్థితిని దెలిసికొననగును. ఆరోగ్యస్థితియందు నాడియొక్క దెబ్బలు నిమిష మునకు, పురుషులలో పెద్దవారల యందు 72 మొదలు పసిపిల్లలలో 120 వరకు నుండును. నాడియొక్క పరిమాణమును, ఒత్తిడివలన నెంత దేలికగ నాడిని ఆపుచేయదగినను విషయ మును, గమనించదగిన అంశములైయున్నవి. నాడిని బరీక్షించునపుడు రెండుగాని లేక మూడుగాని వ్రేళ్ల నుపయోగింపవలయును. మణికట్టు సమీపమున నీనాడిని పరీక్షింపనగును. బిడ్డలయందొక వ్రేలితో బరీక్షించినజాలును. నాడిని అరనిమిషము (30 సెకనులు) వరకు పరీక్షింపనగును. ఈ కాలమును గుర్తించుటకుగాను జేబుగడియారము నుపయోగింప నగును. నాడియొక్క క్రమత విశేషముగా దప్పియుండుటవలనగాని, నాడియొక్క పరి మాణము హీనమయి యుండుటవలనగాని, మణికట్టుయొద్ద నాడిని బరీక్షించుటకు వీలు లేక పోయినప్పుడు ఎడమవైపు స్తనాగ్రమునకు క్రిందుగ రొమ్ము లోభాగమున గుండె యొక్క దెబ్బలను లెక్కింపవలయును. నాడిని బరీక్షించునపుడు రోగియొక్క మోచెయ్యి యొంగకుండ నుండునట్లు చేయవలయును. అట్లొంగియుండినయెడల రక్తప్రచారమున కాటంకము కలిగి నాడియొక్క క్రమమును పరిమాణమునకు లోపమును సూచించును. రోగి పరుండి యుండునప్పటికంటె కూర్చునియున్న స్థితియందు నాడియొక్క తీవ్రతత్వ మధికముగ నుండునని తెలియవలయును.

నాడియొక్క పరీక్షయందు నాలుగంశములను గమనింపవలయును. (1) నాడి యొక్క కొట్టుకొనుట యందలి తఱచుదనము (తఱచుగా గొట్టుకొనుట) (2) నాడియొక్క పరిమాణము (3) నాడియొక్క ఒత్తిడి కఠిన గుణము (4) నాడియొక్క క్రమత.

## (1) నాడియొక్క తఱచుదనము (Frequency)

ఒక్క కాల పరిమాణములో లెక్కింపనగు దెబ్బలయొక్క సంఖ్యను బట్టి నాడి యొక్క తఱచుదనము గుర్తింపబడుచున్నది.

1. శరీరవేడిమి అధికమైన కొలదియును నాడియొక్క చుఱుకుదన మతిశయమై యుండును: శరీరము నీరసస్థితియం దున్నప్పుడును నాడియొక్క తఱచుదన మధికముగ నుండును. శరీర వేడిమి నిలుకడగ నుండియున్నప్పుడుగాని, శరీరవేడిమి తగ్గుదల నందు చున్నప్పుడుగాని, నాడియొక్క కొట్టుకొనుట దినదిన మధికమగుచుండిన యెడల గుండె యొక్క కార్యక్రమత చెడిపోవుచున్నదని గ్రహింపవలయును.

2. పిత్తము రక్తమునందు గలిసి ప్రచారము నందుచున్నపుడుగాని, మఱియేదైన విషము రక్తప్రచారమునందు గలిగినపుడుగాని, నాడి మందమైయుండును. నీరసస్థితియం దున్న వృద్ధవయస్కులలో నాడి యీ స్థితి నందియుండును.

3. ఒకప్పుడు నాడి యెడతెగకుండ గొట్టుకొనుచు పరిమాణమునందు హీనమై లెక్కపెట్టుటకు వీలులేకుండ నుండును. ఒక దెబ్బను మరియొక దెబ్బకును నుండెడి మధ్యకాలము గుర్తించుటకు వీలులేక దెబ్బలను లెక్కపెట్టుటకు వీలులేకుండనుండును. రక్తనాళమునం దొకవిధమగు వణకుదనమును మాత్రమే గమనించుటకు వీలుగనుండును మరణావస్థయం దున్న వారలయం దీవిధమగు నాడిని గనిపెట్టవచ్చును.

## నాడియొక్క పరిమాణము (Size)

ఈ విషయమున నాడి సంబంధమగు రక్తనాళముయొక్క పరిమాణమును, దెబ్బ యొక్క పరిమాణమును గుర్తింపవలయును.

నాడి, వ్రేలికి ప్రమాణస్థితికంటె యెక్కువ విస్తరించునదినటుల కనబడినయెడల వైశాల్యగతి నందియుండినటుల జెప్పనగును (Large Pulse). జ్వరగతులయం దిట్లుండును.

నాడి, వ్రేలికి ప్రమాణస్థితికంటె తక్కువగ గనిపించినయెడల క్షీణగతి నందియుండి నటుల జెప్పవచ్చును (Small Pulse). ఈ స్థితియందు పరిశుద్ధ రక్తనాళములలో నుండవలసినంత పూర్ణమగు రక్తమును ప్రచారమునం దుంచకపోవుటచే, గుండె దుర్బలత్వము నందుచున్నదని తెలిసికొనుటకు గుర్తుగ నెంచవలయును, ఒకొక్కప్పుడు మంచి ఆరోగ్యమునందున్న వారలకును నిట్టి విధమగు నాడి ఉండియుండుటను మనము మఱువరాదు.

మూత్రగ్రంధి యొక్క అస్వస్థతయందును నిట్టివిధమగు నాడిని గనుగొనవచ్చును. ఆసందర్భమునందు దీనిని గుండెయొక్క అస్వస్థతాఫలితమని యెంచదగదు. ఈ పై విధమగు నాడి యందు దారమునవలె సన్నగ నుండునట్టిది బహు అపాయస్థితిని సూచించును (Thready Pulse).

## (3) ఒత్తినచో నణగునట్టి స్థితి (Compressibility)

నాడి గట్టిగనున్నదా మృదువుగనున్నదా? (Hard pulse or Soft pulse)? అనగా నాడి కొట్టుకొనుటను నిలుపుచేయుటకు గట్టిగ నొత్తవలయునా. లేక తేలికగ నొత్తవలయునా?

మూత్రగ్రంధులు వాపుదల నందియున్న స్థితియందు నాడి గట్టిగనుండును; ఈ గతి యందు పరిశుద్ధ రక్తనాళములలో రక్తము పూర్ణముగ నిండియుండును. ఈ కారణమున దెబ్బయొక్క పరిమాణము చిన్నదిగ నుండును. ఈ దెబ్బను అపుచేయుటకు గట్టిగ నణచి పెట్టవలసి యుండును (Hard Pulse). మృదువునాడి యనగా వ్రేళ్లతో నదిమినయెడల బహు తేలికగా నాగిపోవునట్టిది. ఈ స్థితి గుండెయొక్క దుర్బలత్వమును సూచించుచు, శుద్ధ రక్తనాళములు విస్తరింపు నందుటకు వలసినంత రక్తమును గుండె పంపుటలేదని తెలిసికొన నగును (Soft Pulse).

ద్విత్వనాడి: మృదువునాడియందు జేరియున్న మరియొక విధమైనది ద్విత్వనాడి యనబడుచున్నది. ద్విత్వనాడియందు రెండు దెబ్బలుండును. ఈ విధమగునాడి సన్నిపాతజ్వరము (Typhoid Fever) యొక్క అంత్యగతులయందు దఱచుగ గనబడును. మణికట్టుయొక్క ప్రతి దెబ్బయందును మొదటగ పెద్దదెబ్బయును పిమ్మట చిన్న దెబ్బయును గనబడును, ఈ రెండు దెబ్బలను గలిపి యొకటిగనే గమనించవలయును; ఒక్కొక్కప్పుడు పరిమాణమునందీ రెండు దెబ్బలును సమానముగా నుండుటచే నొకదరు వాటిని రెండింటిగా లెక్కించి పొరబడవచ్చును. ఇట్టి అనుమాన మున్నపుడు గుండెదెబ్బలను లెక్కించుటచే ననుమానమును దీర్చికొనవచ్చును. మృదువునాడి యందువలెనే ఈ స్థితియందును శుద్ధరక్త నాళములు అసంపూర్ణముగ రక్తపూరితములగుటచే నీ ద్విత్వనాడి కలుగుచున్నది. ఇది యెల్లప్పుడును అపాయమును సూచింపనేరదు (Dicrotic Pulse).

## (4) క్రమత దప్పిన నాడి

1. నాడియొక్క దెబ్బ ఒకటి బలముగను రెండవది దుర్బలముగను, లేక మొదటిది దుర్బలముగను రెండవది బలముగను, నుండి యిదే విధముగ నడచుచుండును.

2. నాడియొక్క యొక దెబ్బకును పిమ్మటి దెబ్బకును నుండెడి మధ్యకాలము భేదించుచుండుట; ఒకసారి త్వరితముగ గొట్టుకొనుచు మరియొకసారి నెమ్మదిగ గొట్టుకొనును.

దీనిని మిగుల అపాయస్థితిగ నెంచవలెను. శ్వాస సంబంధమగు వ్యాధియందు ఈ విధముగ నాడి జనింపవచ్చును.

ఒక్కొక్కప్పుడు మధ్య నొక దెబ్బ నిలిచిపోవచ్చును. అజీర్ణమునందును, పొగ చుట్టను విశేషముగ గాల్చుటవలనను, నీస్థితి కలుగవచ్చును గాన నీస్థితి యెల్లప్పుడును నపాయకరముగ నెంచదగదు (Intermittent Pulse).

నాడి కొట్టుకొనుట విశేషముగనుండి, క్షీణగతి నందియుండి, మృదుత్వమునం దతిశయముగ నున్నయెడల, గుండెయొక్క దుర్బలత్వ మధిక మగుచున్నదనియు, రోగియొక్క స్థితి మిగుల నపాయకర మగుచున్నదనియు, తెలియవలయును.

## ఊపిరి

వాయువు శ్వాస కోశములలోనికి వచ్చునప్పుడును శ్వాస కోశములనుండి బయటికి బోవునప్పుడును గలిగెడి ఱొమ్ముభాగముయొక్క విస్తరింపువలనను ముకుళనము వలనను ఊపిరి యేర్పడుచున్నది. ఱొమ్ముయొక్క రెండువైపుల కదలికయును భేదమేమియులేక ఒకే విధముగా నుండవలయును. నాడివలెనె ఊపిరియును, దేహపరిశ్రమ వలనను మనోద్రేకమువలనను మార్పు నందుచున్నది. శరీర పరిశ్రమయు మనోపరిశ్రమయు లేని సమయమందు ఆరోగ్యమందున్న మానవుడు ప్రతి నాలుగు నాడిదెబ్బలకును ఒకసారి ఊపిరిని లోనకు పీల్చుచున్నాడు. కొందరియందు నిమిషమునకు పదునైదునుంచి పదునెనిమిది పర్యాయములవరకు నూపిరి పీల్చుట కలుగుచున్నది. నాడి యందువలెనే ఊపిరియందును చురుకుదనమును మాంద్యమును వహించిన జనులు కొందరుందురు. అయితే, సామాన్యముగ విశ్రాంతి దీసికొనియున్న సమయమున పైన గనపరుపబడిన సంఖ్యకు భిన్నముగ నుండిన యెడల దేహముయొక్క అనారోగ్య స్థితిని మనము గ్రహింపవచ్చును. పై సంఖ్యకు అధికముగా నుండినయెడల శ్వాసకోశములకు సరాసరిగాగాని వేరువిధముగాగాని అస్వస్థత కలుగబోవుచున్నదని మనము తెలిసికొనవచ్చును. పై సంఖ్యకు తక్కువ అయినయెడల నిస్త్రాణగాని, జీవసత్త్వముయొక్క నష్టముగాని, నరముల సంబంధమగు అదరుగాని తటస్థించును.

పెద్దవాండ్లయందుకంటె పసిపిల్లలయందు నాడివలెనే ఊపిరియును త్వరితగతిని నడచుచుండును. రెండు సంవత్సరముల వయసు వరకు బిడ్డలు నిమిషమునకు 35 పర్యాయములు ఊపిరిని బీల్తురు; రెండుసంవత్సరములు మొదలు తొమ్మిది సంవత్సరముల వయసు వరకును నిద్రించునపుడు 18 పర్యాయములును, మేల్కొని యున్నపుడు 23 పర్యాయములును, తొమ్మిది మొదలు పదునైదు సంవత్సరముల వరకును నిద్రించునపుడు 13 పర్యాయములును, మేల్కొని యున్నపుడు 20 పర్యాయములును ఊపిరిని బీల్తురు.

ఊపిరి విడుచు వాయువుయొక్క వాసననుబట్టి కొన్ని వ్యాధులయొక్క సంగతులను తెలిసికొనవచ్చును. అతిమూత్రమునందు ఊపిరిగాలి కొద్దిగా సీమరేగు ఫలము వాసనను గలిగియుండును; అన్నకోశ సంబంధమగు జబ్బులయందు, ముఖ్యముగా బిడ్డలయందు, పుల్ల

వాసన కలిగియుండును; కొన్ని విధములగు అజీర్తులయందు దుర్గంధసహితముగ నుండును; మూత్రికయ మూత్రికోశ సంబంధములగు వ్యాధులయందు మూత్రముయొక్క వాసనను గలిగియుండును; సారాయిని విశేషముగా త్రాగుటవలనను ఫుల్లసెనట్రియు సారాయ వాసనతో గూడినదిగాను ఉండును. చెడిపోయిన పండ్లు ఊపిరిని దుర్గంధహితముగ జేయును.

## ఉష్ణస్థితి

శరీరము ఆనారోగ్య స్థితిలో నున్నపుడు దేహముయొక్క ఉష్ణస్థితిని తెలిసికొనుటకై అందు కేర్పడిన తెర్మామెటరుతో శరీరముయొక్క ఉష్ణతను దెలిసికొనవచ్చును. ఇందుల కుపయోగించు తెర్మామెటర్లకు "క్లినికల్", తెర్మామెటర్లని పేరు. "క్లినికల్" అనగా "రోగియొక్క పడక సమీపమున నుపయోగింప దగిన" అని అర్థము. ఈ తెర్మామెటరు నందు సామాన్యముగ 95 డిగ్రీలు మొదలుకొని 112 డిగ్రీలవరకును మార్కు చేయబడి యుండును. ఒక్కొక డిగ్రి అయిదు భాగములుగా విభజింపబడి అట్టి ఒక్కొక భాగము ఒక్కొక చిన్నగీతచే గుర్తుపెట్టబడియుండును. పెద్దగీతలు డిగ్రీలకు బదులుగాను, చిన్న గీతలు డిగ్రీలో అయిదవవంతు భాగములకు బదులుగాను నిల్చియుండును. అంకెలతో సామాన్యముగ 95, 100, 105, 110 డిగ్రీలుమాత్రమే గుర్తింపబడి యుండును. మన దృష్టిలెక్కచే మధ్యనున్న పెద్దగీతనుబట్టి తక్కిన డిగ్రీల సంఖ్యనున్నా మనము గమనింపవచ్చును. మనము శరీరముయొక్క ఉష్ణతను తెలిసికొనుటకు ముందుగా తెర్మామెటరు నందలి పాదరసము 95వ డిగ్రి దగ్గరకు దిగునట్లుగా తెర్మామెటరును కుడిచేతితో బట్టుకొని రెండవ చేతిపై తట్టవలయును.

శరీరముయొక్క సామాన్యస్థితియందు అనగా, ఆరోగ్యతను దేహవిశ్రాంతిని వహించియున్నపుడు, శరీరముయొక్క ఉష్ణత, ఫారన్‌హీట్ తెర్మామెటరు ప్రకారము 98.4 అనగా 98 డిగ్రీలకు రెండు చిన్నగీతలు పైగా నుండవలయును. (శరీరమునందలి ఉష్ణతను దెలియుట కుపయోగించెడి తెర్మామెటరు లన్నియు ఫారన్‌హీట్ తెర్మామెటరులే.) నోటియందు బెట్టుకొని చూచినచో 99.5 డిగ్రీలుండును. రక్తముయొక్క వేడిమి 99.5 డిగ్రీలకు మించియున్నపుడుగాని, 97.5 డిగ్రీలకు తగ్గియున్నపుడుగాని, అట్టిమార్పులు కొంతవరకు స్థిరములైయున్నపుడు దేహమందు వ్యాధి ప్రవేశించినదని నిశ్చయముగా దలపవచ్చును. హెచ్చుగానున్నపుడు జ్వరమునుగాని, జ్వరముతోగూడిన యేదో యొకవ్యాధినిగాని సూచించును. తగ్గియున్నపుడు, శరీరమునందలి నిస్సత్తువనుగాని, త్వరితముగ గృశింపజేయు వ్యాధులనుగాని, దీర్ఘవ్యాపక వ్యాధులనుగాని, దేహములోని రక్తస్రావమునుగాని సూచించును.

## శరీర వేడిమి

ఆరోగ్యస్థితియం దున్నవారలకు శరీరవేడిమి ఫారన్‌హీట్ తెర్మామెటరు ననుసరించి సుమారుగ 98⅖ డిగ్రీలుండును. ఇది మనుష్యశరీరముయొక్క సామాన్యవేడిమి (Normal Temperature) అనబడును. దినముయొక్క యిరువదినాలుగుగంటల కాలమందు

యిదే వేడిమి ఉండక, సాయంకాలము 4 గంటల 6 గంటల మధ్యకాలమునందు 99 డిగ్రీలవరకు హెచ్చవచ్చును. రాత్రివేళయందు క్రమముగ తగ్గి $97\frac{1}{2}$ డిగ్రీలకు దిగవచ్చును. దీనినిబట్టి ఆరోగ్యస్థితియందున్న మనుష్యునకు దినమంతటను శరీరవేడిమి $97\frac{1}{2}$ డిగ్రీలకును 99 డిగ్రీలకును మధ్యగ చలించుచుండునని మనము తెలిసికొన దగియున్నది. శరీరవేడిమి $97\frac{1}{2}$ డిగ్రీలకు తగ్గినను శరీరమునం దస్వస్థత యేర్పడియున్నదని మన మెంచదగియున్నది. వ్యాధియందును శరీరవేడిమియొక్క హెచ్చుటయును గలిగియుండును. సన్నిపాత జ్వరమునందు (Typhoid Fever) రాత్రి రెండుగంటలవేళ శరీర వేడిమి తగ్గుదలనంది సాయంకాలము ఆరుగంటలవేళ హెచ్చుదల నందియుండును. ఈ రెండువేళలకును శరీరవేడిమి రెండు లేక మూడు డిగ్రీలైనను భేదము కలిగియుండును. అస్వస్థతయందలి యిట్టిస్థితి సామాన్యస్థితియందలి గతినే విశేషముగ సూచించుచున్నదని మనము గ్రహింపవలసియున్నది. కొన్ని అరుదు విషయములలో మాత్రము రాత్రి రెండు గంటల వేళనే శరీరవేడిమి హెచ్చుగానుండి సాయంకాల మారుగంటలవేళ తగ్గుదల నందియుండును; యిట్టిస్థితి సామాన్యముగ సంభవించదు.

దినముయొక్క కాలవిశేషమును బట్టి శరీరవేడిమి మారుటయేగాక, మనము శరీరముయొక్క యేభాగమును పరీక్షించుచుంటిమో దానినిబట్టియు శరీర వేడిమియందలి మార్పు గలుగుచుండును. శరీరముయొక్క ఉపరిభాగమునుండి వేడిమి గాలిలోనికి గ్రహింపబడుచుండుటచే శరీరముయొక్క లోభాగములకంటె పైభాగమునందు వేడిమి తక్కువగానుండును; కాబట్టి నోటియందుకంటె చంకలలోను గజ్జలలోను వేడిమి తక్కువగానుండును. నోటియందుకంటె ఆసనమునం దెక్కువవేడి యుండును. కాని ఒడలుయొక్క వేడిమికిని ఆసనమునందలి వేడిమికిని యెన్నడును ఒక డిగ్రీకంటె హెచ్చు భేద ముండనేరదు.

వ్యాధియందు శరీరవేడిమి హెచ్చనైన వచ్చును; లేక తగ్గనైన వచ్చును; హెచ్చుటయే మిక్కుటముగ దటస్థించును.

సామాన్య వేడిమికంటె హెచ్చుదల నందగనే జ్వరగతి ప్రారంభ మైనదని చెప్పవచ్చును. 102 డిగ్రీలకు మించకుండినయెడల సామాన్యజ్వరమని చెప్పనగును. 104 లేక 105 డిగ్రీలకు సమీపించినపుడు తీవ్రజ్వరమని చెప్పవచ్చును; 106 డిగ్రీలకు సమీపించినపుడు ఉపద్రవముగా నెంచనగును. కొందరు 105 డిగ్రీలే ఉపద్రవముగ నెంచుదురు.

## జ్వరము మూడువిధములై యున్నది.

(1) విడువకుండ నొకే విధముగ నుండెడి జ్వరము. ఉ॥ న్యూమోనియా.

(2) సాయంకాలమందు హెచ్చుచు తెల్లవారుజామున తగ్గుచుండెడి జ్వరము. ఉ॥ టైఫాయిడ్ జ్వరము.

(3) జ్వరము పూర్తిగా పోవుచు మరల మరల వచ్చుచుండునట్టిది. ఉ॥ చలిజ్వరము.

జ్వరము తగ్గిపోవుటలో నొకప్పు డొకేసారిగ సామాన్య వేడిమికి కూడ తగ్గి క్షీణ స్థితికి తేవచ్చును. ఇట్టి విషయములలో బహు జాగ్రత్తగనుండి చురుకుదనమును పుట్టించు పదార్థముల నియ్యవలసియుండును.

మరియొకప్పుడు జ్వరము తగ్గిపోవుటలో దిన దినము కొంచెము కొంచెముగా తగ్గుచు క్రమక్రమముగ సాహిత్యము కలుగవచ్చును. స్వస్థావస్థయందున్న రోగికిని యొకప్పుడు మనసునకు గలిగిన యే సూక్ష్మ ఆయాసమువలన గాని మరియే యితర కారణముల వలన గాని రెండు లేక మూడు డిగ్రీలవరకును శరీర వేడిమి హెచ్చవచ్చును గావున, బహు జాగ్రత్తగ గమనించుచుండవలయును.

శరీర వేడిమి 97½ డిగ్రీలకు దక్కువైనపుడు సామాన్య వేడిమికి దక్కువగ నెంచ నగును. శరీర వేడిమి 95 డిగ్రీలకు సమీపించినపుడు క్షీణస్థితి సంభవించుట కాస్పదము కలుగును. ఒకొక్కప్పు డీ వేడిమియందు కూడ మరేమియు దుర్గుణములు కనబడకుండ నుండి అపాయస్థితి లేకపోవచ్చును.

ఒకొక్కప్పుడు 95 డిగ్రీల వేడిమి రక్తస్రావమువలనగాని యేదైన అదరువలనగాని తటస్థింపవచ్చును. అట్టి విషయములలో మిగుల జాగ్రత్తను వహించియుండవలయును.

## శరీర వేడిమిని గొల్చుట

శరీర వేడిమిని థెర్మామెటరుతో గొల్చుటయందు మనము వ్యాధియొక్క స్థితిని గ్రహించుటకై ప్రతిదినమును ఒకే కాలమందును ఒకే స్థలమందును బరీక్షించవలయును. ఒకదినము చంకయందును, యింకొకదినము నోటియందును, బరీక్షించుటవలన మనము సరియైన స్థితిని గ్రహింపజాలము. థెర్మామెటరును శుభ్రముగ దుడిచి, పాదరసపు గుర్తు 95వ డిగ్రీవరకు దిగునట్లు చేసి, రోగియొక్క శరీర వేడిమిని చంకయందు గాని నోటిలోగాని దానిని నుంచుటవలన బరీక్షించవచ్చును. చంకయందలి చెమటను దుడిచివేసి మరియు థెర్మామెటరును బెట్టవలయును. శరీర వేడిమిని కొల్చుటకు 5 నిమిషముల కాలము చాలును. ఇంకొక 5 నిమిషములు థెర్మామెటరును చంకలోనుంచిన యెడల శరీర వేడిమి కొంచెము హెచ్చుగా గన్పించవచ్చును. ఒక మినిటు కాలములోనున్నా శరీర వేడిమిని గనబరచు కొన్ని థెర్మామెటరు లుండును గాని, యెన్నడును పొరపాటు కలుగకుండు నటుల కొంచె మెక్కువ కాలమే యుంచి పరీక్షించుట మంచిదైయున్నది.

థెర్మామెటరును నాలుక క్రింద మూడు నిమిషముల వరకును ఉంచి, పెదవులను మూసియుంచి, పిమ్మట శరీర వేడిమిని గుర్తించుటయు, ఆచారమైయున్నది. కాని యిట్లు చేయుటచే, బిడ్డలలోను, సంధిగుణమును వహించిన వ్యాధిగ్రస్తులయందును, మిగుల నీరస స్థితియందున్న రోగులయందును, ఒకప్పుడు థెర్మామెటరును పండ్లసందున గొరికివేయుట తటస్థించును, కావున జాగ్రత్తగ నుండవలయును. నోటిలోనుంచి పరీక్షించిన థెర్మామెటరు

నెప్పుడును మరియొకరి కుపయోగించుటకు ముందుగా కార్బాలిక్ సొల్యూషను (5 పాళ్లు కార్బాలిక్ ఆసిడ్ +95 పాళ్లు నీళ్లు)లో గడిగి తుడిచివేయుట మంచిది.

మనము అనుకొనినయంత హెచ్చు వేడిమినికాని తగ్గు వేడిమినిగాని తెర్మామీటరులో గనుగొనినపుడు, యింకొక అరగంటకు మరల బరీక్షించుట మంచిది. శరీరవేడిమి హెచ్చుచున్నదియు తగ్గుచున్నదియు గనుగొనుటకు మరల నింకొక అరగంటకును బరీక్షించవలెను. అట్లు చేయకపోయినయెడల రోగిని తగినంత శ్రద్ధతో చికిత్స చేయుచుంటిమని యనుకొనుట కొంతమాత్రమును వీలులేదు.

## జ్వరరోగి కుపచారములు

1. విరేచనము క్రమముగా నగుచుండునటుల జూడవలయును. విరేచనముసం బజీర్తిగుణ ముండియున్నదేమో చూచి అవసర చికిత్స చేయవలయును.

2. మూత్ర విసర్జనము క్రమముగా నగుచున్న విషయమును గమనించవలయును.

3. దినమున కథమపక్షము రెండుమారులైనను నోటిని చల్లని నీటితో శుభ్రముగా గడుగవలయును. పెదవులపైనగాని పండ్లపైనగాని కూడుకొనియున్న మలినమును దీసివేయ వలయును.

4. చల్లనైనట్టియు, పరిశుభ్రమైనట్టియు, జలమును రోగి కోరినంత యివ్వనగును.

5. డాక్టరుయొక్క సలహా లేకుండ రోగిని లేవనియ్యవద్దు; కూర్చుండుటయును నొకప్పుడు హాని గలుగజేయవచ్చును.

6. పిండికట్లు కట్టుటగాని, వేడి కాపడములు కాచుటగాని, అవసరమైనప్పుడు రోగిని ప్రక్కకు ద్రిప్పవలయునేగాని లేవదీయగూడదు.

7. రోగి పరుండియున్న గదియొక్క కిటికీని దెరచియుంచవలయును; కాని రోగిపై మాత్రము గాలిని విసరనియ్యగూడదు.

8. తీక్షణమైన వెలుతురును రోగియొక్క నేత్రములపై ప్రసరింప నీయగవలదు. కాని, గదిలోనికి వీలైనంతవరకు ఎండను రానియ్యవచ్చును.

9. జ్వరరోగిని యొంటరిగా వదలివేయరాదు. అట్లు చేసినయెడల తీవ్రజ్వరములో సంధిగుణము జనింపవచ్చును.

10. రోగి పరుండియుండు గదిలో కత్తులు కత్తెరలు మొదలగువాటి నుంచరాదు.

11. గదియంతయు దుమ్ములేకుండ పరిశుభ్రముగా నుంచి కార్బాలిక్ లోషనులో ముంచిన గుడ్డతో నచ్చటి సామానులన్నియు దుడువనగును.

2




1




థెర్మామెటరు.

1. జ్వరమునందు పాదరసము 104 డిగ్రీలకు హెచ్చిన స్థితిని చూపించు చున్నది.

2. జ్వరమును గొలుచుటకు ముందుగా పాదరసమును గ్రిందికి దింపిన స్థితిని చూపించు చున్నది.

80.4° — శరీరముయొక్క సామాన్య వేడిమి.

12. రోగి నుపయోగించిన గ్లాసు, గిన్నె, చెమ్చా, మొదలయినవాని నన్నిటిని శుభ్రముగా కడిగి దూరముగా నుంచవలయును.

13. ఆహారము, పాలు, కాఫీ మొదలయినవాటిని గదిలో నుంచరాదు, బయటగా బల్లపయి నుంచవచ్చును. ప్రతిదానికి మూతవేసి రోగికి దూరముగ నుంచవలయును. ఒక్కొక్కసారి తాగక లేకపోయినను దూరముగ దీసికొనివెళ్లి మరల నవసరమైనపుడు తీసికొని రావలయును.

14. రోగిని మాట్లాడనియ్యవద్దు: చూచుటకు నెవ్వరిని రానీయకుండుట ఉత్తమము.

15. నీవు రోగితో మాట్లాడునపుడు గాని, రోగియొద్ద నితరులతో మాట్లాడునపుడు గాని, మెల్లగ మాట్లాడినను గాని గుసగుసలాడవద్దు. గుసగుసలాడుట రోగికి విసుగుదలను పుట్టించును.

16. రోగి కుపచారములు చేయువార లందరును చేతులను గోళ్లను శుభ్రముగా కడుగుకొనుచుండవలయును. రోగికన్నను ఉపచారములు చేసి చేయి కడుగుకొనకుండగనే చేతిని నోటిలో పెట్టుకొనునట్టి గాని, చేతితో కండ్లను నలుపుకొనునట్టి గాని, యలవాటులను మానుకొనవలయును.

## థర్మామీటరు నుపయోగించు విధము

థర్మామీటరు నుపయోగించుటకు ముందుగా దానిని కొంచెము వేడిచేసి అందలి పాదరసము 98.4 డిగ్రీలను మాత్రము మించకుండునటుల జూడవలయును. అరచేతి యందలి వేడిమి తరచుగా మారుచుండునుగాన శరీరముయొక్క వేడిమిని గనుగొనుటకు థర్మామీటరును అరచేతిలో పెట్టుకొని శరీర వేడిమిని గనుగొన యత్నించరాదు. థర్మామీటరును పెట్టుటకు ముందుగా చంకను పొడిగానుండునట్లు తుడిచి చర్మమునకు తగులుచుండునట్లు చంక మధ్యగా దీని నుంచవలయును. థర్మామీటరుయొక్క అడుగు భాగమునకు అన్నివైపులను చర్మము అంటియుండునట్లుగా చేతిని బాగుగా నత్తిపెట్టి, ముంజేయిని రొమ్ముపై వేసికొని రెండవ భుజమును తాకుదుగా నుంచవలయును. ఈ స్థితిలో 3 నిముషాలు 5 నిముషముల వరకును ఉంచవలయును. ఈ సమయములో పంకాలు లాగుట నిలిపివేయవలయును. అప్పుడు థర్మామీటరును పరీక్షించి వేడిమిని గుర్తింపవచ్చును. శరీర వేడిమిని గుర్తు పెట్టుటకు ఒక అచ్చుపట్టీని ఉంచుకొనుట మంచిది. ఉపయోగించినపిమ్మట థర్మామీటరును సబ్బుతోను గడుగవలయును కార్బాలిక్ ఆసిడ్ లోషనులో కడుగుట శ్రేష్ఠము.

నిర్దేశ కాలములలో వచ్చుచున్నట్టియు, నిర్దేశ కాలము వ్యాపించుచున్నట్టియు, స్కార్లెట్ జ్వరము పొంగు, మశూచి, టైఫాయిడ్ జ్వరము మొదలగువాటిలో శరీర వేడిమి వాటివాటి ననుసరించి, ఆయా నిర్దేశ దినములలో మార్పులను జెందుచుండును. ఈ స్థితులను సరిగా తెలిసి

కొఱకుటకై వ్యాధియంతటను ప్రతిదినమును ఒకేకాలమందు తెర్మామెటరుతో శరీరవేడిమిని బరీక్షించుట మంచిది. ఉదయమున 8 గంటలకును, సాయంత్రమును, దీనికొనిన కొలతలం యొక్క ఉపయోగముగ నుండును, తెర్మామెటరు పరీక్షకును, రోగి తనంతటతాను చలిగానున్నదనియు వేడిమిగా నున్నదనియు చెప్పువాటికిని, సంబంధ ముండజాలదు. ఏలనన జ్వరంతీవ్రతయందు రోగియొక్క శరీరము మిగుల వేడిగానున్నపుడు చలిగానున్నదనియు, శరీరము నిజముగా చల్లగా నున్నపుడు వేడిగానున్నదనియు, రోగి చెప్పుట కలదు.

బిడ్డలయొక్క శరీరవేడిమి పెద్దవాండ్లకంటె కొంచె మధికముగానుండును బిడ్డల యందు, విశేషజబ్బు, యేమియులేక, బహుశః అన్నకోశసంబంధమగు లోపములను గలిగినపుడు, వెంటనే ఒకేసారిగ శరీరవేడిమి అధికముగ హెచ్చును. ఇట్టి సందర్భములలో కొద్దికాలములోనె మరల శరీరవేడిమి తగ్గి మామూలు స్థితికి వచ్చును. ఇంతేలోనె రుయేదియో గొప్పజబ్బు వచ్చినదని తొందరపడకుండ జాగ్రతగ నుండవలయును. అయితే, ఆరోగ్య స్థితినుండి యుక్తిమార్పు పండ్రెండుగంటల పరిమితికంటె యొక్కువ కాలము ఉండియుం డినయెడల అస్వస్థతావస్థ ప్రారంభమయినదని దృఢముగా నమ్మవచ్చును.

శరీరవేడిమి 95 డిగ్రీలు ఉండినయెడల క్షీణగతి ప్రారంభమయినదని తెలుపవచ్చును: వెంటనే హెచ్చుచేసినదప్ప జీవము నిలుపజాలదు.

97.3 డిగ్రీలుగాని అంతకు తగ్గిగాని యుండినయెడల నిస్త్రాణస్థితియం దుండినట్లు గ్రహింపవచ్చును.

98.4 డిగ్రీలు ఇది సామాన్యముగ నుండవలసిన వేడిమి.

101 డిగ్రీలు జ్వరము ఆవరించినట్లు చెప్పవచ్చును.

102 డిగ్రీలు పూర్ణమగు జ్వరము.

103 డిగ్రీలు కఠిన జ్వరము.

103.5 డిగ్రీలు మొదలు 106.8 డిగ్రీల వరకును ఉన్నతజ్వర మనబడును.

107 డిగ్రీలు విశేష అపాయము. సామాన్యము గ జీవించుట కష్టము.

## నాడికిని, ఊపిరికిని, శరీర వేడిమికినిగల సంబంధము

శరీరవేడిమి, సామాన్యముగ నుండు స్థితినుండి ఒకడిగ్రీ హెచ్చినయెడల నాడికొట్టులు నిమిషమునకు సుమారు పది హెచ్చును; ఉచ్ఛ్వాసనిశ్వాసములు నిమిషమునకు రెండు లేక మూడు హెచ్చును. సామాన్యస్థితియందు నాడికొట్టులు నిమిషమునకు 75 అయి యున్నపుడును, శరీరవేడిమి 98.4 డిగ్రీలు అయియున్నపుడును, ఉచ్ఛ్వాసనిశ్వాసములు 17 అయి

యున్నపుడును శరీర వేడిమి 100 డిగ్రీలకు హెచ్చినప్పుడల నాడి దెబ్బలు 90 లేక 95 గాని, యుచ్ఛ్వాస నిశ్వాసములు సుమారు 23 సామాన్యముగా కావచ్చును.

## చల్లని స్నానములు

జ్వరము అతిశయ స్థితియందుండినపుడు చల్లని నీళ్లలో రోగిని స్నానము చేయించుటవలన మంచి ఫలితములనిచ్చునని తెలియవచ్చియున్నది. జ్వరము 107 లేక 108 డిగ్రీలకు వ్యాపించియున్నపుడు చల్లని స్నానమువలన జ్వరమును తగ్గించితీరవలయును; లేనిచో రోగి మరణమునొందుట నిశ్చయమైయున్నది. జ్వరము 103 డిగ్రీలకు మించియున్నపుడైనను చల్లనినీటిలో ముంచిన గుడ్డలతో వొళ్లంతయు తుడిచి వేడిమిని తగ్గించుట ముఖ్యమైయున్నది. టైఫాయిడ్ జ్వరమునందు చల్లని స్నానములను చేయించుటవలన వ్యాధిసంబంధమగు విషమును అంతరింపజేయుటయును, శరీరమునుండి అట్టివిషయమును తొలగించుటయును, గలుగుచున్నదని మనము గ్రహింపవలయును. ఇట్టి చల్లని స్నానములను జేయించుటవలన శరీరవేడిమిని తగ్గించుటయు గలుగుచున్నది గాని టైఫాయిడ్ జ్వరమునందు పై విషయములే ప్రధానముగ నెంచవలయును.

చల్లనినీటిని ఒడలుపై బ్రయోగించినపుడు అంతరావయవములకు జురుకుదనమును బుట్టించును. మూత్రకలిగిన విషయములలో నిట్టిగుణమును మనము సులభముగనే గమనింపవచ్చును. అటుగిరిని టైఫాయిడ్ జ్వరములో వ్యాధిసంబంధమగు విషమును ఛేదించుటయందు పనిచేయుచున్న గ్రంథులయొక్క చురుకుదనమునకు చల్లని స్నానములు మిగుల సహాయము చేయును. ఈ గ్రంథులయొక్క చురుకుదనము వ్యాధిసంబంధమగు విషమును త్వరితముగ శరీరమునుండి వెలువరింపజేయును. ఈ చల్లని స్నానములను జేయించుటకు పూర్వముకంటె యీ చల్లని స్నానములను జేయించినపిమ్మట టైఫాయిడ్ రోగియొక్క మూత్రమునందు మూడింతలు జ్వరసంబంధమగు విషాణువులుండియున్నట్లు పరీక్షవలన గనుగొనబడెను. అనగా యీ శరీరలక్షణము లట్టుండ జ్వరవిషము రక్తప్రవాహమునందు గలిగియున్న కారణముచే వ్యాధియొక్క తీవ్రత కలుగుచున్నదని మనము దృష్టియం దుంచుకొనుము, యిట్టి చల్లనిస్నానములను జేయించుటవలన శరీరమునుండి జ్వరవిషము మూడంతలుగా వెలువడుచున్నదని మనము గ్రహింపవలసియున్నది.

ఇట్టి స్నానచికిత్సవలన మెదడునకు శాంతత గలుగుచున్నదనెడి లాభమునుగూడ మనము గుర్తెరుంగవలయును; బంధగుణమును తగ్గించి నిద్రను బుట్టించును. మరియు, యీ స్నానము గుండెకు చురుకుదనమును గలిగించి రక్తప్రచారము నభివృద్ధి జేయును; శరీర వేడిమిని తగ్గించుటవలన శరీరమునందు గలుగుచున్న నష్టమును కొద్దిపరచును.

జ్వరవిషయమునందు చల్లని నీటిని ఒడలుపై ప్రయోగించుటవలన నీ క్రిందిలాభము లున్నట్లు మనము నిశ్చయింపవచ్చును.

1. శరీరమునందలి విషసంబంధమగు సూక్ష్మజీవులను అతిశీఘ్రముగా వెలువరింపజేయును.

2. తీవ్రమగు శరీరవేడిమిని తగ్గించి గుండెయొక్క కార్యక్రమమునకు భంగము లేకుండజేసి శరీరమునందు జ్వరవేడిమివలన గలుగుచున్న నష్టమును తగ్గింపజేయును.

3. సంధిగుణము తగ్గిపోవును.

4. రక్తప్రచార మధికమగును.

5. అంతరావయవములకు జాగరూకతనమును గలుగజేసి జీర్ణకోశముయొక్క జీర్ణశక్తి అధికపరచును.

జ్వరమును తగ్గింపజేయు మందుల నుపయోగించుట మంచిదికాదని గొప్ప డాక్టర్లయొక్క అభిప్రాయమైయున్నది. ఏలనన, అట్టిమందుల నుపయోగించుటవలన శరీరవేడిమి తగ్గినప్పటికిని మూత్రగ్రంధులు మొదలగువాటియొక్క చురుకుతనము నణచివేసి శరీరమునుండి విషసంబంధమగు సూక్ష్మజీవులయొక్క వెలువరింపున కాటంకము కలుగజేయును. చల్లని స్నానములను జేయించిన విషయములనున్నూ, జ్వరమును తగ్గించుటకు మందుల నుపయోగించిన విషయములనున్నూ లెక్కవేసి చూచినమీదట చల్లని స్నానములను జేయించిన విషయములలో మరణములు తక్కువగా నుండియున్నట్లు స్థిరపరచబడినది. దీనినిబట్టి చల్లని స్నానములయందు జ్వరమును తగ్గించుగుణముమాత్రమేగాక అధిక ఫలిత మండియున్నట్లు మన మొప్పుకొనక తప్పదు. జ్వరరోగులకు చల్లని స్నానములను జేయుటకు సలహా నిచ్చుట జ్వరవేడిమియొక్క ఆధిక్యము ననుసరించి యుండవలెను. వ్యాధియొక్క విషాధిక్యమునుబట్టి శరీరవేడిమియొక్క ఆధిక్యము యేర్పడును గావున శరీరవేడిమియొక్క తీవ్రదశనుబట్టి వ్యాధియొక్క విషస్థితిని మనము గ్రహించి, చల్లని స్నానములను జేయుటమూలమున నుపశాంతిని గలుగజేయ యత్నింపవలయును.

చల్లని నీటిస్నానమును టైఫాయిడ్ జ్వరచికిత్సయందు ముఖ్యముగను పట్టువిడువకుండగను జేయింపతగియున్నది. ఇతర జ్వరములయందును జ్వరతీవ్రత అతిశయస్థితి నందున్నపుడు చల్లని స్నానమువలన నా అతిశయపు వేడిమిని తగ్గించి శరీరము నపాయస్థితి నుండి తొలగింపనగును.

## నాలుక

అనేక వ్యాధులయందు నాలుక అనేకవిధములైన మార్పులను బొందుచుండును. అందు యీ క్రిందివి ముఖ్యముగా గమనింపదగినవి.

1. పాలిపోయినట్టియు, మొద్దుబారినట్టియు: వెడల్పు అయినట్టియు, మెత్తనైనట్టిగాను పండ్లచే నొక్కులుపడినట్టియు, నాలుక నీరసమయినట్టియు, నిస్సత్తువను జెందినట్టియు, శరీర స్థితిని దెలియజేయుచు, రక్తమునందలి నీటిభాగముయొక్క అతిశయమునుగూడ దెలియజేయును. పాండురోగమునందు నాలుక యిదేరీతిగనుండును.

సంధిగుణము (4) జ్వరము (5) తలతిరుగుట (6) తలనొప్పి (7) ఇతరనొప్పి (8) హృద్రోగము (9) వణకుట (10) గొంతునొప్పి (11) దాహము (12) మూత్రస్థితి (13) వాంతి యగుట.

మందులయొక్క గుణములు శరీరతత్వముల ననుసరించి భిన్నముగ గనబడును. వ్యాధులును వేరువేరు మనుష్యులయందు, ఒకానొకప్పుడు వేర చెప్పబడిన లక్షణముల ననుసరించక భేదించియుండును. ఒకేవ్యాధి వేరుమనుష్యులయందు, లింగము, అభ్యాసము వయసు, శీతోష్ణస్థితి, మనోస్వభావము, జాతి, ప్రకృతి—వీని ననుసరించి వేరువేరు గుణములను వహించి, ఒకానొకప్పుడు ఒకతరగతి లక్షణములు ప్రాముఖ్యము గానుండి వేరొకప్పుడు వేరుతరగతి లక్షణములు ప్రాముఖ్యము గానుండును. దీనినిబట్టి, వైద్యుడు ప్రతివ్యాధిని, ఆయా వ్యాధియొక్క ప్రాముఖ్య లక్షణములనుబట్టి చికిత్స చేయ వలెను వలయును గాని, ఒకే మందు ఒక ప్రత్యేకవ్యాధియం దెట్టిలక్షణములున్నను గుణము నిచ్చునని యెంచరాదు.

## గుండె వ్యాధియందు చికిత్స

గుండె వ్యాధియందు ముఖ్యముగ జేయనగు చికిత్స రోగియొక్క మనస్సునకును శరీరమునకును గూడ విశ్రాంతి నిచ్చుటయం దిమిడియున్నది. మనస్సునకు ఉద్రేకము గలుగుటయు, మనస్సునకు విచారము గలుగుటయు, గూడ శరీరాయాసముతో సమానముగ హృదయమున కధికమగు బనిని గలుగజేయును. కాబట్టి రోగియొక్క మనస్సున కెట్టి ఉద్రేకమును విచారమును గలుగకుండునటుల జాగ్రత్త పెట్టవలయును. రోగి తనంతటదాను యేపనిని జేయనొల్లడు. ఒకవైపునుండి మరియొక వైపునకు దిరుగవలయునన్న, పరిచారకులే ఈ పనిని జేయవలయును. రోగి కొంచెముగ మాత్రమే మాట్లాడవలయును.

గుండెవ్యాధియొక్క ప్రారంభగతులయందు గుండెయొక్క స్నాయువులు గాని, గుండెయొక్క బిలద్వారములు (Valves) గాని, వాపుదల నందియున్నపుడు రోగి యెల్లప్పుడును పరుండియే యుండవలయును. అనంతర స్థితులయందు గుండెయొక్క కార్యము అధికముగ శిథిలమై శ్వాసకోశము లెల్లను రక్తమయమైయున్నపుడు శ్వాసావరోధము కలుగుచు, యిక నట్లు పరుండియుండుట కెంతమాత్రమును వీలుండదు. ఈ స్థితియందు రోగి కూర్చొనుటకు దిండ్లను వెనుక వైపుననుంచి రోగి పడిపోకుండునటుల జాగ్రతను వహించియుండవలయును. ఈ పద్ధతివలన శ్వాసకోశములోని రక్తపువాయువును పీల్చుకొనుటకు వీలుగనుండి, ఉదరమునందలి అవయవము లెవ్వియు, ముఖ్యముగ కార్జము—హృదయము నొత్తిడిని గలిగింపకుండజేయును. నంజువ్యాధి స్పష్టముగ గనబడినపుడు కాలమంది రోగులు పరుండుటకే శక్తిని గలిగియుండక రాత్రింబవళ్లు పడక కుర్చీలో గూర్చునియే యుందురు. ఈ స్థితియందు శరీరమునందలి ద్రవపదార్థము ఉపరిభాగములనుండి క్రింది భాగములకు దిగి గుండెయును శ్వాసకోశములును దేలికగా బనిచేయుటకు వీలుగనుండును. గుండెవ్యాధియొక్క అంత్యగతులయం దేతీరున పరుండినగాని కూర్చుండినగాని రోగి సౌఖ్యముగ నుండునో ఆతీరే మంచిదిగ నెంచవలయును. ఈ వ్యాధియందలి కష్టమును

కాళ్లకును ఉదరమునకును నంజు విశేషముగా నుండినయెడల, తొడయొక్క క్రింది భాగమున వెలుపలివైపున శస్త్రసంబంధమగు సూదితో మూడు నాలుగు రంధ్రములను జేసినయెడల నా రంధ్రములద్వారా శరీరములోని ద్రవపదార్థము వెలువడిపోవును. ఈ కార్యమునందు మిగుల పరిశుభ్రత అవసరమై యున్నది.

ఈ వ్యాధియందు దియ్యదగిన మందులనుగూర్చి, మలము మూలమునను మూత్రము మూలమునను శరీరమునుండి మిక్కుటమగు ద్రవపదార్థము వెలువడుట కవసరమగు మందుల నియ్యవలయును. గుండె త్వరితముగ గొట్టుకొనుచు నిరసస్థితియందుండి క్రియ తప్పియుండినయెడల టింక్చర్ డిజిటాలిస్ను (Tincture Digitalis) ఉపయోగింపనగును. డిజిటాలిన్ యొక్క ఉపయోగమునుగూర్చి పూర్ణముగ దెలియవలెనన్న ఆంగ్లేయౌషధ గుణదీపికను జూడుడు.

ప్రాణవాయువు నెక్కువగ బీల్చుటకు వీలును గలుగజేయుట మూలమున రోగికి విశేషమగు సౌఖ్యమును గలుగజేయవచ్చును. గుండెవ్యాధిచే పీడితుడగుచున్న రోగి విశాలమైన గదిలో నుండి ఆ గదిలోనికి పరిశుభ్రమగు గాలి కరివిగ వచ్చుటకు సదుపాయములను జేయవలయును. చలికాలములో నీ గదియొక్క ఉష్ణత 60 డిగ్రీలకు తగ్గియుండగూడదు. అంతియేగాక వాయువు మిక్కుటముగ రోగిపయి వీచకుండ నుండవలయును.

ఉచ్ఛ్వాస నిశ్వాసములయందు గలిగెడి ఆయాసమును అమిల్ నైట్రైట్ (Amyl Nitrite) ను యుపయోగించుటవలన నయము చేయవచ్చును. ఈ మందు చిన్న గాజుగొట్టములలో వచ్చును. ఒక గాజుగొట్టమును జేబురుమాలులో బగులగొట్టి అందునుండి వచ్చెడి ఆవిరిని వాసన జూడవలయును. ఇట్లు వాసన జూచుటవలన చిన్నవగు పరిశుద్ధ రక్తనాళములు విస్తరింపునంది రక్తప్రచారమున కనువును కలుగజేసి నొప్పిని వెంటనే పోగొట్టును. నైట్రోగ్లిసరిన్ (Nitro-Glycerine) కూడ యిట్టి ప్రయోజనమునే కలుగజేయును, దీనిని లోనికి కియ్యవలసియుండును. ఇది కొంచెము నెమ్మదిగా బనిచేయును. పై ఔషధములలో దేనివలనను ఉపయోగము లేనప్పుడు మార్ఫియా (Morphia) ను సూదితో రక్తములోనికి యింజక్టు చేయవలసియుండును; లేదా క్లోరోఫారం (Chloroform) వాసన చూచుటకైనను ఉపయోగింపనగును.

## వ్యాధియొక్క లక్షణముల గుర్తించుట

వ్యాధిని కుదుర్చుటకు పిలువబడిన ప్రతి వైద్యునియొక్కయు ముఖ్యమగు లక్ష్యము వ్యాధి యొక్క లక్షణములను, గమనించుటయై యుండవలయును.

వ్యాధియొక్క నిజస్థానమును గూర్చియు, వ్యాధి యెంతవరకు వ్యాపించి యున్న దానిని గూర్చియు, వ్యాధియొక్క పుట్టుటకు కారణముల గూర్చియు వ్యాధి యొక్క స్వభావమునుగూర్చియు సంపూర్తియైనట్టియు, సరియగు నట్టియు, వైజ్ఞానికమైనట్టియు, జ్ఞానమును సంపాదించుటయే వ్యాధియొక్క లక్షణజ్ఞానమనబడును. ప్రతి వ్యాధియందును యిట్టి సంపూర్ణమగు జ్ఞానమును సంపాదించుట బహుకష్టమే గాని, లక్షణజ్ఞానమును సంపాదించుటయందు కొద్ది పొరపాటులను జేసినవాడే

యొక్కవ జయముల నందువాడని మనము నమ్మవచ్చును. కొద్ది లక్షణములు పరీక్షించి యంతటితో సంతుష్టినంది, ఆ వ్యాధికి అజీర్తియో పచ్చకామెర్ల వ్యాధియో యని పేరిడి పనిచేయ ప్రారంభించుట సామాన్యముగ జరిగెడి లోపమయి యున్నది.

వ్యాధియొక్క అతిశయమును తీవ్రతను బట్టి, ప్రతివ్యాధి యొక్కయు లక్షణములను బహు జాగ్రత్తతో గమనించుచు, ఒక విధమయిన బుద్ధివిచారణ చేయుటయందే వ్యాధి యొక్క గుణ లక్షణములను గనిపెట్టుశక్తి యిమిడియున్నది.

కొన్ని ప్రత్యేక లక్షణములు సమకూడి యుండుటచే కొన్ని వ్యాధులను నాటిగా తేలికతో గ్రహింప వచ్చును. కొన్ని వ్యాధులయందు అనేక లక్షణములు సమానముగా నుండుటచే, యే ప్రత్యేక లక్షణము భిన్నముగా నుండినదో గ్రహించి పనిచేయుట యొక్కవ కష్టమయినది. ఈలక్షణ జ్ఞానమును బొందుటకయి ఆవశ్యకమగు సంగతి సందర్భముల నన్నిటిని కనుగొని వ్యాధిని గురించి విచారణచేయుట మిగుల మంచిది. అందులకై క్రింది సంగతుల దెలిసికొన యత్నింప నగును.

(1) రోగి యొక్కయు రోగి కుటుంబము యొక్కయు, సాంప్రదాయమును వెనుకటి ఆరోగ్యతను గూర్చియు, విచారింపవలయును.

(2) ప్రస్తుతరోగము యొక్క చరిత్ర — యెంతకాలమునుండి యుండి యున్నదియను బహుశః యేమి కారణముచేత వచ్చియున్నదియు, వ్యాధి యేప్రకారము వృద్ధినంది యున్నదియు విచారింప వలయును.

(3) రోగిని జూచుటచే కనిపెట్టబడిన వ్యాధిలక్షణములను ముఖ్యముగ గమనింపనగును

(4) వ్యాధియొక్క నడక, అనగా దినదినమును యేయే లక్షణములు యెంతెంతకాలము వ్యాపించియున్నదియు గుర్తింప వలయును

(5) ఇప్పటి మందులయొక్క ఫలితములను అనగా యేమందు యిచ్చుట వలన యెట్టి ఫలితము గనిపించినదియు మంచిగుణము నిచ్చినట్టి మందును యింకను వాడుటయు, దుర్గుణముల నిచ్చినట్టి మందును నిలుపుచేయుటయు—యీ అంశములను మెలకువయం దుంచనగును.

## వ్యాధియొక్క ముందునడకను గుర్తించుట.

వ్యాధియొక్క ముందునడకను చెప్పుటకు మిగుల అనుభవమును, మంచి బుద్ధి కుశలతయు గావలయును. వ్యాధియొక్క ముందునడకను సరిగా చెప్పగలుగుటకు వ్యాధియొక్క స్వాభావికమగు నడకను బాగుగా దెలిసినవాడై, ఆరోగ్యము యొక్క సహజ తత్వమునున్నూ తెలిసి యున్నవాడై, తాను ఉపయోగించు ఓషధులయొక్క గుణములను శక్తులను గ్రహించుటయందు మిగుల అనుభవము గలవాడును, అయి యుండవలయును.

వ్యాధియొక్క ముందునడకను గూర్చి వైద్యుడు తనంతటతాను రోగికి గాని రోగియొక్క స్నేహితులకు గాని చెప్పకూడదు. ఎవరయినను అడిగినయెడల స్పష్టముగా తెలిసియున్న సంగతిని చెప్పవచ్చును. అనుమానముగా నున్న సంగతిని చెప్పుటయందు

బహుజాగ్రతగా నుండవలయును. వైద్యులు చెప్పు సంగతులు సాధ్యమయినంతవరకు ఆళాహితములుగా నుండవలయును. అట్లుంచినచో వైద్యుడు తానుజయమందుదుననునమ్మకముతో తానుచేయు చికిత్సను నిలిపివేయుట తటస్థించును. స్పష్టముగా మరణము సంభవించు స్థితియందు రోగియొక్క బంధువులుగాని స్నేహితులుగాని యథార్థస్థితినిగురించి యడిగినచో వైద్యుడు తానెరిగియున్న సంగతిని జెప్పుట తనవిధియై యున్నది.

## దేహపరిశోధన విధానము

రోగి చూచినవెంటనే చేతియందు నాడిని గాని, లోపలనున్న బాధలనుగాని పరీక్షింప బ్రయత్నింపకుండ ముఖమును, ముఖమునందుండు కళలను, బరీక్షింపవలెను. వ్యాధి 10—15 రోజులనుండి బాధించుచున్నను ముఖమునందు కళ తగ్గియుండక పోవచ్చును. 4 రోజులనుండి మాత్రమే వ్యాధి బాధపెట్టుచున్నను. రోగిమిక్కిలి డస్సిపోయి ముఖవర్చస్సు ఎక్కువగ మారి, వ్యాధి ప్రబలముగ నున్నదను నంశములు స్పష్టపడుచును.

నాలుక చాపించి చూచినయెడల మరికొన్ని యంశములు తెలుపదగలవు. విషజ్వరములలో నాలుక మెత్తగను, ఎర్రగను, ద్రవముతో గూడినదిగను ఉండక అనేక మార్పులను గలిగియుండును. ఈ మార్పుల స్వభావమును వాధి యర్థమును వ్యాధి నిదాన నిమర్శయందు వచ్చును.

సామాన్యముగా జనులెల్లరును నిమిషమునకు 18 సార్లు ఊపిరిని వదలి, ఊపిరిని పీల్చుకొనుచుండ, జరపీడితులగు రోగులు 25, 30 సార్లు పీల్చెదరు గాని కొన్ని సమయములందు ఎక్కువసార్లుఊపిరిని దీసికొనుటయేగాక, ఉచ్ఛ్వాస నిశ్వాసములలో నెక్కువశ్రమను పొందుదురు. ఈ యాధిక్యశ్రమకు ముఖ్యనిదర్శనము ముక్కుల నెగరవేయుట.

## హృదయశోధన

వెన్నెముక చేతను ప్రక్కయెముకలచేతను గూడియున్న పంజరములో మూడుముఖ్యావయవములు కలవు. వీనిలో నొకటి గుండె; మరియు రెండు ఊపిరితిత్తులు కలవు.

### 1. గుండెపరీక్ష

గుండె, 2 వ ప్రక్కయెముకనుండి 5 వ ఎముకవఱకు, వ్యాపించియుండును కుడివైపున మధ్య ఎముకనుండి $\frac{3}{4}$ అంగుళము కుడివైపున నుండును ఎడమవైపున స్తనాగ్రము నుండి కిన్నగ నిలువుగీత గీచినయెడల నీ గీతను దాటదు. గుండె యెప్పుడును గొట్టుకొనుచుండును. అనగా చిన్నదయి పెద్దదగుచుండును. ఇట్లు నిమిషమునకు 72సార్లు కొట్టుకొనుచు కొట్టుకొను నపుడెల్ల దీని యగ్రము ఎదురురొమ్మునకు దగులును. కాని లోపల ఈ అవయవ మీమార్పులను పొందుచున్నట్లు ఎవరికిని వారికి గోచరము కానేరదు. విశేషముగ ప్రయాసపడినపుడుగాని, శోక భయాదుల సంక్షోభమును చెందినపుడుగాని, గుండె ఎదురు రొమ్ముపై గొట్టుకొనుచున్నట్లు మనకు దెలియును. తదితర సమయములం దిట్లు గోచరమగుట ఆరోగ్యలక్షణము కాదు. ఆరోగ్యస్థితిలో హృదయముపై ఎడమవైపున 5, 6 ప్రక్కటెముకలమధ్యను, స్తనాగ్రముగుండ గీచిన నిలువుగీతకు అరంగుళము లోపుగనుండున

## 2. శ్వాసకోశముల పరీక్ష

1. నేత్రసహాయముచే హృదయముయొక్క కదలికలో హెచ్చుతగ్గులను గమనింపవలెను.

II. స్పర్శ : రెండు అరచేతులను, వీపుమీదను, ఎదురురొమ్ము పయినను ఉంచిఇరుప్రక్కలను ఊపిరితీసికొనుటయందు రెండు భాగములును సమానముగ గదలుచున్నవాలేవా యను నంశమును నిరూపించవలెను. ఒకవైపు తక్కువ కదలుచున్నయెడల నావైపు ఊపిరితిత్తిలోనికి గాలి తక్కువగ బోవుచున్నదని యర్థము. గాలి తక్కువగ బోవుటకు ముఖ్యకారణము ఏమన ఊపిరితిత్తిలోని రంధ్రములు కల్లిపదార్థముచే నిండియుండుట. అప్పుడు ఈ అవయవములు బోలువానివలెగాక గట్టివానివలె ప్రవర్తించును. శబ్దము గాలియందుకంటె నీటియందుకంటె ఎక్కువగట్టిగను, నీటియందుకంటె కర్రయందెక్కువ గట్టిగను వినబడును. కావున గాలితో నిండిన ఊపిరితిత్తులగుండ కన్న, కల్లితో నిండి గట్టిపడిన ఊపిరితిత్తిగుండ శబ్దము ఎక్కువ గట్టిగ వినబడును. కావున ఇరుప్రక్కలను చేతు లుంచి రోగిని ఒకటి, రెండు, మూడు అని చెప్పుమనినచో, ఒకప్రక్కను శబ్దము గట్టిగను, మఱియొక ప్రక్కను సూక్ష్మముగను వినిపింపవచ్చును. దీనియర్థమేమనిన, గట్టిగా కనుపించువైపున ఊపిరితిత్తి కల్లితో నిండి, గట్టిపడినది సూక్ష్మముగ వినిపించు ప్రక్కను ఊపిరితిత్తి గాలితోనిండి ఆరోగ్యస్థితియం దుండును. అయినను యిరుప్రక్కలను శబ్దము భేదముగ నున్నప్పుడు, ఏప్రక్క శబ్దము ప్రమాణముగ నున్నదియు, ఏప్రక్కను మార్పు చెందినదియు చెప్పుట అనుభవమువలననే తెలియగలదు. సామాన్యముగా నుండు శబ్దప్రమాణము అనుభవముచే గ్రహించి, హెచ్చుతగ్గులను దీనితో బోల్చిచూచి గమనింప వలయును.

### 3. తట్టి చూచుట.

గుండెపరీక్షయందు చెప్పబడిన దంతయు ఇచ్చటను వర్తించును. ఊపిరితిత్తు లెప్పుడును డబ్ డబ్ శబ్దమునిచ్చును. కల్లితో నిండి రోగముతో గూడియున్నపుడు టప్ టప్ శబ్దమునిచ్చును. వీపును, ఎదురురొమ్మును, సర్వత్ర పరీక్షించి, ఏభాగమున జబ్బు ఉన్నదో యాభాగమును గుర్తింపవలెను.

### 4. హృదయశోధనపరికరము. (స్టెతస్కోప్) Stethoscope.

దీనితో జూచిన ఊపిరి తీయునపుడు లోన గలగలు శబ్దము తూములోనికి గాలిపోవునపుడు గలగలు శబ్దమువలె నుండును. ఊపిరి వదలునప్పు డింతశబ్దముండదు. ఊపిరి దీయునపు డుండు శబ్దము వదలునపు డుండుదానికన్న 4 రెట్లెక్కువ కాలముండును. ఈశబ్దములో గుడగుడధ్వను లుండరాదు. ఇట్టిధ్వనులు మూడుతరగతులు గలవి. బహు సూక్ష్మముగను, మధ్యరకముగను, ముతకగను నుండవచ్చును. వీని యర్థమేమనిన నీటిలో నుండి గాలి వదలినచో నెట్లు గుడగుడశబ్దము బయటకు వెలియగలదో యటులనే ఊపిరితిత్తులలోనికి బోవుగాలి ఖాళీస్థలములలోనికిగాక ద్రవపదార్థము (లేక కల్లి) మొదలగు గట్టి పదార్థము) గుండ ప్రవేశించుచున్నది. అట్టి పదార్థములు ఆరోగ్యస్థితియందు ఊపిరితిత్తులలో నుండవు. ఉబ్బసపుదగ్గులో నిట్టిపరీక్ష చేసినయెడల కిల్లిపూతవంటి శబ్దములు వినిపించును.

## మూత్రపరీక్ష

1. మూత్రముయొక్క చిక్కదనము బరీక్షించుట కొక పనిముట్టుగలదు. దీనినియూరినోమీటర్ (Urinomoter) అందురు. దానియందు అంకెలు వేసియుండును. ఈచిక్కదనము నీటితో బోల్చి తెలిసికొనబడును. నీటియొక్క చిక్కదనము 1000 అంకెచే గుర్తింపబడినచో ఆరోగ్యముగు మూత్రముయొక్క చిక్కదనము 1003-1015 వరకు నుండును. ఆంగ్లేయగ్రంథములయందు 1015-1025 అని చెప్పబడును గాని ఈయంకెలు మనదేశమునకు సామాన్యముగ వర్తింపవు.

2. లిట్మస్ కాగిత మని యొక రకపు కాగిత ముండును. ఇందులో నీలపురంగుది యొకటి, ఎరుపుది యొకటి యుండును. ఆరోగ్యముగనున్న మూత్రములో నీలపు కాగితమును ముంచిన ఎర్రబడును. ఒక్కవైపున యెరుపురంగు గలిగినట్టియు రెండవవైపున నీలపురంగు గలిగినట్టియు లిట్మస్ పెన్సిలు లుండును. కాగితముపయిన యీ పెన్సిలుతో గీసి, పైవిధముననే యీ కాగితమును మూత్రమునందు ముంచుటవలన బరీక్షచేయవచ్చును.

3. ఆల్బ్యూమెను (Albumon) శ్వేతద్రావకము.

కొంచెము చిన్న గాజు గొట్టమును దీసి దానియందు మూడువంతుల వరకును మూత్రముపోసి, అడుగుభాగమును బట్టుకొని పైభాగమునందున్న మూత్రమును స్పిరిటుదీపముపై కాచవలెను. అప్పుడు కాచినచోట తెల్లగమబ్బులవలె మార్పుగలిగినచో నామూత్రమునందు మహాద్రావకము (Nitrio Aoid) ఒకబొట్టును మెల్లగా పోయవలెను. ఈమబ్బు కరగని యెడల ఆల్బ్యూమెను గలదు. కరిగినయెడల ఫాస్ఫేట్సను లవణములు గలవు. మబ్బులేని యెడల మూత్రము ఆరోగ్యముగ నున్నది.

(4) మధురపరీక్ష (Sugar Tost) పేవీసు సొల్యూషనును గాని ఫేలింగ్సు సొల్యూషనును గాని కొంచెము గాజుగొట్టములో పోసి, స్పిరిట్ దీపముపై మరగబెట్టి, అందు మెల్లగ 5, 6, బొట్లు మూత్రమును గొట్టము ప్రక్కనుండి జారబోయవలయును. పిమ్మట తిరిగి కాచవలెను. అప్పుడు నీలపువర్ణముగల పైద్రావకము కాచిన పండుటాకు వర్ణముపొందినచో మధుమేహ మున్నదని యర్థము. ఈ సందర్భమున మూత్రముయొక్క చిక్కదనము గూడ హెచ్చుగా 1010, 1030, 1040, గూడ నుండును.

5. అన్నిమూత్రముల యడుగున గొంచెము మడ్డి తేలియుండును. ఇది రోగలక్షణము గాదు.

మూత్రమును ప్రాతఃకాలమున బరీక్షింపవలెను.

## వ్యాధిచికిత్స లెన్నివిధములు ?

వ్యాధి నేమార్గమున నివర్తి యత్నించినను అయ్యది చికిత్స నాబడును. ఈచికిత్సలు క్రింది విధములుగ విభజింపవచ్చును.

(1) శరీరమునుండి కొద్దిరక్తమును దీసి యారక్తమును సూక్ష్మదర్శిని యంత్రము

క్రింద బరీక్షించి యందలి మూలపదార్థలోపమును గ్రహించి యాలోపమును బరిపూర్తిచే యుట మూలమున.

(2) దేహమునందలి యేయవయవము యొక్కనైనను బహిర్భాగము వలనగాని మరియేయితర కారణము వలన గాని, విరుగుటగాని స్వస్థానమునుండి తొలగుట గాని తటస్థించిన యెముకల నట్టిలోపమును "యక్స్ రే" సహాయమున బరీక్షించి దానిని సరిచేయుట.

(3) ఆరోగ్య సూత్రముల ననుసరించి నడుచుకొనుట మూలమున.

(4) ఏ అవయవము యొక్కని ధర్మానుచరణలోపమున వ్యాధిని గలుగుచున్నదో గుర్తించి, యితర జంతువులకు సంబంధించిన ఆ అవయవముయొక్క సారమును సమజీర్ణ లోనికిచ్చుటవలన.

(5) శరీరారోగ్యమున కనుకూలమగు ఆహారనియమముల నేర్పరచుటవలన.

(6) టీకాలను వేయుట - అనగా — సిరా — (రసి)ను గాని, తత్సంబంధమగు దానిని గాని, మశూచివ్యాధి విషమునందువలె యింజక్టు చేయుట మూలమున.

(7) జలచికిత్స - జలమును విరివిగ లోనికిచ్చుట మూలమునను వివిధములగు స్నానములం చేయుట మూలమునను.

(8) వేడిమిని గలిగించి చేయు చికిత్స. ఉ. వాపుదలలయందు వేడికాపడములనిచ్చుట మూలమున.

(9) వెలుతురు మూలమున జేయు చికిత్స. ఉ. సూర్యకిరణచికిత్స. ఇందు వెలుతురును వేడిమియును గలిసియుండును.

(10) విద్యుచ్ఛక్తి ప్రయోగమూలమున చేయు చికిత్స.

(11) వెన్నుపూస ననుసరించి పైభాగమున — అనగా — వెన్నుపూస మొదలుతో కలిసెడి స్థానమునుండి వెన్నుపూస క్రిందివరకును నుండెడి నరములను సవరించుట మూలమున జేయు చికిత్స. ఇయ్యది ప్రత్యేక శాస్త్రమైయున్నది.

(12) స్నాయువులకు ఒత్తిడిని గలుగుచేసి — అనగా — పట్టువిడుపుల మూలమున మర్దన చేయుటచే ఆయా అవయవధర్మముల క్రమపరచుటవలన (Massage).

చాలవ్యాధులలో వాటియొక్క నిర్ణీతకాలము గతించిననేగాని వ్యాధులు నయము కానేరవు. ఈ మధ్యకాలములో ఆహారాదినియమముల జాగ్రతగ నడపుచు చిక్కుస్థితుల గలుగకుండ జూచుచు ఒకవేళ నేదైన చిక్కుస్థితి తటస్థించినచో నంయుక్త పరిచర్యలను జేయుచు, సుఖమును గలుగజేయు మార్గములను అవలంబింపవలయును.

## ఆహారనియమము లేమి?

ఆహారము జీర్ణమగుటకు ఈ క్రింది కార్యానుకూలము లవసరములు:—

(1) మనుష్యుడు జాగ్రతావస్థయందుండుట ; ఏలనన, నిద్రించునపు డాహారముజీర్ణము కానేరదు. (2) జీర్ణకోశమునం దంతటను ఆహారమునకు కదలిక కలుగుట (3) సూర్యోష్ణ వేడిమి, వెలుతురు. (4) జీర్ణకోశమునం దుత్పత్తియగు వివిధ రసములు. (5) జీర్ణాశయము (Stomach) నిలువుగా నుండునస్థితి.

గాలి పెరుగుచునప్పుడు జీర్ణాశయము వ్రేలియుండును. గనుక యెక్కువ జీర్ణక్రియము జరుగనేరదు. అట్టి సమయమున నేమాహారమైనను కడుపులో నిలువ యున్నయెడల పడి పుల్లి వ్యాధులకను వును గలుగజేయును. ఇది గాక జీర్ణాశయమునకు గొంత విశ్రాంతి కావలయును. జీర్ణాశయమునందు బరువుపదార్థములు లేనందున సుఖనిద్ర కలుగును. నిద్రలేచినపిమ్మట నాలుగయిదు గంటలవరకు యెట్టి ఆహారమును లోనికి దీసికొనరాదు. ఉదయముననే కాఫీ మొదలయినవి దీసికొనుట దుర్బలవాటైయుండి ఆరోగ్యమునకు భంగము కలిగించును.

ఒకసారి లోనికి దీసికొనిన ఆహారము పూర్తిగ జీర్ణము గాకముందు మరలనే ఆహారమును దీసికొనరాదు. ఇట్లుచేయుట ఉడుకుచున్న అన్నములో క్రొత్తగా మరికొన్ని బియ్యము పోసి వంటచేసినట్లు యుండును.

ఆహారమును పూర్తిగా నమలవలయును. ఇట్లుగా చేయుటవలన గొంత జీర్ణక్రియము నోటియందే జరుగుచుండును. శాకాహారమే మంచిది. మాంసమును త్యజింపవలయును. ఇతర జంతువులు విశేష ఆహారము దినును. గాని మనుష్యునకట్టి ఆవశ్యకత లేదు. మనుష్యుడు ప్రాణావసరమునకగత్యమగు ఆహారమును మాత్రమునే భుజింపవలయును. జీవించుటకుగాను దినవలయును గాని తినుటకుగాను జీవింపరాదు. ఎక్కువగా దినినచో శరీరమందు క్రొవ్వు పదార్థ మధికమగును. క్రొవ్వుపదార్థ మధికమైనచో అనారోగ్యతకు విత్తనము నాటినట్లే యని యర్థము చేసికొనవలయును.

## ఆహార సూత్రములు

1. నీకెంత ఆహారమవసరమో అంతఆహారమును ఒక్కసారిగనే వడ్డింపించుకొనుము. దానిని దినిన పిమ్మట మారు వడ్డనకు చెయ్యి నష్టము. ఇదియే ప్రథమ సూత్రము.

2. ఇంకను కొంత ఆకలి యుండగనే విస్తరియొద్దనుండి లెమ్ము.

3. నీకెంత ఆహారము కావలసియుండునో దానిని నీ అనుదినానుభవమువలన నిశ్చయించుకొనుము. ఎక్కువ నాశింపకుము.

4. భోజనమునకు గూర్చుండునపుడు మనము కుక్కుటాసనమును వహింపవలయును గాని పద్మాసనమును వహింపరాదని మన శాస్త్రములు చెప్పుచున్నవి. కుక్కుటాసనమున గూర్చున్నచో జీర్ణాశయమును పూర్తిగా నింపుటకు వీలు లేకుండును ఇందులకిదియే కారణము. తక్కువగా దినుట కిదియే ముఖ్యోద్దేశము.

5. వడ్డించిన భోజనపదార్థముల సంఖ్యలో సాధ్యమైనంతవరకు తక్కువగా నుండుట మంచిది.

6. ఒక ముద్దను బాగుగా నమలి మింగిన పిమ్మట మరియొక ముద్దను నోటిలోనికి పోనిచ్చుచుండవలయును. అందువలన నాహారము ఉమ్మి ద్రవముతో గలిసి జీర్ణమున కనువగును.

మన పూర్వులు దినమునకు రెండు భోజనములను మాత్రమే నియమించి యుండిరి. కాని, నలుబది సంవత్సరముల వయస్సు దాటినవారు దినమున కొకసారి భుజించుటయే

మంచిది. గ్రీకులు, రోమనులు, పర్షియనులు — వీరందరును పూర్వకాలములో దినమున కొక్క భోజనమునే చేయుచుండెడివారనుమాట చరిత్రాంశమే అయియున్నది. జీవతలు దినమున కొక్కమారే భుజింతురట ! మనుష్యుడు రెండు సారులు భుజింపవలెనట! కావున మనుష్యులు మృగములబోలి నడచుకొనకుండుట శ్రేయస్కరము.

## మానసిక చికిత్స

**మానసిక చికిత్స**యన ఔషధసేవనములు మొదలగు పద్ధతులవలన చికిత్స చేయకుంచు తక్కిన చికిత్సాశాస్త్రము లెట్టివో యిదియు నట్టిదే గాని దీనిని మతసంబంధమైనదని గాని, భూతవైద్యమువంటి దనిగాని యెంచదగదు. ఇందలి పద్ధతులు ప్రకృతి సూత్రముల ననుసరించి యుండుటచే నట్టి సూత్రముల కీయనగును గౌరవమునే దీనికిని యియ్యనగును.

సృష్టియం దుండెడి శక్తిబలములు ప్రాణబోధితము లై యున్నవి. ప్రాణమును వెంటనంటియే మనస్సుగూడ నుండి యున్నది. బ్రహ్మాండమున కంతకును గూడ మనస్సు గలదు.

శరీరమునను వర్తించు కొన్ని ప్రకృతిసూత్రములు గలవు. ఆ ప్రకృతి సూత్రముల నుల్లంఘించినయెడల వ్యాధి కలుగుచుండును. రోగికి వ్యాధిని గుదుర్చుటకు యత్నించుటలో నీమనశ్శక్తిని నీ వుపయోగింప వలయును. రోగియు దనవ్యాధి కుదరగలదను నమ్మకమును గలిగియుండవలయును. యిట్టిమనశ్శక్తులు పనిచేయనిదే యెట్టి వ్యాధియును కుదిరిక నందజాలదు. వైద్యునకుండెడి యిట్టిశక్తికే మనవారలు హస్తవాసి యని చెప్పుచుందురు! పాఠకమహాశయా !

నీ మనశ్శక్తియందును నీ చికిత్సాశక్తియందును నమ్మకమును గలిగియుండుము. ఇట్టి సహజశక్తిని భగవంతుడు ప్రతిమానవునికిని పారితోషికముగ నిచ్చియున్నాడు. ఈశక్తిని నీ వుపయోగించిన కొలదియు నద్దాని బల మధిక మగును. శరీరసాధకము జేసినకొలది కండరము లెట్లు వృద్ధినందునో అటులనే యీ విషయమునను నుపకరింపగలదు.

నీవు చేయు చికిత్సలయందు జయ మందినయెడల గర్వము నందకుము. ఇట్టిశక్తి నెవరు బ్రయత్నించినను బడయగలరు. ప్రకృతి సూత్రముల హస్తములందు నీవొక సాధనముగా వర్తించుచున్నావు. అంతకు మించి మరేమియు లేదు. బ్రహ్మాండమునందలి శక్తుల నుండి నీవు నీ శక్తిని గ్రహించుచున్నావు. నీ స్వశక్తివలన నీవు జేయునదేమియును లేదు.

రోగి కిచ్చునట్టి ఆహారపదార్థ విషయమై ప్రథమ జాగ్రతను బుచ్చుకొనవలయును. రెండవ ముఖ్యవిషయము శరీరమున కవసర మగు జలమును క్రమముగా నుపయోగించుట. ఆరోగ్యమున కగు మూడవ ఆవశ్యకత క్రమ ఊపిరి. ఊపిరి దీయుట క్రమముగా లేకపోయినయెడల రక్తము పరిశుభ్రపడదు. ఇందు మూలమున ఆరోగ్యతప్పును. దీర్ఘఊపిరి దీయుట సాధకమూలమున ముందుగా నీవు నేర్చుకొని పిమ్మట నీ పద్ధతిని యవలంబింప రోగికి బోధించుము.

శరీరసాధకము, స్నానముచేయుట మొదలగునవియు నావశ్యకములే. నిద్ర-అనగా శరీరమున కంతకును విశ్రాంతి — ప్రకృతి సూత్రముల ననుసరించి యుండియుండవలసినదే. దీనిచే మనోవిశ్రాంతిగ గూడ భావింపవచ్చును.

వీని కన్నిటికంటె ముఖ్యము మనశ్శాంతి లేనిదే శరీరము క్రిమారోగ్యమును వహించి యుండనేరదు. ఈ మనశ్శాంతి రోగికిని వైద్యునకుగూడ నవసరమే. వైద్యునియొక్క చికిత్సావిధానము ఈశ్వరాంశప్రబోధిత మైనదియు పవిత్రమైనదియు నయియున్నది. ఈ ఆశయము నెప్పుడును మనమునం దుంచుకొన్నచో వైద్యవృత్తి ఆనందదాయక మైనదియు జయప్రదమైనదియు నగును. ప్రకృతి మాతనుండి దూరముగ జనిన సోదరులకు శరీరారోగ్యబలముయొక్క సంతోషవార్తను దెలిపి వారల ఋజుమార్గమునకు దే బ్రియత్నింప వలయును.

(ఆధునిక మానసిక చికిత్సయను వేఱు గ్రంథమునందు యీ చికిత్సావిధానమును గూర్చి వివరములు గలుపబడియున్నవి.

## సూర్యకిరణ స్నానము.

ఈ సూర్యకిరణస్నాన చికిత్స గ్రీకుల రోమనుల ఔన్నత్యస్థితి నాటినుండియు నుండియున్నది. ఆర్యులు ఆదినుండియు సూర్యునిమహిమ నెరిగియుండిరి. అను దినమును ఆర్యులు తమ సంధ్యావందనమునందు సూర్యుని కభిముఖులై అర్ఘ్యమును విడచుటను బట్టియే వారియొక్క నమ్మకమును మనము గ్రహింపవచ్చును.

వ్యాధిపీడితులగు క్రిములు జీకటిలో బెరుగును. విశేష వెలుతురున్న, విశేష ఆరోగ్యమే గాక దీర్ఘమైనట్టియు సంతోషమైనట్టియు జీవితమున కనుకూలతయని మనము గ్రహింపవలయును. మనము దుస్తులను ధరించియుండుట మూలమున మన శరీరములు కొంతవరకు మాత్రమే యీ సూర్యకిరణస్నాన యవకాశమును బొందుచున్నవి.

సూర్యకిరణమును విభజించి చూచినయెడల నందు ఏడురంగు లుండును; ఒక వైపున యెఱ్ఱరంగును రెండవవైపున నీలమును ఊదారంగును నుండును. ఈ రెండవ వైపుననుండు ఊదావర్ణముగల కిరణములకు "అత్యంత ఊదావర్ణకిరణములు" (Ultra-violetrays) అని పేరు. ఇవియే రసాయన సంబంధమగు కిరణములు, చెమ్మ, దుమ్ము, వాయువు నందుండెడి జంతుపదార్థములు — ఏమున్నను నీ చికిత్సాకిరణముల ధ్వంసమునుచేయును. వేడికిరణముల యొక్క తీవ్రత యెక్కువైనచో అపాయకరములగు ఫలితములు కలుగగలవు. ఇందుమూలముననే యెండవేడిగా దేశమునందు వడదెబ్బ తగిలి జనులు చనిపోవుచుందురు. సూర్యరశ్మి అన్ని జంతువులకును అన్ని ప్రాణులకును అవశ్యకమైయున్నది. చర్మమునందలి బిలములను చర్మము యొక్క క్రిందనుండు అగ్నికలయందు ప్రవాహము నందున్న రక్తమును ఈ కిరణములనాకర్షించి శరీరమునందలి పరిస్థితులలో మార్పును గలుగజేయును. చిన్నబిడ్డలలో ఎముకలు గట్టిపడకుండ నుండు వ్యాధియందు ఈ చికిత్సవలన ప్రయోజన ముండగలదు. ఈ వ్యాధియందు "విటమిన్ డీ" యని గలిగియున్న కాడ్లివరు చమురును వెన్నను గూడనిత్తురు. క్షయవ్యాధియందును, అనేక చర్మవ్యాధులయందును, పుట్టతలయందును, కీళ్ళనొప్పియందును, అనేక విధములగు అనారోగ్యపీడితులయందును, నాడీబలక్షయమునందును ఈ సూర్యకిరణ చికిత్సా పద్ధతివలన ప్రయోజనము లందబడి యుండెను.

స్విట్జర్లాండు దేశములోని లెయిసిన్ పట్టణమునందు 'డాక్టర్ రోలియర్' యనునాయన యీ చికిత్సామార్గమున చాలసంవత్సరము లనేకవ్యాధుల గుణపర్చుచుండెను.

ఈ సూర్యకిరణస్నానమువలన వ్యాధులను రాకుండ గూడ జేసికొననగును. ఇట్టి స్నానాభ్యాసమువలన శరీరమునకు బలము కలిగి వ్యాధి అవహింపకుండ నడ్డగింపును గలిగించును

సూర్యకిరణ స్నానమువలని ఔషధవిలువ యొప్పుకొనబడియుండుటను బట్టియు చీకటిలో వ్యాధిహేతుక్రిములు వృద్ధినందుచుండుటను బట్టియు, యీ చికిత్సాపద్ధతి ననుసరణ యందుంచుట కొంతమాత్రము సందేహింపవలదు. శరీరమునకును సూర్యకిరణములకును యెంత మాత్రము అడ్డుయున్నను ఈ "అత్యంత ఊదాకిరణములు" పనిచేయజాలవు. కాబట్టి యీచికిత్సవలని అధికారోగ్యదీవనల నందుటకుగాను పూర్తిగ దిగంబరులై యీ స్నానము నొనర్పవలయును.

మధ్యాహ్నసమయమున అనగా సుమారు ఒంటిగంటవేళ ఒక చాపనుగాని మరియే యితరపక్కనుగాని బరచుకొని దుస్తుల నన్నిటిని తొలగించి అందుపైన పదినిమిషములపాటు శరీరమున కంతటను సూర్యరశ్మి తగులునట్లు దొరలుట మూలమున నీచికిత్సను గావింపవచ్చును. ఇట్టి చికిత్స 16 నిమిషములకు మించి చేయరాదు. వేడిమి అధికముగ సోకిన యెడల జబ్బుచేయగలదు. కావున జాగ్రత్తను వహించియుండవలయును.

ఈ క్రింది పరిస్థితులయందు సూర్యకిరణస్నాన మాచరింపదగదు ఒకవేళ ఆచరించినను తక్కువ కాలమును దీసికొనవలయును.

1. వేడిమికి అతిత్వరితముగ నాకర్షించుకొను చర్మమును గలిగినట్టి రోగులు.
2. హృద్రోగములందలి తీవ్రస్థితులయందు.
3. స్పష్టమగునట్టి ధాతునష్టమునందు.
4. జ్వరముతో గూడిన క్షయవ్యాధియొక్క తీవ్రస్థితియందు;

## క్షయ చికిత్స.

1. ఆహారమును విరివిగా నీయవచ్చును. పాలు, గుడ్లు, రొట్టె, వెన్న, శాకపదార్థములు. పండ్లు, మాంసాహారములు—యివన్నియు నియ్యవచ్చును.

2. విరేచనక్రమమును గమనించవలయును.

3. శరీరమునకు చలిగాలి సోకకుండునట్లు దుస్తు లుండవలయును.

4. స్నానమును క్రమముగా చేయవలయును. ఒడలంతటిని గోరువెచ్చని నీటితో స్పాంజిచేసి, పిమ్మట గట్టిగా తుడువవలయును. స్నానమును బహిరంగస్థలములో చేయరాదు

5. ఆయాసమును గలుగజేయు పనిని చేయరాదు.

6. శరీరసాధకము మంచిదేగాని అందువలన దగ్గును, శరీరవేడిమియును, గలుగకుండ జూడవలయును.

7. రోగియుండు గదిలోనికి సూర్యరశ్మియును వెలుతురును గాలియును బాగుగా వచ్చుచుండవలయును.

8. సముద్రతీరమందు గాక లోప్రదేశమునం దుండుట మంచిది, తేమలేని ప్రదేశమై యుండవలయును. క్షయవ్యాధులలో గొన్నిటియందు సముద్రప్రయాణము మేలు చేయును. ఆంధ్రదేశమునందు మదనపల్లి క్షయరోగులకు మంచి నివాసస్థానముగ నెంచబడుచున్నది.

9. జ్వరమునకు మందుల నియ్యనక్కరలేదు. ఫారన్‌హీట్ 74 డిగ్రీల వేడిమిగల నీటితో చేతులు కాళ్ళుగాని, ఒడలంతయు గాని, తుడువవలయును. రోగి భరింపగలిగిన యెడల యీ నీటి వేడిమిని 60 డిగ్రీలవరకు దింపవచ్చును.

10. గాడిదగ్గు గలిగియున్న రోగియెడల, టింక్చర్ బెంజాయిస్ కోనుగాని, మెంథాల్‌నుగాని, క్రియసోట్‌నుగాని, కర్పూరమును గాని, కలిపిన ఉడుకునీటి నుండి వచ్చెడి ఆవిరిని పీల్చుటవలన నుపయోగకరముగ నుండగలదు.

11. దగ్గు అధికముగ నున్నయెడల [illegible] అరగ్రెయిను చొప్పున రోజు ఒక గ్రెయినువరకు మాత్రగా చేసి యియ్యవచ్చును.

12. అజీర్ణవిరేచనములకు ఒక టీ స్పూన్ చిట్లాముదము నియ్యవచ్చును.

13. ఎదురొమ్ములో నొప్పి యుండినయెడల పట్టును వేయవలయును.

14. రక్తస్రావ ముండినయెడల అట్రోపిన్ 1/100 గ్రెయిను $\frac{1}{8}$ మార్ఫియాతో గలిపిగాని లేక ప్రత్యేకముగాని రక్తములోని కింజక్టు చేసినయెడల తరచుగా చక్కని గుణము నిచ్చును.

## అంటు వ్యాధులు.

ఇండియా దేశమునందు వ్యాపకతనందియున్న వ్యాధులలో గొంతువరకు అంటువ్యాధులను ఉండియున్నవి. ఈవ్యాధులు జీవానుసంబంధమునై యున్నవి. ఇందుల కుదాహరణములుగ — టైఫాయిడ్ జ్వరము, అమవిరేచనములు (వీటిలో నొక తరగతి) అంటుసంబంధమగు అతివిరేచనములు, చలిజ్వరము, ప్లేగ (బొబ్బరోగము) న్యుమోనియా, కలరా — తీసికొన వచ్చును.

అంటువ్యాధులలో రెండుతరగతులుగ నేర్పరచవచ్చును. ఒకవిధమగునది ఒక మనిషి నుండి యింకొకమనుష్యునికి శరీరముయొక్క అస్పష్టతా భాగస్పర్శవలననే గాని వేరువిధముగ వ్యాపకతనందనేరదు. రెండవవిధమగునది వాయుమార్గముననగాని జలమార్గముననగాని వ్యాపకత నందును. మొదటిదాని కుదాహరణముగ గనోరియాను తీసికొనవచ్చును. రెండవదాని కుదాహరణముగ కాలరాను తీసికొనవచ్చును, అంటువ్యాధుల విషయమునందు విశేష అనుభవము వలనగాని పరీక్షవలనగాని వ్యాధిని నిర్ణయింప వీలుగనుండదు. మశూచివ్యాధివిషయములో ప్రారంభలక్షణముల బట్టి వైద్యుడు ఆవ్యాధినిశ్చయపరచి కుటుంబములోని తక్కినవార లందరకును ప్రమాపనివారణలకును టీకాలు వేసి వ్యాధియొక్క వ్యాపకతను నిలుపుచేయవచ్చును. కాలరావిషయము గూడ నవసరమగు ముందుజాగ్రతలను బుచ్చుకొనుచు వ్యాధియొక్క వ్యాపకతను అడ్డుచేయవచ్చును.

అంటువ్యాధుల విషయములో తగుజాగ్రత్తలను బుచ్చుకొనుటవలన వ్యాధులయొక్క వ్యాపకతను తగ్గింపవచ్చును. వీటియొక్క ఉపద్రవములుగూడ తగ్గింప జేయవచ్చును

ఇంగ్లాండునందు కొన్ని శతాబ్దములక్రింద కలిగిన "బ్లాక్ డెత్" (Black Death) అను అంటువ్యాధి యిప్పుడెచ్చటను గానరాదు.

కొన్ని అంటువ్యాధులయందు ప్రత్యేకములగు జీవాణువులు శరీరమునందు ప్రవేశించిననే తప్ప వ్యాధులు కలుగనేరవు. చలిజ్వరమందు ఆ జ్వరసంబంధమగు జీవాణువు రక్తమునందు ప్రవేశించిననేగాని చలిజ్వరము కలుగనేరదు.

అంటువ్యాధులన్నియు, మార్గభేదమయినను, ఒకమనిషినుండి యింకొకమనిషికి వ్యాప్తినందునవే అయియున్నవి. ప్రతివ్యాధియును కొంతనియమితకాలము శరీరము సోకియుండి యుండును. ఈ నియమితకాలము అనేకకారణములబట్టి వ్యాధిగ్రస్తులయందు మార్పునందుచుండవచ్చును. వ్యాధిసంబంధమగు జీవాణువు శరీరమునందు ప్రవేశించినపిమ్మట కొంతకాలమువరకు వ్యాధిలక్షణము లేమియు కనబడవు. ఈ మధ్యకాలమునకు వ్యాధిపరిపక్వకాలమని పేరిడవచ్చును. అనంతరము వ్యాధిచిహ్నములు కనబడి వ్యాధియొక్క ఉద్రుతస్థితియందు మరణము సంభవింపవచ్చును. లేక వ్యాధియొక్క ఉద్రితస్థితి గడచినపిమ్మట వ్యాధినివారణ కావచ్చును.

అంటువ్యాధియొక్కసారి సంభవించి శమించిన మీదట సామాన్యముగ మరల కొంతకాలమువరకు ఆదేవ్యాధి సంభవింపనేరదు. వ్యాధిరక్షణశక్తి దానంతట అదియే యేర్పడును కాని, యీ విషయమున చాల మినహాయింపులు కలవు. ఒకే మనిషియందు కాలరా మరల సంవత్సరములోపుగనే రావచ్చును. ప్లేగ్ వ్యాధి కూడ ఒకే మనిషికి రెండుసారులు రావచ్చునుగాని యిట్లు బహు అరుదుగా తటస్థించును.

ఈ అంటువ్యాధులలో ప్రతిదాని విషయమునందును భేదమగు జీవాణువు శరీరమునందు ప్రవేశించి వ్యాధిని గలుగజేయుచున్నదని మనము గ్రహింపవలయును. ఈ వివిధములగు జీవాణువులును శరీరమునందు ప్రవేశించినపిమ్మట, నవి సంఖ్యయందభివృద్ధి నందుచు, వ్యాధిని బైకి గనబరచునప్పటికి గొంతకాలముపట్టును. పిమ్మట నీ జీవాణువులయొక్క బలము తగ్గిపోయి వ్యాధి అంతరించుటకు మరికొంతకాలము నడచును.

ఈ జీవాణువులయొక్క అంటు సోకినంతమాత్రమున వ్యాధి కలుగకపోవచ్చును. శరీరమునందు ప్రవేశించిన జీవాణువులయొక్క సంఖ్య హీనమైయుండవచ్చును; లేక శరీరమునందు జొచ్చిన జీవాణువులయొక్క బలము మిక్కిలి తక్కువగానైన నుండవచ్చును: ఇది యటుండగా, యీ జీవాణువులయొక్క దాడులకు లోబడకుండునంత బలమును శరీరము కలిగియుండనైన వచ్చును.

ఈ దేశమునందు సామాన్యముగ వ్యాప్తినందియున్న అంటువ్యాధులను, వాటియొక్క పరిపక్వకాలమును, రోగినుండి వ్యాపింపదగిన కాలమును, యీక్రింది పట్టికయందు తెలుపబడినది. పరిపక్వకాలము అనగా శరీరమునందు జీవాణువులు ప్రవేశించిన పిమ్మట వ్యాధి పైకిదేలుటకు పట్టుకాలము. రోగినుండి వ్యాపింపదగిన కాలము అనగా, వ్యాధి కుదురుబాటు నందిన పిమ్మటను వ్యాపించుటకు వీలుగనుండు కాలము.

వ్యాధిపరిపక్వకాలము పగటున లెక్కవేసి చెప్పినదై యున్నది. కొన్నివిషయములలో దీని కచ్చితగ్గు లుండవచ్చును.

అంటువ్యాధి ప్రవేశించినపుడు దానిని సాధ్యమైనంత శీఘ్రముగ గుర్తించి వ్యాప్తి జెందకుండునటుల జాగ్రత్తలను పుచ్చుకొన వలయును. ఇట్టి జాగ్రత్తలను జైలుఖానాలు, విద్యాలయములు మొదలగు బహిరంగ వాసస్థలములందు మిగుల ముఖ్యముగా గమనించ వలయును.

వ్యాధులయొక్క వ్యాప్తత.

1. వాయువుద్వారా:— మశూచి, పొంగు, గవదలు, ఇన్‌ఫ్లూయంజా, క్షయవ్యాధి మొదలగు వ్యాధులు వాయువుద్వారా గొంపోబడును. అనేకమగు అంటువ్యాధులలో వ్యాధిహేతములగు జీవాణువులు కొద్దిదూరము మాత్రమే సంచరింపగలవు. మశూచి, ఇన్‌ఫ్లూయంజా విషయములో మాత్రము యెక్కువ దూరమునకు యీ జీవాణువులు సమెచు చుండును.

2. జలము, అహారము, ద్వారా:— టైఫాయిడ్ జ్వరము, కలరా, అమవిరేచనము —యీ వ్యాధులు జలముద్వారా విశేషముగ గొంపోబడును. అంటుదలచెందిన పాలమూల మున గూడ నీ వ్యాధులు వ్యాప్తత నందవచ్చును; పాలమూలమున క్షయవ్యాధియు పొంగును గూడ వ్యాపింపవచ్చును.

3, బట్టలద్వారా:— మశూచి ప్లేగ్ సంబంధములగు జీవాణువులు చాలకాలము రోగితో సంబంధించిన బట్టలు మొదలగు వానియందు చలనములేని స్థితిలోనుండి యున్నట్టి వ్యాధులను వ్యాప్తత నందజేయును.

4. మనుష్యుని ద్వారాయును, కీటకముల ద్వారాయును:— మనుష్యుని యొక్క శ్వాసకోశముల మార్గమునను, ఒడలు మార్గమునను, మలమూత్రముల మార్గమునను కొన్ని వ్యాధులు వ్యాప్తత నందును.

ఎలుకలు మూలమున ప్లేగ్‌వ్యాధి వ్యాప్తత నందును, నల్లులమూలమున కాలా అజార్ వ్యాధియును, దోమలమూలమున చలిజ్వరవ్యాధియును, ఈగల మూలమున టైఫాయిడ్ జ్వరమును, కలరాయును, అమవిరేచనములును వ్యాప్తత నందుచుండును.

అంటువ్యాధులయొక్క వ్యాప్తతను నిలుపుచేయుటకు మార్గములు:—

అన్నివిధములగు అంటువ్యాధులను వ్యాప్తతనందకుండ జేయుటకు నిర్దిష్టమగు ప్రత్యేకపద్ధతిని జెప్పుటకు వీలైనది కాదు. స్ఫోటకమున కవలంబింపదగు పద్ధతులు ప్లేగ్‌వ్యాధికి పనికిరావు; ప్లేగ్ వ్యాధికై ఉపయోగింపదగిన పద్ధతులు కలరాకు నుపయోగింపవు. ఆయా వ్యాధులక్రింద జెప్పబడు ముందు జాగ్రత పద్ధతుల నవలంబించుచు వ్యాధులయొక్క వ్యాప్తత నాపుచేయవలయును.

ఏ అంటువ్యాధియందైనను యీక్రింది అంశములను ముఖ్యముగ గమనింపవలెను.

1. వ్యాధిగ్రస్తుని యితరులనుండి విడదీసి ప్రత్యేక స్థలమునం దుంచవలయును.

2. వ్యాధిగ్రస్తునినుండి అంటుదలను పొందినటుల అనుమానింపదగిన వారిని విడిగా నుంచి, వ్యాధిపరిపక్వకాలము దాటునంతవరకును అట్టివారిని విడిగనే యుంచవలయును.

3. రోగి వసించియున్న స్థలమునకు సంబంధించిన గోడలు, నేల, తివాచులు, పనిముట్లు వగయిరాలన్నిటిని ఆయా నిర్ణయపద్ధతులపైన అంటులేకుండ శుభ్రపర్చ వలయును.

4. మశూచి సంభవించిన విషయమునందు సమీపస్థులందరును టీకాలను వేయించుకొనవలయును. ఇట్లుగా జేయుటవలన నీ వ్యాధిని పారదోలవచ్చును. ప్లేగ్ ప్రవేశించియున్నపుడు అంటుసంబంధమగు టీకాలను వేయించుకొనుటవలన ఆరుమాసములవరకు వ్యాధి రాకుండ జేసికొనవచ్చును. టైఫాయిడ్ జ్వరము 18 మాసములవరకును రాకుండ టీకాలను వేయించుకొనవచ్చును. కాలరానుండ కొన్ని మాసములవరకు రాకుండ టీకాలను వేయించుకొనవచ్చును.

కాలరా విశేషముగా వ్యాప్తి నందియున్నపుడు త్రాగునీటియందు దోషముండి యున్నదని గ్రహింపవలయును. మశూచి విశేషముగా వ్యాపించినయెడల చాలమంది టీకాలను వేయించుకొని యుండలేదని యెంచవలయును. టైఫాయిడ్ జ్వరము యెక్కువగ వ్యాపించియున్నపుడు, యీ రోగులయొక్క మలమూత్రము లేవిధముగ పరిష్కరింప బడుచున్నదియు నీటిసప్లయి పాలసప్లయి విషయములయం దేమయిన దోషయులున్నదియు, విచారింపవలయును.

అన్ని విధములగు అంటువ్యాధులను ఆరోగ్యమగు జీవితములను గడపువారియం దెక్కువ వ్యాప్తి నందజాలవు. శరీరమును పరిశుభ్రముగానుంచుట, పరిశుద్ధమగు నీటి నుపయోగించుట, ఆరోగ్యహితమగు నాహారమును భుజించుట, పరిశుభ్రమగు గాలి వచ్చునట్టి గృహములందు నివసించుట, గృహములను చుట్టుపట్ల పెంటకుప్పలు మొదలగునవి లేకుండ జేయుట — యీ విషయములందు జాగ్రత్తను వహించి యుండవలయును.

అంటువ్యాధి యెవరికయిన ప్రవేశించినపుడు అనుదిన జీవితమునందలి మామూలు అలవాటులయం దెవిధమగు మార్పులను జేయరాదు. పైవిషయముల నుగమనించుట యేగాక, అలసటను గలుగజేయు పనులను జేయరాదు. చలిగాలి సోకరాదు. ఆ యా వ్యాధులయెడ భయకంపిత లగుటవలన వ్యాధియొక్క ప్రవేశమున కెక్కువ ఆస్పదము కలుగునుగాన అట్టి భయమును కొంచెమాత్రమును మనసునందు జేరనియ్యగాదు.

రోగి యెప్పుడైనను నిర్లక్ష్యము చేయరాదు. తగినచికిత్స చేయవలయును. ఏమయినను వ్యాధియొక్క ప్రారంభముననే తగుచికిత్స జేసినయెడల శీఘ్రముగ కుదిరే సందగలదు. సామాన్య వ్యాధులయందు విశేషవిషయములలో విశ్రాంతియును తగు ఆహారమార్పును కుదిరికను గలుగజేయగలవు. శరీరము వ్యాధిపీడితమయినప్పుడు పనినాపివేసి విశ్రాంతిని దీసికొనుచు తేలికగు నాహారము (అనగా పాలు మొదలైనవి) ను బుచ్చుకొనవలయును.

## వాయువు.

శరీరమునకు, ఆహారము, జలము, దుస్తులు, సూర్యరశ్మి కావలయును. వీనిలో నెల్ల వాయువు మిగుల ముఖ్యమైనది. తక్కినవి అప్పుడప్పుడు గావలసియుండును. వాయువు మాత్రము యెల్లప్పుడును అవసరమయియున్నది. మన శ్వాసకోశములలోనికి వాయువును పీల్చకుండ జీవించుటయే కష్టమైయున్నది. బహిర్వాయువునందు ముఖ్యభాగమగు ప్రాణవాయువు మనుష్యునియొక్క జీవితాధారమయియున్నది.

మనము లోనికి బీల్చునట్టి వాయువు పరిశుభ్రమయినదియు, సరియైన ఉష్ణముగలదియునయి యుండవలయును. శరీరమునందలి పోషణమునకును, ఉష్ణతకును, అనుకూలముగను గపులకు జారుడుదనమును బుట్టించుటకును, నరములకును సామాన్యముగ శరీరమునకంతకును బలమును గలుగజేయుటకును, పరిశుభ్రమగు వాయువు మిగుల నవసరమయి యున్నది. వాయువు చలనము లేక పోవుటవలన దుష్టత్వమును గ్రహింపవచ్చును. ఒకప్పుడది మురికితో గూడియుండును. విషయుతమైగూడ నుండవచ్చును. అపరిశుద్ధమగు వాయువును బీల్చుటవలన నీదేశమందు గొన్ని మరణములు గలుగుచున్నవని నిస్సంశయముగ జెప్పవచ్చును.

శ్వాసకోశములలోనికి వాయువు నోటిద్వారమునను నాసికాద్వారమునను గొన్ని మధ్యమార్గములగుండా శ్వాసకోశములలోనికి బోవును. బహిర్వాయువు నోటియందును, ముక్కునందును బ్రవేశించినప్పుడు శ్వాసకోశములలోనికి బోవుముందర గొంచెము వెచ్చదనమును ఉష్ణతను జెందును.

వాయువు స్వాభావికముగ శ్వాసకోశములలోనికి ముక్కుద్వారా పోవలయును. గాని నోటిద్వారా పోగూడదు. ముక్కునందలి రోమములు ఒకవిధముగ నీవాయువునందలి మురికి పదార్థములను వెలిజేయుటకు వీలుగ నేర్పడి యున్నవి. ఇదియునుగాక, నాసికారంధ్రములు విశేషముగ రక్తనాళములచే నావరింపబడి యుండుటచే చలికాలమునందు యీ వాయువు శ్వాసకోశములలోనికి బోవుముందర కొంత వెచ్చదనము నందుట కుపయోగముగ నుండును.

## శ్వాసకోశములు.

ఉదరముయొక్క పైభాగమునందు శ్వాసకోశము లిమిడియున్నవి. ఈ శ్వాసకోశములయందు అపరిశుద్ధరక్తము లోనికి బీల్చబడు ప్రాణవాయుసహాయమున పరిశుద్ధపరచబడుచున్నది. ప్రతి శ్వాసకోశమునందును, వాయుబిలసులు అల్లికలచే బంధింపబడియుండును. నరములు, పరిశుద్ధరక్తనాళములు, అపరిశుద్ధరక్తనాళములు, మేదస్సు పొరలు నాళములు — యివన్నియుగూడ శ్వాసకోశము నావరించియుండును. సగటుగ కుడిశ్వాసకోశము 22 ఔన్సులును యెడమశ్వాసకోశము 20 ఔన్సులును తూకముండును. శ్వాసనాళములయొక్క అంతర్భాగములు జిగురుసంబంధమగు పదార్థముతో గప్పబడి బహుసున్నితముగ నుండి వాయువుతప్ప తక్కిన యేపదార్థముయొక్క స్పర్శతగిలినను దగ్గును బుట్టించి అట్టి దోషపదార్థములను వెలువరింపజేయును.

మనము లోనికి బీల్చునట్టి గాలి శ్వాసకోశములయొక్క అంతర్భాగములగు గాలిసంచులలో బ్రవేశించును. ఈ గాలిసంచులయొక్క ప్రాకారస్థానములు బహుపల్చనివిగను సున్నితములుగనునుండి, సూక్ష్మమగు రక్తనాళములతో గూడియుండును. శ్వాసకోశములలోనికి బోవునట్టి వాయువు యీ గాలి సంచులయందు బ్రవేశించి ఆసంచులయొక్క ప్రాకారస్థానములయొక్క పల్చదనముచేత — బహుసున్నితమగు పొరమాత్రమే అడ్డుయుండుటవలన — ఆ ప్రాకారస్థానములయందలి రక్తనాళములకును యీ గాలిసంచులయొక్క పొరలకు గలుగుచున్న సంసర్గ కార్యక్రమమునందు రక్తమునందలి అనవసరములగు వ్యర్థపదార్థములు యీపొరల మార్గమున వెలువరింపబడుచు, గాలిసంచులలోని ప్రాణవాయువు రక్తములోని

ప్రాకర్షించుకొనబడుచున్నది. ఈ రక్తమువలన నాకర్షింపబడిన ప్రాణవాయువు గుండె యొక్క యెడమ భాగమునుండి శరీరముయొక్క నానాభాగములకును దీసికొని పోబడుచున్నది. ఇట్లుగా ప్రవహించుచున్న రక్తనాళములనుండి ప్రాణవాయువును శరీరమునందలి నానా అవయవములయొక్క అణుకలను గ్రహించుచు, క్రమక్రమ వ్యర్థములగునట్టియు అపాయహేతువులై ఉత్పత్తియగునట్టి పదార్థములను ఆ రక్తమునందు ప్రవేశపెట్టుచు, యీ అనవసర పదార్థములలో గొన్ని మరల శ్వాసకోశమునకు గొంపోబడి అచ్చట ఊపిరి గాలిమార్గమున శరీరమునుండి వెలువరింపబడుచున్నవి. ఈ స్వాభావికపద్ధతి మూలముననే నల్లనైనట్టియు అపరిశుద్ధమైనట్టియు రక్తము యెఱ్ఱనైనట్టియు పరిశుద్ధమైనట్టియు రక్తముగ మారుచున్నది. ఈ పరిశుద్ధ స్థితియందుండెడు రక్తమే శరీరమునందలి అన్ని అవయవములకును పోషణను గలుగజేయును. ప్రతి నిమిషమునందును యీ శ్వాసకోశములలోని గాలిసంచుల యందలి వాయువుతో యిరువదిమార్లు రక్తము స్పర్శగతి నందుచున్నది.

శ్వాసకోశములలోని రక్తము యెల్లప్పుడును ప్రాణవాయువును పీల్చుకొనియుండుటకు బదులుగా నంగారామ్లవాయువును వెలిపుచ్చుచున్నది. ఈ కార్యక్రమమును నడుపుటకు గాను శ్వాసకోశములయొక్క వాయుబిలములలోని వాయువు తరచుగ మార్పు నందుచుండ వలయును. ఉచ్ఛ్వాస నిశ్వాసముల యందు యీమార్పు గలుగుచుండును.

ఆరోగ్యమునందున్న మనిషి విశ్రాంతి సమయమున నిమిషమునకు 16 మొదలు 18 పర్యాయములును, బిడ్డ సుమారు 25 పర్యాయములును, పసిబిడ్డ 35 మొదలు 40 పర్యాయములును, శ్వాసను పీల్చుచుండును.

రక్తము వాయుబిలములందలి సూక్ష్మరక్తనాళముల యందు ప్రవహించునపుడు, అపరిశుద్ధ స్థితినుండి పరిశుద్ధస్థితికి మార్పునందుచున్నది. ఈ వాయుబిలములయొక్క సున్నితమగు ప్రాణాగస్థాన మార్గమున యిరుప్రక్కల వాయువులును మార్పునందుచుండును. హృదయము యొక్క కుడి ప్రక్కనుండి ప్రవహించు అపరిశుద్ధరక్తము అంగారామ్లవాయు పూరితమై యుండును. హృదయముయొక్క యెడమప్రక్కనుండి ప్రవహించు పరిశుద్ధరక్తము ప్రాణవాయు పూరితమై యుండును. వాయుబిలముల యిరుప్రక్కల నుండెడి వాయువులయొక్క పరస్పర మార్పుదలల వలన అంగారామ్లవాయువు నిశ్వాసమునందు బయటికి వెడలుచు ప్రాణవాయువు ఉచ్ఛ్వాసమునందు లోనికి వచ్చుచుండును.

## శ్వాసకృచ్ఛ్రము.

ఏ కారణము వల్లనైనను శ్వాసకోశములలోనికి వాయుప్రవేశ మాటంకపరచ బడిన యెడల, శరీరములో రక్త మపరిశుద్ధి జెందును. ఈ ఆటంకమును తొలగించుటకు దగ్గు గలుగును, ఈ దగ్గువలన నీ ఆటంకము తొలగింపబడనియెడల రక్తమునందు అంగారామ్లవాయు వధికమగుచు నపరిశుద్ధత జెందును. ఈ అపరిశుద్ధ రక్తము మెదడుపై బనిచేయుచు ఉచ్ఛ్వాస నిశ్వాసముల నధికముగను బలయుతముగను జేయుచు, ఆయాసముతో గూడిన ఉచ్ఛ్వాస నిశ్వాసము లేర్పడును. ఈస్థితి శ్వాసకృచ్ఛ్రమనబడును. ఈ శ్వాసకృచ్ఛ్రస్థితి అధికమైనయెడల శరీరముయొక్క స్నాయువులన్నియు ముడుచుకొని, మూర్ఛలం ప్రవేశించును. శ్వాసాటంకము

యిప్పటికిని దీరకపోయిన రోగముల గుండెదెబ్బలు బలహీనతనంది రక్తప్రచారము దుర్బలత్వము నందును. ఈ సందర్భమునందు హృదయము నీరసతతో గూడిన కొన్ని దెబ్బలను గొట్టిన పిమ్మట దానియొక్క కార్యక్రమము నిలచిపోవును. మనుష్యునియందు శ్వాసావరోధము తటస్థించిన పిమ్మట మూడు మొదలు అయిదు నిమిషముల లోపల మరణము దటస్థించును శ్వాసకోశముల యందలి రక్తము ప్రాణవాయువుతో గూడి కార్యక్రమముయొక్క పరిపూర్ణత ననుసరించి, శరీరమునందలి అన్ని అవయవములకును అల్లికలకును బలమును గలుగ జేయు గుణలక్షణములు రక్తమునం దిమిడి యుండును.

## హృదయము.

హృదయము రక్తప్రచారమునకు మధ్యస్థానమైయున్నది. జననము మొదలు మరణము వరకును ప్రతిజీవియందును, నొక పంపు (Pump)॥ (నీళ్లు పైకిలాగునట్టి తోడెడు యంత్రము) వలె పనిచేయును. ఈ కాలమునం దంతటను రక్తమును పరిశుద్ధ రక్త నాళములలోనికి బంపుచుండును.

## నాడి.

హృదయముయొక్క యెడమపార్శ్వమందుండు క్రిందిఅర ముడుచుకొనినపు డందలి కొంత రక్తము ఆభాగము ననుసరించియున్న బృహద్ధమని (Aorta) యను పెద్ద పరిశుద్ధ రక్తనాళములోనికి త్రోయ్బుచున్నది. ఈ రక్తము మరల వెనుకకు బోవుటకు వీలులేకుండ నొకమూత పడిపోవును. ఈ సందర్భమునందు ఈ పరిశుద్ధ రక్తనాళములలో నిదివరకే పూర్ణముగ రక్తముండియుండుటచే నీక్రొత్త రక్తమును దీసికొనుటకై యీ రక్తనాళము విస్తరింపు నందును. ఈ రక్తనాళము విస్తరింపు నంది మరల యథాస్థితిని వహించు గుణమును గలిగియున్నది. ఇట్లు మరల యథాస్థితిని వహించుటయందు, యీ రక్తనాళమునకు శాఖలుగా నున్న చిన్న చిన్న రక్తనాళములలోనికి యీ రక్తము నొంపబడుచున్నది. ఆ చిన్న రక్త నాళములును యిదేపద్ధతిని ముడుచుకొని మరల యథాస్థితి నందుచుండును. ఈ రక్తమంతయు వివిధావయవములకును జేరి మరల నపరిశుద్ధరక్తనాళముల మూలమున శ్వాసకోశములు జేరుచుండును. ఇట్లుగా ముడుచుకొని మరల విస్తరింపునంది యథాస్థితిని వహించుట యనెడు గలుగు పరిశుద్ధ రక్తనాళములయొక్క కార్యక్రమమునకే నాడియని చెప్పబడును. మణికట్టు యొక్క యెదటివైపునను, కణతమీదను, చెవియొక్క ముందుభాగమునను, యీ నాడిని మనము స్పృశింపవచ్చును.

ప్రధాన పరిశుద్ధరక్తనాళమునందు రక్తము సెకనుకు 12 అంగుళముల చొప్పున ప్రవహించుచుండును. ఈరక్తనాళములు చిన్నవైనకొలదియు యీ పరిమితి తగ్గిపోవును; మిక్కిలి సూక్ష్మనాళములకు జేరునప్పటికి యీ పరిమితి యింకను హీనతజెందును. ఎట్లైనను, యీ సూక్ష్మ నాళములయందు రక్తముయొక్క పారుదల కొక్కువ కాలము పట్టక మరల నపరిశుద్ధ రక్తనాళముల మూలమున శీఘ్రముగనే ప్రచారము నందుచుండును. శరీరమునం దంతటను రక్తముయొక్క ప్రచారమునకై సుమారు 30 సెకనుల కాలము మాత్రమే పట్టును. ఒక్క పరిశుద్ధరక్తనాళమును మనము గోసినయెడల అందునుండి రక్తము ఉబికి ఉబికి వచ్చుచుండును.

ఇది నాడియొక్క దెబ్బ ననుసరించి యుండును. పరిశుద్ధరక్త నాళమునుండి స్రవించుచున్న రక్తమును నిలిపివేయవలెనన్న మనము యీరక్తనాళమును హృదయమువైపున బంధింపవలయును; ఏలననగా, యీరక్తనాళములోనికి రక్తము హృదయమువైపుల నుండి వచ్చుచున్నది. ఒక అపరిశుద్ధ రక్తనాళమునుండి రక్తము స్రవించుచున్న యెడల నీ యుబుకుదల లేకుండ నొకేధారగ రక్తము స్రవించుచుండును.

### రక్తమెట్లు పరిశుద్ధత నందును ?

రక్తము మూడువిధములుగ పరిశుద్ధత నందును. (1) శ్వాసకోశములయొక్క రక్తనాళములందు రక్తము ప్రచారము నందుటవలన, రక్తమునందలి అంగారక్షారవాయువును, అందధికమగు జలము ఆవిరిరూపమునను, ఊపిరి గాలిమార్గమున బయటికి వెడలిపోవును. (2) చర్మము యొక్క ఉపరిభాగమును ననుసరించి యుండు స్వేదగ్రంథులలో రక్తము ప్రచారము నందుటవలన, చెమటరూపమున అధికమగు జలమును, కొంచెము అంగారక్షారవాయువును యూరియా అనబడు నొకవ్యర్థపదార్థమును, బయలు వెడలిపోవును. (3) మూత్రగ్రంథులయొక్క రక్తనాళములయందు రక్తము ప్రవాహమును నందుటవలన అధికమగు జలమును, మూత్రమునందు గలిసియుండెడి యూరియా, యూరిక్ ఆమ్లములును, వెలువరింపబడును.

### రక్తముయొక్క ఉపయోగములు.

శరీరమునందు జరుగుచున్న నానావిధములగు కార్యక్రమములందును ఉపయోగపడుచున్న పదార్థములయొక్క వ్యర్థమును పూర్తిగాచేయుట రక్తముయొక్క పనియైయున్నది. ఆహార పదార్థములనుండి పోషణమును గ్రహించి యా పోషణమును అవయవములయొక్క అల్లికలకు గొంపోవుట రక్తముయొక్క ధర్మమై యున్నది. శరీరమున కంతకును రక్తమును జలమును అందుచ్చును. అన్ని అవయవములయందును యుండెడి అల్లికలయొక్క కార్యక్రమములకు అవసరమగు ప్రాణవాయువును రక్తము శ్వాసకోశములనుండి గొంపోయి ఆయా అవయవములకు జేర్చును. ఈ కార్యక్రమములందు ప్రాణవాయువు నెమ్మదిగ నుపయోగము నందును వేడిమిని పుష్టిగను గలుగ జేయును. ఈ కార్యక్రమములం దుద్భవమందు వ్యర్థపదార్థములు మూత్రగ్రంథులు, శ్వాసకోశములు, చర్మము — మూలమున వెలువరింపబడును. శరీరమునందు ప్రాణవాయువుకతమున గలుగుచున్న వేడిమిని సరిసమానముగ శరీరమున కంతకు వ్యాపింపజేయుటయందు రక్తము పని చేయుచున్నది. చలిదేశములయందు గృహములలో వేడిమిని గలుగజేయుటకు ఉడుకునీటి గొట్టములను ఉపయోగించు పద్ధతిని, యీరక్తము శరీరమునం దంతటను ఒకే సమానముగు వేడిమిని ప్రసరింపజేయును. శరీరమునందు నోటిలోని యుమ్మి నీటిని స్రవింపజేయు గ్రంథులకును, జీర్ణాశయమునందలి స్రవములకును, కారిజమునందలి పిత్తద్రవమునకును, యింకను శరీరములోని యితర స్రవములకును, అవసరమగు పదార్థములను రక్తము జేర్చి పెట్టుచున్నది.

ప్రపంచమునందలి వాయువులలో 100 కి 79 వంతులు నత్రజని వాయువు (Nitrogen) యును 21 వంతులు ప్రాణవాయువు (Oxygen)ను ఉండియున్నవి; అనగా, మొదటిది ప్రాణవాయువుకంటె దాదాపు నాలుగువంతు లధికముగ నున్నది. ఈరెంటి యందును ప్రాణ

వాయువు ముఖ్యమైనదై యున్నది. ఈ ప్రాణవాయువు జీవితాధారమైనదియు మిక్కిలి చురుకైనదియునై మన రక్తమును పరిశుద్ధస్థితి యందుంచుట కాధారమై యున్నది. ఈ ప్రాణ వాయువు దేనితో జేరిన దానిని భస్మీభవింపజేయును. అది లేకుండనున్నను వేడిమిగాని వెలుతురుగాని కలుగనేరదు. మన శరీరములలోపల ప్రాణవాయువు ఆహారపదార్థములతో జేరి భస్మీభవింపజేసి, శరీరముయొక్క వేడిమిని గాపాడుచుండును ఈ కార్యక్రమము నెమ్మదిగ జరుగుచుండును గనుక మనము ఆ వేడిమిని దెలియలేకున్నాము. వాయువునందంతయు ప్రాణవాయువే యుండియున్నయెడల మనలను దహింపజేయును గనుక సృష్టియందీ వాయువులో నింకొక విధమగు వాయువు గలిసియుండుట జంతుజాలముల యొక్క మేలుకొరకే అయియున్నదని మనము తెలిసికొనవలయును.

దుర్వాయువు మనల ననుసరించి యుండినయెడల రక్తమును అపరిశుద్ధపరచి శరీరములోని ప్రతి అవయవమునకును హానిని గలుగజేయును. ఒకసారి యూపిరివదలిన గాలినే మరల లోనకు బీల్చుటవలన వ్యాధి జనించి మరణము కలుగును. ఈ కారణముచే పరిశుద్ధమగు వాయువును బీల్చుట మిగుల ముఖ్యమై యున్నది.

### దుర్వాయువు గలుగుటకు మార్గములు.

(1) మనము నివసించుస్థలమందు వంటలు చేయుట మూలమునగాని మంటలు జేయుట మూలమునగాని మిక్కుటముగ పొగబెట్టుట వలన ఆరోగ్యమునకు భంగము గలుగగలదు. చమురుదీపములను బెట్టినపుడు వాటినుండి వెడలెడు అంగార క్షారవాయువు బోవుటకు సరియైన మార్గము లుండవలయును.

(2) జంతుసంబంధమగునట్టిగాని వృక్షసంబంధమగునట్టిగాని పదార్థములు కుళ్ళునపుడు దుష్టమైనవాయువు లుద్భవిల్లి చుట్టుపట్లనుండు వాయువుతో మిశ్రమగును. వాసననుబట్టి మనము యీ సంగతి గ్రహించి అట్టివాటిని వెంటనే తొలగింప వలయును. నిలువమాంసము, ఉచ్ఛిష్టము, కాయగూరల యొక్కయు ఫలముల యొక్కయు పైచర్మములు, మామిడిటెంకలు, చెఱకుపిప్పులు మొదలగువాటిని యింటిలో నిలువ యుంచరాదు.

(3) నివాసముచేయునట్టి గదులలో వంటచేయుట వలన మనము లోనికి బీల్చు వాయువునందు బరువుయేర్పడి ఆకలికి మాంద్యతను గలుగజేయును.

(4) గదులలో గుడ్డల నెప్పుడును ఆరవేయనియ్యరాదు. ఈ పనివలన చెమ్మనీళ్ళుయింటి వంతయు అశుభ్రపరచుటయే గాక చెమ్మ గలుగునట్లు గూడ చేయును.

(5) ఇంటిలోపలను, యింటిలోని సామానులమీదను, గోడలపైనను దుమ్ముండుటవలన నొకవిధముగ నసహ్యమును బుట్టించు వాసనను గల్గించును. మాసిపోయిన బట్టలు చెప్పులుగూడ దుర్వాసనను కలిగించును. మనము నివసించు గదులను వాటిలోనుండు వస్తువు లన్నిటిని పరిశుభ్రముగా నుంచవలయును. కిటికీలను తలుపులను తెరచి యుంచుటవలన శుభ్రమగు గాలి లోనకు వచ్చుటయే గాక దుమ్ము రొచ్చుట నున్నదియుగూడ దగ్గ జేయును.

వేసవికాలమునం దసహ్యముగా నుండినయింటిలో ఈగలు ముసురుకొనును. ఈగలు అంటువ్యాధులను దీసికొనివచ్చుటయేగాక అసౌఖ్యమునకును అసహ్యమునకును గారణము

(9) శ్మశానస్థలసమీపముల వాయువు చెడియుండును. కాబట్టి శ్మశాన వాటికలు నివాసస్థలములకు దూరముగ నుండవలయును. ఇటుక ఆవములు గూడ గ్రామములకు దూరమున నుండవలయును.

(10) ఆవులు, గేదెలు, మేకలు, కుక్కలు, గొర్రెలు మొదలైన గృహజంతువులు ఇంటిసమీపముల నుండుటవలన వాయువును అపరిశుద్ధ పరచును, ఇవి, ఊపిరిని విడుచుట వలననే గాక, పెంటవేయుట మొదలగు పనుల మూలమున వాయువు నపరిశుద్ధత నంద జేయుచు, ఈ పెంటలు ఆరుదల నందినపుడు మెత్తని పొడిగ మారి మనము లోనికుపీల్చు వాయువుతో శరీరమునందు బ్రవేశించును. కాబట్టి ఈ గృహజంతువుల నన్నిటిని మనము నివసించు గృహములకు దూరముగ నుంచుచు ఆస్థలములను పరిశుభ్రస్థితియం దుంచుచుండవలయును.

(11) పాయిఖానా దొడ్లు : ఈ దొడ్లనుండి వెడలు దుర్వాయువు శరీర అనారోగ్యతను గలుగజేయును. కాబట్టి, వాటిని కట్టువిషయమునందును, పరిశుభ్రముగా నుంచు విషయమునందును యెక్కువ జాగ్రత్తను బుచ్చుకొనవలసి యుండును.

### వాయువుయొక్క యేకరీతిస్థితి.

వాయువు అపరిశుద్ధత నందుచున్న మార్గములలో ముఖ్యమగునవింతవరకు విచారించి యుంటిమి. వాయువుయొక్క స్థితిగతులను గూర్చికూడ గమనించితిమి. వాయువునందు నానావిధములగు దుర్వాయువులు మిళితమగుచున్నను, దానియొక్క స్థితిగతులయందే మార్పును గలుగకుండుట స్వభావమునందలి విచిత్రాంశమై యున్నది. ప్రపంచము నావరించియున్న వాయువు క్రమక్రమముగా మాలిన్యత నందుచునే యుండినయెడల మనము జీవించుటకే వీలు లేకుండెడిది. వాయు వీవిధముగ నేకరీతి స్థితియం దుండుటకు పనిచేయుచున్న కారణములను గూర్చి ముందు ప్రకరణమునందు జెప్పబడును.

---

## వాయుప్రచారము

---

శరీరమునుండి వెలువడు దేనినైనను — ఊపిరిమూలమున వెలువడు దుర్వాయువును గాని, మలమూత్రము మొదలగు వాటినుండి వెలువడు వ్యర్థపదార్థములను గాని — విముక్తిజేయుట ఆరోగ్యసంరక్షణ యందలి ప్రధానాంశమై యున్నది.

శ్వాసమూలముననే గాని యితరవిధముగ గాని మనము మలినపరచిన వాయువును సాధ్యమైనంత శీఘ్రముగ పారదోలుట ముఖ్యమైయున్నది. వాయుప్రచారమువలన నీదుర్వాయువు దూరమై పరిశుద్ధమగు వాయువే మనకు వచ్చుచున్నది. వాయుప్రచారము స్వాభావికమనియు కల్పితమనియు రెండు విధములై యున్నది.

స్వాభావిక వాయుప్రచారము స్వభావమునందలి శక్తులవలన గలుగుచుండును. ఈ స్వాభావికశక్తులకు సహాయముగ మనుష్యుడు వాడుకచేయు ఉపకరణములవలనను యేర్పాటుల వలనను కల్పిత వాయుప్రచారము అనుచరింపబడును.

వాయుచలనము మూడువిధములుగ గలుగుచుండును. ఆ మూడువిధములు యేమనిన:- (1) అన్ని విధములగు వాయువులును, ఒకదానియందింకొకటి కలియుగుణమును గలిగియుండుట. (2) ఉష్ణసహితములగు వాయువులు తేలికగ నుండుటవలన పైకిలేచు చల్లనివాయువులు బరువుగనుండుటచే క్రిందికి (భూమిపైపునకు) దిగుచుండును. (3) వాయువు వీచుటయందలిశక్తి.

(1) అన్ని వాయువులును ఒకదానియందింకొకటి కలియు కారణముచేతనే మనమూపిరి విడుచునట్టియు యితరములగునట్టియు దుర్వాయువులు శీఘ్రముగనే బహిర్వాయువునందు గలసి వానియొక్క ఆపాయగుణమును హీనపరచు చున్నవి.

(2) మనము నివసించు గృహములందుత్పత్తియగు దుర్వాయువులు ఉష్ణసహితములగుటచే తేలికయై యింటికప్పుపైపుల కెగయును. ఈ కారణముచే గోడలయొక్క పైపైపున కిటికీ లుంచినయెడల నామార్గమున నాదుర్వాయువులు బహిర్వాయువునందు గలిసిపోవును; అట్టి కిటికీలుగాని, తేలు మార్గములుగాని లేకపోయిన యెడల నీ దుర్వాయువులు చల్లనై, బరువై, మరల క్రిందికి దిగి మనము పీల్చుగాలి యందు ప్రవేశించును. కాబట్టి గృహముల యందు పొగగొట్టము లుండుటవలన ఉపయోగముగ నుండగలదు. పొగ పైకెగసిపోవుట జూచుటను బట్టి యీవిషయమును మనము చక్కగ గ్రహింప నగును.

(3) వీచుచుండెడిగాలి, కుళ్లుదల నందెడి వస్తువునుండి వెడలు దుర్వాయువులను గొంపోవును, మంచివాయువును గొనివచ్చుచు, మనము నివసించు గృహములందు నవీనమైనట్టియు పరిశుద్ధమైనట్టియు గాలిని ప్రసరింపజేయును; కాని వాయుప్రచారమునందీ కార్యక్రమము జరుగుటకు వీలుగనుండునటుల మనము కిటికీలను తలుపులను యేర్పాటు చేసికొనవలయును. గాలియొక్క రాకపోకలకు వీలుగనుండునటుల కిటికీలను, తలుపులను, ఒకదానికొకటి యెదురుగగాని, వాయుప్రచారము నిశ్చితముగ జరుగుటకు ఒకదానికొకటి యెదురుపైపున కొంచెము ప్రక్కనగాని యేర్పాటు చేసికొనవలయును.

సూర్యకిరణముల యొక్క కార్యక్రమము వలనను, వృక్షములు వాయువు నందలి అంగారామ్లవాయువును గ్రహించుటవలనను, వర్షముచే వాయుప్రక్షాళన మగుటవలనను, వాయువు పరిశుద్ధత నందుచుండును.

వాయుప్రచారమునకు కిటికీలు, తలుపులు, పొగగొట్టములు, మాత్రమేగాక, తలుపు సందులు, పెంకుకప్పులుకూడ సహాయపడుచుండును.

గృహమునందలి వాయువును బహిర్వాయువును ఒకే పరిశుద్ధస్థితియందున్నపుడు వాయుప్రచారమున కవసరమగు సంపూర్ణ యేర్పాటులను జేసియున్నటుల యెంచ వచ్చును.

పంకాలు.

వాయుప్రచారమునకు పంకాలు సహాకారులుగ నుండును. ఒడలు నుండి వెడలు ఆవిరిని విసరింపజేసి శరీరమునకు చల్లదనము గలుగజేయును. పంకాయొక్క ప్రతిపోవునకును గదిలోనిగాలి ఒకపైపునుండి బయటికిపోవును; రెండవ పైపునుండి క్రొత్తగాలి లోనికి వచ్చుచుండును.

### వట్టివేళ్ల తడకలు.

వేసవి కాలమందు వట్టివేళ్ల తడకలను గట్టి నీళ్లు పోయుటవలన వాయువునందలి వేడిమిని తగ్గింపవచ్చును. ఈ తడకలయొక్క ఉపయోగమువలన వేడిమిని తగ్గించుటయేగాక, దుమ్మును ఆకర్షించుటచే వాయువును గొంతవరకు పరిశుద్ధ పరచును.

### నిద్రించు గదులు.

మనము నిద్రించు గదులయందు పరిశుభ్రమగు గాలియుండుట మిగుల ముఖ్యమై యున్నది. మనము జీవితకాలమందలి మూడవ భాగమును నిద్రయందు గడుపుచున్నాము. కొందరు నిద్రించునపుడు తలుపులను కిటికీలను మూసి నిద్రించుదురు. ఇట్లు చేయుటవలన చెడుగాలిని లోన నుంచుకొనుచు మంచిగాలిని రానియ్యకుండ జేయుచున్నారు. ఇట్లు చేయుటచే నిద్రలేచునప్పటికి, చురుకుగను, అనుదిన కృత్యములను చేయుటను సంతోషముగను నుండుటకు బదులుగ, శరీరము బరువుగను పనిచేయుటకు అయిష్టముగను, నుండును. బాహిర్వాయువు లోనకు జొరకుండుటవలన మన ఊపిరిగాలి గదిలోని వాయువు నశుభ్ర పరచుచుండును. ఈ దుర్వాయువునే మనము లోనకు పీల్చుచుండు నెడల మన ఆరోగ్యత చెడిపోవుటకు సందియము లేదు. కాబట్టి మనము నిద్రించు గదులలోనికి పరిశుభ్రమగు గాలి యొక్క వీవనకు దగు మార్గముల నేర్పరచి యుండవలెను. చలిగాలి రాకుండగను ఉధృతమగు గాలివీవనలు లేకుండగను జాగ్రత్తలను బుచ్చుకొనవలయును. ఈ జాగ్రత్తల వలన సుఖనిద్రను గలిగి, నిద్రనుండి సంతోషముగ లేవవచ్చును.

బిడ్డలు ముఖ్యముగ పరిశుద్ధమగు వాయువును గలిగియుండవలయును. బిడ్డలు అప్పుడప్పుడు బయట తిరుగుచుండవలయును. పసిగొట్టుటకును ఆటలాడుటకును వారిగల మన మాటంకపెట్టరాదు. వారు నివసించు గదులయందు పరిశుభ్రమగు వాయువు ప్రాగను నందుటకు వసతులు గల్పింపబడి యుండవలయును. వృద్ధులును తమ ఆరోగ్యతను గాపాడుకొనుటకు పరిశుభ్రమగు వాయువును సదా గలిగియుండవలయును. పడకగదులలో చలిగాలి వీవకుండ జాగ్రత్తలను మాత్రము బుచ్చుకొనవలయును.

### విద్యాలయములు.

బిడ్డలయొక్క వయస్సునందు చాలకాలము విద్యాలయములయందు గడుపబడును. ఇండియాదేశము నందలి యీ విద్యాలయముల యొక్క స్థితి బహు అసంతుష్టికరముగ నున్నదని చెప్పుటకేమియు సందియము లేదు. విద్యార్థి జీవితమునందు పరిశుభ్రవాయువు యొక్క ఆవశ్యకతనుగూర్చి విశేషముగ జెప్పనక్కరలేదు. శరీరముయొక్క పెంపునకును వికాసమునకు పరిశుద్ధవాయువు అవసరమైయున్నది. దీనిని భోగముగా గణింపదగదు. ఇయ్యది స్వభావమునందు వెలలేకుండ నుచితముగ ప్రతిమానవునకి నొసంగబడినదై యున్నది. కాబట్టి ప్రపంచమునంతయు కొల్లలుగ నావరించియున్న యీ వాయుధనము ప్రతివిద్యాలయము నందుగూడ విద్యార్థులకు దక్కునటుల చేయుట మన విధాయక కృత్యమై యున్నది.

## రోగినిగూర్చి జాగ్రతలు.

ఇండియా దేశమునందు సామాన్యముగ పేదవారల గృహములలో, వ్యాధులకు తోడుగనుండు అనారోగ్యహిత ప్రదేశములను గూర్చియు, రోగికి జరుగుచుండు అసౌఖ్య విషయములను గూర్చియు, తగు జాగ్రత్తలను బుచ్చుకొనవలయును. రోగి పరుండియుండు గదిలోనికి ఒకతలుపు తప్ప సామాన్యముగ కిటికీయైన నుండదు. రోగియొక్క బంధువు లందరును జుట్టి యుండుటచేత లోనికి పీల్చుట కవసరమగు గాలియైనను సరిగానుండదు. రోగియొక్క శరీర పరిశుభ్రతనుగూర్చి యెవరును జూచువారే యుండరు. రోగియొక్క అన్ని వైపులను గందరగోళముగ నుండును. రోగి తినునట్టి ఆహారస్థితినిగూర్చి విచారించనే అక్కఱలేదు. శరీరవ్యాధిని బాగుగ దెలిసికొని, యిచ్చుచున్న ఔషధములయొక్క గుణఫలితము లను జక్కగ గని పెట్టి, మందులనిచ్చు వైద్యుని కెక్కువ అవసరము యుండును. ఇట్టి స్థితిగతుల యందు పేదవారలు వ్యాధిపీడితులైనప్పుడు ఆసుపత్రిలో ప్రవేశించుట వలన త్వరలో కుదిరిక నందగలరు. ఆసుపత్రి అందుబాటునందు లేనప్పుడు బుద్ధిశాలియగు వైద్యుని యొద్దనుండి మందుపుచ్చుకొనుచు, శుశ్రూషకు సహాయముచేయు గొన్ని విషయములను గమనించుట ముఖ్యమైయున్నది.

ఈ క్రింది విషయములను గమనించుట వలన యెక్కువ ఉపయోగముగ నుండగలదు.

1. రోగి పరుండియుండు గది, ఇంటిలోనెల్ల వెలుతురు వచ్చునదియు, సౌఖ్యముగ నుండునదియు, నై యుండవలయును.

గదిలో సాధ్యమైనంత వరకు సామానుల నుంచరాదు. అనవసరముగ సామానుల నుంచుటవలన నిలువగు వాయుప్రచారలోపమే గాక, దుమ్మునకును వ్యాధిహేతువగు జీవాణువులకును స్థానమేర్పడును. గదిలో ముఖ్యముగ నుండవలసిన వస్తువు లేవనిన:—రోగియొక్క ప్రక్క కవసరమగు మంచము మొదలైనవి. రోగియొక్క భోజనమున కవసరమగు వసతులు, రోగికి గొంచెము దూరమున మందుల నుంచుటకు బల్ల, వైద్యుడును మరియెవరైనను గూర్చుం డుటకు రెండు కుర్చీలుగాని బల్లలుగాని—ఉండిన చాలును. రోగిని జూచుటకు ప్రతివారిని రానియ్య గూడదు. రోగిని జూచుటకు ముఖ్యావసరమైన వారును, రోగి జూడగోరిన వారును, రోగియొక్క ఉపచారకులును, తప్ప యితరులను సామాన్యముగ రానియ్యరాదు. రోగిని జూచుటకు వచ్చినవారు కొంచెముసేపు మాత్రమే మాట్లాడవలయును గాని రోగికి అలసటను గలుగజేయరాదు. రోగిని యెక్కువగ మాట్లాడనీయరాదు. సంభాషణ సంతోష కరమైనదిగ నుండవలయును గాని రోగియొక్క మనస్సున కాయాసము గలుగ జేయునదిగ నుండరాదు. చీకటి గది పనికిరాదు. తీక్ష్ణమైన వెలుతురు రాగూడదు. ఇట్టి వెలుతురు యిందువలన అనవసరపు ఉద్రేకము అధికమైన నొప్పియు జాగరూకతనమును బుట్టించును. వైద్యుని యొక్క ఉత్తరువుల ప్రకారముగాని, వైద్యుడు లేనిచో రోగియొక్క ఇష్టమును అను కూలతను బట్టిగాని, వెలుతురుయొక్క ప్రవేశమును మితముగ జేయవలయును.

2. రోగి నివసించు గదిలోనికి సాధ్యమైనంతవరకు పరిశుద్ధమగు వాయువు వచ్చు చుండునట్లు జాగ్రత పెట్టవలయును. వ్యాధిగ్రస్తులు, తమ శ్వాసకోశముల నుండియు, శరీర

షులనుండియు, మాలిన్యముల వెలువరచుచుందురు. ఆరోగ్యస్థులకంటె వ్యాధిగ్రస్తులు రెండంతలు వాయువును గోరుచుందురు. చలిగాలియును వర్షమును ఉండిననే తప్ప కిటికీలను తలుపులను దెరచియుంచవలయును. చలిగాలి వీచుచున్నప్పుడైనను, గాలి పూర్తిగ రాకుండు నట్లుగ తలుపులను మూయరాదు. గాలి రోగిపైకి సరాసరిగ వీచకుండునట్లు జాగ్రత్తను బుచ్చుకొనవలయును.

3. రోగియొక్క ముఖమును, చేతులను, అనుదినము కడుగవలయును. తక్కిన శరీరమంతయును దినమున కొకసారైనను ఉడుకునీళ్ళతో స్పంజిచేయవలయును. అవయవములను క్రమముగాను, రోగి ఆయాసము గలుగకుండగను —ఒక్కొక్క పర్యాయ మొక్కొక్క అవయవము చొప్పునను— జేయవలయును. రోగి మిక్కిలి అస్వస్థతస్థితియందుండి, యిట్లు చేయుటవలన వ్యాధి ఉద్రిక్తగతిని వహించునని తోచినయెడల, నిలుపు చేయవలసియుండును. రోగికి పరిశుభ్రమగు దుస్తుల నియ్యవలయును.

4. రోగినుండి వచ్చు అన్ని స్రావములను, మయిలబట్టలను, గదిలోనుంచి తీసివేసి కార్బాలిక్ ఆసిడ్ లోషన్ వగయిరాలతో శుభ్రపరచవలయును.

5. రోగి యెప్పుడును క్రింద పరుండబెట్టరాదు. ఏదైన బల్లనుగాని మంచమును గాని తెచ్చి, అందుపైన క్రమమైన ప్రక్కవేసి రోగికి సౌఖ్యముగ నుండునట్లు చేయవలయును.

6. అనవసరమగు ధ్వనులను జేయరాదు. ఇట్టిపనులు రోగియొక్క విశ్రాంతికి భంగమును గలుగజేయును. రోగియొక్క ప్రక్కసమీపమునగాని గదిలోగాని యేవిధమైన గడబిడను జేయరాదు.

7. మందుసీసాలనుగాని, ఏవిధమగు నాహారపదార్థములను గాని, రోగికి సమీపమున నుండనియ్యరాదు. గదియం దెట్టిసందర్భమునను మంచినీళ్లను ఉండనియ్యరాదు.

8. గుణఫలితముల దెలియని మందుల నియ్యరాదు. శాస్త్రజ్ఞాన ముండిన వైద్యునిచే చికిత్స జేయింపవలయును. ప్రతివారియొక్కయు, స్నేహితులయొక్కయు, సలహాల ననుసరించి చికిత్స జేయింపగూడదు.

### రోగికి ఆహారము.

వ్యాధియందు రోగులు సామాన్యముగ నాహారము నేవగింతురు. ఈ యేవగింపు గుణము, శరీరమున కాహార మక్కరలేదనునట్టి గాని, శరీర మాహారమును జీర్ణింప జేసికొనలే దనునట్టిగాని, స్వభావసిద్ధమగు సూచనను దెలియజేయును. దాదాపుగ అన్నివ్యాధుల యందును ఆకలి లేకపోవుట తటస్థించును. కొద్దివిషయములలో దప్ప తక్కిన అన్ని సందర్భముల యందును ఆకలి ఆరోగ్య సూచనమే అయియున్నది. అన్నివ్యాధులయందును, ముఖ్యముగ తీవ్రదశయందున్నపుడు, గట్టిపదార్థముల నాహారముగ మానివేసి, ద్రవపదార్థములను మాత్రమే యియ్యవలయును. ద్రవపదార్థములనైనను ఒకేసారి విశేషముగ నియ్యరాదు. ఏవిషయమునందును మామూలు ఆహారమును యియ్యరాదు. ఒకవేళ నెప్పుడైన యిచ్చినను తక్కువగ నియ్యవలయును. దీర్ఘవ్యాపకమగు జ్వరములలోను, కొంతకాలము జబ్బుగా నుండిన వారలయందును, యీ పద్ధతి పనికిరాదు, అట్టివిషయములలో దేలికగ జీర్ణమగు నాహారము తరచుగ నియ్య నవసరమై యున్నది.

ఒకరోగి మిక్కిలి జబ్బుగా నున్నయెడల, ద్రవాహారమును కొద్దిపరిమాణములలో నెక్కువ తరచుగ నియ్యవలసియుండును. దీర్ఘవ్యాపక వ్యాధులలో—ముఖ్యముగా జ్వరములందు—శరీరముయొక్క బలము గాపాడవలసి యుండును.

రోగి మిక్కిలి బలహీనముగా నున్నయెడల, ఆహారమును దినుటకుగాని, త్రాగుటకుగాని, లేవనియ్యరాదు. పరుండనిచ్చియే ద్రవాహారమును నెమ్మదిగను జాగ్రత్తగను యియ్యవలయును, రోగిని ఆహారమును బుచ్చుకొనుటకు దరచుగ తొందర చేయగూడదు.

వ్యాధియందు విశ్రాంతియును నిద్రయును బలమును గలుగజేయును. గాబట్టి ఆహారమునకుగాని మందునకుగాని అగత్యమైనప్పుడు మాత్రమేదప్ప యితర కాలములయందు రోగిని నిద్రలేపరాదు అప్పుడైనను మిక్కిలి అవసరమైనప్పుడే నిద్ర లేపవలయును. ఇతర సందర్భములందు రోగిని యిచ్ఛవచ్చినటుల నిద్రింప నియ్యవలయును.

రోగులతో నెప్పుడును సంతోషముగను సాధువుగను మాట్లాడవలయును. రోగులు తరచుగ చిరచిరగుణమును కోపస్వభావమును వహించియుందురు. ఈ స్వభావము వారియొక్క లోపముగ నెంచరాదు. ఈగుణము వారు అనుభవించుచుండు వ్యాధిఫలితమై యున్నది. మనము వారియెడల దయగను ఓర్పుదలగను నుండవలయును. రోగుల కుపచారము చేయువారలు, దిగులొందునట్లుగాని, రోగియొక్క వ్యాధి తీవ్రదశ నందియున్నదన్నెడు సూచనను గాని, రోగికి గలియనియ్యరాదు. ఈకొద్ది విషయములందు మనము జాగ్రత్తను వహించియుండుటవలన రోగియొక్క సౌఖ్యమునకు మనము సహాపడిన వారలమే గాక వ్యాధియొక్క కుదిరికకు విశేషముగ దోడ్పడినవార మగుదుము.

ప్రతికుటుంబమునందలి యూ స్త్రీలు రోగులకూర్చి యెట్టిజాగ్రత్తల బుచ్చుకొనవలసినదియు గ్రహించి యుండవలయును. కొందరు స్వభావసిద్ధముగ నీపనియందు నేర్పుగలిగిన వారుందురు. మనము నౌకర్ల నెందరనుంచినను రోగులకు జేయదగు ఉపచారములకూర్చి చక్కగ దెలిసి పనిచేయువారలు దొరకుట కష్టము.

రోగుల గదిప్రక్కనుండువారెవ్వరును బిగ్గరగా మాట్లాడరాదు. రోగితో మాట్లాడునపుడు స్వచ్ఛముగాను విరళముగాను మాటలాడవలయును. గుసగుసలాడుట కూడదు. రోగి వినగూడని దెప్పుడును రోగి శయనించియుండు గదిలో మాట్లాడరాదు.

రోగులయొక్క చుట్టుపట్లు నెప్పుడును సంతోషహితముగా నుండవలయును. సంభ్రమితమైన సందడులను కేకలను బనికిరావు. శాంతత, సుస్వభావము, మాట్లాడుట కూడినపుడు సద్విషయములగూర్చి మాటలాడుట, రోగి అడుగు ప్రశ్నలకు ఉల్లాసకరముగ జవాబులు చెప్పుట—ఇవన్నియు రోగియొక్క సౌఖ్యమును కాపాడునవి యగుటయేగాక వ్యాధియొక్క శీఘ్రమగు కుదిరికకు తోడ్పడును.

దుర్వాసన యున్నయెడల వాటిని గలిగించు కారణముల దొలగించవలయును. సామాన్యముగ నెన్నడును సువాసన ద్రవములు నుపయోగించరాదు. ఇందువలన దుర్వాసన యున్నయెడల గనబడకుండుటకు వీలుగ నుండును. పుష్పముల నలంకరించుటవలన రోగియొక్క దృష్టికి ఆహ్లాదకరముగ నుండును.

## హిస్టీరియా.

ఈ వ్యాధియొక్క లక్షణములు వేరొకచోట వివరింపబడి యున్నవి. ఈవ్యాధిగ్రస్తులను జికిత్స జేయుటయందు శరీరమునకును మనస్సునకును గూడ వలయు వైద్యోపచారములను జేయవలెను. రోగికి వైద్యునియందు నమ్మకము కలుగునట్లు చేసికొనవలయును. లేనియెడల నెట్టిచికిత్సయు నుపయోగింప నేరదు. ఈ వ్యాధి చికిత్సయందు వైద్యునికి పరిపూర్ణకౌశలమును, శాంతమును, దయాగుణమును, ఉండియుండవలయును. వ్యాధిలక్షణములు మరేమియు తొందరతో గూడి యుండలేదని రోగికి తెలియజేయుచు, రోగియొక్క నిండుతోడ్పాటు కూడ నుండిననే గాని వ్యాధి కుదిరిక నందనేరదని రోగికి చెప్పవలయును.

రోగికి స్థానమార్పుదలయును, బంధువులకును స్నేహితులకును దూరముగ నుండుటయును, సహాయమును జేయగలవు. విశ్రాంతి, సాధువగు చల్లనిస్నానములు, విద్యుచ్ఛక్తి ప్రయోగము, అనుదినమును ఒడలు మర్దనము చేయుట, బలమగునట్టియు చురుకుగనమును వహింపనట్టియు నాహారము, ఖరివగు పరిశుభ్రవాయువు—యివన్నియు వ్యాధి స్వస్థతకు దోడ్పడును. నరములకు బలమును గలుగజేయుటకుగాను గోరువెచ్చని లేక చల్లని నీళ్ళతో చేతులపై దోముటవలన నుపయోగించగలదు.

## ఆహారము.

ఆహారవిషయమున బలమగునట్టిది చాలినంతమాత్రమే యియ్యవలయును గాని మిక్కుటముగ నియ్యకూడదు. మిక్కుటభోజనము అస్వస్థతను వృద్ధిపరచును. గనుక యిందువిషయమై జాగ్రతను వహించి యుండవలయును.

చురుకునుబుట్టించు బ్రాందీమొదలగు వాటినిగాని, నిద్రను బుట్టించు నల్లమందు మొదలగు వాటినిగాని ఉపయోగించరాదు. కాఫీ, తేయాకునీళ్ళు, కోకో—వీటినిగూడ నియ్యరాదు. మాంసాహారమును త్యజించవలయును. ఏలనన, యిదియుత్తేజను గలుగ జేయుటయేగాక, మలబద్ధమును గూడ బుట్టించును.

ఈ రోగులకు ఫలములు నాహారముగ నిచ్చుటవలన మంచిగుణము కలుగును. ఇవి తేలికగ జీర్ణముకూడ నగును. సామాన్యముగ నన్నిఫలములును సాధువిరేచన గుణమును గలిగియుండును. ఫలములు విరివిగ నుపయోగింప నగును. నిమ్మరసములో జేసిన పచ్చడులను ఉపయోగింప వచ్చును. శాకపదార్థములు, కాయధాన్య సంబంధములగు ఆహారములు, పాలు, వెన్న, మీగడ, గ్రుడ్లు—వీటిని భుజింపవచ్చును. ఆహారపదార్థములు పూర్ణముగా పచనము చేయబడి, యొక్కొకసారి కొద్దితరగతుల పదార్థముల మాత్రమే తినవలయును. దినమునకు మూడుపర్యాయములు భుజింపవచ్చును. ఒక భోజనమునకును యింకొక భోజనమునకును మధ్యకాలమందు ఉపహారములను మానివేయవలయును. మిఠాయి, మురబ్బాలు, చక్కెరతో గూడిన ఆహారములు, జీర్ణమునకు బరువగు పదార్థములు—వీటిని త్యజింపవలయును. ఆహారమెంత తేలికగ నుండిన నంత మంచిది. ఊరుగాయల నుపయోగించ దగదు. ఉప్పును కొద్దిపరిమాణములో వాడుక చేయదగును.

మందులు.

ఈవ్యాధిగ్రస్తులు మందులనువిశేషముగ సేవించుటవలన తమఆరోగ్యతకు హానిగలుగజేసి కొనుచుందురు. ఈ రోగులు వైద్యుడిచ్చు మందులేగాక ప్రకటన పత్రికలయందు గన బడు మందులను పుచ్చుకొనుట కలవాటుపడి యుందురు. ఈ ఔషధములవలన ఫలితమే మియు గానకున్నను తాము ఆమందులవలన ప్రయోజన మందుచుంటిమని వారు తలచుచుం దురు. బ్రాందీ, నల్లమందు, బ్రోమైడ్సు, క్లోరల్ — యీ మందుల నుపయోగించుట వలన కొంతమాత్రమును ప్రయోజన ముండజాలదు. బలవర్థకౌషధములని విక్రయింపబడు వానియందు విశ్వాస ముంచదగదు.

హిస్టీరియా వ్యాధిగ్రస్తులు నిద్రరాక బాధ నొందుచుందురు. సుఖనిద్ర నొందుచు న్నను అట్టి నిద్రరామిచే బాధ నొందుచున్నటుల వారు దలంతురు. వీరు తరచుగా బలహీ నతను గూర్చి చెప్పుచుందురు. రాత్రికాలములయందు సమయాసమయములు లేకుండ భుజించుట కలవాటుపడి యుందురు. రాత్రి భోజనములు నిద్రాభంగమునకును దుస్వప్నము లకును హేతువులగును. పరుండుటకు ముందుగా పదినిమిషములు మొదలు ముప్పది నిమిష ములవరకు ఉడుకునీటి స్నానమును జేయుటవలన నిద్రకలుగ గలదు. పాదములను ఉడుకు నీటిలో బెట్టి కొంతకాలము వరకు నుంచుటవలన శిరస్సునందు గూడియున్న రక్తమును తొలగింపజేసి రక్తప్రవాహమును సమపరచును. శిరస్సుపైనగాని మెడవైపులగాని చన్నీళ్లలో తడిసిన గుడ్డను అద్దుటవలన పైపద్ధతికంటె రక్తప్రచారమున కెక్కువ అనుకూలమును గలుగ జేయును. పాదము వెచ్చదనము శరీర ఉష్ణతను వహించియుండునటుల జూడవలయును. ప్రక్కబట్టలు పొడిగ నుండునటులను, విశేషవేడిగ నుండకుండునటులను, జాగ్రత్త పుచ్చు కొనవలయును.

పరుండిన పిమ్మట, వెన్నువైపులగాని, శిరమువైపులగాని, చేతులు కాళ్లవైపులగాని, సాధువుగ నొత్తుటవలన నిద్రకనుకూలమగు స్థితిగతు లేర్పడును. నిద్రను రప్పించుటకు తక్కిన పద్ధతులన్నియు నుపయోగించనపుడు, బ్యాటరీ నుపయోగించి సాధువగు విద్యుచ్ఛక్తి ప్రవా హమును బోవింపజేయుటవలన నొకప్పు డుపయోగింప వచ్చును. సుఖనిద్రకు ప్రాణవా యుపరిపూర్ణత యెల్లప్పుడును ఆవశ్యకము గనుక రోగి పరుండియుండు గదిలోనికి పరిశుభ్ర వాయువు విరివిగ వచ్చుటకు మార్గము లేర్పడి యుండవలయును.

నిద్రరానట్టి యీ రోగులు పైన జెప్పబడిన కాఫీ మొదలగు పదార్థములను పుచ్చు కొనరాదు. పొగాకున కలవాటు పడియున్నవారు అట్టి అలవాటును మాన్పుకొన వలయును. నిద్రవచ్చుటకు గాను మందుల సామాన్యముగ నెన్నడును సేవింపరాదు. వైద్యుని యొక్క సలహాపైన నెన్నడైన సేవించినయెడల బహు అరుదుగ సేవించవలయును.

రోగి బయట తిరుగుటకు శక్తి గలిగియుండిన యెండలో గాలిలో దిరుగునటుల జేయ వలయును. ఈనడకవలన గలుగు శరీరసాధకము నిద్రవచ్చుటకు సహాయము నొనర్చును.

మూర్ఛగతి కలిగిన యెడల దానియందు యెక్కువ లక్ష్యముంచినటుల రోగికి గనబడరాదు. రోగికి మూర్ఛ తటస్థించినపుడు దుస్తుల నన్నిటిని వదులుచేయ వలయును. ముఖముపైనయును రొమ్ముపైనయును చల్లని నీళ్లను గొట్టుటవలన చాల విషయములలో మేలు కలుగగలదు. మూర్ఛలవలన మరేమియు ప్రాణాపాయము లేదు. రోగి క్రిందపడిన యెడల తలక్రింద నొక దిండును బెట్టి చలిగాలి తగులకుండ నొక దుప్పటిని గప్పియుంచ వలెను. ఒకటి రెండు గంటల పిమ్మట రోగి తనంతట తానే లేచును. రోగి మూర్ఛనుండి లేచినపిమ్మట మూర్ఛ బహుసాధువైనదని రోగితో జెప్పవలయును.

రోగి చికిత్సకై యెచ్చటికైనను వెళ్ళి మరలి వచ్చినపుడు, ఆతని యొక్క పనులన్నియు సంతోషహితముగ జేయవలయును. విశ్రాంతివలని లాభముల నాతని మనస్సున కాయాసము దోచకుండ నటుల రోగికి గొప్పగొప్పనని చెప్పవలయును. సోమరిగ నుండినయెడల వ్యాధి తిరుగబెట్టుట కాస్పదము గలుగును. ఆ స్త్రీలకు వ్యాధి ఎట్టి వేళంబరమును లేక పోవుటవలన సంప్రాప్తమగునది గాని విశేషించి పాటుపడుటవలన వచ్చునట్టిది కాదని తెలియవలయును.

## జలుబు

కొందరు జనులు జలుబుచే తరచుగా బాధ నొందుచుందురు. ఈ జలుబు మూలముననే మరణము తటస్థించదుగాని, ఈ అస్వస్థతనుండి గలుగు బాధయును, చిరాకును, యిందుల ఫలితముగ గలుగు వ్యాధులును, విచారణీయములు; ప్రపంచమునందంతటను గలుగు మరణములలో సగమువంతు యేవ్యాధుల వలన గలుగుచున్నవో ఆవ్యాధులకు యీ జలుబుగుణము యిరవును గలుగజేయుచున్నది. ఆవ్యాధులు, న్యుమోనియాయును, క్షయవ్యాధియును అయియున్నవి.

బహిర్వాయువునందు శీతలత యేర్పడినపుడు న్యుమోనియా వ్యాధియొక్క ప్రబలత యేర్పడును. క్షయవ్యాధియందు కంటె న్యుమోనియా వ్యాధియందు మరణము లెక్కువగ నుండును. కేవలము చలిగాలి వీచునప్పటికంటె, నొకనాడు ఎండయును మరునాడు వర్షమును గలుగుచు, బహిర్వాయువునందలి శీతోష్ణతలయందు ఆకస్మికమగు మార్పులు కలిగినపుడు, న్యుమోనియాయొక్క వ్యాప్తత యెక్కువ వీలుగనుండును. ఈవ్యాధి హేతువులగు జీవాణుగర్భితమగు ధూళిని మనము లోనికి బీల్చునపుడు వ్యాధిని గ్రహింతుము.

న్యుమోనియా వ్యాధి జీవితమునందలి అన్నిగతులయందు—అనగా, పసితనమునందును బిడ్డగా నున్నపుడును, వృద్ధవయస్సునందును — యేమియు విచక్షణ లేక గలుగుచుండును. క్షయవ్యాధి, వయస్సులోనుండి సంసారభారమును వహించుచు కుటుంబము నంతను సంరక్షించువారిని, గొంపోవును. పడుచుతనమునందు 45 సంవత్సరముల లోపుగ నీవ్యాధి తటస్థమగును. ఈ వ్యాధికిని న్యుమోనియా వ్యాధికిని మార్గమును జూపు జలుబును గురించి మన మశ్రద్ధ జేయరాదు.

జలుబు యొకప్పుడు అంటువ్యాధిగ బ్రసరించును. జలుబుచే బాధనొందువారి నాసికారంధ్రములనుండి వెలువడు ఆమపదార్థమును బరీక్షించిన యెడల నొకప్పుడు వ్యాధిహేత

రక్తప్రచారమునకు సహాయమగును. మిక్కిలి చలిగానున్నపుడు గోరువెచ్చని నీళ్లు నుపయోగింపవచ్చును. బలహీనులకు యీ విధముగా చన్నీళ్ళతో స్పంజి చేయవలెనని చీలమండల వరకును వేడినీళ్ళలో నుంచి యిట్లు స్పంజి చేయుటవలన నపాయముండనేరదు.

అంటువ్యాధులు వ్యాప్తతయం దున్నపుడు నాటకములు మొదలగు జనసమూహ ప్రదేశములకు బోకుండుటవలన జబ్బున కాస్పదము గలుగకుండ జేసికొనవచ్చును. ఎల్లపుడును నాసికాద్వారముననే ఊపిరిని పీల్చవలయును. హస్తములను గడిగికొనకుండ నాహారమును భుజింపరాదు.

## దీర్ఘఊపిరియొక్క ఆరోగ్యత.

పాడుట, ఏడ్చుట, అరచుట, దగ్గుట, నిట్టూర్పు విడచుట, మాట్లాడుట — ఈ కార్యక్రమములలో, శ్వాసావయవములయొక్క స్వాభావిక కదలికలయందు మార్పు కలుగుచు, నరములయొక్కయు స్నాయువులయొక్కయు విశేషబలవ్యయము నకు హేతువగుచు శరీరమునందలి కార్యధర్మముల కనుకూలగతుల గల్పించును.

ఈపైన జెప్పబడిన కార్యధర్మముల నాటంకపరచుటవలన నొకప్పుడు అపాయకరముగ బరిణమింపవచ్చును. ఏడ్పు నణచిపెట్టుట యెప్పుడును మంచిదికాదు. డాక్టర్ కామెల్ గారు — స్త్రీలలో ముఖ్యముగ — శ్వాసకోశములయొక్క క్రమమగు విస్తరింపునకును, రక్తప్రచారముయొక్క ఆధిక్యతకును, బాధయొక్క తీవ్రతావస్థను తగ్గించుటకును, ఏడ్పు సహాయపరచునని అభిప్రాయపడుచున్నారు. కన్నీటిని అణచిపెట్టువారికంటె కన్నీటిని వెలిబుచ్చి మనశ్శాంతిని బొందు స్త్రీలు తమ యౌవనమును విశేషకాలము నిర్వహించుదురని యొకడాక్టరు గారి అభిప్రాయమై యున్నది. పాటకులయొక్క గుండెభాగము అభివృద్ధినంది శ్వాసకోశములయొక్క వ్యాధులనుండి సంరక్షణ కాస్పదము గలుగును. సంగీతమును వృత్తిగా ననుసరించు వారు సామాన్యముగ శ్వాసవ్యాధులకు దూరులై యుందురు.

అరచుట మనోవికాసఫలితమై యున్నది. ఆటయందుగాని పనియందుగాని అరచుటను బట్టిగాని బిగ్గరగా మాట్లాడుటను బట్టిగాని, ఆటయొక్కయు పనియొక్కయు చురుకుదనమును మనము గ్రహింపవచ్చును.

ఆవులింత శ్వాసావయవ సాధకములలో నొకటియైయున్నది. సంఘమునం దావులించుట తప్పిదముగా నెంచబడునుగాని, ఆవులింత, శరీరము బడలికగలిగియుండునపుడట్టి స్థితినుండి లేపి, చురుకుదనమును బుట్టింపజేయుటకు శరీరమొనర్చు స్వాభావిక ప్రయత్నమై యున్నది. నిద్రలేచినప్పుడు, పిల్లి ఆవులించి శరీరమును విస్తరింపు నందజేయును. మనుష్యేతరజంతువులు సామాన్యముగ నస్వాభావిక కార్యములను జేయవు.

నవ్వుటవలన శరీరమునందలి కార్యక్రమములకు జురుకుదనము కలుగుటయేగాక శ్వాసవిషయమున మంచిమార్పుదలను బుట్టించును. నవ్వు, అంతరావయవములకు సాధకమును గలుగజేసి, మనస్సున కానందమును బుట్టించుట కేర్పడిన స్వభావసిద్ధమగు తంత్రముగ నెంచవచ్చును. నవ్వు, శ్వాసకోశములయందును అందుక్రింది క్లోమము నందును ప్రారంభమై, కాలిజమునకును, జీర్ణాశయమునకును, యితర అంతరావయవములకును క్రమముగ కంప

నము గలుగజేసి, మనస్సున కొకవిధమగు ఆనందమును బుట్టించి శరీరమునకంతకును గుర్రపు సవారి చేసినంత సాధకమును గలుగజేయును. నవ్వు, నేత్రములకు వికాసమును గలుగజేసి, స్వేదము నభివృద్ధిపరచి, గుండెభాగమును విస్తరింపు నందజేయును. నిద్రలేకపోవుటవలన శరీరమునకు గలుగు ఆయాసమును, దుర్వార్తను వినుటవలని విచారమును, చిత్తశాంతతను మనో ఆందోళనమును, మనస్సునకు గ్లానియగు సౌఖ్య- నవ్వువలన బారదోలవచ్చును. "నవ్వి బలమును పొందుము" (Laugh and grow fat) అని ఆంగ్లేయభాషయం దొక సామెత గలదు. నవ్వునట్టియు సంతోషమును వహించునట్టియు మనిషి తనచెంతకు వచ్చునట్టి ప్రతి వానిని ఆనందింపజేయును. నవ్వు వైద్యునకును రోగికినిగూడ మంచిమందు యొక్క గుణఫలితము నిచ్చును.

మాట్లాడుట వలన శ్వాసకోశములకు సాధకము కలుగును. కంఠధ్వనిని విశేషముగ నుపయోగించు నుపాధ్యాయునికి శరీరసాధక మెక్కువగ నవసరములేదు. నవ్వుట, పాడుట, అరచుట, ఏడ్చుట — యీ గతులయందు వలెనె మాట్లాడుట యందును లోఊపిరి పూర్ణమై బయటిఊపిరి దీర్ఘమై శ్వాసకోశములకు మంచి సాధకమును గలుగజేయును డాక్టర్ హామిల్ గారు సంభాషణ దీర్ఘజీవినిగ జేయునని అభిప్రాయ పడుచున్నారు.

దీర్ఘ ఊపిరి రక్తమునందు విశేషముగ భస్మీభవింప జేసి శరీరమునుండి వ్యర్థపదార్థముల వెలువరింపజేయును. లోఊపిరియందు ప్రాణవాయువు రక్తము లోనికి గ్రహింపబడి, బయటి ఊపిరియందు అంగారక్షారవాయువు వెలువరింపబడును.

దీర్ఘ ఊపిరివలన మెదడునందు మార్పుగలిగి తలత్రిప్పుటను గలిగించుట కున్నతను బుట్టించును. కాని అలవాటువలన నీ తలత్రిప్పుట నిలచిపోవును.

సామాన్యముగ నూపిరి బీల్చుటయందు నాలుగు పౌనుల తూకమును వరుసగ 203 పర్యాయములు రొమ్ము త్రిప్పినటువంటి మనిషి, కొంచెము విశ్రాంతి తీసికొని రెండునిమిషముల కాలము దీర్ఘ ఊపిరిని బీల్చినపిమ్మట అదే తూకమును 700 పర్యాయములు రొమ్ముటకు సమర్థుడై యుండెనని డాక్టర్ మార్సెట్ గారు చెప్పుచున్నారు.

దీర్ఘ ఊపిరి నరములకు శాంతతను గలుగజేసి మనోనిశ్చయశక్తి (Will Power)నభివృద్ధి నందింపజేయును. నిద్రపట్టక బాధనొందుచుండి నప్పుడు గాలి ప్రసరించుచున్న కిటికీ యొద్దకు వెళ్ళి అయిదు నిమిషములకాలము దీర్ఘ ఊపిరిని దీసికొనుటవలన నిద్రకలిగినట్లు డాక్టర్ బ్రోమిగారు చెప్పుచున్నారు.

దీర్ఘఊపిరిని గమనించుటవలన క్లోమము (Diaphragm) పై కెగయుచు క్రిందికి బడుట మూలమున మలబద్ధకమును అజీర్ణతయును తరచుగ వ్యాపత నందగలవు. మరియు యీ కార్యక్రమములవలన ప్రాణవాయు పూరితమైన రక్తము పేగులయందలి కదలికల నభివృద్ధిపరచి జీర్ణతకు తోడ్పడును. పాండువ్యాధియందును, నరముల యొక్కయు జీర్ణత యొక్కయు అస్వస్థతలయందును, రక్తప్రచార అస్వస్థలయందును; దీర్ఘ ఊపిరి సాధకములు పనిచేయునట్లు చెప్పబడుచున్నది.

శ్వాసకోశముల యందలి విశేషములగు వాయుబిలములు సామాన్యగతియందు మాంద్యముగనుండి దీర్ఘ ఊపిరిని బీల్చునపుడు మాత్రమే చురుకుదనమును వహించును. దీర్ఘఊపిరిని

బిల్చుట కలవాటు చేసికొనినయెడల సామాన్యముగ మాంద్యతను వహించియుండు యీ వాయుబిలములు ఎల్లప్పుడును చురుకుదనమును వహించుట యేర్పడును. శ్వాసలేనప్పుడు ప్రాణము లేదని యెన్నెంచుదుమో అటులనే యీ ఊపిరిని బిల్చుటయందే లోపముండినను మనము క్రమముగ జీవించుట లేదనియే యెంచవచ్చును.

శ్వాసకోశముల కియ్యవలసిన యీ సాధకమునుగూర్చి, మనిషి తాను భుజించు ఆహారము నెట్లు నిర్ణయించుకొనునో, అటులనే నిర్ణయించుకొన వలసియుండును. ఈ సాధకమును జేయుటకు నిద్రలేవగనే ఉదయపువేళ బహు అనుకూలముగ నుండును. ఈ సాధకమును దీసికొనునపుడు శరీరమునకు యేవిధమైనట్టియు బిగువగు దుస్తు లుండరాదు. ఈ సాధకమును యెప్పుడును జేయకుండ నూరకుండుటకంటె దినమునం దెప్పుడో యొకప్పుడు వీలైన సమయమునందు జేయుట మంచిదై యున్నది.

ఉదరమెప్పుడైనను బరువుగ నుండినపుడుగాని అస్వస్థతా సూచకముగ నుండినపుడు గాని యీ దీర్ఘఊపిరి సాధకమును జేసినయెడల వెంటనే దీనియొక్క సౌఖ్యమును గనిపెట్ట వచ్చును.

దీర్ఘ ఊపిరియందు యీ క్రింది ఫలితములకై మనము ప్రయత్నించ వలయును:— సామాన్య ఉచ్ఛ్వాసనిశ్వాసములయందు బనిచేయు స్నాయువుల బలపరచుట, దీర్ఘ ఉచ్ఛ్వాస నిశ్వాసములయందు బనిచేయు భుజములయొక్కయు బాహువులయొక్కయు వెన్నుయొక్కయు స్నాయువుల బలపరచుట; శ్వాసకోశముల ముకుళనము యొక్కయు విస్తరింపు యొక్కయు స్వభావమును వృద్ధిపరచి యీస్థితి అదేరీతిగ నుండునటుల జేయుట; శ్వాసకోశములయొక్క అంతర్భాగముల నన్నిటిని సమభావముగ వృద్ధినందింపజేసి వాటియొక్క వైశాల్యతను స్థిరముగ నుండునట్లు జేయుట; ఎదురొమ్మును విస్తరింపు నందజేయుట; సామాన్య ఊపిరిని దీర్ఘపరచి ఉచ్ఛ్వాస నిశ్వాసములయొక్క సంఖ్యను తగ్గించుట; రక్తప్రచారమునకు జురుకును పుట్టించుట.

దీర్ఘ ఊపిరియందు మనమెంత శ్రద్ధచేయవలసి యుండునో పరిశుభ్రవాయువును గురించియు మనమంత జాగ్రతను బుచ్చుకొన వలసియుండును. నిద్రాసమయమున మన విశ్రాంతి స్థానములయందు పరిశుభ్రవాయువు వీచు నుండునటుల దగు యేర్పాటుల జేసికొనుటయం దెంతమాత్రము నశ్రద్ధ వహించరాదు.

## ఈగలు.

ఇంటియందు ఈగలు యెంత తక్కువగనున్న నంత ఆరోగ్యతా విశేషమునుజూపును. ఈగలు లేకుండ నుండిన పరిపూర్ణ ఆరోగ్యతను సూచించును.

అనేక విధములగు ఈగలు వ్యాధిని వ్యాప్తి నందజేయుటకు శక్తిని కలిగి యుండును.

ఫిరంగిగుండుకన్న వ్యాధిహేతువులగు జీవాణుగర్భితమగు ఈగ యెక్కువ అపాయకరమై యున్నది.

ఒక ఆడుఈగ ఒకమాసము కాలములోన 506,250,000 క్రొత్తఈగలను ఉత్పత్తి చేయగలదు.

ఈగలు గుడ్లుపెట్టి వృద్ధినందుస్థలములు పెంటకుప్పలైయున్నవి. కావున గృహ సమీపమున పెంటకుప్పను నుంచరాదు.

ఈగలు, టైఫాయిడ్, కాలరా; క్షయ, మెనింజైటిస్, ఆమవిరేచనములు, కొన్ని విధములగు అతిసారములు, మశూచి మొదలగు వ్యాధులను గొంపోయి వ్యాప్తత నందజేయును.

ఈగలు, యెంతదూరమువరకు బోవునో కనుగొనుటకుగాను కేంబ్రిడ్జి విద్యాలయము లందు 25,000 ఈగలకు రసాయనశాస్త్రి సంబంధమగు రంగును వేసి వదలివేసిరి. వీటిని మరల బట్టుకొనుటకుగాను 60 పరీక్షాలయములను బెట్టిరి. వీటిలో 191 ఈగలను రెండు ఫర్లాంగుల దూరములో బట్టుకొనిరి. ఈ అంశమునుబట్టి ఈగలు వాయుప్రచారమును బట్టియో లేక వాటి కావశ్యకమగు ఆహారపు వాసనను బట్టియో కొంతదూరమువరకు ప్రయాణము చేయగలుగుచున్నవని మనము గ్రహించవలసియున్నది. ఈ ప్రయాణమందు వ్యాధులను గొంపోయినను గొంపోవచ్చును.

## విటమైన్స్ [Vitamines]

కొన్ని సంవత్సరముల క్రిందట ప్రొఫెసర్ ఐక్మన్ అను నొక జర్మను వైద్యశాస్త్రజ్ఞుడు జావాద్వీపమునందు వ్యాప్తినందియున్న తిమురువాయు వ్యాధిని గూర్చి విచారించు చుండెను. మరలలో తెలుపుచేయబడిన బియ్యమును వండుకొని భుజించు వారలయందు మాత్రమే యీవ్యాధి ముఖ్యముగ వ్యాప్తత నందియుండెనని ఆయన కనుగొనెను.

ఈ విషయమును గూర్చి పరిశోధనల జేయుటయందు ఆయన పావురములకు తెల్లబియ్యమును మేతగా మూడునాలుగు వారముల కాల ముపయోగించెను. అంతట నవి నీరసతనంది తలల నెత్తుకొనుట కసమర్థములై, మ్రింగుటకు నశక్తములై, ఒకటి రెండు దినములలో మరణము నందునట్టి స్థితిలో నుండెను. మనుష్యులయందు గలుగు తిమురువ్యాధి లక్షణములే యీ పావురములయందును గొంతవరకు గనబడెను. అప్పుడు ఆయన యీ తెల్లబియ్యమునుండి తొలగింపబడిన పొట్టును (అనగా తవుడును) నీటిలో గలిపి యీద్రవము నొక చిన్నగొట్టము ద్వారా మిక్కిలి జబ్బుగానున్న పావురముల గొంతులో బోసెను. మ్రింగుటకు శక్తి కలిగియున్న వాటికి తవుడును మేతగా వేసెను; అప్పుడు బహువింతయైన ఫలితము కాన్పించెను. మూడు గంటల కాలములో నవి స్వస్థత నందజొచ్చెను. దినాంత్యమునకు ఆరోగ్యతను వహించుచు రెప్పటియట్లు గనబడెను. ఇది యంతయు బహుచిత్రముగా నుండెను.

ఈ పక్షులయొక్క జీవితాధారమునకుగాను కావలయు పదార్థము తవుడు నందమర్చియుండెను. ఒక అరగ్రైయిను తవుడును ఉపయోగించిన మాత్రమునే వాటియొక్క ఆరోగ్యత స్వస్థత నొంద నారంభించెనని చెప్పబడుచున్నది. ఇండియాదేశమునం దంతటను మరలలో తెలుపు చేయబడిన బియ్యమును దినుట ఆరంభించిన పిమ్మట స్కర్వీవంటి వ్యాధులు ప్రబలత నందుచున్నవని కొందరి డాక్టర్ల అభిప్రాయమై యున్నది. పండ్లు శీఘ్రముగ వదులై యూడిపోవుచున్నవి. నరముల యొక్క అస్వస్థతయును వ్యాప్తత నందుచున్నది. ఉప్పుడు బియ్యమును దినుట ఆరంభించిన పిమ్మట నీవ్యాధి స్వస్థత నందుచున్నది.

## విటమైన్సు అనగా నేమి!

ఇరువదైదు సంవత్సరముల క్రిందట నింగ్లాండులో డాక్టర్ కాసిమీర్ ఫంక్ గారు ఉప్పుడుబియ్యమునందున్న యీ విచిత్ర పదార్థ మెద్దియో దానిని విడదీయుటయును, యీ పదార్థమింకే యాహారములయందుండియున్నదియు, అది యెట్లు నశింపు నందుచున్నదియు దేహారోగ్యతయం దది యేమి పనిచేయుచున్నదియు, కనుగొనుటయును ప్రయత్నములం జేసెను.

ఈతని ప్రయత్నములు సఫలము లయ్యెను. ఈ ప్రధానావశ్యక పదార్థమునకు "విటమైన్సు" అని పేరిడెను. ఈ పదమునకు "జీవితమునకు ప్రధానాధార పదార్థము" అని అర్థముగా మనము గ్రహింపవచ్చును. కోళ్ళకు తెల్లని గోధుమ పిండిని మేతగా నుపయోగించినపుడు పైన జెప్పబడిన రీతిని పావురములకు వలెనే వీటికిని జబ్బు సంప్రాప్తమయ్యెను. అనగా, గోధుమలనుండి విడదీయబడిన పైభాగమునందలి పొట్టులోనే "విటమైన్సు" యుండియుండెనని మనము గ్రహింపవలసియున్నది. తెల్లని మైదాపిండితో జేయబడిన రొట్టెయందు యీ ప్రధాన పదార్థ ముండుట లేదు.

పూర్వపు దినములలో నోడలపైన ప్రయాణముల జేయునపుడు చాల కాలము వరకు శాకాహారములు దొరకక పోవుటచే స్కర్వీవ్యాధి ప్రవేశించుచుండెడిది. వీరును పైనజెప్పబడిన పావురములవలెనే అస్వస్థత జెంది, జీర్ణక్రియము చెడి, మిక్కిలి నీరసత నందుచుండువారు. వీరైన నొక రేవుపట్టణమునందు జేరి కాయగూరలను గాని నిమ్మకాయలను గాని సంపాదించి వాటిని దినిన వెంటనే మరల స్వస్థత నందుచుండెడివారు.

అమెరికా దేశములోని చికాగో పట్నమునందు కొంతకాలము క్రింద ఆరోగ్యోద్యోగస్థుడుగనున్న డాక్టర్ ఇవాన్సుగారు జనసామాన్యమునం దంతటను ఆహార లోపమువలన కొద్దియో గొప్పయో అస్వస్థతలు గలుగుచుండునని అభిప్రాయపడి యున్నారు. కొందరకు నోటియందు దుర్వాసనతో గూడియుండు ఊపిరితోడనే అంత్యమగును, మరికొందరకు కీళ్ల నొప్పి, తుంటినొప్పి, గౌట్ మొదలగు వ్యాధులు జనకమందును. ఇంకకొందరకు ముఖము పాలిపోయి, నేత్రముల చుట్టును ఉబ్బుదల ప్రవేశించి పండ్ల చిగుళ్లు వాపుదల నందును.

మనుష్యుని గొంతుయందుండెడి "థైరాయిడ్" అనబడెడి యొకగ్రంథి శరీరమునకు మిక్కిలి ఆవశ్యకమగు నొకస్రావము నుద్భవింప జేయును. ఈ గ్రంథి మిగుల చిన్నదై యుండుటగాని, లేక అసలే లేకపోవుటగాని, తటస్థించినయెడల నట్టిబిడ్డలకు గురుతుల బోలి వెంద్రుకలు కలుగును. వారలకు మేధాశక్తి బహుహీనముగనుండి వానరములకంటె యెక్కుడు జ్ఞానము గలిగియుండరు. వారిముఖములు ముడుచుకొని యుండును.

గొర్రెలకును మేకలకును గలిగియుండు "థైరాయిడ్" గ్రంథులనుండి తీయబడు సారమును యీ బిడ్డల కుపయోగించిన మీదట స్వస్థులై యితరబిడ్డలవలెనే వీరును ఆరోగ్యతను నందినట్టుల గనుగొనబడెను.

దేవుడు సృజించినట్టి ఫలములు, ధాన్యములు, శాకపదార్థములు మొదలగు వాటిని మనము విశేషముగ మార్పుజేయక, అందలి ప్రధాన పదార్థములు చెడిపోకుండ భుజించుటవలన ననేక వ్యాధులు తటస్థింపకుండ జేసికొనవచ్చును.

1830 వ సంవత్సరమున సిల్వెస్టర్ గ్రాహాం అను నాయన సాధ్యమైనంతవరకు వ్యాధులు కలుగకుండుటకు గాను తెల్లరొట్టెను మానివేసి పొట్టుతో కలిగియున్న పిండితో చేయబడినరొట్టె నుపయోగించుటను బ్రోత్సాహపరచెను. స్వాభావికమైనట్టియు, సాధారణమైనట్టియు నాహారమును భుజించుచు నవీనమగు శాకాహారముల నారగించుట వలన ఉపయోగమును గూర్చి ఆయన విశేషముగ బోధించెను. ఆహారవిషయమున నీపద్ధతుల నవలంబించుటవలన నదివరకు స్వస్థతను గూర్చి నిరాశ జేసికొనిన వారలలో జాలమంది ఆరోగ్యవంతులై యుండిరి. అప్పటికి "విటమైన్స్" యొక్క ఉపయోగము తెలియక పోయినప్పటికిని, యీ మూలపదార్థ ముండునట్టి ఆహారముల భుజించుటచే ఆరోగ్య సాధకముగ నాయన జెప్పియుండెను. ఆ ఆహారములనే మన మిప్పుడు శాస్త్రీయ పద్ధతుల బరీక్షించి ఉపయోగములుగ గనుగొనుచున్నాము.

పచ్చిపాలయందు విటమైన్స్ ఉండును. ఆవులు పచ్చిగడ్డిని తినునట్టికాలము నందిచ్చునట్టి క్షీరములలో విటమైన్స విశేషముగ నుండును. పచ్చిమాంసము నందును విటమైన్స యెక్కువగా నుండును; ఎందువల్లననగా నీజంతువులు విటమైన్స్ ఉండునట్టి ఆహారమును భుజించియుండును. ఇదియుగాక యీ విటమైన్స వృక్షప్రపంచమునందు మాత్రమే సృష్టి నందును. అన్నివిధములగు ధాన్యములయందును, గ్రుడ్లలోని తెలుపుభాగమునందును, నీరుల్లి బటాణీలు, చిక్కుడు మొదలగు వాటియందును, విటమైన్స్ ఉండును. బంగాళా దుంపల యందు విశేషముగ నుండును. అపరదినుసుల యందును ఉండును. నిమ్మకాయలు నారింజ కాయల యందును ఉండును.

తెల్లబియ్యమునందువలె విటమైన్స్‌ను తొలగింపనైన వచ్చును; లేక విశేష వేడిమి తగులుటవలన నవి నశింపునైన నందవచ్చును. ఈ కారణముననే వేగింపునందిన రొట్టెలను మాత్రమే భుజించువారలు శీఘ్రముననో ఆలస్యముననో అస్వస్థతను గ్రహింతురు.

విదేశములనుండి వచ్చు డబ్బాలలోని పాలను బిడ్డలకు యిచ్చుటవలన నొకప్పుడు వ్యాధి సంభవింపవచ్చును. ఈ డబ్బాపాలను తయారు చేయుట యందు మిగుల వేడిమికి లోనగును గాన వాటియందలి విటమైన్స్ నశింపు నందుటచే నీవ్యాధి తటస్థింపవచ్చును.

శరీరపోషణమునందు లోప ముండుటవలననే క్షయవ్యాధి హితములగు జీవాణువులు శరీరమునందు వృద్ధి నొందునను అభిప్రాయమును వహించినట్టి చాల వైద్యశాస్త్రజ్ఞులు గలరు. శరీరమునందలి స్వాభావిక కార్యక్రియలకు మిగుల నగత్యమగు నీ మూలపదార్థములను వహించినట్టి ఆహారములయొక్క ఉపయోగము వలన నింకను యితరవ్యాధులకును నుద్యుక్తత యేర్పడునని మనము శీఘ్రకాలముననే తెలిసికొనుటకు దగినంత బలీయమగు కారణములు కనబడగలవు. ఇట్టి స్థితియందు మందులను మింగుటయందుకంటె నాహారము నందలి మార్పువలన నెక్కువ లాభముండగలదని తెలియవలయును.

మన దేశమునందు పచ్చిజొన్నలు దొరకుచుండగా వీటిని పిండికొట్టి ఉపయోగించుటకు బదులుగా: వీటినుండి విటమైన్స్‌ను విడదీసి, తెల్లని పిండిగా దంచి, నీసారేకు డబ్బాలలో పొట్లములను గట్టి, ఆస్ట్రేలియా దేశమునుండి రవాణా చేయుచున్న నీ పిండికి అనేక రెట్లు బదులను యిచ్చి కొనుచున్నాము.

వ్యాధి వచ్చినపిదపగాని డాక్టరుయొద్దకు బోయి మందులను దెచ్చికొని మ్రింగుచుందురు. ఎన్ని దినములకును వ్యాధిరాహిత్యత కలుగని విషయములను మనము జూడగలము.

మనస్సాక్షియుతమైనట్టియు జ్ఞానవంతమైనట్టియు డాక్టరు రోగమే కారణమువలన గలిగినదియు దెలిసికొనుటకు బ్రయత్నించును. వ్యాధి, యేకారణ ఫలితమైనదియు, త్యజింపవలసినదాని దేని ననుసరించుట వలన గలిగినదియు, అనుసరింపవలసినదాని దేని త్యజించుటవలన సంభవించినదియు — నీ విషయముల జక్కగ జర్చించి వ్యాధియొక్క సరియైన కారణముల గ్రహించుట వైద్యుని విధ్యుక్త ధర్మమై యున్నది. వ్యవసాయకుడు భూసారము లేకుండ పంట నెట్లు పండింప జాలడో వైద్యుడు గూడ నారోగ్యహితము లగు సందర్భములు లేకుండ వ్యాధిని గుదర్చజాలడు.

## శాకభక్షణము,

ప్రపంచమునందు భూమిపై నివసించు జంతువులలో మిగుల బలమైనవి శాకాది ఆహారములను మాత్రమే భుజించి జీవించుచున్నవి. అట్టివాటి కుదాహరణముగ, ఏనుగు, గుఱ్ఱము గొరిల్లా యనెడి కోతి, దుప్పి, ఒంటె, ఎద్దు మొదలగు వాటిని దీసికొనవచ్చును. ఈ ఆహార మహిమయొక్క ఫలితముగ నీ జంతువులకు విశేషమగు నోపిక కలుగుచున్నది ఒంటెలకును, గుఱ్ఱములకును, ఏనుగులకును, నుండెడి ఓర్పు బహువింతను బుట్టించునట్టిదై యున్నది. మాంసభక్షకులగు జంతువులు తమ పరాక్రమమును జూపి అచ్చెరువందింప జేయును గాని పని యందోర్పు తక్కువను గలిగియుండును. సింహము ఘోరయుద్ధమునందు పోరాడి, పోరాటము ముగిసిన పిమ్మట తనశత్రు కళేబరముపై విందారగించి, మరల నాకలిచే బీడింపబడు వరకును దన కాలమును సోమరితనముగ గడపుచుండును. శాకభక్షకునియొక్క సహజమగు శరీర స్వభావము ఓర్పుదలతో గూడియుండును. ఈదుట యందుగాని, నడచుటయందుగాని, పందెములవేసినపుడు సామాన్యముగ శాకభక్షకులే జయప్రదు లగుచుందురు. బలమునందును, పోరుపునందును విశేషులు గాకపోయినను, శాకభక్షకులగు చీనాదేశపు కూలీలయొక్క ఓపిక అద్భుతమైయుండును. వరిఅన్నమును, మత్స్యములను మాత్రమే భుజించునట్టి జపానీయుల అద్భుత కృత్యముల జూచి ప్రపంచమునం దేజాతివారలు ఆశ్చర్యమంది యుండలేదు!

ఇండియాదేశమునందు గవర్నమెంటువారి తపాలాసంచులను మోయుట కేర్పడు కూలీలు మధ్యభోజనమునకు అన్నపుమూటలను మాత్రము గట్టుకొని ప్రతిదినమును ముప్పది మైళ్ళదూరము వరకు బోవుచుందురు.

కాయగూరలను నల్లరొట్టెలను పాలను మాత్రమే భుజించునట్టి రష్యనుదేశపు వ్యవసాయకులు దినమునకు పదునారు మొదలు పదునెనిమిది గంటలవరకును బనిచేయుట కోపికను గలిగియుందురు.

నార్వేజియనుదేశపు వ్యవసాయకులు మాంసాహారము నెన్నడును భుజించి యెరుగరు. దేశయాత్రికుల బండ్లవెంబడి పది పండ్రెండు మైళ్ల దూరమువరకు నొకటేరుగ వీరు పరుగెత్తుటకలవాటుపడి యుందురు.

ఐగుప్తుదేశము నందలి కూలివాండ్రు పచ్చికాయలు, నీరుల్లి, చిక్కుళ్లు, [illegible]ములు, పచ్చజొన్నలు మాత్రమే భుజింపుచు, స్థాయిబలమునకు బ్రసిద్ధిజెందియున్నారు.

దక్షిణ అమెరికా దేశమునందు మాంసము నెప్పుడును భుజింపనట్టియు సారాయములను సేవించనట్టియు గనులలో బనిచేయు వారలు తమ భుజములపై రెండువందల పౌనుల బరువును తీసికొని నిలువు నిచ్చెనల పైన రెండువందల అడుగుల యెత్తువరకు దినమునకు పండ్రెండుసారులు పైకి పోవుచుందురు.

బుద్ధివిశేషతను వహించిన చాలామంది పురుషులును స్త్రీలును మాంసాహారమును త్యజించి శాకపదార్థముల భుజించుట మొదలుపెట్టి తమబలమునందును ఆరోగ్యమునందును యెట్టిలోపమును జెందియుండలేదని అభిప్రాయము నొసంగియున్నారు.

శాకాది పదార్థభోజనమువలన, యూరిక్ ఆసిడ్, గౌట్, కీళ్లనొప్పులు — వీటి యెడల నుద్యుక్తత తగ్గిపోవును. స్వభావము మృదువై, మనస్సునకు శాంతమేర్పడి, బుద్ధి సూక్ష్మత కలుగును.

మాంసభక్షకులు కొన్నిపోరాటములలో గాని, కొన్ని పందెములలో గాని, గెలుపునందవచ్చును గాని, ఓర్పు విశేషము వలసియున్న విషయములలో శాకభక్షకులే జయమందుదురని కొందరి శాస్త్రజ్ఞుల అభిప్రాయమై యున్నది.

1901 వ సంవత్సరమునందు జర్మనీదేశమునందు డ్రెస్డెన్ పట్టణమునకును బర్లిన్ పట్టణమునకును గల 125 మైళ్లదూరమును నడచుటకు పందెమును పెట్టిరి. ఈపందెమునందు అన్నిజాతుల వారును వచ్చిరి. పందెమునకు వచ్చిన 40 మంది యందును యెనిమిదిమంది శాకాహారులును, ముప్పదియిద్దరు మాంసాహారులును అయి యుండిరి. ఈపందెమునందు జయమందిన మొదటి ఆరుగురును శాకాహారులే అయి యుండిరి.

ఈపై అంశములనుబట్టి శాకభక్షణము వలన యెక్కువ ఓపికతో గూడిన పట్టుదల కలుగునని నిశ్చయింపదగి యున్నది.

## క్షయ వ్యాధి.

శ్వాసకోశ సంబంధమగు క్షయవ్యాధి విషయమున వ్యాధి రాకుండ జేయుటకును, వ్యాధ్యనంతరము స్వస్థత నందుటకును, వ్యాధ్యుద్యుక్తత గలుగకుండుటకును, పుచ్చుకొనదగిన జాగ్రత్తలుండియున్నవి.

శ్వాసకోశములయం దుద్యుక్తతను గలుగజేయునట్టి — ముడుచుకొనిన శ్వాసబిలములు గాని, శ్వాసకోశావయవ భాగములయందలి రక్తహీనతగాని — శ్వాసకోశముల కిచ్చునట్టి సాధకమువలన స్వస్థత నందును.

శరీరసాధకమును, దీర్ఘ ఊపిరి పద్ధతులును, యీవ్యాధి రక్షణశక్తి నధికపరచును.

శ్వాసకోశములను విస్తరింపు నందజేయుటకుగాను, ఉదరమునందలి క్రింది భాగములోని స్నాయువులను లోనికి దిగిచి, దీర్ఘ ఊపిరిని లోనికి దీసికొని, భుజములను క్రమముగా వెనుక వైపులకు ద్రోసి, పక్కటెముకలను సాధ్యమైనంత వరకు ముందుకు ద్రోసి, ఊపిరిని కొద్దిసేకనులపాటు బిగబట్టి, పెదవులకు మధ్యగా సన్నని మార్గమును జేసి ఆమార్గముగుండ ఊపిరి గాలిని బలముతో బయటికి విడువవలయును. ఈ పద్ధతిని జేయుటవలన శ్వాసకోశములలోని అన్ని భాగముల యందలియు వాయుబిలములు విస్తరింపునంది ఆరోగ్యగతి యుండును.

## నిమ్మఫల చికిత్స.

పండ్రెండు నిమ్మకాయలను చన్నీళ్ళలోవేసి మెత్తబడునంతవరకును నుదుమబెట్ట వలయును. పిమ్మట నీకాయలనుండి రసమునుదీసి, వలసినంత వరకును చక్కెరను కలిపి త్రాగ వలయును. ఈ త్రాగుటయందు పండ్లకు దగులకుండ త్రాగవలయును; లేనిచో పండ్లపుష్టికి పండ్ల కస్వస్థత కలుగును. దినమునకు పండ్రెండు నిమ్మకాయల నుపయోగింప వచ్చును. ఏదైన బాధ తటస్థమైన గాని, విరేచనములు ప్రారంభించిన గాని, నిమ్మకాయల సంఖ్యను దినమునకు అయిదారునకు తగ్గింపవలయును. స్వస్థత నందిన పిమ్మట నిమ్మకాయలను మరల పండ్రెండు సంఖ్యకు హెచ్చింపవచ్చును. అయిదు లేక ఆరు డజనుల నిమ్మకాయల నుపయోగించునరికి బలముపట్టి ఆకలి పుట్టును. స్వస్థత కలిగినకొలదియు నిమ్మకాయల సంఖ్యను తగ్గింపవచ్చును.

అమెరికా దేశమునందలి వాషింగ్టన్ పట్టణములోని యొక పత్రికయందు మిసెస్ విల్సన్ అనునామె యీపై చికిత్సాపద్ధతిని చెప్పియుండెను. పై పద్ధతిని క్రమముగా నవలంబించి చేసినయెడల ఉపయోగ ముండకపోదని ఆమె చెప్పుచున్నది. ఈదిగువ సంగతిని గూడ ఆమెయే వ్రాయుచున్నది.

“ఈ వ్యాధిగ్రస్తులలో నిద్దరియెడల వైద్యులు నిరాశను జేసికొనిన విషయమును నే నెరిగియున్నాను. వారిద్దరును వ్యాధియొక్క అంత్యగతులయందుండి యున్నను యీపై ప్రకారము నిమ్మకాయల నుపయోగించుట వలన స్వస్థత నందియున్నారు. ఆ యిరువురిలో నొకరగు నొక స్త్రీ ప్రక్క నంటుకొని బహు నీరసస్థితియందుండెను. ఇట్టి స్త్రీ నిమ్మకాయల నుపయోగించుట వలన రెండు మాసములలో స్వస్థతనంది 140 పౌనుల తూకమును వహించెను”

ఈపైన చెప్పబడిన చికిత్సయం దెంతవరకు నుపయోగముండునదియు గనిపెట్టుటకు గాను అనుసరించి చూడవచ్చును. అట్లు ప్రయత్నించి చూచుటవలన నష్టముండ నేరదు.

---



# ఆంగ్లేయ వైద్య చింతామణి

---

## వ్యాధులు—చికిత్స

### అజీర్ణవ్యాధి

అజీర్ణవ్యాధి ఇండియాదేశము నందు వ్యాప్తి నొందియున్నది, దాని వివిధ ఆకృతులయందును ముద్దరియో యొక్క యాకృతిని, తరచుగా గనబడుచున్నది. ఒక్కొకప్పుడు, యితర వ్యాధులతో గూడిక లేక కలుగుచున్నది. ఇంకొకప్పుడు, తాత్కాలిక మయిన దైనను లేక స్థిరమయినదైనను, అన్నకోశము, కాలేజము, పేగులు - వీటియొక్క అవ్యవస్థతా ఫలితముగ గలుగుచున్నది.

అజీర్ణ వ్యాధిని గూర్చి సరిగా దెలిసికొనుటకు ముందు, జీర్ణతయొక్క క్రియను గూర్చియు, జీర్ణక్రియమునందు బనిచేయు వివిధ అవయవములను గూర్చియు, కొంత జ్ఞానమును గలిగియుండుట అవశ్యక మయియున్నది. అజీర్ణ వ్యాధిని గూర్చి విచారించుట యందు, నోరు: పండ్లు, నోటిలో దూరెడు ఉమ్మినీరు (Saliva) — వీటియొక్క పనులను విచారింప వలసి యున్నది.

(జీర్ణతయొక్క క్రియను గూర్చి క్లుప్తముగా యీ క్రింద వ్రాయబడినది:—

#### జీర్ణక్రియము.

ఆహారమును పండ్లతో నములుటచే, ఆ ఆహారము నోటి యందూరెడి ద్రవము (ఉమ్మి) తో గలియుటచే ఆహారపదార్థముల యందుండెడి "స్టార్చి" అనబడు ఒకవిధమగు మూల పదార్థము చక్కెరగా మార్చబడుచున్నది. అంతట నీ ఆహారము గొంతు మార్గమున అన్నకోశమునందు బ్రవేశించుచున్నది. అన్నకోశము నందలి మాంసగ్రంథులచే స్రవింపబడు "గ్యాస్ట్రిక్ జూస్" అను ద్రవపదార్థముతో యీ ఆహారము కలియుచున్నది. ఈ ద్రవ పదార్థమునందు పెప్సిన్ యను హైడ్రోక్లోరిక్ ఆసిడ్ (కంఠద్రావకము) యును గలిసి యున్నవి. ఈ ద్రవ పదార్థము సారజనక సంబంధమగు (Nitrogenous) భోజన పదార్థములు, అనగా మాంసము, చేపలు, గుడ్లు, మీగడ, వెన్న, గోధుమలు (కొంతవరకును)

మెందలగు వాటిపైన పనిచేయును. ఇదిగాక అన్నకోశము వరుసక్రమముగా ముకుళించుట వలనను విస్తరించుట వలనను ఆహారమంతయు కలవరపర్చబడును. రసాయన సంబంధమగు మార్పుయును కొంత కలుగుచున్నది. ఈ కారణములచేత ఆహారమంతయు పలుచని ముద్దగా జేయబడి, అన్నకోశము ముకుళించుట వలన, చిన్న పేగుల లోనికి ప్రవేశించి, అందులోనికి కారిజమునుండి వచ్చు పిత్తద్రవముతోడను, వృక్యకము (Pancreas) నుండి వచ్చు మధు రసముతోడను, గలియును. పిత్తద్రవమునకు జీర్ణతయందు సహాయముజేయు గుణ ముండుటయేగాక, పులియునట్టి మార్పులను ఆటంకపెట్టునట్టియు స్వాభావికమగు విరేచన కారిగ బనిచేయునట్టియు, గుణములు కలవు. మధురసము, ట్రిప్సిన్ అను అందలి మూలపదార్థ సహాయమున క్రొవ్వుపదార్థములపై బనిచేయగలదు; మధురసము నందలి అమిలాప్సిన్ అన బడు నొండొక మూలపదార్థము ఆహారమునందలి స్టార్చి భాగముపైన బనిచేయును. నోటి యందు ఉమ్మిచే యేకారణముననైన, స్టార్చి చక్కెరగా మార్చబడుట సంపూర్తి చేయబడక జరిగిన యీలోపము పేగులయందు యీమధురసముచే సవరింప బడుచున్నది. చిన్న పేగులలో మొదటిభాగమునం దీమార్పులు జరిగిన పిమ్మట ఆహార పదార్థముయొక్క రూపమును లక్షణములను మారుచున్నవి. అంతట నీపదార్థము చిన్న పేగులయందలి కొదువ భాగమున బ్రవేశించి, అచ్చటి కొన్ని మాంస గ్రంథులనుండి స్రవించు ద్రవములతో గలియుటవలన జీర్ణక్రియ సంపూర్తియగుచున్నది. ఈతుది ద్రవపదార్థమునకు కైల్ అని పేరు. పేగుల యందలి లోపలి భాగములయం దుండు చిన్ని ఉన్నత ప్రదేశముల నావరించియున్న అనేకములగు (చిన్న) బిసనాళముల యొక్క సూక్ష్మద్వారములగుండ నీ ఆహార పదార్థము ప్రవేశించిన పిమ్మట, నీ బిసనాళములన్నియు జేరియొక పెద్దనాళముగా నేర్పడి, అందలి ద్రవపదార్థమంతయు, వెన్నెముక కెదురుగా నెడమ చేతినుండి నల్లరక్తమును గొంపోవు అపరిశుద్ధ రక్తనాళమునందు జేర్చబడుచున్నది. ఈ అపరిశుద్ధ రక్తనాళము మరల నింక కొన్ని అపరిశుద్ధ రక్తనాళములతో జేరి హృదయమునందలి కుడిభాగమునందు బ్రవేశించుచున్నది. ఇదియే ఆహారము జీర్ణమగుటయొక్క అంతిమోద్దేశ్యము. మనము భుజించెడి ఆహారపదార్థము లిట్టివిధముననే రక్తమునందు గలిసి దేహమునకు సత్తువ నిచ్చుచున్నవి.

—

## ఆహారము పోవుమార్గము



1. పైత్యాశయము. 2. కంఠనాళము. 3. 4. రక్తనాళములు 5. అన్నాశయములోనుండి ఆహారము పేగులలోనికి పోవు రంధ్రము. 6. చిన్నపేగులయొక్క ప్రారంభము. 7. అన్నాశయము 8. పైత్యవాహిక 9. పైత్యవాహిక చిన్నపేగులలో కలియు స్థానము 10. ప్లీహము 11. పెద్దపేగులు 12. చిన్నపేగులు 13. అపెండిక్సు (అపెండిసైటిస్ వ్యాధి దీనికి కలుగును.) 14. మలాశయము.

నీళ్లవంటి పదార్థములును, నీళ్లలో కరిగిపోవు పదార్థములును, అన్నకోశము యొక్కయు పేగులయొక్కయు అపరిశుద్ధ రక్తనాళముల యందలి రక్తములోనికి గ్రహించుకొనబడును. చిన్నపేగులయందే జీర్ణక్రియయంతయు బూర్తియయి, శరీరావసరములకు దగినవన్నియు ఆకర్షించుకొనబడుచున్నవి. ఆరోగ్యస్థితియందు, అన్నకోశమందుగాని, చిన్నపేగులయందుగాని ఆహారపదార్థము పులియుట తటస్థించదు. జీర్ణతనుబొందినట్టియు, జీర్ణమునకు బనికిరానట్టియు, ఎముకముక్కలు, పొట్టుసంబంధములు, శాకపదార్థములయొక్క నారసంబంధములు మొదలగునవి పెద్దపేగులలో బ్రవేశించును. ఈపదార్థములయందలి నీరు విశేషించి ఆదివరకే శరీరముచే గ్రహింపబడి యుండుట వలన నవి అరుగుపల నందియుండును. పెద్దపేగుల యందలి కొన్ని పదార్థములయొక్కయు, కొన్ని క్రిమిజాలముల యొక్కయు, పనుల వలన నీ మిగతపదార్థమునకు మలసంబంధమగు గుణములును వాసనయును గలుగుచున్నవి. ఒక విధమగు కొన్ని వాయువులును యిందు ఉద్భవించును. మలమున నుండెడి వాసన, మనుష్యునియందును యితర జంతువులయందును భేదించును. పెద్దపేగులయందు గలిగెడి యీ మార్పులన్నియు మలబద్ధముయొక్క దుర్గుణములకు కారణము లగుచున్నవి.

అజీర్ణవ్యాధిని రెండు తరగతులుగా విభజింపవచ్చును. ఏమన, (1) అకస్మికమయిన అజీర్ణవ్యాధి. (2) స్థిరమైన అజీర్ణవ్యాధి, అనగా దీర్ఘకాలము వ్యాపించినట్టియు, శరీరమునకు అలవాటు పడినట్టియు, అజీర్ణవ్యాధి.

## ఆకస్మిక అజీర్ణవ్యాధి,

### కారణములు.

భోజనమునందలి లోపమువలన, అనగా బరువైనయట్టిగాని ఉద్రేకతను బుట్టించునట్టిగాని, పదార్థమును భుజించుటవలన నీ ఆకస్మిక అజీర్ణవ్యాధి తటస్థించును. తొందరగా భుజించుటవలనను దటస్థింప వచ్చును. శరీరమునకు చలిగాలి సోకుటవలనగాని అభ్యాసము లేని పరిశ్రమమువలనగాని (అనగా నొక మోటుబండిలో ప్రయాణము చేయుట మొదలగునట్టి వాటివలన) స్నానము చేయుట వలనగాని, సంపూర్ణ భోజనమైన వెంటనే కఠినమయిన మనఃశరీరశ్రమ చేయుటవలనగాని, యిట్టివ్యాధి తటస్థించును.

### లక్షణములు.

ఈ వ్యాధియొక్క కొద్దిపాటునందు నాలుకమీదను లేక నోటిమీదను పొక్కులు కనబడుటగాని లేక ముఖము యెఱ్ఱవారుటగాని తటస్థించును. అన్నకోశము వాయుపూరిత మగుటయు లేక భోజనానంతరము అరుచిగలిగిన తేపులు వచ్చుటయు, ఒకానొకప్పుడు పులితేపులు వచ్చుటయు, కొద్దిగా తలనొప్పి గలుగుటయు, కొద్దిగా అజీర్ణభేదనము అగుటయు దటస్థించి దానంతట అదియే సర్దుకొనును. తలతిరుగుటయు, నిస్సారతయు, వాంతివచ్చునట్లుండుటయు, వాంతిగలుగుటయు, మలబద్ధము గలుగుటయు, విరేచనము గావలెననియుండుటయు—యిట్టి గుణములతోనున్నను గూడుకొనియుండును. ఒకప్పుడు దుర్వాసనగల తేపులతో గూడి కడుపునొప్పియు దటస్థించును. ఇంకొకప్పుడు విశేషమయిన తలనొప్పి, వాంతివచ్చునట్టి అసహ్యతతో గూడిగాని, కూడకగాని, తటస్థించుటయు గలదు.

# స్థిర అజీర్ణవ్యాధి.

## కారణములు.

సహజముగా దుర్బలమగు జీర్ణశక్తిని గలిగియుండుట వలనను, ఉత్కృష్టమైనట్టియు యింపుకెగని జీవనముయొక్క ఫలితముగను — ముఖ్యముగా చాలసేపు కూర్చుండి పనిచేసెడి వృత్తులతో గూడియుండినను, పేగులను అణచిపెట్టునట్టి పల్లపుకుర్చీలలో గూర్చుండి యుండుట వలనను — ఈ స్థిరఅజీర్ణవ్యాధి సంభవించును. శరీరసాధనము నశ్రద్ధచేయుట వలనను, పనిచేయునప్పుడు విశేషముగా వంగియుండుట వలనను, వెలుతురును గాలియు చక్కగా ప్రవేశించని యిండ్లలో నివసించుటవలనను, జనసమ్మర్దమగు గదులలో నిద్రించుటవలనను, ఏ కారణము వలననైనను గలిగెడి అపరిశుద్ధ వాయువు వలనను, యీవ్యాధి గలుగవచ్చును. మనశ్శక్తుల యొక్క విశేష పరిశ్రమవలన నీవ్యాధి మిక్కుటముగ సంభవించును. సోమరితనము యీవ్యాధిని వృద్ధిపరచును. ఎక్కువగా చుట్టను గాల్చుటయు దీనికి కారణము గావచ్చును. మలబంధము దీనికి కారణము కావచ్చును; దీని యొక్క ఫలితమును గావచ్చును. చెడిపోయినపండ్లు యుండుటవలన నాహారమును బాగుగా నమలుటకు వీలులేకపోవుటచేత గూడ నీవ్యాధి తటస్థింపవచ్చును. చెడుపండ్లనుండియు, పండ్లచిగుళ్ళ నుండియు, స్రవించు దుర్గంధ ద్రవముల వలనను జీర్ణమున కాటంకము కలుగుచున్నది. స్త్రీలయందు గర్భాశయము యొక్క అస్వస్థతవలన నొకానొకప్పుడు యీ స్థిరఅజీర్ణవ్యాధి సంభవించుచున్నది. జీర్ణకోశమున నుండెడి పురుగులవలన నొకానొకప్పుడు నీవ్యాధి తటస్థించుచున్నది. శీతోష్ణస్థితి యందు అకస్మాత్తుగా మార్పులు గలిగినయెడల యీ వ్యాధిగ్రస్తులకు కష్టముగా నుండును. ఉష్ణదేశములందలి అధిక వేడిమివలన శరీరమునకు గలిగెడి రక్తహీనతయందు జీర్ణావయవములును గొంతవరకు నొప్పాటు పడుచున్నవి.

## లక్షణములు.

స్థిర అజీర్ణవ్యాధియందు అన్నకోశము, కాలిజము, పేగులు — యీ అవయవము లన్నియు అస్వస్థతాగ్రస్తము లగుచున్నవి. ఎప్పుడైన నరుదుగా యీ అవయవములలో నేదయిన యొక్కటి మాత్రమే అస్వస్థత నుండునుగాని, తఱచుగా మాత్రము యీ వ్యాధియందు యివియన్నియు ఒకేసారిగ ననారోగ్యస్థితి నుండుట తటస్థించుచున్నది. ఈ వ్యాధి చిరకాలముండుటచే నన్నకోశముయొక్క నాళములు అతిసున్నితములై కడుపులో నీడ్చునట్టియు, నములునట్టియు, మండునట్టియు, బాధను పుట్టించును ఇట్టిస్థితియందు దాహముతో గూడిన యాకలి జనించును. ఈ ఆకలి పుట్టినపుడు రోగి యెక్కువగా దినుట తటస్థించినయెడల. అంతట కండరిట్లు యెక్కువ బాధనందును. వెన్నుపైపులను బొట్లు పొడుచుటయు తటస్థించును. ఇందువలన కాలిజము జబ్బుస్థితియందున్నదని కొందరనుకొందురు. రొమ్మునందు నొప్పియును; క్రమముదప్పిన నాడియును, బుట్టుటవలన హృదయరోగమును గూర్చి కొందరు అనవసరముగ భయమందుదురు. మూత్రము వెలువడినప్పుడు వేడిగా నుండవచ్చును. ఇట్టి మూత్రమును నిలువయుంచియున్నప్పుడు అడుగున యెఱ్ఱని గసి తేరును. అన్నకోశములోని జీర్ణక్రియలు సరిగ జరుగకపోవుటవలన ఆహారమంతయు పులియజేయబడి

దుర్వాసనగల తేపులువచ్చును. ఒకానొకప్పుడు వాంతి కలుగుటయు గలదు. క్రమముగా జీర్ణముకాని ఆహారమే పేగుల లోనికిబోయి అచ్చటనుగూడ క్రమమయిన జీర్ణత గలుగక పోవుటచే పేగులనుండియు దుర్వాసనగల తేపులుపుట్టి, ఆహారమంతయు మిక్కుటముగ పులియబడి, పేగులయందు నొప్పిగల్పట్టి, రోగికి మిగుల అసౌఖ్యముగనుండి, యీ సందర్భమున అజీర్తి విరేచనములు పుట్టినను పుట్టును. నోరు జిగటలుసాగుటయు, గొంతు పచ్చిపుండుగానుండుటయు, శరీరమునందనేక స్థలములలో నొప్పులును, నిస్త్రాణయు, దట్టస్తంభమును. నాలుకయొక్క చివరను, అంచులను, యెర్రగా నుండును. మధ్యభాగమునందు మాలిన్యముతోగూడిన గీతయుండును. చెడిపోయిన పండ్లబాధవలన రోగి యొక్క పైపున మాత్రమే నములుచుండిన యెడల, యీగీత రెండవవైపున మిగుల స్పష్టముగా కనబడును. మూత్రము ఉపరి భాగమున దరచుగ పంచవర్ణములుగల తెట్టును, గన్పట్టజేయును.

కారిజమునుండి వచ్చు పిత్తముయొక్క గుణలక్షణములుగాని, పరిమాణముగాని మారినప్పుడు, ఆహారము పేగులనుండి శరీరములోనికి గ్రహింపబడుట కర్హమైనస్థితిలో నుండజాలదు. కారిజ మీవిధముగ నస్వస్థతయం దుండినప్పుడు పిత్తమందలి మాలినపదార్థములు రక్తములో గలిసి, రోగి పాలిపోయినట్టియు, కొంచెము పసుపురంగును గలిగినట్టియు వర్ణమును వహించును. ఇట్టివ్యాధి దీర్ఘవ్యాపకమైనప్పుడు నాలుకయొక్క వెనుకతట్టునయందు పొక్కుల వంటివి, మిగులవృద్ధిజెంది చిన్నిపులిపిరి కాయలవలె నుండును.

అజీర్తివ్యాధియొక్క మిగిలిన కొన్ని చిహ్నములు—పెదవులపై పొక్కులు లేచుట, కనురెప్పలు ఉబ్బుట, కడుపులో సులపోయు నొప్పి, కడుపులో కదలికను పుట్టించు డొంక నొప్పి యేర్పడి శరీరమంతటను వ్యాపించుట, గుండెలు క్రమముదప్పి కొట్టుకొనుట, కీళ్లనొప్పులు, ఉబ్బసము, మలబద్ధము, మూత్రకృచ్ఛ్రము, అతిమూత్రము — యీ వ్యాధులతో కూడ నజీర్ణవ్యాధి కనుపించును.

## చికిత్స

అజీర్తివ్యాధియొక్క చికిత్స ఔషధసేవ యందుకంటె పథ్యమునందును, ఆరోగ్యశాస్త్రసూత్రముల ననుచరించుట యందును గలదు. మితభోజనమును జేయుట మిగుల యావశ్యకము. అజీర్ణవ్యాధిపీడితులు నెమ్మదిగా భుజింపవలయును. ఒక భోజనమునకును మరియొక భోజనమునకును మధ్యకాలము విరివిగనుండవలయును. అధమపక్షము ఆరుగంటలైనను యుండవలయును. మధ్యకాలములం దేమియు దినరాదు. భోజన పూర్వముగాని, భోజనానంతరముగాని, అధికమైనట్టిగాని. దీర్ఘమైనట్టిగాని మనఃపరిశ్రమనుగాని శరీరపరిశ్రమనుగాని, బుచ్చుకొనగూడదు, అజీర్తిరోగులకు బాగుగా వండిన మాంసపదార్థములయొక్కయు, శాకపదార్థములయొక్కయు మిశ్రిత ఆహారము మంచిది. బంగాళాదుంపలు, పిండివంటలు, తీపిపదార్థములు, పండ్లు, చక్కెర, కాల్చబడనిరొట్టె—వీటిని త్యజింపవలయును. చక్కెరను వదలివేసి సాకరీన్ అనుపదార్థమును ఉపయోగింపవలయును. ఉద్రేకమును, మత్తును బుట్టించు త్రాగుడులను మానివేయవలయును. తేయాకునీళ్ళు విశేషముగా త్రాగగూడదు. ఇతర ద్రవపదార్థములను విశేషముగ బుచ్చుకొనగూడదు. తిను త్రాగు విషయములను గూర్చి

రోగికి స్వానుభవమువలననే సంగతులు తెలియగలవు. అజీర్తివ్యాధియొక్క చాలతరగతుల యందు మందులు పుచ్చుకొనన వసరములేదు. జాగ్రతతో నుండుటయు, మందుజాగ్రత్తను గలిగి యుండుటయు, మితభోజనము చేయుచుండుటయు, యివియన్నియు, రోగికి మందుల కంటెయెక్కువ ఉపశాంతిని గలుగజేయును. ఇతర అవయవములకు విశ్రాంతిచ్చునటులే, అన్నకోశమునకును విశ్రాంతినీయవలయును ఈవ్యాధియొక్క ఉద్రిక్తస్థితియందు, పెద్దవారుగాని పిల్లలుగాని యిరువదినాలుగు గంటలవరకు భోజనమును మానినయెడల శరీరమునకు ఆయాసము కలుగనేరదు. అజీర్ణత అన్నకోశముతో మాత్రమే సంబంధించినదై యున్న యెడల భోజనము మానివేసి మితియగుటకు మందు పుచ్చుకొనవలయును. అజీర్ణత ప్రేగుల తోగూడ సంబంధించినదై యుండినయెడల విరేచనమగుటకు మందుపుచ్చుకొనుట అవసరమయియున్నది. దీర్ఘకాలమునుండి యుండియున్న అజీర్ణతకు, భోజనమునందు జాగ్రతగా నుండుటయు, శరీరమునకు సరిపడని పదార్థములను లోనకు బుచ్చుకొనకుండుటయు మిగుల మంచిది.

అజీర్ణవ్యాధియందు, ఆరోగ్య శాస్త్రవిధులను బట్టి సబ్బు ఉపయోగించి స్నానము చేయుటవలన చర్మభాగముల యందలి రోమ రంధ్రములను పరిశుభ్రముగా నుంచవలయును, అలసట జెందకుండ శరీరవ్యాయామము బుచ్చుకొనవలయును. మనఃపరిశ్రమను తగ్గించవలయును. చలిగాలి తగలకుండు స్థలములలో నిద్రించవలయును. స్థిరఅజీర్ణ వ్యాధిగ్రస్తులు, శీతోష్ణస్థితిని మార్చునట్టి ప్రదేశమున కరుగవలయును.

కడుపులో మంటగానున్నపుడు 10 గ్రెయినుల బైకార్బనేట్ ఆఫ్ సోడాను ఒక అరఔన్సు జలములో గలిపి పుచ్చుకొనినచో ఉపశాంతి గలుగును. సోడామింట్ బిళ్లలను చిన్న సీసాలలో అమ్ముదురు. ఈబిళ్ళలను ఉపయోగించినను ఉపయోగింప వచ్చును. అన్నకోశము వాయుపూరితమయి ఉబ్బరముగా నుండినపుడు ఒక ఔన్సు జలములో 5 పెప్పర్మెంట్ ఆయిల్ చుక్కలను వేసి పుచ్చుకొనవలయును. కడుపు ఉబ్బరములో నొప్పికూడా కలిసియున్నపుడు, ఒక డ్రాము స్పిరిట్సు అమ్మోనియా ఆరోమేటిక్ ను ఒక ఔన్సు జలములో కలిపి పుచ్చుకొనవలయును. కడుపు ఉబ్బరము ప్రాంతమయి, దుర్వాసన యుతమయి యుండినపుడు క్రియసోట్ గాని కార్బాలిక్ ఆసిడ్ గాని ఒక చుక్కను చక్కెరపై వేసి లోనకు పుచ్చుకొనవలయును. అజీర్ణవ్యాధితోగూడ మలబద్ధమువలన బాధనొందుచున్న కొందరు రోగులకు, రాత్రిపరుండ బోవునపుడు ఒకటుంబ్లరు చల్లని నీళ్లను, ఉదయమున నిద్రలేవగానే మరియొకటుంబ్లరు చల్లనినీళ్ళను త్రాగుటవలన గుణమునిచ్చును.

---

## అతిమూత్రము.

అతిమూత్రవ్యాధి (1) డయబిటిస్ మెలిటస్ (2) డయబిటిస్ ఇన్సిపిడస్ అని రెండు విధములయి యున్నది. ఇందులో మొదటితరగతి వ్యాధి యందు, మూత్రముద్వారా గ్రేప్ సుగర్ అనబడు ఒక విధమగు తీపిపదార్థము తఱచుగా వెలువబడుచుండును. ఈ తీపి పదార్థము మూత్రముద్వారా అప్పుడప్పుడు కొంచెము గ్రేప్ సుగర్ మాత్రమే వెలువడు

వ్యాధికి గ్లయికోసూరియా అని వేరొక పేరు ఉండియున్నది. రెండవ తరగతి వ్యాధియందు దాహము అధికముగానుండి, సుగర్ (చక్కెర) యను అల్బ్యుమిన్ అనబడు శ్వేత ధాతువును లేకుండ మూత్రము విశేష పరిమాణములుగ వెలువబడును.

## (1) డయబీటిస్ మెల్లిటస్.

### కారణములు.

అంగారసంబంధమయినట్టియు, జలవాయువు ప్రాణవాయువుల సంబంధమయినట్టియు, ప్రాణవాయువు కంటె రెట్టింపు జలవాయువు యుండునట్టియగు ఆహారపదార్థములకు కార్బోహైడ్రేట్లు అని పేరు. ఈ ఆహార పదార్థములవలననే శరీరములో రక్తమునందుండెడి చక్కెరపదార్థము యేర్పడుచున్నది. కారిజముయొక్క వ్యాపారములలో నొకటి యీ చక్కెరను చేసి రక్తమునందు ప్రవేశపెట్టుట అయియున్నది. అధిక మనః పరిశ్రమవలన గాని, యెక్కువ భయమునందుట వలనగాని, తాగుబోతుతనము వలన గాని, స్ఫోటకము, ఇన్ఫ్లూయంజా, ఉద్రేకజ్వరములు, కలరా, మొదలగు వ్యాధుల పిమ్మటగాని, మెదడునందు ఒకవిధమగు మార్పుగలిగి రక్తమునందలి యీ చక్కెర పదార్థము వృద్ధియగుటకు కనుగుణ్యమగు పనులు జరుగుచున్నవి. కారిజము క్రమముగా పనిచేయక చక్కెరను యెక్కువగా ఉత్పత్తిచేయుట వలనగాని, శరీరమునందలి నానా అవయవముల యొక్క పని కారణము వలన శరీరమునం దుత్పత్తియగుచున్న చక్కెరను ధ్వంసము చేయుట తగ్గిపోవుట వలన గాని, ఈ అతిమూత్రవ్యాధి సంభవించుచున్నది. ఈ రెంటిలో యేలాగునైనను సరియే, దేహమందలి రక్తప్రచారమునందు చక్కెర ప్రవేశించి మూత్రగ్రంథి ద్వారా నివర్తింపబడుచున్నది.

అతిమూత్రము తఱచుగా సంభవించెడి వ్యాధి కాదు. మాంచెస్టరు పట్టణమునందలి ఒకపెద్ద ఆసుపత్రిలో ఇరువది సంవత్సరముల కాలములో రోగులుగా ప్రవేశించిన 27,721 మందిలో 272 గురు మాత్రమే అతిమూత్ర వ్యాధిచే బాధనొందిరి. ఇంగ్లాండు, ఫ్రాన్సు, డెన్మార్కు, యునైటెడ్ స్టేట్సు దేశములలో అతిమూత్రవ్యాధి హెచ్చుచున్నది. ఇండియా దేశమునందు హిందువులలో నెక్కువగను, సిలోన్, దక్షిణ ఇటలీ, [illegible] ప్రదేశముల యందును, యీ వ్యాధి యితర దేశములయందుకంటె నెక్కువ వ్యాపకముగ నున్నది.

### లక్షణములు.

ఈ వ్యాధియొక్క మొదటిగుర్తులు సామాన్యముగా దాహమధికమగుటయు, మూత్రవిసర్జనావసరము యెక్కువగుటయు, అయియున్నవి, నీరసము ప్రారంభమును, [illegible]చుటను ప్రారంభింపవచ్చును. తఱచుగా, దాహము అకస్మాత్తుగా పుట్టును. వ్యాధియొక్క ఉద్రేకగతులయందు ముఖము కృశించి, నుదురుపయిన ముడతలు కన్పట్టును. సాధుగతులయందు ముఖమునందు మార్పులేమియు సామాన్యముగ గానరావు. మిక్కుటవ్యాధియందు శరీరమంతయు గూడ కృశించును.

మూత్రముయొక్క పరిమాణము ఎక్కువగును. తీవ్రగతులయందు దినమునకు 150 మొదలు 250 ఔన్సులవరకు గూడనుండును. సాధుగతులయందు మామూలుకంటె కొద్దిగమాత్రమే హెచ్చును. మూత్రము యొక్క రంగు వెలవెలబారి తెలుపువర్ణమును గలిగియుండును; ఒకానొకప్పుడు ఆకుపచ్చ, పసుపు గలిసిన వర్ణము ఉండును. మూత్రము నందు గ్రేపుసుగరు ఉండుటయే ముఖ్యమయిన మార్పు అయియున్నది. ఈ గ్రేపుసుగరు, మూత్రమునందు 100 కి 1/200 వంతు మొదలు, 8 లేక 10 వరకు నుండును. అతిమూత్ర రోగియొక్క మూత్రముపయి ఈగలు విశేషముగ మూగును. ఈ వ్యాధికి యిది యొక గుర్తుగా గనుగొనవచ్చును. ఈమూత్రముయొక్క యొకచుక్క యెచ్చటనైనను పడినయెడల, అది ఆరిన పిమ్మట ఒక తెల్లని పదార్థమచట నిలువయుండుటను మనము కనుగొనవచ్చును.

వ్యాధి వృద్ధిజెందినప్పుడు, మూత్రముద్వారా అల్బ్యుమిన్ అను శ్వేతధాతువు గూడ వెలువడుట తటస్థించును. దేహముయొక్క వేడిమి స్వాభావిక వేడిమితో సమానముగ నుండును, లేదా, కొంచెము తగ్గియుండును. ఇతరమగు శరీరాస్వస్థతలు సంభవించిననే తప్ప శరీరవేడిమి హెచ్చదు. ఉద్రిక్తగతులయందు ఒడలు పొడిగానుండును. పరుపులును, రాచపుండ్లును, అంగవికృతి (Apoplexy) రోగమును దటస్థించుటయు గలదు. నోరు సామాన్యముగా పొడిగానుండును; దీర్ఘవ్యాపిత వ్యాధియందు పంటిచిగుళ్లు తరచుగా వాచియుండును; పళ్ళు పుచ్చియగును. ఉద్రుత గతులయందు నాలుక యెఱ్ఱగాను పచ్చిగాను వుండును. నాలకాలము ఆకలి మందగించకనే యుండును. ఒకానొకప్పుడు ఆకలి అధికముగా నుండును. రోగి చిక్కినకొలదిని, ఆరోగ్యత చెడి, ఆకలి తగ్గి, చెమటలు ప్రారంభమయి, హృదయస్థితియు నీరసించి, పాదములు వాచుటయు తటస్థించును. స్త్రీలలో దురదలు యెక్కువగా నుండును. ఈవ్యాధియందు కంటికి పొరగప్పుటయు నొకానొకప్పుడు తటస్థించును. పురుషులయందు సంభోగశక్తి తరుచుగా క్షీణించును. ఉద్రుతగతులయందు స్త్రీలలో సంభోగేచ్ఛ తగ్గుననియు, వయసుచెల్లిన ఆడువారలయందు, యీవ్యాధి సాధుగతిని పొందిన యెడల, సంభోగేచ్ఛ హెచ్చుననియు తెలియుచున్నది. ఋతుస్రావము కాకయుండునుగాని, సామాన్యముగ మాంద్యమును, ముష్టును, విస్తారమును వహించియుండును. ఈవ్యాధి స్త్రీలయందు కంటె పురుషులయందు యెక్కువ వ్యాపితమయియున్నది. నలువది సంవత్సరముల వయసుపయిన యీ వ్యాధియందు మరణము యెక్కువగనున్నది. ఉద్రిక్త గతులయందు మరణము కొన్ని సంవత్సరములలోనో, లేక కొన్ని మాసములలోనో, గలుగుటయు గూడగలదు. సాధుగతులయందు, వయసుచెల్లిన వారిలో, 10 సంవత్సరములు మొదలు 20 సంవత్సరముల వరకుగూడ నిలిచియుండుట గలదు. ఈ వ్యాధియందు క్షయరోగము సంభవించిన యెడల మరణమునకు పూర్వమున అతిమూత్ర లక్షణములు హరించవచ్చును.

అతిమూత్రవ్యాధి పీడితునియొక్క మూత్రమును యిట్లు పరీక్షించవలెను. సరి సమానముగు మూత్రమును లిక్కర్ పొటాస్‌ను గలిపి కాచినయెడల బొగ్గిన యెఱుపు రంగు దేలును. ఈ యెఱుపురంగు మూత్రమునందు గ్రేపుసుగరు వుండియున్నట్లు సూచించును.

### చికిత్స

అతిమూత్రవ్యాధిచే బాధనొందు రోగి భోజన పదార్థములయందు ముఖ్యముగా జాగ్రతగా నుండవలయును. చక్కెర గలిగియుండు పదార్థముల భుజించుట మానవలయును.

ఈ దిగువ పదార్థములను భుజింపవచ్చును:—

మాంసమునందు కాలిజముతప్ప తక్కిన అవయవములును, చేపలు, గుడ్లు, మీగడ, వెన్న, చమురులు; శాకాయగూరలలో క్యాబేజి, పాలకూర, చిన్నఉల్లిగడ్డ [illegible], ద్రవపదార్థములలో సామాన్యజలము, సోడానీళ్లు, నిమ్మరసము [illegible], నిమ్మకాయనీళ్ళు, కాఫీ, డ్రైషెర్రీ, క్లారెట్ బర్గండీ వైనులు, బ్రాందీయును, గొద్దిగా పుచ్చుకొనవచ్చును.

ఈ దిగువ పదార్థములను త్యజింపవలయును:—

పోర్టువైన్, చాంపేనువైన్, ఫలములయొక్క రసములు, పరబతులు, కోకో, చాకలేట్లు, అన్నము, పాలు విస్తారముగను, పుచ్చుకొనగూడదు.

పాలలో 100 కి 4 వంతులు చక్కెర వుండును ఇందులో విశేషభాగము క్రొవ్వు పదార్థమును అల్బుమినును వుండును. మీగడలో క్రొవ్వుపదార్థము యెక్కువగానుండి చక్కెర తక్కువగానుండునుగాన, దీనిని పుచ్చుకొనవచ్చును. గోధుమ పొట్టుతో జేసిన రొట్టెను దినవచ్చును. అతిమూత్ర వ్యాధిపీడితులు చక్కెరకు బదులుగా సాకరీన్‌ను వుపయోగింపనగును.

### మందులు.

అత్యుగ్రత స్థితియందు యేమందులను సామాన్యముగ నుపయోగింపజాలవు. సాధుగతులయందు అనేక ఔషధములు వుపయోగము లగును. ఓపియం (నల్లమందు) మార్ఫియా, కోడీన్ చాలా ఉపయోగములు. ఓపియం అరగ్రేయిను మొదలు 2 లేక 3 గ్రేయినుల వరకును మోతాదును హెచ్చింపవచ్చును. కోడీన్(కోడియా) కూడా అరగ్రేయిను మొదలు 2 లేక 3 గ్రేయినులవరకును మోతాదులు హెచ్చింపవచ్చును. వీటిని భోజనానంతరమున బుచ్చుకొనుట మంచిది. ఇవి మలబద్ధమును బుట్టించును గాన, దానికి వేరువిధముగా చికిత్స జేయవలయును.

బైకార్బనేట్ ఆఫ్ సోడా, సిట్రేట్ ఆఫ్ పొటాష్, అసిటేట్ ఆఫ్ పొటాష్ ఉపయోగమగును. ఈక్రింది ఔషధములును ఉపయోగములుగ నుండును. సాధుగతులలో ఆర్సెనిక్ (పాషాణము); జాంబూల్ (నేరేడు) లిక్విడ్ పెద్ద మోతాదులలోను; సోడియం సాలిసైలేట్; బిస్మత్ సాలిసైలేట్; క్లోమ్ముకోష్ఠముతో గూడియుండిన రోగులకు [illegible] మిగుల కుషించియుండినరోగుల కాడ్‌లివరు చమురును ఉపయోగించును.

ఈవ్యాధి మిగుల ఉగ్రతస్థితి యందున్నపుడుగాని, మూర్ఛ వచ్చునట్లుండిన గాని సోడియం బైకార్బనేటును దినమునకు 150 గ్రేయినులు యియ్యవచ్చునని యొక గొప్ప డాక్టరుగారు చెప్పుచున్నారు.

### (2) డయబీటిస్ ఇన్‌సిపిడస్.

ఈవ్యాధి బహు అరదుగా దటస్థించును. మాంచెస్టరు పట్టణమునందలి యొక పెద్ద ఆసుపత్రిలో 10 సంవత్సరముల కాలమునందు ప్రవేశించిన 14,575 రోగులలో 7 గురు మాత్రమే యీవ్యాధిచే బాధనొందిరి.

### కారణములు.

తలకు దెబ్బ తాకుటవలనను, మనస్సుయొక్క విశేష ఆయాసము వలనను, అధిక మనోద్రేకము వలనను, భయమువలనను, దుర్బలమగు ఆహారమువలనను, త్రాగుబోతు తనము వలనను, హిస్టీరియామువంటి కొలుకు మొదలగు వ్యాధులవలనను, చలిగాలి సోకుట వలనను, నీవ్యాధి తటస్థించును. కారణమేదైనను, మెదడుయందు గలిగెడి మార్పువలన యీవ్యాధి పుట్టుచున్నది. శవపరీక్షన మూలమున దెలియుచున్నది. మూత్రగ్రంథులతో సంబంధించిన నరములకు అస్వస్థత గలుగుట వలన మూత్ర గ్రంథులయొక్క పనియందు లోపము కలుగు చున్నదని చాలమంది యొక్క అభిప్రాయమై యున్నది.

### లక్షణములు.

ఈవ్యాధియొక్క ముఖ్యలక్షణములు, అతిదాహము, అతిమూత్ర విసర్జనము. ఏయితర వ్యాధియందైనను యీవ్యాధియందు మూత్ర పరిమాణము అధికముగ నుండదు. మొత్తమున దినమునకు 180 ఔన్సులు మొదలు 400 లేక 500 ఔన్సుల వరకు నుండును. మూత్రమునందు శ్వేతధాతువు యుండదు. నోరును, నాలుకయును పొడిగానుండును. ఒడలు పొడిగానుండి, చెమట తగ్గియుండును. సామాన్యముగ నాకలి మారకనేయుండును; మలబద్ధమును సామాన్యముగ తటస్థించును. కొన్ని విషయములలో అతిమూత్రము, అతిదాహము తప్ప వేరువిధమగు అనారోగ్యత యేమియు గానరాదు. మరికొన్ని విషయములలో కృశించుట విశేషముగ నుండును. శరీరవేడిమి సామాన్యముగ మామూలుస్థితియందే యుండును. ద్రవపదార్థములు లోనకు బుచ్చుకొనుట తగ్గించినయెడల గుణమునిచ్చిన కొన్ని దృష్టాంతములు కలవు. జ్వరమువచ్చినపుడు మూత్ర పరిమాణము తగ్గును.

### చికిత్స.

ఇంకొక వ్యాధితోగూడి యీవ్యాధి యుండినపుడు, ఆవ్యాధికి ముందు చికిత్సగావింప వలయును. ద్రవపదార్థములను బుచ్చుకొనుట తగ్గించుటవలన కొద్దివిషయములలో ఉపశాంతి గలిగియుండును. లోనకు జెంకు వెలిరియనేట్, ఆంటిపైరిన్ యిచ్చుట వలన చాల నెమ్మది కలుగగలదు. యెర్గాట్ లోనకు యిచ్చుటవలన మూత్ర పరిమాణమును తగ్గించును గాని, దీనిని విశేషముగ నియ్యగూడదు. నైట్రోగ్లిసరిన్ యిచ్చుటవలన యొకప్పుడు గుణము నియ్యవచ్చును. చెమటను బుట్టించుటకుగాను ఉష్ణతను గలుగజేయు వస్త్రములను ధరించుట మంచిది. దాహమును అణచుటకు మంచు దాహములను, ఆసిడ్ సంబంధమగు దాహములను, బుచ్చుకొనుట ఉపయోగకారిగ నుండును. ఈవ్యాధియందు చక్కెర గలిగియుండు పదార్థములను నిషేధించుట యవసరములేదు. ఆహారములో లవణమును కొద్దిగా భుజించుట యుక్తముగా నుండును.

---

### అతిస్థూలత.

ఇండియా దేశమునందలి యూరోపియనులు స్వదేశీయులను గూడ తఱచుగ స్థూలకాయులగుటగలదు. ఇట్టి స్థూలకాయము అననుకూలతకే దారితీయుటగాక, ఒకొక్క

త్పుడు వ్యాధిగను పరిణమించుచున్నది. దీనికి కారణము బహుళః క్రొవ్వు పదార్థములను విశేషముగ భుజించుటవలనను, శరీరమునందు క్రొవ్వుపదార్థము కూడుకొని యుండుట కనువగు వయస్సునందు తగిన శరీరసాధకము దీసికొనక పోవుట వలనను, అయియుండవచ్చును. ఈ క్రొవ్వుపదార్థము శరీరమంతటను సమానముగ వ్యాపించి యుండిన యెడల, అవ్యవధానమైన అనర్థకమేమియు లేక పోవచ్చును. కాని ప్రత్యేకస్థలముల యందు మాత్రము యీ క్రొవ్వు పదార్థము ఆవరించి యున్నపుడు దానియొక్క హానికరమగు గుణము స్పష్టముగాక మానదు. ఆరోగ్యమునందున్న స్వదేశీయుడు, ఇరువది సంవత్సరములకును ముప్పది సంవత్సరములకును మధ్యవయసునందు, సామాన్యముగ 5 అడుగుల 5 అంగుళముల పొడవును, 140 పౌనులు మొదలు 150 పౌనులవరకు బరువును ఉండును. ఇంతకు పైన యుండెడి ప్రతి అంగుళము పొడవునకును దాదాపు 5 పౌనుల హెచ్చుబరువు ఉండును. ఆడువారలు కొంచెము తక్కువ బరువుగా నుందురు. తమ పొడవునకు మించియుండెడి బరువు ఉండినపుడును తమయొక్క నడుముకొలత ఛాతీకొలత కంటె నధికముగా నుండునపుడును, శరీరమునందు క్రొవ్వుపదార్థము అధిక మగుచున్నదనియు, స్నాయువుల యొక్కయు పటుత్వము తగ్గిపోవుటకు సూచన గన్పట్టు చున్నదనియు, తెలిసికొన వలయును. శరీరమునందు స్థూలత యెక్కువ అయినయెడల, ఆయా భాగముల కన్నిటికిని అధిక రక్తమును బంపుటకయి హృదయమునకు పని యెక్కువ అగుచున్నది. ఇందువలన హృద్రోగము జనించి ఆయాసముతో గూడిన ఊపిరియును, క్రమముదప్పి గుండె కొట్టుకొనుటయు, దటస్థించును. ఇదిగాక గుండె ప్రక్కల గాని గుండెయందే గాని క్రొవ్వు పదార్థము కూడుకొని ఆ అవయవము క్షీణదశకు వచ్చును. దీనికిని పైలక్షణములే ఉన్నత స్థితియందుండి, తలతిరుగుటయు నేర్పడును. వయసు మీరిన వారలయందు, కంటిలో ఒకవిధమగు నూతన ఆకారమును దాల్చి కంటిగ్రుడ్డు నందలి శుక్లమండలము లేక కాచబింబము అనబడు దాని అంచున మందమైనట్టియు కొంచెము తెల్లనైనట్టియు పొర గప్పియుండును. క్రొవ్వుతో గూడిన గుండెరోగము మిగుల అపాయకరముగాన యిందులకు చికిత్స జేయుటను గూర్చి అశ్రద్ధజేయరాదు. ఇట్టి రోగులు అన్ని విధములగు అమిత పరిశ్రమలను మానివేసి, తొందర గలుగునట్టిగాని ఉద్రేకమును గలుగ జేయునట్టిగాని పనులను గూడ వదలివేసి, ఆహారమును తగ్గించి, గాలివీచుచుండెడి బహిరంగస్థలములలో నియమము తప్పకుండునట్టియు సాధారణమయినట్టియు శరీరసాధకమును దీసికొన వలయును. ఒకానొకప్పుడు మెదడు యందలి రక్తనాళములలో నీ క్రొవ్వుపదార్థము వృద్ధియగుట వలన రక్తనాళము బ్రద్దలగుట యేర్పడి, మూర్ఛయు దటస్థమగును.

ఒక మనిషి విపరీతముగ లావు అగుట ప్రారంభము కాగానే ఆహారము తగ్గించుట వలనను స్థూలతను తగ్గింపవచ్చును. చక్కెర సంబంధమగు ఆహారములను త్యజింప వలయును.

ఏ భోజనపదార్థములను విశేషముగ లోనబుచ్చుకొనుట వలన స్థూలత యేర్పడుట తటస్థించుచున్నదో అట్టి భోజనపదార్థములను తగ్గింప వలయును. మాంసమునందలి క్రొవ్వు తెల్లరొట్టె, జొన్నలు, మీగడ, వెన్న, బీరు, తీపిసారాయీలు, బంగాళాదుంపలు, అన్నము, ఆరోరూట్, సగ్గుబియ్యము, చక్కెర — వీటిని మితముగా తినవలయును; పొట్టుతోగూడిన రొట్టెముక్కలు, పచ్చికూరగాయలు, ఫలములు మొదలగునవి తినవలయును. ఒక తరహా

భోజనమునుండి మరియొక తరహా భోజనమునకు క్రమముగా మార్చవలయును. ఒకే సారిగ మార్పుట మంచిదికాదు. మత్స్యపదార్థములను సంపూర్తిగా మానవలయును.

అంటిఫ్యాట్ అను పేరుగల కొన్ని మందులు అమ్మబడును. ఇవి ఉపయోగింపదగినవి కావు.

కేవలము మాంసము మాత్రమే తినుచు ఒక భోజనమునకును యింకొక భోజనమునకును మధ్యకాలమందు ఒక పైంటు ఉష్ణజలమును దినమునకు మూడునాలుగు పర్యాయములు నెమ్మదిగా పుచ్చుకొనవలయుననెడి యొక చికిత్స గలదు. తక్కిన విధములగు ఆహారపదార్థములను పూర్ణముగా వదలివేయుట ఆరోగ్యమునకు భంగకరమగును గాన నీ పద్ధతియు అంత శ్రేష్ఠముగ గనుపడదు.

లోనకు పుచ్చుకొను ద్రవపదార్థములను తగ్గించుటవలన మనిషి సన్నము కావచ్చునని యొక ఉపాయమును కొందరు చెప్పియున్నారు. శరీరమునం దేర్పడుచున్న వ్యర్థపదార్థములను దీసికొనిపోవుటకయి శరీరమునందంతటను వలసినంత ద్రవపదార్థము ఉండవలయును. ఈ నాహారమునకు, మూత్రమునందలి యూరిక్ అసిడ్ అను మూలపదార్థము కరగి ద్రవరూపమున నుండుటకును గడ్డకట్టకుండుటకును అంతకు 8000 రెట్లు జలముతో గలంగవలయును. లేనిచో నది గడ్డకట్టి మూత్రకృచ్ఛ్రముగా నేర్పడి మిగుల బాధ గలిగించును. కావున నీ పద్ధతియు అవలంబనీయముగ గనిపించదు.

---

## హిస్టీరియా.

హిస్టీరియా అనబడు నీ మెదడు సంబంధమగు అస్వస్థత సామాన్యముగ సుఖజీవనము గలవారియందును; యెల్లప్పుడును కూర్చుండి యుండుట యాలవాటు గలవారి యందును తటస్థమగుచున్నది. ఇది ఆడువారలకు సంబంధించినది మాత్రమే అయియున్నది. ఈ వ్యాధి రెండువిధములగా పరిణమించుచున్నది. (1) నరములతో సంబంధించిన కొన్ని దుర్గుణములు ముందు ప్రారంభమగును. (2) మూర్ఛగతులు తటస్థమగును.

నరములతో సంబంధించిన దుర్గుణములు యీ దిగువ నుదహరింపబడినవి:—ముఖము యెర్రవారుట, కడుపు ఉబ్బరము, వెక్కిళ్లు, గుండెలు క్రమముదప్పి కొట్టుకొనుట, శ్వాసయందు ఆయాసము గలుగుట, ఉక్కిరిబిక్కిరిచేయు క్షోభములు గలుగుట, గొంతులో ఉండ చిక్కుకొనియున్నట్లు చిత్తవృత్తి గలుగుట, కంఠధ్వని పోవుట. శరీరమునందు చాల భాగములలో నొప్పులు గలుగును తలలో మేకును గొట్టుచున్నట్టి బాధయు గలుగవచ్చును. ఎడమపార్శ్వము, కీళ్లు, స్తనాగ్రములు అస్వస్థత నొందవచ్చును ఈ వ్యాధియందు, రోగి, నిజముగాని అనేక వ్యాధులచే బాధనొందుచున్నట్లు ప్రకటించును. నిజముగా నే విధమయిన వ్యాధియు లేనప్పుడు ఈరోగి పేగులసంబంధమయినట్టిగాని గర్భాశయ సంబంధమయినట్టిగాని గొంతు సంబంధమయినట్టిగాని, వ్యాధులచే బాధనొందుచున్నట్లు మనమును కొనుటకు వీలుగనుండును. బిగిసికొనిపోవుటయు, ఒక కీలుయొక్క పక్షవాతమును, వెన్న

మూకయొక్క పోట్లు, మూత్రము బంధించుట, యివి అన్నియు నీవ్యాధియొక్క నటనగుణములైయున్నవి. ఈవ్యాధిచే బాధనొందు స్త్రీలయొక్క బాధలనుగూర్చిన వివరములు ఘోరములుగను, నిజమయిన సంగతులకు బహు అతిశయోక్తులుగను యుండును. ఒడలు ముట్టుకొనగనే యీ రోగి పెట్టున నేడ్చును; బాగుగ నొక్కినయెడల బాధ యెక్కువకాదు. అస్థలమందు నిజమయిన వ్యాధి యుండిన యెడల నొక్కిన మీదట బాధ యెక్కువ కావలసియుండును. ముఖము వాడియుండదు. ముఖమును జూచుట వలన బాధను తెలియజాలము. ముఖవైఖరి విచిత్రముగా నుండుటయు, కనురెప్పలు వాలియుండుటయు, జేసిన ప్రశ్నలకు తటాలున జవాబు చెప్పుటయు, యీరోగులకు సహజమైయున్నది. దేహముయొక్క ఉష్ణతయందేమియు మార్పు కనబడదు. ఈ అస్వస్థత నిజముగా మనసునందు పుట్టియున్నది. రోగియొక్క మనసుతో సంబంధించి నంతవరకు రోగి మొరపెట్టుకొని బాధలన్నియు నిజములయి యున్నవి. ఇది మనస్సంబంధమయిన వ్యాధి అయి యున్నది. ఈవ్యాధిచే పీడింపబడు వారు తరచుగా వ్యాధులను గల్పింప కుతూహలులై యుందురు. భోజన మక్కరలేదందురు; గాని రహస్యముగా తెప్పించుకొని తిందురు. రహస్యముగా సేవించిన ద్రవపదార్థములతాగి వాటిని యేదో యొక వ్యాధియందువలె గ్రక్కుదురు. ఈవ్యాధియందు సామాన్యముగా ఋతుస్రావము క్రమము దప్పియుండును. పేగులలో పురుగులుండినను యుండవచ్చును.

ఇతర సంబంధమగు మూర్ఛకును యీ మూర్ఛకును భేదమేమనగా, యీ మూర్ఛకు ముందుగా వెక్కి వెక్కి యేడ్చుటయు, ఆవలించుటయు, వెక్కిలియు, గొంతులో ఉండ చిక్కుకొని యుండినట్లుండుటయు, ఉక్కిరిబిక్కిరి అయినట్లుండుటయు యివి అన్నియు పుట్టును. ముఖవిలాసము స్వాభావికముగనే యుండును. ఈరోగి క్రిందపడు నెడల నజాగ్రతగా బడక సౌఖ్యమగు స్థలమును జూచుకొని అపాయము కలుగకుండ జాగ్రతగా పడును కాళ్ళు చేతులు కదలించుట యుండినను యివి పూర్ణముగా స్వాధీనము తప్పియుండవు. ఒకప్పుడు నవ్వుటయును; ఒకప్పుడు యేడ్చుటయును కూడ యుండును. మూర్ఛపిమ్మట యెక్కువైన వర్ణము లేని అధికమూత్ర విసర్జనము తరచుగా గలుగుచుండును.

## చికిత్స

మూర్ఛవచ్చినపుడు దుస్తులను వదులుచేసి, పరిశుభ్రమైన గాలివచ్చునట్లుచేసి విసరుచు, చల్లనినీళ్లనుగాని, వినిగరునుగాని, యుడికొలోనునుగాని, ముఖముపై జల్లవలయును, స్మెల్లింగుసాల్టునుగాని, పక్షి యీకెలను గాల్చి ఆ పొగనుగాని, నాసికారంధ్రమునకు జూపవలయును. పాదములను, చేతులను రుద్దవలయును. ముఖముపైనయును గుండెలమీదయును చన్నీళ్ళు పోయుటకంటె మంచిమందు లేదు. ఇది మంత్రమువలె పనిజేయును. ఈ వ్యాధిగ్రస్తులు ఒకానొకప్పుడు వేరు వ్యాధులచేతను బాధనొందు చుందురు గాన కనిపెట్టి జాగ్రతగా చికిత్స చేయవలయును. ఈవ్యాధిగ్రస్తులు మూర్ఛలను దప్పించుకొనలేక పోయినప్పటికిని, వాటినుండి కాపాడుకొనుట తమ విధియైయున్నదని రోగులకు తెలియునట్లు చెప్పవలయును. మూర్ఛలకు మధ్యకాలములయందు, శుభ్రమయిన భోజనము, మంచి గాలియు, శరీరసాధకమును, మనస్సునకు కాలక్షేపమును, విరేచనమును క్రమముగా నగుటకు తగినట్టి పనులును, చన్నీళ్ళస్నానమును, అవసరములై యున్నవి.

యితర మలినములను శుభ్రముగా గడిగివేయవలయును. ఏదైనను దీని యొక్క మాత్రము హెచ్చియుండినయెడల, దానిపైన స్వచ్ఛమయిన కార్బాలిక్ ఆసిడ్‌నుగాని, సానిటాస్, అయొడోఫారం, ఆల్కహాల్ మొదలగువానితో బోరాసిక్ లింటును ఉపయోగించి కట్టు చేయవలయును. గాయముచుట్టియుండెడి ప్రదేశము ఉబ్బియుండిన యెడలను, సెప్టిక్ గుణము పట్టియుండిన యెడలను, మిగుల వేడియగు కార్బాలిక్ వగైరా పోల్టిసుతో కట్టు చేసినయెడల, నొప్పి తగ్గి బాగుపడియును. ఈవ్యాధిచే బాధనొందు వారికి గాయములుండియున్న, వాటిని ఛేదించుటవలనను, గాయము ఉండియున్న స్థలమునందలి దుర్మాంసమును తీసివేయుట వలనను, వ్యాధి నివర్తినందినట్లు తెలియుచున్నది. ఈవ్యాధియందు రక్తముతోనికి యింజక్టు చేయుటకు "ఆంటిటాక్సిన్" తరగతుల యందు ఒకమందు కనిపెట్టబడినది. ఇది మిగుల సంతుష్టికరములగు ఫలితముల నిచ్చునట్లు తెలియుచున్నది. దీనిని మెదడునందుగాని వెన్నుపాము (సుషుమ్న) నందుగాని యింజక్టు చేయుటవలన మిగుల జయప్రదముగ బనిచేయును. ఇండియా దేశమునందు యీవ్యాధి బహు తఱుచుగ తటస్థించును గాన, యీపద్ధతిని విరివిగ నాచరణయందు బెట్టుటవలన జాల ప్రాణములను గాపాడ వచ్చును. పెద్దమోతాదులను నిర్భయముగ వాడవచ్చును. ఈవ్యాధియొక్క ఉద్రిక్తస్థితి మిగుల మారుచుండును. చాల కాలము ఉండియున్న కొలదిని కుదురుటకును యెక్కువ వీలుండును. సాధుగతులయందు శమనమును గలుగజేసెడు మందులనిచ్చుట మూలమున మాత్రమే కుదర్చవచ్చును. ఉద్రిక్త గతులయందు యీవ్యాధి అపాయకరమయి చాలవాటిలో మరణముచే తటస్థించును. నొప్పిని తగ్గించుటకును, ఈడ్పు నరికట్టుటకును, క్లోరాడీన్‌ను గాని క్లోరల్ హైడ్రేటును గాని యిచ్చును. శరీరబలమును గాపాడుటకు దగిన ద్రవపదార్థముల నిచ్చును, చురుకు పుట్టించుటకు బ్రాందీని యిచ్చుచుండవలయును. ఈపదార్థములు లోనికి బోవుటకు వీలుండుటకు ఒకప్పుడు ఒకపన్ను నూడబెరకవలసి వచ్చును. మంచుగడ్డ దొరికినయెడల, ముక్కలుగాకొట్టి ఒకసంచిలో గాని గుడ్డలో గాని మూటగట్టి, వెన్నెముకపైన నుంచవలయును.

పైన చెప్పబడిన మందులు ఉపయోగించకున్న 5 చుక్కలు క్లోరోఫారంను, 20 మినిముల టింక్చరు ఓపియంతో, ఒకఔన్సు జలములో గలిపి నాలుగు గంటలకొకసారి యియ్యవలయును. ఇదియు ఉపయోగించని యెడల, ఒక గ్రెయిను హైడ్రోక్లోరేట్ ఆఫ్ మార్ఫియాయును, 10 చుక్కలు రెక్టిఫయిడ్ స్పిరిటుయును, ఒక ఔన్సు జలములో గలిపి నాలుగు గంటలకొకసారి యియ్యవలయును

---

## పురిటిలోని ఈడ్పువాయువు.

పుట్టిన తరువాత 8 వ దినమునకు 10 వ దినమునకును మధ్య యీవ్యాధి పసిబిడ్డలకును తటస్థించుట గలదు. బొడ్డుపైన శుభ్రముగా నుంచకపోవుట, వలన నీవ్యాధి తటస్థించును. నిద్రపోకపోవుట, మూలుగుట, ఆవలించుట, అదరుట మొదలగు లక్షణములు కనుపించును. పాలు సరిగ త్రాగకపోవుట, చివరకు దవుడలు కరచుకొనిపోవుట, తటస్థించును. వ్యాధి వ్యాపించుచున్న యెడల పెద్దవారలయందు గనబడు లక్షణములే క్రమముగా గన

బడును. ఆహారమును లోని కిప్పుచుండుటయందే చికిత్స యిమిడియున్నది. ఆహారమునందు తల్లిపాలు పసిబిడ్డల శ్రేష్ఠము. దవుడలు కరచుకొని యున్నయెడల, చెంచా కాడతో గుణ్ణనుపట్టి మెల్లగా యెడము చేయవలయును. పాలలో మూడవవంతు భాగము లైంవాటరు గలిపి, జాగ్రత్తగా నియ్యవలయును. మ్రింగుటలో కష్టముగ నున్నయెడల చిన్నచెంచాలో సగముగాని, అవసరమయినచో అంతకు తక్కువనుగాని, యియ్యవలయును. ప్రతిగంటకును ఆహారమును లోన కిప్పుటకు ప్రయత్నము చేయవలయును. దినమునకు రెండుసారులు వేడి నీళ్ళతో స్నానమును చేయించవలయును. ఈ స్నానమును గాలి తగులని ప్రదేశములో చేయించవలయును. మందుగ అగ్రాగైయిను క్లోరల్ హైడ్రేటు నుయ్యు, ఒక గ్రెయిను పొటాసియం బ్రోమైడునునయ్యు అరడ్రాము జలములో గలిపి అయిదు లేక ఆరుగంటల కొకసారి యియ్యవలయును.

---

## ఉబ్బసము.

ఉబ్బస వ్యాధులయందు ఊపిరి సంబంధమగు ఆయాసము తెరలు తెరలుగా గలుగుచుండును. ఈ వ్యాధియందు కఫము గూడియుండుటయు, కఫము లేక పోవుటయు గలదు. కఫము లేనిదానికి పొడి ఉబ్బస మందురు. ఉరమ్ముయొక్క పైభాగమునందు శ్వాసనాళము (గొంతుసిర) రెండు భాగములుగ చీలి, రెండువైపుల నుండెడి శ్వాసకోశముల లోనికి, జొచ్చుచున్నవి. రెండు భాగములుగా చీలిన యీరెండు నాళములును చిన్ననాళములుగ విభజింపబడి, మరల మరల విభజింపబడుటవలన ఉపశాఖలుగ నేర్పడి; శ్వాసకోశముల యొక్క బిలములలోనికిని, అందునుండి వెలుపటికిని వాయువును గొనిపోవుచున్నవి. ఈ నాళములన్నియు గుండ్రనియయిన స్నాయు సంబంధములచే జుట్టబడియుండుటచే, నీస్నాయు బంధములు ముడుచుకొనుట వలన, నీనాళములయొక్క పరిమాణము తగ్గింపబడి, ఉబ్బసమునందలి శ్వాససంబంధమగు అస్వస్థతావస్థ గలుగుచున్నది. ఈస్నాయు బంధములు ముడుచుకొనుట రెండువిధములుగా గలుగవచ్చును. మొదటిది, దుమారము, శాకసంబంధమగు ఘాటుగల పుష్పాదులు, రసవాద సంబంధమగు ఆవిరులు, జంతు సంబంధమగు ప్రసరణములు, శీతోష్ణస్థితి సంబంధమగు ప్రబలతలు—వీటి కారణమున స్నాయుబంధములు సరాసరిగ ముడుచుకొనజేయబడును. రెండవది, కోపము భయము మొదలగు మనోవికారములు, మలబంధము, బలమగు, రాత్రిభోజనములు; కడుపు ఉబ్బరము, యితర విధములగు అజీర్తివ్యాధి, కీళ్ళనొప్పులతో గూడిన శరీర తత్వము, క్రొవ్వుచెందిన గుండెకాయ, వంశపారంపర్యముగా నుండెడి యీస్థితి—వీటి కారణమున స్నాయు బంధములు వేఱుమార్గముగ ముడుచుకొనజేయబడును. కొందరు మనుష్యులు ఉబ్బసవ్యాధికి తేలికగా లోనగుదురు. ఇట్టివారు సన్నగానుండి గుండ్రని భుజములు గలవారై వికారముతో గూడిన ముఖవైఖరి గలిగి కంఠలోతునకుపోయి ఎలుగురాని గొంతుధ్వని గలిగి స్వభావసిద్ధముగా కొద్దిదగ్గును గలిగి యుందురు.

ఈ వ్యాధియొక్క తెర సామాన్యముగ రాత్రులయందు వచ్చును. సాధారణముగ రాత్రి 2 గంటలకును 4 గంటలకును మధ్యగా వచ్చును; రాత్రులయందు శరీరమునందలి

రక్తప్రచారము మాంద్యమును వహించి యుండుటవలన రక్తము నూరుకొని యుండుట తటస్థించి, ఊపిరియందలి యిట్టి అస్వస్థతకు దోడ్పాటును గలుగజేయును. అయితే, తెర వచ్చుటకు ముందుగా సామాన్యముగ నీరసము, కడుపు ఉబ్బరము, తలనొప్పి, కన్నులు బరువుగా నుండుట, వాంతివచ్చినట్లుండుట, విశేషమయిన మూత్రము, నిద్రపట్టక పోవుట, గుండె కాయయొద్ద యొకవిధమగు బరువు — యివియన్నియును గనబడును. ఒకప్పుడు, వేడిమియు లేక అకస్మాత్తుగా నాయాసము వచ్చుటయు గలదు. ఈవ్యాధి యొక్క తీవ్రత స్థితియందు ఊపిరిని పీల్చుట మిగుల ఆయాసముచే మూలుగుట కూడ సంభవించును. ముఖము కమిలినట్లుగాని నీలవర్ణము గాని యుండి, కండ్లు పొడుచుకొని వచ్చినట్లు గానుండి, శరీర మంతయు చెమటతో నిండి యుండును. ఈ తెర కొన్ని నిమిషములు గాని లేక కొన్ని గంటలు గాని నిల్చియుండును. తగ్గుచున్నపుడు మందమయిన కఫము గాని తెమడ గాని పడునదును; అధికమగు వివర్ణమయిన మూత్రవిసర్జనము గలుగును. ఈవ్యాధి తీవ్రతస్థితియందు లేనప్పుడు రోగి తగుజాగ్రత్త తీసికొనుచుండినయెడల ఆరోగ్యస్థితియందు నుండవచ్చును.

## చికిత్స.

ఈవ్యాధియందు తెరవచ్చినపుడు రోగి కూర్చుండవలయును. ఆయాసము విశేషముగా నున్నపుడు చేతులుగల కుర్చీలో కూర్చుండి ముందుగా నొక బల్లపైన దిండువేసి ఆదిండు పైన మోచేతులను ఆనుకొని యుండవలయును. వెన్నెముక వెంబడి సోప్ లినిమెంటు తోడను ఓపియం లినిమెంటు తోడను రుద్దవలయును. ఎదురొమ్మునుండి చేతులకువచ్చెడి పెద్ద రక్తనాళములను బాటనవేళ్ళతో నొక్కిపట్టినయెడల ఊపిరియందలి ఆయాసము తగ్గును. రక్తపుష్టిగల మనుష్యులకు ఒక ఔన్సు జలములో 20 చుక్కల వైనం ఇపికాకొను ఇయ్యవలయును. బలహీనులకు టింక్చర్ క్యాంఫర్ గాని యథవా స్పిరిట్సు అమ్మోనియా అరొమెటిక్ యైనను యిచ్చుట మిగుల నుపయోగకారిగ నుండును. అజీర్ణమయినగాని, అలవ్యమైనగాని, భోజనమును జేసిన పిమ్మట తెర వచ్చినయెడల, మస్టర్డు వాంతికారి నుపయోగింపవలయును. మలబద్ధమునకు పిమ్మట తటస్థించినయెడల, సోడా సల్ఫేటు నీయవలయును. ఒక అరఔన్సు బ్రాందీని నీళ్ళతో గలిపి యిచ్చినయెడల ఒకప్పుడు ఉపశాంతి నిచ్చును. మరియొకప్పుడు ఘాటయిన కాఫీని చక్కెర పాలు లేకుండ నిచ్చినయెడల నెమ్మదించును. ఓపియం, బెల్లడోనా, పొటాసియం అయొడైడ్, టింక్చర్ లోబెలియా ఈథరిస్ — ఇవియు వాడనగును. ఆయాసమును తగ్గించుటయందు నైట్రోగ్లిసరీన్ బాగుగ పనిచేయును. ఇది టేబ్లాయిడ్ (బిళ్ళ) రూపముగ అమ్మును. దీనిని ఉపయోగింపనగును. రసభస్మమును విరేచనకారిగ నిచ్చిన, యొకప్పుడు మేలు గలుగ వచ్చును. క్లోరోఫారంను బహుజాగ్రతతో వాసన జూచుటవలన తచ్ఛాంతిని గలుగజేయును. 10 గ్రెయినుల ఆలం (పటిక) పొడిని నాలుకపై నుంచినచో నొకప్పుడు ఉద్రేకము నణచవచ్చును. 20 గ్రెయినుల క్లోరల్ హైడ్రేట్ నిచ్చినను ఒకప్పుడు గుణము నిచ్చును. కాని దీనిని బహుజాగ్రతతో నీయవలయును. ఒకటి తరువాత నొకటిని వీటినన్నిటిని వాడి చూచినయెడల యేదైన ఒకటి ఉపశాంతి గలుగ జేయకమానదు. వైద్యుడు తన బుద్ధివివేచన నుపయోగించి వీటిని వాడవలయును. తెర పూర్తిగా తగ్గనపుడు, నల్లఉమ్మెత్త ఆకుల పొడితో చుట్టనుజుట్టి గాల్చుట మిగుల ఉపయోగ

ముగ నూనెపూయును. ఈ సంబంధమగు చుట్టలు కెమిస్టు షాపులయందు దొరకును. దీనికే స్ట్రమోనియం అని పేరు.

ఉబ్బసవ్యాధి పీడితులు, యీవ్యాధి ఉద్రిక్త స్థితియందు లేనప్పుడు క్వినీన్, ఐరన్ (లోహము), స్ట్రిక్నిన్ (ముష్టి), ఆర్సెనిక్ (పాషాణము), బలవర్ధక ఔషధములను పుచ్చుకొనవలెయును. పొటాస్ అయొడైడున్నూ, ఆర్సెనిక్ యున్ను చాలకాలము సేవించినయెడల వ్యాధి అంతరించి పోవచ్చును.

—:—

## ఉబ్బసము జ్వరము.

వాయువునందు తేలి సంచరించుచుండెడి ఒక విధమగు అణువులు, ఒకవిధమగు శరీరతత్వముగల కొందరి జనులయొక్క నాసికా బిలములందు ప్రవేశించినప్పుడు, జలుబును, తుమ్ములను [illegible] శ్వాసమును అంకురించును.

ఈవ్యాధి పొడసింపజేయు స్థలమును మార్చుటవలన ముఖ్యముగ నీవ్యాధి కుదురును. స్థలమును విడిచివెళ్ళుటకు వీలులేకపోయినయెడల [illegible] నీయవలెయును. ఒక ఔన్సు జలములో రెండుగ్రెయినుల క్వినీను కలిపి, యిందులో 2 డ్రాములను నాసికారంధ్రములలో దినమునకు రెండుమారులు పిచికారీ చేయవలెయును. అజీర్ణమగు పదార్థములను భుజింపకూడదు. చలిగాలి శరీరమునకు సోకకుండ వెచ్చన కలుగజేయు వస్త్రములను ధరింపవలెయును. అలసటను జెందకుండ బహిఃప్రదేశమునందు శరీర సాధకమును పుచ్చుకొనవలెయును. కీళ్లనొప్పులతో గూడిన శరీరతత్వముయి యుండినయెడల భోజనమునుగూర్చి మిగుల ముఖ్యముగ జాగ్రతను పుచ్చుకొనవలయును.

## ఉమ్మి ఊరుట.

మనము భుజించెడి ఆహారపదార్థములయందలి "స్టార్చ్" సంబంధమగునవి చక్కెరగా మార్చబడి శరీరమునందలి రక్తములో కలియుటకు వీలగునట్లు చేయుటకు నోటియందలి మాంసగ్రంథులు, ఉమ్మియనబడు ఒకవిధమగు ద్రవమును స్రవింప జేయుచున్నవి. వ్యాధియందు యీస్రావము తక్కువ కావచ్చును; లేక యెక్కువయు కావచ్చును. తక్కువ అయినపుడు నోరు ఆరుదల నందియుండును. ఎక్కువ అయినప్పుడు యీస్రావము నోరు అంతయు నిండి కారును. నోటియొక్క వాపుదలయందును, జ్వరమునందును, బెలడోనా యొక్కయు, స్ట్రమోనియం (ఉమ్మెత్త) యొక్కయు, విషప్రయోగములయందును, శరీరమునుండి విశేషముగా నీరు స్రవించునపుడు అనగా యెక్కువ చెమటపట్టినపుడును, లేక, అతిమూత్రవ్యాధియందును, దీర్ఘకాలము విరేచనములగుచుండుటయందును — యీ ఉమ్మి ఊరుట తగ్గియుండును.

నోటియొక్క వాపుదలయందు బోరాక్సు (వెలిగారము)ను గ్లిసరీనుతో కలిపి రాయవలెయును; లేక గోరువెచ్చనీళ్ళు, త్రాగకుండ, పుక్కిలించి విడువవలెయును. అతిమూత్రవ్యాధియందు మూత్రముగుండ వెలుపడు చక్కెర తగ్గినపుడు యీ అస్వస్థత తగ్గును; అను

కోశ సంబంధమగు అస్వస్థత యుండినయెడల దానిని బాగుచేసిన పిమ్మట యీ ఉబ్బు ఊరుటయొక్క తగ్గుదల పోవును.

జలుబు చేయుట మూలమునను, నీరసత్వము, అజీర్తి, పంటిపోటువచ్చుట, పాదరసము అయొడిన్ పొటాషు మొదలగు వాటివలనను — యీ మాంస గ్రంథులు ఉబ్బి నిశేషముగ స్రవించును. ఒకానొకప్పుడు మనోద్రేకములవలనను, బాధలవలనను, గర్భమును దాల్చియున్నప్పుడును, వెఱ్ఱితనమునందును యిట్లు కలుగును. రసప్రయోగము వల్లనైనయెడల నాలుకయును దవుడలును పండ్లవలన నొక్కులువడి పుండ్లు అగును. రసఫలితముగ నీ ఉబ్బు ఊరుట దటస్థించినయెడల పది మొదలు పదునైదు దినములవరకును నిలచియుండును; ఒకానొకప్పుడు యెక్కువ కాలము వ్యాపించి పుండ్లు నెమ్మదిగా బాగగుటయు గలదు. పటిక నీళ్ళను పుక్కిలించి వేయవలయును. లేదా, పోర్టువయినును జలమును సమభాగములుగ గలిపి పుక్కిలించి వేయవలయును. రోగియొక్క బలమును, ద్రవపదార్థములను తేలికగా జీర్ణమగునట్టి ఆహారములను లోన కిచ్చుటవలన, బాగుపడవలయును. నీరసత్వమువలన అధికముగ ఉబ్బుఊరుట దటస్థించినయెడల, క్వినీన్, ఐరన్, గలిపిన బలవర్ధకౌషధములు, లోనికిచ్చుట మంచిది; నోటియందలి పుండ్లకు, మూడు గ్రాములు పటికపొడిని ఒక ఔన్సు జలములో గలిపి పుండ్లు నద్దవలయును. లేదా, యేదయిన ఈకతో వినిగర్ నయినను అద్దవలయును. పాదరసము, అయొడిన్ వలనగాక యితర కారణముల వలన అయినయెడల దినమునకు మూడు పార్లు టింక్చరు బెలడోనాను 10 మినిముల చొప్పున నియ్యవలయును. రస సంబంధములగు వాటిని దినుటవలన దటస్థించినయెడల వాటిని నిలుపు చేయవలయును.

---

## ఋతు స్రావము.

స్త్రీలు ఋతుస్రావకాలమందు చలిగాలి సోకకుండునటులను, వాయువు నందలి ఆకస్మికపు శీతోష్ణమార్పులకు దగులకుండునటులను, అతిశయమగు పరిశ్రమలకు లోను గాకుండునటులను బహుజాగ్రతగా నుండవలయును. ఇందు సంబంధమగు వ్యాధులు యీ క్రింద వివరింపబడియున్నవి.

### 1. అమెనోరియా (ఋతుస్రావముయొక్క క్షీణత లేక నిలుపుదల).

స్త్రీలకు ఋతుస్రావమేర్పడుట ఇండియా దేశమునందు సామాన్యముగ పదమూడవ సంవత్సరమునందు ప్రారంభమయి నలుబదియైదవ సంవత్సరమునందు నిలిచి పోవుచున్నది. ఈ క్రింది సందర్భములయందు ఋతుస్రావము నిలిచిపోవచ్చును. (1) గర్భకాలమునందును స్తన్యమునిచ్చు కాలమునందును సాధారణముగ నిది నిలిచిపోవును. (2) యుక్తవయసునందు గనపడక నిలచిపోవచ్చును. (3) ఋతుస్రావము కొంతకాలము వచ్చినను అంతట నిలిచి పోవచ్చును. (4) గర్భాశయముయొక్క వ్యాధియందును, గర్భాశయము నందలి యేదియో పదార్థ అటంకమువలనను, స్రావము కనుపడక పోవచ్చును. (5) వయసు చెల్లినపుడు నిలిచిపోవచ్చును. లేదా పాండురోగముయొక్క ఫలితముగ సంభవించినను సంభవింపవచ్చును.

పోవుటవలనను, మఱియు కొంతకాలము వరకును ఏదే చిన్న కారణమైనను దానికాటంకము గలుగజేయుట వలనను, ఇట్లు కలుగుచున్నది. తడిలో దిరుగుటవలనను, తడినేలమీద గూర్చుండుటవలనను, గాలి యుధృతముగా వీచుచున్నపుడు దేనునుగా నిలబడి యుండుట వలనను, అధిక మనఃపరితాపము వలనను — ఋతుస్రావము నిలుపు కావచ్చును. ఈ ఋతుస్రావము పైకారణములలో దేనివలనయైనను నిలుపు కాబడినప్పుడు, తలనొప్పి, బలహీనత, పేగులలో యడుగు భాగమునందు నొప్పి—యివి అన్నియు సామాన్యముగా సంభవించును.

క్షయ మొదలగు కొన్ని వ్యాధులయందు ఋతుస్రావము నిలచిపోవుట తటస్థించును గాని, అట్టివి అందులయందు పయిన వివరింపబడిన లక్షణములను గలిగియుండవు. ఇతర వ్యాధులు ఉండుట తటస్థించి వాటి లక్షణములు కనుపట్టుచుండిన యెడల, వాటికి చికిత్స చేయుటవలన నీవ్యాధియు కుదిరిక నందగలదు.

నాల్గవది:—గర్భాశయమునందు ఏదైన నష్టముండుట వలనగాని, లేక గర్భాశయము యొక్క అస్వస్థతవలనగాని స్రావము గలుగకపోవుట గలదు. అట్టి నష్టము గల స్త్రీల యందును, అస్వస్థత పెద్దవారలయందును గలుగును. పైన వివరింపబడిన చికిత్సలు యుపయోగింపబడినయెడల సిగ్గుపడుటచే నస్వస్థతను దెలుపకుండ ... యుండుకొనవలయును. ఇట్టివాటికి ఔషధములు నిష్ప్రయోజనములు గాన, ... మాత్రమే సేవించుచుండుట వలన, హానియే కలుగగలదు.

అయిదవది—వృద్ధవయస్సునందు ఋతుస్రావము నిలుపుదలగుట సహజముగ నుండి యున్నది. ఇది సుమారు నలుబదియైదవ సంవత్సరమునందు తటస్థించును. ఈ అవస్థయందు స్త్రీలకు జబ్బుచేయుటయు, కలదు. గుండెరోగము ననుసరించి మూర్ఛలు వచ్చుటయు, కాళ్ళు వాచుటయు, రాత్రిలు చెమటలు పట్టుటయు, ఒంటిపై దద్దులు కలుగుటయు, ముక్కువెంబడి రక్తము గారుటయు, మూలశంక ప్రవేశించుటయు వీటిలో నేదైనను గలుగవచ్చును. హిస్టీరియా వ్యాధికూడ ప్రవేశింపవచ్చును. మూత్రవిసర్జనావసరము యెక్కువగా నుండును. కొంచెము పనిచేసిన పిమ్మటగాని, తుమ్మినపుడుగాని, దగ్గినప్పుడుగాని మూత్రమును నిలిపియుంచుటకశక్తతవలన కొద్దిగా వెలువడుచుండుటయు కొందరకు సంభవించును. కోపము అధికము కావచ్చును. ఇతర కారణము లేమియు లేకుండినపుడు, వృద్ధవయస్సునందలి అవస్థయేయని దలపవచ్చును. విరేచనము క్రమముగ జరుగుటకు శ్రద్ధ తీసికొనవలయును. మిక్కిలి కుపిక్కుచియున్న వారలకు సిట్రేట్ ఆఫ్ మెగ్నీసియా యును టింక్చర్ ఆఫ్ జింజర్ యును యియ్యవలయును.

## 2. డిస్‌మెనోరియా. (ఋతుస్రావమునందు నొప్పిగలుగుట)

ఈవ్యాధి ఇండియా దేశమునందు మిక్కుటముగా యుండి, గర్భాశయ సమీపమున రక్తముకూడుకొని యుండుటను సూచించుచున్నది. పేగులయొక్క అడుగు భాగమునందు నొప్పి అధికముగా నుండును. నొప్పి తీవ్రతమముగానుండి పొత్తి ... మముండుట వలన, రోగి కడుపునొప్పిచే బాధనొందుటేగాక, దొర్లుటయు తటస్థించును. రోగి, హిస్టీరియా వ్యా

వలయును. నీరసస్థితియందుండిన యెడల, భోజనపదార్థముల నెక్కువ ఓరిమిగ నియ్యవచ్చును మిగుల ఉద్రుత స్థితియందుండిన నేతప్ప, నిస్త్రాణను నిలుపుచేయుటకు బ్రాందీ మొదలగు పదార్థముల నియ్యకూడదు. ఏలననగా, బ్రాందీ నిచ్చుటవలన రక్తప్రచార మధికమయి స్రావమును అధికము చేయును. పరుండి విశ్రాంతి దీసికొనుటవలననే నిస్త్రాణ తగ్గును. లోపలికి దీసికొను ప్రతివస్తువు కాదు. చల్లగా నుండవలయును. స్రావమగుచున్నపుడు వేడిపదార్థములను బుచ్చుకొనినయెడల రక్తప్రచారము నధికము చేసి, స్రావము అధికమగునటుల జేయును. విషవాయుసంబంధమగు వ్యాధియుండిననే తప్ప క్వినీన్ ను ఉపయోగింప గూడదు. కాజము అస్వస్థతయందుండి, విరేచన బద్ధమును గలుగును. విరేచనబద్ధమునకు, దార్ఢ్యశరీరులైనయెడల సల్ఫేట్ ఆఫ్ సోడాయును, బలహీనులైనయెడల చిట్లాముదమును యియ్యవలయును. కదలుటవలన స్రావము తిరిగి కాకుండినయెడల, రోగి గాలిలో కొద్దిగా తిరుగుటకు నారంభింపవచ్చును. మధ్యకాలమునందు పరుండుగదిలోనికి పరిశుభ్రమయిన గాలియు, వెలుతురును, వచ్చుచుండునట్లు జాగ్రత్త పడవలయును. పరుండు స్థలము మెత్తగానుండక గట్టిగా నుండవలయును. కట్టుబట్టలు బిగువుగా నుండక నుండవలయును. విరేచనబద్ధము లేకుండ కాల విరేచన మగుచుండునటుల జాగ్రత్తపడవలయును.

## (4) లుకోరియా (ఋతుస్రావము తెలుపు వర్ణముగ నుండుట).

ఈ వ్యాధియందు రహస్యస్థలమునుండి తెల్లనైనట్టియు కొంచెము పసుపువర్ణము గలిగినట్టియు, ద్రవపదార్థము స్రవించుచుండును. ప్రతిదినము కొన్ని ఔన్సుల పరిమాణము పరిమాణము ద్రవవస్తు మగుచుండును. ఇది యొకానొకప్పుడు కోడిగుడ్డు సొనవలె నుండును. అజీర్ణత ప్రారంభించి విరేచనబద్ధము ఉండును. గుండెదడయును, తలతిరుగుట, నిస్త్రాణ నరములు నొప్పులు, కడుపు ఉబ్బరము, వెన్నునొప్పి, శరీరము తెల్లబారుట, హిస్టీరియా లక్షణములు — వీటి అన్నిటితో నొకానొకప్పుడు కలిసియుండును.

రక్తహీనత, తరచుగ ఋతుస్రావమగుట, గర్భాశయముయొక్క వాపుదల లేక తొలగియుండుట, తరుచుగ పిల్లల గనుట, శరీరసాధకము లేకపోవుట, సుఖమారంజీవనము, శరీరముయొక్క బలహీనతకు కారణములగు నితరపనులు, యీవ్యాధికి కారణములగుచున్నవి.

### చికిత్స

ఋతుస్రావము నందలి అస్వస్థతకు దగుచికిత్స చేయవలయును. గర్భాశయముయొక్క వ్యాధి యున్నట్టయుండినయెడల అందులకగు సాధకమును చేయవలయును. ఇట్టి కారణము లేమియు గానక, శరీరమునందలి బలహీనత ననుసరించి యీవ్యాధి యేర్పడినదని నమ్మకము కలిగినయెడల, ఆరోగ్యమునకు వలయు పనులను చేయుటయు, ఆహారమునుగూర్చియు, రోగుల యొక్క స్వస్థతనుగూర్చియు క్రమముగ నుపాయములను చేసి, సరియగు శరీరసాధకమును నతుకూడ దగు యేర్పాటులనుచేసి, స్థలమును మార్చుటకు వీలయినచో నట్లు చేయవలయును రోగి గర్భిణిని దాల్చియున్నప్పుడు తప్ప పిచ్చికారీ స్నానము చేయుటయు, అధమపక్షమును వెన్నెముకకు చన్నీళ్లు పోయుట యయినను, చేయవలయును. స్రావమును నిలుపు చేయుటయు పటికనీళ్ళ లోపలను ఔషధయోగమును పిచికారీ చేయవలయును. పటికనీళ్ళు

ఉపయోగించకపోయిన యెడల యీ క్రింది ఔషధయోగ ప్రకారము లోషనుగా జే
పిచికారీ చేయవలయును.

సల్ఫేట్ ఆఫ్ జింక్ — గ్రె॥ 20
టింక్చర్ ఆఫ్ ఓపియం — మి॥ 30
గోరువెచ్చనినీళ్ళు — ఔన్సులు 8

లోపల ఐరను లవణములు; మినరల్ ఆసిడ్సు; శాకసంబంధమగు బలవర్ధక ఔషధములు యియ్యవలయును.

## ఎండదెబ్బ

ఎండదెబ్బవలన గలిగెడు వ్యాధి మూడువిధములుగ నున్నది. (1) నిస్త్రాణ శక్త మూర్ఛ (2) అంగవికృతిరోగము (3) ఎండవలని జ్వరము (తాపజ్వరము.)

అధిక సూర్యాతపమువలన మెదడుయందు గలిగెడి అస్వస్థతవలన నీ వ్యాధులు సంభవించుచున్నవి. అధికమగు యెండలో దిరుగుటవలనను, యీవ్యాధి రావచ్చును. లేక నీడను ఉండినను, ఎండవేడిమి వలన వాయువునందు గలిగెడి తీక్ష్ణతవలనను, యీవ్యాధి తటస్థింపవచ్చును. ఈ వ్యాధివచ్చుటకు యీ క్రింది కారణములు సహాయము చేయవచ్చును.—అలసట, మనోద్రేకము, మనోవిచారము, జనసమ్మర్దమగు గృహములలో నివసించుట, పరిశుభ్రమైన గాలి వెలుతురు రాని యిండ్లనుండుట, సరియైన నీటివసతి లేకపోవుట, మలబద్ధము, మత్తుద్రవముల నపరిమితముగా త్రాగుట.

### లక్షణములు.

ఎండదెబ్బవలన నీ వ్యాధి సంభవించుటకు పూర్వము రోగికి కోపము అధికమగుట తాపము జనించుట, తలనొప్పిగలుగుట—యీ లక్షణములు గనుపట్టును. ఆకలి మందగించి మలబద్ధముతోగూడి, వాంతివచ్చునట్లుండుటయు గలదు. చర్మము ఎర్రగ నుండుటయు, చర్మము వేడిగను పొడిగను నుండుటయు, కొద్దిగా తలతిరుగుటయు, కొద్దిగా మూత్రము విసర్జించుచుండినను తరుచుగా మూత్రమును విడుచుటకు యిచ్ఛగలిగి యుండుటయు — గలుగ వచ్చును. భావములయందు భ్రమగలుగుటయు, దృష్టియందును భ్రమగలుగుటయు, ఎక్కువగా మాట్లాడుటయు, తెరలు తెరలుగా నవ్వుటయు, యేడ్చుటయు తటస్థింపవచ్చును. ఈ లక్షణములు వ్యాధి పూర్తిగ పరిణమించకపూర్వము కొన్ని గంటలకుగాని కొన్నినిమిషములకుగాని, కనుపడినను కనుపడవచ్చును. లేదా; లేకపోవచ్చును, అధిక ఆతపమునకు లోనయిన జనులయందు వైలక్షణము లేమయిన గనుపడిన యెడల, యీ క్రింది ఉపచారములను వెంటనే జేయవలయును.—గాలి బాగుగా తగులునట్లు చేయుట, శిరస్సు (బుఱ్ఱ) [illegible] చల్లగా నుండునట్లు చేయుట, చల్లనినీళ్ళు మిక్కుటముగ త్రాగునట్లు చేయుట, ఐసుముక్కలను తడిగుడ్డతో గుడుపుట, వీలయితే స్నానము చేయించుట.

విరేచనమగుటకు సాధనము చేయుట సామాన్యముగ నవసరమయి యుండును. రెండుపెద్ద చెమ్చాలతో సిట్రేట్ ఆఫ్ మెగ్నీసియాను ఒక అర్ధటంబ్లరు నీళ్ళలో గలిపి ప్రతి రెండుగంటలకు నియ్యవలయును.

## (1) నిస్త్రాణ లేక మూర్ఛ.

పైన చెప్పబడిన లక్షణములు ఒకానొకప్పుడు ఉండియు ఒకానొకప్పుడు లేకయు— నిస్త్రాణ; తలతిరుగుట; వణకుట; కాళ్లు చేతులు చల్లబడుట; తెలియక మూత్ర విసర్జనము చేయ నిచ్ఛగలిగి యుండుట; ఒకానొకప్పుడు మత్తుగ పడియుండుట; యీ గుణములతో మూర్ఛ ప్రారంభమగును. ముఖము పాలిపోయి శరీరముయొక్క ఉపరి భాగమంతయు చల్లగానుండి తేమగ చెమటతో పడిసియుండును. ఊపిరి ఆయాసముతోనుండి, గుండెయొక్కయు నాడియొక్కయు నడక బలహీనతను వహించి, కనుగ్రుడ్లు విస్తరింప జేయబడి, కొంచెమిచ్చు తక్కువగ స్మారకము తప్పియుండును

## (2) అంగవిక్రుతి రోగము.

పైన చెప్పబడిన నిస్త్రాణ లేక మూర్ఛస్థితినుండి కొద్దినిమిషములకే గాని లేక కొద్ది గంటలకు గాని ఉన్మత్తస్థితిని జెందిన అంగవిక్రుతిరోగ మేర్పడవచ్చును. ఇందులకు యీ దిగువ క్రొత్త లక్షణము లేర్పడును — ముఖము యెర్రబారుట; శరీరమంతయును తలయును వేడియెక్కుట; కండ్లు రక్తపూరితములగుట, నాడి బలమైనట్టియు త్వరగ నడక గలిగినట్టియు నడకను గలిగి యుండుట, గురకతో కూడినట్లు గాని, కిర్రుమనుచప్పుడు ధ్వనినిచ్చునట్లు గాని, అసంపూర్తియైనట్లు గాని, ఊపిరిని గలిగి శ్వాసకోశములు అస్వస్థత నందియున్నట్లు తెలియ జేయుట.
కొద్దికాలములోనే స్మారకము తప్పిపోయి అవయవములు కొంకరలు బోవుటయు దటస్థించును. ఇట్టి సందర్భములలో రోగి పడిపోవును. ఒకానొకప్పుడు కాళ్ళు చేతులు యీడ్చుకొనుచు యుండును గాని, సామాన్యముగ నిక కదలుట తటస్థించదు. ఈవ్యాధి ఒకానొకప్పుడు తలకు వ్యాపించుట చేతను, రెండు దినములుగ పరిణమించి, మరణమును దటస్థింప జేయును.

## చికిత్స.

వ్యాధి యేగతియందుండి యున్నదియు ముందుగ గమనింపవలయును. రోగి నిస్త్రాణజెంది, తలదిరుగుచు, వణకుచు, చల్లగనుండినయెడల, వీపుపై బరుండబెట్టి, కాళ్ళకు చేతులను రుద్ది దుస్తులను వదులుజేసి, కొంచెము బ్రాందియును కొంచెము జలమును గలిపి యియ్యవలయును. ఈ స్థితినుండి ఉన్మత్తస్థితిలోనికి మారుచుండుట బహుజాగ్రతగా గనిపెట్టి పని చేయవలయును. ముఖము యెర్రబారుట, శరీర వేడిమి హెచ్చుట, కండ్లు రక్తపూరితములై యుండుట, నాడియొక్క చురుకుదనము హెచ్చుట — యీ లక్షణములు కనుపడినయెడల బ్రాందినిచ్చుట నిలిపివేసి, తలపైన చల్లనినీళ్ళు పోయుచు, చుట్టుపట్ల గాలియంతయు చల్లనగునట్టుల విసరవలయును. రోగి మింగ గలిగినయెడల, ఒక ఔన్సు సోడాసల్ఫేటును మూడు ఔన్సుల జలములో గలిపి వెంటనే విరేచన మగునట్లు, ముందుగా నీయవలయును. 8 లేక 10 గ్రెయినుల క్వినైనును టీతో గలిపిగాని లేక విడిగా గాని యియ్యవలయును. కాళ్లను చేతులను రుద్దవలయును. మస్టర్డు (ఆవ) పిండిని మెడమీద పట్టిగా వేయవలయును. రోగిని వేడినీళ్లలో స్నానమును చేయించవచ్చును.

క్రిమము దప్పినట్టియు ధ్వనితో గూడినట్టియు ఆయాసము స్వల్పము అసంపూర్తి యయినట్టియు, ఊపిరితో గూడియుండుట వలన శ్వాసకోశములు అస్వస్థత జెందియున్నట్లు తెలియబడినచో ఎదురొమ్ముపైన పెద్దమస్టర్డు పట్టిని వేయవలయును. తలయును ఎదురొమ్మును గూడ నస్వస్థత నందుట సామాన్యముగ తటస్థించుచుండును; ఇట్లు రోగము నస్వస్థత జెందియున్నట్లు దోచినయెడల మెడమీదను ఎదురొమ్ముమీదను గూడ మస్టర్డు పట్టలను వేయవలయును.

అన్నిసంగతుల యందును రోగి చల్లనిగాలి వచ్చునట్లుగ గాలిగొనుచుండ వలయును ఇట్లు చేయుటవలన చెమట అధికమగుటయేగాక శరీరమునకు చల్లదనమును గూడ నిచ్చును.

రోగి ఆదివరకు మూత్రసంబంధమగు వ్యాధులచే పీడింపబడి యుండనిచో పొటాసియం అయొడైడ్‌ను సాధ్యమయినంత త్వరలో నియ్యవలయును. దీనివలన రోగము వలన మెదడునందలి రక్తనాళములు వ్యాకోచమునుండి తగ్గి రోగి స్వస్థత నందుటకు తోడ్పడును. పొటాసియం అయొడైడ్‌ను యిచ్చుట వలన నీళ్ల విరేచనము కలుగును.

ఈ వ్యాధినుండి స్వస్థతనందుట బహు శీఘ్రముగ గలిగినప్పటికిని, సామాన్యముగ జ్వరమును, ఆయాసముతో గూడిన ఊపిరిని బిల్చుటయును, కొన్ని దినములవరకు స్వల్పముగాను తలనొప్పి; విరేచనములు; యొకానొకప్పుడు పక్షవాతమును గూడ గలుగును. కొన్నిప్పుడు మెదడు చెడి వెఱ్ఱితనము బుట్టవచ్చును. పూర్తియయిన స్వస్థతను జెందియున్నప్పటికిని యీ రోగి యికమీదెన్నడును ఎండదెబ్బకు నిలువ జాలడు.

ఎండదెబ్బ సంబంధమగు అన్ని వ్యాధుల యందును త్వరితముగ బనిచేయు విరేచనకారి నిచ్చుట మిగుల ముఖ్యముగాన యీ విషయమును గమనించవలయును.

## (౩) ఎండదెబ్బవలన జ్వరము (తాపజ్వరము.)

ఎండదెబ్బవలన జ్వరము యొకానొకప్పుడు కొద్దిగ రావచ్చును; మరియొకప్పుడు మిగుల తీవ్రముగ రావచ్చును. దినమునందు బనిచేయుటలో సూర్యాతపమునకు లోబడిన చాల జనులు రాత్రియందు జ్వరతీవ్రత బొంది, అనుమకుగురించి దుఃఖము చెందుచుందురు. కొన్నిగంటలలో నది అంతరించిపోవును. లేక రాత్రియంతయు నిద్రపట్టక; అతివిరేచనములు తటస్థించినను తటస్థింపవచ్చును. ఇదియే నిస్త్రాణ బలహీనత అతిశీతలమగునప్పుడు మొదలగువాటిలో బెట్టి జ్వరమును బుట్టింపవచ్చును. ఇది యిరువదినాలుగు గంటలలో తగ్గకను తగ్గవచ్చును. లేక తాపజ్వరముక్రింద బెట్టవచ్చును. ఈవ్యాధియొక్క ప్రారంభమునకు ముందు కొంచెము చలి పుట్టినను బుట్టవచ్చును. శరీరముయొక్క వేడిమి అధికముగ హెచ్చి, దాహమతిశయమును, నాలుక పిడచగట్టి యెండిపోయి అదురులనుండి; నాడి బలముగాను, బహు చురుకుగాను ఉండును. ఈవ్యాధి అరువది గంటలవరకు వ్యాపించును. ఈలోగా కుదురక పోయిన యెడల, స్మారకముదప్పి మరణము సంభవించును. శరీరముయొక్క వేడిమి 108 డిగ్రీలవరకు వ్యాపించును. ఒకానొకప్పుడు 108 డిగ్రీలుకూడ దాటి 112 డిగ్రీలవరకు పెరుగనుండవచ్చును. తక్షణమే అతిచల్లని నీళ్ళలో స్నానము చేయించినచో దప్పు యొక అరగంటలో పున ప్రాణముపోవుట తటస్థించును.

-ని వాడవలయును. పొటాస్ నైట్రోగ్లిసరీన్ అంత పనిచేయదు. అమిల్ నైట్రైటును వాసన జూచుటవలన బాధకు వెంటనే ఉపశాంతికలుగును. కడుపు ఉబ్బరము ఉండియుండిన యెడల కార్మినేటివ్ మిక్స్చర్ నీయవలయును. ఉష్ణజలము పోసియున్న సీసాలను శిరస్సాలంవేసి హృదయభాగమందు యందు మెత్తైన పాదములమీద చేతుల మీద కాచుట మంచిది. తెరరా వేగమే బ్రాంధీని నీళ్లతో గలిపియిచ్చి ఆజీర్ణరోగమయిన సందిచినరుదల అందులకగు ఔషధసేవ జేయవలయును.

## ఏనుగుకాలు.

కొందరకు కాలు మిక్కుటముగ వాచి ఏనుగుయొక్క కాలువలె యుండుటవలన నీ వ్యాధికి ఏనుగుకాలు అనివాడుదురు చేతికికూడ నిదేవిధమగు వ్యాధికొందరకు గలుగును. అస్వస్థతనందిన అశయపమునందలి మేదస్సుపొరలడి నాళములు విస్తరించుట వలననుయందలి ద్రవము పారకుండ నడ్డుపడుట వలనను యీవ్యాధి సంభవించుచున్నది. ఈ నాళములకీవిధముగు హాని యొకవిధమగు పురుగుచే గలుగుచున్నది. ఈపురుగుయందలి అడుగులిపురుగు మంచినీళ్ల ద్వారా శరీరమందుజొచ్చి మేదస్సు పొరెడి గ్రంథియందుగాని నాళమునందుగాని ప్రవేశించి అచ్చట గుడ్లను జీవముతో నుండిన బిరుగులను బెట్టుచున్నది. వీనివలన జ్వరమునుమరించి ఒక అవయవమందు కొద్దియో గొప్పయో బాధతో గూడి అందలి మేదస్సు పొరడి గోన్నినాళములు విస్తరింపజేయబడును. ఉష్ణతగతి వెంటనే తగ్గిపోయి అదేలక్షణములతో మరలి వచ్చుచు. అస్వస్థతనందిన అవయవము లావునందుచుండును. చెన్నపురి రాజధాని యందు నీ వ్యాధి చెన్నపట్నమునందును విశాఖపట్నమునందును మిక్కుటముగ నున్నది. రోగియొక్క రక్తమునుండి చిన్నపురుగులు దోమలచే నెత్తుకొనిపోబడి నీటియందు గలుపబడును. కాని మిక్కిలి లావగుటవలనను బరువెక్కుటవలనను నడచుటయందు రోగికి కష్టముగా నుండును. కట్టుకట్టినయెడల నడచుటకు వీలుగానుండును. ఆయాభాగములయందు దోమలనెక్కువగ కుట్టకుండ చుట్టుపట్ల దోమలుండకుండు నట్లు జేసికొనవలయును. అపరిశుద్ధమగు నీటిని త్రాగకూడదు. ఈ వ్యాధికి మందు యేమియు ఉపయోగములేదు. చర్మము చిరిగిపడి కంది నల్లబడి వాచినయెడల ఒక ఔన్సు జలములో 5 గ్రెయినుల సిల్వర్ నైట్రేటునుగలిపినయిన రాయవలయును. 5 గ్రెయినుల సల్ఫేటు ఆఫ్ ఐరనును ఒక ఔన్సు ఉష్ణజలములో గలిపి అందులో దడిపిన గుడ్డను పయినగట్టినచొ ఉపశాంతి గలుగవచ్చును. చర్మము పగిలి పడిన చోట్లు శుభ్రముగా నుంచవలయును. లేనిచో కురుపులు యేర్పడవచ్చును. బాపుగొందిన చోట్ల నందున కురుపులు యేర్పడవచ్చును. గాన జింక్ ఆక్సైడ్ పౌడరు జల్లుటవలన యీ కురుపులు యేర్పడకుండును.

## ఏనుగుగజ్జి(Eczema)

ఏనుగుగజ్జి అనేకతరగతులుగా తటస్థమగును. ఈ వ్యాధియందు చర్మము యెర్రనై, అచ్చటచ్చట వెడల్పయిన భాగములయందు ఉన్నతములయిన చిన్న పొక్కులు లేచును. ఈ వ్యాధి సామాన్యముగ చంకయందును గజ్జయందును బుట్టును. ఈ పొక్కులలోని ద్రవము త్వరలోనె తెల్లగాను మడ్డిగాను మార్పబడి, నాలుగయిదుదినములలో పొక్కులు పగిలి

ద్రవము వెలువడిన పొక్కులైనట్టియు గుండ్రిగా పసుపును గలిగి అరుపచ్చనివర్ణమును వహించి నట్టియు పక్కులు కట్టును. ఈ అస్వస్థత భాగమును జుట్టి క్రొత్తపొక్కులు లేచి, వెనుక భాగము పచ్చిగనే యుండును. ఈవ్యాధి ఒకవారములో నయమైనను గావచ్చును. ఒకప్పుడు కొన్ని నెలలయినను పట్టవచ్చును. స్వల్ప కాలము వ్యాపించునపుడు పక్కులు ఊడిపోయి, అస్థలము పచ్చిగా నుండినను ఉండును. లేక పక్కులు పగులుటవలన నీళ్ళనంటి దద్రిసము వచ్చును. పిల్లలకు పండ్లువచ్చునప్పుడు చెవులవెనుక నీవ్యాధి తటస్థింపవచ్చును. స్త్రీలయందు ఋతుస్రావ సంబంధమగు వ్యాధులలో గూడ నీవ్యాధికలుగవచ్చును. ఒకప్పుడు స్తన్యము నిచ్చు స్త్రీలయొక్క స్తనాగ్రములయందును నీవ్యాధి తటస్థమగును. చాలవాటిలో నజీర్ణ వలన వచ్చును. ఈవ్యాధి సంభవించుటకు శరీరమునందు దుర్బలత కలిగినపుడు బట్టయొక్క గాని ఒరపిడి నీవ్యాధికి స్థానమేర్పడును. చక్కెర, పిండి మొదలగు పొడి పదార్థముల దలి చుగ ముట్టుకొనుచుండినయెడల నొకప్పుడు యీవ్యాధి యేర్పడును. అట్టివారియందు ఆ పనులను మానినయెడల వ్యాధి అంతరించిపోవును. ఋతుస్రావ వ్యాధిలో గూడియుండిన యెడల నావ్యాధికి తగు చికిత్స జేసినయెడల ఏనుగుగజ్జి పోవును. ఈవ్యాధియందు చర్మము పగిలి పొడిగనున్నయెడల 5 గ్రెయినుల బోరిక్ ఆసిడ్‌ను, 5 గ్రెయినుల జింకు ఆక్సైడును 6 గ్రెయినుల జరిస్టార్‌చ్‌ను, ఒక ఔన్సు వాసలీనులో గలిపి రాయవలయును. రసి గారుచున్నయెడల, ఆస్టార్చ్‌ను గాని జింక్ ఆక్సైడ్‌నుగాని పైనదట్టముగ జల్లవలయును. దీనిపైన లింటు నూనెవేసి గట్టవలయును. రసివలన లింటు తడిసినయెడల అభాగమంతయు శుభ్రముగా గడిగి తిరిగి డ్రెసి చేయవలయును. అన్ని విషయములందును విరేచనము క్రమముగా నగుటకు జాగ్రత పుచ్చుకొనవలయును. కీళ్ళనొప్పులతో గూడిన ఏనుగుగజ్జి అయిన యెడల భోజనపదార్థములయందు బహుజాగ్రతగ నుండవలయును. పాలు శాకపదార్థములు భుజింపవచ్చును. చక్కెర గలిగి యుండిన పదార్థములను త్యజింపవలయును.

## ఓడలో గలుగు కడుపుదిప్పు.

ఓడలో ప్రయాణము చేయునప్పుడు కొందఱకు గడుపులోదిప్పునను విషయము సామాన్యముగ తెలిసినదే అయియున్నది, ఇందులకు నిశ్చయమైన మందు కానరాదు. బ్రాందీయును చల్లనినీళ్ళను కొందరకు ఉపయోగించును. అన్నకోశముపైన ఒత్తిడి యుండునట్టుల ఒక పట్టాను పెట్టుకొనుట వలన కొంతవఱకు ఉపయోగముగ నుండును. పొటాసియం బ్రోమైడు ఉపయోగముగ నుండునుగాని, దీనిని జాగ్రతతో నీయవలసియుండును. కొంచెము చక్కెరపైన 2 చుక్కల క్రియాసోట్‌ను వేసి పుచ్చుకొనుటవలన నొకప్పుడు గుణమియ్యవచ్చును.

## కడుపునొప్పి.

సామాన్యముగ పేగులలో గలిగెడి నొప్పికే మనము కడుపునొప్పియని వాడుచుందుము. ఇది అనేకవిధములుగ పరిణమించుచున్నది. (1) చురుకైనట్టియు పోటుతోగూడి యుండునట్టియు (2) నొప్పితోగూడి వాంతి వచ్చునట్టియు (3) వాయుపూరితమయి ఉబ్బరముగానుండి బాధపెట్టునట్టియు (4) ఆహారము జీర్ణముగాక పోవుటవలన నొప్పి గలిగించు

నట్టియు (5) పేగులు స్వస్థమైన గతియందుండకపోవుటవలన వమనమును పుట్టించునట్టియు (6) పేగులలో నాటంకము కలుగుటవలన నుదరము నొక్కిపట్టినప్పుడు బాధను గలిగించునట్టియు (7) సీసపు సంబంధమగు పదార్థములు జీర్ణకోశమునందు ప్రవేశించుట వలనను రంగుపనుల చేయుటవలనను బాధను గలిగించునట్టియు — యిన్నివిధములగు కడుపు నొప్పి కనుపడుచున్నది.

ఈవ్యాధి సామాన్యముగ రాత్రులందు అకస్మాత్తుగా పేగులయందు ఉండి ఉండి నలిపివేయునట్టి నొప్పితో ప్రారంభమయి నిస్త్రాణ కడుపులో దిగ్గుట; వమనము వాంతి — వీటితో గూడియుండును. బొడ్డుదగ్గర స్నాయువులు ఉండిఉండి ముడుచుకొనుచుండుటవలన బొడ్డులోనికి లాగుచున్నట్లు కనబడుచుండును. పేగులయందు ముందుగా మలబద్ధమేర్పడి వాయుప్రవేశమూలమున యీ అవయవము విస్తరించ జేయబడియుండును. కొంత సేపటికి రోగికి విరేచనము కావలెనని మిగుల కోరిక యుండును విరేచనమయినయెడల విరేచనతో వాయువుకూడ వెలువడి రోగికి మిగుల శమనముగనుండును. పేగులయందు ఉబ్బసలగుండినపుడు దప్ప తక్కిన సందర్భములయందు రోగిదొర్లుటవలనగాని కడుపు పట్టు బట్టుండుటవలన గాని పేగులపైకొంచెమగరు ఆదుముటవలన కొంతఉపశాంతి కలుగగలదు. ఇందులకయి మోకాలు వచ్చి పేగులపై నదిమిపట్టునట్టిస్థితిలోయుండునట్లు కాళ్ళపిక్కలయొక్క ముందటి భాగములను జేతులతో బట్టుకొని రోగి తరచుగా బయుండియుండును. ఇందువలన పొత్తికడుపుయందలి స్నాయువులు సడలింపు నందును. పేగులు వాపు నందియుండిన యెడల, రోగి వీపుపైబరుండి కాళ్ళను ముడుచుకొని పరుండి యుండును పేగులయొక్క వాపుకలయుండి యుండినయెడల జ్వరము విశేషించి యుండును. కేవలము కడుపునొప్పి అయినయెడల జ్వరము ఉండదు. ఇతరవిధమగు కడుపునొప్పికి దగుచికిత్స జేయనియెడల, పేగులయొక్క వాపుగాని, పేగులయందలి ఆటంకపదార్థము యొక్క యేర్పడుటగాని తటస్థించును.

కడుపునొప్పి మూత్రకృచ్ఛ్రము నుండియు — విరేచనము లగుటకు ఆరంభదశనుండియు కొవలేలని మూలశంక వ్యాధినుండియు పైత్యవాహిక (Gall duct) గుండ "స్టోన్" (శిలాపదార్థము) పోవునప్పుడు గలిగెడి బాధనుండియు కాలరాయందు తటస్థించెడి నొప్పులనుండి ఒరుబీజము గలిగెడి బాధనుండియు — భేదముగ గుర్తింపబడవలయును. మూత్రకృచ్ఛ్రవ్యాధియందు వృషణము లోనికు లాగుకొని, అప్రిక్కనుండెడి కాలు మొద్దుబారి, తొడలోకూడ పోట్లుపొడుచుచు నడుమునందు నొప్పితోగూడి, తరచుగ మూత్రమును విడువవలెనని యిచ్ఛగలిగి యుండును. విరేచనవ్యాధి ప్రారంభమునందు గలిగెడి బాధ విశేషముగనుండక మలబద్ధమునకు బదులుగా అజీర్ణ విరేచనములతో గూడియుండును. [illegible] నిమూలశంకయందు క్రిందిపేగుయందు మాత్రమే నొప్పియుండి, రక్తము స్రవించినను స్రవించవచ్చును. పైత్యవాహికలో "స్టోన్" యుండినయెడల, జీర్ణకోశము పైభాగమున బాధ గనుపట్టుచు వీపులోనికి పోట్లు పొడుచుచుండును; కాలరాయందు అజీర్ణ విరేచనములకు ముందుగా వాంతులును, తెల్లనిద్రవము విరేచనముగుండ బారుచుండుటయు, మూత్రము బంధించుటయు, తటస్థించును.

—:—

### చికిత్స.

కడుపునొప్పి వ్యాధియందు కారణమును గమనించి మరియు చికిత్స జేయవలయును. అజీర్ణపదార్థములను భుజించుటవలన కడుపునొప్పి బుట్టినట్లు దోచిన యెడల [illegible] వాంతికారి నియ్యవలయును. వాంతికారికి సహాయముగ [illegible] ఉప్పునీళ్ళను విశేషముగ త్రాగవలయును; పిమ్మట సౌమ్యమైన విరేచనకారి నియ్యవలయును.

కడుపునొప్పి పైత్యసంబంధ మైనదైనయెడల, తలనొప్పి, అలసట, కడుపుదిబ్బటి, పైత్యదినము వాంతులగుట, ముఖ్యముగా సుగంధముతో గూడియుండుట, వీటితో కలిసి యుండును. మిక్కుటముగ దోషము యుండిన యెడల వాంతికారి నిచ్చుట యెక్కువ ఉపయోగముగ నుండును. విరేచనము గాకుండినయెడల విరేచనకారి నియ్యవలెయును.

కడుపునొప్పియందు ఉబ్బరము కనపించిన యెడల పత్యాహారములను విశేషముగ శాకపదార్థములను తిందలగువాటిని తినుటవలన బలహీనములైన వారలకు జీర్ణకోశము వాయుపూరితముగుటను నొప్పిగలుగును [illegible]. ఇట్టిస్థితియందు ఒకగ్లాసు [illegible] జలములో 40 మినిమ్సు స్పిరిట్సు అమ్మోనియా ఆరోమాటికను యియ్యవలెయును. 20 మినిమ్సు టించర్ ఆఫ్ జింజరుయును [illegible] నియ్యవచ్చును; ప్రతి రెండు గంటలకను రెండు చెమ్చాల సిట్రేట్ ఆఫ్ మెగ్నీషియా నీళ్లలో కలిపి యియ్యవచ్చును.

విరిధనుకు కడుపునొప్పి గలవారిని, పేగులను చేతులతో నొత్తిపట్టుట వలనగాని, వేడియైన బ్యాండేజిని [illegible] గాని, లినిమెంట్ ఓపియమునుగాని, లినిమెంట్ బెలడోనాను గాని పూసి [illegible] వలనగాని, బాధ తగ్గింపవచ్చును. సోప్ లినిమెంటుతో రుద్దుటవలనను గుణము గనగవచ్చును. బాధ తీవ్రముగా నుండినయెడల ఒక మోతాదు మాత్రమే 15 లేక 20 గ్రెయినుల క్లోరల్ హైడ్రేటును యిచ్చుట వలన గుణము నియ్యగలదు.

పైత్య సంబంధమగు కడుపునొప్పి ప్రారంభమున కాగానే విరేచనబద్ధ మైనముగ నుండినయెడల 5 గ్రెయినుల రసకర్పూరము 1 గ్రెయిను యక్స్ట్రాక్టు ఆఫ్ ఓపియంతో గలిపి యియ్యవలయును. తరువాత మూడుగంటలకు ఒకటిన్నర సోడా సల్ఫేటునున్నూ ముప్పది మినిములు టించర్ ఆఫ్ జింజరునున్నూ రెండు ఔన్సుల జలముతో గలిపి యియ్యవలెయును.

---

### పేగుయొక్క వాపుదల,

పైన వివరింపబడిన తరగతులలో జేరక [illegible] మందులవలన నేమియు ఉపశమింపక పోయినప్పుడును, అయినను [illegible] మూలమున [illegible] గుణము రిచ్చునప్పుడును పొత్తికడుపు స్పృహముగ్గాను వహించి [illegible] జ్వరమును కూడా అంకురించి యుండును. ఇట్టి సంపర్భములయందు విరేచనకారుల నియ్యరాదు. పేగులయొక్క యాదుర్గుణమే యెక్కువయి పేగులయొక్క వాపు యెక్కువగును. ఈ స్థితియందు పేగులలో మంటపుట్టి

నొక్కినయెడల బాధ యెక్కువగును. ఆరోగ్యస్థితియందు ఉబికిన [illegible] పొత్తికడుపు పైకిలేచి క్రిందపడుచుండును. ఈ వ్యాధియందు పొత్తికడుపు బాధాపూరితమై కదలకుండ నుండును మలబంధము, కడుపు తిప్పుట వాంతియగుట, ప్రేగులబలహీనత, [illegible]—ఈ గుణములు సాధారణముగ గనబడుచుండును. నాడి [illegible] మూత్రము తీవ్రవర్ణము వహించియుండును. మరణము సంభవించు విషయములందు ప్రేగులు [illegible] వాయువుతో నిండియుండినందున పైనగొట్టినచో మ్రోగుచుండును. చేతులును హస్తములును చల్లనగును, ఒడలంతయు చల్లని చెమటపట్టి ముఖము [illegible] మారిపోవును బాధ అకస్మాత్తుగ తగ్గి, రోగి మరణము నొందును. ప్రేగులయొక్క [illegible] జ్వరచిహ్నములు అగుపడును.

శరీరమునకు చలిగాలి సోకుటవలనను, చెడిపోయిన [illegible] తినుటవలనను ప్రేగుల యందు చిక్కుకొనిన యేదైన పదార్థమువలనను, యీ వాపు కలుగవచ్చును. టైఫాయిడ్ మొదలగు కొన్ని జ్వరములందు యిటులనే సంభవింపవచ్చును.

చికిత్స.

విడువకుండ వేడినీళ్లతో కాపడమును గావించుచుండవలెయును. చేతులు తలపైని నుంచుకొనుటవలన నూపిరిబీల్చుట తేలికగా నుండును. అస్వస్థతకు పూర్వము మలబద్ధము గలిగియుండినను తప్ప విరేచనకారుల నియ్యకూడదు. అట్టిస్థితియందు ముందుగా చిట్టాముదము నిచ్చుటయుచితము. బాధనివారణ యగుటకును, నిద్రపట్టుటకును, క్లోరల్ హైడ్రేట్ను రాత్రియందియ్య వచ్చును. పేగులయందు దస్తులతో జ్వరముండిన టైఫాయిడ్ జ్వరముతోనికి దిగవచ్చును గాన మిగుల జాగ్రతతో నుండవలయును కాలరా సమయమందుండి యున్నపుడు అజీర్ణవిరేచనములను అశ్రద్ధచేయకూడదు.

---

## సీసపు సంబంధమగు కడుపునొప్పి.

సీసపుసంబంధమగు పదార్థములు శరీరమునందు ప్రవేశించుట వలన కలుగును కడుపు నొప్పి, సీసము లేక సత్తు శరీరమునందు గలిసియుండుటవలన, ప్రేగులనొప్పి, [illegible] లాగుట, కడుపులోదిప్పుట, వాంతియగుట, విరేచనబద్ధము—వీటితో గూడిన కడుపునొప్పి యుండును ఈ లోహము శరీరమునందు ప్రవేశించుటవలన, పళ్ళచిగుళ్ళపైన [illegible] వర్ణముగల గీరలు యేర్పడును. పైత్యమువలన గలిగెడి కడుపునొప్పికి వలెనే దీనికిని చికిత్స చేయవలయును.

చికిత్స.

పేగులయందలి మలము శుభ్రముగా బోవువరకును ప్రతి మూడు లేక నాలుగు గంటలకును యీ దిగువ ప్రికారమియ్యవలయును.

| | |
|---|---|
| మెగ్నీసియం సల్ఫేట్ : | డ్రాములు 2 |
| డైల్యూట్ సల్ఫూరిక్ ఆసిడ్ (జలము గలిసిన) | మినిములు 10 |

| | |
|---|---|
| టించ్చర్ ఆఫ్ ఓపియం | మినిములు 10 |
| జలము | ఔన్సు 1 |

బాధతో గూడిన లక్షణములు పోయిన పిమ్మట ఆల్టరెటివులలో 3 వ ఔషధయోగ మును వాడవలయును. ఇందలి పొటాసియం అయొడైడ్ రక్తమునందలి సీసము లేక సత్తుతో గలిసి అయొడైడ్ ఆఫ్ లెడ్ గా చేయునప్పుడు మూత్రము ద్వారాయును యితర వ్యర్థద్రవపదార్థములతోడను, శరీరమునుండి వెలువడి పోవును.

## కర్ణరోగములు

### (1). చెవిలోనుండి స్రవించుట.

చెవిలోని బయటిదేవున్న మార్గము గాని, మధ్యభాగము గాని, వాపునందుట వలన పోటుపోవుటచేగాని, చలివలన గాని, దెబ్బలు వలన గాని, ఆహారమును భుజించుట వలన గాని, నొప్పి యధికమును కలుగును. కొలది రెండు దినముల పిమ్మట చెవిలోనుండి పసుపువర్ణముగల చీము వచ్చును. చీము వచ్చినచో ఆరంభమునందున్న పిమ్మట నొప్పి తగ్గును. పండ్లువచ్చుట వలన నీవాపు యేర్పడినయెడల పంటిచిగుళ్ళను కత్తితో గీరవలయును. చెవియందు యితర మగు పదార్థము లేమియున్నను ఉన్నయెడల పిచికారీ చేయుటవలన వాటిని బయటకు వెడలింప జేయవలయును. వేడినీళ్ళతో బయటకు వచ్చునట్లు చేయవలయును. పిచికారీ చేసిన పిమ్మట చెవిలో బోరిక్ ఆసిడ్‌ను వేసి దూది పెట్టవలయును. పిచికారి చేయుటకు సబ్బు కలిపిన గోరువెచ్చని నీళ్లను ఉపయోగించ వలయును. చన్నీళ్లను ఉపయోగించరాదు. నొప్పివలన నిద్రరాని యెడల, పెద్దవారలకు 10 గ్రెయినుల క్లోరల్ హైడ్రేటునున్నూ, పిల్లలయిన యెడల 2 మొదలు 4 గ్రెయినులవరకు పొటాసియం బ్రొమైడునున్నూ యియ్యవలయును. అవసరమయినయెడల విరేచనకారిని దేనినైనను యియ్యవలయును. చెవిని దినమునకు రెండు లేక మూడుసారులు కడుగవలయును.

### (2) చెవిపోటు.

చెవిపోటు నరములసంబంధమునుబట్టి గలదియును అయియుండవచ్చును. లేక పురుపుల వల్లనైనను యుండవచ్చును. చెవివాపువల్లనైనను అయియుండవచ్చును. నరముల సంబంధమైన దైనయెడల చలిగాలి వల్లనైనను, లేక చన్నీళ్లను స్నానము చేయుటవలనను అజాగ్రతగ జేయుటవల్లనైనను, దటస్థించవచ్చును. పుప్పిపన్ను వల్లనైనను లేక పండ్లు వచ్చునప్పుడైనను, యీపోటు తటస్థించవచ్చును. నరముల సంబంధమగు చెవిపోటు మిగుల అతిశయముగనుండి ముఖముపైనయును తలయందును పోట్లు ప్రారంభించి, నోరు తెరచునప్పుడును నములిన ప్పుడును యీపోట్లు అధికముగ నుండును. ఇట్టి చెవిపోటు అకస్మాత్తుగ వచ్చును; యిందు జ్వరము కూడా నుండదు.

#### చికిత్స.

పెద్దవారలకు విరేచనకారి నిచ్చుటయు, పిమ్మట క్వైనైన్‌ను యిచ్చుటయు గుణము నిచ్చును. పండ్లు వచ్చుచుండినయెడల కత్తితో గీరవలయును. బాధ అధికముగా నుండిన

గూర్చి మరియెంతో శ్రేష్ఠులగు ఐరోపీయ వైద్యశాస్త్రజ్ఞులు పరీక్షించి యుండిరి. 1832 వ సం॥ నందు ఇంగ్లాండు దేశమునందును యీవ్యాధి స్థానమును గనుగొనెను. అటుతరువాత నింగ్లాండు దేశమునందును యీ వ్యాధి మున్నూరు ప్రవేశించెను. 1866 వ సం॥ పిమ్మట నెప్పుడును యీవ్యాధి ఇంగ్లాండు దేశమునందు గనబడియుండలేదు. ఈవ్యాధికి ప్రధాన స్థానము దక్షిణ బంగాళా ప్రదేశమైయున్నది. ఇచ్చట అన్ని కాలములయందును యీ దేవత యధేచ్ఛగా రాజ్యము చేయుచుండును. మశూచి మొదలగు వ్యాధులయందువలె యీవ్యాధి గాలిద్వారా వ్యాపించదు. ఒకవిధమగు పురుగు శరీరమునందు ప్రవేశించి ఆపురుగు అభివృద్ధి నందుటవలన యీవ్యాధి గలుగుచున్నదని అభిప్రాయమై యున్నది.

ఈవ్యాధి-మనుష్యసంసర్గము; జలధార; ఆహారపదార్థములు; త్రాగునీళ్ళు; నీళ్ళుగలిసిన పాలు—ఇట్టివలన యొకచోటనుండి మరియొక చోటికి గొంపోబడుచున్నది. ఈవ్యాధి తటస్థించుటకు ముందుగా కాలరా పురుగు ఉండవలయును. ఈ పురుగు శరీరమునందు ప్రవేశించిన పిమ్మట అట్టి మనుష్యుని యొక్క శరీరస్థితి యీవ్యాధి కనుకూలముగ నుండవలయును ఈ కారణగతులన్నియు సంఘటించిననే గాని, యొకపురుషునికి కలరావ్యాధి తటస్థించదు. ఏది యెట్లున్నను శరీరమునందలి జీవసత్వము తగ్గుటవలన నుండియుండిననే గాని, యీ పురుగు శరీరమునందు ప్రవేశించినను మాత్రమున హాని కలుగజాలదు చుట్టుపట్ల కాలరావ్యాధి యుండినపుడు, శరీరమున కలసట జెందునట్టి పరిశ్రమల దీసికొనగూడదు. పెంటకుప్పలు ఈ పురుగుయొక్క అభివృద్ధికి సహాయము జేయును గాన, అట్టిగోటి నన్నిటిని తొలగింపవలయును. లోనకు పుచ్చుకొను నీళ్ళను, పాలను, బాగుగా గాచి మరియు పుచ్చుకొనవలయును. ఈ వ్యాధివలన భయమును, గొంతవరకు ఉన్మత్తతను పుట్టించును.

లక్షణములు.

ఈవ్యాధి రెండు విధములుగా ప్రవేశించుచున్నది. (1) అకస్మాత్తుగా వచ్చుట. (2) అజీర్తి విరేచనములుగా ప్రారంభమయి, ఒకటి మొదలు పదిదినముల వరకును అటులుండి అప్పుడు కాలరా ప్రారంభమగుట. ఈ వ్యాధి సామాన్యముగా వాయువేడిమి తగ్గియుండి నపుడు, అనగా, రాత్రియందుగాని, ఉదయమునందే గాని ప్రారంభమగును. ఆరంభమునుంచియే మిగుల నిస్త్రాణయు, నీరసమును, గనబడును. మొదటలో ప్రేగులయందు నొప్పిగలుగును గాని, విరేచనములును వాంతులు అధికమయిన కొలదియు, నొప్పి తగ్గిపోవును. ఆరంభమునందలి విరేచనములు మలమును బోలియుండును గాని, తరువాత తరువాత పలచనై గంజినీళ్లను బోలియుండును. వాంతులును గంజినీళ్లవలెనే యుండును. దీనికి కారణము కాలిజమునుండి పైత్యద్రవము స్రవింపబడక యుండుటవలన నయియున్నది. కొద్దిగంటలలో నిట్టి విరేచనములు పదునైదు లేక యిరువదివరకు యగును; వాంతులును అదే ప్రకారముగా నుండవచ్చును. కాలరా వ్యాధియందలి వాంతి యేమియు ప్రయత్నము లేకనే యగుచుండును. చేతివ్రేళ్ళు, కాలివ్రేళ్ళు, తొడలు, పేగులయందలి స్నాయువులు—యివియన్నియు క్రమముగా లాగుట ప్రారంభమగును. ఈ బాధ మిగుల అతిశయముగా నుండుటవలన మూలుగుట ప్రారంభమగును. చేతివ్రేళ్ళు కాలివ్రేళ్ళు నీలవర్ణమును గలిగి ముడతలు పడియుండును. మొదటగా మూత్రము కొద్దికొద్దిగా వెలువడుచు తీవ్రవర్ణమును గలిగియుండును. పిమ్మట సంపూర్ణముగ

బంధించిపోవును. మూత్రకోశములనుండి మూత్రము వెడలుటయే లేదు. కడుపులో మంట పుట్టును. నాలుక తెల్లనై వణకుచుండును. నోరంతయు చేదుగానుండును. ఉమ్మి ఊయుట లేదు. నోరంతయు ఆరిపోయి దాహము అధికమయి చల్లని ద్రవములను త్రాగవలెనని యుండును. నాడి నీరసముగానుండి మామూలుకంటె విశేషముగ కొట్టుకొనుచుండును. నిమిషమునకు 98 సారులుకూడ కొట్టుకొనవచ్చును. ఒడలంతయు చల్లగానున్నను జ్వరమసలు ఉండదు. ఆరంభదశయందు వేడితగ్గిపోవునుగాని, రోగి అధికతాపము నొందుచు, బట్టకప్పుకొనకుండ పరుండుటకు యిష్టపడును.

చెవిలో ధ్వనులు పుట్టవచ్చును. రోగి మిగుల ఆయాసపడుచు నిట్టూర్పు కొట్టుకొనుచుండును. చివరకు ఆయాసము అధికమగుచు మూర్ఛాగతి ప్రారంభమగును. ఈ గతియే నడచుచున్న యెడల, నాడి తొందర నంది చేతికి మాత్రము అందకుండి వాంతులును విరేచనములును కూడ కట్టి, నొప్పులును తగ్గును. ఒడలంతయు చల్లనిచెమటపట్టి దుర్వాసన గలిగి నీలమయిన వర్ణము ప్రవేశించును. గోళ్లును పెదవులును ముఖ్యముగా నీలవర్ణమును వహించి యుండును. ఒడలంతయును, అవయవములును, ముడుతపడిపోవును. ధ్వని బొంగుపోయి నీరసమును వహించును. నాలుక కొనవేళ్లు, నాలుకయును ఊపిరియును చల్లగనుండును. స్మృతి సామాన్యముగ బాగుగనే యుండునుగాని, యింద్రియములు సుఖముగ నెంచరాదు. ముఖము వాడి యుండును. కండ్లు గుంటలుపడి కనుపాపలు మాత్రము మామూలువలెనే యుండును. ముక్కుమాత్రము స్ఫుటముగ గనబడును చెక్కిళ్లు లోతునకుపోయి, దవుడ కరచుకొని పోవును శరీరవేడిమి తగ్గినట్లుల గనబడును, నాడియు బలహీనమయి, వెక్కిళ్లుపుట్టి విరేచనములు రోగికి తెలియకుండ నగును, శరీరమంతయు కొంచెము నీలవర్ణమును వహించి యుండును. మరణమునకు కొంతముందు గంటలకు పూర్వము, తలకును నుదురునను, ఎదురొమ్మునను, కొంచెము వేడి పుట్టవచ్చును. మరణము సమీపించుటవలన చిన్నరక్తనాళములు పగిలిపోవునంది యీవేడి కలుగునుగాన యిది చెడు చిహ్నముగా దీసికొనవలయును.

కాలరావ్యాధి సంభవించినవారిలో దాదాపుసగముమంది మరణము నొందుదురు. ఈ వ్యాధిపుట్టిన ఆరంభమునందు మరణము లెక్కువగా నుండును. పసిపిల్లలయందును, ముసలివారలయందును, బలహీనులయందును, మధ్య వయస్కు వారలయందుకంటెను, స్థూలశరీరులయందు కంటెను, మరణము లెక్కువగా దటస్థించును. వ్యాధి త్వరలో వృద్ధినందుట, వ్యాధి అకస్మాత్తుగా ప్రవేశించుట, మిగుల ఆయాసమునందుట, నాడి త్వరలో చెదరిపోవుట, శరీరము మిక్కుటముగ చలువలు గ్రమ్ముకట, మూత్రము విసర్జించక బంధించుట, పచ్చకామాల వ్యాధి, శ్వాసకోశ సంబంధమగు కలతలు, విరేచనములు వాంతులు తిరిగితిరిగి గలుగుట, టైఫాయిడ్ లక్షణములు, సంధిగుణము — యివి యన్నియు యీవ్యాధియందు చెడు గుర్తులై యున్నవి.

వాంతులును విరేచనములును క్రమముగా తగ్గుటయు ఒడలు వేడిమియెక్కుటయు, నాడి నిండుచుండుటయు, కంఠస్వరము యొక్క శక్తి హెచ్చుటయు, మూత్రము వెడలుటయు, విరేచనముల వర్ణము కలుగుటయు, కడుపులోని మంట తగ్గుటయు, రోగి నిద్రించుటయు —

యివియన్నియు మంచిగుర్తులై యుండి స్వస్థత కనువగును. మూత్రము వెడలు నంతవరకు నపాయము దాటియుండదు; వ్యాధి ప్రారంభమయిన 72 గంటల లోపుగా మూత్రము వెడలిన యెడల వ్యాధినుండి స్వస్థత నందవచ్చును. మూత్రగ్రంథులు క్రమముగా పని చేయని యెడల, మూత్రమను గుండ వెలుపడవలసిన విషపదార్థములు రక్తమునందు కలిసి, రక్తము నంతయు పాడుజేయును. ఇందు మూలమున మరణము సంభవింపగలదు.

ఒకప్పుడు స్పష్టమయిన లక్షణములు లేకుండగనే హైత్యాధిక్యముతో గుండెదిగి విరేచనములు ఒకటి రెండు మాత్రమే అయినప్పటికి, శీఘ్రగతి ప్రారంభమగును, మరణము సంభవించును.

## చికిత్స.

కాలరా వ్యాధి యందు పరిశుభ్రముగా నుండుటయు పరిశుభ్రమగు పదార్థముల భుజించుటయు, కాచి చల్లార్చిన నీళ్లను త్రాగుటయు మిగుల ముఖ్యములు. ఈవ్యాధియందు జాగ్రత నాహారము నిచ్చుటవలనను, స్వాభావికముగ శరీరమునందు గలుగుచుండెడి వ్యాధిప్రతికారమునకు మిగుల కుశలతతో మందులనిచ్చుట మూలమున సహాయము జేయుచుండుటవలనను, అనేక ప్రాణములను గాపాడవచ్చును. అజీర్తి విరేచనములు ప్రారంభమయినప్పుడు వెంటనే బందుజేయుటవలన మిగుల నుపయోగ మందగలదు. కాలరా వ్యాపించియున్నప్పుడు అజీర్తి విరేచనములు ప్రారంభమయిన యెడల, వెంటనే దగుచికిత్స జేయవలయును. లేనిచో నీవ్యాధి కాలరాలోనికి దిగునగును; ఈ సమయమందు విరేచనకారుల బుచ్చుకొనకూడదు.

అజీర్తివ్యాధియొక్క లక్షణములు కనుపడగనే 30 చుక్కల క్లోరోడీన్‌ను ఒకఔన్సు బ్రాందీలో కలిపియిచ్చును, అవసరమయితే ప్రతి రెండుగంటలకును దీనిని మరల నియ్యవలయును. కడుపులో దిప్పుటకు టించ్చర్ జింజర్ ఔషధయోగమును బుచ్చుకొనవలయును మొదటిఔషధము రెండు మోతాదులను, రెండవఔషధము నాలుగు మోతాదులును, యిచ్చినప్పటికిని వ్యాధి కుదురకతగ్గక పోయినయెడల, 10 గ్రైయినుల పల్విస్ క్రిటా ఆరోమేటిక్ కం ఓపియాంను యియ్యవలయును; దీనియొక్క ఒక మోతాదుతో నయముకాక పోయినయెడల, నాలుగు గంటల తరువాత మరియొక మోతాదు నియ్యవలయును.

మూత్రము క్రమముగా వెడలుటకు గాను రెండు ఔన్సుల జలములో నొక డ్రాము స్పిరిట్ ఈథర్ నైట్రిస్‌ను కలిపి ప్రతిగంటకును యిచ్చుచుండవలయును. కడుపులో దిప్పుట యెక్కువగా నుండిన యెడల పొత్తికడుపుపైన మస్టర్డు పట్టీని వేయవలయును. రోగి పరుండి శయ్యబట్టియే యుండవలయును. విరేచనములు కట్టు నంతవరకును తేయాకు నీళ్లు; ఆరోరూట్ పిండితో గాని సగ్గుబియ్యముతో గాని చేసిన జావ, కొంచెము పోర్టువైనైనను — వీటిని లోనికియ్యవచ్చును. గట్టి పదార్థముల నేమియును లోనికియ్యగూడదు. వాంతి వెళ్లిపోయిన యెడల, ప్రతి అరగంటకును కొంచెము కొంచెము మాత్రమే యిచ్చుచుండవలయును. దాహమునకు, మంచినీళ్ళు, సోడావాటరు, మంచుగడ్డ గలిపిననీళ్ళు, యియ్యవచ్చును. వినిగరుతో గాని సల్ఫ్యూరిక్ ఆసిడ్‌తోగాని రెండు లేక మూడుచుక్కలు గలిపిననీళ్లను లోనికిచ్చుట మిగుల శ్రేష్ఠము; నిలకడ, పులుంపుతో గాచిన

దగినమూనందు కాలరాపురుగు నివసింపజాలదు. మూత్రము నిలుచునందువలన ప్రాణాపాయము లేదు. మూత్రము బంధించినయెడల, నడుము క్రింద వెన్నుపూసపైన మస్టర్డుపట్టీని వేయుటవలన మూత్రము వెలువడగలదు. కాళ్ళులాగునప్పుడు, చేతులతో బట్టుటవలన శమనముగ నుండగలదు. కాళ్ళుచేతులు చల్లగానుండినయెడల, గోరువెచ్చనిసీసాలతో గాని, ఉప్పుతో గాని, కాచవలయును. అస్ట్రింజెంట్లలో 4 వ ఔషధయోగమును నాలుగు టీస్పూనుల వరకు రెండు గంటల కొకపర్యాయము యివ్వవచ్చును.

పైచికిత్సను జేసినపిమ్మట విరేచనములును వాంతులును తగ్గిపోయిన యెడల రోగి క్షీణగతి నందుట ప్రారంభమగును. ఈస్థితియందు మందులను నోటిద్వారా నిచ్చుటవలన నధికముగ ఉపయోగము ఉండజాలదు. ఈ సమయమునందు శరీరవేడిమిని గాపాడవలయును. పరిశుద్ధమయిన గాలి వచ్చుచుండునట్లును జాగ్రతపడవలయును. రోగి పరుండియే యుండవలయును లేవనియ్యకూడదు. ఊపిరిపీల్చుట ఆయాసముగా నుండినయెడల, ఎదురొమ్ముపైన మస్టర్డుపట్టీని వేయవలయును. పాదములను చేతులను కయ్యూపుట్ తైలములో రుద్దవలయును. దాహమునకై ఒక అరఔన్సు బ్రాండీని నీటితో గలిపి యియ్యవలయును. కాలరావ్యాధియందు గట్టిపదార్థముల నెన్నడును ఆహారముగ నియ్యకూడదు.

ఈ వ్యాధియందు బాధ తగ్గించుటకుగాను, మార్ఫియాను రక్తములోనికి యింజక్టు చేయుట మిగుల ఉపయోగముగ కనుగొనబడెను. నాడి మిగుల నీరసస్థితిలో నున్నప్పుడు, 60 గ్రెయినుల సామాన్య లవణమును 30 గ్రెయినుల సోడా బైకార్బొనేటును రెండుపైంట్ల కాచి చల్లార్చిన నీళ్ళలో గలిపి, యీ నీళ్ళ 98.4 డిగ్రీల వేడిమిగలదిగ రక్తవేడిమి యందుండగా నపరిశుద్ధ రక్తనాళములలో నింజక్టు చేయుటవలన నొకప్పుడు నాడి సరియై, ప్రాణములు కాపాడబడిన సందర్భములును గలవు. ఈనీళ్లను యింజక్టు చేయుటయందు అందలి గుణమును జాగ్రతగ కనిపెట్టుచుండవలయును. అయితే, విరేచనములు వాంతులు అగుచుండిన యెడల యీనీళ్ళు అన్నియు మరల వాటిగుండ శరీరమునుండి వెలువడి, దీనియొక్క గుణము హరించిపోవును. రోగియొక్క శరీరవేడిమిని గాపాడుటకు దుప్పటిని కప్పవలయును ఒడలంతయు దుడుపవలయును.

ఈవ్యాధియందు పాదములును చేతులును చల్లబడి శరీరము క్షీణగతియందుండిన యెడల, వేడిని బుట్టించుటకును గుండెకాయయొక్క నడకను సరిచేయుటకును, 5 మినిముల లిక్కర్ స్ట్రిక్నీనును 15 మినిముల టింక్చర్ డిజిటాలిస్‌ను 10 చుక్కల స్పిరిట్సు అమ్మోనియా అరోమేటిక్‌ను ఒక ఔన్సు జలములో గలిపి రెండుగంటల కొకసారి యివ్వవలయును.
కాలరా కేర్పడిన ఔషధయోగములను కూడ జూడవలయును.

కాలరావ్యాధి రాకుండుటకు గాను, హాఫ్‌కిన్ అనునాయన ఒక విధమయిన ద్రవమును రక్తమునందు యింజక్టు చేయుట మూలమగు టీకాలు వేయుటను కనుగొనెను. కొంతవరకు ఉపయోగముగ నుండునట్లుగ తెలియుచున్నది.

## కాలరాయందలి పిమ్మట గుణములు.

క్షీణగతినుండి వ్యాధి సర్దుకొనుటకు ఆరంభమయినప్పుడు ఆహారపదార్థముల యందు జాగ్రతగా నుండుటకంటె వేరు ఔషధముల నిచ్చుట సామాన్యముగ నవసరములేదు.

(1) బ్రాందీమొదలగు మత్తుపదార్థముల నధికముగ నిచ్చియుండుటవలన నొకానొకప్పుడు జ్వరము సంభవించవచ్చును. ఈజ్వరము ఒకానొకప్పుడు సాధారణముగానుండి దానంతట అది పోవచ్చును. ఒకానొకప్పుడు జ్వరము అధికమయి నాలుక యెండుట తెల్లగానుండి తరువాత గోధుమవర్ణమును వహించి పగుళ్లు కలిగి పళ్ళమీద పాచిపట్టి యెరుగువారి నాడి చురుకుబారి ఒడలంతయు ఉష్ణముగనుండును. ఈ స్థితియందు సంధి జనించి క్రమముగా స్మారకముతప్పి యిట్లు నాలుగుదినములు మొదలు ఎనిమిది దినములవరకును. గడచిన పిమ్మట వ్యాధి సద్దుకొనినను సద్దుకొనును. లేక, రోగి మరణము నొందినను నొందవచ్చును.

(2) మరియొకప్పుడు అంగవికృతిరోగము పట్టవచ్చి, జ్వరము ఒకానొకప్పుడు వచ్చియు ఒకానొకప్పుడు రాకుండినను, మూత్రము మరల బాధించుచుండును.

(3) అజీర్తి వ్యాధిచే బీడింపబడుచుండువారికి, కాలరా వ్యాధి పిమ్మట ఒకానొకప్పుడు వెక్కిళ్లుబుట్టి ఆహారమేమియును లోపలికి దిగకపోవుటచే వీలుగాక ఆయాసముగానుండి మిగుల నిస్త్రాణ ప్రారంభమగును.

చికిత్స.

కాలరావ్యాధి తగ్గుదల నందుచున్నపుడు శరీరముయొక్క వేడిమిని తడిగుడ్డతో తుడుచుటవలన తగ్గించవచ్చును. మూత్రవిసర్జనము కావలసినంత లేనిచో నడుముపైన వెన్నుపైపున మస్టర్డుపట్టీని వేయవలెను. మూత్రసాధకముగ స్పిరిట్ ఈథర్ నైట్రిసును యియ్యవలయును. క్రొత్తగా అలవాటు గలవారలకు సామాన్యముగ వాంతి యగుచుండును గాన, సిట్రేట్ ఆఫ్ మెగ్నీసియా కొద్ది మోతాదులలో నియ్యవలెయును. ద్రవపదార్థములను మాత్రమే కొద్దిమోతాదులుగ ఆహారముగ నిచ్చుచుండుట మిగుల మంచిది. నాలుక గోధుమవర్ణము గలదిగను ఆరుదలనందినదిగను నుండి పాచిపట్టినదిగ నుండకపోయినను బలహీనముగనుండి, సంధి ప్రవేశించినయెడల, ప్రతిగంటకును ఒక టేబిలుస్పూను పోర్టువైను నీయవలయును. బలమును గాపాడుటకు దగిన ఆహారముల నిచ్చుచు కొద్దికొద్దిగ పాలను లోనికియ్యవలయును. ఆహారమును ఒకేసారిగ యెక్కువ మాత్రము నియ్యకూడదు. నాలుక గోధుమవర్ణమును వహించి ఆరుదల నందియున్నయెడల, అమ్మోనియా కార్బొనేట్ 2 డ్రాములను. సల్ఫ్యూరిక్ ఈథర్ 4 డ్రాములును, స్పిరిట్ యీథర్ నైట్రిస్ 6 డ్రాములును, 12 ఔన్సుల జలములో గలిపి, మూడుగంటలకొకసారి ఒకఔన్సు చొప్పున నీయవలయును.

స్మారకము తప్పుటగాని, అంగవికృతి రోగము బోలియుండినగాని. పాదములను చేతులను వేడిగానుండి, తలపైన తడిగుడ్డలు వేసి, మూత్రగ్రంధుల పైనయును కాలిజము పైనయును. మెడకు వెనుకవైపునయును, మస్టర్డుపట్టీలను వేయవలయును.

వెక్కిళ్లు పుట్టినయెడల పాలలో మూడవవంతు లైంవాటరును గలిపి లోనికియ్య వలయును.

పైన జెప్పినది ఉపయోగింపక పోయినయెడల, వాంతికిగాని వెక్కిళ్లకిగాని రెండు మూడుచుక్కల క్లోరోఫారంను నాలుగుఔన్సుల జలములోవేసి యియ్యవలయును.

### (1) కాలిజమునందు రక్తము కూడుకొని యుండుట

కాలిజమునందు రక్తము అధికముగా జేరుటవలన నీ అవయవము తేయుగాని, లేక కొంత గాని, విస్తరింపజేయబడును. ఒకానొకప్పుడు చేమకట్టుయు, పైత్యవాహికయు మాత్రము యీస్థితి నందియుండును. ఇందుకు యీదిగువ నుదహరింపబడిన కారణములయి యుండవచ్చును:—జనసమ్మర్దముగా నుండుచోట్ల నివసించుట, ఎక్కువగా కూర్చుని పనిచేయుట, ముఖ్యముగా పగటియందు యెక్కువగా నిద్రించుట, విశేషముగా త్రాగుట, తేలికగా జీర్ణముకానట్టియు కారముతో గూడినట్టియు ఆహారములభుజించుట, మత్తు గలుగజేయునట్టియు, యెక్కువగా చక్కెరను గలిగియుండునట్టియు ద్రవపదార్థములను త్రాగుట, మూలశంక వ్యాధివలన గలుగుచుండెడి రక్తస్రావము నకస్మాత్తుగా గట్టివేయుట, జ్వరవ్యాధులయందు శరీరము చల్లదనమును వహించి యుండెడి మన్యకాలముల యందు రక్తము అంతరావయవములలోనికి యెక్కువ ఉధృతముతో బంపబడుటచే నీ అవయవము విస్తరింపు నందుట.

కాలిజమునందు యెక్కువరక్తము కూడియుండుటగాని, కాలిజము వాపునందుటగాని, కాలిజము యొక్క పుండునగాని, ఉష్ణశీతలములు గలుగజేయు ముఖ్యకారణము, ఉష్ణప్రదేశములయందలి దేశములలోని శీతోష్ణస్థితి యొక్క గుణాగుణములను బట్టియుండియున్నది. సమశీతోష్ణదేశములయందు కంటె ఉష్ణదేశములయందు కాలిజమునకు పిత్తమును స్రవించు వ్యాపార మెక్కువగుటవలన నీ అవయవము ఉద్రేకత నందుచున్నది. సమశీతోష్ణదేశములందు శ్వాసకోశముల ద్వారా వెలువరుపబడు కొన్ని ద్రవపదార్థములు, ఉష్ణదేశములందు కాలిజమునుండి యెక్కువ పైత్యద్రవము స్రవింపబడుటవలన శరీరమునుండి వెలువరింప జేయబడుచున్నవి. కావున నీదేశమునందు యీ అవయవమునకు యెక్కువపనిగలుగుచున్నది. ఎండ తగులుటవలనను, ఎండవేడిమిక్కిలి, శరీరమునకు చెమట అధికమయి చర్మము నీరసస్థితిని జెంది, చిరచిరలాడు గుణమును ఆవహించి, వాయుప్రసంచలి బుడుపులనపనరించియు గలుగుచుండెడి శీతోష్ణములలోని అధికమార్పులవలన చర్మము మిగుల సున్నితముగ నుండును. కావున శరీరముయొక్క ఉపరిభాగము సులభముగా చల్లదనమునందుటవలన, రక్తమంతయు లోగల అవయవములకు బంపబడుటవలన కాలిజమునకు యీస్థితిగలిగి అస్వస్థత గలుగుటకు కారణమగుచున్నది. ఈ సందర్భమున, శరీరముయొక్క ఉపరిభాగమునకు ఉష్ణత గలుగునప్పుడు రక్తము పయిభాగములం దెక్కువగ ప్రసరించుచుండుననియు, శీతలత దగులునప్పుడు రక్తము అంతరావయవములకు విశేషించి పంపబడుననియు, యీసాధారణాంశములను గమనించవలసి యుండును.

పిత్తాశయ సంబంధమగు రక్తము కూడుకొనుట కీదిగువ లక్షణము లుండును:— నాలుక బెరడుకట్టుట; నోటియందు చేదు; ఉత్సాహము తగ్గియుండుట; ఆకలి మందగించుట; తలనొప్పి; విరేచనక్రియము తప్పుట; విరేచనము నల్లగానుండుట లేక రంగును తగ్గియుండుట; తరుచుగ విరేచనబద్ధము గలిగియుండుట; వాంతి వచ్చునట్లుండుట; కుడిభాగము బరువుగాను నిండుగాను యుండినట్లుండుట.

ఈలక్షణము లుండినయెడల కాలిజము మాంద్యత వహించియున్నదని చెప్పవచ్చును. ఈలక్షణములే సామాన్యముగ నుండినయెడల పైత్యోద్రేకము జనించినదని చెప్పవచ్చును.

దీర్ఘశ్వాసము తీసికొనునపుడు అశక్తత, దగ్గుటయాలక్షణములు ప్రాముఖ్యముగ నుండినయెడల, కుడిశ్వాసకోశము క్రిందనుండియున్న కాలేజముయొక్క భాగమును, ఒకప్పుడు శ్వాసకోశము సహితమును, అస్వస్థతనంది యుండునని మనము గ్రహించవలయును.

చికిత్స.

| | | |
|---|---|---|
| పోడోఫిల్లం రెజిను | ... | గ్రా॥ 6 |
| సల్ఫ్యూలా క్వినైను | ... | గ్రా॥ 15 |
| ఎక్స్ట్రాక్ట్ హాయొసైమసు | ... | గ్రా॥ 6 |

ఇవి అన్నియును కలిపి ఆరుమాత్రలుగా జేయవలయును. ఇందులో ఒకమాత్ర యిచ్చి పిమ్మట నాలుగు గంటలకు 4 వ విరేచనకారి నీయవలయును. విరేచన బద్ధముగానుండి గ్రహణి వ్యాధి లేకుండినయెడల, యీ మందుల నియ్యరాదు.

గ్రహణి లేకుండినయెడల, దృఢమైన యొడలు గలిగియు సామాన్యముగ నారోగ్యత యుండినట్టియు రోగికి, యీ క్రింది చికిత్స జేయవచ్చును. పయిన నుదహరింపబడిన విరేచనకారుల నొకపర్యాయము యిచ్చిన పిమ్మట, 2 గ్రెయినుల టార్టార్ యెమిటిక్ ను 2 డ్రాముల సైట్రేటు ఆఫ్ పొటాసియంతో బాగుగా కలియునట్లు చేసి, దీనిని 8 భాగములుగా లేక పొట్లములుగా జేసి ప్రతిగంటకును ఒక్కొక్క పొట్లమును యియ్యవలయును. టార్టార్ యెమిటిక్ వలన మిగుల త్రిప్పుటయు, వాంతియునయినయెడలగాని, లేక విరేచనములు యెక్కువగా నగునట్లు చేసినగాని, 8 పొట్లములకును 1 గ్రెయినుమాత్రమే టార్టార్ యెమిటిక్ను యుపయోగించి వేరు పొట్లములుకట్టి వాటిని వాడవలయును. తక్కువ దార్ఢ్యత గలవారికి 20 గ్రెయినుల అమ్మోనియం క్లోరైడును జలములో గలిపి దినమునకు మూడుసారు లియ్యవలయును.

## (8) కాలేజముయొక్క దీర్ఘ వ్యాపితమగు వాపుదల

కాలేజముయొక్క వాపుదల యుద్రేకగతినుండి తత్ఫలితముగ దీర్ఘ వ్యాపితమగునది కావచ్చును. లేక రక్తము కూడుకొనుట తరుచుగ దటస్థించుటచే నిట్లు కావచ్చును. ఒకానొకప్పుడు యిది క్రమక్రమముగా వచ్చుచుండుటవలన చాలకాలము అశ్రద్ధ చేయబడుటచే సంపూర్తియగును. కుడిభాగమునందు బరువుగా నుండుటనుండి అప్పుడప్పుడు పోటు పొడుచుచుండుట, ఆకలి క్షీణించుట, కడుపు ఉబ్బరము, అజీర్తివ్యాధియొక్క యితరలక్షణములు — పిత్తతో గూడుకొనియుండును. కాలేజముయొక్క యీసంబంధమగు నొకవిధమగు వ్యాధియందు కాలేజము విస్తరింపజేయబడి ప్రక్కయెముకల క్రింద చేతులతో వడిమి చూచుట వలన గనుగొనుటకు వీలగును. మత్తుపదార్థములను త్రాగు వారికి యీవ్యాధి సంభవించినయెడల, కొన్నిదినములకు కాలేజము సన్నగిలి స్వాభావికముగ నుండిన దానికంటెయు క్షీణించును. ఈ రెండువిధముల వ్యాధులయందును ముఖము పాలిపోయి, ఒడలంతయు పాడిగానుండి, రోగిమిగుల అధైర్యమునొంది నీరసస్థితియందుండును. విరేచనము పల్చగా నున్నను గట్టిగానున్నను లేతపసుపుయొక్క రంగునుగలిగియుండును. మూత్రద్రవమువలన

మూత్రము తీవ్రవర్ణము వహించి యుండును. ఒకప్పుడు యీస్థితియందు పచ్చకామాల వ్యాధి తటస్థించును. పేగులనుండియు ముక్కునుండియు ఒకానొకప్పుడు రక్తము కారుట సంభవించును.

కాలుకు సంబంధమగు విషములు కారిజము ననుసరించి గ్రుంథులగాన స్వయముగ గాని పితృధనముగ గాని యీవ్యాధిని సంపాదించినవారు కారిజమునందు రక్తము పూడు కొనియుండు వ్యాధిచే బాధనొందునపుడు ప్రత్యేకముగ చికిత్స నందవలయును.

చికిత్స.

ఉదయమున 4 వ విరేచనకారి నుపయోగించుట వలనను భోజనపదార్థములయందు జాగ్రతగానుండుట వలనను, మత్తుపదార్థములను త్యజించుటవలనను,ఉపశాంతి గలుగజేయును. వ్యాధి శాంతతినందక పోయినయెడల సమశీతోష్ణస్థితిగల ప్రదేశమున కేగుటవలన నుపయోగముగ నుండును.

ఈ క్రింది ఔషధయోగములను ఉపయోగింపవచ్చును.

| | |
|---|---|
| డైల్యూటె నైట్రిక్ ఆసిడ్ | డ్రాము 1 |
| డైల్యూటె హైడ్రోక్లోరిక్ ఆసిడ్ | డ్రాము 1 |
| టింక్చర్ ఆఫ్ జింజర్ | డ్రాము 1 |
| జలము | ఔన్సులు 8 |

దినమునకు మూడుపర్యాయములు ఒక్కొక్క ఔన్సుచొప్పున పుచ్చుకొనవలయును. ఈమందు పుచ్చుకొనిన పిమ్మట నోరు కడుగుకొనవలయును.

8 వ విరేచనకారిని గాని 3 న అల్టరేటివును గాని గూడ వాడవచ్చును. వీటిలో నేదైన నొకటి గుణము నియ్యవచ్చును.

## (4) కారిజము యొక్క పుండు లేక వ్రణము.

1. కారిజమునందు రక్తముకూడుకొని యుండునప్పుడుగాని, కారిజముయొక్క వాపుదల ఉద్రిక్తస్థితియం దుండు నప్పుడు గాని, యీదిగువ లక్షణములు గూడియుండినయెడల కారిజమునందు పుండు పుట్టుచున్నదని యెంచవచ్చును. చలిపుట్టుట, చల్లని చెమటలు గలుగుట; నాలుకపై విడువకుండ పొరకప్పుట; మూత్రము తగ్గుదలనంది తీవ్రవర్ణమును వహించి యుండుట; మూత్రమునందు గసి తేలుట; రాత్రులయందు జర్వ మధికమగుట, అజీర్తి విరేచనములు

2. దీర్ఘవ్యాపితమగు కారిజముయొక్క వాపుదలయందు యీపుండు క్రమేణ కలుగుచుండును. ఈ వాపుదలయొక్క ఉద్రిత తగ్గగనే, పుండు ప్రారంభమయి, రోగి ఆరోగ్యతనందక, నీరసించి, అప్పుడప్పుడు చలికలుగును. సాయంకాలమునందు జ్వరచిహ్నము కలుగుచు, నాలుకపై, పొరగప్పి, నాలుకయొక్క కొనయందును అంచులయందును యెర్రగ నుండి, కడివైపుల బరువుగాను ఆయాసము నిచ్చునట్లుగాను ఉండి, అరచేతులు పొడిగా నుండి — యీ లక్షణములతో గలిసియుండును.

3. కారిజమునకు దగ్గర కెమియు వాపు లేకుండగనే ఒకానొకప్పుడు పుండు తటస్థింపవచ్చును. రోగి చిక్కిపోయి, మనోవ్యాకులత బ్రవేశించి, బండబారిన పోటు పొడుచుచు కుడిప్రక్కను బరువుగానుండి, కొంచెముగా దగ్గు ప్రవేశించి యుండవచ్చును. ఈ శైలిక యగుగుణములవలన పుండు యేర్పడుచున్నదని అనుమానము కలుగకపోవచ్చును. వణకుట, ప్రారంభమయి, చల్లని చెమటలు పుట్టి కారిజము వాపునంది నట్లు కనుపడునంత వరకును వ్యాధియొక్క యథార్థస్థితిని గుర్తింపబడి యుండుటలేదు.

4. గ్రహణివ్యాధియొక్క వృద్ధియందలి అలసట, చిక్కిపోవుట, సాయంకాలము నందు జ్వరము వచ్చుట, ఆవ్యాధియందలి దానికంటె నెక్కువ ఉద్రుతను వహించియుండిన యెడలనున్నా, నాలుకమధ్యయందు బెరడు కట్టి కొనయందును అంచుయందును యెర్రగానుండిన యెడలనున్నా, ప్రక్కవైపుల నొప్పిగానున్నా, బరువుగానున్నా యుండినయెడలనున్నా, పుండు ప్రారంభించినదని అనుమానించ దగియుండును. వణకుట యుండినయెడల, పుండును గురించిన అనుమానము నివర్తియగును.

కారిజముపైన పుండు ప్రారంభమయినపుడు, ఒకప్పుడు అన్నకోశము వైపులకు పైభాగమున వాపులో గనబడవచ్చును. ఒకప్పుడు అన్నకోశము లోనికే కురుపుగా దేలి వాంతి మూలముగా బయలు వెడలిపోవును. ఇంకొకప్పుడు పేగులలోనికి ప్రవేశించి మలినమంతయు మలముద్వారా పోవచ్చును. మరియొకప్పుడు శ్వాసకోశములో ప్రవేశించి దగ్గుమూలముగా బయలు వెడలును. ఈమార్గములేమియు వీలులేక పోయినప్పుడు, ఎదురొమ్మునందలి పేగుల యందలియు అంతర్భాగములలోనికి జొచ్చుటవలన, బయటికి పోవుటకు మార్గములేదు. కురుపు పైకి దేలుచున్నపుడు, చర్మము యెర్రబారిన స్థలమందు, కురుపును దరచి పిండికట్లు కట్టవచ్చును. కురుపు గొప్పది కాకపోయినయెడల, యిందుమూలమున మలినములన్ని యు బయటకువచ్చి, కురుపు క్రమముగా మాని, రోగికి నెమ్మది కలుగవచ్చును. తక్కినవిషయములలో, సాధ్యమయినంత త్వరలో తెలివైన శస్త్రవైద్యునికి జూపించి శస్త్రము చేయించుటయే మంచిది. అంతవరకును, రోగికి బలమయిన ఆహారము నిచ్చుచు, బాధను తగ్గించుటకుగాను క్లోరల్ హైడ్రేసును యిచ్చుటకంటె చేయునది యేమియులేదు. శస్త్రము చేయుట ఆలస్యము చేసినకొలదిని అపాయము యెక్కువగుచుండును. కురుపు విశేషించి పెద్దది అయియున్నప్పుడు, ఒకటికంటె యెక్కువ కురుపులు ఉండియున్నప్పుడును, సామాన్యముగ మరణము సంభవించును.

5. కారిజముయొక్క నరముల సంబంధమగు వ్యాధి:— కుడివైపున కొంచెము బరువుగా నుండి, కొద్దిగా అసౌఖ్యతతో గూడిన లక్షణము లుండి యుండునును. కుడిభుజము అలసట జెందిన ట్లుండుచు, నీరసము: మనోస్థిరత లేకపోవుట, విచారము ఉండియుండును. ఆకలియు జీర్ణతయు క్రమముగానుండి రోగికి నిద్రపట్టు చుండును. మనిషియొక్క ఆరోగ్యత యేమియు చెడకుండ యీ విధముగ కొన్ని మాసము లుండిన యెడల నీ వ్యాధిని గనుగొనవచ్చును. ఒకప్పుడు ఈవిధముగ కొన్ని సంవత్సరముల వరకు గూడ నీ వ్యాధి వ్యాపింపవచ్చును.

చికిత్స.

బాధ అధికముగా నున్న యెడల సర్షపకొనుటకుగాను మస్టర్డు పట్టిని వేయవలయును. (1) వ ఔషధయోగమును (బలవర్ధకౌషధము) యీయవలయును.

---

## కింక వాయువు.

గొంతుపీకలోనున్నూ శ్వాసకోశములనుబోవు శ్వాస నాళములలోనున్నూ శ్లేష్మసంబంధమగు యొక తెల్లనిపదార్థము చేరుకొని, యీపదార్థము యీశ్వాస నాళములలోనే అడ్డుపడుటవలనగాని, లేక గొంతునుండి గొంతుపీకలోనికి బోవు చిన్నరంధ్రమునం దడ్డుపడుటవలనగాని, ఊపిరిపీల్చుట ఆయాసమయి యీ కింకవాయువు అనెడివ్యాధి కలుగుచున్నది. ఒకప్పుడు సాధుగతులయందు యీపదార్థము సరిగ నేర్పడకుండగనే, తెమడ వదలిపోయి వ్యాధి దానంతట అదియే స్వస్థగొనును.

ఒక సంవత్సరమునకును అయిదు సంవత్సరములకును మధ్యవయసునందు మాత్రమే యీ వ్యాధి యెక్కువగ దటస్థించుచుండును. అయిదు సంవత్సరముల పిమ్మట నీ వ్యాధి వచ్చుటయే తక్కువయి యున్నది; వచ్చినను తేలికగా స్వస్థగొనును.

ఈవ్యాధికి కారణములు, చలిగాలి తగులుట, చెమ్మ తగులుట, అయియున్నట్లు సామాన్యముగా చెప్పబడుచున్నది. కొందరి పిల్లలయందు యీవ్యాధికి ఉద్భవశక్తి అతిశయముగనుండి, వారు తరచుగ నీవ్యాధికి లోనగుచుందురు. ఈవ్యాధి యొకసారి తటస్థించిన యెడల మరలి మరలి వచ్చుట సామాన్యముగ గలుగుచున్నది.

### లక్షణములు.

కింకవాయువు ఒకానొకప్పుడు అకస్మాత్తుగ దటస్థించి రాత్రియందు ఊపిరి పీల్చుటయందలి ఆయాసముతో ప్రారంభమగును. చాలవిషయములలో కొన్ని దినములవరకును జ్వరతీవుండి, తుమ్ములుతుమ్ముట, కండ్లవెంబడి నీళ్ళుకారుట, పొడిదగ్గు, జలుబుగల సంబంధమగు నీ లక్షణములతో గూడియుండును. గొంతు బొంగురుబోయి యుండును. ఇట్టి సూచనలక్షణములు ఒకప్పుడు ఉండియు, ఒకప్పుడు లేకుండగను, బిడ్డ ఊపిరిని పీల్చుటయందలి విశేషమగు అయాసముతోడను, మొఱిపెట్టునట్టి దగ్గుతోడను నిద్రలేచును. ఈదగ్గుయొక్క ధ్వని వికారముగా నుండును. కోడికూయునట్టిగాని కుక్కమొరగునట్టిగాని ధ్వనివలెనుండి, లోహసంబంధమగు ధ్వనిని వహించి యుండును. ఊపిరిని పీల్చుట ఆయాసమయి, గుడ్డద్వారాగాని లోహపుగొట్టముద్వారగాని ఊపిరిని పీల్చినట్లుండును. ఈ ఆయాసమును దగ్గును తెరలుతెరలుగా వచ్చుటకు మధ్యకాలములందు బిడ్డకు కొంచెము నిద్రపట్టవచ్చును. దగ్గు మొదటలో పొడిగానుండును. పిమ్మట తెమడ వెళ్ళిపోయి శాంతిని గలుగజేసి, వ్యాధి అంతరింపవచ్చును.

వ్యాధి యీవిధముగా కుదిరిక నందకపోయిన యెడల తెల్లని పొరసంబంధమగు పదార్థము వెలువడుట ప్రారంభమగును. ఈ పదార్థము బయటికి పోవునట్లు చేయుటకు ప్రయ

త్నము నిశ్శేషమగును. ముఖము యెఱ్ఱవారి శరీరమంతయు చెమటపట్టును. హస్తములంగ ళ్లిగా మూయబడి వేళ్లు యిటునిటు కొట్టుకొనుచు, పక్కబట్టలు త్రోసివేయబడును. బిడ్డ ఒకప్పుడు కూర్చుని ఒకప్పుడు పరుండి తలవెనుక వయిపులకు బిగదీసికొని పోవును. కన్నులు పొడుచుకొనివచ్చి కంఠములోని తెలుపులు రక్తమయములయి యుండును. నాడి త్వరగాను కఠినముగాను ఉండును. ఒడలంతయు మాటగానుండి దాహ మధికముగా నుండును. ఏదియో అడ్డమును దీసివేయుటకయి యున్నట్లు బిడ్డ చేతిని తరచుగ నోటియొద్దకు దీసికొనుచుండును. ఉదయమునందు యీ లక్షణములు తగ్గి నెమ్మదించుచున్నట్లు కనుపడవచ్చును. ఇందువల్ల పూర్తిగా నెమ్మదించినదని అనుకొనుటకు వీలులేదు, సాయంకాలమునకు వ్యాధి తిరిగి రావచ్చును. పలుసలుసలుగా నుండెడి పదార్థము దగ్గుమూలమున తెమడగా వెళ్ళిపోయిన పిమ్మట వ్యాధి కుదిరిక నందినను అందవచ్చును; లేక దగ్గుయొక్క తెరలును ఊపిరిని పీల్చుటయందలి ఆయాసముచే శక్తిక్షీణతవలన దగ్గుయొక్క ధ్వని క్షీణించి గురకతో గూడినదై గొంతుపై మెలివేసినట్లుండి, అలసటవలనను ఊపిరి తిరుగకపోవుట తటస్థించును. తరచుగా నంతిమస్థితియందు నొకటిరెండు యిట్టి తెరలువచ్చి మరణము సంభవించుటయు కలదు. ఈవ్యాధియొక్క పరిమితి యిరువదినాలుగ గంటలు మొదలు అయిదు దినములవరకు నుండును.

### చికిత్స.

కంఠవాయు ప్రబంధమగు దగ్గుగాని గొంతు బొంగురుపోవుటగాని, తటస్థించిన వెంటనే నీక్రింది ఔషధయోగము నిచ్చి, రోగికి ముఖ్యముగా రాత్రియందు చలిగాలి తగులకుండునట్లు జాగ్రత్త పడవలయును.

| | | | |
|---|---|---|---|
| టింక్చర్ క్యాంఫర్ కో | ... | డ్రాము | 1 |
| వైనం ఇపికాక్ | ... | మినిములు | 20 |
| స్పిరిట్ ఈథర్ నైట్రిస్ | ... | డ్రాము | 1 |
| జలము | ... | ఔన్సులు | $2\frac{1}{2}$ |

ఈ ఔషధము, ఒక సంవత్సరము వయసునందొక డ్రామును యిచ్చి అంతకుయెక్కుడు వయసుండిన యెడల ప్రతి సంవత్సరమునకు నొక అరడ్రాము చొప్పున మోతాదును హెచ్చుచేయవలయును.

కంఠవాయువు ప్రవేశించినదని స్థిరముగ తెలిసినయెడల, వాంతికారిని వెంట నేయియ్యవలయును. రెండున్నర లేక మూడు సంవత్సరముల వయసుగల దార్ఢ్యముగు బిడ్డకు రెండు డ్రాముల వైనం ఇపికాక్‌ను రెండు లేక మూడు ఔన్సుల జలములో గలిపి యియ్యవలయును. బిడ్డకు శరీరదార్ఢ్యత లేకపోయిన యెడల, మోతాదును తగ్గించి ఒక డ్రాము వైనంఇపికాక్‌ను మాత్రము రెండు లేక మూడు ఔన్సుల జలములో గలిపి యియ్యవలయును. శుభ్రముగా వాంతి యయ్యెవరకును యీ ఔషధమును ప్రతి అయిదు నిమిషములకును యియ్యవలయును. వాంతికారికి తోడుగ 98 మొదలు 100 డిగ్రీల ఫారన్‌హీట్ వేడిమిగల నీళ్ళయందు రోగిని స్నానము చేయించవలయును. ఎనిమిది నిమిషములలో నీస్నానమును నిలిపివేసి

అప్పుడు రోగిని శుభ్రముగా దుడిచి, దుప్పటి కప్పియుంచవలయును. వాంతికారుల నిచ్చుట వలన గుణము నిచ్చిన పిమ్మట విరేచనము క్రమముగా గాకపోయిన యెడల ఒక్క డ్రాము చిట్లాముదము నియ్యవలయును. నివారించుటకు గాను నల్లమందు సంబంధమగు వాటి నేమియు నియ్యరాదు. అందువలన కఫము స్రావమును కలుగగలదు. వేడినీళ్ళలో గుడ్డను పిడిచి తడుచుగా గొంతుపైన దుడుచుచుండుటవలన గుణముగ నుండును. వ్యాధియుండు నంతటను రోగి యొక్క శరీరబలమును గాపాడుట ముఖ్యము గనుక, బలమును గలుగజేయు ఆహారములను లోనికిచ్చుచుండవలయును. రోగి నివసించియుండు గదిలో ఉష్ణమధిక మగుటకొరకుగాను వీలయినన్ని యెక్కువదీపములను వెలిగించవలయును. గదిలోని వాయువునందలి నీటిభాగము అధికముగా నుండునట్లు గదికి బయట నెచ్చటనైన నీళ్లను మసల గాచి, అందలి ఆవిరి ఒకగొట్టము ద్వారా గదిలోనికి వచ్చునట్లు చేయవలయును. ఈ నీళ్లను గాచుటకు గదిలోని నిప్పును మంట పెట్టకూడదు. గదిలోనే నిప్పును పెట్టినయెడల పొగ వచ్చును. యీపొగ రోగికి మంచిది కాదు. ఇదిగాక ఆవిరి పైకిపోయి రోగికి యేమియు ప్రయోజనము లేకుండ నుండును.

అన్ని చికిత్సలును నిరుపయోగములైనపుడు గొంతుదగ్గర శస్త్రము చేయుట వలన నొకప్పుడు జయప్రదమగును. ఈపని సర్జను వలన మాత్రమే చేయించవలయును.

కింకవాయువునకు లోనైన బిడ్డలయందు జలుబు చేయకుండగను దగ్గురాకుండగను కాపాడుచు, తేలికగ జీర్ణమగు ఆహారపదార్థముల నిచ్చుచుండ వలయును.

---

## కురుపులు.

### కురుపులకును వ్రణములకును గల భేదము.

కురుపులకును వ్రణములకును భేదమును గమనించవలసి యున్నది. కురుపుల యొక్క మధ్యభాగము గట్టిగా నుండియుండును. వ్రణములయం దట్లుండదు. వ్రణములయందు నిర్జీవమగు కండ లేక మాంసము ఉండదు.

### వ్రణములు.

శరీరమునం దేభాగమునందయినను, బాధతోగూడి వాపుదలనంది క్రమముగానొకప్పుడు శీఘ్రముగానునూ, ఒకప్పుడు ఆలస్యముగానునూ కొంచెము పసుపువర్ణముగల చీము బయలు వెడలు దానికి వ్రణమందురు. వ్రణములు శరీరమునం దేభాగమునందైనను లేవవచ్చును. పంటి చిగుళ్లపై పుండ్లకును, గోరుచుట్టునకును, స్తన్యమునిచ్చు కాలమున స్తనములపై గనబడు బాధతో కూడినవాపుదలకును, మెదడునందలియు కాలిజము నందలియు పుండ్లకును, వ్రణము అనిపేరు వాడుదురు. ఏదైనా దెబ్బతగులుటవలనగాని చలిగాలి తగులుటవలనగాని, ఆహారములేమి వలనగాని కొలుకు సంబంధమగు వ్యాధుల ఫలితముగగాని, శరీరముయొక్క నీరసస్థితులననుసరించి గాని, వ్రణములు కలుగవచ్చును.

వ్రణములు రెండు తరగతులుగా నుండును. ఒకవిధమగు వ్రణములలో వాపుదలయు బాధయు అతిశయముగానుండి వాటినడకయు చురుకుగా నుండును. రెండవవిధమగు వ్రణములు

నెమ్మదిగా హెచ్చుచు బాధ సామాన్యముగ నుండి చర్మము యెఱ్ఱగానుండినను ఉండును. లేకపోయిన లేకపోవచ్చును. మొదటి తరగతిలో రెండు లేక మూడు దినములలోగానే లేక కొద్దిగంటలలోనే గాని వాపుదల అతిశయమయి యెఱ్ఱగానుండి బాధ యెక్కువై చర్మము విస్తరింపునది మధ్యభాగమునందు ఊదరపువర్ణము తీవ్రముగనుండును. వాపుయెక్కువయిన కొలదిని బాధగూడ అతిశయమయి పోట్లు పొడుచుచుండును. వ్రణసమీపము నందలి చర్మమును, దానిచుట్టు పట్లయందును ఉబ్బుదలజూపి వ్రేలుతో నొక్కినయెడల సొట్టపడి ఆగుర్తు కొంతసేపటివరకు అటులనే యుండును. వ్రణమునందలి మధ్యభాగము క్రమముగా మెత్తబడి పక్వమునకువచ్చి యిచ్చటి చర్మము పల్చనై యెక్కువ స్ఫుటమగుచు తీవ్రమైన యెర్రని వర్ణముపోయి పసుపు నీలవర్ణములుం గలిసిన చుక్కయేర్పడును. ఈ సమయమునందు వాపుఅంతయు మెత్తనై రెండు చేతులయొక్క వ్రేళ్లతోను మెల్లగా నొత్తుటవలనలోపలిచీము చెడురక్తము కదలుచున్నట్లు కనుగొనవచ్చును. చిట్టచివరకు వ్రణముపగిలి అందలి మాలిన్యమంతయు, ఒకటి లేక అంతకెక్కుడు ద్వారములగుండా బయటికి వెడలిపోయి మొదటగా వెడలునట్టి మలినము అధికముగానుండి చిక్కనై పసుపువర్ణమును గలిగియుండును. వ్రణముయొక్క రంధ్రము ముడుచుకొని మూసికొనిపోవు సరికి యీమలినము రక్తముతో గూడినదియై స్వచ్ఛముగాను పల్చగాను యుండును. వ్రణము మానుటయందు చర్మముయొక్క పైపొరలు ఊడిపోవును. వ్రణముయొక్క ఉద్రేకమునుబట్టి, జ్వరత వణకుట తలనొప్పి వీపుయందును కీళ్ళయందును నొప్పులును తటస్థమగును. చర్మము మందముగానున్న స్థలములయందును లోపలి భాగములయందు, అనగా ఒకవిధమగు గోరుచుట్టు మొదలగు వ్యాధులయందు, వ్రణములు తేలుటకును మిగుల ఆలస్యమయి బాధ యెక్కువగును. రెండవవిధమగు వ్రణములు దీర్ఘవ్యాపితములై అంతయెక్కువ కఠినములైనవి కావు. జ్వరతయును తలనొప్పియును తగ్గుదలనంది చలి లేక పోవచ్చును. వాపుదల మెల్లగా నభివృద్ధిజెందుచు, బాధయు కొంచెముగా నుండవచ్చును. చాలకాలమునువరకు చర్మముపై నుబ్బుదల గనపడక పోవచ్చును; తుదకు యెఱ్ఱనై ఒక చిన్న ద్వారముగుండ రసి కారిపోవును. ఇట్టి వ్రణములయం దారంభమున విశేషజ్వరముండకపోయినను, చిట్టచివరకు ఉద్రిక్త జ్వరము రావచ్చును. దీర్ఘవ్యాపితమగు వ్రణములు సామాన్యముగ స్ఫటికగనుండి రసిగారుట అధికముగనుండి చాలకాలము వ్యాపించిన యెడల, దుర్బలముచేత వచ్చుజ్వరము రావచ్చును.

చికిత్స.

ముల్లు మొదలగునవి గుచ్చుకొనుట మూలమున గలిగెడి వ్రణములయిన యెడల, అట్టివాటిని దొలగించి, లింటును నాలుగు లేక అయిదు మడతలుగా వేసి ఔన్సు 1 కి 10 చుక్కల స్వచ్ఛమైన కార్బాలిక్ ఆసిడ్‌ను గలిపిన నీళ్ళలో దడిపి, పైన డ్రెస్ చేయవలయును. మిగుల బాధతోగూడిన వాపుదలయొక్క ప్రారంభమున, చీము, రక్తము కూడుకొనకుండునట్లు చల్లనినీళ్లతోగాని, ఒక అరఔన్సు నైట్రేట్ ఆఫ్ పొటాష్, ఒక అరఔన్సు హైడ్రోక్లొరేట్ ఆఫ్ అమ్మోనియా, ఒక అరఔన్సు సామాన్యలవణము—వీటి అన్నిటితో గలిపిన 12 ఔన్సుల జలములో లింటును దడిపి పైగట్టవలయును. వ్రణముచేసిన అవయవమునకు సంపూర్ణమైన విశ్రాంతి నిచ్చుటవలనను, సాధ్యమయినంతవరకు వ్రణావయవమును ఉన్నతస్థానమందుంచుటవలనను, విరేచనకారి నిచ్చుటవలనను, సారాయి మొదలగు

## కురుపులు.

ఇండియా దేశమునందు కురుపులు సామాన్యముగ తటస్థించును. ఈ కురుపులు యొకప్పుడు ఒకటిగా లేచుట కలదు. అనేకములుగా లేచుటయు కలదు. ఇవి అనేక పరిమాణములుగలిగి బఠాణీగింజ మొదలు కోడిగుడ్డు వరకును అంతకు అధికముగనుగూడ నుండి యుండును. ఈ కురుపులు సామాన్యముగ కాళ్ళు, చేతులు, మెడ వెనుకవయిపు, పంక, తొడలు సమీపమున—యీ భాగములయందు లేచును. కొన్ని విషయములలో బాధయు వాపుదలయు గలిగినను కొంతకాలము పిమ్మట చీదురక్తమును గూడుకొనుట లేకుండగనే వాటంతట అవియే అంతరించిపోవును. కలమీద నొకప్పుడు వందలకొలది కురుపులు లేచును. ఇండియా దేశమునందలి యీకురుపులు వేడిమివలన గాని దుర్వాయువువలనగాని చెడు ఆహారమువలన గాని అధిక పరిశ్రమవలన గాని జ్వరపీడనవలన గాని రక్తహీనతవలన గాని—రక్తమునందు గలిగెడి లోపమువలన కలుగుచున్నవి. ఇట్టి ఉద్యుక్తతలకు లోనయిన జనులయం దకస్మాత్తుగ స్నేగన దెబ్బలుతగులుట గాని, రోగముల నందుట గాని, దటస్థించినయెడల కురుపులు యేర్పడును. రక్తము విదురయిన సుగుణవలనను కురుపులు కలుగవచ్చును. పండ్లువచ్చునపుడు పిల్లలకు కురుపులు లేవవచ్చును. ఉష్ణప్రదేశములనుండి సముద్రతీరమునందలి పట్నములకు పోవుటవలన నొకప్పుడు కురుపులు కలుగవచ్చును. మామిడి పండ్లు తినుటవలన కురుపులు లేచునని కొందరు తప్పు అభిప్రాయము నందుచున్నారు. మామిడిఫలముల బుతువు వెనువెంటనే చెమ్మతో కూడిన అసౌఖ్యముగ నుండుటవలన రక్తము చెడిపోయి అధికముగ వాండుటవలన రక్తము చెడిపోయి కురుపులు లేచును. పచ్చికురుపులకు రాచపుండ్లని పేరుగలదు.

### చికిత్స.

అన్ని విషయములలోను రోగియొక్క సామాన్యమగు శరీరారోగ్యతను గురించి శ్రద్ధతో విచారించి తగు చికిత్సను చేయవలయును. నాలుక పొడ్డుబారి జీర్ణావయవములు అస్వస్థతయందుండినయెడల 6 వ విరేచనకారి నుపయోగింపవలయును. బలహీనులయెడల సల్ఫేట్ ఆఫ్ మెగ్నీసియాను ఒకటి లేక రెండు పెద్ద చెమ్చాలను ఒక అరటంబ్లరు జలములో వేసి యియ్యవలయును; స్కర్వీసంబంధమగు అనుమానముండిన యెడల, ఆహారపదార్థములయందు శాకపదార్థములు తక్కువగా అయినపుడు క్రొత్తగా కోసిన కాయగూరల నుపయోగింపవలయును. కొన్నిదినములవరకు ప్రతిదినమును రెండు లేక మూడు ఔన్సుల నిమ్మరసమును లోనకు పుచ్చుకొనవలయును. మూత్ర సంబంధమగు వ్యాధి యుండినయెడల, 3 వ అల్లరేటి పుచ్చుకొనవలయును. నిస్త్రాణము, రక్తహీనత, యుండినయెడల 1 వ బలవర్ధక ఔషధమును పుచ్చుకొనవలయును. ఏవిధమయిన సిలవ్యాధియు విశేషముగ నుండినయెడల సల్ఫేట్ ఆఫ్ సోడాతోడను, లేనియెడల నదిలేకుండగను, 6 వ విరేచనకారిని పుచ్చుకొనవలయును.

కురుపులయొక్క స్థలములయందు అవిసెపిండిని ఉడికించి పిండికట్టు కట్టవలయును. అత్తికాయల గట్టుటయు వాడుక గలదు. బోరాసిక్ లింటును నాలుగు మడతలుగ చేసి, ఉడుకునీళ్ళను పీల్చుకొండ దానిని మీద పైనవేసి కట్టినను కట్టవచ్చును. పలిసిన కూడ చీముయున్నప్పుడు పైకిలేచిన భాగమును పరిశుభ్రమయిన లాన్సెట్ (చిన్నకత్తి)తో కోయవ

యును. వ్రణములకు జేయు చికిత్సనే దీనికి జేయవలయును. దీర్ఘకాలము పీడించు కురుపులకు ప్రతి మూడు గంటలకు ఒకసారి స్పిరిట్సు ఆఫ్ క్యాంఫరును పైనరాయుటవలన, కురుపులు హరించిపోవును. రసి కారుట నిలచిపోయిన పిమ్మట సుండు పుండ్లను శుభ్రముగా కార్బాలిక్ లోషనుతో గడిగి, సింపిల్ అయింటుమెంటు వేయుటవలన మానగలవు.

కురుపులను బోగొట్టుటకు, కురుపుచుట్టును ఒకటి రెండు అంగుళములు మేరను ఒక ఈకతో లినిమెంటు ఆయొడిన్ ను, మొదటిదినము మూడుపర్యాయములును, తరువాత తరువాత తక్కువ పర్యాయములును అసలము పొక్కుచుండునట్లు మాత్రము రాయవలయును. లినిమెంటు బెలడోనాయొక్కయు గ్లిసరీను యొక్కయు సమానభాగములను గలిపి కురుపు నుండి మాలిన్యము రాకమునుపు వాపుదల యుండినప్పుడు, రాసినయెడల వాపుదల తగ్గిపోవును. క్యాల్సియం సల్ఫయిడ్ 1/10 గ్రెయిను గల మాత్రలను ప్రతి రెండు లేక మూడు గంటలకు నిచ్చినయెడల, క్రొత్తకురుపులు యేర్పడకుండగను, ఉండియున్న కురుపుల యొక్క ఉబ్బుదల తగ్గిపోవునట్లులను, విస్తీర్ణత తగ్గునట్లులను, జేయుచు త్వరలో వాటిని పక్వమునకు దెప్పించి, మాలిన్య మతిశీఘ్రముతో వెడలిపోవునట్లు పనిచేయును. ఇతరములగు మందు లేమి పుచ్చుకొనుచున్నను దీనిని పుచ్చుకొనవచ్చును.

## కుష్ఠరోగము.

కుష్ఠరోగము, ఐరోపాఖండమునకు తూర్పుదేశములనుండి ఐగుప్తుదేశము ద్వారా క్రీస్తుశకమునకు మూడు లేక నాలుగువందల సంవత్సరముల పూర్వము, గొంపోబడియున్నట్లు తెలియుచున్నది. పదునయిదవ శతాబ్దములకు మధ్యకాలములో, నతితీవ్రముగ వ్యాపించియుండెను. ఈ వ్యాధిపీడితులను విడిగా నుంచుటవలనను, ఆరోగ్యశాస్త్ర విధులను జక్కగ గమనించుటవలనను, ఆయాదేశములయం దీవ్యాధి చాలవరకు దరిమి వేయబడెను. బ్రిటనునందును, ఇతర ఐరోపియను దేశములయందును, యీ వ్యాధి స్వస్థానజనితమైయుండిన వారెవ్వరును, యిప్పుడు కానరారు. నార్వేదేశమునందును మధ్యధరాసముద్రమును నంటియున్న కొన్ని దేశములయందును మాత్రము, యింకను కొద్దిగ వ్యాప్తినంది యున్నట్లు తెలియుచున్నది. ఆసియా, ఆఫ్రికా ఖండములయందును, అమెరికా ఖండమునందు దుష్టప్రదేశములయందును యీవ్యాధి యింకను బలవత్తరముగనే అవహించియున్నది. ఇండియాదేశమునం దీవ్యాధి అచ్చటచ్చట నావరించియున్నను, యిప్పుడీదేశమునందు ఒకలక్షకు మించిన కుష్ఠరోగపీడితులుం కలరని లెక్కలవలన దెలియుచున్నది. చీనాదేశమునందలి సంఖ్య మిగుల అధికమయియున్నది.

ఈవ్యాధి అంటువ్యాధి అయియున్నది. ఒకవిధమగు పురుగు శరీరమునందు బ్రవేశించుటవలన నీవ్యాధి కలుగుచున్నది. ఈపురుగు 1874 సం॥ లో హాన్సన్ అనునాతనివలన గనుగొనబడినది. ఈవ్యాధి అన్ని వయస్సులయందు దటస్థింపవచ్చునుగాని, యౌవనమునందును బాల్యమునందును మిగుల దక్కువైయున్నది. వ్యాధి అంకురించినది మొదలు బయల్పాగి యగుసరికి సామాన్యముగ రెండు లేక మూడు సంవత్సరములు పట్టును. ఈపరిమితి కొన్ని విషయములలో మిగుల హీనమయినచో మూడు మాసములు కావచ్చును, పరిమితి మిగుల అతిశయమయినచో ముప్పది సంవత్సరములును యొకానొకప్పుడు పట్టును.

కుష్ఠురోగము మూడువిధములయి యున్నది. మొదటిది గుండ్రమైనట్టిగాని వంకరలైనట్టిగాని తామ్రవర్ణము గలిగినమచ్చలు శరీరమునం దేభాగమున నయినను లేచి, తరువాత తెల్లనై, అస్వస్థతనందిన చర్మము బండబారి పోవును. ఈ అస్వస్థత కాలివ్రేళ్ళయందుగాని, చేతి వ్రేళ్ళయందుగాని, ముఖమునందుగాని, శరీరమునం దేభాగమునకైనగాని తటస్థింపవచ్చును. రెండవది చర్మముపైని నెత్తుగ కాయవలె వృద్ధినొంది యీ అస్వస్థప్రదేశములయందు పుండ్లుయేర్పడి క్రమక్రమముగ నీ పుండ్లు నరాలయందున మాంసమును, ఎముకలనుగూడ తినివేయబడి, కాలి వ్రేళ్ళు ఊడిపోవును. మూడవది పైరెండు విధములను కలిసినదై యున్నది.

## చికిత్స.

కుష్ఠురోగమునకు సరియైన మందింకను కనిపెట్టబడి యుండలేదు. ఓలియంగైనొకార్డి యనుదానిని 2 చుక్కలు మొదలు 40 చుక్కలవరకును దినమునకు మూడు పర్యాయములు చొప్పున యిచ్చుటవలన గుణముగా నుండగలదు. ఆర్సెనిక్ (పాషాణము) లోనికిచ్చుట వలన బలవర్ధకౌషధముగ పనిచేయగలదు. అన్నా అనునాయన, ఇక్ థియాల్ను ప్రవర్ధమానముగు మోతాదులలో లోనికిచ్చుచు, ఆనొలీన్ ఆయింట్మెంటులో, పదవవంతు పైరోగ్యాలిక్ ఆసిడ్నుగాని, పదవవంతు క్రియొసోఫానిక్ ఆసిడ్నుగాని, కలిపి పైన రాసినయెడల, ఉపశాంతి గలుగగలదని చెప్పుచున్నాడు. ఆరంభదశయందు, సాలిసైలేట్ సంబంధమగు లవణములను 15 గ్రెయినుల మోతాదుతో ప్రారంభించి దినమునకు నాలుగు పర్యాయములిచ్చుచు, క్రమముగా మోతాదును హెచ్చించి ఆరుమాసములవరకు యిచ్చిన యెడల, తప్పక గుణము గనబడగలదని డానియల్సన్ అనునాయన చెప్పియున్నాడు.

కుష్ఠురోగము అంటువ్యాధి గావున నీవ్యాధితో బాధనందువారిని విడిగానుంచి జనసంఘములతో సంబంధము లేకుండ జేయవలయును.

---

## కొంకరలు పోవుట.

కొంకరలుపోవుట అకస్మాత్తుగ దటస్థించదు. ఈవ్యాధి తటస్థించుటకు ముందు కొన్ని లక్షణములను గుర్తింపవచ్చును. బొటనవ్రేళ్లు అరచేతుల వైపునకు ముడుచుకొని పోవుట, వ్రేళ్ళు పట్టుపట్టుట, కాలిమ్రేళ్లు ముడుచుకొనుట, నిద్రయందు ఉలికిపడుట, వంకర చూపులను చూచుట, ముఖము కదలించుట, యీ లక్షణములతో గూడి యుండును. ఇట్టి గుణములు కనుపడినపుడు జీర్ణావయవముల యొక్కయు పండ్లయొక్కయు, ఆహారము యొక్కయు స్థితులు విచారింప బడవలయును.

బిడ్డలు ఒకానొకప్పుడు రాత్రులయందు భయపడి నిద్రలేచి ఉద్రేకముగా నేడ్వ నారంభింతురు. ఇందులకు కారణము నాసికాబిలములు బిగిసియుండుటవలన నై యుండవచ్చును. ఈ భయోద్రేకము కొంకరలు పోవుటలోనికి యీడ్వబడవచ్చును. అజీర్ణతయు ఒకానొకప్పుడు యీభయమును బుట్టింపవచ్చును. ఇంకొకప్పుడు నిద్రనుండి లేచినతోడనే ఊపిరిని బీల్చుట ఆయాసమయి ముఖమంతయు ఎర్రబారి బిడ్డ ఉక్కిరి బిక్కిరి యగుట తటస్థించును. ఊపిరిని పీల్చలేక పోవుట వలనను అలసటవలనను యొకప్పుడు మరణము గలుగ వచ్చును.

చికిత్స.

మెడవైపుల నుండెడి గుడ్డలన్నియు శీఘ్రముగా సడలింపఁ జేయుటయు, పరిశుభ్రమగు గాలి లోనికివచ్చునట్లు జేయబడి బిడ్డకు గాలి తగులునట్లు చేయవలయును. ముఖముపైన చల్లని నీళ్ళుకొట్టి విసరుచు వీపుపైన గట్టిగా రుద్దవలయును. ఉప్పునీళ్ళలో నొక గుడ్డను పిండి, దీనితో గొంతుపైని తటాలున రుద్దిచి, ఒక అరనిమిషమైన పిమ్మట తీసివేసి యిదే పద్ధతిని ప్రతి అయిదునిమిషములకును ఒకపర్యాయము చొప్పున ననేక మారులు చేయవలయును. భోజనానంతరము యీవ్యాధి తటస్థించినయెడల, వాంతికగునట్లు ఒక యీకను గొంతులోనికి బోనిచ్చి వాంతిని కలిగింపవలయును. పళ్ళుచిగుళ్ళు మృదువుగనుండి ఉబ్బిన యెడల వెంటనే కత్తితో గీరవలయును. దీనితో వాంతి కాకపోయినయెడల, ఒక డ్రాము వైనం ఇపికాక్ ను ఒక అరఔన్సు జలములో గలిపి యియ్యవలయును. వీటివలన సామాన్య ఉపశాంతి కలుగగలదు. ఒకప్పుడు ఉపయోగములేక పోయినయెడల, బిడ్డను వేడినీళ్ళలో స్నానము జేయించవలయును. కొంకరలు పోవుట తిరిగి తటస్థమయిన యెడల, తలపైనయును మెడపైనయును బ్లిస్టరు(పొక్కునందు) వేయుట అవసరమగును

కొంకరలు పోవుటయొక్క ఉద్రేకస్థితి తగ్గగనే, బ్రొమైడ్ ఆఫ్ పొటాసియం (2 వ ఆల్టరేటివు)ను యియ్యవలయును. మలబద్ధ ముండిన యెడలనున్నూ పేగులలో పురుగు లుండిన యెడలనున్నూ అందులకు దగు చికిత్స జేయవలయును.



కోరియా.

కోరియా యనబడు కొంకరలు పుట్టించు ఒకవిధమగు వ్యాధి సామాన్యముగ బిడ్డల యందును ముఖ్యముగా ఆడపిల్లలయందును దటస్థించును. ఎనిమిది మొదలు పదునాలుగు సంవత్సరముల వరకు నుండు వయస్సునందు యెక్కువ తరచుగ వచ్చును. దుష్టమైన ఆహారముల నియ్యబడునట్టియు అనారోగ్యస్థితులయందు నివసించునట్టియు పిల్లలయందీ వ్యాధి వచ్చుట కుద్యుక్తత అతిశయముగ నుండును. ఏదైన నింకొకవ్యాధి అనగా, స్కార్లెట్ జ్వరము, పొంగు, కోరింతదగ్గు, కీళ్ళనొప్పులు మొదలగువాటి వలన శరీరము క్షీణించినను వచ్చును. మలబద్ధము, పేగులలో పురుగులుండుట, పుష్పవతి [?], పండ్లు వచ్చుట, [?] —వీటివలనను యొకప్పుడు యీవ్యాధి కలుగవచ్చును. చిన్నమెదడులోని భాగము [?] వమునందలి క్రిమములు దప్పుటవలన నీవ్యాధి తటస్థించునని సామాన్యముగ జెప్పుకొందురు. బలహీనులగు బిడ్డలకు గలిగిన భయమువలనను యొకానొకప్పుడు యీవ్యాధి సంభవింపవచ్చును. అధికమగు మనఃపరిశ్రమయు కారణముగ బరిణమింపవచ్చును దుష్టమగు అలవాటులను యీ వ్యాధిని ప్రోత్సాహపరుపవచ్చును. ప్రత్యేకముగా కారణమేమియు లేక నొకప్పుడు వంశపారంపర్యముగ రావచ్చును. వయస్సువారలయందు సెగరోగమువంటి రావచ్చును.

లక్షణములు.

కీళ్ళనొప్పుల గలిగియుండుట, మనోవిచారము, ఆయాసము, కోప మధికమగుట, నిద్ర పట్టకపోవుట, ముఖము చిట్లించుట; కాళ్ళు కదలించుట—యీ లక్షణములతో గూడి

గుర్తించును. ఈ వ్యాధి సంపూర్ణావస్థ నందినప్పుడు కొన్ని అవయవములే గాని లేక అవయవములన్ని గాని వణకెడు కదలిక నందవచ్చును. నడచుటయందు కాలు ఒకవైపునకు యీడ్చుకొనిపోవును. చేతిని నోటియొద్దకు దీసికొనిపోవుటకు యత్నించుటలో నది సుదూరవైపునకు గాని భుజమువైపునకు గాని తలమీదికి గాని గొంపోబడును. ఒకప్పుడు మాట్లాడుట కష్టముగా నుండును. ఏదైన నొక అవయవమునకు పక్షవాతము సంభవింపవచ్చును. అలసటతో గూడిన మూర్ఛలు రావచ్చును. గుండె అధికముగా గొట్టుకొనుట తటస్థింపవచ్చును. అత్యుద్రేకమగు విషయములలో, క్షీణమువలన, రోగిమరణము నందవచ్చును. ఈవ్యాధికి సామాన్యమగు పరిమితికాలము రెండు మాసములు లయియుండును. ఒకప్పుడు ఆరుమాసములు లయినను పట్టవచ్చును. అశ్రద్ధ చేసినయెడల దీర్ఘవ్యాపిత వ్యాధిగ నేర్పడవచ్చును.

## చికిత్స.

వ్యాధి బహుశః యేకారణమువలన గలిగినదని విచారింప వలయును. పేగులలో పురుగులుండుట వలన నైనచో, వాటిని దొలగింప వలయును. మలబద్ధముండిన యెడల దానికి జికిత్స చేయవలయును. పండ్లు వచ్చుట మూలమున నైనచో వాపుదల నందిన పంటి చిగుళ్ళను లాన్సెట్ (ఒక విధమగు కత్తి)తో గీరవలయును. రక్తహీనత వలననైనచో నందులకు వలయు జికిత్స చేయవలయును. ముత్రస్రావమునందలి లోపమేదైన యున్నయెడల అందులకగు ఔషధముల నీయవలయును. పాండురోగ మున్నయెడల అందులకగు జికిత్స నొసర్ప వలయును. నిస్సత్తువ నల్లనయినచో బలవర్ధకౌషధముల నియ్యవలయును. పాషాణ సంబంధమగు బలవర్ధకౌషధ మిచ్చుట శ్రేష్ఠము. దుష్టమైన అలవాటు లేమైన యుండిన యెడల, అట్టి అలవాటులను మాని వేయ వలయును. మిగుల ఉద్రేకమగు విషయములలో సంపూర్ణమైన విశ్రాంతియు నెమ్మదియు గాపాడ బడవలయును. రోగి ఒక చీకటిగదిలో ప్రశాంతి బరుండ బెట్టబడి ఉద్రేకమును బుట్టించు కారణములన్నియు దొలగింప బడవలయును కాళ్లను చేతులను దినమంతటను అనేకసారులు ఒత్తవలయును. పెద్దవారలకు పగలు నిద్ర వచ్చుటకు గాను పొటాసియం బ్రొమైడు (1 వ అల్పరేటివు)ను దినమునకు మూడుసారు లియ్యవలయును. రాత్రులయందు నిద్రపట్టుటకు గాను క్లోరల్ ఔషధయోగమును యియ్య వలయును. కొన్నాళ్ళకు యిచే ఔషధముల వయసుప్రకారము మోతాదుల నేర్పరచి యివ్వ వలయును. ఉద్రిక్త విషయములలో సాధ్యమయినంత త్వరలోనున్నా, సాధుగతులలో శీఘ్రముగానున్నా, వాయువునందలి మార్పు గొరకై, నివాసప్రదేశమును మార్చుట ముఖ్యమయి యున్నది. కీళ్ళనొప్పులచే గలిగిన కోరియావ్యాధి వలన సంభవించిన గుండెరోగము ప్పుడు కొంత కాలమువరకు సామాన్యముగ నిలచియుండి, క్రమముగా దానంతట అదియే సర్దుకొనును.

---

## కొఱుకు రోగము.

కొఱుకురోగము అంటువ్యాధులలో జేరినదై క్రమముగా వృద్ధినొందుచు చాల కాలము వ్యాపించునదై యున్నది. ఈ వ్యాధికి మూల కారణము ఒక విధమగు పురుగు

రక్తమునందు ప్రవేశించుట వలననై యున్నది. ఈవ్యాధి స్వయముగ సంపాదించుటయు, మఱియొక హేతుమార్గమున సంపాదించుటయు, పితృధనముగ బుట్టుకతోడనే కలిగియుండుటయు, — యీ మూడువిధములుగ వ్యాపించియున్నది. స్వయముగా సంపాదించుటయన, విశేషముగ విషయములలో నీవ్యాధిచే పీడింపబడిన పురుషునితోగాని స్త్రీతోగాని సంభోగప్రాప్తి నందుటవలన నీవ్యాధి సంభవించుచున్నది. చుంబనము, స్తన్యపానము చేయుట, కరచుట, పచ్చపొడుచుటయందు యీవ్యాధి పీడితుడు తనయుమ్మిని ఉపయోగించుట, టీకాలు వేయుట—వీటిద్వారా ఒకానొకప్పుడు యీవ్యాధి వ్యాప్తత నందుచున్నది; ఇంకొక హేతుమార్గమున నీవ్యాధి వ్యాపించుట యెట్లన ఆదివఱకే కొఱుకు పురుగుచే మాలిన్యమునందిన త్రాగుట కుపయోగించు గిన్నెలు వంటిపనిముట్లు మొదలగువానిని తిరిగి ఉపయోగించుట మూలమున గూడ నీవ్యాధి వ్యాపించుచున్నది. అటుదల స్థితియందుకూడ నీ కొఱుకు పురుగు అనేకవారముల వరకును సజీవిగ నుండుచున్నదని స్పష్టమగుచున్నది. ఈ వ్యాధియొక్క అభివృద్ధి మూడుగతులుగ నియమింపబడి యున్నది. ఈ మూడుగతులును యీక్రింద వేరువేరుగ వివరింపబడి యున్నవి:—

ప్రథమగతి.

స్వసంపాదన వలననైనదో వ్యాధి శరీరమునం దావహించిన (శరీరగతమైనను బట్టి) పదిదినములు మొదలు ముప్పది దినములలోగా, ముఖ్యముగా జననేంద్రియములయందు దెబ్బటనో యొకచోట ఒకటియొకటైన చిన్న పొక్కు పుట్టి నాలుగవ దినమున యది నీరుపోసి గాని దాని అడుగుభాగము వాపుదల నందును. ఈపొక్కు ఒకప్పుడు నాలుక, పెదవి, గవదకాయ, కనురెప్ప, చేతివ్రేలు — లేక శరీరమునం దేభాగమున నైననుగూడ లేవవచ్చును. ఈ పొక్కుయందు మాలిన్యమేర్పడి; అది వెలువడి, బాధలేనట్టి పుండుగా నేర్పడి, చుట్టుప్రక్కల గట్టియయి అంచులు ఉన్నతములయి మధ్యభాగము గొయ్యిగానుండును; ఈపుండుయే యీవ్యాధికి ప్రథమగతి యనబడును. ఈవ్యాధి శరీరమునం దావహించిన నాలుగు లేక ఐదు దినములలోపుగనే యొకప్పుడు యింకొకవిధమగు పొక్కులేచి, యీ పొక్కునందు మొదటనే రసి యేర్పడియుండును. ఇది గట్టిగానుండక యొక్కువబాధతో గూడి దీనిని అనుసరించి అంత తరచుగ కొఱుకువ్యాధి లక్షణములు పిమ్మట వ్యాపింపక పోవచ్చును.

పుండు ప్రారంభమయిన పిమ్మట గాని లేక పుండు మానిపోయిన పిమ్మట గాని పదునైదు మొదలు ముప్పది దినములలోగా గజ్జలలో వాపుదల ప్రారంభమయి, మెత్తదనమేర్పడి బిళ్ళలుగా దేలవచ్చును. ఇవి వ్రణములుగా దేలినయెడల వ్రణములకగు చికిత్సనే జేయించవలయును.

ద్వితీయగతి.

కొన్నివారములు, నెలలు లేక సంవత్సరములు గడచిన పిమ్మట ఈ వ్యాధియొక్క రెండవగతి ప్రారంభమగును. ఈగతి సామాన్యముగ నారువారముల వరకు వ్యాపించియుండును. ఒకప్పుడు మూడు మాసములవరకు గూడ నుండవచ్చును. ఈ గతియందు రోగికి ఉత్సాహము చెడి, కీళ్ళనొప్పులు ప్రారంభమయి పిక్కయెముకల యందును ముదమయెముకల యందును బాధ అతిశయమయి ఆకలితగ్గిపోయి నిద్రపట్టకుండ నుండును. అంతట చర్మవ్యా

ధులు ప్రారంభమయి గొంతు పచ్చిచేయును యేర్పడి నాలుక పైనయును పుండ్లు అగుటయు కలుగును; ఇవి అన్నియుగాని లేక కొన్నియైనగాని తటస్థింపవచ్చును. రోగికి గొంతు బొంగుపోయి చెవిలో పోట్లు పుట్టవచ్చును; ఈ రెండవగతియందు ఒకప్పుడు జ్వరము వచ్చినను రావచ్చును. కొరుకు యందలి చర్మవ్యాధిలో తెలుపుగ నరచేతుల యందు పొక్కులు లేచును. ముఖమును ప్రసరణమును ముక్కుయొక్క ప్రక్కలను నోరుయొక్క కోణముల యందును తలపైనయును ఉదర భాగమునందు బొడ్డుచుట్టును కడుపు

కిరుపైపులను ఆసనము జననేంద్రియముల సామీప్యమునను పాదముల కడుగుభాగమునను యీ పొక్కులు లేవవచ్చును. ఈ అవస్థయందలి జ్వరము సామాన్యముగ 101 డిగ్రీలను మించియుండదు. కొన్ని సమయములలో మాత్రము జ్వరము ఉద్రేకమును సహించి తగ్గుచు హెచ్చుచుండెడి విధమునగాని, దినము విడచి దినము వచ్చుచుండెడి విధమునగాని, వచ్చుచుండును. ఇట్టి సందర్భములలో జ్వరము 104 లేక 105 డిగ్రీలకు కూడ రావచ్చును. ఒకానొకప్పుడు పాండురోగము ప్రవేశింపవచ్చును తలనొప్పియు సాధుగతియందుగాని ఉద్రేకగతియందుగాని తటస్థింపవచ్చును. పొక్కులు ఉద్రేక గతియందుండినపుడు కళ్ళు దురదలు ప్రారంభమయి పుసులుగట్టిగనుండును. ఈ వ్యాధి బలమయినపుడు కండ్లకు మసకలు యేర్పడవచ్చును. ఈ వ్యాధియందు లోపలి చెవి అస్వస్థత నందినయెడల ఒకపుడు రోగికి త్వరలోనే పూర్ణమైన చెవుడు కలుగవచ్చును. ఒకానొకప్పుడు కాలియొక్కయు చేతియొక్కయు గోళ్ళ దళములయి పెళుసులెక్కి పైభాగము మిట్టపల్లములుగాను నిడుపాటి గోతులుగాను యుండును. ఇంకొకప్పుడు గోళ్ళయొద్ద పుండ్లుయేర్పడి మిగుల బాధగలిగించును.

ప్రతి రోగియందును పైనచెప్పిన లక్షణములన్నియు, కనుపడవు. ఒకప్పుడు శరీరమునయిన పొక్కులుమాత్రమే గనబడి గొంతునొప్పితో పోవును. ఈ ద్వితీయగతియందు ఒకప్పుడు ఆరుమాసములు మొదలు ఒక సంవత్సరమువరకు నుండుటకలదు.

### తృతీయగతి.

ద్వితీయగతియందు దగు చికిత్స చేసినయెడల సామాన్యముగ నీవ్యాధి పెంపందదు. ద్వితీయ గతియందు శరీరమునందు పరిభాగములు మాత్రమే అస్వస్థత నందియుండును. తృతీయగతియందు అస్వస్థత అంతరావయవములకు వ్యాపించి స్నాయువులు ఎముకలు మొదలయినవి అస్వస్థత నందును. వ్యాధి ప్రారంభమయిన మొదటి సంవత్సరముననే యొకప్పుడు తృతీయగతి ప్రారంభమగును. ఒకప్పుడు మూడవ లేక నాల్గవ సంవత్సరమువరకు సాగియుండును. ఈ వ్యాధియందు తృతీయ గతికి వ్యాపించుట బహు అరుదుగా గలుగుచున్నది. ఈ వ్యాధి తృతీయగతివరకు వ్యాపించియున్నప్పుడు, రోగియొక్క అంతరావయవము లనేకవిధములుగ నస్వస్థత జెందియుండును. రెండుసంవత్సరముల పరిమితివరకును యీ వ్యాధి సంబంధమగు లక్షణములేమియు గనబడకుండినయెడల, అట్టివారు వివాహము చేసికొనవచ్చును. ఇట్టివారియందు తమ భార్యలకును బిడ్డలకును నీవ్యాధి వ్యాపింపజేయుట కవకాశము తగ్గిపోవుచున్నది. కొరుకువ్యాధిచే బాధనొందువారు యేసందర్భమునందును వివాహము జేసికొన దగ్గవారు కారు.

ఆడువారలు కొరుకువ్యాధిచే బాధనొందుచుండినయెడల, తమ శరీరమునందుండెడి కొరుకు విషఫలితముగ, గర్భస్రావముల నందుచుందురు. కొరుకు రోగముతో బుట్టినబిడ్డలు

బలహీనముగ నుండి బొంగుపోయిన ధ్వనితో నేడ్చుచు ముక్కుల వెంబడి ద్రవము వెడలుచు ఒడలు పయినయును, ముఖ్యముగా జననేంద్రియ భాగములయందును. తామ్రవర్ణము గలిగిన మచ్చలు కనబడును. ఇట్టిబిడ్డలు డిప్పకట్టు క్షయరోగమునకు తేలికగా లోనగుదురు.

చికిత్స.

ప్రథమగతియందు పొక్కు యేర్పడి, పుండుయేర్పడినదనుకొన్న తోడనే అయియుండిన యెడల జాగ్రతగా నంతటను సిల్వరునైట్రేటును ఉపయోగించుటవలన గాని, లేక స్వచ్ఛమయిన కార్బాలిక్ ఆసిడ్‌తోడ నద్దుటవలన గాని, దానిని రూపు మాపవలయును. అంతట అనుదినము దానిని, మానుపుటకుగాను లింటును నాలుగయిదు మడతలుగా వేసి కార్బాలిక్ లోషనులో దడిపి పుండుచుట్టును గట్టుచుండవలయును. యిట్లు చేయకుండగనే, పుండుయేర్పడినయెడల క్యాలోమెల్-లైంవాటరు ఔషధయోగమును లింటుతో నుపయోగించవలయును. పుండు భాగమును శుభ్రముగా నుంచుట మిగులముఖ్యముగాను అందులకుపయోగించుటకు పైలోషను హాజరులేనియెడల ఒకడ్రాము బోరిక్ ఆసిడ్‌ను ఒకపయింటు నీళ్లలో గలిపి దాని తోడనుగాని, పెర్ క్లోరిడ్ ఆఫ్ మెర్క్యురీ ఒక భాగమునకు రెండు వేలభాగముల నీళ్ళు గలిపి, దానితోడనుగాని (లేక) సల్ఫేటు ఆఫ్ జింక్ రెండు గ్రైనులను ఒక ఔన్సుజలములో గలిపి దానితోడను గాని—వీటిలో దేనితోనయినను ఆభాగమును గడుగవలయును. పుండు యెర్రగా నున్నయెడల అయొడోఫారమును పయిన గట్టవలయును. రోగియొక్క ఆరోగ్యత అదివరకే వ్యాధిచేతను చెడియుండినయెడల బ్లూ పిల్ (పిల్యులా హైడ్రార్జిరి) 3 గ్రెయినుల మోతాదులో దినమునకు మూడుసార్లు యివ్వవలయును. నోటియందు లోహ సంబంధమగు రుచి గలుగు వరకుగాని - లేక - పండ్లచిగుళ్ళు పచ్చిగా నుండు వరకుగాని యీ ఔషధమును యియ్యవచ్చును. ఈ మాత్ర పేగులపైన పనిచేయుచున్నట్లు గనబడిన యెడల, ప్రతి మోతాదుతోను ఒక పావుగ్రెయిను యక్స్ట్రాక్టు ఆఫ్ ఓపియంను గలిపి యియ్యవలయును. క్రమమయిన ఆహారమును భుజించుచు, శరీరమునకు వెచ్చగ యుండునట్లు దుస్తులను ధరించుచు, కొద్దియైన శరీర పరిశ్రమను దీసికొనుచుండ వలయును. చుట్టను గాల్చుటను మత్తుపదార్థముల త్రాగుటను నిలిపివేయవలయును. సంభోగమును నిలుపుదల జేయుట ఉత్తమము. సామాన్యముగ వేడి నీళ్ళయందు స్నానము జేయుటవలన శరీర శుభ్రతను గాపాడవలయును.

ద్వితీయ తృతీయ గతులయందలి చికిత్స.

ద్వితీయ గతియందు మెర్క్యురీ (పాదరసము) సంబంధమగు ఔషధముల నుపయోగించుట యందలి ఆవశ్యకత చాలమందిచే నొప్పుకొనబడి యుండినదేగాని, దానిని ఉపయోగించు విధమునందును దానిని ఉపయోగించు కాలపరిమితి యందును వివిధాభిప్రాయము లందబడుచున్నవి. మెర్క్యురీని నాలుగు విధములుగ వాడవచ్చును:— (1) లోని కిచ్చుటవలన (2) పైన రుద్దుటవలన (3) ఆవిరి పట్టుటవలన (4) సూదితో లోనికి యింజెక్టు చేయుట వలన.

వ్యాధియొక్క ఉద్రేక గతియందు మాత్రమే మందులను పుచ్చుకొనుచు తక్కిన కాలములందు మందు పుచ్చుకొనకుండుట మంచిదికాదు.

ఫోర్న్నియరు అను నాయన యీ క్రింది చికిత్సను జెప్పుచున్నాడు. గ్రీన్ అయొడైడ్‌ను మున్పాతిక గ్రేయిను మొదలు ఒకటిన్నర గ్రేయిను వరకు గల మోతాదును ప్రతిదినము ఈ క్రింది విధముగ నీయవలయునని చెప్పుచున్నాడు. మొదటి రెండు సంవత్సరములయందును, ప్రతి అయిదు మాసములకును మొదటి రెండు మాసములయందును యీ ఔషధమును యిచ్చుచు, తక్కిన మూడు మాసములయందును ఔషధమును నిలిపివేయుటను, జేయవలెను. మూడు నాలుగు సంవత్సరములయందు, యిదే ఔషధమును ప్రతి ఆరుమాసములకును ఆరు వారములు దీసికొని నాలుగున్నర మాసములు నిలిపివేసి, యీ రెండు సంవత్సరముల యందును యీప్రకారము జరుపవలయును.

రికార్డు అను నాయన, ఆరు మాసములవరకును మెర్క్యూరీ సంబంధమగు ఔషధము నియ్యవలయుననియు, పిమ్మట మూడుమాసములు పొటాసియం అయొడైడ్‌ను యియ్యవలయుననియు, అంతట నౌషధము నాపివేయవచ్చుననియు చెప్పుచున్నాడు.

హచ్చిన్సన్ అను నాయన హైడ్రార్జిరికం క్రీటా (గ్రేపవుడరు) ఒక గ్రేయిను మోతాదుగా పావుగ్రేయిను లేక అయిదవవంతు గ్రేయినును నల్లమందును గలిపి, రోగియొక్క శరీరారోగ్యతకు భంగము లేకుండ చేసికొనగలిగినన్ని సారులు యియ్యవలయును. ఉమ్మి ఊరుట గాని, అజీర్తి విరేచనములు గాని, కాకుండ సాధ్యమయినంత యెక్కువ మెర్క్యూరీని శరీరమునందు బ్రవేశపెట్టుట యీ పద్ధతియొక్క ఉద్దేశ్యమయి యున్నది. పండ్లయొక్క స్థితిని గాపాడుటవలన, పటిక గండూషము నుపయోగించుటవలనను, ఉమ్మిఊరుటను నిలుపుజేయుచు సరియైన ఆహారము నిచ్చుటవలనను, నల్లమందును చిన్న మోతాదులలో నిచ్చుటవలనను, అజీర్తిని ఆటంకపెట్టుచును ఉండవలయును. ఈ మాత్రలను దినమునకు నాలుగు లేక అయిదు లేక ఆరు లేక ఏడు సహితమును భోజన సందర్భము లేకుండ నియ్యవచ్చును. ఇట్లు అనుదినమును విశేషకాలము చేయవలసి యుండును.

బైం అయొడైడ్ ఆఫ్ మెర్క్యూరీ గ్రేయినును 8 మొదలు 16 మోతాదులుగాజేసి లోనకిచ్చుటవలనను ఉపయోగముండగలదు. మిగుల ఆలస్యగతులయందు ఒక్క డ్రాము లైకర్ హైడ్రార్జిరిపెర్‌క్లోరిడ్‌తో 8 గ్రేయినుల పొటాసియం అయొడైడ్‌ను గలిపి తరచుగా నిచ్చుచుండుట ఉపయోగించగలదు.

తృతీయగతి యందలి పొక్కులకును కాళ్ళపైనలేచెడి బొబ్బలకును పాదరస సంబంధమగు ఔషధములతో గూడిగాని లేకుండగాని 3 గ్రేయినులు మొదలు 20 గ్రేయినుల మోతాదువరకు పొటాసియం అయొడైడ్‌ను దినమునకు మూడుసారులు యియ్యవలయును.

మెర్క్యూరీ సంబంధమగు అయింట్మెంట్లను శరీరమునకు మర్దనజేయుట వలన ఎక్కువ ఉపయోగముండగలదని కొందరి అభిప్రాయమయియున్నది. ప్రతిరాత్రియందును 40 మొదలు 60 గ్రేయినుల వరకు బ్లూ ఆయింట్‌మెంటును ప్రతిదినమును శరీరమునందేదో యొక భాగమున ఒక అరగంటసేపు మర్దనచేయవలయును. మర్దనచేయుటకు ముందుగా స్నానము చేయుట మంచిది. రోగి పగలంతయు వేరు వ్యాపకముండినయెడల సాయంకాలము మర్దన చేయుట మంచిది. లేనిచో ఉదయమున్నూ ఉత్తమము ఈ పనికి ఓలియేట్ ఆఫ్ మెర్క్యూ

దీని గూడ ఉపయోగింతురు. కాని, అది అంత ఉపయోగముగా నుండియుండలేదు, ఇటీవల మెర్క్యూరీ గలసియున్న సబ్బుబిళ్ళలుగూడ నుపయోగింపబడుచున్నవి. ఈ సబ్బులను నురుగు వచ్చిన పిమ్మట ఆ నురుగును ఒడలంపై రాసి ఆరునట్లు చేయవలయును.

మెర్క్యూరీ శీఘ్రముగా పనిచేయుటకైయును, దీర్ఘవ్యాపిత మైనట్టియు ఉద్రిక్తత గలదియై యుండినట్టియు, విషయములలో బాగుగా పనిచేయుటకును, ఆవిరిపట్టు పద్ధతి ఉపయోగించ బడుచున్నది. ఇందులకై 20 మొదలు 40 గ్రెయినుల వరకు క్యాలోమెల్ (రసభస్మము)ను ఒక చిన్న గిన్నెలో వేసి ఒక చిన్న దీపము పైనబెట్టి, ఒక వెడల్పైనమూతిగల గిన్నెలో ఉడుకునీళ్ళనుబోసి,—యీ రెంటిని పేము కుర్చీక్రింద బెట్టినప్పుడు రోగి దుప్పటిని కప్పుకొని ఒక అరగంటసేపు కూర్చుండవలయును. నీళ్ళఆవిరియందు, రసభస్మము కాలిన పొగ కలిసి, శరీరమునకంతయు పట్టును ఈపనిని దినమువిడిచి దినము రాత్రి పరుండుటకుముందర జేయవలయును.

సూదితో రక్తములోనికి యింజక్టు చేయుటకై, క్యాలోమెల్, యెల్లో ఆక్సైడ్ ఆఫ్ మెర్క్యూరీ, హైడ్రార్జరీ పెర్ క్లోరైడ్, సాల్వర్సనుల నుపయోగింతురు. సామాన్య గతులయందివి ఉపయోగింప దగవు. కొరుకువ్యాధి, కంఠము, చెవులు, మెదడునకు, వ్యాపించిన గతులయందీ పద్ధతి అవలంబింప దగియున్నది. వీటి అన్నిటిలోను పెర్క్లోరైడ్ ఆఫ్ మెర్క్యూరీ లోషనుతో నింజక్టుచేయుట మిగుల ఉపయోగముగ కనుగొనబడెను. ఇంజక్టుచేయుటయందు మిగుల శుభ్రతను వహించి, యెక్కువ జాగ్రతతో బనిచేయవలసి యుండును.

ఏవిధమైన చికిత్స నిచ్చినను రోగియొక్క సామాన్య ఆరోగ్యతను గాపాడుటకు దగుప్రయత్నములను జేయవలయును. తేలికగా జీర్ణమగునట్టియు బలమునిచ్చునట్టియు, ఆహారపదార్థములను భుజించుచుండుటయు, పెందలకడ పరుండుటయు, పరిశుభ్రమయిన గాలి దగులునట్లు జేసికొనుటయు, వాయువునందును నివాసప్రదేశమునందును మార్పు జేయుటయు—యివి అన్నియు చికిత్సయందలి ప్రధానాంశములు అయియున్నవి.

ఒక గర్భవతియగు స్త్రీ, తనకు కొరుకువ్యాధి లేకపోయినప్పటికిని, తనభర్తకు కొరుకువ్యాధి యుండియుండినయెడల, గర్భవతికాలమునందు వ్యాధికి చికిత్సనొంద వలయును. ఈ వ్యాధియొక్క లక్షణములు కనుపడకపోయి నప్పటికిని చికిత్స నొందవలయును.

---

## గజ్జి

గజ్జి యనునది సామాన్యముగ చేతివ్రేళ్ళసందున, [illegible] గుండుసూదితల కంటె చిన్నదైన పొక్కులుగా ప్రారంభమయి, పిమ్మట యితరభాగములకు వ్యాపించును దీనికే చిడుము అనియు వాడుకపేరు కలదు. చర్మము క్రింద స్థానము నేర్పరుచుకొనెడియొక విధమగు పురుగువలన నీవ్యాధి కలుగుచున్నది. ఈ పురుగు ఆకారమునందు గుండ్రముగా నుండి బహు సన్నముగానుండును. ఈజాతి పురుగులయందు మొగపురుగుకంటె ఆడుపురుగు పెద్దదిగానుండును గాన, బూడిదవర్ణము తెలుపువర్ణము గలిగిన రంగుగలిగి, కదలుచున్న ఆడు

వురూపమున, నొకప్పుడు దీనిని కంటితో జూడవచ్చును. సూక్ష్మదర్శన యంత్రము క్రింద బరీక్షించిన యెడల తాబేలు ఆకారమును వహించి యెండు కలతోడను ముళ్లకోడను చెర యుచు తలయొక్క కొనయందు బాగుమైన దవుడలు గలిగియున్నట్లు మనకు గనబడును. ఈ యాడు పురుగు చర్మము పల్చగానున్నను మృదువుగానున్నను యుండెడి చేతి యొక్కగాని మణికట్టుయొక్కగాని లోపలిభాగమున చర్మముయొక్క పైపొరలోని పల్చని భాగమునందు చారియలజేయును. చర్మమునందొకసారి ప్రవేశించినపిమ్మట యీపురుగు తిరిగి బయటికిరాదు. చర్మమునందే గ్రుడ్లు పెట్టును. అప్పటి తన సంతానమును ఈగవెంట వదలిపెట్టి పోవుచుండును. చర్మముపైన సూదితో గీరలగీసినట్లుగా చుక్కలు చుక్కలుగాగాని యీ చారియలను మనము చూడవచ్చును. దీనివలన దురద (రాత్రులయందు ముఖ్యముగా) అపరిమితముగా నుండును. ఈ గజ్జి కొంత కాలము వ్యాపించి చికిత్సనొందని యెడల, గోకుటవలన రేగుదలనుండి, మాలిన్య పొక్కులు, యీ చారియలు స్ఫుటముగా మారవచ్చును. గజ్జి కలిగినవారిని దూరముగా నుంచవలయును.

## చికిత్స.

అస్వస్థతనొందిన భాగములను సబ్బుతోను నీళ్ళతోడను శుభ్రముగా గడుగవలయును; ఇందువలన చారియలు బయలుపడును. అప్పుడు ఔషధయోగముల యందలి గంధకపు ఆయింటుమెంటును దినమునకు రెండుసారులు బాగుగా రుద్దవలయును. చేతులకు పాతగుడ్డలను గట్టియుంచి, పని అయినపిమ్మట వాటిని దగులబెట్టవలయును. మూడు దినములపిమ్మట రోగి వేడినీళ్ళలో స్నానము జేసి, కార్బాలిక్ సబ్బుతో శుభ్రముగా రుద్దుకొనవలయును. గంధకపు ఆయింటుమెంటును తిరిగి ఉపయోగించవలయును. విరేచనబద్ధ ముండినయెడల, కాలవిరేచన మగుటకు సాధనము జేయుటతప్ప, లోనకు వేరు మందుల నియ్య నవసరములేదు.

---

## గనోరియా

## ( సెగరోగము )

గనోరియా ఆంగ్లేయభాషా పదము అయియున్నది. దీనికి తెనుగునందు సెగరోగ మందురు. ఇది అంటువ్యాధి అయియున్నది. గనోకాకస్ అనబడు ఒకవిధమగు పురుగువలన నీవ్యాధి కలుగుచున్నది. ఈ వ్యాధి పురుషులకును స్త్రీలకును గూడ గలుగవచ్చును. వ్యాధి అంటుకొనిన మూడు దినములకును ఆరుదినములకును మధ్యగా, మూత్రద్వారముయొద్ద యెర్రనై, ఒకప్పుడు దురద ప్రారంభమయి యింకొకప్పుడు సూదిపోటు పొడిచినట్లుండును. అటుపిమ్మట మూత్రద్వారముయొద్ద, మొదటలో కొద్దిగానున్ను, పిమ్మట అధికముగానున్ను, ద్రవము వెలువడుట యేర్పడును ఈద్రవముయొక్క రంగు కొందరియందు తెల్లగానున్ను, కొందరియందు పసుపు వర్ణము గలిగియున్ను, మరికొందరియందు ఆకుపచ్చ వర్ణముగాని రక్తవర్ణముగాని గలిగియున్ను, యుండును. ఈవ్యాధియందు మూత్రమార్గము వాపుదల నొందియుండును. మూత్రవిసర్జనమందు మంటగానుండును. అత్యంతశోషస్థయందు మూత్రవిసర్జన కాలమున విశేషబాధ యుండును. మూత్రద్వారము విశేషముగా వాచి

యుండినపుడు, యీస్థితికి "కార్డీ" యందురు. ఈయవస్థయందు బాధ ఉద్రేకముగా నుండును. ఆడువారలయందు, ఈవ్యాధియొక్క లక్షణములకును లుకోరియా (కుసుమవ్యాధి) యొక్క లక్షణములకును భేదములేదు. మూత్రవిసర్జనయందు మంట యుండిన యెడల గనోరియా వ్యాధిగను, లేనియెడల లుకోరియా వ్యాధిగను, భావింపవలయును.

గనోరియావ్యాధియందలి వాపుదల ఒకప్పుడు వృషణములకు వ్యాపింపవచ్చును. ఈ వ్యాధివలన ఒకప్పుడు నీరుడుతిత్తియు వాపుదల నందవచ్చును. గజ్జలలో బిళ్లలు కట్టవచ్చును. శిశ్నముయొక్క చివరభాగమందలి చర్మము ఒకప్పుడు వాపుదల నందవచ్చును. కీళ్లనొప్పులును గలుగవచ్చును. గనోరియాయందు వెలువడు ద్రవము పొరబాటున కండ్లకు తగులుట తటస్థించినచో, చిన్నపిల్లలయిన యెడల అంధత్వమే యేర్పడును గావున నిందువిషయమయి బట్టలకు గాని చేతివ్రేళ్లకు గాని తగులకుండ జాగ్రతగ నుంచవలయును. ఈవ్యాధి పీడితులు రహస్యస్థలమందు ప్రత్యేకమగు గుడ్డలను గట్టుకొని అప్పుడప్పుడు వానిని తగుల బెట్టుచుండవలయును.

ఈవ్యాధి ఒకప్పుడు యెంతమంచి చికిత్సనందినను కుదురుబాటు కాక దీర్ఘవ్యాధితమయి గ్లీట్ అనబడు స్థితిలోనికి వచ్చును. ఈ స్థితియందు ద్రవము వెలువడు లక్షణము మాత్రమేయుండి యిది అప్పుడప్పుడు కలుగుచుండును. ఉదయమున గాని దినమునందప్పు డప్పుడు గాని ఒక చుక్క మాత్రమే వెలువడును. ప్రతిదినమును అగుపడక పోవచ్చును.

## చికిత్స.

పురుషులయందు యీవ్యాధి, కొంచెము దురదతోడను ద్రవసంబంధమగు పదార్థము వెలువడుటతోడను ఆరంభము కాగానే 3 ఔన్సుల జలములో 2 గ్రయినుల సిల్వరు నైట్రేటును గలిపి నాలుగు గంటల కొకపర్యాయము పిచికారీ చేయుటవలన గుణమియ్య గలదు. ఈప్రకారము ఆరు లేక యెనిమిది పర్యాయములు చేయవలయును. వెలువడు ద్రవము యెక్కువైనయెడలనున్నూ బాధ కలిగిన యెడలనున్నూ యీ పద్ధతిని ఆపివేయ వలయును. పిచికారీచేయుటకు ముందుగా మూత్రమును విసర్జించవలయును. విరేచనకారులలో 1వ ఔషధయోగమును బుచ్చుకొన వలయును. విరేచనకారిని బుచ్చుకొనిన పిమ్మట ప్రతి గంటకును ఒక చుక్క టింక్చర్ నక్సువామికా (విషముష్టి)ను ఒక డ్రాము జలములోవేసి లోనకు బుచ్చుకొనవలయును. రోగి సాధ్యమయినంతవరకు పరుండియే యుండవలయును. ఈవ్యాధియందు విశ్రాంతి దీసికొనుట మిగుల ముఖ్యము. రహస్యభాగమునకు పైన చల్లగా నుండుటకు తడిగుడ్డను జుట్టుట మంచిది. ఒక పైంటు సాధారణ ఉష్ణజలములో 2 గ్రయినుల పొటాస్ పర్మాంగనేటును గలిపిన లోషనుతో దినమునకు పది లేక పంద్రెండు సార్లు మూత్రద్వారమున పిచికారీ చేయవలయును.

జ్వరచిహ్నములు తగ్గగనే కోపేబాను లోనికియ్యవలయును. కోపేబావలన నొక్కప్పుడు దద్దుర్లు పుట్టవచ్చును. అంతట నీ మందును నిలిపివేయ్యవలయును. ఈ స్థితియందు జింక్ సల్ఫేట్ లోషనును దినమునకు రెండుసారులు పిచికారీ చేయుట నుపయోగించ వలయును. మూత్రమునందలి ఆమ్లమువలన మంటబుట్టును గాన, దీనికై పొటాష్ సిట్రేట్ గాని

మెగ్నీషియా సిట్రేటు గాని గలిసిన ఔషధములను లోనికి బుచ్చుకొనవలయును. స న్యా జలమును సోడావాటరును లిథియా వాటరును విశేషముగా బుచ్చుకొను చుండవలయును. తుదకు మూత్రమార్గము యొక్క కొన్ని భాగములు గట్టియగుటవలన గాని, మూత్రమార్గము సంపూర్ణముగ గాని కొంతవఱకు గాని బంధింపబడును. దీనికి "స్ట్రిక్చర్" అని వాడుదురు. ఈ అవస్థయందు స్నానానొకప్పుడు గొట్టమును మూత్రద్వారము గుండ నీరుడు తిత్తివఱకును పోనిచ్చుటవలన మూత్రమే మూత్రమును వెలువరింప వీలగును. సామాన్యముగా మూత్రము మామూలుకంటె అధిక ప్రయత్నము చేయుటవలన మూత్రద్వారముయొద్ద బాధకలుగుచు, మూత్రము వెలువడుట సంభవించును. కొన్ని దుర్గతులయందు యీవ్యాధి మూత్రాశయమునుండి మూత్రగ్రంథులకు గూడ వ్యాపించును. ఆడువారలయందైనచో, గర్భాశయమునకు వ్యాపించుట మూలమున, అనగా, గనోకాకస్ క్రిములు గర్భాశయమునందు ప్రవేశించుట వలన, అట్టివారు సంతానప్రాప్తికి దూరులగుదురు.

ఈవ్యాధి ఆడువారలకు గలిగినచో, మగవారలయందు వ్యాధిలక్షణములకు తోడుగా, రహస్యభాగములంతయు వేడిమితోడను బాధతోడను గూడి, మూత్ర విసర్జనయందును, నడచుటయందును, కష్టముగా నుండును. ఆడువారలకు మూత్రగుణమును మార్చుటకు పొటాస్ సిట్రేస్ మెగ్నీషియా సిట్రేస్‌లను మాత్రము లోనికిచ్చుటకు దప్పి, లోనికిచ్చుటకు వేరు ఔషధము లుపయోగింపజాలవు. పొటాస్ పర్మాంగనేట్ సొల్యూషనును భగరంధ్రము లోనికి పిచికారీ చేయవలయును.

ఈ వ్యాధియందు వృషణములకు అస్వస్థత గలిగినయెడల పిచికారీ చేయుటను ఆపి వేసి ఉడుకునీళ్ళలో ఆ భాగమును కాపడము గాచవలయును. మూత్రాశయము వాపుదల నందినయెడలనున్నా పిచికారీ చేయుటను ఆపివేసి రోగిని వేడినీళ్ళలో స్నానముచేయించి పేగులయొక్క అడుగుభాగము పైన ఉడుకునీటితో కాపడమును గాచవలయును. ఇందులకగు వేరుచికిత్సనుసూన్నా చేయవలసియుండును.

గనోరియా వ్యాధి "గ్లీట్" స్థితికి వచ్చినపుడు బహుజాగ్రతగా చికిత్స చేయవలసి యుండును. జింక్ సల్ఫేట్ లోషనును పిచికారిచేయుచు ఐరన్ (లోహము)ను లోనికిచ్చుట వలన గుణామియ్యగలదు. ఈ అవస్థయందలి చికిత్సకు విశేషకాలము పట్టును. ఆహార పదార్థములయందు బహుమితముగా నుండవలయును. లైకర్ కాంటాగ్ స్లేవి బక్కు రైట్ ప్యాకెట్‌ను ఒక డ్రాముచొప్పున దినమునకు రెండు సారులు జలములో గలిపి యియ్యవచ్చును.

స్ట్రిక్చర్ కై చికిత్స చేయుటకు సర్జనుయొక్క సలహా తీసికొనుట మంచిది.

---

## గర్భవత్సంబంధమగు వాంతులు

ఈ గర్భవత్సంబంధమగు వాంతులు సామాన్యముగ గర్భముగలిగిన ఆరవవారమునందు ప్రారంభమై మూడవమాసము చివరను అంత్యమగును. ఒకప్పుడు యింకను శీఘ్రముగ ప్రారంభమయి ప్రసవసమయము వఱకు నిలిచి యుండును. విశేష స్త్రీలలో కడుపులో

దిప్పటయు వాంతులు వెళ్ళుటయు, ముఖ్యముగా నుదయమున గలుగుచుండును. కొందరి యందు దినమంతయు నటులుండి ఉద్రిత గతియు నవలంబించవచ్చును.

### చికిత్స

కడుపులో దిప్పటయు వాంతులు కలుగుటయు సాధారణముగానే యుండును. మరియు, యిందులకు చికిత్స అవసరములేదు. ఉద్రిక్తముగా నుండిన యెడల యేయాహారపదార్థము వలన నిట్లుగలిగినదియు విచారించి, అట్టిదానిని త్యజింపవలయును. ఇతర కాలములందున జీర్ణము చేసికొనగలిగిన ఆహారపదార్థములను గర్భవతులు మాత్రము జీర్ణము చేసికొనజాలకపోవచ్చును. విరేచనము సరిగా కాకపోయిన యెడల చిట్టాముదమునుగాని కాస్కారా సాగ్రిడా మాత్రలనుగాని పుచ్చుకొనవలయును. కడుపు ఉబ్బరముగా నుండినయెడల అందుకు తగుచికిత్స జేయవలయును. కొందరు స్త్రీలు ఒక టంబ్లరు ఉడుకునీళ్ళు త్రాగుటవలన నొక్కనిమిషములో వాంతియగుట నెక్కువగావించి పిమ్మట నా దినమునకు సుఖము గలిగించును. వాంతియగుట మిక్కిలి యెక్కువగానుండి దినమంతయు ఆహారము నిలువని యెడల కొద్ది పరిమాణములుగ బలమగు ఆహారపదార్థములను, అనగా పాలు మొదలగు వాటిని లోన నిచ్చుచుండవలయును. సోడావాటరు త్రాగుటవలన నొకప్పుడు గుణమియ్యగలదు. ఒక డ్రాము స్పిరిట్సు అమ్మోనియా ఆరోమేటిక్‌ను లోనకిచ్చుట వలనను, గుణము కనుపించవచ్చును. వైనం ఇపికాక్‌ను ప్రతిగంటకు ఒకచుక్క చొప్పున ఒక డ్రాము జలములో గలిపి యిచ్చుటవలన నొకప్పుడు మంచి గుణము నియ్యగలదు. గుడ్డను అనేక మడతలు వేసి, తడిపి, ఆమాశయముపైన గట్టుటవలన నొకప్పుడు ఉపయోగముగ నుండును. ఉదకట్టును ఉదయముననే రెండు లేక మూడుగంటలవరకు నుంచవలయును. ఒకటి రెండు పెద్దచెమ్చాల సిట్రేట్ ఆఫ్ మెగ్నీసియా పవుడరును ఒక అరటంబ్లరు జలములో గలిపి యిచ్చుటవలనను యొకప్పుడు ఉపయోగించగలదు 2 పైంట్ల ఉడుకు జలములో 1 ఔన్సు టింక్చర్ ఓపియమును వేసి, యీ ఆవిరిని పీల్చుటవలనను యొకప్పుడు గుణమియ్యగలదు.

---

## గర్భస్రావము.

గర్భస్రావము సామాన్యముగ నారవ మాసమునకు పూర్వమున గలుగుచుండును. ఆరు మాసముల పిమ్మట శిశువు జనించిన యెడల అకాలప్రసవమన బడును. గర్భస్రావము యెక్కువ తఱచుగ నయ్యెడి కాలము మూడవమాసమునందయియున్నది. ఈమాసమందు కొంచె మెచ్చు తక్కువగ ఋతుస్రావ కాలముననే గర్భస్రావము కలుగుచుండును. గర్భస్రావ మొక్కసారి గలిగినచో నిది మరల మరల సంభవించుటకు యుక్తి యేర్పడుచున్నది. కొందరి స్త్రీలలో నిది అలవాటుగ ఘటిల్లుచున్నది. ఇందులకు కారణములు అనేకములున్నవి. నిస్సత్తువ, మనోద్రేకము, కోపోద్రేకము, భయము, అవడు, దెబ్బ, మెట్లపయిని కాలు జారుట, బండికుదుపు, వీటిలో దేనివలనైనను గలుగ వచ్చును. గర్భాశయము యొక్క బలహీనత వలన గాని, లేక, వ్యాధివలనగాని, ఒకప్పుడు గర్భస్రావము గలుగవచ్చును. గ్రహణి

మూలముగను విరేచనకారుల దుర్వ్యాపకము జేయుట వలనను, గర్భస్రావము కొందరు స్త్రీలు స్వాభావికముగ శరీర దౌర్బల్యత గల వారలగుటచే గర్భము —— మునకు రాకముందే స్రావము కలుగుచుండును. విషజ్వర పీడన గలిగిన యెడల నీ దౌర్బల్యతకు దోడయి గర్భస్రావము తప్పక గలుగును. కొఱుకు రోగము గర్భస్రావమునకు గారణ మగుచున్నది. కొఱుకు రోగమున్న యెడల, గర్భధారణ ప్రారంభమునుండి; వెనుకటి గర్భపాతములయందు ఏయే కాలములయందు గర్భస్రావ మేర్పడినదో ఆంత పరిమితి వరకును, అయొడైడ్ ఆఫ్ పొటాసియం 5 గ్రెయినుల మోతాదును దినమునకు మూడుసారులు పుచ్చుకొనుచుండ వలయును.

### లక్షణములు.

గర్భస్రావము గలుగునెడల, ఒకవిధమగు ఆయాసము, నిస్త్రాణ, అలసట ప్రారంభమయి, వెన్ను, నడుము, తొడలు — వీటియందు నొప్పులు పోట్లు పొడుచుచు కొద్దిగా రక్తస్రావ మేర్పడును. ఈ లక్షణములు కొంత కాలము ఉండిన పిమ్మట కాన్పుయందు నొప్పులవలెనే నొప్పులుగలిగి ఒకప్పుడు వాంతియగుటయు, అధిక రక్తస్రావమగుటయు, గలుగును. ఈ రక్తము పూర్ణమయిన యెఱ్ఱరంగు గలిగియుండును. నొప్పియును, రక్తస్రావమును అప్పుడప్పుడు కలుగుచు యీ అవస్థ చాలదినములవరకు నుండవచ్చును. ఒకప్పుడు గర్భస్రావము అకస్మాత్తుగా ప్రారంభమయి, అంతయు కొన్ని గంటలలోనే పూర్తి కావచ్చును. మూడు మాసముల పిమ్మట యైనచో, పిండము, యెరుపు తెలుపు గలిగిన యొకబంతి ఆకారమును వహించి, పావురము గుడ్డు యొక్క పరిమాణము గలిగి యుండును. ఇంకను అధికకాలమయిన పిమ్మట యయినచో, కాలపరిమితి ప్రకారము పరిమాణము నందు పెద్దదిగానుండును. బాధయొక్కయు రక్తస్రావము యొక్కయు తీవ్రతను బట్టి పిమ్మట అపాయస్థితి యేర్పడియుండును.

### చికిత్స.

గర్భస్రావము గలుగు చిహ్నములు కనబడిన వెంటనే పరుండియుండుట మూలముగ విశ్రాంతిని దీసికొనుటవలనను, ఒకటి మొదలు అయిదు చుక్కలవరకు యక్స్ట్రాక్టు ఆఫ్ కోనియంను రెండుగంటల కొకపర్యాయము యిచ్చుట మూలమునను గర్భస్రావమగుటను నిలుపు చేయవచ్చును. లేక యక్స్ట్రాక్టు ఆఫ్ వైబర్నం ప్రూనిఫోలియా లిక్విడ్ నయినను రెండు గంటల కొక పర్యాయము ఒక డ్రాము మోతాదు చొప్పున నీయవచ్చును.

బాధ యెక్కువయి, రక్తస్రావము అధికమయినయెడల, గర్భస్రావము తప్పక దటసించును. ఈ సందర్భమునందు రక్తము విశేషనష్టము కాకుండునట్లుల జాగ్రతపడవలయును. ఈ స్థితియందు 1 వ ఆస్ట్రింజెంటు నిచ్చుచు, రోగి పరుండియే యుండి రక్తస్రావ భాగమునందు దూది పెట్టియుంచవలయును. గర్భస్రావము కాగానే రక్తస్రావము సామాన్యముగా దానంతట అదియే కట్టును. ఒకప్పుడు మాలిన్యమును దొలగించుట అవసరమగును. పైన చెప్పబడిన 1 వ ఆస్ట్రింజెంటుకంటె 3 వ ఆస్ట్రింజెంటు మిగుల ఉపయోగముగ నుండునుగాన, తీవ్రమైయెడల దీనిని ఉపయోగించవలయును. ఈస్థితియందు, రోగి, ఏడు లేక తొమ్మిది దినములవరకును పరుండియేయుండి విశ్రాంతిని దీసికొనవలయును. ఆహారపదార్థములందు తేలికవి పుచ్చుకొనుచు, విరేచనము క్రమముగా నగునట్లుల జాగ్రత పుచ్చుకొనవల

యును. గర్భస్రావమునందు, వెంటనే తిరుగుచు అరంభించినయెడల గర్భాశయముయొక్క అస్వస్థత యేర్పడునుగాన, యిందువిషయమయి స్త్రీలు బహుజాగ్రత్తగా నుండవలయును.

---

## గవదలు.

చెవియొక్క యెదురు వైపునను, దవడకుక్రిందు గానున్నూ, ఉమ్మినీరు స్రవించుగ్రంధియొక్క వాపుదల మూలమున నేర్పడెడి వ్యాధికి గవదలంఅనిపేరు. ఈవ్యాధి సామాన్యముగ బిడ్డల యందుఘటస్థించును. ఒకప్పుడు పెద్దవారల యందును ఘటసించును. ఈవ్యాధి ఒకసారివచ్చిన వారికి మరలవచ్చుట బహుఅరుదుఅయియున్నది. ఇదిఅంటువ్యాధిఅయి యున్నది ఈవ్యాధియం దువ్యాపించు పురుగుగనోరి యందలిగనో శ్వాసపురుగురూపముగనుండును. ఈవ్యాధియొక్క వ్యాప్తికిచలిగాలి మిగుల అనుకూలముగ నుండును. ఈవ్యాధి సంబంధమగుపురుగు శరీరము నందుఒవారము మొదలుమూడువారముల వఱకుబలిసినపిమ్మట, గవదలు తేలును. నిస్త్రాణ, చలి, జీర్ణాస్వస్థత, వాంతియగుట, రాత్రియందు తాపము గలుగుట—యీలక్షణములతో ప్రారంభమగును. అంతట, శరీరవేడిమి చాలవిషయములలో 100-101 డిగ్రీలకు హెచ్చును కొద్దివిషయములలో మాత్రము 103, 104 డిగ్రీలకు గూడ హెచ్చును. ముఖముయొక్క ఒకప్రక్క ఉద్రేకమగు పోట్లు ప్రారంభించి వాపు యేర్పడును. ఈబాధ ఒకప్పుడు పంటి నొప్పి బాధను బోలియుండును. చెవిక్రింద చెంపపైనుండి గడ్డమువైపులకు వ్యాపించుచు, యీవాపుదలభాగము తాకుచుగ రాయివలె గట్టిగానుండును. జ్వరము అంకురించిన కొద్దిగం టలలోనేగాని, లేక ఒకప్పుడు ఒకదినమునకుగాని రెండుదినములకుగాని యీవాపుయేర్పడును. ఈవాపుదల భాగమునందు పోటు అధికముగానుండి, వాపుదల నాలుగులేక అయిదు దినములు అదేప్రకారముండును. ఈగతియందు చర్మము యెఱ్ఱగానుండును. క్రమేణ యెరుపుదనమును వాపుదలయు తగ్గిపోవును. ఈవాపుదల ఒకప్పుడు ఒకవైపుననే యేర్పడ వచ్చును. ఇంకొకపుడు రెండువైపులను యేర్పడవచ్చును. ఈవ్యాధియొక్క ఉద్రేకగతుల యందు గొంతువాచుట వలన అహారము మ్రింగుట బహుకష్టముగానుండును. నాలుకపై పాచకమ్మి వాపుదలనంది ఊపిరి దుర్గంధసహితముగ నుండును. ఈవ్యాధియొక్క నడక యందు, సామాన్యముగ అంత్యగతియందు, స్త్రీలకు స్తనములయొక్క వాపుదలతోడను పురుషులకు వృషణములయొక్క వాపుదలతోడను, పరిణమించును.

## చికిత్స.

గవదలు ఉద్రేకగతియందుండినయెడల, గుటక వేయుట గాని, ఊపిరిని పీల్చుటకు గాని బహుకష్టముగా నుండును. ఇట్టిస్థితియందు గుడ్డనుడికెడునీళ్ళలో ముంచి, దానితో తఱచుగ వాపుదల భాగముపైన నద్దుచుండవలయును. ఇది మంచి గుణము నియ్యగలదు. ఇతర కాలములందు వాపుదలభాగమందు ఫ్లానల్ గుడ్డను గట్టియుంచ వలయును. జ్వరగతియందు రోగి పరుండియే యుండవలయును. అహారపదార్థములు మ్రింగుట కష్టమయినయెడల, పాలు మొదలగు ద్రవపదార్థములను మాత్రమే లోనికిచ్చుచుండ వలయును. విరేచనము సాఫీగా

యగుటవలన మిగుల ఉపయోగకారిగ నుండునుగాన, విరేచనబద్ధ ముండినయెడల విరేచనకారుల నుపయోగింపవలయును. రాత్రులం నిద్రపట్టకపోయిన క్లోరల్ హైడ్రేట్ నుగాని పొటాసియం బ్రోమైడునుగాని లోనకిచ్చుటవలన నిద్రపట్టగలదు. ఈ వాపుదల భాగము చీముపట్టినయెడల, పిండికట్లు కట్టుటవలన నుపయోగముండ గలదు. శరీరమంతయు ఉడుకునీళ్లలో స్నానము చేయుటవలన నుపశమనముగా నుండగలదు; సిట్రేట్ ఆఫ్ మెగ్నీసియాను వయస్సునుబట్టి తగుమోతాదులలో నిచ్చుటవలన శరీరమునకు చల్లదన మేర్పడగలదు.

---

## గాయములు.

శరీరమందలి కొన్నిభాగములు నలుగుట మూలమున గాయములు రేర్పడును. ఈ గాయములయందు చర్మము చీలుకొనిపోవుట తటస్థించదు. ఈ గాయములకు సాధుగతియు ఉద్రేకగతియు, కూడ గలవు. సాధుగతియందు చర్మముయొక్క ఉపరిభాగము మాత్రమే అస్వస్థత నందియుండును. ఉద్రేకగతియందు చర్మమునందలి చిన్నిరక్తనాళములు బద్దలై, అందలి రక్తము చర్మములోనికి జొచ్చుటవలన వివర్ణమేర్పడును. ఈవర్ణము మొదట గానలుపునీలము కలిసియుండి నలిగానుండి, పిమ్మట క్రమముగా ఊదా, ఆకుపచ్చ, పసుపుపచ్చ, వర్ణములను వహించి, దానంతట అదియే పోవును; గాయము ఉద్రేకస్థితిని వహించినయెడల, చర్మము క్రింది అంతర్భాగములయందు రక్తనాళముల యొక్క విచ్ఛేదముగలిగి రక్తము ప్రవహింపవచ్చును. ఈస్థితియందును, ఒకప్పుడు చర్మమున కేమియుహాని కలుగక అంతర్భాగములు మాత్రమే అస్వస్థత నందవచ్చును. చిన్ని గాయములకు, అనగా బిడ్డలు క్రిందపడుటవలన గలిగెడి గాయములకు, గుడ్డను బ్రాందిలో ముంచి పైనగట్టుటవలన గుణమియ్యగలదు. లేదా, స్పిరిట్సు ఆఫ్ క్యాంఫరునుగాని, టింక్చర్ ఆఫ్ ఆర్నికానుగాని పైనరాయుటవలన నుపయోగ ముండగలదు. ఎక్కువ ఉద్రేకస్థితి వహించిన గాయము తగిలిన అవయవమును దిండుపైన నుంచుట వలనగాని, వేరువిధముగాగాని, సాధ్యమయి నంతవరకు ఎత్తయిన ప్రదేశమునందుంచి ఫ్లానల్ గుడ్డను ఉడుకునీళ్ళలో ముంచి తడుచుగా వేడికాపడములను గాచుటవలన గుణముగా నుండును; లేక, విస్కీయును జలమును సమాన భాగములుగా గలిసిన లోషనును పైనరాయవలయును. గాయము అపాయకరమైన దైనయెడల, ఈస్థితియందు చర్మముపైన బొబ్బగా రేర్పడును. ఈబొబ్బలను మెల్లగా కత్తిరించి, అందలి నీరును ఓడిచివేయవలయును. ఈబొబ్బయొక్క పొరను మాత్రము తీసివేయకూడదు. అంతట వేడికాపడములను క్రమముగా తగ్గించి, ఒకపౌన్సు వినిగరును నాలుగు పౌన్సుల జలమును గలిసిన లోషనును రాయవలయును. కొంతకాలము పిమ్మట, సోప్ లినిమెంటును రాయుటవలన గుణ మియ్యగలదు.

గాయము తగిలిన భాగములయందు, ఒకానొకప్పుడు పెద్దరక్తనాళ మేదైన విచ్ఛేదమునంది, విశేషరక్తము ఆయా భాగములయందలి స్నాయు బంధముల యొక్కయు నాడిబంధములయొక్కయు అర్లికలలోనికి జొరవచ్చును. ఈస్థితియందు పుండుయేర్పడి చర్మము పగిలి బహుబాధ కలిగింపవచ్చును. దీనికి పిండికట్లనుగట్టి, పుండుఅంతయు శుభ్రమగువఱకును, కార్బాలిక్ లోషనులో గడుగుచు అందులకగు చికిత్స జేయ వలయును.

## గాయిటర్

గాయిటర్ వ్యాధియొక్క ముఖ్యలక్షణములు, గొంతుయొక్క ముందటి థైరాయిడ్ అనబడెడి ఒక గ్రంధియొక్క వాపుదల అయియున్నది. కనుగ్రుడ్లు పొడుచుకొని వచ్చునట్లుండుటయు, గుండెయొక్క కొట్టుకొనుట అధిక మగుటయు, ఈవ్యాధియొక్క యితర లక్షణములైయున్నవి. ఈవ్యాధియొక్క ఉధృతత పురుషులయందు కంటె స్త్రీలయందు ఆరు లేక యెనిమిదంతలు అధికముగా నున్నది. హిస్టీరియా, మూర్ఛ, అతిమూత్రము, మనోవ్యాధులు— వీటిచే బాధనొందువారియం దీవ్యాధికి ఉధృతత అతిశయముగ నుండును. ఇండియా దేశమునందు బంగాళా రాజధానియందును దక్షిణఇండియా యందును యీవ్యాధి సామాన్యముగ గనుపించుటయే లేదు. పశ్చిమోత్తర పరగణాలయందును నర్మదానదీ ప్రాంతములయందును యీవ్యాధి అతిశయముగ వ్యాపించియున్నది. త్రాగెడి జలములో సున్నముకలిసియున్న యెడల నీవ్యాధి అవతరించునని కొందరి అభిప్రాయమైయున్నది. ఇట్టి సున్నముగలిసిన నీళ్లను త్రాగవలసిన స్థలమున నుండుట దటస్థించినయెడల వ్యాధి అంకురించగనే యితరస్థలములకు వెళ్లిపోవుట మంచిదై యున్నది.

థైరాయిడ్ గ్రంధియొక్క వాపుదల ఒకప్పుడు మిగుల యెక్కువై, శ్వాసనాళముపైనను ఆయాభాగముల యందలి రక్తనాళముల పైనను అదిమిపట్టుటవలన, ఉచ్ఛ్వాసనిశ్వాసము లతికష్టములై, గుటకవేయుటయు బాధతో గూడినదియై గొంతుయొక్క ధ్వనియందుకూడ మార్పు గలిగియుండును. ఈగతియందు శస్త్రము చేయుట మిగుల అవసరముగాన నశ్రద్ధ జేయరాదు.

నాడి యెక్కువ చురుకుగా కొట్టుకొనుచుండును; నిమిషమునకు 90 మొదలు 180 వరకును ఒకప్పుడు అంతకెక్కువగను గూడ నుండును. చేతులును కాళ్ళును ఒకప్పుడు శరీరమంతయుగూడ వణకుట ప్రారంభమగును. శరీరపేడిమి అధికము గాకపోయినను ఒడలెప్పుడు నేకరీతిగ ఉష్ణతను వహించియుండుట వలన శరీరమందలి పదార్థనష్టము అధికమయి రోగి చిక్కిపోవుట తటస్థించును. నాలుకయొక్క స్థితి తరచుగ మారుచుండును. జీర్ణకోశముయొక్క యస్వస్థత లేనంతవరకును నాలుక సామాన్యముగ శుభ్రముగనే యుండును. జీర్ణతయు బాగుండవచ్చును గాని, ఒకప్పుడు అజీర్తివిరేచనములు ప్రారంభమయి వాంతులును గలిగియుండ వచ్చును. మూత్రద్వారము నుండి శ్వేతధాతునష్టము గలుగవచ్చును. అతిమూత్రవ్యాధియు ఒకానొకప్పుడు పుట్టవచ్చును.

### చికిత్స.

రోగికి మొదటగా చేయవలసిన చికిత్స, శరీరమునకును మనస్సునకును పరిపూర్ణమగు విశ్రాంతి నిచ్చుటయై యున్నది. ఉధృత గతులయందు రెండుమూడు మాసములవరకు గూడ, ప్రక్కనుండి కదలనీయక, ఉద్రేకతను గలుగజేయు యెట్టి సమాచారములను రోగికి దెలియపర్చరాదు. ఉధృత గతులయందు కాఫీ టీలను యియ్యరాదు. మద్యపదార్థములు సంపూర్ణముగ త్యజించవలయును. కాల్సియం క్లోరైడ్ ను 5 గ్రైనుల మోతాదులలో దినమునకు మూడుసారు లిచ్చుటవలన నుపయోగముగ నుండగలదు. గుండెకాయయొక్క ఉధృతమగు వడకను నిలుపుచేయుటకు టింక్చర్ డిజిటాలిస్ ను గాని టింక్చర్ స్ట్రోఫాం

స్రావమునం దస్వస్థత యుండిన యౌవన స్త్రీలయందు మాత్రము యీ లక్షణములు గుండె వ్యాధిని సూచింపనేరవు. గుండె అదరునపుడు యీక్రింది అంశములను ముఖ్యముగ గమనించ వలయును.

1. ఎక్కువకాలము పరుండియుండుట మూలమున గుండెకాయ యొక్క పనినితగ్గించవలయును.

2. మనోద్రేకత కలుగకుండ జేసికొనుట మూలమునను, త్వరితముగ నడచుటవలనను, అధిక బరువుల నెత్తుటవలనను, ఆకస్మికమగు వ్యాయామ పరిశ్రమలను దీసికొనకుండుట మూలమునను, చల్లని పానీయపదార్థములను విశేషముగ త్రాగకుండుట మూలమునను, అజీర్ణ మండియు మలబద్ధమునుండియు గాపాడుట మూలమునను, గుండెకాయయొక్క వ్యాపారము క్రమముగా జరుగుచుండునటుల చేయవలయును.

---

## గుండె అదరు.

### (పాల్పిటేషన్)

గుండెయందలి దెబ్బయొక్క తరచుగ సంభవించుటవలన గాని, దీనియొక్క తీవ్రత వలనగాని, గలిగెడి చిత్తవృత్తికి పాల్పిటేషన్ అను నామకపేరు గలదు. ఈ చిత్తవృత్తి కేవలము మనస్సంబంధ మయినదే అయియుండవచ్చును. కాని, సామాన్యముగ బాహ్యమునను గూడ గోచరమగుచున్నది.

పాల్పిటేషన్ అనునది రెండువిధములుగ గలుగుచున్నది. ఒకటి నరముల సంబంధమగు పాల్పిటేషన్ అనియు, రెండవది అవయవ సంబంధమగు పాల్పిటేషన్ అనియు, చెప్పబడుచున్నవి. కేవలము నరముల సంబంధమగు పాల్పిటేషన్ వలన ప్రాణాపాయము లేదు. గుండెయొక్క పాల్పిటేషన్ లేక అదరు అనునది ఒకప్పుడు, అజీర్తివలనను, కడుపు ఉబ్బరమువలనను, చుట్టను గాల్చుటవలనను, రక్తహీనత వలనను, హిస్టీరియావలనను, ఋతుస్రావముయొక్క క్షీణత లేక నిలుపుదల వలనను, గలుగవచ్చును. అత్యుష్ణమగు దినములను పాల్పిటేషన్ కనుపడవచ్చును. గుండెకాయ యెంతమాత్రము రేగుదలస్థితియం దుండినను యెడమవైపున బరుండుటకు కష్టముగా నుండును. గుండెయందు అవయవాస్వస్థత యేర్పడిన యెడల అస్వస్థతయొక్క ఉద్రతను బట్టి యీవ్యాధివలన అపాయము స్థిరపడుచున్నది.

### చికిత్స.

పాల్పిటేషన్ వలన బాధనొందువారు తమ సహజజ్ఞానమువలన నీ అదరును అణచి పెట్టుటకుగాను దమ చేతితో హృదయభాగమును ఒత్తిపెట్టుట మూలమున గొంతయుపశాంతిని బొందుదురు. ఇదేవిధముగా హృదయభాగములయందు అణచి పెట్టుటకుగాను, బెలడోనా పలాస్త్రిని నునుపైన తోలుపైనవేసి దానిని ఆస్థలమున వేయవలయును, ఇట్లు చేయుటవలన పలాస్త్రి ఆభాగమును కదలనీక కొంతవరకు ఉపశాంతి గలుగజేయును. కొంచెము బ్రాందీని లోనికిచ్చుట వలనను గుణము నియ్యవచ్చును. దీనిని తరచుగా నిచ్చుటవలన నదియే అలవాటగును. గాన బ్రాందీ నిచ్చుటయందు జాగ్రతగా నుండవలయును. అంతియగాక బ్రాందీ

నిచ్చుచుండుట వలన నది పనిచేయుటకుగాను మోతాదును హెచ్చుచేయుచుండుట అవసరమగునుగాన నది మిగుల ఉపయోగకారిగ నెంచబడదు. బ్రాందీని తరచుగ నిచ్చుట వలన గుండెయొక్క వ్యాపారమును దానంతట అది జేసికొనెడి శక్తి తగ్గిపోవుచుండును. ఇందులకే బ్రాందీయొక్క మోతాదును క్రమక్రమముగ హెచ్చుచేయవలసిన అవసరము కలుగుచున్నది. ఈ కారణమువలన దీనికి బదులుగా స్పిరిట్సు అమ్మోనియా అరోమేటిక్ను క్రమముగ మోతాదులో ఉపయోగింప వలయును. దీనివలన నేలాటి యపాయమును కలుగజాలదు. ఒకానొకప్పుడు చల్లని నీళ్ళను నెమ్మదిగా త్రాగుటవలన గాని పొంగువచ్చు జలమును త్రాగుటవలన గాని అదే ఉపయోగముండగలదు. రోగి రక్తహీనత గలిగి నిస్సత్తువగానుండిన యెడల ఈస్టన్సు సిరప్నుగాని క్వైనా హైపొఫాస్ఫైట్సునుగాని లోనకియ్యవలయును. నరముల యొక్క రేగుడలను స్వస్థపరచుటకుగాను పొటాసియం బ్రొమైడును యియ్యవచ్చును. కాలేజము నందలి అస్వస్థతను బోగొట్టుటకు క్యాలొమెల్ను ఉపయోగించవలయును. పేగులయందలియు కాలేజమునందలియు రేగుడల పదార్థములను వెలిబుచ్చుటకుగాను పిల్యూలా హైడ్రార్జిరీని 4 గ్రెయినులు లోనకిచ్చి పిమ్మట 1 వ విరేచనకారి నియ్యవలయును. జీర్ణాశయము యొక్క రేగుడలను అపుజేయుటకుగాను బిస్మత్ సబ్నైట్రేస్ - పెప్సిన్లను యియ్యవలయును.

టించ్చర్ బెలడోనాను పెద్ద మోతాదులో నిచ్చుటవలన, గుండెకాయయొక్క రేగుడలు కట్టుబడినట్లు కొందరు వైద్యశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఈ సమయమునందు శరీరపరిశ్రమ యెంతమాత్రమును ఉండకూడదు. ఎట్టిమనోవికారము లున్నను శాల్యులేపనమును వ్యక్తపరచునుగాన, రోగికి మనోవికారము లేమియు గలుగకుండ శాంతత యుండునట్లు పెట్టవలయును; ఏదైన మనస్సంబంధమగు అస్వస్థత యుండిన యెడల సోడా సేలిసైలస్ను చిన్న మోతాదులో అనగా 10 గ్రెయినులతో 10 లేక 20 గ్రెయినుల పొటాసియం బ్రొమైడును గలిపి, దినమునకు రెండు లేక మూడు పర్యాయములు యియ్యవలయును. దినమునకు ఒకటిసారిగ నిద్రబోవుముందర రెట్టింపు మోతాదు నిచ్చినందువలనను ఉపయోగము గనుండగలదు.

అన్నింటికంటె తుదను చెప్పబడినప్పటికిని ఉపయోగమునందు తక్కువకానట్టి టించ్చర్ డిజిటాలిస్ను 5 మినిములు మోతాదులలో దినమునకు మూడు పర్యాయము లిచ్చుట వలన, మిగుల ఉపయోగముగ నుండగలదు. అవసరము వచ్చినపుడైనను యీ మందును యియ్యవచ్చును.

---

## గురకతో గూడిన దగ్గు.

### (మాంద దగ్గు లేక కక్కువాయి దగ్గు)

గురకతో గూడిన దగ్గునకు మాందదగ్గు లేక కక్కువాయి దగ్గు అను పేర్లు కూడకలవు. ఈ దగ్గు అంటువ్యాధి అయియుండి సామాన్యముగ బిడ్డలకు సంభవించుచు ఒకానొకప్పుడు పెద్దవారలకుగూడ దటస్థించుచు, జీవితమునందు సాధారణముగ ఒక్కసారిమాత్రమే గలుగుచుండును; ఇది సామాన్యపుదగ్గుగా ప్రారంభమయి, కొన్నిదినముల పిమ్మట తెరలుగావచ్చి,

యియ్యవలయును. జీర్ణమునకు అగ్నము గాని పదార్థములను యియ్యకూడదు. వ్యాధియొక్క ఆరంభగతులయందు జ్వరము వచ్చునట్లుండిన యెడల నున్నా రొమ్ము పడిశెముపట్టు నట్లుండిన యెడల నున్నా రోగికి వెచ్చగా నుండునటుల చేయ వలయును. రాత్రిల యందు బయిండా నపుడు దిండ్లపైన తలను ఆన్చుకొని యుండ వలయును. కిటికీలం తెరచి గాలిని లోనకు రానీయ వలయునుగాని రోగిపైగాలి వీచకుండ జేయవలయును.

పైనచెప్పిన బ్రాందీ ఆవనూనెలకు బదులుగా, వెన్నుపైన రాయుటకు, సోప్ లినిమెంట్ను ఓపియం లినిమెంట్ను ఉపయోగించుట మంచిది. ఇవి విషపదార్థములు. వీటిని పైన రాయవల యునుగాని లోనతీసుకోరాదు. మిగుల ఉద్రేక గతులయందు 20 చుక్కల క్లోరోఫారంను చేతిరుమాలుపైన వేసి తెరవచ్చినప్పుడు బిడ్డయొక్క ముఖమునకు ఒక అరడుగు దూరమున నుంచవలయును. కోపమారుటలో 3వ ఔషధయోగమును గూడ వాడి చూడవచ్చును. ఈ వ్యాధివలన మిగుల నీరసము గలుగును గాన బలవర్ధకౌషధములలో 3వ ఔషధయోగము నియ్యవలసి యుండును.

## గొంతు రోగములు.

### 1. గొంతు బొంగుపోవుట.

స్వరపేటికను పైభాగమునను గొంతునకు వెనుక భాగమునను రేగుదల యేర్పడుటచే రక్తము కూడుకొని అధికముగు ఆమను పరివృద్ధి యగుటవలన గొంతు బొంగుపోవుట కలుగుచున్నది. ఇది ఉదయమున ప్రారంభమయి మధ్యాహ్న వేళలయందు తగ్గిపోయి రాత్రిల లో హెచ్చుదలయం దుండును. ఇతర ఉద్రేక లక్షణములులేని సాధితనముతో గూడిన బొంగుపోవుటకు ఫ్లానెల్ గుడ్డను చుట్టి యీ క్రింది ఔషధయోగమును మూడు లేక నాలుగు గంటలకొక ఔన్సుచొప్పున పుచ్చుకొనవలయును.

| | | | | |
|---|---|---|---|---|
| టింక్చర్ క్యాంఫర్ కో | ... | ... | డ్రాములు | 3 |
| వైనం ఇపికాక్ | ... | ... | డ్రాము | 1 |
| స్పిరిట్ ఈథర్ నైట్రిస్ | ... | ... | డ్రాములు | 3 |
| జలము | ... | ... | ఔన్సులు | 7 |

పెద్దవారలకు పల్వస్ ఇపికాక్ కో ను 5 గ్రెయినుల మోతాదులలో గుణము నిచ్చు వరకును మూడుగంటలకొకపర్యాయ మిచ్చుటవలన ఉపయోగ ముండగలదు. క్లోరేట్ ఆఫ్ పొటాష్ టేబ్లాయిడ్ (బిళ్లలు)లను ఉపయోగించుట వలనను ప్రయోజన ముండగలదు. కొకెన్, పొటాష్, బోరాక్సు (వెలిగారము)లతో జేయబడిన బరోస్ వెల్కం అండు కంపెనీయొక్క వాయిస్ టేబ్లాయిడ్సను బుచ్చుకొనుటయు మిగుల మంచిది. ఈ బొంగు పోవుటకు దోహంగా గొంతులోని గవద గాయలు (Tonsils) యుద్రేకమై ఉబ్బుదల నందియున్నట్లుండినయెడల గ్లిసరీన్ను టింక్చర్ ఫెర్రయి పెర్క్లోర్ను సమానభాగములుగ గలిపి, బ్రష్ తో గొంతులోని గవదకాయలకు దినమునకు రెండుసారులు రాయవలయును.

### 2. గొంతనాలిక యొక్క పొడగరించుట.

గొంతుయొక్క ద్వారము మొదలున పైభాగమునుండి క్రిందికి వ్రేలాడుచుండెడి యీకొండ నాలుకను నోరు తెరచిన యెదట ప్రతివారును గుర్తింప దగి యున్నది. ద్రవ పదార్థములను

మ్రింగునపుడు, వీటిని తిరిగి నాసికాద్వారముల గుండ రావుండ జేయుట, దీనియొక్క ఫలి అయియున్నది. జలుబువలన గాని, బహిరంగోపన్యాసముల నిచ్చుట వలన గాని, ఒకప్పుడు జీర్ణకోశమునందలి అస్వస్థత వలనగాని, యీ కొండనాలుక పొడగరించి, నాలుక యొక్క వెనుకభాగముపై నంటియుండును. ఇందుమీదట రేగుదలపుట్టి, బొంగురు ధ్వని ప్రారంభమయి, పరుండి యున్నపుడుగాని, చదువునప్పుడు గాని మాట్లాడునప్పుడుగాని వాయువును నోటిద్వారా పీల్చునప్పుడు గాని, ఒకవిధమయినదగ్గు కలుగుచున్నది. కడుపులో త్రిప్పుటయు వాంతికలుగుటయు కూడ నొకప్పుడు తటస్థింపవచ్చును.

చికిత్స.

5. గ్రెయినుల సిల్వర్ నైట్రేటును ఒక ఔన్సు జలములో గలిపి ప్రుల్లకు దూదిని చుట్టి యీ సొల్యూషనులో ముంచి కొండనాలుకపై ఉదయమునను సాయంత్రమునను అద్దవలయును.

ఒక డ్రాము ట్యానిక్ ఆసిడ్‌ను నాలుగు డ్రాముల గ్లిసరీనులో కలిపి స్పిరిటు దీపముపైన వెచ్చజేసిన పిమ్మట, యిది ద్రవరూపముగా మారును. ఉదయమునను సాయంకాలమునను దీనిని రాసినందువలనను ఉపయోగ ముండగలదు.

పగటిపొడుమును ఉదయముననున్నూ సాయంత్రమున యున్నూ బ్రష్‌తో నద్దుచుండుట వలన నొకప్పుడు ఉపయోగించగలదు.

ఏమందు ఉపయోగించినను విరేచనబద్ధ ముండిన యెడల అందులకగు చికిత్సను జేయవలయును.

వీటి అన్నిటి కంటెను పొడగరించిన కొండనాలుక యొక్క కొంచెమును చివరభాగమును గత్తిరించుటవలన నెక్కువ ఉపయోగ ముండగలదు.

3. గొంతుయొక్క వాపులు.

స్కార్లెటు జ్వరమునందు గొంతుయొక్క వాపుదల ఉద్రిక్తస్థితి నందియుండును. ఱుమ రోగమునందును ఒకప్పుడు గొంతు వాపుదల నందవచ్చును. ఆయావ్యాధుల యందు గొంతువాపుదల ననుసరించి యితర లక్షణములును ఉండును. జలుబు వలన నేర్పడిన గొంతువాపును గురించి మాత్రమే యీ సందర్భమున ఆలోచింపబడును. జలుబువలన గలిగడియీ గొంతువాపునకు, అలసట వ్యాకులత అస్థైర్యము జలదారులయందలి దుర్వాయువులు, ఉద్రిక్తతను బుట్టించును. జలుబు వలన గలిగడి గొంతువాపు సాధుగతియందును లేక ఉద్రిక్తగతి యందును ఉండవచ్చును. ఈ వాపుదల సామాన్యస్థితియం దుండినపుడు ఒకప్పుడు గొంతు బొంగు పోయినను పోవచ్చును, ఈ వాపుదల ఉద్రిక్తస్థితియం దుండినపుడు గవదకాయల యొక్క వాపుదల (Tonsillitis) కలుగును. ఈ స్థితియందు సామాన్యముగ ఒక గవద కాయయును, ఒకప్పుడు రెండు గవదకాయలును, వాచుట యేర్పడును. అస్వస్థత భాగము మిగుల యెర్రనై వాపుదలనంది పుండ్లు యేర్పడి ఒకప్పుడు వ్రణమునకు స్థానమేర్పడినను యేర్పడును. ఈ గతియందు ఆ భాగమంతయు పచ్చిగా నుండి మ్రింగుటయు కష్టముగా

నుండును. చీము యేర్పడుచున్నపుడు గొంతులో పోటు పొడుచును. చెవులలోను బాధ కలుగుచు తలనొప్పి ప్రారంభమయి ఊపిరిని బీల్చుటకును మ్రింగుటకును మిగుల కష్టమయి తరుచుగ మ్రింగవలెనను యిచ్ఛ గలుగుచు నోటిలో బెట్టు ద్రవపదార్థములు ముక్కు వెంబడి వెలువడుచుండును. చీము అంతయు గూడి వ్రణము పక్వమునకు వచ్చుసరికి మూడు నాలుగు దినములు పట్టును. అంతట మాలిన్యమంతయు బయలు వెడలి శీఘ్ర నివారణ మగును. మెడయందలి గ్రంథులును వాపుదల నంది బాధగా నుండును.

చికిత్స.

గొంతువాపుయొక్క సామీపగతులయందు మస్టర్డుపట్టీని పైభాగమునందు వేయుటవలనను, విరేచనకారిగ 1 వ ఔషధయోగమును అప్పుడప్పుడు నిచ్చుట వలనను పటికగండూషమును వాడుటవలనను ఉపయోగ ముండగలదు. గొంతుయందు పుండ్లుపడినయెడల మూడు డ్రాముల పటికను ఒక ఔన్సు జలములో గలిపి, దానిని అద్దుటవలన నుపయోగించగలదు. గవదకాయల (Tonsils) యొక్క వాపుదల అతిశయముగ నుండినపుడు బయటివైపున ఉడుకు నీళ్ళలో ముంచిన గుడ్డతో కాపడమును గాచవలయును. గొంతులోనికి ఆవిరిని బట్టవలయును. బాధను తగ్గించుటకును విశ్రాంతిని గలుగజేయుటకును క్లోరల్ హైడ్రేట్‌ను తగుమోతాదులో నిచ్చుటవలన నుపయోగించగలదు. అవసరమైన యెడలనైనను చీము గానున్న యెడలనైనను వ్రణమును శస్త్రము చేయించవలయును. గ్వాయికం (Lozenges) బిళ్ళలను తరుచుగా చప్పరించుట వలనయైనను, పోటాసి క్లోరైడ్ 10 గ్రెయినుల మోతాదును మూడుగంటలకొకపర్యాయము పుచ్చుకొనుట వలనయైనను, స్పష్టమగు ఉపశాంతి కలుగగలదు. నూటికి 10 వ వంతు కొకేను సొల్యూషనును గొంతుకునకు రాయుటవలన ఉద్రేకబాధ తగ్గుదల నందును.

4. గవదకాయల యొక్క వృద్ధియగుట (Tonsillitis)

గవదకాయలు తరుచుగ వాపుదలనందుట మూలమున నవి పరిమాణమునం దభివృద్ధియగుట యేర్పడును. కొందరకు యీ గవదకాయలు సహజముగ బుట్టుకతోడనే పెద్దవిగ నుండును. కొందరకు యితర కారణములవలనను పెద్దవికావచ్చును. తేమగల ప్రదేశముల యందు నివసించుటవలన నొకప్పుడు యీవ్యాధి యేర్పడవచ్చును. ఈ గవదకాయలు పెద్దవియై, గట్టిపడియుండినపుడు, మ్రింగుటయందును, ఊపిరిని బీల్చుటయందును గష్టమై, మాటయందును స్వచ్ఛత దప్పి, ఒకవిధమగు ముక్కుడుమాట వచ్చుచుండును. కొంతవరకు చెవుడు యేర్పడి, యీ రోగి నిద్రించునపుడు నోరు దెరచుకొనియుండి, గుఱ్ఱు పట్టుట అధికమగును. వాయువిడిచియుండంతట మాత్రము మార్పుగలిగినను, యిట్టివారలకు గొంతునొప్పి యేర్పడును. ఈ వ్యాధి శీతల ప్రదేశములయం దధికముగ నుండును.

చికిత్స.

చలిగాలి తగులకుండు నట్లు సాధ్యమగునంత వరకు జాగ్రత్తను బుచ్చుకొనుచు బలవర్ధకౌషధముగ 3 వ ఔషధయోగమును బుచ్చుకొనవలయును. బలమునిచ్చు ఆహారపదార్థములను భుజించుచుండవలయును. క్రమముగ శరీరసాధకమును దీసికొనుచు, ఉదయముననే చన్నీళ్ళలో స్నానము చేయుటవలన గుణము గనిపించగలదు. పటిక గండూషమును ఉప

యోగింపనగును. సిల్వర్ నైట్రేట్ సొల్యూషనును రాయుటవలన ఉపయోగముండునని చెప్పుదురుగాని, దీనివలన గవదకాయలకు రేగుదల అతిశయమై వాటియొక్క అభివృద్ధి కనువు గలుగజేయుటయు గలదు. ఈ సందర్భములందు గవదకాయలను సర్జనుయొక్క సహాయమున గత్తిరించుటయే ముఖ్యముగ గనుపించుచున్నది.

## 5. స్వరపేటిక యొక్క వాపుదల (Laryngitis)

శ్వాసనాళము యొక్క పైభాగము స్వరపేటిక యనబడును. ఈ భాగము యొక్క వాపుదల పడిసెము తోగాని, గొంతుయొక్క పచ్చి చేయుటతో గాని ప్రారంభ మగును. జలుబువలన గాని కంఠధ్వనియొక్క అధిక పరిశ్రమ వలనగాని, యీ వ్యాధి సంభవింపవచ్చును. క్షయరోగమువలనగాని కొరుకు రోగముయొక్క ఫలితముగగాని, ఒకప్పుడు యీవ్యాధి సంభవింపవచ్చును. ఈవాపుదల ఒకప్పుడు గొంతు బొంగుపోవునంత కొద్దితోడనే సమాప్తి నందవచ్చును. మరియొకప్పుడు ఉద్రితగతిని వహించి కంఠధ్వని బొత్తుగా నశించి ఊపిరియాడకుండ జేయును; ఉద్రితగతియందు సామాన్యముగ బిడ్డలకు కొన్ని గంటలలోనే మరణము సంప్రాప్తమగును; దీర్ఘవ్యాపక స్థితి యందు కొన్ని వారములుగాని కొన్ని నెలలుగాని పట్టును. శ్వాసనాళము యొక్క వాపుదల ఉద్రితగతియందుండి అతిశయస్థితిలో నున్నయెడల నిది మిగుల అపాయకరమైన వ్యాధి అయియున్నది. జ్వరము, బాధ, గొంతుయొద్ద బిగువు, ఎలుగురాసినట్టియు గొణుగునట్టియు కంఠధ్వని, కింకివాయు సంబంధమగునట్టి దగ్గు—యీ లక్షణములతో గూడియుండును. మొదటగా గొంతుయొక్క పైభాగమున్నూ పచ్చిగానుండి ఆరుదల నందినట్లుండి, దళమైనట్టియు తీగెలు సాగునట్టియు కఫము వెలువడుచు, యీ కఫము చీముతో సంబాధించినదై యుండి వెలువడుట అధికమైనకొలదిని బాధ తగ్గుదల నందుచుండును. ఉచ్ఛ్వాస నిశ్వాసముల యందాయాసము గలుగుట, సులభముగా మింగుట కశక్తత, నిద్రపట్టకపోవుట, ఉండి ఉండి శ్వాసావరోధము కలుగుచుండుట, తుదకు ఎగఊపిరి బిల్చుట, మూర్ఛలు వచ్చుట—యీ లక్షణములు క్రమముగా గనబడుచుండును. గొంతుయెఱ్ఱనై వాచినట్లు కనబడును. శ్వాసనాళములోనికి ఉండు చిన్నరంధ్రము అయా భాగములు వాపుదల నందుటవలన కొంచెముచ్చు తక్కువగా మూయబడి వాయుప్రవేశమున కాటంకము గలుగజేయ బడుచున్నది

### చికిత్స.

గొంతు బొంగుపోవుట తోడనుగాని కంఠధ్వనియొక్క నశింపుతోడను గాని యీ వ్యాధి ప్రారంభముకాగానే చలిగాలి తగులకుండునట్లు గొంతుచుట్టు ఫ్లానల్ గుడ్డను జుట్టుటనుగాని, మస్టర్డుపట్టీని వేయుటనుగాని, చేయవలయును. కఫమును హరింపు చేయుటకుగాను యీ క్రింది ఔషధయోగమును మూడు లేక నాలుగు గంటల కొకసారి ఒకఔన్సు మోతాదు చొప్పున నీయవలయును.

| | | | | |
|---|---|---|---|---|
| టింక్చర్ క్యాంఫర్ | ... | ... | డ్రాములు | 3 |
| వైనం ఇపికాక్ | ... | ... | డ్రాములు | 1 |
| స్పిరిట్ ఈథర్ నైట్రిస్ | ... | ... | డ్రాములు | 3 |
| నీళ్ళు | ... | ... | ఔన్సులు | 7 |

వ్యాధి ఉద్రితగతియై యుండినయెడల అధిక చికిత్సలను జేయవలసి యుండును. ఉడుకునీళ్లనుంచి వచ్చెడి ఆవిరిని లోనకు పీల్చుచు ఉడుకు నీళ్లలోముంచిన స్పంజితో గొంతుయొక్క పైభాగమున నద్దవలయును. బిడ్డల కయినయెడల గంటకొకసారి 30 మినిములు స్పిరిట్ ఈథర్ నైట్రిసును లోనకియ్యవలయును. పెద్దవారల కయినయెడల పల్విస్ ఇపికాక్ కో ను 5 గ్రైయినుల మోతాదులలో నాలుగుగంటల కొకసారి యియ్యవలయును. అవసరమయినయెడల విరేచన కారిగ 1వ ఔషధయోగము నియ్యవలయును, రోగిని మాట్లాడనియ్య కూడదు. రోగి పరుండియుండు గదిలోనికి గాలి ఉద్రితముగ విసరుట లేకుండ నుంచవలయును. ఆహారమునకు ద్రవపదార్థములను మాత్రమే యిచ్చుచు ఘనపదార్థముల త్యజింపవలయును.

---

## గోరుచుట్టు.

గోరుచుట్టు అనేకవిధము లయియున్నది. అన్నిటిలోను తేలిక విధమయినది తటస్థించినపుడు గోరుయొక్క మొదలువైపున ఒకప్రక్కగా వాపుదల ప్రారంభమయి పోట్లు పొడుచుచుండును. క్రమక్రమముగా కొంచె మెచ్చు తక్కువగ గోరు చుట్టును, కొంచెము తెల్లనైనట్టియు, కొంతవరకు స్వచ్ఛమయినట్టియు, గుల్లయేర్పడును. ఈగుల్లను తెరవకుండిన యెడల, దానంతట అదియే బ్రద్దలయి, ద్రవరూపముగు మాలిన్యము బయలువెడలి మానుదల నందును. ఈ మాలిన్యము కొన్ని దినములపాటు అచ్చట కూడుకొని యుండినయెడల చర్మముయొక్క అంతర్భాగమున పుండు రేర్పడి రోగిని చుక్కవలె పైకితేలి యిది బహువ్యధనైయుండును. ఇది వృద్ధిఅయినయెడల గోరు నశింపునందును. ఈగుల్లను కత్తిరించి పిండికట్లు కట్టుటవలన నీపుండును మాన్పవలయును. ప్రతిదినమును కార్బాలిక్ లోషనుతో గడిగి శుభ్రపరచుట మంచిది.

రెండవవిధమగు గోరుచుట్టు వ్రేలియొక్క చివరభాగమునందు లేచును; మొదటి విధమయిన దానికంటె నిది మిక్కిలి కఠినమైనదై యందలి మాలిన్యము చర్మమునకు పూర్తిగా నడుగుభాగమున యేర్పడియుండును. గుల్ల తేలక వ్రేలు ఉబ్బి, యెర్రనై మాలిన్యము పైకితేలిన కొలదియు తెలుపువర్ణమును వహించుచుండును. ఈబాధ అరచేతి వైపులకును బాహువు వైపులకును గూడ వ్యాపించును. ఈ సందర్భమునందు గోరు సామాన్యముగ నశింపునందును. ఈస్థితియందు వ్రేలును నిలువు వైపులను లోతుగాజీల్చి, మాలిన్యమును దీసివేయుచు, పిండికట్లను కట్టవలయును. మాలిన్యము కారుట నిలుపుకాగానే పలాస్త్రిని వేయవలయును.

మూడవ విధమగు గోరుచుట్టు మిగుల ఉద్రితమైనదై యున్నది. ఇందు స్నాయు బంధముల నావరించియున్న కోశము ఉబ్బుదల నంది వేడియై యెర్రబారి విశేషముగు బాధను గలిగించును. ఇది రెండవ దానికంటె నెక్కువలోతుగ నేర్పడుచున్నది. వ్రేలు ఉబ్బుదల జూపి, త్వరలో చికిత్స నందనిచో వాపుదల చేతికి వ్యాపించి స్నాయు బంధములుగాని, వ్రేలియొక్క ఒకటి లేక అంతకెక్కుడు యెముకలుగాని హానిజెంది బయటికి వెడలి

రావచ్చును. అస్వస్థత భాగమును ఉడుకు నీళ్లలో తడిపి వేడివేడి అవిసెపిండి కట్లను గట్టవలయును. వ్యాధి ఆరంభమయిన యిరువది లేక ముప్పది గంటల లోపుగా వాపుగల నందిన భాగము యొక్క వరకును జీల్సి లింటును బెటుటవలన గాయము తెరచియుండునట్లుగా జేయవలయును. వేళ్లునకు పరిపూర్ణమైన విశ్రాంతి గలుగునట్లు చేయుటకు వేళ్లు వెంబడి మణికట్టువరకును నొక మృదువగు కొయ్యబద్దను గట్టవలయును. ఈకొయ్యబద్ద వేళ్లయొక్క వెడల్పునకే యుండి అరచేతి వైపులను మాత్రము యెక్కువ వెడల్పుగ నుండిన యెడల సౌఖ్యకరముగ నుండగలదు. ఈ కొయ్యబద్దపై గుడ్డను జుట్టి, అనుదినమును తగుస్థానము మార్చుచు, కొయ్యబద్దనుగూడ శుభ్రముగా గడుగుచుండవలయును. చీమున పిమ్మట మామూల్యము నేళ్లుటు ఆగిపోవు వరకును, పిండికట్లను గట్టుచుండవలయును. చేతిని గదిలిని గలుగకుండునట్లు చేయుటకును, చేతికిని మోచేతిని ఒక వెడల్పయిన గుడ్డను గట్టి, చెయ్యి యొక్క వ్రేళ్లు యెదరభుజము వైపుల కుండునట్లు ముడుచుకొనియుండి, చేతిని ఆగుస్థమయిన అనుకొనియుండునట్లు చేయవలయును.

---

## గౌట్.

రక్తమునందు యూరిక్ అమ్లము ఉద్భవించి, స్నాయుబంధములయొక్క అల్లికలయందు నిలవకాబడుట వలన గలిగెడు మిగుల నుగ్రతనుగు బాధను గౌట్ అను వాపు కలుగగలదు. తీగనుగాని తప్పి సారాయిలనుగాని యెక్కువగా త్రాగుటవలన గాని మూత్రగ్రంథులయొక్క గాని వ్యాపారమునందు లోపము కలుగుటవలన, యూరిక్ ఆమ్లము అధికముగా నేర్పడుట తటస్థించును. ఒకప్పుడు వంశపారంపర్యముగ గలిగెడి ఉద్రేకత్వమువల్లనైనను గలుగవచ్చును; ఆహారపదార్థముల యందు స్పష్టమైన అవ్యక్తత లేక పోయినను, ఒకప్పుడు కాలిజమును మూత్రగ్రంథులును తమ కార్యముల నిర్వర్తింపక పోయినప్పుడు; యీవ్యాధి తటస్థించును. ఒకవిధమగు గౌట్వ్యాధి దీర్ఘవ్యాపితమగు సీసపుపదార్థపు వినియోగము వలన గలుగుచుండును. కొన్ని విషయములలో గౌట్వ్యాధి, వాతరోగము (కీళ్లనొప్పులతో గూడినది)ను బోలియుండును. గౌట్యందు మొదటగా, కాలివ్రేళ్లు చేతివ్రేళ్లు మొందలంగాగల చిన్నకీళ్లు అస్వస్థత నందును. వాతరోగమునందు, పెద్దకీళ్లు పట్టుపట్టును: గౌట్ వ్యాధి, సామాన్యముగ సోమరిపోతులకును, సుఖసరాయణులుగ భుజించువారలకును, దటస్థమగును. వాతరోగము, శుభ్రమగు దుస్తులు లేనివారికిని, శుభ్రమగు భోజనము లేనివారికిని, సామాన్యముగ దటస్థించుచుండును. గౌట్ పెద్దవయసునందు గలుగుచుండును; వాతరోగము తరుచుగ పిన్నవయస్కులకు గలుగుచుండును. ఒకప్పుడు, గౌట్ వ్యాధియును వాతరోగమును గలిసివచ్చినను రావచ్చును.

### లక్షణములు.

రేగుదల నందిన స్వభావము, జ్వరత, తలనొప్పి, అజీర్తిని సూచించు లక్షణములు — యీవ్యాధియొక్క తెరవచ్చుటకు ముందుగ నీగుణములు కనబడును. ఈవ్యాధి తరచుగా రాత్రులయందు వచ్చును. ఎక్కువతరచుగా కాలియొక్క బొటనవ్రేలుయందు ఉగ్రమతమగు మెల్లిపేయు నొప్పి ప్రారంభమయి, ఉదయమునకు తగ్గుదలనంది, వ్రేలుయొక్క యెఱ్ఱదనము

ను వాపుదలయు అటులనే యుండి వ్రేలు మృదుత్వమును వహించి మెరయుచుండును. చెవుల ఆన్సహితముగ నుండును; రోగియొక్క ప్రకృతి మిగుల అహంకారమును వహించి యుండును మూత్రము పరిధముమున క్షీణతనంది తీవ్రవర్ణమును వహించి స్వచ్ఛమైయుండి తరువాత అధికమయి యిటుక పొడుమును బోలిన గసి అడుగున చేరును. చాలదినములవరకు రాత్రులయందు బాధ అధికమగుచు. వాపుదల అధికమయిన కొలదియు బాధ తగ్గుచుండును బాధయు వాపుదలయు తగ్గుదలనందగనే, ఆభాగమునందలి చర్మము పొరలుగా నూడి పోవును. అంత నీవ్యాధి అంతరించి, మరల కొన్ని మాసములవరకును కనుపడక పోవచ్చును. ఈవ్యాధి పీడితునియొక్క గోళ్ళు గట్టిబారి, పెళుసులెక్క, గీలు జెందియుండును. అరుదైన విషయములలో మాత్రము, యీవ్యాధి బొటనవ్రేలునుండి శీర్షాశయము నకు వ్యాపించి, అకస్మాత్తుగ పొత్తికడుపుయొద్ద ఉద్ధృతమగు బాధ ప్రారంభమయి కడుపు ఉబ్బరము, నిస్రాణ, వాంతివచ్చునట్లుండుట, క్రమము తప్పినట్టియు నీరసతను వహించినట్టియు నాడి — యీలక్షణములు కూడియుండును. ఒకానొకప్పుడు అంతరావయవములకు వ్యాపించి, యితరరోగములను బుట్టింపవచ్చును. యూరిక్ ఆసిడ్ (అమ్లము) ఆయా అవయవములంగు జేరియుండుటవలన వివిధములగు అస్వస్థలు కలుగుచుండును.

## చికిత్స.

ఈ వ్యాధియందని తెరవచ్చుచుండదర, విరేచనబద్ధముండిన యెడల 1 వ విరేచనకారిని వెంటనే ఉపయోగించవలయును. వ్యాధియొక్క సూచనలు కనుపడినవెంటనే, 30 మినిముల కాల్చికం ద్రవమును 2 ఔన్సుల జలములో కలిపి పుచ్చుకొనవలయును. పిమ్మట బాధ తగ్గువరకు ప్రతినాలుగు గంటలకును డయూరెటిక్సులో 2 వ ఔషధయోగమును బుచ్చుకొనుచుండవలయును. మాంద్యత గలిగిన యెడలగాని, వాంతివచ్చినట్లు ఉండినయెడలగాని, మందును నిలిపివేయవలయును. గుండెయొక్క అస్వస్థత గలిగినయెడల కాల్చికంవైనును యొక్కువగ నియ్యరాదు. ఒక ఔన్సు జలములో నాలుగు డ్రాముల సోడా కార్బొనేట్ కలిపిన లోషనులో ముంచిన కాటన్ వూల్‌ను అస్వస్థత భాగముపైన గట్టవలయును. అస్వస్థత భాగమును ఉన్నతప్రదేశమున నుంచి, సాధ్యమయినంతవరకు గదలకుండ నుంచవలయును. అన్ని విషయములయందును వెచ్చన గలుగజేయుట యొక్కువ ముఖ్యము. చల్లదనము వలన నీ వ్యాధి అంతరావయవములకు వ్యాపించుటకు కనువగును. విశ్రాంతి పరిపూర్ణముగనుండి ఆహారపదార్థములు పాలు, అరోరూట్, సంబంధమగునవి అయియుండవలయును. లిథియా వాటరును విరివిగా నుపయోగింపదగును. ఉద్రేకత గలుగచేయు ఔషధముల నెక్కువగ నియ్యరాదు.

తెరవచ్చిన పిమ్మట భోజనపదార్థములు ముఖ్యముగ శాక సంబంధమైనవై యుండవలయును. తీపిపదార్థముల పరిపూర్ణముగ ద్యజింపవలయును. క్రమమైన శరీరసాధకమును బుచ్చుకొనుచు, విరేచన క్రమమును గాపాడవలయును.

—

## గ్రహణి.

### (డయేరి యా)

గ్రహణివ్యాధికి అతిసారము అతివిరేచనము అనియు నాడుపేర్లు కలవు. ఆంగ్లేయ భాషయందు డయేరియా అందురు. ఈ వ్యాధి అనేక కారణములవలన గలుగుచుండును. అన్ని తరగతులయందును ఇండియా దేశమునందు యీ వ్యాధి వ్యాపించి యున్నది.

(1) కాలరా వ్యాధికి ముందుగా నేర్పడు అతి విరేచనములు, (2) చీము, నెత్తురు, మలముతో పడు విరేచనములకు ముందుగాగలుగు అతివిరేచనములు. (3) ఇతర వ్యాధుల యొక్క లక్షణముగాగాని, అట్టి వ్యాధులతో గూడికనంది గాని, ఏర్పడు అతివిరేచనములు ఈ మూడు విధములగు అతివిరేచనములకును ఆయా వ్యాధులను వివరించుటయందు, చికిత్స వ్రాయబడియున్నది. ఇతరములగు అతివిరేచనములను యీ క్రిందిరీతిగ విభజింపవచ్చును. (1) రేగువల వలని అతివిరేచనములు, (2) వాయువేడిమియందలి మార్పువలన గలిగెడి అతి విరేచనములు, (3) హిల్ (పర్వతప్రాంతములయందలి) డయేరియా, (4) శిశుసంబంధమగు అతివిరేచనములు.

ఈ వ్యాధియందు చికిత్స చేయుటకు ముందుగా విరేచనములు కాలరావ్యాధియొక్క ప్రారంభ లక్షణములా అని ప్రశ్నింపవలయును. చుట్టుపట్ల కాలరా లేకుండినయెడల నీప్రశ్న గతిని గూర్చి విచారించవలసిన పనిలేదు. చుట్టుపట్ల కాలరా ఉండియుండిన యెడల, అందుల కగు చికిత్స జేయవలయును ఇటు తరువాత విచారించవలసిన విషయము, చీము నెత్తురు మలముతో పడు వ్యాధికి ముందుగా నీ విరేచనము లగుచున్నవాయని విచారించుట యయియున్నది. ఈ వ్యాధి కడుపునొప్పితో ప్రారంభమయిన యెడల నీ సందియము అవసరము లేదు. రేగుదలవలన గలిగినదని సూచించెడి యీక్రింది కారణము లేమయిన యుండిన యెడల నున్నా, యీ వ్యాధి యీ తరగతిక్రింద జేరదని గ్రహింపవచ్చును వాయువేడిమి యందలి మార్పువలన గలిగెడి అతివిరేచనముల వెంబడి, సామాన్యముగ చీము, నెత్తురు, మలముతో పడు విరేచనములు సంభవించును.

### I. రేగుదలవలని అతివిరేచనములు.

రేగువలవలని అతివిరేచనములు, చాల విషయములలో భోజన పదార్థములయందలి అవివేకతవలన గలుగుచుండును. ఇట్టిదానివలన ప్రేగులయందలి హానికరమగు పదార్థములను వెలిబుచ్చుటయే శరీరముయొక్క స్వాభావిక ప్రయత్నమని యెంచవలయును. ఈ హానికర మగు పదార్థములు, జీర్ణత కాదగని ఆహారము, పక్వమునకురాని కాయలు, పూర్తిగా నుడకని కూరగాయలు మొదలగునవి అయియున్నవి. వండుకొను పాత్రలను శుభ్రముగా కళాయి చేయించుకొన నందువలననున్నా యీ విధమగు విరేచనములు కలుగవచ్చును. ఉప్పునీళ్ళు త్రాగుటవలనను ఇట్టి విరేచనములు కావచ్చును. మంచినీళ్ళు ఉండు ప్రదేశములనుండి ఉప్పునీళ్ళుగల ప్రదేశములకు బోయినపుడు, ఆనీళ్ళను గాచి వడియగట్టి త్రాగకపోవుట వలన, నీ విరేచనములు తరుచుగ సంభవించుచుండును.

ఈ పైకారణమువలన గలిగెడి రేగుదల వలని విరేచనములు కలుగకుండ నంతట మనము జాగ్రత్తపడియుండ గలము. మన స్వాధీనమునందు లేని కొన్ని.

కారణములును గలవు. పురుగులు, మలపదార్థము యొక్క నిలువ యుండుట, అజీర్తి, పిత్తముయొక్క అతిప్రవాహము, కాలిజమునందు రక్తము కూడుకొనుటవలన గలిగెడి పిత్తము—యీ కారణములవలనను రేగుదల గలిగి అతివిరేచనములు గలుగవచ్చును.

చికిత్స.

మొదటగా జెప్పబడిన కారణములలో దేనివలననైనను విరేచనములు కలిగిన యెడల, ప్రేగులయందలి రేగుదలను గలుగజేయు పదార్థములను వెలిబుచ్చుటకయి విరేచనముల గలిగించుట శరీరముయొక్క స్వాభావికమగు చికిత్స గావున నిట్టివారికి సామాన్యముగ వేరుమందులు అవసరములేవు. అయితే విరేచనములు నీరసమును గలుగజేసి, కడుపునొప్పిని గూడ తరచుగా బుట్టించును గాన, యెంత శీఘ్రముగ జికిత్సనొందిన యంతమంచిది. ఈ తరగతి యందలి విరేచనములందు కొద్దియో గొప్పయో మెలిపెట్టు నొప్పి ఉండును. ఈ సందర్భమునందు పెద్దవారలకు ఒక అరఔన్సు చిట్టాముదము నిచ్చి, 20 చుక్కల క్లోరోడీన్ నిచ్చుటవలన గుణముగ నుండగలదు. విరేచనములు కట్టక పెద్దవిరేచనము లగుటవలన నీరసత గలుగుచుండినయెడల 3 డ్రాములటింక్చరు రీయు కోను ఒక ఔన్సుజలములో గలిపి యిచ్చుటవలన గుణమియ్యగలదు. బిడ్డలకు చిట్టాముదము నిచ్చుటయే మిగుల మంచిది. పయిమందు వలన గుణమియ్యక నొప్పి యెక్కువగా నుండినగాని, వాంతివచ్చున ట్లుండినగాని లింటు ముక్కను గాని ఫ్లానెలు గుడ్డను గాని, కర్పూరతైలములో తడిపి వేగులపై నుంచి, అందుపయిన ఒకపొడిగుడ్డవేసి ఒక గంటకు మించనికాలము నట్లుంచవలయును. మంట యెక్కువగా నున్నతోడనే తీసివేయవలయును. వాంతిగుణ మున్న యెడల సోడావాటరు వలన ఉపయోగ ముండగలదు.

2. వాయు వేడిమి యందలి మార్పువలన గలిగెడి అతివిరేచనములు.

ఈ విధమగు విరేచనములు వాయువునందలి వేడిమిలోని అకస్మాత్తుగ గలిగెడి మార్పువలన సంభవించుచున్నవి. వర్షకాలప్రారంభమందలి అకస్మిక శీతలత వలనను, రాత్రియందలి చెమ్మతోగూడిన గాలి సోకుటవలనను, తడిగుడ్డలను గట్టుకొనుట తడి పరుపులను వేసికొనుట వలనను, గాలి కెదురుగా గూర్చుండుట లేక పరుండుట వలనను — ఒకప్పుడు యీవ్యాధి సంభవించుచున్నది. ఎండలో దిరుగుటవలనను యీవ్యాధి కలుగవచ్చును. ఎండలో దిరిగి అకస్మాత్తుగా చల్లని నీడకు బోవుట వలనను ఒకప్పుడు యీవ్యాధి సంభవింపవచ్చును. చెమట పోసినప్పుడు ఉధృతమగు గాలిలో గూర్చుండుట వలనను యీవ్యాధి కలుగవచ్చును. జలదారులనుండియు, మురికిగుంటల నుండియు వెలువడు దుర్వాయువును పీల్చుటవలనను, యీవ్యాధి జనింపవచ్చును. రక్తహీనత గలిగియున్న జనులు వాయువునందలి మార్పువలన నెక్కువగ అతివిరేచన వ్యాధిచే పీడింపబడుచుందురు. మనోవ్యాధి, విసుకుదల వీటివలనను అతివిరేచనములు పుట్టవచ్చును.

చికిత్స.

ఈ కారణమువలన గలిగెడి అజీర్తివిరేచనములు రోగి మేలువిధమగు ఆరోగ్యస్థితి [illegible] ఉండినయెడల [illegible]

ముగా చీము, నెత్తురు, పడుటలోనికి దించును. ఈ తరగతిలోని విరేచనములందు విరేచనకారుల లోనికియ్యరాదు. టింక్చర్ ఆఫ్ జింజర్ ఔషధయోగమును లోనికిచ్చును, ద్రవ పదార్థమగు ఆహారమును మాత్రమే యిచ్చుచుండుటవలన గుణ మియ్యగలదు. అసలు వ్యాధియే రాకుండుటకు తగు జాగ్రత బుచ్చుకొనుటకు గాను వాయువునందు మార్పుగలుగు ఋతువులలో ముఖ్యముగా గాలి ఉద్రితముగ వీచుచోట్ల గూర్చుండకయును. ఫ్లానల్ గుడ్డలను ధరించుటవలనను, ఉపయోగ ముండగలదు. ఉదయముననే బయటకు పోవునప్పుడు వేడి కాఫీ గాని తేయాకు నీళ్ళను గాని త్రాగుట మంచిది.

---

## 3. హిల్ డయేరియా.

పర్వత ప్రాంతములయందొక విధమగు అతివిరేచనములు సామాన్యముగ గలుగుచుండును. హిమాలయ పర్వత ప్రాంతములయందీవ్యాధి మిక్కుటముగ వ్యాపించి యున్నది. ఈ వ్యాధి యొకప్పుడు యితర ప్రదేశములయందు గూడ గనబడుచుండును, వివిధములగు అతివిరేచనవ్యాధులయందిది దుష్టమయినదిగా నెంచనగును. విరేచనము లగునప్పు డేమియు బాధలేక, విరేచనములు ముఖ్యముగా ఉదయమున నగుచుండును. విరేచనములు కొద్ది పరిమాణముగ నగుచు వర్ణమునందు తెలుపుగానుండి సున్నము, నీళ్ళు, గలిపినట్లుగానుండి నురుగుకట్టియుండును. వ్యాధి ఉద్రుతగతి నందునప్పటికి సాయంకాలముకూడ విరేచనములగుచు, ఒకప్పుడు భోజనము వెంటనేగూడ యగుచుండును. విరేచనమగునపుడుగాని, విరేచనమగుముందరగాని, బాధలేకుండినను విరేచనవిసర్జన మునకు బహుతొందర గలిగియుండును. విరేచనము పిమ్మట సౌఖ్యముగ కూడ నుండును. పేగులు వాయుపూరితములగుటచే విజృంభితనంది, అజీర్తిలక్షణములు కనుపడుచుండును. నాడి నీరసతనంది, నాలుక మధ్యభాగమందు పొరగక్కి, ఆకలి యుండు విస్తారము అస్వస్థత యేర్పడక పోవచ్చును. రోగికి కారిజము వైపుల అసౌఖ్యత కనుపడవచ్చును. ఈస్థితియందశ్రద్ధజేసిన యెడల విరేచనము లధికమగుచు, రోగి కృశించి రోగియొక్క మనోస్థైర్యములు కూడ నీరసించి, జ్వరము రావచ్చును. అంతట విరేచనములయందు చీము నెత్తురు పడుచు, రోగి నిస్త్రాణచే మరణము నందుట సంభవించును.

### చికిత్స.

పర్వతస్థలములకు బోయినవెంటనే ఫ్లానల్ గుడ్డలను ధరించవలయును. వాయువునందలి ఆకస్మికమగుమార్పు కారిజముపై బనిచేయుటచే పిత్తము ఉత్పత్తియగుట నిలిచియు, యీవ్యాధి సంభవించును. ఈ కారణమువలననే ఫ్లానల్ గుడ్డలను ధరించుట మిగుల ముఖ్యము. మిక్కిలి వేడియగు ద్రవపదార్థములను త్రాగరాదు. పాలను ఆహారపదార్థము గా నుపయోగించుట తరుచుగ సరిపోవును. ఒకప్పుడు కాచిన పాలను త్రాగుట శరీరమునకు బాగుగా సరిపడును. టింక్చర్ ఆఫ్ జింజర్ ఔషధయోగము మిగుల నుపయోగముగ నుండును. పేగులపై వెచ్చగా నుండునట్లు చేయుట చాలముఖ్యము. విరేచనములందు చీము, నెత్తురు పడుట ఆరంభించగనే స్థలమును వదలి వేరొకచోటికి కేగుటవలన నెమ్మది గలుగగలదు.

కేవలము పాలనే ఆహారపదార్థముగ జేసికొన్ని, లైకర్ హైడ్రార్జిరై పెర్క్లోర్‌ను 3 మినిములమోతాదులలో దినమునకు మూడుసారులు పుచ్చుకొనుట బహుశ్రేష్ఠము, పేగులు ఉబ్బరముగానుండి దుర్వాసనగల తేపులు వచ్చుచుండిన యెడల, ఒకచుక్క కార్బాలిక్ ఆసిడ్‌నుగాని క్రియసోట్‌నుగాని, కొంచెము చక్కెరపై వేసికొని పుచ్చుకొనవలయును. వీటివలన నుపయోగము లేకపోయిన యెడల టింక్చర్ కనేబిస్ ఇండికా 10 మినిములును, బిస్మత్ సబ్ నైట్రిస్ 10 గ్రెయినులును, స్పిరిట్సు క్లోరోఫారం 20 మినిములును, ఒక ఔన్సు జలములో గలిపి యీప్రకారము దినమునకు మూడుపర్యాయములు పుచ్చుకొనవలయును. పాలు శరీరమునకు పడకపోయిన యెడల, కార్నిక్సు లిక్విడ్ పెప్టనాయిడ్సు, ఫేర్‌చైల్డ్ ఎసెన్స్ ఆఫ్ పెప్సిన్స్, అను పేటెంట్ ఔషధములను వాడవచ్చును.

### 4. శిశుసంబంధమగు అతివిరేచనములు.

శిశువులను అనుదినమును మూడు లేక నాలుగుపర్యాయములు విరేచన మగుచుండవలయును శిశువులయొక్క ఆరోగ్యమగు విరేచనము ఆవపిండి వర్ణముగలిగి, పులుపువాసన లేకుండ నుండును. శిశువులయం దీవ్యాధియు ఆహారపదార్థములయందలి లోపములవలనగాని, తేమవలనగాని, చలిగాలివలనగాని, తటస్థించును. దుస్తులను క్రమముగా దొడుగక పోవుటవలనను, జీర్ణతనందని ఆహారమువలనను, పేగులయందు గట్టిపడిన మలపదార్థము చేరుకొనుటవలనను — ఒకప్పుడు యీ విరేచనములు యేర్పడవచ్చును. గురకతోకూడిన దగ్గుయందును యీవిరేచనములు పుట్టవచ్చును. బిడ్డలయందుగలుగు యీవిరేచనములకు తోడుగా వాంతులును ఉండవచ్చును. కడుపు ఉబ్బరము యేర్పడి పేగులు మెలివేయుటవలన బిడ్డ ఏడ్చుచు కాళ్లతో పేగులవైపునకు దన్నుకొనును. విరేచనము స్వాభావికమగు పసుపువర్ణము గలిగియుండి, ద్రవతలేకుండినయెడల, ఆహారపదార్థమునందలిలోపముండుటవలనగాని, వాయువునందలి మార్పులవలనగాని యీవ్యాధి యేర్పడియుండెనని భావింపవలయును. విరేచనము ఆకుపచ్చ వర్ణముగాగాని ఆకుపచ్చ పసుపు గలిసిన వర్ణముగాగాని యుండి, పసుపు వాసన గలిగియుండి, ముక్కలుముక్కలుగా దొడుకొనిన తెల్లని పదార్థము రీతిగా నుండినయెడల పేగులయందు రేగుడలు యేర్పడియున్నదనియు, ఆహారము బిడ్డకు సరిపడుటలేదనియు, గ్రహింపవలయును. ఈస్థితిలో, పేరుకొనిన పదార్థమువాంతి వెళ్ళిపోవచ్చును; విరేచనములు తెలుపుగానున్న యెడల, కారిజముయొక్క అస్వస్థతను దెలియజేయును. నీళ్లవిరేచనములును మలబంధమును, ఒకటి తరువాత నొకటి కలుగుచుండిన యెడల, యీవ్యాధికి మలబంధమును, ఒకటి తరువాత నొకటి కలుగుచుండిన యెడల, యీవ్యాధికి మలబంధమే కారణముగా గలిసికొనవలయును. అతివిరేచనములు అకస్మాత్తుగా ప్రారంభమయి, విరేచనములు పూర్తిగా ఆకుపచ్చవర్ణము వహించి యుండినయెడలనున్నూ, నిస్త్రాణతో గూడియుండినయెడలనున్నూ, యీస్థితి కాలరాను బోలియున్నదని యెంచవలయును. విరేచనములయందు, చీమును రక్తపుగీరయును గలిసియున్న యెడల, వ్యాధియొక్క గుణము మారిపోవుచున్నదని తెలియవలయును.

అతివిరేచనములయొక్క ఒకానొకగతియందు పేగులు రేగుదలనంది, 104 డిగ్రీలవరకు జ్వరముపుట్టి, నాడి చురుకుబారి, నాలుకయెుక తెల్లనిపొరగమ్మి యెర్రనిచుక్కలు యేర్పడి ఒడలు పొడిగానుండి, మూత్రము తగ్గుదల నందియుండును. విరేచనములు అర్ధద్రవరూప మున నుండి, తరచుగా గట్టి ముద్దలు ఉండి స్వాభావికముగ దానికంటె తెలుపువర్ణమును వహించి, తెలుపయిన ఆమముతోగూడి, పేగులు పచ్చిగా నుండును. మంటకూడా యెక్కు వగా నుండును. జ్వరమువల్లను, తెల్లని ఆమమువల్ల యీవ్యాధిని సామాన్య అతివిరేచనము లనుండి వేరుగ గుర్తింపవచ్చును. విరేచనమునందు రక్తపుగీరలు లేక పోవుటయు దీనియొక్క గుణమైయున్నది. మంటకు తోడుగా విరేచనమగునపుడు మెలివేయునట్టిబాధ కలిసియుం డును. పాదములు చల్లనై పేగులపై వేడిగానుండి, ముఖము కమలి, శరీరము ముడుచుకొని పోయి. తరుచుగా నీరసమయినట్టియు హ్రస్వమయినట్టియు ధ్వనితో నేడ్చుచు, ముఖ్యము గాపండ్లు వచ్చుచుండినయెడల, మూర్ఛలు వచ్చినను రావచ్చును. తుదకు వ్యాధి ఉగ్రత గతి నందినయెడల, నాలుక ఆరుదలనంది, నాడి తొందరను వహించి నిస్త్రాణచే బిడ్డకు మర ణము సంప్రాప్తమగును. విరేచనములందు చివరకు రక్తము అగుపడినయెడల, మరణము సమీ పించుచున్నదని తెలిసికొన వలయును.

చికిత్స.

బిడ్డలకు ముఖ్యముగా పండ్లు వచ్చునపుడు అతివిరేచనము లయిన యెడల, యిట్టిది శరీ రమునందు గలిగిన రేగుదల నణచివేయుటకు జరుగు శరీరము నందలి స్వాభావిక ప్రయత్నమే గనుక, యీవిరేచనములను అతిశీఘ్రముగా నిలుపు చేయుటకు యత్నించరాదు. విరేచనములు సామాన్యగతియందుండి, విరేచనము యొక్కవర్ణము స్వాభావికముగనుండి విరేచనము అర్ధ ద్రవ పదార్థముగ నుండిన యెడల, మందు అవసరము లేకుండగనే నెమ్మదించును. ఎట్లయి నను, ఈఅస్వస్థతను యిరువదినాలుగు గంటలకంటె నెక్కువకాలము చికిత్స చేయకుండ నూరకుండరాదు.

ఆహారపదార్థములయందు యేమయిన లోపము డిన యెడల, దానిని సరిచేయవల యును. పసిపిల్లలకు రెండుగంటల కొకసారి కంటె నెక్కువగ నాహారమును లోనికియ్య రాదు. వయసునం దెదిగిన కొలదియు, యీ కాలపరిమితిని హెచ్చింప వలయును.

వ్యాధి ప్రారంభము కాగానే సంవత్సరములోపు వయసుగల బిడ్డ అయినయెడల ఒక డ్రాముసూప్ము, చిట్లాముదమును యిచ్చుట మిగుల శ్రేష్ఠమయిన చికిత్స అయియున్నది. దీని వలన పేగులయందుండెడి రేగుదలపదార్థము వెలువడును. విరేచనములు కట్టుకపోయిన యెడల, వయసుననుసరించి తగిన మోతాదులో క్లోరోడీన్ ను యియ్యవలయును. ఒడలు ఒకసారి వేడిగను ఒకసారి చల్లగను ఉండినయెడల, యీ క్రింది ఔషధయోగమును వాడ వలయును.

పల్వెస్ ఇపికాక్ కో ... ... ... గ్రయినులు 2
క్వినీన్ — — — — — గ్రయిను 1

ఈ రెంటిని బాగుగా గలిపి పవుడరుగా చేయవలయును. రెండు సంవత్సరముల వయసుగల బిడ్డకు ఉదయమునను రాత్రియును ఒక పప్పుగింజ గాని యియ్యవలయును.

ఒక సంవత్సరము వయసుగల బిడ్డకు పై మోతాదునందు సగము చొప్పునను, ఆరు మాసములు వయసునందున్న బిడ్డకు నాలుగవ వంతుచొప్పున యియ్యవలయును.

ఊపిరిగాని విరేచనములుగాని, ఫులుపువాసన గొట్టుచుండినయెడల లైంవాటరును ఉపయోగించవలయును. విరేచనములు తెల్లగానుండిన యెడల, ఒక గ్రెయిను పొడొఫయిలిన్ ను ఒక డ్రాము బ్రాందీలోగలిపి, యీ సొల్యూషనులో ఒకటి లేక రెండు చుక్కలను కొంచెము చక్కెరపైవేసి, దినమునను రెండుసారులు యియ్యవలయును. దీని వలన కాలిజము యొక్క అస్వస్థతకు కుదిరిక నందగలదు. విరేచనములందు ఆమము, రక్తము, కూడి యుండినయెడల, ఆమ విరేచనములకు దగు చికిత్స జేయవలయును. అతివిరేచనముల యొక్క అన్ని తరగతులయందును, బిడ్డలకు కొద్ది పరిమాణములయందు అనేకసారు లిచ్చుచుండవలయును. ఎక్కు పరిమాణము వినియోగించునపుడు పావుగంట కొకసారి ఒకడ్రాము చొప్పున ఆహారము నులోనకియ్యవలయును. శీఘ్రకాలములో చురుకును బుట్టించు పదార్థములు అవసరమగును. గాన, మొదటి ఒకటి రెండు దినముల పిమ్మట, ఒకడ్రాము పోర్టువైనను కొంచెము నీళ్ళలోవేసి దినమునకు రెండు మూడు సారులిచ్చుటవలన గుణమియ్యగలదు.

అతి విరేచనములలో నన్ని తరగతులయందును, బిడ్డలను పేగులపైన ఫ్లానల్ గుడ్డను జుట్టుట మంచిది. మందులు యిచ్చుచుండినను, పండ్లయొక్క స్థితిని విచారించి, పండ్లచిగుళ్ళు యెర్రనై ఉబ్బుడల సందియుండినయెడల చిగుళ్ళను లాన్సెట్ తో గీరవలసియుండును. పేగులయందు పురుగు లుండిన యెడల, సాంటొనీన్ యిచ్చుటవలన అందులకగు చికిత్సజేయవలయును.

ఊపిరియందు ఫులుపువాసన యుండినయెడల 7 వ అస్ట్రింజెంటు ఔషధయోగమును వాడవలయును. దీనితోగూడ 4 వ ఆల్టరేటివు ఔషధయోగమును వాడవచ్చును. నొప్పి అధికముగానుండిన యెడల 4 వ అస్ట్రింజెంటు ఔషధయోగమును ఉపయోగింపవలయును.

— —

## చెంపపై పొక్కులు.

మొక్కయొక్క ప్రక్కలను చెంపలపై ఉన్నతములైన పొక్కులు ఒకానొకప్పుడు లేచును. కొన్ని విషయములయందు యీపొక్కులు పుండ్లుగా దేలును. ఈ పుండ్లు రొదుగుట కాస్పదము కలుగుచున్నది. క్షయవ్యాధి పీడితులయందు యీ పొక్కులు కలుగుట మిగుల తరుచుగ సంభవించుచుండును. క్షయసంబంధమగు పుగగు యీ పుండ్లయందు సామాన్యముగ గనబడుచుండును. ఈ పుండ్లకు పొక్కుమందులను వేయుటవలన నుపయోగముండగలదు. ఈ పొక్కులు గుబురులుగా నుండినయెడల, ఒకొక్కక్కభాగమున కొక్కొకపర్యాయము స్వచ్ఛమయిన కార్బాలిక్ ఆసిడ్ ను రాయుటవలన గుణమియ్యగలదు. ఎలెక్ట్రిక్ వెలుతురు వలనను, సూర్యరస్మి వలనను, యక్స్ కిరణముల వలనను, సంతుష్టికరములగు ఫలితములు కలిగియున్నట్లు తెలియుచున్నది.

— —

## చర్మరోగములు.

చర్మరోగములు రెండువిధములుగ నున్నవి. ఒక విధమయినవి క్రిమిజాలములతో గూడి యుండును. రెండవవిధమైన వాటియందు క్రిమిజాలములుండక కేవలము చర్మసంబంధము లైనట్టివిగ గాని, శరీరమునందలి కొన్ని యితర అస్వస్థతలవలన గలిగెడి చర్మమునందలి ఏనుగుగజ్జి, గజ్జి, తామర మొటిమెలు, సోరియేసిస్——మొదలగు వాటిగ గాని పరిణమించుచుండును. ఈ వ్యాధులు ఆయా శీర్షికల క్రింద వివరింపబడియున్నవి. ఇచ్చట తక్కిన చర్మవ్యాధులు మాత్రమే గమనింప బడి యున్నవి.

### 1. మచ్చలు.

సూర్యాతపమువలన, ఎఱుపువర్ణము గలవారియందు, ముఖ్యముగా ముఖముపైన, నచ్చటచ్చట గుబురులుగా, ఒక విధమయిన రంగుగల మచ్చలు యేర్పడును. వీటివలన బాధ యేమియు లేదు. హానికరములును గావు. సూర్యాతపమునకును, గాలికిని, దుమారమునకును, లోనుగాకుండుటవలన నీ మచ్చలు వాటంతట అవియేపోవును. చలిగాలియందు యీమచ్చలు నశించును.

#### చికిత్స.

ఇరువది మంచి బాదంకాయలలోని పప్పులను కల్వములో నుద్దయగునట్లు మెత్తగా గొట్టి, ఒక పైంటు ఉడుకునీళ్ళలో దీనిని గలిపి, వడియగట్టి, యీ నీళ్ళ యందు స్పంజితో ముంచి మచ్చలపైనద్ది, ఆ నీళ్ళను చర్మముపై నారనీయవలయును. లేదా, సమానములగు లైంవాటరును పాలనుగలిపి, దానినిగూడ యిదేప్రకారము అద్దవచ్చును. ఒకఅరగంటపిమ్మట ఆయాభాగములను గ్లిసరీను సబ్బుతోడను నీళ్ళతోడను గడిగి శేయవలయును. అటుతరువాత, తెల్లనైన పుల్లరు ఆర్తు(చవుడు) నుపైనఅద్దవచ్చును. మఱియొక, చికిత్స రెండు అవున్సుల నిమ్మరసము, ఒక డ్రాము వెలిగారము, ఒక డ్రాము తెల్లని చక్కెర – వీటి నన్నిటినిగలిపి అప్పుడప్పుడు రాయుచుండుట అయియున్నది.

### 2. ఎఱ్ఱని పొక్కులు.

పొంగునంపువలె నీ వ్యాధియందు ముందుగ జలుబు, తుమ్ములు వచ్చుట కండ్ల వెంబడి నీళ్ళువచ్చుట – యీ గుణములు కలిగియుండవు. పొంగునంగువలె పొక్కులొకక్కటే ఆకారము వహించియుండటలేక, అనేక పరిమాణములుగను, అనేక ఆకారములుగను, శరీరమంతటను వ్యాపించియుండును. స్కార్లెట్ జ్వరమునందు వలె యీవ్యాధియందు గొంతునొప్పి యుండదు. ఈ వ్యాధి అనేక తరగతులుగ నుండి యున్నది. ఇందు, గులాబివర్ణముగు వహించి గుండని ఆకారములుగ శరీరమున వ్యాపించి యుండెడిది మాత్రమే ముఖ్యమైయున్నది. ఇట్టిపొక్కులు ఒకానొకప్పుడు మశూచికమునకు ముందుగా రావచ్చునుగాన, మశూచికను చుట్టుపట్ల వ్యాపించి యుండినయెడల, యిందువిషయమై యెక్కువజాగ్రతను వహించియుండుటమంచిది. బిడ్డలయందు, యీవ్యాధి తటస్థించి పండ్లు చిగుళ్లు వాచియుండినయెడల, వాటిని, లాన్సెట్‌తో గీర యత్నింపవలయును. విరేచనము క్రమముగా గాకుండినయెడల చిట్లాముదము నియ్యవలయును. కడుపునందు ఆమ్లము వృద్ధిగా నుండిన యెడల, కొద్ది గ్రేయినుల సిట్రేట్ ఆఫ్ మెగ్నీసియాను నీళ్ళలోవేసి యియ్యవలయును. ఈ వ్యాధి, పెద్దవారలకు

వచ్చినయెడల, సామాన్యముగా నేదియో యొకవిధమగు అజీర్ణవ్యాధి వ్యాపించియుండును గాన, అందులకగు చికిత్స జేయవలయును.

### 3. దుక్క ముండ్లు (Nettle Rash).

దూలగొండి (Nettle) ఆకు రాయుటవలన యేర్పడెడి కందులవలెనే కంది, బాధ యందును దానివలెనే యుండెడి, యీ వ్యాధికి దుక్క ముండ్లు అను వాడుక పేరుకలదు. ఒకప్పుడు యీదద్దురు పేము బెత్తముతో గొట్టిన దెబ్బవలె పొడుగుగా ప్రారంభమయి, అంచులయందు మాత్రము యెఱ్ఱగానుండును ఈదద్దురు తరుచుగా నకస్మాత్తుగ గనబడును. కొన్ని నిమిషములు మాత్రమే ఉండిన పిమ్మటగాని, లేక ఒకటి రెండు దినముల పిమ్మట గాని, దానంతట అదియే అకస్మాత్తుగ నంతరించిపోవును. పగలు కనుపడక రాత్రి తిరిగి వచ్చుటయు కలదు. దురద బహు అతిశయమయి ఒడలు జలదరించుటయు గలుగును. దీనికి, ఒక భాగము స్పిరిట్సు అమ్మోనియా ఆరోమేటిక్‌ను రెండు భాగముల జలములో గలిపిపయిన రాయవలయును. ఒకప్పుడు వాంతితోగాని జ్వరముతోగాని కూడ అకస్మికముగ నిది సంభవించుట మిగుల భయమును బుట్టింపవచ్చును. కాని, యీ వ్యాధి అపాయకరమయినది గాదు, తరుచుగ నాహారపదార్థముల యందలి లోపమువలన మాత్రమే యీవ్యాధి కలుగుచుండునని గ్రహింపవలయును. కొందరి మనుష్యులలో షెల్ ఫిష్ (ఒకవిధమగు చేప) దోసకాయలు, పుట్టగొడుగులు మొదలగు వాటిని దినుటవలన నీ వ్యాధి గలుగును. కోపేబా, ఆంటిపైరన్ క్వినీన్ — వీనిని దినుటవలనను, యిదే విధముగ దద్దురు కొందరియందు కలిగియున్నది. శరీరము వేడిగానున్నపుడు చల్లని నీళ్ళను త్రాగుట వలనను, ఈ వ్యాధికలుగవచ్చును. సంపూర్తియైన భోజనమయిన వెంటనే ఈదద్దురు యేర్పడిన యెడల మస్టర్డు వాంతికారి నియ్యవలయును. ఇతర సందర్భములయందు 1 వ విరేచనకారి నియ్యవలయును.

### 4. చెమరకాయలు.

శీతల ప్రదేశములనుండి ఉష్ణ ప్రదేశములకు వచ్చువారలకు సామాన్యముగ గలిగెడి దీ వ్యాధియే అయియున్నది. దీనికే ఒడలు ప్రేలుట యనియు కొందరు వాడుదురు. దీని వలన అపాయమేమియు లేకున్నను బహు చీదరగానుండును. ఒడలు చిటచిటలాడుట, దురద పెట్టుట, చెమటపోయుట, యీ లక్షణములతో కూడి చర్మముపయిన యెఱ్ఱని పొక్కులయందు అటుపిమ్మట కొంచెము తెల్లని పదార్థమును, ఉండును. శరీరసాధకము వలనను, ఉడుకు ద్రవములను త్రాగుట వలనను, యీ పొక్కులయొక్క వర్ణము తీవ్రతను వహించును. ఈపొక్కులకు పయిన స్పిరిట్సు అమ్మోనియా ఆరోమేటిక్‌నున్నూ, జలమునున్నూ సమానభాగములుగ గలిపి రాయుటవలన దురద తగ్గగలదు. కరుకయిన తువాలుతో ఒడలును దుడుచుటవలన చిన్నపొక్కుల యొక్క తలలు బ్రద్దలయి యివి దురద పెట్టుట తగ్గిపోవును. తేలికయిన దుస్తులను ధరించుట, మితభోజనము చేయుట, అప్పుడప్పుడు విరేచనకారుల బుచ్చుకొనుట, ఆవశ్యకములై యున్నవి. ఫ్లానల్ దుస్తులను ధరించరాదు. దాహముగానుండి జ్వరత వహించి యుండినయెడల సిట్రేట్ ఆఫ్ మెగ్నీసియాను తగు మోతాదులలో నీళ్ళలో వేసి పుచ్చుకొనవలయును. ఉద్రిక్తావస్థయందు నిద్ర పట్టకపోవుటయు, కోపము హెచ్చుటయు, గలుగును. వీలుకలిగినవారు శీతలప్రదేశమునకు బోవుట

మిగుల మంచిది. ఇరువది గ్రెయినుల కాపర్ సల్ఫేటును ఒక ఔన్సు జలములో గలిపి, ఆ స్వస్థత భాగముల నద్దవలయును. రెండు డ్రాముల పొటాష్ బైకార్బునేట్ ను ఒక అరప యింటు జలములో గలిపి అద్దినను అద్దవచ్చును.

5. ఒకవిధమగు పొక్కులు (బైబ్స్)

బిడ్డలయందు ముఖ్యముగా శరీరముయొక్క నానాభాగములయందును ఒక విధమగు పొక్కులు లేచును. ప్రారంభమునందు, వీపు, కడుపు, పిఱుదులు, కాళ్ళు, చేతులు— వీటిపయిన యెఱ్ఱనయిన గుండ్రని మచ్చలు యేర్పడి, యివి మంటతోగూడి దురద పెట్టును. కొద్దిగంటలలోనే యీమచ్చల మధ్య పొక్కులు యేర్పడి, అతిత్వరలోనే పెద్దవయి, కొంచెము అంచుమాత్రము వదలి, యెఱ్ఱనిమచ్చ అంతటను యీపొక్కు వ్యాపించును ఈవిధమగు పొక్కులు అనేకములుగా లేచును. ఈపొక్కులలోని ద్రవము, మొదట స్వచ్ఛము గానుండి క్రమముగా మడ్డియయి, రెండు లేక మూడు దినములలో పగులును; పగిలిన పిమ్మట పక్కులుకట్టి, యివి మానుటల నందును. కొన్ని పక్కులు మానుచుండగనే మరి కొన్ని క్రొత్త పక్కులు యేర్పడి, యీవ్యాధి యీప్రకారముగ కొన్ని దినములుగాని, ఒకప్పుడు కొన్ని వారములుగాని, వ్యాపించియుండును. బిడ్డలయందు, పుట్టుకవెంటనే యీవ్యాధి తటస్థించినయెడల, కొఱుకు వ్యాధియొక్క ఫలితముగగాని, నొప్పులు పడుటయందుగాని పిమ్మటనుగాని తల్లినుండి గ్రహించిన మాలిన్యము యొక్క అంటువలనగాని, యెంచవలయును; పిమ్మట కొంతకాలమునకు దటస్థించినయెడల జీర్ణాశయముయొక్క అస్వస్థతా ఫలితముగ నెంచవలయును. పెద్దవారలయందు, అజీర్ణవ్యాధి వలనగాని, యితరకారణముల వలన గలిగిన నీరసత్వము వలనగాని, ఈవ్యాధి తటస్థించినదని యెంచవలసి యుండును. ఈ వ్యాధియందు గలుగు దురదవలన నిద్రపట్టకపోయిన దప్ప యితరవిధములుగ రోగి సౌఖ్యముగ నున్నటులనే గనబడును. రోగియొక్క సామాన్య ఆరోగ్యతను గనిపెట్టుచు జీర్ణాస్వస్థత లేమయిన యున్నయెడల దగుమందుల నిచ్చుటయందే యీవ్యాధియొక్క చికిత్స యిమిడియున్నది. ఈపొక్కులను సన్నసూదితో గుచ్చుటవలన, లోనిమాలిన్యమును దొలగించి గుడ్డలు తగులుటవలన నస్వస్థత భాగములకు హానిగలుగకుండ జేయుచు, వీలువెంబడి వాటిని గడుగుచు బోరిక్ అసిడ్ను పయిన జల్లుట మూలమున, స్థానికా చికిత్సను జేయవలయును ఈపుండ్లు మానుదలనందిన పిమ్మట కొంతకాలము నలనిమచ్చలుండునుగాని సామాన్యగతుల యందివి స్థిరముగ నుండునవికావు. లోనికిచ్చుటకు పాషాణసంబంధములు మిగుల ఉపయోగములుగ నెంచబడుచున్నవి.

6. సన్ననిపొక్కులు (మిలియేరియా)

సామాన్యముగ గుండుసూదితలకంటె పరిమాణమునం దధికముగనుండని సన్ననిదవ్రప పదార్థ సహితములైన పొక్కులకు మిలియేరియా అను వాడుకపేరు కలదు. ఈవ్యాధియందు తరుచుగా చర్మముకూడ యెఱ్ఱబారి యుండును. ఎక్కువ చెమటను బుట్టించు కొన్నిజ్వరము లు మొదలగువాటియందు స్వేదగ్రంధులకు గలుగు యస్వస్థల వలన నీవ్యాధి యేర్పడును. స్వేదమును స్రవించునట్టి చిన్నినాళములు చర్మముయొక్క పైభాగమువలన గాని స్రావముల వలనగాని కప్పబడుటవలన నీవ్యాధి కలుగుచున్నది. అధికవేడిమికి లోబడినవారలకు గాని

ఒడలు పరిశుభ్రముగా నుంచని వారలకు గాని యీ వ్యాధి సంభవించుచుండునట్టుల మనము తరచుగ గనుగొనుచుందుము. ఈ పొక్కులు ముఖ్యముగా మెడ, ఎదురొమ్ము, చంకలు — యీ భాగములయందు గనబడును. దీనివలన అపాయమేమియు లేదు గాని రోగియొక్క శరీరమునకు చల్లదనమును, చర్మమునకు పరిశుభ్రతయును, గావలయునని సూచించును. శరీ జింక్ ఆక్సైడ్ పౌడరును పైన జల్లుటవలన నుపయోగ ముండగలదు.

## 7. తలమాద.

తలమాద అనునది చీముసంబంధమగు పురుగువలన గలిగెడు అంటువ్యాధి అయియున్నది. మొదట కొంచెము దురదప్రారంభమయి యెఱ్ఱని వర్ణముగల బొబ్బవలె చేతికి దగులును. ఈ బొబ్బ వ్యాపించిన కొలదిని తామరయందువలె గుండ్రముగ నుండక, వంకరగ నుండును. సుమారు పండ్రెండు గంటలలో ప్రతిబొబ్బయొక్క మధ్యప్రదేశమునందును, కొంచెము పసుపువర్ణముగల ద్రవపదార్థము గోళాకారమును వహించి యుండును. ఇదియును దీనిపిమ్మట వెంబడు దళమైన స్రావమును ఆరుదలనంది తేనెతుట్టె ఆకారమును వహించి, పక్కుయొక్క కొంతభాగము మిట్టగానున్నా, కొంతభాగము పల్లముగానున్నా యుండును. ఈ పక్కులలో తలవెండ్రుకలు దూరియుండును. వ్యాధి ఉద్రిక్తగతి నందినచో అదిని, తలయంతటను కొంచెము పసుపువర్ణముగల పక్కుగట్టునంత వరకును స్రావము దళమగుచు పరిమాణమునం దధికమగుచుండును. ఈ వ్యాధి అశ్రద్ధ చేయబడిన యెడల పక్కు అడుగున పుండ్లుయేర్పడును. ఈ వ్యాధి ఆరంభదశలో గుర్తింపబడినయెడల తామర కగు చికిత్సనే దీనికి జేయవలయును. పక్కులు కట్టునంతవరకును యేమియు జేసియుండని యెడల పక్కులు ఊడిపోయి పైభాగమంతయు శుభ్రముగ నుండునంతవరకును పిండికట్లను గట్టవలయును. వెండ్రుకలను స్వల్పముగా కత్తిరించవలయును. ఆలివ్ ఆయిల్ నుగాని గ్లిసరీన్ నుగాని పైనరాసి తలకు అంటిపెట్టుకొని యుండునట్టి టోపీని ధరించవలయును. ఆహార పదార్థముల యందును, మందులయందును వ్యాప్తిగలుగకుండ నవలంబింపదగు పద్ధతులయందును తామర కగు అంశములనే గమనింప వలయును. ఈ వ్యాధి ఒకబిడ్డనుంచి మరియొక బిడ్డకు వ్యాపించకుండునటులయును. గోకుకొనుటవలన శరీరమునం దొకభాగమును డి మరియొక భాగమునకు వ్యాప్తినొందకుండునటులయును జాగ్రత్తను బుచ్చుకొనవలయును. బలహీనులగు రోగులకు తుయవులుగా దేలవచ్చును. గంధకపు ఆయింటుమెంటు ఔషధయోగమును గూడ వాడనగును.

## 8. పీడ (Erythema)

ఈ వ్యాధియందు కొంచెము యెఱ్ఱనైన వివిధ పరిమాణములును వివిధ ఆకారములును కలిగిన గుబురులుగా శరీరమందలి నానా భాగములయందును వ్యాప్తినంది, సామాన్యముగ మూడు దినములలో, ఒకప్పుడు వారము దినములలోను, అంతరించిపోవును. ఈ వ్యాధియందు మిగుల దురదగాని, జలదరింపుగాని, మండియుండును. ఋతుస్రావమునకు ముందుగా పడతులయొక్క శాల్యపయిన దరుచుగ నీవ్యాధి సంభవించును. శరీరము వేడినంది యున్నప్పుడు చల్లని నీళ్ళను త్రాగుటవలన నీవ్యాధి యేర్పడవచ్చును. బిడ్డలయందు పండ్లు వచ్చునప్పుడు యీ వ్యాధి రావచ్చును. బిడ్డలయందు ఈ వ్యాధి సామాన్యముగ పిరుదలపైనయును [illegible]

యీ భాగములయందును, దటస్థించును. విరేచనము క్రమముగా గాకుండినయెడల అందుకగు విరేచనకారుల నియ్యవలయును. ఈవ్యాధి అపాయకరమైనదిగాక బహు అరుదుగా జ్వరముతో గూడియుండును. రోగికినిచ్చు ఆహారపదార్థములు తేలికగ జీర్ణమగునవిగాయుండవలయును. అస్వస్థత భాగములయందు జింక్ ఆక్సైడ్‌ను వాసలీన్‌ను కలిపి రాయవలయును. జింక్ అయింట్‌మెంటును రాసినను రాయవచ్చును.

---

## చెమట.

నిప్పుదగ్గరకుగాని, ఎండలోనికిగాని బోవుటవలనను, శరీరపరిశ్రమ దీసికొనుటవలనను గలిగెడి చెమటకును, యిట్టి కారణము లేవియు లేకుండగనే శరీరమంతనుగాని, శరీరమందలి కొన్ని భాగములయందేగాని అస్వస్థత కారణమున విశేషముగ గలుగు చెమటకును, భేదము కలదు. న్యూమోనియా మొదలగు కొన్ని జ్వరములలో శరీరమునందు వేడిమిని క్రమపరచు మధ్యభాగములు విశేషకాలముగాని కొద్దికాలమేగాని కలత నందుటవలన, శరీర వేడిమి పిమ్మట యథాస్థానమునకు వచ్చినతరువాత గూడ, యీ మధ్యభాగముయొక్క అస్వస్థత అటులనేయుండి శరీరమునందు యీచెమట అధికముగగల్గువ్యాధి జనించును. ఒడలుయొక్క చర్మభాగములయందలి రక్తప్రచారముయొక్క చురుకుదనమునకు స్వేదస్రావమునకును, చాలవరకు సంబంధమండియుండినను, కొన్నికొన్ని నరముల సంబంధములగు కారణములచే చర్మభాగములయందు రక్తము కూడుకొని యుండియు పొడిగానుండుట తటస్థించి, శరీరము పాలియున్నప్పుడు చెమటతో మునిగి యుండుట దటస్థించును. కొన్నికొన్ని విషమజ్వరముల యందు మెదడుభాగము విషప్రేరితమగుటచే, స్వేదగ్రంధులకు వ్యాపించు నరములయందును అస్వస్థత యేర్పడి ఉధృతమగు చెమట గారుటయు ప్రారంభమగును. అరచేతులయందే అస్వస్థత యేర్పడినయెడల, చేతులు చల్లగానుండును. ఇట్టివారి చేతులు మురికిగా నుండును గాన నీటయినపనిని దేనిని జేయుటకును వీరలు పనికిరారు. ఈవ్యాధిచే పీడింపబడు వారలు సామాన్యముగ నారోగ్యస్థితియందు లేరనియే జెప్పవచ్చును. త్రాగుబోతుదనము అధికమయి యున్నవారలందు చేతులు సామాన్యముగ చెమటపోడుచునుండును. ఇట్టివారలందు చర్మము బిగువులేక, సూక్ష్మరంధ్రములు కలదియు క్రొవ్వినట్టిదియు అయి, మొటిమలవలెనొక విధమగు మెత్తదనమును వహించియుండురు. తేయాకు నీళ్ళు యెక్కువ ద్రాగుటవలనను, కొందరకు కాళ్ళును చేతులును చల్లని చెమటలు పోయును.

### చికిత్స.

చెమటలు కలుగు నీవ్యాధియందు సామాన్యముగ బలవర్ధకౌషధములు అవశ్యకములయి యున్నవి. జ్వరగతుల ననుసరించి వచ్చిన వ్యాధి క్రమముగా దానంతట అదియే సర్దుకొనునుగాని, క్వినీనును యిచ్చుటవలన తొందరగా సర్దుకొనగలదు. సేలిసైలిక్ ఆసిడ్, జింక్ ఆక్సైడ్ లను పైన రాయవలయును. పొటాస్ పర్మాంగనేట్ కలిసిన లోషనుతో నస్వస్థత భాగములను గడుగుటయు మంచిది.

---

## చెమట (దుర్గంధసహితము).

స్వేద గ్రంథులయొక్క అస్వస్థతవలన, చెమట యందు దుర్గంధ మేర్పడును. ఈ చెమటయందు ఒక వైద్యశాస్త్రజ్ఞుడు దుర్వాసనను గలుగజేయు ఒక విధమగు పురుగులను గనుగొనియున్నాడు. పాండురోగమునందు యీవ్యాధి వ్యాప్తతనంది, ఋతుస్రావకాలమందు అధికముగ నుండును సంభోగ సంబంధముగు ఉద్రేకతయుండును. యీదుర్గంధ సహితము చెమట కొంతవరకు గలుగును.

చెమట అధికముగ నుండవలసిన అగత్యము లేదు. ఒకప్పుడు శరీరమంతటి నుండియు మిగుల అసహ్యమగు వాసన బయలుదేరి, చెమట అధికమయిన కొలదిని వాసనయు హెచ్చుచుండును. ఈ వాసన వెల్లుల్లివాసనను బోలియుండును. లేక తీక్ష్ణముగా మాత్రమేయుండును. మశూచి మొదలగు వ్యాధులయందు వాసనలు ఒక విధముగ అహితములుగనుండును. కీళ్ళజ్వరమందు, చెమట పులుపువాసన గలిగియుండును. గంధకము, అయొడిన్, ఇంగువ, కస్తూరి మొదలగు ఔషధములు లోనకు పుచ్చుకొనునపుడు, చెమట ఆయా వాసనలన గలిగియుండును.

శరీరారోగ్యతయందలి లోపమేదయిన యున్నయెడల, అందులకగు చికిత్స జేయవలయును. ఈ వ్యాధి కుదిరిక నందుటకై పరిపూర్ణమయిన శుభ్రతను గలిగియుండవలయును. ఒడలు యొక్క శుభ్రతను గాపాడుటయేగాక, కట్టుబట్టలను, చొక్కాలను తరుచుగ మార్చుచుండవలయును. సాధారణ చెమటకగు చికిత్సనే దీనికిని జేయనగును.

---

## జ్వరములు.

### పునఃప్రకోపజ్వరము (Relapsing Fever)

### (కాటక జ్వరము.)

ఈ జ్వరము ఒకసారి వచ్చి నెమ్మదించి క్రమకాలమున మరల వచ్చుటచే, పునఃప్రకోపజ్వర మనబడెను. ఈ జ్వరము కాటకములయందు మిగుల వ్యాప్తతనంది యుండునుగాన కాటకజ్వరమనియు పిలువబడును. కాటకములయందు ఆకలిచేతను, ఆధరువులేమి చేతను, బాధనొందు వారియందీవ్యాధి అధికముగ వ్యాపించి యుండును. ఇండియా దేశమునందును, కాటకములయందు యీవ్యాధి సర్వ సాధారణముగ వ్యాపించియుండెను. గాని, 1897వ సంవత్సరమునందు మాత్రము యీదేశమునందు కఱవు గలిగియున్న అనేక జిల్లాలలో యీ వ్యాధి కనుపడియుండలేదు.

ఈ వ్యాధి నందుటకు స్త్రీలయందుకంటె పురుషులయందెక్కువ తీవ్రత యుండి యున్నట్లు అనేకులు చెప్పియున్నారు. వయసునందేమియు వివక్షత లేదనియు చెప్పవచ్చును ఈ వ్యాధి కాటకములయందు యెక్కువ తీక్ష్ణత వహించియున్నను, తక్కిన కాలముల యందు పొత్తుగా నుండుటకు వీలులేదని చెప్పుటకు ఆస్పదము లేదు. ఈ వ్యాధియందొక విధమగు పురుగు రక్తమునం దావహించి యుండును. సూక్ష్మదర్శన యంత్ర సహాయమున

నీపురుగును గనుగొనవచ్చును. వ్యాధియందలి సందిగ్ధస్థితి (Crisis) సమయమువరకును ఈ పురుగు రక్తమునందుండును. ఈ సమయమునకు తప్పక యీ పురుగులు సంఖ్యయందు కొంచెముగా తగ్గిపోవును. శరీర వేడిమి స్వాభావిక స్థితికివచ్చుసరికి, యీపురుగులు అంతరించిపోవును. జ్వరము తిరిగి వచ్చుసరికి యీపురుగు మరల శరీరమునందు గనబడును. యీ పురుగులు రక్తముయొక్క పొరదలయందు ప్లీహావలన నశింపుజేయబడునని తెలియుచున్నది. ప్లీహ తొలగింపబడిన కొన్ని కోతులయందు ఈ పురుగును రక్తములోనికి యింజక్టు చేయుటచే నవి మరణము నొందెను. మరణానంతరమున వాటిరక్తమును పరీక్షించగా అందు ఈపురుగులు కనుగొనబడినట్లు తెలియుచున్నది.

జనసమర్ద ప్రదేశములయందు ఈవ్యాధి విశేషవ్యాప్తత నందుచుండును. ఈవ్యాధి పీడితుడు ఆక్రమించుకొనియున్న, వెలుతురును గాలియు చక్కగా లేని ఒక గదిలోనికి బోవుట మాత్రమున, నీవ్యాధిని ఆకర్షింపవచ్చును. రోగియొక్క ఉమ్మియందును ఈవ్యాధి సంబంధమగు పురుగు ఉండియుండును. గాని, ఊపిరి విడుచుట మూలమున నీవ్యాధి గాలి మార్గమున వ్యాప్తత నందుటకు వీలు కలుగుచున్నది.

లక్షణములు.

ఈవ్యాధి శరీరమునం దావహించిన కొన్ని గంటలలోనే ఒకప్పుడు ఉద్రిక్తస్థితిలోనికి రావచ్చును. ఎట్లయినను యీ కాలపరిమితి పదునాలుగు దినములకు మించదు. పరిటునసామాన్యముగ అయిదు పది దినముల మధ్యకాలములో ఉద్రిక్తగతి ప్రారంభ మగును.

ఈజ్వరము సాధారణముగా నకస్మాత్తుగ వచ్చును. ఈరోగి తన సామాన్యవ్యాపకమునందుండగనే తీవ్రమైన తలనొప్పి, తలతిప్పుట, చలి, వాంతియగుట — యీ లక్షణములు కనబడును. తలనొప్పి తరుచుగా నుదురువైపుల నుండును. కాళ్ళు, చేతులు, వెన్ను —యీ భాగములయందును నొప్పులు సాధారణముగా గలుగుచుండును. నిస్త్రాణయు గూడియుండును. ఈస్థితియందు కొన్నిగంటలు మాత్రమే ఉండినపిమ్మట, శరీరమునందు మంటతోగూడిన వేడిమి ప్రవేశించి శరీరవేడిమి 104, 105 డిగ్రీల మధ్యగ నుండును. నాడియొక్క తీవ్రతయు హెచ్చి నిమిషమునకు 110-120 దెబ్బలకు, మధ్యగా నుండును.

ఈవ్యాధియందు ప్రధానసూచన లక్షణమగు తలతిప్పుడువలన రోగి పరుండియే యుండును. అప్పుడప్పుడు, ఆరంభగతియందే సంధిగుణము జనింపవచ్చును. సామాన్యముగ మాత్రము యీగుణము కొన్ని దినములవఱకు కనబడదు. నాలుకపై సాధారణముగ తెల్లనైనట్టిగాని, కొంచెము పసుపువర్ణమును వహించినట్టిగాని, దళమైన పాచగప్పి, వ్యాధిప్రారంభమగునను జ్వాలవిషయములలో నాలుక తడిగా నుండును. ఈస్థితియందు అతివిరేచనములు సామాన్యముగా ఘటిల్లించవు. పేగులయందు సాధారణముగా మలబద్ధమున కుచ్ఛ్యక్షత ప్రవేశించును. మూత్రము తీవ్రవర్ణమును వహించి పరిమాణమునందు మాత్రము, కనిపెట్టబడదగినంత తగ్గుదల కనుపించదు. ఒడలు సామాన్యముగ మిగుల పొడిగానుండి, ఒకానొకప్పుడు మాత్రము మొదటి యిరువదినాలుగు గంటలలోను గొంచెము చెమటలు కనుపడవచ్చును. పచ్చకామాల వ్యాధి ఒకప్పుడు అకస్మాత్తుగను ఒకప్పుడు క్రమక్రమముగను శరీరమునందు వ్యా

పించును. కాలేజము, ప్లీహ — యీరెండు అవయవములను ఘనతనంది, చేతితో దాకుటవలన మృదుత్వమును వహించియున్నట్లు కనుగొనవచ్చును.

ఈ దుతజ్వరము అయిదు దినములు మొదలు ఏడుదినములవరకును వ్యాపించియుండి వివిధవిషయములయందు శరీరవేడిమి 102 – 108 డిగ్రీలకు మధ్యగానుండును. సామాన్యముగా, ఉదయమునందలి శరీరవేడిమి సాయంకాలమందలి దానికంటె తగ్గియుండును. మూడవ దినమునందు మాత్రము శరీరవేడిమి ఉదయమునను సాయంకాలమునను కొంచెమెచ్చుతక్కువగ ఒక్కేగతియందుండును. జ్వరమునందంతటను రోగి బహుకలత జెంది మిగుల నీరసగతియందుండును. జీర్ణాశయమునందలి పదార్థమంతయు వెలువడినపిమ్మట పైత్యద్రవమును ఒకప్పుడు రక్తమును వెలువడుటకలదు. ప్రాణాపాయ విషయములందు ముఖ్యప్రాంతములయందు రక్తము కూడుకొని కములిన గతిని వహించియుండును.

అయిదవ దినమునకును ఏడవ దినమునకును మధ్యగా, కొద్దిగా నతివిరేచనములు ఏర్పడి, శరీరవేడిమి గొంచెము కాలము వరకు అధికమగుచు, అప్పుడప్పుడు సంధితోగూడ సంధిగ్ధస్థితి ప్రవేశమగును. శరీరవేడిమియొక్క తగ్గుదల బహు ఆశ్చర్యకరముగానుండి, యీ సంధిగ్ధస్థితియొక్క తీక్ష్ణతయే యితర వ్యాధియందును కానరాదు. ఒక్కేమారుగా యిరువది నాలుగు గంటలలోపల 10 డిగ్రీల వేడిమియు, ఒకప్పుడు అంతకెక్కుడును గూడ, తగ్గుదలనంది ఒకవిషయములో 92 డిగ్రీలవరకు గూడ తగ్గియున్నట్లు మూర్‌హెడ్ అనునాయన చెప్పియున్నాడు. శరీరవేడిమి తగ్గుదల నందుటతోపాటు ఉద్ధృతముగ చెమటలు ప్రారంభమయి యిందుల ఫలితముగా, మూత్రముయొక్క పరిమాణమునందు మిగుల క్షీణత గలిగి యుండును.

తగ్గుదల నందిన శరీరవేడిమి క్రమముగా సాధారణవేడిమికి ప్రకోపించును. రోగియొక్క నాలుక పరిశుభ్రతనందు ఆకలియు బుట్టును. తలతిప్పుట, నిస్త్రాణ, యీగుణములు పూర్ణముగా నశించి సంధిగ్ధస్థితికి నాలుగయిదు దినములపిమ్మట రోగి నడచుటకుగూడ శక్తిని గలిగియుండును. కాని, జ్వరము ప్రారంభమయిన సుమారు పదునాలుగు దినముల కును, సంధిగ్ధస్థితికి పిమ్మట ఏడు మొదలుకొని తొమ్మిది దినముల లోపలను మొదటిలక్షణములతోడనే అకస్మాత్తుగ మరల జ్వరము ప్రారంభించును. ఇదియే పునఃప్రకోపజ్వరము యొక్క ప్రథమ పునఃప్రకోపగతి యనబడుచున్నది.

ఆరంభగతియందుండెడి సూచన లక్షణములు యీప్రథమపునఃప్రకోపగతియందు సామాన్యముగ నుండనేరవు, శరీరవేడిమి అధమము 3 డిగ్రీల వరకు హెచ్చి రోగికి చలి ప్రారంభించును. కొన్ని విషయములయందు పునఃప్రకోపగతి లేకుండగనే, ప్రథమగతితోడనే వ్యాధి అంతరించి పోవుటయు కలదు. ఈపునఃప్రకోపగతియందలి లక్షణములు ప్రథమగతియందలి వాటివలెనే యుండును. ఈ అవస్థయందు సామాన్యముగ ఆరంభమందలి ఉద్రేకంకంటె తగ్గుదల నందిగాని లేక సామాన్యముగ గాని, యుండును. బహు అరుదుగా మాత్రము, దానికంటె తీవ్రతను వహించియుండును. వాంతియగుట, పచ్చకామాల, అతివిరేచనములు —యీలక్షణములన్నియు ఉద్ధృతగతియందే యుండవచ్చును. పునఃప్రకోప గతియొక్క

కాలపరిమితి ఆరంభగతియందలి దానియంత ఉండనేరదు. ఈ రెండుగతులకును నుండెడి సామాన్యభేద మిదియే అయియున్నది. ఈవ్యాధి యీగతియందు సాధారణముగ మూడు మొదలు ఆయిదుదినముల వరకు నుండును. కొన్ని విషయములయందు యిందులకు హెచ్చుతగ్గు లుండవచ్చును.

ఆరంభగతియందలి మూత్రము, పరిమాణమునందు ఆరోగ్యస్థితియందలి దానితో కొంచె మెచ్చుతక్కువగ సమానముగ నుండినను, పునఃప్రకోపగతియందు మూత్రము దీని యొక్క పరిమాణము అధికముగ హెచ్చియుండును. ఈగతియందు సందిగ్ధస్థితికి వచ్చు ముందర, ప్రతిగంటకును 6 లేక 7 ఔన్సుల మూత్రమును విసర్జించినట్టియు, దినమంతటను 84 ఔన్సుల మూత్రమును విసర్జించినట్టియు సందర్భములు కలవు.

రెండవ సందిగ్ధస్థితి ప్రథమసందిగ్ధస్థితిని బోలియుండును. ఈ సందిగ్ధస్థితికి పూర్వము, శరీరవేడిమి అత్యధికతీవ్రతనొంది అకస్మాత్తుగా నతి తొందరగా, సామాన్యపు వేడిమికంటె కొన్ని డిగ్రీలు తగ్గిపోవును. చెమటలు పోయుట ప్రథమ గతియందుకంటె అధికమగును. శరీరముపైన ఒకప్పుడు పొక్కులును గనుపడును. శరీరవేడిమి అంతయెక్కువగా తగ్గిపోయినపుడు, నిస్త్రాణ అధికముగా నుండుట సహజలక్షణమే అయియున్నది. స్వాభావికముగ నీస్థితియందు మూత్రపరిమాణము తగ్గుదల నందును.

ఇటుపిమ్మట స్వస్థావస్థ ప్రారంభమగును. ఒకానొకప్పుడు వ్యాధి ప్రారంభించిన నుండి యిరువదియొక్క దినమున ద్వితీయ పునఃప్రకోపగతి అంకురించును. ఇది అరుదుగా తప్ప మూడుదినములకంటె నెక్కువగ వ్యాపించియుండదు. వెనుకటి పోటులకంటె నిది సామాన్యముగ బహుసాధుగతిని వహించియుండును. మూడవ పర్యాయమును నాల్గవ పర్యాయమును, కొన్నివిషయములలో, నీ వ్యాధి మరల ప్రకోపించి యున్నట్లు తెలియుచున్నది. కాని, యిట్టివి బహు అరుదుగా దటస్థించును.

ఈ వ్యాధియందు స్వస్థావస్థకాలము చాలదినములవరకు వ్యాపించి రోగి పరిపూర్ణమైన ఆరోగ్యత నందుసరికి చాలకాలము పట్టును.

జ్వరగతియందొకానొకప్పుడు అస్వస్థత శ్వాసకోశములకు వ్యాపించి, గొంతుపడిసెము ప్రారంభమయి, అరుదుగా న్యుమోనియా గూడ గలుగవచ్చును.

ఈ వ్యాధియందు మరణములు నూటికి ఆరుకంటె తక్కువగానున్నవి. అధిక విరేచనములు, తీవ్రతమగు పచ్చకామెర్లు, మిగుల నిస్త్రాణ—యివి యెక్కువ అపాయకరముగ నెంచబడవలయును. వయసుమీరిన వారలయందును, చిక్కులతో గూడియుండిన గతులయందును. తప్ప, తక్కినవిషయములలో తేలికగా కుదురుబాటు నందును.

## చికిత్స.

ఈ వ్యాధికి ప్రత్యేకమగు చికిత్స యింతవరకును గనుగొనబడి యుండలేదు. రోగిని, పరిశుభ్రమగు గాలి వెలుతురు వచ్చునట్టి గదిలో నుంచి, పరిశుభ్రతను గాపాడుచు, పాలనుగాని, యితరమగు బలమునిచ్చు ఆహార పదార్థములనుగాని, లోనికియ్యవలయును. వ్యాధి ప్రారంభమునందు మలబంధ మేర్పడియుండిన యెడల, 4 వ విరేచనకారి నుపయోగించ

వలయును. ఒడలంతయు సామాన్యముగ ఉష్ణపునీళ్ళతో ప్రతిదినమును తుడువవలయును. స్ట్రిక్నీన్‌నుగాని, నక్సువామికాను గాని బలవర్ధకౌషధముగ నిచ్చుటవలన మిగుల ఉపయోగముండినట్లు తెలియుచున్నది, నాడి బహు మాంద్యతను వహించి యుండినయెడల, స్పిరిట్సు అమ్మోనియా అరోమేటిక్సు తగు మోతాదులలో నియ్యవలయును. నిద్రరామికిని, వాంతులకును, అతివిరేచనములకును, దగు చికిత్సను చేయుచుండవలయును. శరీర వేడిమి 106 డిగ్రీలకు మించియుండిన యెడల, తడిగుడ్డలను ఒడలుపైకప్పి, శరీర వేడిమి సామాన్యవేడిమికి తగ్గకుండ జాగ్రతతో జూచుచుండవలయును. పునఃప్రకోపగతి రాకుండ జేయుటకుగాను అనేక ఔషధములు ప్రయోగించుట మూలమున పరీక్ష జేయబడెను. గాని, ఏవియు నుపయోగించి యుండలేదు. క్వినీన్‌ను యిచ్చుటవలన నేమియు ఉపయోగము కనుపడియుండలేదు. రోగికి క్రమమగు ఆహారపదార్థముల నిచ్చుచు, రోగియొక్క శరీరబలమును గాపాడుచుండవలయును.

## విషమ జ్వరములు.

ఆంగ్లేయ భాషయందు మలేరియల్ జ్వరమను దానికే, మనము సామాన్యముగ చలిజ్వరమని వాడుచున్నాము. విషమ జ్వరమనియు కొందరు వాడుదురు. ఈ జ్వరములు ఒక విధమగు పురుగులచే కలుగుచున్నవి. ఈపురుగులు మనుష్యుల యందును ఒకతరగతి దోమలయందును నివాసము నేర్పరచుకొనును. మనుష్యులయందు రక్తములోని యెర్రని కణములయందు తమ నివాసము నేర్పరచుకొని, యీపురుగులు చలిజ్వరవ్యాధికి కారణము లగుచున్నవి. సామాన్యముగ వ్యవస్థతో గూడిన జ్వరము, రక్తహీనత, ప్లీహయొక్క ఘనత జెందుట, స్నాయుబంధముల యొక్క అల్లికలయందు మెలనిన్ అనబడు నల్లని వర్ణము నిలువచేయబడుట — యీ లక్షణములతో నీవ్యాధి కూడి యుండును.

క్రీస్తుశకమునకు పూర్వము నాలుగు అయిదు శతాబ్దములయందు, గ్రీసుదేశమునందలి హిపాక్రిటీస్ అను వైద్యశాస్త్రజ్ఞుడు యీజ్వరమును గుర్తించి యున్నాడు. క్రీస్తుశకము 1వ శతాబ్దమునందు, యీవ్యాధియందలి కొన్ని భేదములు గమనింపబడియుండెను. ఈ వ్యాధియందలి జ్ఞానముయొక్క నవీనాభివృద్ధి, 1640 వ సంవత్సరమునందు దక్షిణ అమెరికాలోని పెరూసంస్థానముయొక్క గవర్నరు జనరల్ అయిన సింకోన్ అను నాయనవలన బహోపాఖండమునందు సింకోనా (క్వినీన్) వృక్షము ప్రవేశపెట్టబడిన నాటినుండి ప్రారంభమయినట్లు మనము యెంచవచ్చును. క్వినీన్‌ను సకాలములో నుపయోగించుటవలన నీవ్యాధియందు దివిరిక తరుచుగ గనుపడి యుండెను. గాని, నీ ఓషధి యీవ్యాధి యెడల శోధనపదార్థముగా మిగుల ఉపయోగముగ నుండెను. 18 వ శతాబ్దపు ఆరంభమునందు, మరికొన్ని విశేషములు కనిపెట్టబడి యుండెను. 1803—23 సంవత్సరములయందు, ప్లీహయొక్క ఘనత జెందుట, ఈవ్యాధి లక్షణముగా తెలియబడెను. 2347వ సంవత్సరమునందు స్నాయుబంధములయొక్క అల్లికలయందలి నల్లనివర్ణము, యీ వ్యాధిలక్షణముగా మెకెల్ అను నాయనవలన యీవ్యాధి సంబంధమగు పురుగు కనుగొనబడెను. 1898వ సంవత్సరమునందు రాస్ అను నాయనవలన, దోమలయందు ఈ పురుగు అభివృద్ధిజెందుచున్నదని గ్రహింపబడెను.

ఈ వ్యాధి వ్యాపకమగుటకు యీక్రింది అంశములు ముఖ్యములైయున్నవి. (1) ఈ వ్యాధిసంబంధమగు పురుగు ఉండుట. (2) బహిఃప్రకృతియందు యీ పురుగు అభివృద్ధి వ్యాప్తత జెందుట కనుకూలమగు ప్రకృతి సంబంధమగు స్థితిగతులు ఆవరించి యుండుట. (3) ఈ పురుగు మనుష్య శరీరములోనికి జొచ్చుటకును, అనుకూలమగు గతులు ఉండి యుండుట.

పల్లపు భూములయందును, గొప్పనదులు సముద్రములందు కలయుచోట్ల యందును, బురద నేలల యందును — వృక్షకోటి యొక్క నశింపువలనను, నీటియొక్క విస్తారతవలనను, యీ పురుగులు అభివృద్ధి నందుచున్నవని కొందరి యభిప్రాయమై యున్నది. ఇట్టి అనుకూల గతులు ఉండి యున్నను, దక్షిణ పసిఫిక్ దీవులయందలి కొన్ని స్థలములలో నీవ్యాధిలేకుండ గనే యున్నది. దీనిని బట్టి యీవ్యాధి సంబంధమగు పురుగులు జీవించియుండుటకు, యితరములగు అనుకూలతలును ఉండియుండ వలయుననెడి అంశము స్థిరపడుచున్నది. జలము దుర్లభమయిన కొన్ని పర్వతప్రాంతములయందు, యీవ్యాధి వ్యాపించి యుండుటనుజూడ, వర్షించుచుండెడి వృక్షసంబంధములును, వాయువునందలి చెమ్మయును, యీవ్యాధి యొక్క అభివృద్ధికి కేవలము అగత్యములని జెప్పుటకు వీలుగాకున్నది. ఈవ్యాధి సంబంధమగు పురుగులు స్వభావమునందు అభివృద్ధి నందుటకు గాను, యీపురుగులకేగాని, యీపురుగులు నివాసములుగా జేసికొనెడి దోమలకుగాని, తమకంటె నెక్కుడు బలాఢ్యులైనట్టి శత్రువులు లేకుండగ నుండవలయును. సృష్టియందలి యిట్టి కారణాంతరములను విచారించుచున్నను, యింత వరకు జంతుశాస్త్రజ్ఞులుగాని వైద్యశాస్త్రజ్ఞులు గాని పూర్తిగ కనుగొని యుండలేదు.

ఈవ్యాధియొక్క అభివృద్ధికి నీటియొక్క వ్యాప్తత అనుకూలతను గలుగజేయుచున్నదని అందరును యొప్పుకొనియున్న అంశమే అయియున్నది వరదలు వచ్చుటవలనను, వ్యవసాయ కారణమున నీటిపారుదలను, కాలువలు, గట్లు మొదలగు వాటివలన విస్తరించజేయుట మూలమునను, యీ వ్యాధి వ్యాప్తత నందుచున్నది.

ఈవ్యాధి సంబంధమగు పురుగులు కొన్నిగజముల దూరముకంటె నెక్కువ గొంపోబడుటయందు జీవించియుండ నేరవు. ఈపురుగులు ఉద్భవించిన స్థలమునుండి కొన్ని అడుగుల యెత్తుకంటె నెక్కువగ బయికి లేవ నేరవు. మశూచి పొంగు వ్యాధులయందలి పురుగులవలె నీవ్యాధి సంబంధమగు పురుగు విశేషకాలము జీవించి యుండ నేరదు.

ఈవ్యాధి ఒకప్పుడు దోమ కుట్టుట మూలమునను, మరియొకప్పుడు త్రాగుమంచి నీళ్ల మూలమునను, యింకొకప్పుడు యీ సంబంధమగు విషవాయువును లోనికి పీల్చుటవలనను, యీవ్యాధి కలుగుటకు కారణములగును. ఈవ్యాధిసంబంధమగు విషవాయువు సూర్యోదయమునకు పూర్వమునను సూర్యాస్తమయమునకు దరువాతను, ప్రబలి యుండును. కాబట్టి, మన్యప్రదేశములలో యీ కాలములయందు బహిర్వాయువునకు లోనగుటవలన నీ వ్యాధిని గ్రహించుటకు మార్గము యేర్పడుచున్నది. మన్యప్రదేశములయందు నేలపై బరుండుటవలన సామాన్యముగ నీవ్యాధి అంకురించుటకును జూడ, యీవ్యాధి సంబంధమగు పురుగు వాయువునందలి అట్టడుగు భాగమున నావరించియుండునని తెలియనగుచున్నది. ఏ కారణమువల్లనైనను శరీరమునందు గలిగెడి జవసత్వము యొక్క తగ్గుదల స్థితియందు యీ

వ్యాధిసంబంధమగు పురుగు శరీరమునందు ప్రవేశించినయెడల, ఆపురుగు యొక్క నివాసమునకును అభివృద్ధికిని అనువు యేర్పడుచున్నది.

వ్యాధియొక్క వ్యాప్తతయందు వయస్సు వివక్షత యేమియు నుండినట్లు కనుపడదు ఈవ్యాధి యెడల, బిడ్డలకును పెద్దవారలకును సమానమగు ఉద్యుక్తతయే యుండియున్నది. కాని, బిడ్డలయందు గలిగెడి యీ వ్యాధి యెక్కువ అపాయకరమైయున్నది. మట్టిపని చేయువారలయందు యీ వ్యాధి యెక్కువ తరచుగ గలుగుటకు వీలుకలదు. ఈ వ్యాధి, అంటుగుణము యొక్కయెట్టి స్వాభావిక పద్ధతిపైనయును, ఒక మనుష్యుని నుండి మరియొక మనుష్యునికి వ్యాపింపనేరదు. ఈ వ్యాధి ఒకసారి కలిగిన పిమ్మట, తదనంతర రాహిత్యత గలుగజేయక, పోవుటయే గాక, యిందువలన ఫలితముగ గాని, నూతనగ్రహణము వలన గాని, మరల మరల వచ్చుట కుద్యుక్తత యేర్పడును, కొందరి వైద్యశాస్త్రజ్ఞులయొక్క శోధనల వలన, మిక్కుటముగు సన్యపరిదేశముల యందలి చిన్న బిడ్డలందరు దమరక్తమునందు యీ వ్యాధి సంబంధమగు పురుగులను గలిగియుండునట్లు దెలియుచున్నది. ఈ బిడ్డలు పెద్దవారలైన కొలదని, యీవ్యాధి గ్రహించుట కుద్యుక్తత తగ్గిపోవుచున్నది. ఈ వ్యాధి శరీరమునందు పక్వమునకు వచ్చు కాలపరిమితి చాల భిన్నములుగ నుండియున్నది. బహుశః యిందుమిగుల తక్కువయగు పరిమితి ఎనిమిది దినములు మొదలు పదిదినములవరకుగా నెంచనచ్చును. విశేష పరిమితి ఒకప్పుడు కొన్ని సంవత్సరములు పట్టినను పట్టును. ఇంత కాలము పట్టినపుడు, వ్యాధి శరీరమునం దంతర్గతముగ నుండియున్నదని భావింప వలయును.

విషమజ్వరములు ఇంటర్‌మిటెంట్ జ్వరము అనియు రెమిటెంట్ జ్వరము అనియు రెండుతెగలుగ విభజింపబడియున్నవి. ఈ రెండుజ్వరములను విడివిడిగ నీక్రింద వివరింపబడియున్నవి.

## ఇంటర్ మిటెంట్ జ్వరము

### (చలిజ్వరము)

ఇంటర్‌మిటెంట్ జ్వరమునకే ఆంగ్లేయభాషయందు ఏగ్యు అను పేరును గలదు. ఈ జ్వరము, విడిచివిడిచి వచ్చుచుండుటచే పారిజ్వరమనియు; చలితో గూడి యుండుటచే చలిజ్వరమనియు, విపరీతమైన శీతలతతో గూడియుండుట వలన విషమశీతజ్వర మనియు, వేరు పేర్లను పొందియున్నది. ఈ వ్యాధి మూడు విధములుగ దటస్థించును. మొదటి విధమునందు జ్వరము అనుదినమును వచ్చుచుండును. ఈ గతియందు జ్వరము సాధారణముగ ఉదయమున వచ్చుచుండును. రెండవ విధమునందు దినము విడిచి, దినము జ్వరము వచ్చుచుండును. జ్వరము సాధారణముగ పగలు సుమారు పండ్రెండుగంటల సమయమున వచ్చుచుండును. మూడవ విధమునందు, మధ్యగా రెండుదినములు విడిచి నాల్గవదినమున జ్వరము వచ్చుచుండును. ఈ గతియందు జ్వరము సామాన్యముగ మధ్యాహ్నవేళలయందు వచ్చును. అనుదినమును వచ్చునట్టి జ్వరము, సాధారణముగ వచ్చుచుండును. కొన్ని జ్వరములయందు యీ క్రమము కనుపడక పోవచ్చును. ఈ జ్వరముయొక్క లక్షణములగు తీవ్రగతులును చలి, వేడి

చెమటలు — కనుపడక పోవచ్చును. ఇట్టివి చలిజ్వరములుగా భావింపబడక భిన్నములుగా నెంచవలయును. అన్ని విధములగు చలిజ్వరములందును పైన చెప్పబడిన త్రిగతులును ముఖ్య లక్షణములుగా నుండును. కొన్ని విషయములందు, జ్వరగతి ప్రారంభమగుటకు ముందుగా కొన్ని చిహ్నములు కనుపడును.

### లక్షణములు.

నిస్త్రాణ, నీరసత, ఆయాసము, ఆవలించుట, ఒళ్ళు విరచుకొనుట జీర్ణాశయము వైపుల నొకవిధమగు నొప్పి — యీలక్షణములు కొన్ని విషయము లందుండును. మరికొన్ని విషయములందు కాళ్ళు, వెన్ను, నడుము — యీ మొదలగు భాగములయందు అసౌఖ్యత, లేక, బాధ కలిగియుండును. లేక, కండ్లు మంటలు గాని అరచేతులు మంటలు గాని, యేర్పడి చెవులలో ధ్వనులుపుట్టును. లేదా తలనొప్పి మాత్రమే యుండవచ్చును. తరుచుగ నాలుకపై పొర గప్పియుండును. తరుచుగ వాంతివచ్చునట్లుండి ఒకానొకప్పుడు వాంతియు గలుగవచ్చును అంతట శరీరమంతటను ముఖ్యముగా వెన్నువైపులకు చలిపుట్టి ముఖకాంతి తగ్గిపోయి చేతి వ్రేళ్ళు తెల్లబారి ముడుచుకొనిపోయి ఒడలంతయు సాధారణముగ గగ్గురు పొడుచును. ఈ చలిమూలమున ఉద్రుతమగు వణకుట ప్రారంభమయి, పండ్లుకొరకుటయు గలుగును. పైన చెప్పబడిన సూచనలక్షణములు లేకుండగనే యొకప్పుడు చలిగతి ప్రారంభమగును. వణకుట తోగూడి, పెదవులు చెవులు ముక్కు వివర్ణములై, ఊపిరిపీల్చుట త్వరితగతినంది, నాడి తొందరతోగూడి, శరీరవేడిమి హెచ్చుదల నందును. ఈ స్థితియందు నాలుక తెల్లనై ఆరుబల లంది, వెన్ను నడుము పాదములు చేతులు — వీటివైపుల ఉద్రుతమగు బాధగలిగి, కడుపుగో ద్రిప్పుటయు, వాంతియగుటయు, అధికము కావచ్చును. ఇట్లు ఒకఅరగంట, లేక అంతకెక్కుడు కాలమును అయినపిమ్మట, అత్యుద్రుతమగు చలినుండి, క్రమముగా అత్యుద్రుతమగు వేడిమిలోనికి మారును. ఈస్థితియందు, తలనొప్పి అధికమయి ముఖము యెర్రబారి, చేతులు వేడిగాను పొడిగాను యుండి, నాడిపూర్ణమై చురుకుబారి, ఉచ్ఛ్వాస నిశ్వాసములు తొందరనంది, వాంతియగుట అత్యుద్రుతతో తరుచుగ రావచ్చును. దాహము అధికముగా నుండవచ్చును, మూత్రము పరిమాణమునందు హీనమై తీవ్రవర్ణమును గలిగి, మూత్రము వెలువడునప్పుడు మంటపుట్టవచ్చును. అప్పుడప్పుడు సంధిగుణము కూడ గలుగవచ్చును. ఈఉష్ణగతి రెండు లేక మూడు గంటలవరకును ఒకప్పుడు అధికముగను వ్యాపించి యుండును. శరీరవేడిమి 104, 106, 107, డిగ్రీలవరకును, ఒకప్పుడు అంతకెక్కుడుగను వ్యాపించును. అంతట, మెడ నుదురు అరచేతులు — వీటివైపుల చెమట ప్రారంభమయి క్రమముగా శరీరమంతటను వ్యాపించును. ఈస్థితియందు రోగియొక్క ఒడలుపై చెమట కారుట యేర్పడి, దుస్తులును పక్కబట్టలును దడిసిపోవును. ఈస్వేదగతి ప్రారంభించిన పిమ్మట జ్వరము శీఘ్రతతో తగ్గిపోయి శరీరవేడిమి మామూలుస్థితికి వచ్చి, సుమారు ఒక గంటకాలములో కొంతనీరసతను బొందియుండుటనుదప్ప, రోగి తక్కిన అన్ని విషయములందును సౌఖ్యమునొంది బాధుగతులందు వెంటనే లేచి తిరుగుటయు గలదు. ఈవ్యాధిగలిగిన అనేక విషయములందు, ప్లీహ స్పర్శగోచరమగు, కాలిజము కూడా కొంతవరకు యథాస్థితిని

వహించియుండును. ఈరెండు అవయవములందును ఒకప్పుడు అసాధ్యతగలిగి బాధయు గనిపింపవచ్చును.

ఈజ్వరముయొక్క తెర, వ్యాధియొక్క ఉద్రేతనుబట్టి, మూడు మొదలు ఆరు లేక యెనిమిది గంటలవరకును ఒకప్పుడు అంతకెక్కుడుగనుగూడ వ్యాపించును. స్వస్థావస్థయందు మూత్రము పరిమాణమునందు హీనమయి, తీవ్రవర్ణమును వహించి యుండును.

ఈవ్యాధి అంతరించినట్లు కనుపడినపిమ్మటను గూడ, అప్పుడప్పుడుకొన్ని విషయములలో శరీరవేడిమి హెచ్చుచుండవచ్చును. ఇట్టిస్థితి ఉండునంతవరకును, యీవ్యాధి సంబంధమగు పురుగు నాశన మందియుండలేదని యెంచబడ వలయును.

స్వచ్ఛమయిన చలిజ్వరమందు, పైలక్షణము లెప్పుడును గనిపెట్టదగియుండివను, ముఖ్యముగా పలుమారు జ్వరతెరలు వచ్చిన పిమ్మట, చలిగతి లేకుండగనేగాని, లేక సూక్ష్మముగా నుండిగాని, వణకుట లేకుండగ, శరీరవేడిమి హెచ్చుదలనందుట తరుచుగ దటస్థించును. ఈవ్యాధియొక్క ఫలితముగ కొన్ని విషయములందు జీర్ణాశయము అస్వస్థతనందినపుడు వాంతియగుట విశేషముగనుండి మందుగాని ఆహారముగాని నిలుచుటకు ఆస్పదము లేక పోవచ్చును. ప్లీహా శారీరజముల యొక్క అస్వస్థతకు దోడుగా నొకప్పుడు, గుండెఅదరు, అతివిరేచనములు, తలనొప్పి, చెవులలోధ్వనులు, బాధకరమగుదగ్గు యివి అన్నియు కలుగవచ్చును. బహు అరుదువిషయములలో, మూర్ఛనందిన రక్తము మూత్ర గ్రంధులనుండి వచ్చుటమూలమున మూత్రము మిగుల నల్లనివర్ణమును వహించియుండును.

వ్యాధితగిలిన మనుష్యులయందు మరణప్రాప్తిని లెక్కవేయగా తక్కువ అయియున్నను, యీవ్యాధి వ్యాపించియుండెడి విరివినిబట్టి చూడగా, మొత్తము పైన మరణములు అధికముగా నున్నవి. ఇండియాదేశమునందు, కాలరా వ్యాధియందు కంటెను, యేయితర వ్యాధి యందుకంటెను, యీవ్యాధివలన మరణము లధికములయి యున్నవి. చిక్కుదలను వహించునట్టి సామాన్యస్వరములు ప్రాణభయమును కలుగజేయవుగాని, వ్యాధ్యనంతరము గలిగెడి రక్తహీనతవలన, వ్యాధి మరల ప్రకోపించుట కనువు యేర్పడుటయు, యితర వ్యాధులు గలుగుటకు యిరువు యేర్పడుటయు, కలుగుచున్నవి. ఈ ప్రకారముగ, నీవ్యాధి ఫలితముగ గలుగు యితర వ్యాధులవలన మరణము లేర్పడుచున్నవి.

ఉద్రుతగతులయందుండెడి యీవ్యాధి, అవిలంబముగ గుర్తింపబడి, క్రమమగు చికిత్స జేయు డేనియెడల, యెప్పుడును అపాయకరమగును. ఇట్టివాటియందు మరణములు మూడింటికి ఒకటిచొప్పున గలుగుచుండును. శరదృతువునందు గలిగెడి యీవ్యాధి వసంతఋతువునందు గలుగుదానికంటె తీవ్రతను వహించియుండును. ఈ వ్యాధియందు స్థలభేదములనుబట్టి తీవ్రగతులను మారుచుండును. పశ్చిమ ఆఫ్రికాయందుండెడి యీ వ్యాధి, ఐరోపాయందలి దానికంటెను, ఇండియాయందలి దానికంటెను. మిగుల అపాయకరమైనదై యున్నది.

చికిత్స.

చలిజ్వరమునందు: చలి ప్రారంభముకాగానే రోగి పరుండియుండి దుప్పటులను గప్పుకొనవలయును. రోగికి సాధ్యమయినంతవరకు అన్నివిధములను వేడిమి గలుగ జేయవలయును.

ఈ శీతలగతి మారి ఉష్ణగతి ప్రారంభమయి జ్వరము ఆరంభము కాగానే, రోగి చల్లనినీళ్లను త్రాగుట మూలమున చెమట యధికమగునట్లు చేసి, సాధారణముగ ఉష్ణజలములో స్పంజిని ముంచి, ఒడలంతయు తుడువవలయును. తలపై తడిగుడ్డను గాని, అవసరమైతే మంచుగడ్డను గాని, పెట్టుటవలన జ్వరమును తగ్గింప జూడవలయును. సిట్రేట్ ఆఫ్ మెగ్నీసియాను కొద్ది మోతాదులలో నిచ్చుటవలన, చెమటను అధికపరచి, జీర్ణాశయముయొక్క రేగుదల అణచి వేయబడును.

రోగికి చెమటపోయుట ప్రారంభించి, చెమట విరివిగ నుండక పోయిన యెడల, శరీరముపై బాగుగ గప్పియుంచుట వలనను, తేయాకునీళ్ళను గాని చల్లని నీళ్ళను గాని యిచ్చుటవలనను, స్వేదము నభివృద్ధిపరచవలయును. నీరసముగానుండిన యెడల కొంచెము బ్రాందీని నీళ్లలోగలిపి యిచ్చి, మూర్ఛ రాకుండునటుల రోగిని పరుండబెట్టియే యుంచవల యును. చెమటతో తడిసిన గుడ్డలను తొలగించుటలో, రోగికి గాలి తగులకుండునట్లు జాగ్ర తగా పొడి తువాళ్ళతో ఒడలు తుడువ వలయును.

ఈ వ్యాధి యందలి చికిత్స, ఒకజ్వర తెరకును మరియొక జ్వర తెరకును, మధ్య కాల మునందు చేయవలసియున్నది. ఈవ్యాధియందు క్వినీన్‌తో సమానముగ బనిచేయు మరియొక ఔషధము లేదు. విరేచనము క్రమముగ నగుచుండిన యెడల, చెమట పోయుట బాగుగ ప్రారంభింపగనే, 10 గ్రైయినుల క్వినీన్ సల్ఫేటుతో చేయబడిన గిలటీన్ పూతనందిన మాత్రలనుగాని, చక్కెరతో బొల్పబడిన బర్రోజ్ వెల్కం అండ్ కంపెనీ యొక్క టేబ్లా యిడ్లు (బిళ్లలు) ను గాని అవసరమునుబట్టి ఆయా గ్రైయినుల మోతాదులలో నుపయోగించుట యెక్కువ మేలుగనుండును. పిమ్మట మూడు లేక నాలుగుదినములు, దినమునకు ఒకపర్యా యము చొప్పున నయిదుగ్రైయినుల మోతాదులలో నియ్యవలయును. అటుతర్వాత వ్యాధి తిరుగబెట్టకుండునట్లు, వరుసదప్పని ఆరువారములు మొదలు మూడుమాసముల వరకును, వారమున కొక్కదినమున రెండు 5 గ్రెయినుల మోతాదులను బుచ్చుకొనవలయును. ఈదినపు వేకువజాముననే సాధువగు విరేచనకారిని బుచ్చుకొనుట ఉపయోగకారిగ నుండును. ఇటు వంటి చికిత్సకు యెట్టివిషజ్వరమును సామాన్యముగ లొంగకపోదని పాట్రిక్ మాన్సన్ అను వైద్యశాస్త్రజ్ఞుడు చెప్పుచున్నాడు.

ఈ విషజ్వరములందు క్వినీన్ సకాలములో నిచ్చుటవలన, తరువాతి తెరను సామాన్య ముగ రానియ్యకయు, వచ్చినను, సాధుగతిలో వచ్చునట్లును జేయును. జీర్ణాశయము రేగు దల నందియుండి, కుటిలముగ, వాంతి యగుచుండినయెడల, ఉద్రుతగతియం దుండినట్లు యెంచబడని విషయములందు క్వినీన్‌ను యెనీమా మూలమున పేగులలోనికి బ్రయోగించవల యును. ఇందులకు రెట్టింపు మోతాదును ఉపయోగించవలయును. ఈ యెనీమాను యిచ్చు టకు ముందుగా, వట్టి యెనీమాను ఇచ్చి పేగులను శుభ్రపరచవలయును. అపాయకరమగు జ్వరములందును, నాలుక చెడుస్థితియందుండి, జీర్ణాస్వస్థత గలిగియున్నదని సూచన లుండి యున్నప్పుడును, క్వినీన్‌ను ద్రవమిళితముగ నియ్యవలయును. ఈ సందర్భమునందు (1) (2) బలవర్ధక ఔషధయోగములను వాడవలయును.

క్వినీన్‌ను చికిత్సకుడనోడుగా, విశ్రాంతి, వెచ్చదనము గలుగజేయుట, మంచిఆహారము —యీమూడు సంగతులను ముఖ్యముగా గమనించవలయును. కొన్ని సందర్భములయందు క్వినీన్ ఒక గ్రెయినును నయినను వాడకుండ, యీ అంశములయందు జాగ్రత్త నందుటవలన వ్యాధి కుదిరిన సందినటుల తెలియబడుచున్నది. ఈ సంబంధమూలగు జ్వరముల పిమ్మట కలిగెడి రక్తహీనతకు, ఆర్సనిక్‌తో లోహము (Iron) ను, కొద్ది మోతాదులలో క్వినీన్‌నుగాని నక్సవామికా గాని గలిసిన ఔషధములను, ఉపయోగింపవలయును. వీటికి సహాయములుగ బలమగు ఆహారము, కొద్దిమోతాదులలో బ్రాందీ, వెచ్చనైన దుస్తులను ధరించుట, అతిచల్లదనము లేని శీతోష్ణస్థితి—పనిచేయును.

ప్లీహముయొక్క ఘనతతగ్గుటకు, లినిమెంట్ అయొడిన్‌ను పైనరాయుటవలనను, 4 వ విరేచనకారి ఔషధయోగమును యిచ్చుటవలనను, క్వినీన్‌నుగూడ లోనకిచ్చుట వలనను, గుణమియ్యగలదు. ఆర్సెనిక్, ఐరన్, విద్యుచ్ఛక్తి, కొన్ని సమయములందు ఉపయోగములుగ నుండును. ఈ జ్వరవ్యాధిచే దరుచుగ బీడింపబడు వారలు, తమ నివాసప్రదేశమును విడిచి, శీతోష్ణస్థితియందు మార్పు కలుగుటకై వేరు ప్రదేశమున కరుగుట మిగులమంచిది.

క్వినీన్‌కు బదులుగా వేరు ఔషధము లనేకములు వాడబడియున్నవి. కాని క్వినీన్ అంత ఉపయోగముగా మరియేదియును గనుగొనబడి యుండలేదు. దీనికి దరువాత ఆర్సెనిక్ ఉపయోగముగ నున్నది. ఇండియాదేశమునందు, యీవిధజ్వరములందు టింక్చర్ వార్బర్గ్‌ను మిగులవాడుదురు. ఇందు చెమటను బుట్టించు అనేక ఓషధులును విస్తారము క్వినీన్‌ను, గలవు. ఒకప్పుడు కేవలము క్వినీన్ పనిచేయని విషయములలో నీ టింక్చర్ పనిచేసినది. ఈ ఔషధమును లోనకిచ్చుటకు ముందుగా, చిట్టాముదమునుగాని వేరు విరేచనకారిని గాని యిచ్చుట మూలమున పేగులను శుభ్రపరచి యుంచవలయును. పిమ్మట నీమందు ఒక అర ఔన్సును సీసా కదలింపకుండ లోనికిచ్చి, రోగిని స్వస్థతిగా బరుండబెట్టవలయును. మూడు గంటల పిమ్మట దీనినే మరియొక మోతాదును యియ్యవలయును, ఒకటి రెండు మోతాదులను బుచ్చుకొనుటకు మధ్యకాలమునందును, రెండవ మోతాదును బుచ్చుకొనిన పిమ్మట నొక గంటవరకును, యేయాహారమును లోనికియ్యక రోగి పరుండి యుండునట్లు చేయవలయును.

ముందుజాగ్రతలు.

దోమలను నశింపుజేయుటకు తగు జాగ్రతలను దీసికొనవలయును. దురదృష్టవశమున వ్యవసాయమునకై మనుష్యకృత్యముల వలన నీటిపారుదలను విస్తరింపు చేయుటమూలమున, నింగ్లండు దేశమునందు కొంతభాగమును, ఇండియా దేశమునందు కొన్నిభాగములును, యీ వ్యాధిపూరితములుగ జేయబడినవి. నివాసములకు సమీపములనుండెడి మురికిగుంటలలో కొంచెము కిరసనాయిలును పైనజల్లుట వలన, దోమలను పారదోలవచ్చును. ఇండ్లను యెత్తయిన ప్రదేశములయందు గట్టుకొనవలయును. ఈ జ్వర ఋతువులయందు ప్రయాణములను బెట్టుకొనగూడదు. మన్యప్రదేశములందు, ప్రయాణముల జేయునపుడుగాని, కొంచెము కాలము మాత్రమే నివసించియుండవలసి వచ్చినపుడుగాని, దినమునకు మూడు మొదలు అయిదు గ్రెయినుల క్వినీన్ వేసికొనుటవలనను గాని, వారమునందు ఒకదినమున గాని రెండుదినములు గాని దినము ఒకటికి రెండు లేక మూడు 5 గ్రెయినుల మోతాదుల క్వినీన్‌ను వేసికొనుట వలనగాని, యీజ్వరము రాకుండ జేసికొనవచ్చును.

మన్యప్రదేశములయందు శరీరారోగ్యతను బహు జాగ్రతతో గాపాడుకొనవలయును. క్రమమయిన శరీరసాధకము, తినుత్రాగుటలయందు మితత్వము, అలసటను గలుగజేయని వ్యాపకము, మనోల్లాసము— వీటిని గలిగియుండుట, చలి, మలబంధము, ఎండవేడిమి రాత్రులయం దెక్కువగ మేలుకొనుట, దోమకాటులు, సూర్యోదయమునకు బూర్వమును సూర్యాస్తమయమునకు బిమ్మటను బయటికి బోవుట— వీటినుండి దప్పించుకొనుట, ముఖ్యములగు అంశములయి యున్నవి. త్రవ్వుపనులు మిగుల అపాయకరములుగాన, జ్వరఋతువు లందట్టిపనులను జేయించరాదు. అట్టిపనులయందు యేర్పాటు చేయబడినవారు ఆపనులకు సమీపమునందు నిద్రించరాదు.

## రెమిటెంట్ జ్వరము.

రెమిటెంట్ జ్వరము అనగా నడుమ నడుమ తగ్గుచు హెచ్చుచుండెడు జ్వరము. ఇది సామాన్యముగ చలి జ్వరమునకు భిన్నముగా వివరింపబడి యున్నప్పటికిని, తరుచుగ నిది చలి జ్వరము జాతిలోనిదిగనే యెంచదగియున్నది. ఇది చలిజ్వరముగ ప్రారంభమయి, విరామకాల పరిమితులు క్రమముగ తగ్గిపోయి, కొద్ది రోజులపిమ్మట జ్వరము తగ్గుటమాత్రమే యేర్పడి శరీరముయొక్క సాధారణ వేడిమికి దిగకుండ నుండును. ఇదేవిధముగ రెమిటెంట్ జ్వరము చలి జ్వరము క్రిందను మార్పునందును. రెమిటెంట్ జ్వరమునందలి లక్షణములు, చలిజ్వరము నందలి స్పష్టమగు త్రిగతులను విరామకాలములను దప్పి, తక్కినవాటియందు అందలి లక్షణములనే బోలియుండును. రెమిటెంట్ తరగతియందలి జ్వరసూచనలు ముందుగా దెలిసినపుడు ఈ సూచనలక్షణములను చలిజ్వరమునందలి సూచనలక్షణములును ఒకటియే అయియున్నవి. జ్వరగతి, చలిజ్వరమునందువలె రెండు లేక మూడుగంటలలోనే అంతరించక, తరుచుగ నెనిమిదిగంటలవరకును వ్యాపించి, నాడి తొందరనంది, ఊపిరి బీల్చుటయం దాయాస మేర్పడి, రోగికి మిగుల కలతగలిగియుండును. తరుచుగా రెండవదినము సాయంకాలమునకు శరీరవేడిమి 106 డిగ్రీలకు హెచ్చును. నాడి నిమిషమునకు 100 మొదలు 120 వరకుగొట్టుకొనుచుండును. ముఖము యెర్రబారి కన్నులు రక్తపూరితములై యుండును. తరుచుగా సంని గుణము జనించి పచ్చకామాలవ్యాధిచే శరీరమంతయు ఒకప్పుడు అకస్మాత్తుగను మఱియొకప్పుడు క్రమక్రమముగను పసుపు వర్ణమును వహించియుండును. ఒకప్పుడు జీర్ణాశయము రేగుదలనంది, వెక్కిలి బుట్టి, ఆకుపచ్చ పసుపు కలిపినట్టిగాని గోధుమవర్ణమువంటిగాని నల్లనయినట్టిగాని వాంతులుగలుగుటయు దటస్థించును. చివరవిధమయిన వాంతులు కలుగుట చెడులక్షణమైయున్నది. జ్వరము ఉన్నతగతి నందినపిమ్మట సామాన్యముగ నారుగంటల కాలమువరకును, ఒకప్పుడు పండ్రెండుగంటల కాలము దాటనంతవరకును, తగ్గుదల యేర్పడదు. ఇందులకు గుర్తుగా, చెమట, తగ్గుదలనందిన శరీరవేడిమి, యెక్కువ మృదుత్వమును వహించిన నాడి, ఒకప్పుడు అలసట దీర్చెడునిద్ర—యివి యన్నియు గూడియుండును. ఈ తగ్గుదల తరచుగా కొంచెము కాలము మాత్రమే ఉండి బహుశః చలి లేకుండగనే జ్వరముయొక్క రెండవగతి ప్రారంభమగును. సామాన్యముగ జ్వరము తగ్గుదలనంది యీస్థితి మధ్యాహ్నమువరకు నుండును. ఉద్రితగతులయందు యీతగ్గుదలను గమనించుట కష్టము

గాని, యీావ్యవస్థను గనిపెట్టుట మిగుల ముఖ్యమయి యున్నది. రెమిటెంట్ జ్వరమునకు ఇంటరుమిటెంట్ జ్వరము (చలిజ్వరము) నకును కలిగెడి భేదము, జ్వరలక్షణములు విడువకుండ నుండుటయందే యుండి యున్నది. రెమిటెంట్ జ్వరముయొక్క ఆరంభదినములందుండెడి లక్షణములను బట్టి, యీజ్వరమునకును టైఫాయిడ్ జ్వరమునకును గల భేదమును గుర్తించుట యెల్లప్పుడును వీలయినదిగాదు. ఈ కారణమువలన, రెమిటెంట్ జ్వరమును యెక్కువ జాగ్రతతో జూడవలయును. రోగిని వెంటనే పరుండునట్లుచేసి, శరీరవేడిమిని గైకొనుచు ద్రవసంబంధమగు ఆహారపదార్థములను మాత్రమే లోనకిచ్చుచుండవలయును. రెమిటెంట్ జ్వరముయొక్క ఒక తెరయొక్క కాలపరిమితి సకటున సుమారు యిరువదినాలుగు గంటల వరకు వ్యాపించియుండును. చికిత్సజేయుటచే నీకాలపరిమితిని తగ్గించిననేదప్ప, పిమ్మట తెరలయొక్క కాలపరిమితి క్రమముగ హెచ్చుచుండును. ఇట్టి తెరలు వచ్చుచుండెడి వ్యాధి సామాన్యముగ నేడుదినములు మొదలు మూడువారములవరకును, వ్యాపించియుండును. ఒకప్పుడు యింతకెక్కుడు కాలమును వ్యాపించియుండును. ఏడు, పదునాలుగు, యిరువది యొక్క దినములు సందిగ్ధస్థితి యేర్పడుదినములుగ నెంచబడి, ఆదినములందు సుగుణముగ మారుటగాని, దుస్థితి సంభవించుటగాని, యేర్పడునని తలపబడుచున్నది. శరీరవేడిమి యొక్కయు నాడియొక్కయు తీవ్రత తగ్గుదల నందుట, జీర్ణాశయముయొక్క రేగుదల క్షీణతనందుట, చెమట అధికమగుట, — యివి సులక్షణములయి యున్నవి. ఆధిక్యతనందెడి నీరసత, విరేచనములందు రక్తము పడుట, మూత్రమునందు రక్తముపడుట చల్లని చెమట, సంధిగుణము, మగత — యివి చెడులక్షణము లయియున్నవి.

రెమిటెంట్ జ్వరములందు అంతరావయవములయొక్క అస్వాస్థత యేర్పడుట సామాన్యముగ గలుగుచుండును. జీర్ణాశయముయొక్క అస్వాస్థతను గూర్చి యిదివర వ్రాయబడియున్నది. ఇట్టి అవస్థ యుండగా నొకప్పుడు ప్రతి ఆహారపదార్థమును ఔషధమును వెలువడజేయబడును. రెమిటెంట్ జ్వరముచే బాధనొందుచున్న వారలయందు, జ్వరమువలన నిట్టిజీర్ణాశయ అస్వాస్థత గలుగుచున్నదని దెలియవలయును. ఈ జ్వరమునందు మెదడుపై గలిగెడు గుణఫలితముగను, జ్వరము తగ్గుదల నందియున్న స్థితిలో బహుశః అవివేకతవలన రోగిని లేవదీసి కూర్చుండబెట్టినప్పుడును, మూర్ఛతటస్థింపవచ్చును. ఈ వ్యాధియందు రోగిని లేవదీయకుండ జాగ్రతను వహించి యుండవలయును. మెదడుయొక్కగాని, మెదడును ఆవరించి యుండు పొరలయొక్కగాని, రేపుదలవలన గాని వాపుదల వలనయేగాని తలపయిన మిక్కుటమగు వేడియేర్పడి సంధిగుణము జనించి, కండ్లుయెఱ్ఱుపులెక్కు — యీ స్థితి క్రమముగా పూర్ణమయిన మయికములోనికి దిగవచ్చును. రొమ్ముపశిసెముగాని, న్యుమోనియాగాని, తటస్థమగుటయు గలదు. ఈ వ్యాధియందు యెదురొమ్ము అస్వాస్థతలు యేర్పడి, జ్వర తీవ్రతవలన వీటిని వెంటనే గనుగొన వీలులేక పోవచ్చును. ఇట్టి అస్వాస్థతలు తీవ్రగతి నందకముందే చికిత్సను జేయవలసి యుండును. కారిజమునందును, మూత్రగ్రంథులయందును రక్తము కూడుకొనుట గాని, ఈ అవయవములయొక్క వాపుదలగాని, యేర్పడుటయు, దటస్థింపవచ్చును. అతివిరేచనము లుండినయెడల, విరేచనమును బరీక్షించవలసి యుండును. రెమిటెంటు జ్వరసంబంధమగు విరేచనము కాంతిగలిగిన సాధు పసుపు వర్ణమును గలిగియుండును. టైఫాయిడ్ జ్వరసంబంధమగు విరేచనము రంగునందెక్కువ మబ్బుగానుండును.

చీము, రక్తము గూడిన విరేచనములగుట ప్రారంభించినయెడల అతినీరసతయును టైఫాయిడ్ జ్వరమున కద్యుక్తతయను యేర్పడినవని యెంచవలయును.

## చికిత్స.

సామాన్యగతులయందు, అంతరావయవముల యొక్క అస్వస్థత కనుపడనపుడు 4 వ విరేచనకారి ఔషధయోగమును యియ్యవచ్చును విరేచనము పరిశుభ్రముగా నగువరకును, యీవిరేచనకారిని అనుదినమును ఉపయోగింపనగును జ్వరము తగ్గుదల నందగనేగాని, 10 గ్రెయినుల క్వినీన్ మాత్రలరూపమునగాని, పొడి అయినయెడల ఒక అరడ్రాము నిమ్మరసములోను రెండు ఔన్సుల జలములోను గలిపిగాని, యియ్యవలయును. పిమ్మట 3 గ్రెయినుల మోతాదులలో క్వినీన్‌ను మూడు గంటల కొకపర్యాయము యియ్యవలయును. తిరిగి జ్వరము అధికమగుచున్నట్లు కనుపడగానే క్వినీన్ ను యిచ్చుట ఆపివేయవలయును రెండు దినములవరకు జ్వరము రాకుండినయెడల, క్వినీన్‌ను యిచ్చుట తగ్గించవలయును. జీర్ణాశయమందొక్క రేగుదలవలన, క్వినీన్ వాంతివెళ్ళి పోయినయెడల, చేదులేనట్టియు జీర్ణాశయమునందు యిమిడిక నందినట్టియు క్వినీన్‌ను, 12 చుక్కల ఆసిడ్‌తో ఒక ఔన్సు జలమునందు గలిపి, లోనకియ్యవలయును. ఈ విధమగు క్వినీన్ యూక్వినీన్ అందగు. మొదదు అస్వస్థత నందినటు లుండినను, అతివిరేచనము లగుచుండినను, క్వినీన్‌ను యియ్యరాదు.

వ్యాధి యంతటను బలమునిచ్చు దవాహారపదార్థములను యిచ్చుచుండవలెయును. అతినీరసత ఉండిన యెడలనున్నూ, మగత వచ్చునట్లుండిన యెడలనున్నూ, నాలుక ఆరుదల నంది గోధుమవర్ణమును వహించి యుండిన యెడలనున్నూ, నీగసమైనట్టియు చురుకుబారినట్టియు నాడి యుండిన యెడల నున్నూ, సంధుకుణము జనించని యెడలనున్నూ. బ్రాందీని ఒకడ్రాము మోతాదులలో క్రమకాలముల నిచ్చుచుండుట వలన మిగుల ఉపయోగ ముండగలదు. టైఫాయిడ్ జ్వరము క్రింద చికిత్సలో బ్రాందీనిచ్చుటను గురించు యేర్పరచిన పద్ధతుల ననుసరించి బ్రాందీని యియ్యవలయును. రోగి బహునీరసస్థితియందుండినయెడల పరుండియున్న స్థితినుండి లేవనియ్యగూడదు. అవసరమునుబట్టి టింక్చర్ వార్‌బర్గ్‌ను ఉపయోగించవలసి వచ్చినయెడల, ఇంటర్‌మిటెంట్ జ్వరముక్రింద చికిత్సయందు వ్రాయబడిన యీమందు ఉపయోగించు పద్ధతుల ననుసరించి దీనిని వాడవలయును. ఇంటర్‌మిటెంట్ జ్వరమును రెమిటెంట్ జ్వరమును మలేరియల్ జాతివే అయియున్నవి గనుక, ఇంటర్‌మిటెంట్ జ్వరమునందలి చికిత్సనుగూడ యీ సంబంధమున జాగ్రతతో గమనింపదగును.

రెమి టెంటు జ్వరమునకును టైఫాయిడ్ జ్వరమునకును గల భేదములు.

| రెమి టెంటు. | టైఫాయిడ్. |
|---|---|
| 1. జ్వరము అకస్మాత్తుగ వచ్చును. | 1. జ్వరము క్రమముగా వచ్చును. |
| 2. వణకుట యెక్కువ స్పష్టముగా నుండును. | 2. వణకుట కొద్దిగా నుండవచ్చును. |
| 3 మొదటి దినమునందే తరుచుగ శరీర వేడిమి హెచ్చును. | 3. మొదట కొన్నిదినములవరకు శరీర వేడిమి హెచ్చును. |
| 4. ఆరంభమునందు మలబంధముండిపిమ్మట అతివిరేచనము లేర్పడ వచ్చును. విరేచనము నల్లనిపైత్యముతో గూడిన వర్ణమును గలిగియుండును. | 4. అతివిరేచనములు సామాన్యముగ నారంభమునుండియు నుండి, విరేచనము మబ్బురంగుతో గూడిన పసుపువర్ణమును వహించియుండును |
| 5. వాంతి అయినపిమ్మట, ప్లీహజీర్ణాశయముపైన మృదువుగానుండి యుండును. | 5. ప్రేగులు పచ్చిగా నుండి బాధతో గూడియుండును. |
| 6. శరీరముపైన యెఱ్ఱని పొక్కులు కనుపడవు. | 6. శరీరముపైన యెఱ్ఱనిచుక్కలు కనుపడవచ్చును. |
| 7. అనుదినమును జ్వరమునకు తగ్గుదలయేర్పడి తగ్గుదల సామాన్యముగ నుదయమున గలుగుచు, ఒకప్పుడు యితరకాలములయందును గలుగుచుండును. | 7. జ్వరము కొద్దిగా మాత్రమే తగ్గి యిట్లు తగ్గుట సామాన్యముగ నుదయమున నుండును. |
| 8. పచ్చకామాల తరుచుగ సంభవించును. | 8. పచ్చకామాల బహు అరుదుగ వచ్చును. |
| 9. జీర్ణాశయ అస్వస్థతలు సామాన్యముగ నెల్లపుడును ఉండును. | 9. వాంతివచ్చునట్లుండుట, వెక్కిలి, వాంతియగుట, మొదలగు జీర్ణాశయ అస్వస్థతలు అప్పుడప్పుడు కలుగుచుండును. |

రెమిటెంటు జ్వరము టైఫాయిడ్ జ్వరమును తరుచుగ నొకదాని కొకటి భ్రమత కలుగజేయును గాన, యీ రెంటికి నుండెడి ముఖ్యభేదములను యీ పయిన వ్రాసియుండవలసినది.

## ఇన్ఫ్లూయంజా.

ఇన్ఫ్లూయంజా అనునది మిగుల ఉద్రుతమగు, నిర్ణీతమైన, జ్వరముతో గూడిన అంటు వ్యాధి అయియున్నది. ఈ వ్యాధిసంబంధమగు పురుగు ఊపిరిని పీల్చుట ద్వారా శరీరమునందు ప్రవేశించిన తోడనే, తొందరతో ప్రధానముగ నరములపై పనిచేయుటచే, జ్వరము ప్రారంభమయి, నాడి బహుతొందరగా గొట్టుకొనును. ఈ వ్యాధి పుట్టుకతోడనే బహు విరివిగ వ్యాపించును. దీనినిబట్టి యీ వ్యాధిసంబంధమగు పురుగులు వాయువునందే అభివృద్ధినందుచున్నవని తెలియ వీలగుచున్నది.

1773 వ సంవత్సరమునందు యీవ్యాధి ఇటలీ, జర్మనీ, ఇంగ్లాండు దేశములందు వ్యాపించియుండెను. పిమ్మట ననేకమారులు యీవ్యాధి పూర్వార్ధగోళమునం దప్పుడప్పుడు వ్యాపించియుండినను, బ్రిటిష్ దీవులను మాత్రము కొన్నడును దర్శించియుండలేదు. 1389వ సంవత్సరమందు, యీవ్యాధి ఐరోపాఖండమునందు ఇంగ్లాండు సహితముగా పశ్చిమదేశములను ముడిచికొని పోయినపుడు, ఐరోపియను వైద్యశాస్త్రజ్ఞుల దృష్టి యీవ్యాధివైపులకు దిరిగియుండెను. అప్పటినుండియు యీవ్యాధి యెల్లరకు విదితమై, పూర్వార్ధపశ్చిమార్ధగోళముల రెంటియందును వ్యాప్తత నందియుండెను ఇండియాదేశమునందును 1890, 91, 92 సంవత్సరములందు యీవ్యాధి వ్యాపించియుండెను.

చలిగాలివలన నీవ్యాధి కలుగకపోయినను, యిట్టిగాలి యీవ్యాధికి ఉద్యుక్తతను బుట్టించును. సంపూర్ణమగు ఆరోగ్యత లేకపోవుట, జనసమ్మర్ధత అనారోగ్యతను బుట్టించు పరిసరములు — యీకారణములు యీవ్యాధియెడల ఉద్యుక్తతను గలుగ జేయును.

## లక్షణములు.

మిక్కిలి జలుబుచేసి పడిసెము కలుగుట, మిగుల నిస్త్రాణ, ఆయాసము, జ్వరము యివి యీ వ్యాధికి లక్షణములైయున్నవి. సామాన్యముగా దగ్గు ఉండి శ్వాసకోశ సంబంధమగు అస్వస్థత యేర్పడినను, యేర్పడును. తరుచుగా జీర్ణాశయము అస్వస్థతనంది, నాలుక తెల్లబారి, ఆకలియు రుచియు నశించి, వాంతివచ్చునట్లుండి, వాంతియు గలుగవచ్చును. సాధారణముగ ఒడలంతయు నొప్పులతో గూడియుండును. ఒడలు మొదట వేడిగానుండి, పిమ్మట ఉద్రుతముగా చెమటలు పోసి, ఒకవిధమగు వాసన బయలుదేరును బడ్డలయందును. ముదుసలుల యందును, ఈవ్యాధి బహునీరసతను గలుగజేసి, మెదడు యొదురొమ్ములయొక్క అస్వస్థతలకు అనువును గలుగజేయును. వ్యాధియొక్క పరిమితి నాలుగయిదు లేక పండ్రెండు దినములు పట్టును. గుండెరోగము, క్షయవ్యాధి, ఉండియున్న వారలకు యీవ్యాధి తటస్థమైనయెడల ఈగలవలె మరణము నందుదురు. ఈవ్యాధివలన నితరవిధములుగ మరణభయము లేదు.

## చికిత్స.

ఈవ్యాధి తగిలినపిమ్మట అందు సంబంధమగు బాధలనుండి తప్పించుకొన యత్నించుట వృధా అయియున్నది. వ్యాధి తగిలినవెంటనే రోగి పరుండియుండి ప్రతి రెండు గంటలకును ద్రవపదార్థములను ఆహారముగ దీసికొనవలయును. జ్వరతను దగ్గించుటకు సిట్రేట్ ఆఫ్ మెగ్నీసియాను దగు మోతాదులలో పుచ్చుకొన వలయును. జ్వరము తగ్గినపిమ్మట, దినమునకు మూడు మోతాదులుగా 2 లేక 3 గ్రైయినులు క్వినీన్ను యియ్యవలయును. ఈ ఔషధమును యీప్రకారము కొద్ది మోతాదులలోనే యియ్యవలయును గాని యెక్కువగనియ్యకూడదు. ఒడలు నొప్పులకుగాను యీక్రింది ఔషధయోగము నియ్యదగును.

| | | | |
|---|---|---|---|
| ఫెనాసిటిన్ | ... | గ్రైయినులు | 20 |
| టింక్చర్ జెన్సిమియై | ... | మినిములు | 20 |
| స్పిరిట్సు క్లోరోఫారం | ... | మినిములు | 20 |
| జలము | ... | ఔన్సులు | 2 |

అరఔన్సుచొప్పున రెండుగంటల కొకసారి యియ్యవలయును.

సోడా సేలిసైలిస్ 10 గ్రెయినులనున్ను కెఫీన్ సిట్రిస్ 5 గ్రెయినులనున్ను ఒక అరటంబ్లరు జలములో గలిపి దినమునకు రెండు లేక మూడు పర్యాయములు పుచ్చుకొనవలయును.

స్వస్థావస్థగతియందు బలవర్ధకౌషధముల నియ్యవలయును. లైకర్ స్ట్రిక్నీన్ హైడ్రోక్లోర్ 3 మినిములును, ఆసిడ్ ఫాస్ఫారిక్ డిల్యూట్ 10 మినిములును ఒకఔన్సు జలములో గలిపి, దినమునకు రెండు లేక మూడు పర్యాయములకంటె నెక్కువగ బుచ్చుకొనగూడదు. ఎక్కువచిక్కయిన స్థితులు ఘటిల్లినపుడు చురుకుదనమును బుట్టించుటకు బ్రాందీ నిచ్చుట అవసరమగునుగాని, దీనిని కొద్దిమోతాదులలో మాత్ర మియ్యవలయును. హెచ్చుమోతాదులలో నిచ్చినయెడల మెదడునకు అస్వస్థతను బుట్టించును గాన బహుజాగ్రత్తతో నియ్యవలయును.

---

## టైఫాయిడ్ జ్వరము.

సుమారు నాలుగువారముల వఱకును వ్యాపించి, శరీరవేడిమి, ముఖ్యముగా ప్రారంభదశయందు అనన్యసామాన్యమగు గతిని వహించి, పేగులయందు అస్వస్థతామార్పులు కలిగి, సాధారణముగ నుదరభాగముతియు ఉబ్బిగానుండి, అతివిరేచనములు రేర్పడి, చర్మముపైన గులాబివర్ణముగల పొక్కులు కనుపడి, మిగులబలహీనతను గలుగజేసెడి అంటుసంబంధమగు జ్వరము - టైఫాయిడ్ జ్వరమనబడును. దీనికే సన్నిపాతజ్వర మందురు.

ఈజ్వరము పేగులతో సంబంధించిన అస్వస్థతవలన నేర్పడినదగుటచే యెంటరిక్ జ్వరమనియు పిలువబడును. 1829 వ॥ సంవత్సరమునందు లూయీ అను ఫ్రెంచి వైద్యశాస్త్రజ్ఞుడు, యీజ్వరమునకు టైఫాయిడ్ జ్వరమని పేరిడి, యీవ్యాధినిగూర్చి తనప్రసిద్ధమగు గ్రంధమును బ్రకటించెను. ఈజ్వరముయొక్క స్వభావమును లక్షణములును పందొమ్మిదవ శతాబ్దమునందు మాత్రమే పూర్ణముగ గుర్తెరుంగబడెను 1849-52 సంవత్సరముల మధ్య సర్ విలియమ్ జెన్నర్ గారిచే బ్రకటింపబడిన ప్రఖ్యాతవ్యాసములందు యీవ్యాధియందలి లక్షణములు విశేషవివరములతో వ్రాయబడి యుండెను.

### వ్యాప్తత.

సమశీతోష్ణ ప్రదేశములయందు యీవ్యాధి ముఖ్యముగ వ్యాప్తత నందియుండి సామాన్యముగ సంభవించెడి దీర్ఘవ్యాపకజ్వరములలో నిది చేరియుండును. ప్రపంచమునందన్ని భాగములయందును యీజ్వరము విరివిగ వ్యాపించి, ప్రాముఖ్యలక్షణములు దెల్లస్థలముల యందును యొకవిధముగ నుండి, ప్రతి ప్రదేశమునందును ఆయాసంఘముల యొక్క ఆరోగ్యశాస్త్రజ్ఞానమును సూచించును. మురికినీటి యొక్క జలధారుల యందలి లోపమును, త్రాగుట కుపయోగించు జలమునందు మాలిన్యము కలియుటకు అస్పదమును - యీ రెండు అంశములును టైఫాయిడ్ జ్వరసంబంధమగు క్రిముల యొక్క వ్యాప్తత కనుకూలము గలుగజేయును. పెంటకుప్పలు, జనసమ్మర్దము, ధారాళముగా గాలి ప్రసరించుట కాటంకములు

-యీవిషయములు, వ్యాధిశరీరమునందు ప్రవేశించిన పిమ్మట దానిని ప్రతిరోధించుటకుండు మనుజునియొక్క శక్తిని హీనపరచును. వ్యాధిగ్రస్తునినుండి, చేతివ్రేళ్లమూలమునగాని, ఆహారపదార్థముల మూలమునగాని, ఈగల మూలమున గాని, వ్యాధి వ్యాపింప వచ్చును.

ఇంగ్లాండు దేశమునందు 1910 సం॥లో నీవ్యాధివలన 1848 గురు మరణమునంది యుండిరి. ప్రజాసంఖ్య 100 0003,46చొ॥ పడిసిరి పల్లెటూళ్లయందుకంటె పట్న వాసములయందు మరణము లెక్కువై యుండెను.

ఇండియా దేశమునందు యీవ్యాధి విశేషముగా ప్రబలియున్నది. ఏజాతివారలును యీవ్యాధిని గ్రహించుటయందు దూరులై యుండలేదు. మూడు వారములకు మించి వ్యాపించి యెడతెగకుండ నుండు జ్వరములలో నూటికి 80 వంతున టైఫాయిడు జ్వర విషయములగుచున్నవి.

యునైటెడ్ స్టేట్సు (అమెరికా) లో యీవ్యాధి మిక్కుటముగ వ్యాపించి యున్నది, సంవత్సరమునకు 35,000 మొదలు 40,000 వరకు యీవ్యాధినుండి మరణమునందు చుందురని తెలియుచున్నది. సంవత్సరమునకు హీనము 5,00,000 జనమైనను యీవ్యాధికి లోనగుచున్నారనియు దెలియుచున్నది. పట్టణములయందుకంటె పల్లెటూళ్ళయందు యీ వ్యాధి విశేషవ్యాప్తత కలుగుచున్నదని మనము గ్రహించవలయును.

జర్మనీ దేశములో ఆరోగ్య శాస్త్రవిధులను విశేషముగ గమనించు ముఖ్యపట్టణములలో నీవ్యాధి లేదనియే చెప్పవచ్చును. కడచిన 25 సంవత్సరముల లోపలను ప్రష్యాదేశములో నీవ్యాధివలన ప్రతి 10,000 జనమునకును 2 కంటె తక్కువగ మరణము నందుచున్నారు. కొన్నిపల్లెటూరి ప్రదేశములయందు దింకనుయీవ్యాధి వ్యాప్తత నందుచు నేయున్నది.

సైన్యమునందు యీవ్యాధి కలుగజేయు హాని యింతింతని చెప్పుటకు వీలులేదు. ఈ మధ్య జరిగియున్న యిరోపా మహాసంగ్రామమున విశేషజనులు మందుసామగ్రి కారణమున వికలాంగులైనను, జచ్చినను, లోగడ జరిగియున్న యుద్ధములలో మాత్రము యీజ్వర దేవతకే మిక్కుటముగు ప్రాణము లర్పింపబడి యున్నవని నిస్సందేహముగ జెప్పవచ్చును.

స్పెయిను - అమెరికా యుద్ధమునందు, సేనలో దాదాపు అయిదవవంతు అనగా 1,07,973 జనమునకును 20,738 యీజ్వరమునకు లోనై 1,580 మంది మరణమునందిరి. యుద్ధము ప్రారంభమైన 8 వారములలోపుగా 100 కి 90 పటాలములలో వ్యాధి ప్రారంభించెను. అపరిశుభ్రత, ఈగలయొక్క సంచలనము, ధూళిమూలమున వ్యాధి గ్రహణము - యివి ముఖ్య కారణములై యున్నట్లు కమిషనువారు అభిప్రాయ పడిరి.

దక్షిణ ఆఫ్రికా యుద్ధమునందు ఆంగ్లేయ సైన్యము 5,57,653 జనమునకును 57,684 టైఫాయిడ్ వ్యాధిగ్రస్తులు తటస్థమైరి; ఇందు 8,225 మరణించిరి. యుద్ధమునందు తగిలిన గాయముల మూలమున 7,582 మాత్రమే మరణము నందిరి. ఆరుబయటి ప్రదేశమున నంట చేసికొనుటయందు సామాన్యముగ ప్రతిపదార్థమునందును ఆఫ్రికా దేశస్థితినిబట్టి యిసుక లేగిరివచ్చి పడుచుండెడిది. ఈయిసుక యందు మూత్రపురీష మాలిన్యము లుండుట వలన వ్యాధివ్యాప్తత కిరవు యేర్పడెడిది. ఇదిగాక ఈగలు విశేషించి యుండుటవలన నవియు గొంతవ్వరకు ఆహార పదార్థములను త్రాగెడి నీటిని వ్యాధిహేతువులుగ జేయుచుండెడివి.

రుష్యా జపాను యుద్ధమునందు నవీనారోగ్య శాస్త్రపద్ధతులను జక్కగ గమనించుట చేత నీవ్యాధియొక్క తీవ్రత కనుపడియుండలేదు, అంతకుపూర్వము జరిగియున్న యేయుద్ధమునందును యీవ్యాధివిషయమై యింత ముందుజాగ్రతలను బుచ్చుకొని యుండలేదు. అందువలననే యీ యుద్ధమునందు టైఫాయిడ్ మరణములు కొద్దిగమాత్రమే యుండెను.

ఈవ్యాధియొక్క వ్యాప్తత ఒక విధమగు పురుగు అభివృద్ధి నందుటను, ఆపురుగు మనుష్యశరీరమునందు జొచ్చుటకుండెడి అవకాశముల యొక్క అతిశయతలను అనుసరించి యుండును. ఇదిగాక వయసు, లింగము, శీతోష్ణస్థితి, ఋతువు—వీటి ననుసరించియుండును.

వయసు:— ఈవ్యాధి జీవితకాలములో తొంటివయసునందు వచ్చుచుండును. ఎక్కువ విషయములలో 10-25 సంవత్సరముల మధ్యగా గలుగుచుండును. పది సంవత్సరములకు బూర్వవయసునందు గలిగియున్న కొన్ని విషయము లుండియున్నను, పిన్నవయసునందు సంభవించు వ్యాధిగ నిదియెంచబడి యుండలేదు. ఆరునెల్లల వయసునందును అప్పుడుపుట్టిన పిల్లలకును యీవ్యాధి గలిగినకొన్ని సందర్భములు గలవు; నలుబది సంవత్సరములు దాటినపిమ్మట గలుగు విషయములు కొద్దిగా నుండును. ఆరువది సంవత్సరముల పిమ్మట బహు అరుదుగా నుండును. ఆరువది సంవత్సరముల పిమ్మట నీవ్యాధి సంభవించిన యెడల జీవించుట కష్టము. జ్వరము విశేషముగ నుండదుగాని యితరములగు చిక్కులు సామాన్యముగ గలుగుచు న్యుమోనియా వ్యాధికిని గుండె నిలుపుదలకును ఆస్పదము కలుగును.

లింగము:— టైఫాయిడ్ జ్వరమున ఉద్యుక్తతయందు స్త్రీ పురుషులలో భేదమేమియు లేనట్లు కనుపడుచున్నదిగాని, బహుశః పురుషులయందీవ్యాధి కొంచెమెక్కువ పాలుగ గలిగియున్నట్లు తెలియుచున్నది.

శీతోష్ణస్థితి:— టైఫాయిడ్ జ్వరము ప్రపంచమునందన్నిభాగముల యందును ఉండియున్నదిగాని ఒకప్పుడు సమశీతోష్ణ ప్రదేశములం దెక్కువ వ్యాపించియుండునని యెంచబడెను. ఇప్పుడు ఉష్ణదేశములయందు సర్వసాధారణమగు జ్వరముగ గుర్తింప బడియున్నది.

ఋతువు:— శరదృతువునందు కురిసెడి వర్షమువలన యీజ్వర సంబాధమగు విషము తాగునీటియొక్క ఉత్పత్తిస్థానములలోనికి పారుదలయగుటచే నీఋతువునందు యీవ్యాధి ముఖ్యముగ వ్యాపించియుండును.

ఈ వ్యాధి వ్యాప్తతనందుటకు రెండువిధములగు పద్ధతుల నూహింపబడి యున్నవి. మొదటిది:— ఈవ్యాధిఆదివరకు జనించిలేకున్నను జీవసంబంధమగు పదార్థము కుళ్ళి, నీటియందును, పీల్చుగాలియందును గలియుటచే నీవ్యాధి నూతనముగ బుట్టవచ్చునని కొందరి అభిప్రాయమై యున్నది. రెండవది:— ఈ వ్యాధియొక్క స్వభావము ప్రత్యేకలక్షణముల వహించినదనియూ, యీవ్యాధి ఆవహించియున్న విషయము లదివరకు ఉండి యుండనిచో క్రొత్తగ నీవ్యాధి దానంతట అది పుట్టుటకు వీలులేదనియు, పేగులసంబంధమగు మలపదార్థముల మూలమున నీవ్యాధి గొంపోబడునదనియూ, మరికొందరి అభిప్రాయమైయున్నది. ఈ రెండవ అభిప్రాయము జాలమందిచే నామోదము వడసియున్నది.

ఈ వ్యాధి వ్యాపించుటకు మార్గములు.

1. జలము:—టైఫాయిడ్ జ్వరసంబంధమగు పురుగు చాలసమయములలో జలము ద్వారా వ్యాప్తతనందునని చాల కాలముక్రిందనే గుర్తింపబడి యీవ్యాధి యొక్క వ్యాప్తత నీటిసప్లయియందలి దోషమువలన గలిగి యుండెనని కనుగొనబడిన దృష్టాంతములు చాల గలవు.

2. పాలు:—ఏపురుగువల్లనైనను పాలు బహుత్వరితముగా నపరిశుద్ధము చేయబడును. ఈ వ్యాధిచే నంటుచేయబడిన జలమును పాలయందు గలుపుటవల్లనైనను, అట్టి నీళ్ళతో పాలపాత్రలను గడుగుటవల్లనైనను, టైఫాయిడ్ జ్వరరోగిని సంరక్షణచేయుచున్న వారు పాలు పిదుకుట వల్లనైనను, పాల మూలముగా నీవ్యాధి వ్యాపింప జేయబడును.

3. ఆహారము;—ఈవ్యాధి సంబంధమగు అనారోగ్యత నందియున్న జంతువుల యొక్కగాని, యితర జీవపదార్థముల యొక్కగాని, మాంసమును భుజించుటవలన నీవ్యాధి వ్యాపించగలదు. స్విట్జర్లాండు దేశమునందలి పశువులు టైఫాయిడ్ జ్వరసంబంధమగు యీ వ్యాధిని అప్పుడప్పుడు కలిగియుండునట్లు తెలియుచున్నది.

4. వాయువు:—దుర్వాయువు మూలమునను యీవ్యాధి వ్యాప్తతనందునని కొంత కాలముక్రిందట అభిప్రాయము వ్యాపించి యుండెనుగాని, జనసమూహమున నీవ్యాధి మిక్కుటముగ వ్యాపించుననెడి యూహ యెక్కువ స్థితనందిన వెనుక నీయభిప్రాయము అడుగంట ద్రొక్కబడెను. టైఫాయిడ్ రోగియొక్క యెండుదల నందిన విరేచన పదార్థము వాయువునందు గలిసి యూపిరిని పీల్చుటలో నీవిషపదార్థము శరీరమునందు బ్రవేశించుట వలన నొకప్పుడు యీవ్యాధి కలుగుచున్నది.

5. వస్త్రములు:— టైఫాయిడ్ రోగులవలన మలినపర్చబడిన వస్త్రములు కార్బాలిక్ లోషన్ వగైరాలవలన శుభ్రము చేయకుండిన కారణముచే నీవ్యాధి వ్యాప్తత నందగలదు. టైఫాయిడ్ జ్వరము, రోగి దగ్గరకు బోయినంతమాత్రమున, అంటుకొనదు. టైఫాయిడ్ వ్యాధి పీడితులకు సంరక్షణ జేయువారలు, తమ చేతులను శుభ్రముగా గడుగుకొననందువలననున్నూ, లేక ప్రక్కపై నారుదలనందిన రోగియొక్క విరేచనమును దుమారముగా లోనకు బీల్చినందు వల్లనున్నూ, యీవ్యాధిని ఆకర్షించవచ్చును.

6. టైఫాయిడ్ వ్యాధిగ్రస్తులు:— ఒకసారి టైఫాయిడ్ జ్వరముచే బాధనొందిన వారు ఆరోగ్యస్థితి నందియున్నను, కొందరు కొన్ని సంవత్సరముల వరకును నీవ్యాధి సంబంధమగు పురుగులను పిత్తనాళములయందును పేగులయందును గొనిపోవు చుందురు. జర్మనీదేశములో స్ట్రాస్‌బర్గు పట్టణమునం దొక రొట్టెలుచేయు స్త్రీ కొన్ని సంవత్సరముల క్రిందట నీజ్వరముచే బాధనొంది యుండెను. ఈమెయొక్క విరేచనములను బరీక్షించిచూడ విశేషములగు టైఫాయిడ్ క్రిములుండి యుండెను. రొట్టెశాలలోనికి వచ్చు ప్రతి క్రొత్తపనివాడును టైఫాయిడ్ జ్వరపీడితుడగుట తటస్థించెను. ఇద్దరు పనివారలు మరణమును గూడ బొందిరి.

7. ఈగలు:—1898 సం॥ నందలి స్పానిష్ అమెరికన్ యుద్ధములో యీ వ్యాధి వ్యాప్తత గలుగజేయుటయందు ఈగల యొక్క ప్రాముఖ్యతను స్పష్టముగ గ్రహించియున్నారు. ఈగలు టైఫాయిడ్ రోగులయొక్క విరేచన మలముపైనుండి పిమ్మట సైనికుల యొక్క భోజనపదార్థములపై వ్రాలి యీవ్యాధిని వ్యాప్తపరచుచుండెను. తమ ఆహారపదార్థములపై సున్నముతలను వేసియున్న విషయములలో వ్యాధియొక్క వ్యాప్తత తగ్గియుండెను. 1902 సం॥ నందు అమెరికాదేశములో చికాగో పట్టణమునందు యీవ్యాధి విశేషముగ వ్యాపించియున్నపుడు మిక్కుటమగు పరిశోధనలు చేయబడెను. ఒక టైఫాయిడ్ జ్వరపీడితుని గదిలోనున్న ఈగలనుబట్టి పరీక్షించగా యీవ్యాధి సంబంధమగు పురుగులుదొరకెను.

8. పెంటకుప్పలు, దుర్గంధ జలదారులు, మురికి కుండ్లు:— ఇవి వాటంతటయవి టైఫాయిడ్ జ్వరమును గలుగజేయవుగాని, యీవ్యాధి సంబంధమగు పురుగులు సజీవులై యుండుటకును అభివృద్ధి జెందుటకును అనువును గలుగజేయును.

కొందరు జనులు యీ వ్యాధియెడల మరికొందరికంటె దక్కువ ఉన్ముక్తతను గలిగియుండుట బహుశః నిజమైయున్నను, పూర్వ మొకసారి యీ వ్యాధిచే బాధ నొందియుండుట మాత్రము రక్షణను గలుగజేయు ననుటయందు సందియములేదు. ఈవ్యాధి రెండవ సారి గలిగియుండిన దృష్టాంతము లుండియున్నను ఇట్టివి బహు అరుదైయున్నవి. ఈవ్యాధి రాకుండుటకుగాను రైట్ అనునాయన టీకాలు వేయుటను గనిపెట్టెనుగాని, ఇందువలన నుపయోగ మెంతవరకు యుండునదియు ప్రస్తుతములో నిశ్చయింప వీలుగాకున్నది.

అవయవములలోని మార్పులు.

ఈ టైఫాయిడ్ జ్వరసంబంధమగు పురుగులు శరీరమునందలి కొన్ని అవయవములలో నుండుటకు యెక్కువ అనువును గలిగియున్నవని చెప్పుటకు నిదర్శనములుకలవు. ఈఅవయవములు —చిన్న పేగులు, ప్లీహ, కాలిజము, మూత్రగ్రంధులు, శ్వాసకోశములు, అయియున్నవి. కొంతకాలము పిమ్మట నీఅవయవములందు యీ వ్యాధిసంబంధమగు పురుగులు విషముల వెలిబుచ్చుచుండుట వలన నీ వ్యాధియందలి సామాన్య లక్షణములకు కారణమగుచున్నది.

ఈ పురుగు సాధారణముగ నెక్కువ విషయములలో జీర్ణకోశ మార్గముననే శరీరమందు ప్రవేశించునని అభిప్రాయము కలదు. కొన్ని విషయములలో లోనకు పీల్చుగాలి ద్వారా యీ పురుగు శరీరమునందు ప్రవేశించినను, ప్రవేశింపవచ్చును. వ్యాధియొక్క ఆరంభము నుండియు న్యుమోనియా లక్షణములతో గూడియున్న యీ వ్యాధియందు, బహుశః శ్వాసకోశమార్గమున నీపురుగు శరీరమునందు ప్రవేశించి యుండునని మనము తలపవచ్చును.

పేగులు — ఈవ్యాధియందు ముఖ్యముగా పేగులు అస్వస్థతనంది పచ్చిగా నుండును. పేగులలో పుండ్లుపుట్టి తీవ్రమైనావస్థయందు వొకానొకప్పుడు కొంత భాగమునకు రంధ్రములు పడవచ్చును.

ప్లీహ— ఈ అవయవము, వర్ణమునందు నలుపును, వహించి ఘనతనంది, స్వాభావిక పరిమాణముకంటె మూడు లేక నాలుగంతలు పెద్దదిగ నుండును.

గుండెకాయ — ఈ అవయవమునందు స్నాయుపటుత్వము తగ్గి, ప్రాకారస్థానములు అప్పుడప్పుడు పల్చనై యుండును. ఇది తరుచుగా పాలిపోయి దిగువు చెడిన స్థితియందుండును సామాన్యగతులయందు యితర అవయవము లేమియు మార్పు నందవు.

## లక్షణములు.

ఈ వ్యాధిసంబంధమగు పురుగు శరీరమునందు ప్రవేశించిన పిమ్మట, యెంత కాలమునకు వ్యాధి పక్వమునకు వచ్చునదియు, యింకను ధ్రువపరుపబడి యుండలేదు. ఈ కాలపరిమితి ఒక వారము మొదలు మూడు వారములవరకు కొందరిచే చెప్పబడియున్నది. కాలమందు రోగి జబ్బును గ్రహించినను గ్రహింపవచ్చును. లేకపోయినను లేకపోవచ్చును. విస్తార విషయములలో నేయితర జ్వరములయందు కంటెను యీజ్వరమునందు వ్యాధియొక్క ఆరంభదశ బహుసా దుఃఖమును వహించియుండును. వ్యాధినిగూర్చి క్రమవిచారణ చేయుటకు త్వరితముగ నారంభించినను, వ్యాధి సరిగా యేదినమున ప్రారంభమైనదియు నిశ్చయించి చెప్పుట మిగుల కష్టమైయున్నది. వ్యాధి ప్రారంభమయిన పిమ్మటను గూడ రోగి కొంతకాలమువరకు నిటునటు దిరుగుటకు శక్తిని గలిగియుండవచ్చును.

## మొదటి వారమునందలి అంశములు.

వ్యాధియొక్క ప్రారంభదశయందు జలపరముగలిగి అసౌఖ్యతయు బడలికయు ప్రవేశించి ముఖ్యముగా రాత్రులయందు జ్వరమువచ్చినట్లుండును, తలనొప్పి ప్రధానముగా నుండును. ముఖ్యముగా కూర్చుండునపుడు తలతిప్పుట తరుచుగా నుండును. ముక్కువెంబడి కొద్దిగాగాని విశేషముగాగాని రక్తము కారుట యేర్పడి యుండుటతో జ్వరము కూడియుండిన యెడల టైఫాయిడ్ ను గురించి అనుమానించుటకు మంచి కారణముగ నుండును. దాహము ఆకలి లేకపోవుట, అప్పుడప్పుడు జీర్ణాస్వస్థత, యుండును. నాలుక తడిగానుండి, అంచులనున్నూ కొనయందున్నూ యెర్రగానుండి, తక్కిన భాగమంతయు ఒకవిధమగు తెల్లనైన పొరగమ్మియుండును. ఈ కాలమందలి శరీరవేడిమి గమనింపదగిన లక్షణములను వహించియుండును. ప్రతి సాయంకాలమునందును ఒక డిగ్రీ లేక రెండు డిగ్రీలు హెచ్చుదలనంది మరునాటి ఉదయమున ఒకడిగ్రీగాని అంతకు తక్కువగాని తగ్గుదలనంది, ఆ మరునాటి సాయంకాలమునందు పూర్వముకంటెను హెచ్చుదలనంది, అటుపిమ్మట ఉదయమునకు కొంచెము తగ్గుదలను జూపి — యీప్రకారము జ్వరగతి మెట్లపై నెక్కురీతిని అనుదినమును హెచ్చుచుండును.

మొదటివారముయొక్క అంత్యమునకు, సాయంకాలమందు గలుగు శరీరవేడిమి 102 — 103 డిగ్రీలు — లేక, అంతకెక్కుడుగను వహించి యుండును. నాడి చురుకుబారినను, శరీరవేడిమికి దగినట్లుగా చురుకుదల నందియుండదు. నాడి నిండుగనుండి మృదువుగను యుండును. ఒడలు పొడిగా నుండును. మలబంధము తప్పకుండ నుండియుండును. ఉదరము కొంచెముకొంచెముగా విస్తీర్ణత నందియుండును. ప్లీహముయొక్క మాంద్యత అధికమగును. మొదటివారముయొక్క అంత్యమునకు రోగి సాగిలబడిన స్థితిలోనికి వచ్చి, ముఖ్యముగా సాయంకాలమునందు చెక్కిళ్ళ వైపున ముఖము యెర్రబారి యుండును. కండ్లు వికాసతనంది, కనుపాపలు విస్తరింపు నంది యుండును.

### రెండవ వారమునందలి అంశములు.

మొదటి వారమునందలి లక్షణములే. ఉద్ధతను వహించి, రోగి వ్యాధియొక్క పట్టులో నెక్కువగ జిక్కినట్లు కనుపడును. శరీరవేడిమి, 103-104 డిగ్రీలవరకు హెచ్చి, ఉదయమున కొద్దిగ మాత్రమే తగ్గుదల నందుచు, సాయంత్రములందు మొదటివారము కంటె అధికముగ గనబడును. నాడి, సాధుగతులయందు కొంచెము శాంతతను వహించియుండినను కొంతవరకు త్వరితగతిని వహించి యుండును. ఈవారమునందు చర్మముపైన పొక్కులను పుట్టి, యివి అభివృద్ధి నందుచుండును. ఈపొక్కులు కొందరియందు గనుపడక పోవచ్చును. దోమ కాటులవలె నుండినను ఉండవచ్చును. ఇవి క్రమముగా నల్లబడి పోవుచుండును. ఈ రెండవ వారమునందే అతివిరేచనములు పుట్టును. ఈవిరేచనములందు బాధయేమియును నుండక, పేగులయొక్క అస్వస్థత ఉద్రితగతిని వహించినను వహింప వచ్చును. లేక సాధుగతినైనను వహించియుండవచ్చును. విరేచనము గోధుమవర్ణము కలిసిన పసుపురంగుతో గూడి దుర్వాసన గలిగియుండును. ఈ విరేచనమునందు జీర్ణతనందని అహారపదార్థములు, పేగులయందలి కురుపులయొక్క మలినపుతునుకలు ఉండియుండును. టైఫాయిడ్జ్వర వ్యాధిసంబంధమగు పురుగులును యిందుండి యుండును. విరేచనములందు రక్తముండి యుండవచ్చును. అప్పుడప్పుడు విశేషముగ రక్తము పడవచ్చును. ఈస్థితియందు యుదరము యెక్కువవిస్తరింపు నంది యుండును. నాలుకపై బొరగమ్మియే యుండును. కాని అరుదలనంది చీలికల దీసియుండును. ముఖ్యముగా రాత్రులందు సాధువగు సంధిగుణము పుట్టవచ్చును. పగటియందు మానసికస్థితి క్రమముగనుండి, బహుశః యీసందర్భమందు సామాన్యముగ గలుగు చెవుడు మూలమున, రోగి మాంద్యతను వహించి నిర్లక్ష్యముతో గూడియుండును.

### మూడవ వారమునందలి అంశములు.

రెండవ వారమునందలి లక్షణములే మూడవ వారమునందును సామాన్యముగ అత్యుద్రిత గతియందు నడచుచుండును. శరీరవేడిమి కొంచె మెచ్చుతక్కువగా నెల్లప్పుడును విశేషించియే యుండి, ఉదయవేళలయందు మాత్రము కొంచెముగా తగ్గుదల నందుచుండును. నాడి నిమిషమునకు 110-120 వరకు తొందరతో నడచు చుండినను, నీరసతను వహించి యుండును. రోగి, ప్రక్కనంటుకుని పరుండి, నిశ్చింత భావముతోడను నీరసతతోడను జాచుచుండును. రోగి కష్కించి, ప్రయత్నముమీద స్నాయువులు వణకుచున్నందును; కునుకు నిద్ర అధికమయి, మెల్లగా గొనుగుటతో గూడిన సంధిగుణము జనించును. శ్వాసకోశసంబంధమగు రక్తముయొక్క కూడిక వలన, అధికమగు ఉచ్ఛ్వాస నిశ్వాసములతో గూడిన దగ్గు తరుచుగా నేర్పడును. ఈవారమునందే, యీజ్వరముయొక్క యెక్కువ చిక్కుదల అవస్థలు, అనగా, రక్తముపడుట, పేగులయందు రంధ్రము యేర్పడుట — తటస్థించుట కాస్పదము కలుగును.

### నాలవ వారమునందలి అంశములు.

జ్వరము సర్వసాధారణముగా నాలుగవ వారమునందు తగ్గుదల నందుచుండును. శరీరవేడిమి, ఉదయమునందు యెక్కువగా తగ్గుదలనంది, సాయంకాలమునందు వెనుకటంత

ఆధిక్యతనందక, యుండును. రోగి, యెక్కువ నీరసతను వహించి యున్నను, అన్ని యితరలక్షణములందును అనుకూలమగు మార్పులు గలిగి, రోగి స్వస్థావస్థస్థితిలోని కభివృద్ధి జెందుట కారంభమగును. ఈ గతియందును జ్వరలక్షణములు కొద్ది కాల పరిమితులవఱకు మరల గలుగుట కారంభించి, అప్పుడప్పుడు స్పష్టమైన పునఃప్రకోపగతిని అవలంబింప వచ్చును.

కొన్ని విషయములందు నాలుగవ వారమునందలి అంశములేమియు మార్పునందకయే జ్వరము అయిదు లేక ఆరవ వారమువరకును తగ్గుదలనందు సూచనలు కనుపడక యుండును, అట్టి విషయములలో రోగి మిగుల శుష్కించి నిస్త్రాణ నందియుండును.

### ముఖ్య లక్షణములయొక్క పరిశీలనము.

ఆరంభము:— ఈ వ్యాధియొక్క ఆరంభదశ వివిధవిధములుగ నున్నది. కొన్ని విషయములలో జ్వరముయొక్క ఆరంభమే తెలిసికొనుట వీలులేకుండగ నుండును; మరికొన్ని విషయములలో, ఆరంభమునందే యితరవ్యాధి లక్షణములతో గూడి యుండుటవలన నీవ్యాధిని నిర్ణయించుటకు గష్టముగా నుండును. ఒకప్పుడు శ్వాసకోశ సంబంధమగు న్యూమోనియా వ్యాధిలక్షణములు ఆరంభమునందే గనబడవచ్చును. బిడ్డలయందు మెదడు సంబంధమగు అస్వస్థతలుకలిగి, యీవ్యాధిని పొరబుచ్చవచ్చును. జ్వరము ఉండియున్నను, రోగి, తిరుగుచునేయుండి, రక్తస్రావముగాని పేగులయందు రంధ్రము పడుటగాని తటస్థించునంతవరకును, టైఫాయిడ్ జ్వరమని తెలిసికొనుటకే వీలు లేకుండును.

శరీరవేడిమి:— జ్వరగతియే టైఫాయిడ్ జ్వరముయొక్క ముఖ్య చిహ్నములలో నొకటియై యున్నది. జ్వరముయొక్క ప్రథమగతియందు హెచ్చుట, రెండవగతియందు యెడతెగకుండుట, మూడవ గతియందు తగ్గుట— యీ లక్షణము లుండియున్నవి. ఉదయ వేళలయందు కొద్దియో గొప్పయో జ్వరము తగ్గుదలనందుట యీ వ్యాధియొక్క ముఖ్యలక్షణమై యున్నది.

మొదటి వారమునందు ప్రతిదినము సాయంకాలమును వెనుకటి దినముకంటె నెక్కువ శరీరవేడిమి కనబడుచు, ఉదయమున కొద్దిగా తగ్గుదలనందుచు, వారముయొక్క అంత్యమగుసరికి సాధారణముగ శరీరవేడిమి ఉన్నతదశ నందును. రెండవ వారమునందు, శరీరవేడిమి యెక్కువ పట్టుదలతో నున్నతదశయందుండి, ఉదయపు వేళలయందు కొద్దిగా మాత్రము తగ్గుచుండును. మూడవ వారమునందు జాలవరకు యిదేప్రకారముండి, అటుపిమ్మట ఉదయమునందలి తగ్గుదలలు విశేషముగనుండి సాయంత్రమునందలి హెచ్చుదలలు అంత విశేషముగ నుండవు.

నాలుగవ వారమునందు, ఉదయపువేళ శరీరవేడిమి సామాన్యముగ స్వాభావిక స్థితిలోనికి దిగి, సాయంకాలమందు కొద్దికాల పరిమితియందు మాత్రమే హెచ్చుదలనంది, త్వరలో నీగతి మారిపోయి క్రమముగా నారోగ్యతయందలి స్థితిలోనికి వచ్చును. ఒక వారము దినములవరకు శరీరవేడిమి ఉదయమునను సాయంకాలమునను ఒకేవిధముగా నుండిన యెడల, వ్యాధి అంత్యము నందినదని యెంచవచ్చును. కాని, యీస్థితియందు వ్యాధి తిరుగబెట్టుట అసామాన్యము కానేరదు.

జ్వరముయొక్క అభివృద్ధియందు అనుదినమును శరీరవేడిమిని బరీక్షించుటలో రాత్రి యొనిమిదిగంటలకును పండ్రెండు గంటలకును మధ్యకాలములో నున్నతరగతి నందియుండు ననియు, ఉదయము ఆరు గంటలకును యొనిమిది గంటలకును మధ్యకాలములో క్షీణగతి నందియుండుననియు, సాధారణముగ గనుగొననగును.

అతివిరేచనములు ప్రాముఖ్యలక్షణముగా నున్న విషయములో శరీరవేడిమి అత్యున్నతదశనంది తరుచుగా నెక్కువ తగ్గుదలలు కనుపడవు. ప్రేగులయందు రక్తస్రావము కలిగినచో, శరీరవేడిమి యందు ఆకస్మికమయినట్టియు, గుర్తింప దగినట్టియు, తగ్గుదల వెంటనే కనబడును.

శరీరవేడిమి 106 డిగ్రీలను అంతకు పైనయును ఉండుట సాధారణములు కావు; ఇట్లుండినచో అపాయకరముగ నెంచనగును. స్వస్థావస్థయందు భోజన పదార్థములయందు మార్పువలనగాని, లేచి తిరుగుటవలనగాని, శరీరవేడిమియందు క్రమముగ నుండవలసిన దానికంటె కొంచె మెచ్చుతగ్గులు కలుగవచ్చును; ఈస్థితియందు శరీరవేడిమిని దరుచుగ బరీక్షించుట మంచిది.

రక్తప్రచారము:— వ్యాధి అతిశయత నొందిన కొలదిని నాడి యెక్కువ దరుచుగ గొట్టుకొనుచు, అతివిరేచనము లుండినయెడల, యింకను యెక్కువగ నుండును. నాడి మొదటలో నిండుగను మృదువుగను నుండి, పిమ్మట సన్ననై యుండును. జ్వరముయొక్క తదనంతర గతులయందు నాడి అస్థిరతనొంది క్రమము దప్పినదై యుండును. పెద్దవారలయందు నిమిషమునకు 130 సంఖ్య దాటినయెడల అదుర్దాను జెందవలసి యుండును.

రక్తస్రావము కలిగినయెడల నాడియొక్క సంఖ్య అధికమయి శరీరవేడిమి దగిపోవును; ప్రేగులయందు రంధ్రము పడినయెడల రక్తప్రచారమునందు క్షీణగతియొక్క లక్షణములు కనుపడును. స్వస్థావస్థయందు శరీరవేడిమి నెంతశ్రద్ధతో బరీక్షించుట యవసరమో నాడినికూడ అంతే శ్రద్ధతో బరీక్షించుట అవసరమయి యున్నది.

టైఫాయిడ్ జ్వరముయొక్క ఫలితముగ నొకప్పుడు యేదైన నొక కాలికుబోవు అపరిశుద్ధరక్తనాళమునందు రక్తముగడ్డకట్టుటవలన రక్తప్రచారమునకు కొంతవరకు అటంకము కలిగి ఆ కాలు వాయుట తటస్థించును. ఈవ్యాధి సామాన్యముగ నెడమ కాలునకు తటస్థించును. ఇది జ్వరముయొక్క అంతిమభాగమునందయినను, స్వస్థావస్థయందయినను దటస్థించును. ఇది బాధకరమయినను సామాన్యముగ నపాయముతో గూడియుండదు.

శ్వాసావయవములు:— జ్వరాస్వస్థత లనేకము లందువలెనే వ్యాధి అభివృద్ధినందిన కొలది ఉచ్ఛ్వాస నిశ్వాసము లధికము లగుచుండును. కొన్ని శ్వాసకోశ సంబంధమగు అస్వస్థతలు సామాన్యముగ గలుగవచ్చును. రొమ్ముపడిసెము సాధారణముగ గలుగుచు, దగ్గుతోగూడ నెమదనసూతియగు గురక ఉండవచ్చును.

జీర్ణావయవములు:— నాలుక యొక్కస్థితి యిదివరకే వివరింప బడియున్నది. అట్టి పరిస్థితియందు గొంతు యొక్క రేగుదల స్థితివలన, మ్రింగుట కష్టముగా నుండవచ్చును. దాహము, ఆకలి లేకపోవుట, ముఖ్యలక్షణములై యున్నవిగాని, సాధుగతులయందవి కాక

రావు. ప్రారంభగతియందు, సామాన్యముగ వాంతి యుండదు. కాని, వాంతి యగుట యుద్రుత స్థితిని వహించగనే, వ్యాధి మీరుచున్నదని గ్రహింప వలయును.

అతివిరేచనములు, టైఫాయిడ్ జ్వరముయొక్క సూచన లక్షణమే గాని యిది యెల్లప్పుడును ఉండ నేరదు. ఇది అప్పుడప్పుడు ఆరంభము నుంచియే యుండును. గాని సాధారణముగ రెండవవారమునందు గనబడి జ్వరముయొక్క అంతము వఱకును, లేక, వ్యాధి తిరుగ బెట్టినపుడు మరల రావచ్చును. విరేచనముయొక్క పరిమాణము చాలవఱకు మారుచుండును సరాసరిన దినమునకు నాలుగు లేక అయిదు పల్చని విరేచనము లగును. ఉద్రేకగతులయందు పది మొదలు యిరువది వఱకు నుండును. ఈ అతివిరేచనములయొక్క యుద్రుతి పేగులయొక్క పుండును బట్టియుండునని చెప్పుటకు వీలు కాకపోయినప్పటికిని, దీని కిదియే అపాయకరమై తరుచుగా మరణమును గలుగజేయుచున్నది. కొన్ని విషయములలో నారంభమునుండియు మలబంధ మేర్పడియుండును. విరేచనకారుల నిచ్చుటవలన అతివిరేచనముల గలిగించును. గాన, దీనికై బహుజాగ్రతతో చికిత్సను జేయవలసి యుండును.

అతివిరేచన మూలముననగాని, యితర కారణముల మూలముననగాని ఉదరము విస్తరింపు నొందుట మిగుల అసౌఖ్యతను గలుగజేయును. ఇది తరుచుగా సంభవించుట, ఉద్రేకలక్షణముల గనబరచుచు, పేగులయందు రంధ్రము కలుగుటకు, యెక్కువవీలును గలుగ జేయుచున్నది.

టైఫాయిడ్ జ్వరముయొక్క అన్ని లక్షణములయందును పేగులయందు రంధ్రము పడుటయే మిగుల భీతినందవలసిన అంశమయి యున్నది. అయితే యిట్టివిషయములు నూటికి రెండు మూడు కంటె నెక్కువగ దటస్థించుట లేదు. అతివిరేచనములు, రక్తస్రావము, ఉదరముయొక్క విస్తరింపునందుట — యీ మూడు లక్షణములును ప్రాముఖ్యముగ నుండినపుడు సామాన్యముగ నిది దటస్థించును. కాని అప్పుడప్పుడు యిది మలబంధము మొదటి నుంచియు ఉండియున్న స్థితులయందును గలుగుట కలదు. ఇది చాల ఆలస్యముగ అనగా సాధారణముగ మూడవవారము లేక నాలుగవవారమందును, ఒకప్పుడు స్వస్థావస్థయందును, వ్యాధి తిరుగబెట్టిన యవస్థయందును, గలుగుచుండును. మనకు స్పష్టముగ గనబడు సన్నిహిత కారణ మేమియు లేకుండగనే యిది కలుగవచ్చును. మరియొకప్పుడు ఆహారపదార్థము నందలి లోపము వలనను, వాంతియగుట యందలి శ్రమమువలనను, విరేచనమగుట యందలి ముక్కుట వలనను, ప్రక్కనుండి ఒత్తిగిలుట వలనను, — యీ రంధ్ర మేర్పడుట దటస్థింప వచ్చును. ఈ అస్వస్థత కలుగగనే, ఉదర భాగమునందు ఆకస్మికముగ విశేషబాధ కలిగి, యీ బాధ శరీరమంతటను వ్యాపించి, వాంతి అయి క్షీణగతిలక్షణములతో ముగియును.

మూత్రము:— అన్ని జ్వరములయందును ఉండునటులే మొదలుగా యీ జ్వరమునందును మూత్రమునందలి ఘనపదార్థము లధికములయి నల్లని వర్ణమును వహించి యుండును. జ్వరము తీవ్రత వహించిన కొలదిని యూరియా యూరిక్ ఆమ్లములు అధికము లగుచుండును. శ్వేతధాతువు కొద్దిగ నుండవచ్చును.

నరములు:— ఆరంభమునందు గలుగు తలనొప్పిని గూర్చి యిదివరకే వ్రాయబడి యున్నది. సాధుగతులయందు సంధిగుణము లేకుండగనే యుండవచ్చును. సామాన్యవిషయ

ములందు మొదటి భాగమునందు పిమ్మట రాత్రులయందలి సంధిగుణము సాధారణాంశమే అయియున్నది. ప్రారంభగతియందు దాకానొకప్పుడు కాళ్ళు పట్లు పట్టవచ్చును. ఈ వ్యాధి యందు మూర్ఛలు కలుగుట బహుఅరుదై యున్నది. చెవుడు, ఒకప్పుడు ఒక చెవియందు మాత్రమును, మరియొకప్పుడు రెండు చెవులయందును, యేర్పడవచ్చును. ఈ చెవుడు పిమ్మట నెమ్మదించి పోవును. స్థిరమగు చెవుడు యేర్పడుట బహు అరుదైయున్నది. దృష్టి యందస్వస్థత గలుగదుగాని, కనుపాపలు విస్తరింపునంది కన్నులు కొంతవఱకు మెరయు నట్టి స్థితిలో నుండును.

జ్వరముయొక్క తిరుగ బెట్టుట.

స్వస్థావస్థయందు దాకానొకప్పుడు వ్యాధి తిరుగ బెట్టవచ్చును. ఈ కాలమందు ఆహారమునందలి మార్పులవలనను, స్పష్టమగు నితర కారణములవలనను, గలిగెడి సూక్ష్మమగు శరీరముయొక్క అధిక వేడిమికిని, జ్వరముయొక్క తిరుగబెట్టుటకును, భేదమును గమనించవలసి యుండును. వ్యాధియొక్క పెద్దపాటులయందు యీ తిరుగబెట్టుట సామాన్యముగ దటస్థించుచుండును. దీనియందును మొదటిదెబ్బ కనుపడిన లక్షణములే మరల గనుపడును. శరీరవేడిమి క్రమముగా నధికమగుచు నాడియొక్కయు అరుదలనందిన నాలుకయొక్కయు, అతివిరేచనములయొక్కయు, లక్షణములు వెనుకటివలెనే యుండును ఈగతి మొదటి కాల పరిమితి కంటె దక్కువగానుండి గుణములయందును, సాగుత్వమును వహించియుండును. కాని దీని వలన రోగి విశేషముగ కష్టించినను, చాలవిషయములలో స్వస్థత నందవచ్చును. కొన్ని విషయములలో మాత్రము అతిసారము, రక్తస్రావము, పేగులలో రంధ్రము పడుట, వీటివలన మరణము సంభవించును.

సులక్షణములు.

రాత్రులయందు 103 డిగ్రీలకు హెచ్చునట్టియు, ఉదయపువేళల బాగుగా తగ్గుచుండునట్టియు సామాన్యజ్వరము పెద్దవారలయందు (నిమిషమునకు) 100 కి హెచ్చునట్టియు బిడ్డలయందు 120 కి హెచ్చునట్టియు నాడి, చెమ్మతోగూడినట్టియు యెఱ్ఱవగా మారగమ్మినట్టియు నాలుక; మెత్తనైనట్టియు, సహజమైనట్టియు, ఉదరము, చిక్కుస్థితుల లేక పోవుట — యివి అన్నియు సుగుణములుగా నెంచదగును. వీటికి దోడుగా రోగి శుభ్రముగా నిద్రించును, ప్రక్కలో దనంతటతాను కదలుటకు శక్తిగలిగియుండినయెడల, కొంత వరకు నమ్మకముతో వ్యాధి కుదురుబాటునందునని చెప్పవచ్చును. కాని మిగుల సాధువైన విషయములందుగూడ రక్తస్రావము, పేగులయందు రంధ్రముపడుట, ఒకప్పుడు తటస్థపడును గాన సాయంకాలమునందలి శరీరవేడిమివరుసగా పదిదినములవరకును మామూలుగా నారోగ్యతయందుండు స్థితిని వహించి యుండునంతవరకును అపాయమునుండి పూర్ణముగా దొలగి యుండినట్లు యెంచగూడదు.

దుర్లక్షణములు.

రోగి మత్తుగానుండి, సంధిక్షణము వహించి, ప్రక్కలో గదలుటకు శక్తిలేక వెల్లకిలి పరుండి యుండిన యెడల - దుర్గుణముగా నెంచదగును. వాంతియగుట, మూత్రము నిలుపయుండుట, మూత్రమును మలమును వెలువడుటయందు రోగియొక్క స్వాధీనము తప్పి

యుండుట, ఎడతెగని చెవుడు, ఉద్రేకమగు అతివిరేచనములు (దినమునకు 10 లేక 12 – ఇవి అన్నియుగూడ చెడులక్షణములుగా దలంప వలయును. 120 కి మించియున్న నాడియును నిర్లక్ష్యము చేయతగినది కాదు. నాడి 130 ని మించియున్నయెడల అపాయము సమీపించి యున్నదని గుర్తింప వలయును, శరీరవేడిమి 104 డిగ్రీలుగాని అంతకు మించిగాని ఒకే విధముగానుండి, ఉదయమున స్పష్టమయిన తగ్గుదల లేకుండినయెడల, కఠినమయిన విషయముగా నెంచవలయును. మూడవవారమునందీ శరీరవేడిమి వ్యాపించియుండి తగ్గుదల లక్షణములు కనుపడకుండినయెడల వ్యాధి బహుశః యిరువదియెనిమిది దినములవరకును వ్యాపించును. దీనితో పైన జెప్పబడిన దుర్గుణములు కనుపించియున్న యెడల, నెమ్మదిని కొందుటను గురించిన ఆశలు వదలుకొనవలసి యుండును.

పొక్కులుగాని, చుక్కలుగాని, శరీరముపై వ్యాపించియుండునంతవరకును, వ్యాధి నెమ్మదించునని యనుకొనుటకు వీలులేదు.

రక్తస్రావము మొదటి పదిదినములు దాటినవెనుక కలిగిన యెడలనున్నూ, శరీరవేడిమి యెక్కువగా తగ్గుదలనంది తిరిగి హెచ్చుకవయిన యెడలనున్నూ, యిందునుగురించి యెక్కువగా నాలోచించవలసి యుండును. అయితే, నలుబది యెనిమిది గంటలలోగా మరలి రాకుండ, శరీరవేడిమి మామూలుస్థితికి వచ్చియుండిన యెడల, ఉపద్రవములేదు.

పేగులయందు రంధ్రము పడుటవలన సాధారణముగా నెల్లప్పుడును ప్రాణాపాయముతో గూడియుండును. ఇది దానంతట అదియే సర్దుకొనుట బహు అరుదైయున్నది. శస్త్రముచేసి బాగుచేయుట యైనను బహు కష్టమయియున్నది.

ఈ వ్యాధియందు తిరుగబెట్టుట, సామాన్యముగ సాధుగతిని వహించి యుండును. ఈ స్థితియందు నెమ్మదించుట యెక్కువ కష్టములోనిది కాదు. తిరుగబెట్టు స్థితియందు సాధారణముగ నొకపక్షముకంటె నెక్కువగా నుండనేరదు.

న్యూమోనియా సంబంధమగు చిక్కులు కలిగినయెడల మరణము చాలవరకు నిశ్చయమే అయియున్నది. గర్భిణి ఉండియున్నయెడల, శిశువునకు ప్రాణాపాయము కలుగుటయే గాక, తల్లికిని చాల అపాయమును గలుగజేయును. టైఫాయిడ్ జ్వరము, ప్రసవసంబంధమగు స్థితితో గూడియుండినయెడల, విశేషముగా నెంచ వలసి యుండును.

### ఇతర వ్యాధులతో గూడియుండుట.

స్వస్థావస్థయందు మాత్రమె సామాన్యముగ గనిపించునట్టి దద్దుర్రోగము (Erysipelas) యీ టైఫాయిడ్ వ్యాధితో బహుఅరుదుగా గలిసియుండును. జ్వరావస్థయందుగాని స్వస్థావస్థయందుగాని పొంగు కనుపడవచ్చును. బిడ్డలయందు ఆటలమ్మ కనుపించిన విషయములు గలవు.

చలిజ్వరమును టైఫాయిడ్ జ్వరమును ఒకేకాలమందు రోగి ననుసరించి యుండవచ్చును. యీ రెంటిని గలిపి యొకటిగా నెంచి చికిత్సజేయు ప్రయోజనముండజాలదు.

టైఫాయిడ్ జ్వరమునకు ముందుగా ఇన్‌ఫ్లూయంజా లక్షణములు కనుపడ వచ్చును. లేక, రెండును యేకకాలమందు శరీరము నావహించి యుండవచ్చును.

క్షయవ్యాధి టైఫాయిడ్ వ్యాధితో గలిసి యుండవచ్చును. క్షయవ్యాధిగ్రస్తుడు టైఫాయిడ్ జ్వరమును గ్రహింపవచ్చును.

టైఫాయిడ్ జ్వరము తీవ్రదశయందుండినపుడు అతిమాత్ర రోగియొక్క మూత్రము నందు మధుపదార్థము కనుపడక పోవచ్చును.

### టైఫాయిడ్ జ్వరములో తరగతులు.

ఈ జ్వరమునందలి పలువిధములగు గుణలక్షణములను బట్టి వ్యాధిని శీఘ్రముగా గుర్తించుట కష్టసాధ్యమయి యున్నది. ఈజ్వరము అనేకవిధములుగా పరిణమించుచుండును, కొన్ని విషయములలో సామాన్య జ్వర లక్షణములే ఉద్రుతావస్థయందుండును. ఇంకొన్నిటిలో వ్యాధి యొక్క నడకయందు మార్పుదల కలుగుచుండును. మరికొన్నిటిలో కొన్ని ప్రత్యేక అవయవములపై విషప్రయోగ మగుటవలన చిక్కుదల స్థితులు కలుగును. మెదడు సంబంధమగు నస్వస్థత యొకప్పుడు యేర్పడును. మూత్ర గ్రంథులొకప్పుడు చిక్కుదల స్థితిని వహించును. శ్వాసావయవము లొకప్పుడు అనారోగ్యతను జెందియుండును. ఈవ్యాధి ప్రత్యేకించి యొకమార్గమున నడచునని చెప్పుటకు వీలైనదికాదు. వివిధములగు నస్వస్థతలను యొకప్పుడు కొద్ది తోడనే సమాప్తి నంద వచ్చును; లేక, మరియొకప్పుడు తీవ్రములయి యుండవచ్చును. ఇట్టి అనేకమార్పులు కలిగిన లక్షణములను వహించిన యీవ్యాధిని గుర్తించుటయం దొకప్పుడు వైద్యులు పొరబడ వచ్చును గాన మిగుల బుద్ధికుశలత నుపయోగించవలసి యుండును. టైఫాయిడ్ జ్వరమును యీక్రింది 5 తరగతులుగ విభజింపవచ్చును.

1. సామాన్యమగునట్టియు అనపాయమైనట్టియు తరగతి:— ఇందు జ్వరము వచ్చినను, రోగిని పడక వేయుట కవసరము లేకుండ జేయును. బిడ్డలలో ముఖ్యముగా నిది అకస్మాత్తుగా రావచ్చును. వ్యాధిలక్షణములు సూక్ష్మములై, నాడిసంఖ్య విశేషముగ నుండక, జ్వరము అరుదుగా తప్ప 102 డిగ్రీలకు మించకుండ నుండును. సామాన్యముగా ఒడలుపైన గులాబీచుక్కలు గనబడును. ఈచుక్కలు తెల్లవారలయందు మాత్రమే ముఖ్యముగ గనబడును గాని, ఇండియాదేశపు జనులయందు కనుపడుట అరుదైయున్నది. ప్లీహ యొక్క అభివృద్ధియు కనుపడును. అతివిరేచనము లరుదైయున్నవి. ఈవ్యాధియందు తిరుగబెట్టుటయు ఉండియున్నది. ఇట్టి సామాన్య విషయములలో నజాగ్రతను వహించుటవలననే సంఘము నందు యీ వ్యాధి చిరకాలముగ వ్యాపించుటకు మార్గ మేర్పడుచున్నది.

2. అపాయకరమగు తరగతి:— ఉద్రుత జ్వరము, స్పష్టమగు మెదడు యొక్క అస్వస్థతలు, యీ తరగతియొక్క లక్షణములై యున్నవి. న్యుమోనియా వ్యాధితోడను, మూత్రగ్రంథుల యొక్క అస్వస్థతతోడను, ఉద్రుతమగు జీర్ణాశయాస్వస్థతలతోడను, మెదడు సంబంధమగు నస్వస్థతల తోడను, ప్రారంభమగు కఠినజాతులు యీ తరగతియందు కలిసి యుండును.

3. అంతర్గత తరగతి:— ఈ తరగతియందలి లక్షణములు సామాన్యముగ సూక్ష్మములై, రోగి పడకవేయుటకు దగినంత వ్యాధితీవ్రత కనుపించదు. రోగి బడలిక జెంది, బహుశః

కొద్ది అతివిరేచనములు గలిగి, వ్యాధిగతియం దంతటను తనవసుల జేసికొనుచు, తిరుగుచు నుండును. ఈతరగతియందే కొన్ని విషయములలో నకస్మాత్తుగ సంధిగుణము జనింపవచ్చును. ఈ అంతర్గతతరగతి విషయములలో నొకప్పుడు రక్తస్రావమేగాని లేక పేగులయందు రంధ్రముపడుటగాని మొదటగా గుర్తింపదగిన లక్షణముగా నేర్పడవచ్చును. ఈ వ్యాధియందు సరియైనచికిత్స లేకుండ వ్యాధిగ్రస్తుడు దూరప్రయాణము చేసిన విషయములో నిట్టి అపాయస్థితులు సంభవించునని సర్ విలియమ్ జెన్నరుగారు చెప్పుచున్నారు.

**4. రక్తస్రావ తరగతి:**—ఇది అరుదైయున్నది ఆరంభమునుండియే రక్తస్రావము అధికమై యుండవచ్చును; కాని, యెక్కువ సామాన్యముగ వ్యాధియొక్క మధ్యగతియందు స్రావము తటస్థమగును. ఈతరగతియందు నిశ్చితముగా మరణము కలుగు ననుకొనవగును.

5. జ్వరములేని టైఫాయిడ్:— కొందరు వైద్యగ్రంథకర్తలు జ్వరము మాత్రము లేకుండ తక్కినలక్షణములుండిన టైఫాయిడ్ వ్యాధిని ఒప్పుకొని యున్నారు. ఈ రోగికి, బడలిక, మాంద్యము, తలనొప్పి, పాచిడుకట్టిన నాలుక, ఆకలి లేకపోవుట, నాడియొక్క మాంద్యత, ఒడలుపై చుక్కలు, వృద్ధినొందిన ప్లీహ — యీ లక్షణములన్నియు, నుండును. ఇట్టి యొక్క విషయములో పదునారవదినమున శరీరవేడిమి మామూలునవలెనే యుండియున్నట్లు సర్ విలియం ఆస్లరుగారు చెప్పుచున్నారు.

## టైఫాయిడ్ రోగిని విడిగ నుంచవలయునా ?

కుటుంబములోని యితరులెవ్వరును (రోగి కుపచారముల జేయుటయందు యోగ్యము లేనివారలు) సాధ్యమయినంతవరకు రోగి పరుండియుండు గదిలోనికి బోకుండ నుండుటయే శ్రేష్ఠమని చెప్పవచ్చును. ఉపచారకులు, యీవ్యాధియందు 'ముందు జాగ్రతలు' అనుశీర్షిక క్రింద వ్రాయబడిన యంశములను ముఖ్యముగ గమనింపవలయును. రోగి కుదిరికనందిన పిమ్మట గదియంతయు శుభ్రపరచి సున్నమును గొట్టవలయును.

కడచిన కొద్ది సంవత్సరములలో, జర్మనీదేశమునందు, యీవ్యాధిని గుర్తించిన విషయములలో సాధ్యమైనంతవరకు ముందుజాగ్రతలను బుచ్చుకొని, రోగినుండి వ్యాధి యితరులకు వ్యాపింపకుండ జేయుటకు అవసరమగు కట్టుదిట్టములను సలిపి పనిచేసి యున్నారు. ఈవ్యాధి మిక్కుటముగ వ్యాపించియున్న ట్రియరు అను నొక జిల్లాయందు డాక్టరు కోచ్ గారు కొంతమంది సహాయవైద్యులతో నొక పరిశోధనశాల నేర్పరచి, యచ్చటనున్న ప్రతి టైఫాయిడ్ రోగిని విడిగానుంచి, వ్యాధియొక్క అంటువల్ల కొంతమాత్రమును ఆస్పదము లేకుండునటుల జాగ్రతలను బుచ్చుకొనుచు, యీవ్యాధి సంబంధమగు పురుగుల నన్నివిధములచేతను హతము గావించుచు, మూడుమాసములలో నాచుట్టుప్రక్కల నెక్కడను టైఫాయిడ్ పురుగుగాని ఆవ్యాధిగాని లేకుండ రూపుమాపిరి.

## చికిత్స.

టైఫాయిడ్ జ్వరముచే బీడింపబడుచున్న రోగికి, సంరక్షణ చేయుటయందును, ఆహారము నిచ్చుటయందును, తగు జాగ్రత్తలు బుచ్చుకొనుట, యీవ్యాధి యందలి చికిత్స

లోని ప్రధానాంశమయి యున్నది. రోగిని, విశాలమయినట్టియు, గాని ధారాళముగా రాదగినట్టియు, గాలియొక్క రాకపోకలకు దగిన యేర్పాటులు జేయబడి యున్నట్టియు, యొక గదిలో నుంచవలయును. కిటికీ మార్గమున గాని యితరమార్గమున గాని గాలి స్వేచ్ఛగా వచ్చుచుండినను, యీ గాలియొక్క ఉద్ధృతి రోగిపై దగులకుండు స్థలమున, రోగిని పరుండబెట్టి యుంచవలయును. పాన్పు యెక్కువ మెత్తగా గాని, యెక్కువ గట్టిగా గాని, యుండకుండ నుండవలయును. ప్రతి నాలుగుగంటలకు గాని, అవసరమైతే అంతకు దక్కువ కాలమునకే గాని, శరీర వేడిమిని తెర్మామీటరుతో చూచికొనుచు, వ్రాసి యుంచుకొన వలయును; ఆహారము నెప్పుడెప్పు డిచ్చినదియు, యెంతెంత యిచ్చినదియు, రోగి యెంత కాలము నిద్రించి యున్నదియు, యీ వివరములను గూడ వ్రాసి యుంచుకొనుట మంచిది. వైద్యుడు లేని సమయమున రోగియొక్క లక్షణములందు గాని, వైఖరియందు గాని, యేవైనమార్పులు కలిగియున్న యెడల, వీటిని జాగ్రత్తతో గమనించవలయును. రోగియొక్క నోయును, బోరిక్ లోషనుతో పుక్కిలించి ఉమ్మివేయుట వలన, పరిశుభ్రముగా నుంచవలయును. రోగియొక్క శరీరమంతయు ఉడుకునీళ్ళలో ముంచిన స్పాంజితో దుడువవలయును. ఒడలంతయు పొడిగానుంచి యెచ్చటనైతే ఒత్తిడి తగులునని ఊహించుటకు వీలుండునో యచ్చట పుండ్లు యేర్పడకుండ జాగ్రత్తగ బరీక్షించుచు, రోగిని ఒక ప్రక్కనుండి మరియొక ప్రక్కకు అప్పుడప్పుడు ద్రిప్పి పరుండబెట్ట వలయును. మొదటివారము పిమ్మట నుండియైనను రోగిని లేవదీయకుండ, మలమూత్రముల ప్రక్కమీనుండి విసర్జించు నటుల నే యేర్పాటుచేసి, యిందులకు దగు పరికరముల (Urinal and Bed Pan) నుపయోగింపవలయును. చూడవచ్చువారల రానియ్యక రోగి సంపూర్ణమైన విశ్రాంతిని గలిగియుండునట్లు చేయవలయును. టైఫాయిడ్ జ్వరమునందు యోగింపదగిన సర్వశ్రేష్ఠమగు నాహారము పాలని వైద్యశాస్త్రజ్ఞులందరును ఏకీభావముతో నొప్పుకొనియున్నారు. ఈ పాలను యెక్కువ తరుచుగ గాని, యెక్కువ పరిమాణములుగ గాని, యియ్యరాదు. ప్రతి రెండున్నర లేక మూడుగంటలకు, నాలుగు ఔన్సుల చొప్పున నిచ్చిన సరిపడగలదు. కేవలము దానిని యిచ్చినను, లేక, కొంచెముగా నీటితో గాని, లైంవాటరు తోగాని, సోడా వాటరుతోగాని, కలిపి యియ్యవచ్చును. ఇరువదినాలుగు గంటలలో నిచ్చిన మొత్తపు పరిమాణము రెండున్నర లేక మూడు పైంట్లను మించి యుండగూడదు. పాలు క్రమముగా జీర్ణమగు చున్నవో లేవో కనుగొనుట మిగుల ఆవశ్యకమయి యున్నది. ఇందుకుగాను, రోగియొక్క విరేచనమును క్రమ కాలములందు పరీక్షజేయుచు, విరేచనమునందు జీర్ణముకానట్టి తోడుకొనిన పదార్థ ముండిన యెడల, కొంత కాలమువరకు ఆపివేయవలసియుండును. లేక, పరిమాణము నందు తగ్గించవలసినదైన యుండును. లేదా, బలమునైన మిశ్రమము చేయవలసి యుండును. పాలను తగ్గించినపుడు, గాని నిలిపివేసినపుడు గాని, బార్లినీళ్లు, బాగుగా వడపోసిన ఓట్ జావ. కోడిగుడ్లలోని తెలుపు, పాలను గుడ్లను గలిపి పల్చగావండినది (Custard) వీటిని ఉపయోగవచ్చును. కాని ఆహారమునందిట్టిమార్పులను జేయుటవలన, అతివిరేచనములు పుట్టకుండునట్లును అతివిరేచనము లది వరకే యుండియుండిన యెడల నధికము గాకుండునటులును, జాగ్రత్తను మాత్రము పుచ్చుకొనవలసియుండును, ఆహారమును రాత్రింబవలు యిచ్చుచుండవలయును. రోగి, స్మృతి తప్పిన అవస్థయందుండినయెడల, క్రమక్రమ కాలములందు ఆహారమును బుచ్చుకొనుటకు, మేల్కొలుప వలయును. రోగి శాంతముగునిద్ర నందుచుండినయెడల, లేపకుండుటయే మం

చిది. జలమును విరివిగా నియ్యవచ్చునుగాని, ఒక్కొకమారు కొద్దిగ మాత్రమునే యిచ్చుచుండవలయును. ఎక్కువగా నిచ్చుటవలన నొకప్పుడు అతివిరేచనము లధికము గావచ్చును.

ఆహారము సరిపడుచుండినయెడల, జ్వరగతియందు రోగియొక్క ఆహారమునందేమియు మార్పును గలుగ జేయరాదు. కాని, శరీరవేడిమి స్వాభావికస్థితికి వచ్చి, స్వస్థావస్థ ప్రారంభమయినటుల గనబడినయెడల, తేయాకునీళ్ళు కాఫీలకు తోడుగా బ్రాత్ (Broths) లను బహుమెలకువతో నుపయోగింప బ్రారంభింపవచ్చును. ఆహారమునందు జేయబడు నిట్టి మార్పు లన్నింటియందును, విరేచనము బరీక్షించి జీర్ణత క్రమముగా నున్నసంగతిని తెలిసికొనుచుండ వలయును. శరీరవేడిమిని కూడ జాగ్రతతో బరీక్షించుచు, ఇందు స్పష్టమగు అధిక్యత కనుపడినయెడల జ్వరమునందలి ఆహారమునకు మరలవలయును. ఏ యితరవ్యాధియందలి స్వస్థావస్థయందు కంటెను, యీవ్యాధియందలి స్వస్థావస్థయం దెక్కువ జాగ్రతను వహించి యుండవలసియుండును.

టైఫాయిడ్ జ్వరమునందు బ్రాందీని యుపయోగించుటయందలి ఆవశ్యకతను గూర్చి వేరువేరు అభిప్రాయము లుండియున్నవి. టైఫాయిడ్ యొక్క అన్నివిషయము లందును బ్రాందీని అవసరములేదనునది నిశ్చయమే, ఒకప్పుడు బ్రాందీని అధికముగ నుపయోగించుట వలన గూడ అపాయము కలుగుచుండును. సాధుగతిని వహించిన విషయములందు, చురుకుదనమును బుట్టించవలసిన అవసరమును సూచించు లక్షణములు, కనుపడనే గనుపడవు. రక్తప్రచారము యొక్కయు, మెదడు సంబంధ మగునట్టియు లక్షణ ములను బట్టి బ్రాందీని ఉపయోగించుటయొక్క అవశ్య కతను నిర్ణయింప వలసియుండును. విశేష కాలము అధిక వేడిమిని వహించి యుండుట యొక్క గాని, అతివిరేచనములయొక్క గాని, ఫలితముగ, గుండెకాయ నీరసత నంది, గుండెచప్పుళ్ళు నిస్త్రాణతోగూడిగాని క్రమతదప్పిగాని యుండి, నాడి మాంద్యతను వహించి యుండిన యెడల, బ్రాందీ తప్పక గుణమునిచ్చును; ఒకప్పుడు నిద్రను రప్పించుట యందును, ఉద్రేక లక్షణములతోగూడిన టైఫాయిడ్ యొక్క అలస్యగతులయందలి ముఖ్యలక్షణములగు ఆయాసము సంధిగుణములను సర్దుపరచుట యందును, బ్రాందీ పనిచేయును. బ్రాందీ నిచ్చుట యందలి మోతాదును నిశ్చయించుటకు వైద్యునియొక్క వివత్ప్రజ్ఞానము నుపయోగించి, పని చేయవలయునుగాని, యిందును గురించి మోతాదును స్థిరపరచుటకు వీలులేదు. ఎట్టి విషయములందును, యిరువదినాలుగు గంటలలో ఆరు లేక యెనిమిది ఔన్సులకంటె నెక్కువ బ్రాందీని యియ్యనవసరములైన అంశములు బహు అరుదై యుండును. బ్రాందీ నిచ్చిన పిమ్మట, దానియొక్క గుణమును కనిపెట్టి మరియు, దానిని మరల మరల నిచ్చుచుండ వలయును. దీనిని యిచ్చుటవలన, రోగియందు కలత అధికమయినయెడల, మోతాదును తగ్గించుటనుగాని, బ్రాందీని అసలే ఆపివేయుటనుగాని, చేయవలయును. బ్రాందీతో గూడిగాని బ్రాందీకి బదులుగా గాని, స్పిరిట్సు అమ్మోనియా అరోమేటిక్, టింక్చర్ డిజిటాలిస్, లైకర్ స్ట్రిక్నీన్ హైడ్రోక్లోర్, మొదలగు గుండెకాయకు చురుకుదనమును బుట్టించు ఔషధములను వాడవచ్చును.

---

అతి విరేచనములు కొద్దిగా నుండినయెడల ప్రత్యేక చికిత్స అవసరములేదు. కాని, చాల విషయములలో అతివిరేచనము నధికమయి మందులు అవసరముగ గనుపించును. ఆహారమునందు మార్పును గలుగ జేయుట మూలమున నీ అతివిరేచనము లప్పుడప్పుడు ఆగిపోవచ్చును. ఆహారమును మార్చుటయందు పైన సూచింపబడిన ప్రకారము చేయవలయును దినమునకు యెనిమిది లేక తొమ్మిది పర్యాయముల కంటె నధికముగ విరేచనములయిననే దప్ప మందులనియ్య నవసరములేదు. పల్విస్ ఇపికాక్ కో రెండు గ్రెయినులును బిస్మత్ సబ్ నైట్రేట్ రెండు గ్రెయినులును గలిపి ఉదయమునను సాయంకాలమునను యియ్యవచ్చును. బిడ్డలకు పల్విస్ క్రేటా ఆరొమేటిక్ క. ఓపియం ను యియ్యనగును. ఉదరముయొక్క ఉబ్బుదలను సాలోల్ ను గాని బిస్మత్ సేలిసైలిస్ ను గాని యిచ్చుటవలన, నిలుపు చేయవచ్చును. కర్పూరతైలమును 20 మినిముల మోతాదులలో నిచ్చుటవలన నుపయోగముగ గనుగొనబడెను. దీనిని ఉదరముపయిన రాసి వేడి కాపడములను గాచుటవలనను ఉపయోగముండగలదు. ఉదరముపయిన మంచును ప్రయోగించుట మూలమునను యొకప్పుడు మిగుల లాభకరముగ గనుపించెను.

జ్వరముయొక్క యీ పద్ధతి యందును సాధారణముగ మలబంధ మేర్పడి యుండును. ఈ సందర్భమందు ప్రతి మూడు లేక నాలుగు దినముల నొకసారి చిట్లాముదమును ఒక డ్రాము చొప్పున నియ్యవలయును. లవణ సంబంధమగు విరేచనకారుల నిచ్చుటవలన అపాయము కలుగవచ్చును.

రక్తస్రావమునందు, రోగికి పరిపూర్ణమయిన విశ్రాంతి నియ్యవలయును, లైకర్ మార్ఫియా హైడ్రోక్లోర్ ను 25 లేక 30 మినిములను ఒక ఔన్సు జలములో గలిపి యిచ్చి పిమ్మట ప్రతి రెండు లేక నాలుగు గంటల కొకసారి 10 మినిముల చొప్పున నియ్యవలయును. ఈస్థితియందు ఆహారమును మిక్కుటముగ తగ్గించవలసి యుండును. తడవకు ఒక అరఔన్సు పాలకంటె నెక్కువగ నియ్యరాదు.

పేగులయందు రంధ్రమపడుటకు మందుల వలని చికిత్స యేమియులేదు. లైకర్ మార్ఫియా హైడ్రోక్లోర్ ను యిచ్చుటవలన బాధను కొంతవరకు తగ్గింప వచ్చునుగాని, కుదురుబాటు నొందుటను వినియుండలేదు. శస్త్రమును చేయుటకు బూనుకొను నెడల, యీ అవస్థ సంభవించిన పండ్రెండుగంటల లోపల నీ పని జేయింపవలయును. శస్త్రమువలన నుపయోగముండుట బహు అరుదు.

రోగియొక్క పడకయందలి తీరును మార్చుచుండుట వలన కురుపులు కలుగకుండ జేయనగును. కురుపు లేర్పడిన యెడల, బోరిక్ ఆసిడ్ ను వాసలీన్ నుగాని, జింక్ ఆక్సైడ్ ను వాసలీన్ నుగాని, కలిపి రాయుటవలన నెమ్మదించగలదు.

స్వస్థావస్థయందును, నెమ్మదిగా గనబడిన జాలకాలమువరకును, ముఖ్యముగా ఆహారము పరిశ్రమల విషయమయి యెక్కువ జాగ్రత్తను బుచ్చుకొన వలయును. ఈ ప్రకారము చేయుటవలన, ప్రస్తుతాపాయములనుండి దప్పించుకొనుటయే గాక, దీర్ఘకాలము వ్యాపించబోవు నీరసస్థితినుండియు, అజీర్ణ వ్యాధినుండియు, తప్పించు కొనవచ్చును. ఈవ్యాధిచే బాధనొందిన వారలకు, తరుచుగ నజీర్ణవ్యాధి సంప్రాప్త మగును.

## ప్రత్యేక చికిత్సా పద్ధతులు.

1. శరీరవేడిమి యెడల జేయబడు చికిత్స. 2. టైఫాయిడ్ పురుగుల యెడలను, తజ్జనిత విషపదార్థముల యెడలను, జేయబడు చికిత్స.

### 1. శరీరవేడిమి యెడల జేయబడు చికిత్స.

జ్వర నివారిణులగు ఔషధములు చాలమందిచే నుపయోగింప బడుచున్నవి. ఆస్లెక్, కార్ అను వైద్యశాస్త్రజ్ఞులు తమ అనుభవములవలన నివి ఉపయోగింప దగవని చెప్పుచున్నారు. టైఫాయిడ్ జ్వరమునందు, జ్వరము స్థిరమయినట్టియు నిర్ణీతమయినట్టియు గతి ననుసరించి యుండునుగాన, జ్వరనివారిణులగు ఔషధముల నుపయోగించుట స్వాభావికమగు చికిత్స కానేరదు. శరీరవేడిమి అత్యుద్రితావస్థను వహించియున్నపుడు దప్ప నితరవిషయము లందీ ఓషధుల నుపయోగించుటవలన కార్యకారిగ నుండలేదని వీరలు చెప్పుచున్నారు. ఈ ఓషధుల నుపయోగించుట కుండెడి కారణము, అతిశయవేడిమి వలన గుండెయందలి స్నాయువునకు గలుగు నష్టమును గలుగకుండ జేయుట మాత్రము, అయియున్నది.

ఇందులకై యే ఓషధినయినను ఉపయోగించదలచిన యెడల క్షేమకరమయినట్టియు కార్యసాధకమయినట్టియు ఓషధి క్వినీన్ మాత్రమే అయియున్నది. జ్వరము యొక్క అత్యుద్రితావస్థయందది మిగుల ఉపయోగకరముగ నుండవచ్చును. వ్యాధియొక్క స్థితిననుసరించి 15 మొదలు 25 గ్రెయినులవరకు నుపయోగింపవలయును. అంటిఫిబ్రిన్, అంటిపయిరిన్, మొదలగు ఔషధముల నుపయోగించ గూడదు, వాటి నుపయోగించుట వలన గుండెయం దస్వస్థత యేర్పడి, శుద్ధరక్తనాళముల యందలియు అపరిశుద్ధ రక్తనాళముల యందలియు రక్తము కలియుటవలన ఒడలునకు నీలవర్ణమేర్పడి, ప్రాణాపాయకరమగు క్షీణగతి ప్రారంభింపవచ్చును. ఇదిగాక వీటివలన శరీరమునందలి టైఫాయిడ్ విషములు తొలగింపబడుట ఆటంక పరచబడును.

నీటివైద్య పద్ధతులపై చికిత్సచేయుటవలన నెక్కువ జయప్రదములగు ఫలితములు పొందబడెను. ఈ పద్ధతులయందు బ్రాండ్ యొక్క పద్ధతి యెక్కువ ముఖ్యమైయున్నది. ఇంగ్లాండు దేశమునందు యీ పద్ధతి యెక్కువ వాడుకలోనికి దేబడక పోయినప్పటికిని, ఐరోపాఖండమునం దితరదేశములందును అమెరికాఖండము నందును, యీపద్ధతిని విశేషించి వాడుకలోనికి దెచ్చుటవలన నాశ్చర్యకరమయిన ఫలితములు గాంచబడెను. ఆసమయమునందు దీసికొనబడిన శరీరవేడిమి ఫారన్‌హీట్ 102. 2 డిగ్రీలకు మించియుంచినపుడు రోగిని ఫారన్‌హీట్ 65 డిగ్రీలకు మించియుండని వేడిమిగల నీళ్ళతొట్టిలో స్నానము చేయించవలయును. స్నానము చేయునీళ్ళ వేడిమికంటె 5 డిగ్రీల తక్కువ వేడిమిగల నీళ్ళయందు ముంచిన తడిగుడ్డను శిరముపైనయును, భుజములపైనయును ఉంచవలయును. రోగిని నీళ్ళ తొట్టియందు పదునయిదు నిమిషములు ఉంచవలయును. ఈ కాలమందు రోగియొక్క పరిచారకులు రోగియొక్క శరీరమంతయును చక్కగ రుద్దవలయును. రోగిని తనంత తానును యీపనిని జేయ బ్రోత్సాహపరుప వలయును. ఇట్టిరాపిడివలన శరీరమునందలి ఉపరిభాగముల

యందు రక్తప్రచారము వృద్ధిపరుపబడుట ఉద్దేశింపబడినది గాన, యిట్టిరాపిడి మిగుల ముఖ్యమయినది. ఈ స్నానము ఆరంభించిన యెనిమిది లేక పదినిమిషములకు వణకుట తరుచుగా నారంభించును గాన, దానిని లక్ష్యము చేయక పదునయిదు నిమిషములను పూర్తి యగునంత వరకు యీ స్నానము చేయవలయును. ఈ కాలపరిమితి పిమ్మట రోగిని నీళ్ళతొట్టినుండి దీసి పొడిగుడ్డతో దుడిచి, దుప్పటిని గప్పి, పాదములను హస్తములను శుభ్రముగా పొడిగా నుండునట్లు దుడిచి, చేతులతో వేడిగలుగునట్లు రుద్దవలయును. ఈ స్థితియందు కొంచెము బ్రాందీని యియ్యవచ్చును. శరీరవేడిమి ఫారన్‌హీట్ 102.2 డిగ్రీలకు తక్కువగా నుండిన నేదప్ప, యీ స్నానమును ప్రతిమూడు గంటలకును మరలమరల చేయించుచుండవలయును. ఆహారపదార్థములుగ ద్రవపదార్థములను మాత్రమే యీయవలయును. ఓషధులేమియునియ్యదగవు.

ఈచికిత్స యందలి కష్టమెక్కువగనున్నను, యీపద్ధతిని యథావిధిగా జరుపు ఆసుపత్రులయందు, టైఫాయిడ్ జ్వరము వలని మరణములయొక్క సంఖ్య చాలవరకు తగ్గుదల నందియుండెను. ఈస్థితియందలి గహస్యము శరీరవేడిమిని తగ్గించుటయందుగాక, శరీరమునందుండెడి టైఫాయిడ్ విషమును దొలగించుట యందిమిడియున్నది. ఈపద్ధతివలన మూత్రవృద్ధి అయి శరీరమునందలి టైఫాయిడ్ విషము అధికపరిమాణములుగ వెలువడుచుండును. ఇందువలన దుర్బలమగు గుండెకాయ కలవారలకు నదురు సంభవించునేమోయని జడువవలసియున్నది. అట్టివిషయములలో, గదివేడిమితో సమానమగు వేడిమిగల నీటియందు స్నానమును జేయించవలయును. ఈపద్ధతివలన రక్తస్రావమగుటకు అనువును అధికపరచిన వారలమగుచున్నామను గారణముచే కొందరు ఈపద్ధతిని నిషేధించెదరుగాని టైఫాయిడ్ యందలి అపాయకరమగు రక్తస్రావము యెల్లపుడును పుండులేక కురుపు సంబంధమయినది గనుక బహిరావస్థలవలన యీ రక్తస్రావ మెట్లు కలుగునదియు దెలియ వీలుగాకున్నది.

జ్వరముయొక్క ఉద్రిక్తగతియందు చల్లనినీళ్ళను, మంచును, పైన ప్రయోగించుట వలన మిగుల ఉపయోగముండగలదు. చల్లనినీళ్ళలో స్పాంజిని ముంచి దుడుచుట వలనగాని, తడిగుడ్డలను గట్టుటవలనగాని తేలికగ శరీరవేడిమిని తగ్గింపవచ్చును. శరీరవేడిమిలో సమానమైన వేడిమిగల నీటియందు రోగిని ఉంచి, క్రమముగా నీ నీటియందు చల్లని నీళ్ళను గలుపుట వలన నీటి వేడిమిని తగ్గించుట మూలమునను రోగియొక్క శరీరవేడిమిని తగ్గింపవచ్చును. ఈ పద్ధతియందు గుండెకాయకు అదరు కలుగుటకు వీలులేదు.

బ్రార్ అను నాయన వలన యేర్పరుపబడిన యింకొక నీటివైద్యపద్ధతి, రోగియొక్క శరీర వేడిమి కంటె కొన్ని డిగ్రీలు తక్కువ వేడిగా నున్న నీటియందు జ్వరగతి యందంతటను రోగిని ఉంచి యుండుట, అయియున్నది.

### 2. టైఫాయిడ్ పురుగుల యెడలను, తజ్జనిత విషపదార్థముల యెడలను, చేయబడు చికిత్స.

క్రుళ్ళకుండ జేసెడి ఓషధుల నుపయోగించుటవలన జ్వరముయొక్క పరిమితి కాలమును తగ్గించుటకుగాను అనేక ప్రయత్నములు చేయబడినవి ఈ విషయమందు

పరిపూర్ణమగు జయము కలుగక పోయినను, కొంతవర కనుకూలమగు ఫలితము లందబడి యుండెను. పేగులయందు క్రిములనుండ జేయుట అసంభవమే గాని, కొన్ని ఔషధముల నుపయోగించుటవలన మలమునందలి కంపును బోగొట్టుటకు మాత్రము వీలు కలదు. ఔషధములయందు సాలోల్ బహుశః అన్నిటికంటె నెక్కువగ నుపయోగింపబడుచు యున్నది. దీనిని ప్రతి నాలుగు లేక ఆరుగంటలకును 10 గ్రెయినుల మోతాదులలో నియ్యవచ్చును. గ్వాయికల్ కార్బనేట్ కూడ మంచి గుణము నిచ్చును. జ్వరగతియందంతటను, పైన జెప్పబడిన వాటిలో దేనితోనైనను గలిపి క్యాలొమెల్ (రసభస్మము) నిచ్చుటవలనను మిగుల నుపయోగముండగలదు. బాగుగ వాడుకయందుగల యితరములగు క్రిములనుండ జేయు ఔషధములు - బిస్మత్ సేలి సైలిస్, టర్పెన్టైన్, యూకలిప్టస్ అయిల్, థైమాల్ అయియున్నవి.

ఈ పై ఔషధము లేమియు రోగికి హానిని కలుగజేయవు. జ్వరముయొక్క పరిమిత గతినిన్ని తగ్గింపజాలవు. పునఃప్రకోప గతినిన్ని ఆటంకపరుప జాలవు. మలమునందలి కంపును మాత్రము పోగొట్టి పరిచారకులకు లోనగు అపాయములను తగ్గింపవచ్చును. పుండుయొక్క తీవ్రతను తగ్గించి వ్యాధియొక్క కాఠిన్యతను తగ్గింపవచ్చును.

### ముందు జాగ్రతలు.

టైఫాయిడ్ జ్వర సంబంధమగు విషము, ముఖ్యముగా త్రాగెడు నీళ్ళద్వారా, శరీరమునందు వ్యాప్తత నందుచున్నది. కావున నీటిసప్లయియొక్క ఉత్పత్తి స్థానమునందును, నీరు పారుదలయగు మార్గములందును, మలినములు కలవకుండు నటుల జాగ్రతగ నుచ్చుకొనవలయును. గృహమునందలి పరిశుభ్రతను గాపాడుచు, అన్ని విధములగు పాత్రలను శుభ్రముగా నుంచుకొనవలయును. త్రాగెడు నీళ్ళయందును పాలయందును ఏ విధమగు అనుమానమున్నను, వాటిని ఉపయోగించుటకు ముందుగా గాచవలయును. ఈ వ్యాధియొక్క అంటు దగిలియున్నటుల అనుమానమున్న ఆహారములను త్యజించవలయును.

టైఫాయిడ్ రోగియొక్క మలమూత్రముల సంబంధమగు దుర్వాయువులను పోగొట్టుట యందును, యీ పదార్థములను బరిష్కరించుట యందును, యెక్కువగు శ్రద్ధను దీసికొనుట మిగుల ప్రాముఖ్యతను వహించిన అంశమయి యున్నది. మలమును బారవేయుటకు ముందుగా, 1 కి 40 వంతునగాని, 1 కి 20 వంతునగాని కార్బాలిక్ ఆసిడ్ కలిసిన సొల్యూషన్‌ను దానితో గలిపి, రెండు లేక మూడు గంటలు నిలువ చేయవలయును. 1 కి 500 వంతున గలుపబడిన మెర్క్యూరీ పెర్ క్లోరీడ్ యొక్క సొల్యూషనయినను యిందులకు పనికివచ్చును.

రోగికై వాడుక జేయబడిన పనిముట్లను, పాత్రలను, కార్బాలిక్ ఆసిడ్ సొల్యూషనులో నదుంగవలయును. రోగియొక్క మలముతో మాలిన్యమునందిన పక్కబట్టలను కాని, యితర బట్టలనుకాని, కార్బాలిక్ సొల్యూషనులో నాన జేయవలయును; లేదా, ఉడుకుటకు ముందుగా ఉడుక బెటడము నైనను జేయవలయును. రోగియొక్క పరిచారకులు, రోగికి విరేచన మయినపిమ్మట, రోగియొక్క గుదస్థానమును దుర్బలమగు కార్బాలిక్ సొల్యూషనుతో దుడువవలయును. రోగికి ఉపచారములను జేయువారలు తమ చేతులను గూడ కార్బాలిక్ సొల్యూషనుతో శుభ్రముగా గడుగుకొనుచుండవలయును.

## నీటివైద్యము.

జ్వర చికిత్సయెడల నీటివైద్యముయొక్క లాభమును పందొమ్మిదవ శతాబ్దమునందు బాగుగ గుర్తెరిగియున్నారు. 1861 సం॥ నుండి జ్వరవిషయములలో స్నానములయొక్క ఉపయోగమును గూర్చి డాక్టరు బ్రాండ్ గారు విశేషముగ నొక్కి చెప్పియున్నారు.

టైఫాయిడ్ జ్వర సంబంధమగు విషము శరీరమునందు విశేషముగ నావరించి యున్నదని కనుగొనిన విషయములలో, నోటిద్వారా వీలైనంతవరకు విరివిగ నీటిని లోనికిచ్చుటవలన నుపయోగ ముండగలదని డాక్టరు ఆస్లరుగారు చెప్పుచున్నారు. ఈస్థితియందు తొట్టె స్నానములను గూడ చేయించవలయును. ఈ విషయములో దినమునకంతకును 4 మొదలు 10 ఔన్సుల వరకు విస్కీని యిచ్చుట వలనను ఉపయోగ ముండవచ్చును. తలనొప్పియు, మగతయును, ఉండినయెడల, మంచు గడ్డను గాని తడిగుడ్డలను గాని శిరస్సుపైన గట్టవలయును. మగతను వహించిన ప్రతి రోగిని జాగ్రతగా కాపాడవలయును. ఇట్టిరోగుల విషయములో నిద్రవచ్చునట్లు చేయుట మిగుల ముఖ్యమైయున్నది; ఇందులకు లైకర్ మార్ఫియా హైడ్రోక్లోర్‌ను లోనకియ్యవలయును. మెదడు సంబంధమగు అస్వస్థతలు యేర్పడినపుడు, జలమును లోనకిచ్చుటవలనను, స్నానములు మొదలయినవి చేయించుట వలనను, యీరెండు విధములగు నీటిచికిత్సలును మిగుల సహాయకారులుగ నుండుననని సర్ విలియం ఆస్లరుగారు చెప్పుచున్నారు.

నీటి చికిత్సయందు వాడుక చేయదగిన ముఖ్యములగు మూడుపద్ధతులు గలవు.

1. స్పాంజిని నీటిలో ముంచి రోగియొక్క ఒడలు తోముట, జ్వరముయొక్క తీవ్రతననుసరించి, గోరువెచ్చని నీళ్లు, మంచుతో సమానమగు చల్లని నీళ్లు—వీటిలో స్పాంజిని గాని మెత్తని గుడ్డను గాని ముంచి, ఒడలంతయు దోమవలయును. 15 నిమిషములు మొదలు 20 నిమిషములవరకు నిట్లుగా జేయనగును. జ్వరము అత్యుద్రేకావస్థను వహించి, మంచుతో సమానమగు చల్లని నీళ్లలో స్పాంజిని ముంచుచు ఒడలంతయు దుడుచుట అవసరమయినప్పుడు, పూర్ణమయిన స్నానమును జేయించుటయే మంచిది. ఇట్టి సంపూర్ణస్నానమునకు రోగియొక్క బంధువులుగాని స్నేహితులుగాని అభ్యంతరము చెప్పినప్పుడు, రెండవ పక్షమున యీవిధముగా స్పాంజితో ఒక్కొక కాలును ఒక్కొక చెయ్యిని దుడిచి, పిమ్మట వీపును ఉదరమును దుడువ వలయును.

2. తడిగుడ్డలు శరీరమునకు జుట్టుట టైఫాయిడ్ జ్వరమునందు యీపద్ధతి అంత ఉపయోగముగ గనుపించదు. కాని, తొట్టె అందుబాటునందు లేనపుడును, మెదడు సంబంధమగు అస్వస్థతలు స్పష్టముగ గనబడినపుడును, యీపద్ధతి నవలంబించి ఉండి ఉండి యీ తడిగుడ్డలపైన చల్లని నీళ్లను బోయుచుండ వలయును.

3 తొట్టెస్నానము రోగియొక్క శిరస్సుతప్ప తక్కిన యావచ్ఛరీరమును నీటియందుండుటకు వీలయినంత పొడుగుగ నా తొట్టె యుండవలయును. శరీరవేడిమి 102 డిగ్రీలకు మించి యుండినపుడు తొట్టెస్నానము చేయించుటకు కొందరు వైద్యశాస్త్రజ్ఞులు సలహా

నిచ్చుచున్నారు. రోగిని 15 లేక 20 నిమిషములు తొట్టిలోనుంచి, పిమ్మట అందునుంచి లేవదీసి, పొడిబట్టను జుట్టి, బరువులేని దుప్పటిని కప్పవలయును. రోగి, తొట్టిలో నున్నప్పుడు, చేతులను కాళ్లను ఉదరమును శుభ్రముగా చేతితో రుద్దవలయును. ఇటువంటి స్నానము నెప్పుడును రాత్రికాలమందు చేయించరాదు. గోరువెచ్చని నీళ్లలో మొదటగా రోగిని కూర్చుండబెట్టి క్రమక్రమముగా చల్లని నీటిని కలుపుటవలన రోగికి అసౌఖ్యము ఉండనేరదు. ఈస్నానమును జేయించుటయందు ఉపయోగించు ఉపాయమును బట్టియు జాగ్రతను బట్టియు రోగికి ఈస్నానమువలన కలుగు ఆయాసమును నిర్ణయింపవలయును. స్నానానంతరము ఆహారమునుగాని, యొకప్పుడు చురుకును బుట్టించు పదార్థమునుగాని, యియ్యవగును. స్నానమైన పిమ్మట చలి కలిగినయెడల మరేమియు తొందరలేదు. రక్తస్రావము, ఉదరభాగమునందు నొప్పి, మిగుల నీరసత—యీ సందర్భములందు తొట్టిస్నానమును చేయించరాదు

స్నానము వలన నీ క్రింద ఉపయోగము లుండును,—

1, సంధిగుణము తగ్గును వణకుడలయు తగ్గును. విషలక్షణములు కొంతవరకు అంతరించును.

2. మూత్రగ్రంధుల మూలమున టైఫాయిడ్ విషములు వెలువరింపబడును.

3 రక్తప్రచారమునందు చురుకుదనము పుట్టును. గుండెయొక్క కొట్టుకొనుటయందలి తీవ్రత తగ్గును. నాడి బలమును వహించును.

4. రొమ్ముపడిసెముయొక్క ప్రారంభగతియందు మంచిగుణము నిచ్చి, శ్వాసకోశములయొక్క అడుగుభాగమున రక్తముయొక్క కూడికను నిలుపుజేయును.

5. ఒకేతీరుగ పరుండుటవలన కలిగెడి కురుపుల కాస్పదము తక్కువగ నుండును. ఒడలు శుభ్రతను వహించి ఆరోగ్యకరముగ నుండును. స్నానమునకు నిచ్చు నీటిలో ఒకఅరిపాను పటికను గలిపిన యెడల నుపయోగముగ నుండగలదు.

6. శరీరవేడిమి తగ్గుటగల నందునుగాని యిదియే ప్రాముఖ్యమగు నంశము కాదు.

7 ఇందుమూలమున నీ వ్యాధియందలి మరణములు తగ్గును. ఈ విధమగు చికిత్స వలన ప్రపంచమునందున్న పెద్ద ఆసుపత్రిలలో 100 కి 6 మొదలు 8 వరకు మరణములు తగ్గింప బడినవి.

---

## డెంగ్యూ జ్వరము.

తలనొప్పి, ఆయాసము, చలి, నీరసత, వెన్ను గాళ్ళు చేతులు కీళ్ళు కనుగ్రుడ్లు—వీటిపై పులఅధికమగు బాధ, కొద్దియో గొప్పయో జ్వరత— యివి యన్నియు డెంగ్యూజ్వరముయొక్క ఆరంభ లక్షణములై యున్నవి, కాని ఒకానొకప్పుడు యేదియో ఒకకీలునందు అకస్మాత్తుగ పోటు కలుగుట మూలమునను, యీ జ్వరము ప్రారంభము కావచ్చును. పిమ్మట కొద్దికాలములో సామాన్యముగ పండ్రెండు గంటల లోపల, ముఖము, ఎదురొమ్ము అరచేతులు, యింక నితరస్థలములందును, యెఱ్ఱనిపొక్కులు రేగ్పడి, యివి సుమారు నలుబదియెనిమిది గంటల పిమ్మట నశించును. జ్వరము 103 లేక 104 డిగ్రీల వరకు హెచ్చి

నాడి నిమిషమునకు 120 దెబ్బలవరకు వ్యాపించును. పొక్కులు తగ్గిపోయిన కొలదిని జ్వరమును నొప్పులును తగిపోవును. జ్వరము మరల అధికమయి, రెండవసారి పొక్కులు కనుపడి యీ పొక్కులు బహుళః ఆరంభమునందు అరచేతులలో కనుపడి, పొంగును బోలి యుండును. ఈస్థితి కొన్ని గంటలు మాత్రమే యుండి, అంతరించిపోయినను బోవును. లేక రెండు దినముల వరకు ఉండినను ఉండును. ఒకానొకప్పుడు యీ రెండవసారి కనుపడిన పొక్కులు “కుక్క ముంగ్లి”ను బోలియుండి, దురద విశేషముగ గలిగి, నను గలుగవచ్చును. ఈ రెండవతెర వచ్చినపిమ్మట రోగికి మిగుల బలహీనత గలిగి, కీళ్లయందు నొప్పులు కలిగి, మెడయందలియు గజ్జలయందలియు, గ్రంధులు వాపుదల నందవచ్చును. ఈ వ్యాధియందు మూడవ తెరగూడ గలుగవచ్చును. ఈవ్యాధి పెద్దవారలకును, బిడ్డలకును, పసిపిల్లలకును, గలుగవచ్చును. బిడ్డలయందు, ఈ బాధవలన గలుగు అదరుటలు, మూర్ఛలుగా భ్రమింపబడును. పెద్దవారలయందు గనబడు అనంతర బాధలు, బిడ్డలయందును పసివారలయందును యేమియు గనబడక, త్వరితములో కుదిరిక నందును.

చికిత్స.

విరేచనకారుల నిచ్చుటవలన రోగి తరుచుగా కదలుట తటస్థించును గావున ఈవ్యాధియందు విరేచనకారు లుపయోగ నీయములు కావు. తడిగుడ్డలతో శరీరమును దుడుచుటవలనను చల్లదనమునిచ్చు ద్రవపదార్థములను ద్రాగుటవలనను, రెండు లేక మూడు మోతాదులను ఫినాసిటీన్‌ను యిచ్చుటవలనను— జ్వరమును తగ్గింపవచ్చును. ఆహార పదార్థములు తేలికగ జీర్ణమగునవిగ నుండవలయును. చివరదఫాను లేచినపొక్కులు అంతరించువఱకును, రోగి పరుండియే యుండవలయును. నొప్పులు నయము గాకపోయినయెడల పొటాసియం అయొడైడ్‌ను సేవించవలసి యుండును. ఉద్ధృతమగు పాటుల పిమ్మట వాయువునందలి మార్పుకొరకై యితరస్థలములకు బోవుట మంచిది.

నొప్పులనున్ను, జ్వరమునున్ను తగ్గించుటకు టింక్చర్ బెలడోనాను 10 మినిముల మోతాదులలో దినమునకు మూడుసారు లియ్యవలయును. దీనివలన నుపయోగము లేకపోయినయెడల డయూరిటిక్సు- డయఫొరిటిక్సులో 2 వ ఔషధయోగమును వాడవలయును.

---

## తలనొప్పి.

తలనొప్పి యనునది ప్రత్యేకమగు నొకవ్యాధిగాక, సామాన్యముగ నింకొక వ్యాధియొక్క సూచనలక్షణమై యున్నది. ఈవ్యాధియందలి ముఖ్యవిధముల నీ క్రింద వివరించడమయినది.

### 1. అజీర్తి సంబంధమగు తలనొప్పి.

జీర్ణాశయమును, పేగులు, కారిజము — వీటియందలి దేని అస్వస్థత వల్లనైనను, యీ సంబంధమగు తలనొప్పి కలుగవచ్చును. జీర్ణాశయమునందలి యస్వస్థత అధికముగ నుండిన

యెడల నుదురుపైన పోట్లు పొడిచినట్లునుండి, వాంతి వచ్చునట్లుండును. తినుటయందు గాని, త్రాగుటయందు గాని అమితత్వముగా నుండాల్చిన దృష్టిశరీరము కును (తీవ్రత లేకుండ తలనొప్పి మాత్రముండును. పొత్తికడుపు యందు కలుష్యము యున్నట్లు తోచగానే, యేది రోగి యొక్క యజీర్ణపదార్థము జీర్ణాశయము నుండి ప్రేగులలోనికి వెడలియుండునట్లు తెలయవలయును. ఇట్టి అవస్థ కలిగిన వెంటనే తలనొప్పి, నిలచిపోవును. ఇట్టి తలనొప్పి, సోడావాటరును త్రాగుట వల్లను, ఒక పెద్ద చెమిచా కొలతగల సిట్రేట్ ఆఫ్ మెగ్నీసియాను జలములో వేసి త్రాగుటవల్లను, సర్దుకొనగలవు, కారణముగాని ప్రేగులుగాని యస్వస్థతయందుండినయెడల, శిరమున కడ్డముగా బిగువు యేర్పడి, బాధ ఉద్రేకముగ నుండును. అట్టి విషయములలో 4 వ విరేచనకారి ఔషధయోగమును నుపయోగించవలయును. పైత్యసంబంధమగు తలనొప్పికిని యిదే చికిత్సను జేయవలయును.

2. నరముల సంబంధమగు తలనొప్పి.

ఈ సంబంధమగు తలనొప్పి, ఎల్లప్పుడును గూర్చుండి పనిచేయుట కలవాటు పడియుండిన దుర్బలుల యందును, నిస్సత్తువగల ఆడువారలయందు బుతుస్రావ కాలము సమీపము నందును, కలుగుచుండును. ఈ తలనొప్పి కలవాటు పడిన వారు, సామాన్యముగ పాలియుండి బలహీనతను వహించి, తేలికగా నుద్రేకము నొందుచుందురు. మనస్సంబంధమయినట్టి గాని, మనోవికార సంబంధమయినట్టి గాని, ఉద్రేకత యెంత మాత్రము కలిగియున్నను, యిట్టి వారలయందు తలనొప్పి కలుగుచుండును. నొప్పి ఒక స్థలముననే గాని, ఒక పార్శ్వముననే గాని లేక అన్నివైపులను గాని యుండవచ్చును. చెడిపోయిన పండ్లు కలవారలకు యీవిధమగు బాధ దవుడలయందుండినట్లు దోచును. హిస్టీరియావలన బాధనొందు పడుచులయందు తలలో నేదో యొక భాగమున మేకును గొట్టినట్లుండును. మూర్ఛవచ్చు ముందరను యిదేవిధమగు బాధ కలుగవచ్చును. ఈ విధమగు తలనొప్పి వచ్చువారలు సాధారణముగ తెరవచ్చు ముందర చలిని బొందుచు, నిర్లక్ష్యతతో గూడిన మాంద్యతను వహించియుందురు. ఇట్టివారలు ఉదయమున కొంతకష్టముతో నిద్రలేచెదరు. లేక నిద్రలేచుట యందే ఉద్రుతమగు బాధనందుచు, ఆహారమును మ్రింగుటయందు గష్టము నందుదురు.

ఈ సంబంధమగు తలనొప్పి మాన్పనందుటకు గాను అలవాటులను మార్చవలసి యుండును. అపరిమితముగ కాఫీని గాని తేయాకు నీళ్ళను గాని త్రాగువారు, పాలను సోడావాటరును త్రాగవలయును. పనుల మూలముననుగాని యితరకారణముల మూలముననుగాని క్రమకాలముల యందు భోజనముల జేయనివారు, ఆ పద్ధతిని మార్చవలయును. సోమరితనముగ నుండు వారుగాని, యెప్పుడును గూర్చుండి పనిచేయు వారలు గాని, క్రమమగు శరీరసాధకము బుచ్చుకొనుచుండ వలయును. చుట్టలను విరామములేకుండ గాల్చువారలు, యీ అలవాటులను దప్పించవలయును. లేదా, తగ్గించనైనను తగ్గింపవలయును. ఫలహారములకు బదులుగా ఆరోగ్యకరమగు ఆహారమును భుజింపవలయును. బుతుస్రావకాలమున ఆడువారలకు తలనొప్పి కలిగిన యెడల పొటాసియం బ్రోమైడు (1 వ అట్టరెటిక్కు)ను సేవించవలయును. ఫినాసిటిన్ 5 గ్రెయినులను కెఫీన్ సిట్రేస్ 4 గ్రెయినులను గలిపి యిచ్చుట వలనను గుణమియ్యగలదు.

## 3. పార్శ్వపు నొప్పి.

కపాల సంబంధమగు అయిదవ నరముయొక్క ఉపరిశాఖ అస్వస్థత నందినపుడు కంటి లోనొప్పి కనుపడవచ్చును మధ్యశాఖ అస్వస్థత నందినపుడు పై దవుడయందు నొప్పి కనుపడవచ్చును. క్రిందిశాఖ అస్వస్థత నందినపుడు క్రిందిదవుడయందు నొప్పి పండ్లు చెడిపోయి యున్నయెడల ఆయా దవుడల ననుసరించి యున్న పండ్లయందును నొప్పి యేర్పడును. ఈ నొప్పి ఒకప్పుడు ప్రొద్దుగుంకగనే తగ్గిపోవును. ఈవ్యాధికిని ఈక్రింద వివరింపబోవు నుదురుపోటునకును ఒకటే చికిత్సను జేయనగును.

## 4. నుదురుపోటు.

మన్యప్రాంతములయందు సాధారణముగ వ్యాపించి యుండెడి యీ నుదురుపోటు చలిజ్వరమునకు బదులుగా వచ్చుచుండును; అనగా, ఒకనాడు చలిజ్వరమును, రెండవనాడు నుదురుపోటును, గలుగుచుండును. ఈ నుదురుపోటునందు కనురెప్పలు యీడ్చునట్టిబాధ గూడ గలుగుచుండును. బాధ అతిశయమై తెరలు తెరలుగా వృద్ధియగుచు, కన్నులవెంబడి యు నీరుకారుచు, రోగి యెట్టి విధమయిన పనిని జేయుటకు వీలు లేకుండును. ఒకానొక ప్పుడు నరముయొక్క మార్గమునందు యెర్రని గీత కనుపడవచ్చును. ఈబాధ దినమంతయు ఉండవచ్చును. కాని, సామాన్యముగ రెండుమూడు గంటలలో నంతరించవచ్చును. ఈపో టునకుగాని నరముల సంబంధమగు ఇతర పోటునకుగాని ఉద్రిక్తతను వహించియున్న వార అందు జీర్ణాస్వస్థత గలిగినప్పుడెల్లను ఈవ్యాధి తటస్థింపవచ్చును. ఇట్టివారల మనస్సునం దెట్టిబాధ కలిగినను యీవ్యాధి జనించును. సూర్యాతపమునకు లోనగుట, అలసట, రాత్రు లయందు దెక్కువగ బని చేయుట, చలి, జలుబు, చెమ్మ, బలమగు భోజనములు, మానుగాలు విశ్రాంతి లేక పోవుట—యిట్టి కారణములన్నియు నీవ్యాధిని ప్రకోపింప జేయవచ్చును. స్త్రీలయందు, తరుచున బిడ్డల గనుట, దీర్ఘకాలము స్తన్యమునిచ్చుట, అధికమగు బుతు స్రావము కలుగుట—యిట్టివన్నియును నరసంబంధమగు నొప్పు (నాడీవ్యాధి) లకు గారణము లగుచున్నవి.

### చికిత్స.

ఇండియా దేశమునందు ఈ నుదురుపోటుయొక్క ఆరంభగతులు సామాన్యముగ చలి జ్వర సంబంధమయినవి అయియుండును గనుక అవసరమయిన యెడల 4 వ ఔషధయో గమును విరేచనకారిగ నిచ్చి, అయిదు లేక ఆరు గ్రయినుల క్వినీన్ మోతాదుల ప్రతిమూ డుగంటలకును యిచ్చినయెడల, కుదిరిక నందవచ్చును. విద్యుచ్ఛక్తి సంబంధమగు బ్యాట రీని ప్రయోగించుటవలన నొకప్పుడు నెమ్మది గలుగును. మిగులబాధగానున్న ప్రదేశమందు వేలితో నొక్కిపట్టుటచే నొకప్పుడు ఉపశాంతి కలుగవచ్చును. తలచుట్టును తడిగుడ్డను గట్టుటవలన నొకప్పుడు నొప్పి తగ్గవచ్చును. చీకటిగదిలో నెమ్మదిగా బరుండుటవలనను ఒక ప్పుడు నొప్పి వర్ధిల్లనవచ్చును. చేతులతో తలపయిన పట్టుకొనుటవలనను అప్పుడప్పుడు ఉపశాంతిని గలుగ జేయవచ్చును. వేడి తేయాకునీళ్లు, వేడి కాఫీ — వీటివలన నుపయోగ ముండవచ్చును. కణతపయినగాని నుదుటిపయినగాని చిన్నమస్టర్డుపట్టీని వేయవచ్చును.

సమానభాగములగు క్లోరల్ హైడ్రేటును క్యాంఫర్ (కర్పూరము) ను గలిసి తైలముగాజేసి మర్దనచేయుటవలన సామాన్యముగ జాలవరకు గుణమిచ్చును. వేడి కాపడము వలననుగుణము కలుగగలదు. కాని చాలావిషయములలో చల్లని ద్రవముల రాయుటవలనను మంచుగడ్డను గట్టుటవలనను యెక్కువగుణ మిచ్చినట్లు తెలియుచున్నది. ఈవ్యాధి తిరిగి తిరిగ వచ్చినయెడల చలిజ్వర సంబంధమయి నట్టియు బలహీనతతో గూడినట్టియు కారణములకు దోడుగా జీర్ణాశయము యొక్కగాని కాలిజము యొక్కగాని అస్వస్థత లుండి యుండునుగాన, అవసరమును బట్టి అందులకగు చికిత్సను జేయవలయును. పిమ్మట క్వినీన్ గలిసిన 1 వ బలవర్ధకౌషధము నియ్యవలయును. ఇది 15 దినములు వాడిన పిమ్మట నుపయోగము గనుపడక పోయిన యెడల 4 వ బలవర్ధకౌషధమును వాడి చూడవలయును.

## 5. మాడుపోటు.

పైన వివరింపబడిన తలనొప్పులకు భేదమైనట్టి మాడుపోటు మెదడున కధిక రక్తము పారుటవలన గలుగుచున్నది. ఇట్టి వ్యాధి సామాన్యముగ పెద్దవారలయందు గలుగుచుండును. మూర్ఛ, అంగవికృతిరోగము, ఎండదెబ్బ—యిట్టి ఉద్రుత వ్యాధులకు సూచన లక్షణముగా నది తటస్థించును గాన, యిందువిషయమై బహు జాగ్రతగా నుండవలయును. మూలశంక యందలి రక్తస్రావము ఆగిపోవుట వలనను, శరీరము అలవాటునందిన యితర రక్తస్రావము లేమయిన ఆగిపోవుట వలనను యీవ్యాధి తటస్థింప వచ్చును. ఉద్రుతగతులయందు బాధ అతిశయమై, కండ్లును ముఖమును యెర్రబారి, తల వైపుల బిగువునంది, చెవుల హునుకొను భారమగానుండి, దాహము జ్వరతలతో గూడియుండును.

### చికిత్స.

బాధ కొద్దిగా నుండినయెడల 4 వ ఔషధయోగమును విరేచనకారిగ నియ్యవలయును. చురుకుదనమును బుట్టించు బ్రాందీవైగైరాల నియ్యగూడదు. ఆహార పదార్థముల యందు జాగ్రతను వహించి మెదడున కేమియు పనిని గల్పించక, ఎండవేడిమికి లోను గాకుండ జాగ్రతను బుచ్చుకొనుచు, సాధారణమగు శరీర సాధకమును బుచ్చుకొనుచుండవలయును. బాధ ఉద్రుతముగానుండి జ్వరతను గూడియుండిన యెడల, కూర్చునియుండియే పూర్ణమైన విశ్రాంతిని బుచ్చుకొనుచు, తలకు జల్లని ద్రవపదార్థములను పైన రాయవలయును. వెండ్రుకలను బొట్టిగా నుండునటుల గత్తిరించవలయును.

## 6. శీర్ష సంబంధమగు తలనొప్పి.

శిరముపై చర్మము ననుసరించియున్న స్నాయువుల యొక్క వాత సంబంధమగు నొప్పులవలన నొకానొకప్పుడు తలనొప్పి కలుగవచ్చును. నొప్పి శిరమునకు పైభాగమున నుండియున్నట్లు గన్పట్టును. నుదురును ముడుచుకొనుటవలన బాధ అతిశయమగును. ఇతర స్థలములయందును నొప్పిఉండి, మూత్రమునందు యెర్రనిగసి తేలవచ్చును. వాతరోగమునకును, గౌట్ నకును, నియమింపబడిన చికిత్సనే దీనికిని జేయవలయును.

7. జలుబువలని తలనొప్పి.

జలుబువలన గలిగెడి తలనొప్పికి క్యాలోమెల్ (రసభస్మము) ను విరేచనకారిగ నియ్యవలయును. 10 గ్రెయినుల అమ్మోనియం క్లోరైడ్ నున్నూ 20 మినిముల స్పిరిట్సు అమ్మోనియా అరొమేటిక్ నున్నూ ఒక ఔన్సుజలములో గలిపి నాలుగు గంటల కొకపర్యాయము యియ్యనగును. అమ్మోనియా కార్బొనేట్ను వాసనఁ జూడవచ్చును.

---

## తామర.

తామర యనబడు చర్మవ్యాధి అంటుసంబంధమయినదయి యున్నది. ఇది సామాన్యముగా బిడ్డలయొక్క తలలయందు లేచును. తరచుగా ముఖము, శరీరము, కాళ్ళు, చేతులు, గోళ్ళయొక్క మొదళ్ళు, గడ్డము — యీభాగములయందును గనుపడుచుండును. ఇది యొక విధమగు పురుగుయొక్క యభివృద్ధివలన గలుగుచుండును, ఒకానొకప్పుడు అన్నివిధములైన తామరలును ఒకేవిధమగు పురుగువలన గలుగుచుండెనని తలంపబడెను గాని, ఇటీవల నీ పురుగునందనేక జాతు లుండియున్నట్లు కనుగొనబడెను. ఒకజాతి పురుగు, చాలవరకు శరీరమునందు వెండ్రుకలుండెడి భాగములను మాత్రమే, ననగా, తల, గడ్డము, కనుబొమ్మలు యితర రోమప్రదేశములు — వీటిని అనుసరించి యుండును. ఇంకొకవిధమగు పురుగు, చర్మమును, గోళ్లను, అనుసరించి యుండును.

### 1. తలలోని తామర.

తామర ఆరంభమగుటకు ముందుగా, అస్వస్థత నొందిన చర్మభాగములు యెఱ్ఱనై, దురదతోగూడి యుండును. ఈ అవస్థయందు యీ వ్యాధిని దెలియక పోవచ్చును. రెండు లేక మూడు దినములలో గోళాకారములుగ చిన్న పొక్కులు ప్రారంభమయి, యీ పొక్కులు కొద్దిగంటల కాలములోనే ద్రవసహితములై యుండును. ఈ పొక్కులు పగిలి అందలి స్రావము వ్యాప్తతనంది, ఆ భాగములందు క్రొత్తపొక్కులు యేర్పడి, వెనుకటి వలెనే నివియును అభివృద్ధి నందుచుండును. ఈ పొక్కులను దురదచే గోకుటవలన పక్కులు కట్టియుండును. ఈ అస్వస్థత భాగములందలి వెండ్రుకలు పగిలియుండును.

చికిత్స.

తలలో తామర యుండినయెడల, ఆయా భాగములయందలి వెండ్రుకల నన్నిటిని శుభ్రముగా గత్తిరించవలయును. ఆటుపిమ్మట దినమునకు రెండుపారులు నూటికి అయిదు వంతున కార్బాలిక్ ఆసిడ్ కలిపిన సొల్యూషనుతో గాని, కార్బాలిక్ సబ్బుతో గాని, తల నంతయు శుభ్రముగా గడుగవలయును. గాఢమయిన వినిగర్ను గాని, ఒకఔన్సునందు నాలుగుడ్రాములు పటిక కలిసిన సొల్యూషను గాని, అస్వస్థత భాగములపై నద్దవలయును. ఈ వ్యాధికి ఉపయోగించు యేమందులైనను అస్వస్థత భాగములయందు బాగుగా జొచ్చునట్లును, వెండ్రుకలయొక్క కుదుళ్లలోనికి బోవునట్లును, గట్టిగా రుద్దవలయును. ఈ వ్యాధి సంబంధమగు పురుగులు వెండ్రుకలయొక్క కుదుళ్ల ననుసరించి యుండును గాన, మందులు,

ఆ కుదుళ్లలోనికి జొచ్చుట మిగుల ఆవశ్యకమగుచు యున్నది. ఈ వ్యాధియొక్క అంటు గుణము, తాకుటవలనను గాలివలనను బహువ్యాప్తినొందును గనుక, రోగస్థుని జాగ్రత్తను బుచ్చుకొనవలయును. ఈ వ్యాధిగ్రస్తులు ఉపయోగించు దువ్వెనలను బ్రష్షులను, తువాళ్లను, సబ్బుబిళ్లలను, యితరులు ఉపయోగించరాదు.

గోవా పవుడరును వినిగర్‌లోగాని నిమ్మరసములోగాని కలిపి అస్వస్థత భాగముల రాయవలయును. గోవా పవుడరుతో చేయబడిన క్రైసారోబిన్ అనునది మిగుల ఉపయోగముగ నుండును. క్రైసోఫానిక్ అసిడ్‌ను వాసలీన్‌లో కలిపి రాసినను రాయవచ్చును. సబ్బుతోను ఉడుకునీళ్ళతోను అస్వస్థత భాగములను కడిగిన పిమ్మట ఒక డ్రాము ప్రిసిపిటేటెడ్ సల్ఫర్, అరడ్రాము అమ్మోనియేటెడ్ మెర్క్యూరీ, ఒక ఔన్సు లానోలీన్ — యీ మూడును కలిసిన ఆయింట్‌మెంటును ఉపయోగించవలయును. దీర్ఘవ్యాపితమగు విషయములలో ప్రతి దినమును ఒకసారి లినిమెంటు అయొడీన్‌ను రాయవలయును. అస్వస్థ భాగము పుండు పడునంతవరకు గాని, పచ్చిగా నుండువరకు గాని, దీనిని రాయవలయును.

2. ఒడలుప్పు తామర.

శరీరమునం దితరభాగములయందు యేర్పడు తామర నివయయందు, కార్బాలిక్ సబ్బుతో దినమునకు రెండుసారులు కడుగవలయును. 8 ఔన్సుల జలములో 2 డ్రాముల సోడా బైకార్బనేట్ కలిసిన సొల్యూషనుతో స్పాంజి చేయవలయును పిమ్మట జింక్ సల్ఫేట్ ఒక డ్రామును లానోలీన్ ఒకఔన్సును గలిసియున్న ఆయింట్‌మెంటును రాయవలయును. తలలో నేర్పడు తామరకు నియోగింపబడిన మందులను దీనికి ఉపయోగింపనగును.

---

## తిమురు వాయువు.

తిమురు వాయువు లేక ఉబ్బువాయువు అను వ్యాధికి ఆంగ్లేయ భాషయందు బెరిబెరి అందురు సింహళభాషయందు బెరి అనగా బలహీనత అని అర్థము బెరిబెరి అనగా అతిబల హీనత అని అర్థమిచ్చుచున్నది. శరీరమునం దుపరిభాగములను వ్యాపించియుండెడి నరముల యొక్క వాపుదలవలన నీ వ్యాధి సంభవించుచున్నది. అతినీరసత, కాళ్ళను పిక్కలను కట్టు పట్టి వంగకుండుట, యీ భాగములు తిమ్మిరుగా నుండి ఉబ్బుదలనందుట, కాళ్ళను చేతులను ఉపయోగించుటయందు బహుకష్టముగా నుండుట — యీలక్షణములతో గూడియుండును. వేళ్లయొక్క కొనలయందును తిమురు కలుగవచ్చును. కొద్దిదినములలోగాని, లేక కొద్దిగంటలలోనేగాని, శరీరము ఉబ్బుదల జూపి, ఊపిరిని పీల్చుట తొందరతోగూడి, నాడి నీరసతనందు, మూత్రము అతిహీనమై, దాహ మధికముగా నుండును. అతివిరేచనములును, తిమురును, పిమ్మట యేర్పడును.

ఈవ్యాధి కొన్ని నిర్దేశస్థలములయందు మాత్రమే గలుగుచుండును. ముఖ్యముగా నుష్ణప్రదేశములయందు యీ వ్యాధి వ్యాపించియుండును. చలిజ్వరము, కీళ్ళనొప్పులు,

రక్తహీనత — వీటివలన నీ వ్యాధి గలుగుచుండునని కొందరి ఆంగ్లేయ వైద్య శాస్త్రజ్ఞుల యొక్క అభిప్రాయమై యున్నది. మరికొందరు, వ్యాధిహితమయిన వరి అన్నమును భుజించుటవలన నీ వ్యాధి కలుగుచున్నదని అభిప్రాయులైయున్నారు. సారజనక సంబంధమగు ఆహారపదార్థములయందలి లోపమువలన నీవ్యాధి కలుగుచున్నదని యింకొక అభిప్రాయము కలదు.

ఈవ్యాధి చీనా దేశమునందు బహు పూర్వకాలమునుంచి యుండియుండెనని తెలియుచున్నది. ఇండియా దేశమునందు ఆంగ్లేయ వైద్యశాస్త్రజ్ఞులయొక్క దృష్టి యీవ్యాధికై 1835 వ సం॥ ప్రాంతముల దిరిగెను. జపానుదేశమునందలి దేశీయ వైద్య శాస్త్రజ్ఞుల యొక్కయు యూరోపియను వైద్యశాస్త్రజ్ఞుల యొక్కయు పరిశ్రమలు ఈ వ్యాధియెడల జ్ఞానము నభివృద్ధినందింప జేసినవి, ఈ వ్యాధి, ఇండియాదేశమునందు కంటె, మలయాదీవుల యందును, చీనా, జపాను, దేశములందును, విశేషముగ వ్యాపించి యున్నది. ఫిలిప్పయిను దీవులయందు యింకను విశేషముగ వ్యాప్తినందియున్నది. ఆస్ట్రేలియా దేశమునందును అక్కడక్కడ యీ వ్యాధి ప్రవేశించి యున్నది. దక్షిణ అమెరికా కొన్ని భాగములయందును యీ వ్యాధి కనబడుచున్నది.

ఉష్ణము, జనసమర్దత వాయువునందు తేమ అధికముగానుండుట, భూప్రదేశము చెమ్మగిలియుండుట — యీవ్యాధి కనుకూల కారణములై యున్నవి. ఉష్ణదేశములలో వర్ష ఋతువునం దీవ్యాధి అతిశయించి యుండును. ఇతర దేశములందు వసంతఋతువునందు శర దృతువునందును, యీ వ్యాధి యెక్కువగ వ్యాపించియుండును. ఈవ్యాధి సంబంధమగు పురుగులు మనుష్య శరీరమునందు బ్రవేశించునని కొందరి అభిప్రాయమై యున్నది. ఈ పురుగులు శరీరమునందు బ్రవేశించక, భూమిలోనుండియే విషమును వెడలింపజేయుననియు, ఆ విషమును పీల్చుట మూలముననగాని, మ్రింగుట మూలముననగాని, యీవ్యాధి సంభవించుననియు మరికొందరి అభిప్రాయమై యున్నది. ఈ రెండవ అభిప్రాయమే యెక్కువ ఆమోదమును వడసియున్నది.

జపానుదేశమునందు చేయబడిన పరిశోధనల వలన తెల్లబియ్యమును భుజించెడి వారల యందు యీ వ్యాధి వ్యాప్తత జెందుచున్నదని తెలిసికొనబడెను. ఉప్పుడు బియ్యమును తినెడి వారలకు యీవ్యాధి రాలేదు. కాని తెల్లబియ్యమును భుజించెడి వారలయందును చాల మంది యీ వ్యాధికి లోనుగాకుండుటను జూడ, యిందునకు యితరమగు కారణమేదియో సహాయకారిగ నుండునని తలపవలసి వచ్చుచున్నది. ఎట్లయినను, యితర కారణములకు దోడుగ నీతెల్లబియ్యపు భోజనము సమకూడినపుడు యీవ్యాధి ప్రవేశించునని స్పష్టమగుచున్నది. స్ట్రెయిట్స్ సెటిల్మెంట్సులో కొందరు మనుష్యులు తెల్లబియ్యమును భుజించుటకు ప్రారంభించిన అరువది దినములలో నీ వ్యాధిని గ్రహించిరి. ఉప్పుడుబియ్యమును భుజించుచున్న కొందరికి యీవ్యాధి కలుగలేదు.

ఫిలిప్పయిను దీవులలో నొకపటాలమునకు అహారమునకై ఆదివర కిచ్చుచున్న 20 ఔన్సుల తెల్లబియ్యమును మాన్పి 16 ఔన్సుల ఉప్పుడు బియ్యమును యిచ్చుట ఆరంభించిరి. ఆహారమునందు మార్పుచేయని 1908, 1909, సంవత్సరములలో 619 యును 558 యును

ఈ వ్యాధిని గ్రహించిరి. ఆహారమార్పును జేసిన పిమ్మట 1910 సంవత్సరములో 500మంది యీవ్యాధిని గ్రహించిరి. 1911 సం॥ నందు మొదటి ఆరుమాసములలో నొక్కడు మాత్రమే యీవ్యాధిని గ్రహించెను. క్రమముగ నీ ఆహారమార్పు అంతటను సలుపగ జేసిన పిమ్మట యీవ్యాధి మరల కనుపడనే లేదు.

ఈ వ్యాధి, భాగ్యవంతులకును పేదవారలకును జీవించుతీరులయందు వివక్షత లేకుండగనే, గలుగుచుండును. మిక్కిలి పసిబిడ్డలకు దప్ప తక్కిన అన్నివయసుల యందును యీ వ్యాధి కలుగవచ్చును. ఇరువది ముప్పదియైదు సంవత్సరముల మధ్య వయసున్నవారి యందు, గొప్పవ్యాప్తత నందియుండును. ఎనిమిది సంవత్సరముల లోపువయసున్నవారందును, వృద్ధులయందును, యీవ్యాధి బహు అరుదుగ దటస్థించును.

---

## చికిత్స.

ఈవ్యాధి వ్యాపించియున్న స్థలమునుండి రోగిని వెంటనే యితరస్థలమునకు దీసికొని పోవలయును. ఆహారపదార్థములందు తేలికైనవియును బలమునిచ్చునట్టివియును ఉపయోగింపవలయును. తాజాయైన శాకపదార్థములు, నిమ్మరసము, పాలు, గ్రుడ్లు, మాంసము— వీటిని ఉపయోగింపనగును. ఈ వ్యాధియందు అన్నమును దినగూడదు. వ్యాధి తీవ్రతస్థితియం దుండినయెడల, రోగి పరుండి యుండవలయును. రోగి యొక్క జబ్బుస్థితిలో లేకుండినయెడల, బాహాటమయినగాలిలో నెక్కువ కాలము గడుపవలసి యుండును. పరుండు స్థలము, భూమికి మిగుల యెత్తయిన ప్రదేశమునందుండి, పొడిగను, వెలుతురు గాలి వచ్చునట్టిదిగను ఉండవలయును. మూత్రమును వృద్ధిపరచుటకుగాను, 30 మినిమ్ముల మోతాదులలో స్పిరిట్ ఈతర్ నైట్రిస్‌ను పగటియందు మూడుసారులియ్యవలయును. రాత్రులయందు 8 లేక 10 గ్రెయినుల పల్విస్ ఇపికాక్ కో‌ను యియ్యవలయును. వ్యాధియొక్క అత్యుద్రిక్తావస్థలయందు విరేచనకారిగ 4 వ ఔషధయోగమును వాడవలయును. గుండెకాయ నీరసతనందిన రేగుదలతోగూడి విస్తరింపు నందినయెడల క్రమము దప్పకుండ టించ్చర్ డిజిటాలిస్‌ను యియ్యవలయును. శ్వాసకృచ్ఛము కలుగుచుండినయెడల నైట్రోగ్లిసరీన్‌ను ఆలస్యము లేకుండ సంపూర్ణమయిన మోతాదులలో దరుచుగ నియ్యవలయును. లోహమును మొదటినుంచియు వాడవలసియుండును. దినమునకు 2 లేక 3 గ్రెయినుల వాడవచ్చును. క్వినీన్‌ను కొద్దిమోతాదులలో నుపయోగించుట వలనను ఉపయోగముండవచ్చును. ఈ సందర్భమున 3 వ బలవర్ధ కౌషధయోగమును వాడనగును. రోగి వెచ్చనను గలుగజేయు దుస్తులను ధరించవలయును.

---

## తుంటినొప్పి (Saiatica)

తుంటియొక్క వెనుకవైపునుండి పోవు పెద్దనరము యొక్క అస్వస్థతవలన నీవ్యాధి కలుగును. ఈ భాగములయందు ఉద్రితమయిన వెత్తినొప్పి వ్యాపించియుండును. కదలుటవల

నను ఆభాగములయందు ఒత్తి పట్టుటవలనను బాధ అధికమగును. జలుబువలన గాని, తడి స్థలమందు గూర్చుండుటవలనగాని, యీవ్యాధి తటస్థింపవచ్చును. ఒకప్పుడు మలబంధము వలనను గలుగవచ్చును. ఈ సందర్భమునందు నొప్పి యెడమ సైఫులయందును. విశ్రాంతి తీసి కొని ఆ భాగమునందు వెచ్చనైన దుస్తులను ధరించుచు వేడి కాపడములను గాచుచు మిగుల బాధగానున్న చోట మస్టర్డుపట్టీలను వేయవలయును. 4 వ ఔషధయోగమును విరేచన కారిగ నియ్యవలయును. వాతరోగముతో సంబంధించిన విషయములందు అందులకగు చికిత్సను జేయవలయును. 15 గ్రెయినుల సోడా సేలిసైలిస్‌తో 5 గ్రెయినుల అంటిపైరిన్‌ను గలిపి ప్రతినాలుగు గంటలకును యిచ్చుటచే ఉపశాంతి కలుగ గలదు. ఎలెక్ట్రిక్ బ్యాటరీని ఉపయోగించుట వలన నొకప్పుడు గుణమియ్యగలదు.

## దగ్గు.

దగ్గు, ప్రత్యేకించి ఒక వ్యాధికంటె; యితర అస్వస్థతలయొక్క ఒకలక్షణ మయి యున్నది. దగ్గుయొక్క గుణము దానికగు కారణము నను సరించియుండును. శ్వాసకోశముల నుండి రక్తమును గ్రక్కుకొను వ్యాధియందు రక్తము వెలువడును. శ్వాసకోశముల ననుసరించియుండి పొరలయొక్క వాపుదలయందు ప్రక్కభాగములందు పోట్లతో గూడియుండును. కంఠవాయు సంబంధమగు దగ్గునందు లోహసంబంధమగు ధ్వనిని వహించియుండును. పొంగునందు, ముక్కువెంబడి ద్రవపదార్థము వెలువడును. కండ్లవెంబడి నీళ్ళుకారును. శ్వాస సంబంధమగు పడిసెము (రొమ్ముపడిసెము) నందు, దగ్గువెంబడి జిగట యైనట్టి కఫము వెలువడును. బిడ్డలకు పండ్లు వచ్చునపుడును, దగ్గురాత్రులయందు విశేషముగ నుండును. కొండనాలుకయొక్క వాపుదలయందును, కర్ణరోగములయందును, హిస్టీరియావ్యాధియందును, జీర్ణాశయము కారిజము అస్వస్థతలయందును, స్వరపేటికయొక్క అస్వస్థతయందును- దగ్గు కలుగ వచ్చును. ఈ వ్యాధుల యందును, యింక నితర వ్యాధులయందును, దగ్గు, స్పష్టమైనట్టియు ప్రధాన మైనట్టియు లక్షణముగా నుండును.

| | | | |
|---|---|---|---|
| టింక్చర్ క్యాంఫర్ కో | ... | ... | డ్రాములు 3 |
| స్పిరిట్సు అమోనియా అరోమేటిక్ | | | డ్రాములు 2 |
| జలము | ... | ... | ఔన్సులు 8 |

ఉచ్ఛ్వాస తెరల యందును, దీర్ఘవ్యాపితమగు శ్వాస సంబంధమగు దగ్గుల యందును, ప్రతి రెండు లేక మూడు గంటలకు ఒకఔన్సు చొప్పున పైమందును యియ్య వలయును.

| | | | |
|---|---|---|---|
| టింక్చర్ క్యాంఫర్ కో | ... | ... | డ్రాములు 3 |
| వైనం ఇపికాక్ | ... | ... | డ్రాము 1 |
| స్పిరిట్ ఈథర్ నైట్రిస్ | ... | ... | డ్రాములు 3 |
| జలము | ... | ... | ఔన్సులు 7 |

జలుబువలన గలుగు దగ్గుయందును, యితర విధములగు దగ్గులందును, కఫము వెలువడక పోయినయెడల, యీపైమందును ప్రతి మూడు లేక నాలుగు గంటలకు ఒకఔన్సు

చొప్పున నీయవలయును. ఒక సంవత్సరము వయసునందున్న బిడ్డలకు ఒక డ్రాము చొప్పున నియ్యవలయును. ఇంతకు మించిన ప్రతి సంవత్సరము వయసునకును, మోతాదును సంవత్సరమున కొకడ్రాము చొప్పున హెచ్చింప వలయును.

## దద్దురోగము. (Erysipolas.)

ఈ దద్దురోగము, ఒకవిధమగు పురుగుమూలమున చర్మము యొక్క కొంతభాగమును అందుక్రింది స్నాయువుల యొక్క త్వక్కలును, ఉబ్బుదల నందుటవలన గలుగుచున్నది. శరీరముయొక్క సహజదుర్బలత్వమువలనను, త్రాగుడు అధికమగుట వలనను, చెడుఆహారము వలనను, పరిశుభ్రతను ఆరోగ్యసంబంధమగు పద్ధతులను గమనించక పోవుటవలనను, కొన్ని ఆసుపత్రిలనుండియు జెయిలుఖానాలనుండియువచ్చు దుర్వాయువునకు లోనగుటవలనను-యీవ్యాధి సంభవింపవచ్చును. ఈవ్యాధిముఖముమీద నెక్కువగా గలుగుచుండును, దద్దురుభాగము మెరయుచు యెర్రనైమంటగలిగిమిగుల వాపుదలనందియుండును. ఈదద్దురువలన నొక్కప్పుడు ముఖమునుగుర్తించుటకే వీలు లేకుండును. చలి, వణకుట, తలనొప్పి, వాంతి వచ్చునట్లుండుట, పిమ్మట వాంతి కలుగుట, ఉద్రేక జ్వరము, మలబంధము—యీలక్షణములతో గూడియుండును. ఈ వ్యాధి పదిదినములు మొదలు పదునాలుగు దినములవరకు వ్యాపించి, యిందులో నాలుగుదినములు ఉబ్బుదల అతిశయమయి పుండ్లు యేర్పడిన పిమ్మట పొగలుగా నూడిపోవును.

అత్యుద్రేకావస్థయందు 105—104 డిగ్రీల జ్వరముండి, సంధిగుణముగూడ కనుపడ వచ్చును. అస్వస్థతాభాగమందు పోటు విశేషముగానుండి మాలిన్య మేర్పడిన వ్రణములుగా దేలి, మిగుల అపాయకరమై యీవాపుదల మెదడునకు వ్యాపించిన యెడల శీఘ్రముతో మరణము సంభవించినను సంభవింపవచ్చును.

పుండ్లుపడిన భాగములయందుగాని, శస్త్రమునందిన భాగములయందుగాని, టీకాలు వేసినప్పుడుగాని, చుట్టుభాగమంతయు యెర్రనై ఉబ్బుదల నందియున్నపుడు యీవ్యాధి తటస్థింపవచ్చును. ఒక గాయమునం దీవ్యాధి ఆవరించినపుడు స్రావము ఆగిపోయినను పోవును. గాయము దాదాపు కుదిరిక నందియుండిన యెడల తిరిగి తెరపు నందును.

### చికిత్స.

అస్వస్థతభాగముపైన వేడినీళ్ళలో ముంచిన లింటును వేసి, పైన చమురుగుడ్డను వేయవలయును. చుట్టును యెర్రగానున్న భాగముపైన 1 ఔన్సు జలములో 10 గ్రైయినుల సిల్వర్ నైట్రేట్‌ను గలిపిన సొల్యూషనును రెండు అంగుళముల మేరను రాయవలయును. ఇట్లు రాయుటవలన వ్యాధి వ్యాప్తత నందనేరదు. 4 వ ఔషధయోగమును గాని చిట్లామదమును గాని విరేచనకారిగ నిచ్చి రోగియొక్క బలము తగ్గకుండునటుల మంచి ఆహారము నిచ్చుచుండవలయును. 5 గ్రైయినుల ఫెనాసిటిన్ 4 గ్రైయినుల సిట్రిస్‌ను గలిపి ప్రతి నాలుగుగంటలకు జ్వరము తగ్గుటకుగాను యియ్యవలయును. బొబ్బలుగా దేలినయెడల మిగుల పెద్దవైననే తప్ప వాటినిగిల్లకూడదు. మాలిన్యమేర్పడిన యెడల శస్త్రము అవసరమయి యుండును. కార్బాలిక్ లోషనుతో దీనిని గడిగి అయొడోఫారమును వేసి డ్రెస్ చేయవలసి యుండును.

రోగి పరుండు స్థానమునకు పరిశుభ్రమగు గాలి వచ్చునట్లుండవలయును. గాలియొక్క వీచుటలు మాత్రము రోగిపై రాకుండ నుండవలయును. రోగి యొడల మిగుల శుభ్రతను గాపాడవలయును. ప్రక్క పైబట్టలను తరుచుగ మార్చుచుండవలయును. రసిచే మలినమైనం దిన గుడ్డలను వెంటనే దీసివేయ వలయును. ఇట్టి వస్త్రములను కార్బాలికు లోషనుతో గడుగవలయును. రోగియొక్క విరేచనముల యెడలకూడ జాగ్రతను వహించి యుండ వలయును.

---

## దాహము.

అతిదాహము వ్యాధియొక్క లక్షణమయి యున్నది. ఆరోగ్యస్థితి యందలి దాహము శరీరములోని రక్తమునందలి జలభాగము యొక్క హీనతను సూచించును. అతిదాహము కొన్ని విధములగు అజీర్తివ్యాధులనుగూడ నంటియుండును. ఇది అతి మూత్రవ్యాధి యొక్క ప్రధానలక్షణమయి యున్నది. అన్ని విషయములందును దాహమును నిలుపుచేయుటకు గాను పరిశుభ్రమగు జలమును మితముగ నుపయోగింప వచ్చును. వ్యాధి యందలి అతిదాహమునకు సిట్రేట్ ఆఫ్ మెగ్నీసియాను తగు మోతాదులలో నుపయోగింపనగును.

## ధాతునష్టము

### (మూత్రగ్రంథుల యొక్క క్షీణదశ)

మూత్రగ్రంథుల యొక్క అస్వస్థత అనేక విధములుగ నుండును. మూత్రగ్రంథుల యొక్క వాపుదల వలన నొకవిధమగు వ్యాధి వ్యాపించుచున్నది. శరీరమునందు గౌట్ స్థితి యేర్పడుట వలనను, సారాయిల నెక్కువగ త్రాగుట వలనను,—మూత్ర గ్రంథులకు యింకొక విధమగు అస్వస్థత యేర్పడును. క్షయవ్యాధి యందును యితరములగు అలసటను కలుగజేయు వ్యాధుల యందును, మరియొక విధమగు అస్వస్థత పుట్టును. వ్యాధి యేవిధమ గునది యైయున్నను, మూత్ర గ్రంథులయొక్క నిర్మాణమునందు కొన్ని మార్పులు కలిగి, పలువిధములగు లక్షణములు కనుపడును. మిగుల ప్రాముఖ్యతను వహించినట్టి ఆరంభ లక్ష ణము, మూత్రమునందు ఆల్బ్యుమిన్ అనబడు శ్వేతధాతువు నష్టమగుట, అయి యున్నది. ఇది కంటికి గనబడదుగాని, దీనిని కొంచెముగా నొక గాజు గొట్టములో గాని, ఇనుము లేక వెండి చెమిచాలో గాని, వేసి కాచిన యెడల, అల్బ్యుమిన్ ఉండి యుండినచో నిడికాడ్డియో గొప్పదియో తెల్లగానగును. ఒకటి లేక రెండు చుక్కలబలమగు నైట్రిక్ ఆసిడ్‌ను గలిపి నచో, మూత్రము స్వచ్ఛమయిన వర్ణమును దాల్చినయెడల అల్బ్యుమిన్ ఉండియున్నదని స్పష్టమగు నిదర్శనముగా నెంచవచ్చును. మూత్రమునందు ఆల్బ్యుమిన్ ఉండియున్నంత మాత్రమున మూత్రగ్రంథి క్షీణదశనది యున్నదని యెల్లప్పుడును అనుకొనుటకు వీలులేదు. చన్నీళ్ళలో స్నానము జేసిన పిమ్మట గాని, మాగడ, పిండివంటలు, గుడ్లు మొదలగు ఆహార పదార్థములను భుజించిన పిమ్మటగాని, ఒకప్పుడు మూత్రమునుండి అల్బ్యుమిన్ వెలువడ

వచ్చును. ఏకారణము వల్లనైనను అజీర్ణత ప్రవేశించి యుండిన యెడలను, కొందరి యొక్క మూత్రమునందు యీవ్యాధి కనుపడ వచ్చును. కారిజము అస్వస్థానస్థ[illegible]ండి క్రమము గా బనిజేయుచుండినపుడు, రేగుదలను గలుగ జేయు కొన్ని ఆమ్లములను మూత్రగ్రంధులకు ప్రో నిచ్చుటవలనను, ఆల్బుమిన్ మూత్రమునుండి వెలంవడవచ్చును. చలిజ్వర స్కార్లెట్ జ్వర వ్యాధులయందును, యీవ్యాధుల పిమ్మటను, ఒకప్పుడు యిట్లు తటస్థింపవచ్చును. కొందరియందు, అధిక స్నాయు పరిశ్రమము పిమ్మట నిది కలుగవచ్చును. ఈ యన్నివిషయము లందును మూత్రగ్రంధుల యొక్క క్షీణదశ లేదనియే చెప్పవచ్చును. మూత్రమునందు, అల్బుమిన్ కు దోడుగా, మూత్రమును స్రవించు మూత్రనాళములయొక్క పొరసంబంధమగు పదార్థములు కనుగొన బడినయెడల, మూత్ర గ్రంథులయొక్క క్షీణదశ ఉండె యున్నట్లు నిశ్చయింపదగియున్నది. ఈపొరసంబంధమగు పదార్థములను కనుగొనుటకు, మూత్రమును సూక్ష్మదర్శన యంత్రముచే బరీక్ష జేయవలసి యుండును. మూత్ర గ్రంధుల యొక్క క్షీణదశను కనుగొనుటకు, ఆల్బుమిన్ ఉండుటయేగాక ఆరంభదశయందు యీక్రింది లక్షణము లను కనుగొన నగును. (1) మూత్రము యొక్క పరిమాణమునందు తగ్గుదల (2) మూత్రమును విసర్జించుటకు రాత్రులయందు అనేకమారులు నిద్రలేచుట. (3) వెన్ను యొక్క క్రింది భాగమునందు యొకవిధమగు నొప్పి (4) అజీర్ణి (5) స్పష్టమగు గారణమేమియు లేకుండ నీరసత ఇట్టి లక్షణములతో గూడి మూత్రమునందు అల్బుమిన్ ఉండి యుండిన యెడల, యీవ్యాధి స్పష్టముగా నుండియున్నదని దెలంపవలయును. వ్యాధి అభివృద్ధి నందినకొలదిని తలనొప్పి, మత్తు, పాలిపోవుట, కండ్లయొద్ద ఉబ్బుదల జాపుట, ఊపిరిని బీల్చుటయందు దా యాసము, ముఖ్యముగా రాత్రులయందు దరుచుగా మూత్రమును విసర్జింపవలెననెడి యిచ్ఛ అజీర్తి లక్షణములు, వాంతి వచ్చునట్లుండుట, వాంతికలుగుట — యీ లక్షణములు వ్యాపిస్త తనందుచుండును. అనంతర గతులయందు తరుచుట నంజు ప్రవేశింపవచ్చును. శ్వాససంబంధ మగు అస్వస్థతలు, మూర్ఛలు, అంగవికృతిరోగము, కలుగవచ్చును.

చికిత్స.

మూత్రముద్వారా ఆల్బుమిన్ అనబడు శ్వేతధాతువు నష్టమగునట్టియు, మూత్రము చేరెడు మాంసగ్రంధి క్షీణదశ నందునట్టియు, వ్యాధులయందు బహు జాగ్రత్తగా చికిత్స చేయవలసియుండును. ఈ వ్యాధియొక్క ఉద్రేకగతులయందు రోగిని వెంటనే పరుండబెట్టి ఉద్రుత లక్షణములన్నియు తగ్గువరకును, రోగి చలిగాలి తగులకుండునట్లు చేయవలయును. ఈ వ్యాధియందు ఆహారపదార్థములుగ, పాలు, బార్లినీళ్ళు, జావలు, మాత్రమే ఉపయో గింప వలయును. మాంస సంబంధము లగునవి మూత్రగ్రంధులకు బనిని యెక్కువ జేయును గాన, వాటి నెంతమాత్రమును ఉపయోగింప గూడదు. వ్యాధి మిక్కుటమగు ఉద్రేక గతి యందుండిన యెడల, దినమున కంతయు ఒకటి లేక రెండు పైంట్ల పాలను సోడావాటరుతో గాని బార్లె నీళ్ళతో గాని కలిపి యియ్యవలయును. ఆకలి మందగించి యున్నపుడు, ఎన్న డును యింతకెక్కువగ నియ్యగూడదు. సాగుగతులయందు మూడు లేక నాలుగు పైంట్లను యియ్యవచ్చును.

దాహము నణచివేయుటకు గాను, సామాన్యజలమును గాని లెమనేడన్ను గాని విరివిగా డ్రాగవచ్చును. సారాయి పదార్థములను త్యజింపవలయును. ఉష్ణ ద్రవపదార్థములను డ్రాగుటవలనను, శరీరమునకు ఆవిరిని బట్టుటవలనను, రోగికి అడుగునను పైనయును వెచ్చగనుండునట్లు దుప్పట్లను గప్పియుంచుట వలనను, చెమట పుట్టునట్లు చేయవలయును. వెన్నుపయిపుల నొప్పి అధికముగా నుండినయెడల, కాపడములను గాచవలయును. టింక్చర్ జాబరాండీని 30 మినిముల చొప్పున నాలుగు గంటల కొకసారి యిచ్చుటవలన చెమటను వృద్ధిపరచును. గాని, దీనివలన కొందరకు గుండె అస్వస్థత గలిగి క్షీణగతి సంభవించుటయు, కొందరియందు కడుపులో త్రిప్పు వాంతి గలుగుటయు, సంభవించునుగాన, యీ మందును బహు జాగ్రతతో నియ్యవలయును. సోడా సల్ఫేటును గాని, మెగ్నీషియా సల్ఫేటును గాని, కొద్ది మోతాదులలో నిచ్చుచు, విరేచనము యెక్కువ ద్రవరూపమున నగునట్లుల జేయవలయును. విరేచనములు అధికముగ గాకుండగను, యిందువలన నిస్త్రాణ గలుగకుండగను, జాగ్రతను వహించి యుండవలయును.

రక్తమునందు మూత్రము గలిసి యుండు స్థితి సంభవించిన యెడల, చెమట యధికముగునట్లును, విరేచనముల మూలమున అధిక ద్రవపదార్థము వెలువడు నట్లును, పనిచేయవలయును. నంజు ఉండియుండిన యెడలనుయూ, యీ చికిత్సనే అధికముగ జేయవలయును.

వాంతి ఉండినయెడల, బిస్మతు సబ్ నైట్రిస్ నిచ్చుచు, ఆహారమును గొద్ది పరిమాణములుగ నిచ్చుచుండ వలయును. గుండెకాయ విస్తరింపునందుట వలన నీరసతను వహించి యుండిన యెడల, డిజిటాలిస్‌ను, స్ట్రిక్నీన్‌ను యియ్యవచ్చును. ఈ వ్యాధియందు మూత్రమును ప్రకోపింపజేయు ఔషధముల నియ్యగూడదని జాలమంది తలంతురు. గాని, వీనిని వాడుటవలన అపాయము లేమియు గలిగియుండలేదు. ఇందుకుగాను సిట్రేట్ ఆఫ్ పొటాష్, డిజిటాలిస్, కెఫీన్, మిగుల ఉపయోగనీయములు. వీనిలో చివరది మిగుల బలముగు మూత్రప్రకోపకారి అయియున్నది. యీ వ్యాధియందు దీనియొక్క గుణము త్వరలో పట్టువిడిపోవును. జలమును విరివిగా నుపయోగించుట వలన మూత్ర ప్రకోపకారిగ బనిచేయును. ఉద్రేకస్థితియందు శ్వేతధాతు వను దగ్గించు ఓషధి యేదియు గనిపెట్టబడి యుండలేదు గాని, వ్యాధి శాంతత నందిన పిమ్మట ఆర్సెనిక్ (పాషాణము) యీ విషయమున తరుచు గా నుపయోగముగ గనుగొనబడి యుండెను.

స్వస్థావస్థయందలి రక్తహీనతకై ఐరన్‌ను ఉపయోగింపవలయును. వ్యాధి దీర్ఘ వ్యాపక స్థితియందుండినను, ఆహార విషయములందును, శరీరమునను చెమటను గలుగజేయు విషయములందును, విరేచనకారుల నిచ్చుట యందును, పై అంశము లనే గమనంపవలయును.

---

## నంజు.

నంజు, యితర వ్యాధులయొక్క ఫలితముగ గాని, లక్షణముగ గాని, దటస్థించును. రక్తముయొక్క జలభాగము రక్తనాళములయొక్క పొరల గుండా వాటిని జొట్టి యుండెడి స్నాయువుల యొక్క అల్లికల లోనికి బ్రవేశించుటవలన యేర్పడెడి వాపుదల, నంజు అన

బడును. రక్తప్రసారమునకు గలిగెడి నేదియో ఆటంకమును బలపరుస్తును ప్రవహించకుండ నిలుచుట మూలమున నీవ్యాధి వ్యాపించునట్టి భాగములు, సామాన్యముగ పాదములును ఉదరమును అయియున్నవి. మూత్రగ్రంథులు, గుండెకాయ — వీటియొక్క వ్యాధులయందు, ముఖమును, ఒకప్పుడు శరీరమంతయును, యీ అస్వస్థత చేర్పడును. ఈ వ్యాధి బయటకు దేలినపుడు, అస్వస్థత భాగములను వేళ్ళతో నొక్కినయెడల గుంటలుపడి, యీగుంటలు క్రమముగా సర్దుకొనును.

నంజు, యీ క్రింది కారణములలో నేదైనొకదానను గలుగ వచ్చును. — చలిగాలి తగులుట, మూత్రగ్రంథుల యొక్క అస్వస్థత గుండె కాయ యొక్క గాని శ్వాసకోశముల యొక్క గాని, అస్వస్థత, కారిజముయొక్క గాని ప్లీహముయొక్క గాని అస్వస్థత రక్తహీనత లేక పాండురోగము, ఋతుస్రావ సంబంధమగు అస్వస్థతలు, చలిగాలికి గాని చెమ్మకు గాని లోనగుటవలనను, శరీరమునకు విరివిగా చెమట గలుగుచున్నపుడు చల్లనిగాలిలో గూర్చుండుట వలనను, నంజు కలుగవచ్చును. ఈవిధముగ, చర్మముయొక్క వ్యాపారము అకస్మాత్తుగా నిలుపుచేయబడి, రక్తమునందలి జలభాగము స్నాయువులయొక్క అల్లికలయందు నిలువ చేయబడుటవలన, నీవ్యాధి కలుగుచున్నది. మూత్రగ్రంథులను దరుచుగ నస్వస్థతనంది, మూత్రగ్రంథులయొక్క క్షీణదశకు ప్రారంభదశగ దటస్థించినను, దటస్థింపవచ్చును. చలిగాలి సోకుటవలన గాని, యితర కారణముల వలనగాని, చెమటపట్టుట నిలిచిపోయి, శరీరమంతటను అకస్మాత్తుగ నంజు గనబడిన యెడల, రోగికి వెచ్చగానుండునట్లు తగుజాగ్రత్తలను బుచ్చుకొని; వేగులపై బని చేయించుచును, నీళ్ళ విరేచనము లగుటకును, 4వ ఔషధయోగమును విరేచనకారిగ నియ్యవలయును, చర్మముపై బని చేయుటకు గాను, పల్విస్ ఇపికాక్ కో ను 5 గ్రయినుల మోతాదులో దినమునకు మూడుసారు లియ్యవలయును. మూత్రము అభివృద్ధి అగుటకు గాను అర్ధ డ్రాము మోతాదులలో స్పిరిట్ ఈతర్ నైట్రిస్ను యియ్యవలయును. వేడినీళ్లస్నానములును ఉపయోగకరములుగ నుండును.

మూత్రగ్రంథులయొక్క అస్వస్థత వలనగలిగెడి నంజుయందు కనురెప్పలును జననేంద్రియభాగములును నడలింపునంది, పాదములును కాళ్ళును త్వరలో నస్వస్థత నందును.

కారిజముయొక్క గాని ప్లీహముయొక్క గాని అస్వస్థతవలన యేర్పడిన నంజుయందు ఉదరభాగము ముందుగా ఉబ్బుదల నందును. దీర్ఘవ్యాపితమగు త్రాగుబోతుతనము వలనను కాలేయ రోగము వలనను, జీర్ణాశయ అస్వస్థతవలనను, యిట్లు సంభవించును.

రక్తహీనతవలన గలిగెడి నంజు, పేగులలోని పురుగులవలన గలిగినదే తప్ప, యీ వ్యాధి అంతరావయవములకు వ్యాపించదు. ఈవ్యాధి, పాదములు చీలమండలు, కనురెప్పలు — యీ భాగములయందు మాత్రమే సామాన్యముగ నావరించి యుండును.

ఋతు సంబంధమగు అస్వస్థతవలన గలిగెడి నంజు, యెక్కువ అపాయకర మయినదిగాక, సామాన్యముగ పాదములను మాత్రమే ఆశ్రయించి యుండును. ఒకప్పుడు చేతులయందును ముఖమునందును గూడ ఉబ్బుదల కనుపడి, సాయంకాల సమయములందు అధికముగ నుండును.

ఈ అన్నివిధములగు నంజులయందును, ఆయా అంతరావయవముల యొక్క అస్వస్థతా ఫలితముగ దెలియనగుచున్నవి గనుక, అట్టి అంతరావయవముల యొక్క అస్వస్థతలకు దగు చికిత్సల గావించుటవలన, నీవ్యాధి కుదిరిక నందగలదు. గుండెనంజునకగు చికిత్సను గూర్చి మాత్రము యీక్రింద వివరించడ మయినది. మూత్రగ్రంథులయొక్క క్షీణగతివలన గలిగెడి నంజునకు ఆవ్యాధి సందర్భమున జూడనగును.

## గుండెనంజునకు చికిత్స:

గుండెయొక్క అస్వస్థత యేర్పడిన రోగియందు, వెలుతురు, గాలి, శరీరసాధకము, విశ్రాంతి, నిద్ర — వీటి విషయమై బహుజాగ్రత్తను దీసికొనవలయును. అహారవిషయమున, జీర్ణాస్వస్థత గలుగకుండ బలము నిచ్చు పదార్థములను బుచ్చుకొనవలయును.

గుండెఅదరు ఉద్రుతావస్థయం దుండినయెడల, రోగి పూర్ణమైన విశ్రాంతిని దీసికొనవలయును. ఏతీరున బరుండియుండిన రోగికి మిగుల సౌఖ్యకరముగ నుండునో, ఆతీరున బరుండియుండవలయును. శరీరమునందు ఉబ్బుదల యేర్పడకుండ, జీర్ణాస్వస్థత మాత్రమే ఉండియుండినయెడల, కేవలము ద్రవపదార్థములను మాత్రమే ఆహారముగ నిచ్చుచుండవలయును. ఉబ్బుదల ఉండియుండిన యెడల అహారమునందు ద్రవపదార్థము అతిశయముగ నుండరాదు. గుండె అస్వస్థతలయొక్క విశేషగతులలో, యిందు సంబంధమగు బలవర్ధకౌషధములు అవసరములగును. ఈ బలవర్ధకౌషధములు టింక్చర్ డిజిటాలిస్, టింక్చర్ స్ట్రోఫాంతస్ న్నూ అయియున్నవి. జీర్ణాస్వస్థత గలిగియున్నపుడు, శీఘ్రమగు ఫలితములు కావలసివచ్చిన యెడల, స్ట్రోఫాంతస్ ను ఉపయోగించుటయే ఉత్తమమయి యున్నది. నంజు అతిశయముగా నుండి, మూత్రపరిమాణము హీనమయి యున్నయెడల, డిజిటాలిస్ యెక్కువ ఉపయోగమయియున్నది. జీర్ణాస్వస్థతో గూడిన జలుబు ఉండియుండిన యెడల, కొద్దిమోతాదులలో, పిల్యూలా హైడ్రార్జరై గాని, హైడ్రార్జరైకంక్రేటా (గ్రేపవుడరు) గాని, క్యాలోమెల్ (రసభస్మము గాని, ఇయ్యవలయును, నంజు మిగుల తీవ్రతగతియం దుండిన యెడల, నీళ్ళవిరేచనము లగునట్లు చేయు లవణసంబంధమగు విరేచనకారుల (4 వ ఔషధయోగము) జలము యెక్కువగ గలువకుండ నియ్యవలయును. మూత్రము విరివిగ యగునందులకుగాను, సిట్రేట్ అఫ్ పొటాష్, అసిటేట్ అఫ్ పొటాష్ లను యియ్యవలయును. మూత్రమునందు అల్బుమిన్ (శ్వేతధాతువు) ఉండియుండినయెడల, గుండె సంబంధమగు బలవర్ధకౌషధములు దీని పరిమాణమును తగ్గింపజేయును. గుండెసంబధమగు బలవర్ధకౌషధముల వలన మూత్రము వెలువడుట పూర్ణముగ నుండినయెడల, పైనజెప్పబడిన సిట్రేట్ అఫ్ పొటాష్ ఆసిటేట్ అఫ్ పొటాష్ లకు దోడుగా కఫీన్ ను ఉపయోగించుటవలన మిగుల గుణముగా నుండును. నిద్రపట్టకపోయినయెడల, కొంచెము బ్రాందీనైనను లేక సల్ఫోనల్ నైనను యియ్యవచ్చును. నిద్రపట్టుటకును, రక్తప్రచారమును వృద్ధిపరచుటకును, లైకర్ మార్ఫియా హైడ్రోక్లోర్ మన్నూ ఉపయోగింపవచ్చును. పేగులయందు వాయువు కూడుకొని యుండినట్లుండి, ఉబ్బరమును గనుపరచినపుడెల్లను, కార్మినేటివ్ మిక్స్చర్ ను యిచ్చుటవలన మిగుల ఉపయోగముండగలదు.

---

## నడుము నొప్పి.

నడుము నొప్పియందు, బాధ ఉద్రిక్తమయి, నడుము యొక్క స్నాయువులు పట్టినట్లుండి, కదలుటవలన, బాధ అతిశయమయి, నడుచుటనుండి రోగిని నిర్బంధపరచును. ఈ స్థితి తరుచుగ నాకస్మికముగ గలుగుచుండును. దీనిని ఒకవిధమగు వాతరోగముగ నెంచవచ్చును. ఈవ్యాధి ఒకప్పుడు తీవ్రముగా అలవాటులేని పనులను జేయుటయందు గలుగును. మూత్రగ్రంథులయొక్క అస్వస్థతవలన గలిగెడి బాధను ఈ బాధను భేదముగ గుర్తింపవీలుకాక పోవచ్చును. కాని, కదలుటవలన యీ నడుము నొప్పి బాధ అతిశయమగును. ఈ వ్యాధియందు, మూత్రములో శ్వేతపదార్థ ముండుటగాని, తరుచుగ మూత్రము విసర్జింపవలెననెడి యిచ్ఛగాని, ఉండదు,

### చికిత్స.

ఈ నొప్పియొక్క తెరవచ్చుటగా ముందుగా మలబద్ధ మేర్పడి మూత్రము తీవ్రవర్ణమును వహించి యుండినయెడల, 4 వ విరేచన కారియందు 8 గ్రెయినుల పొటాష్ నైట్రేట్ను కలిపి. దీనిని దినమునకు మూడు మోతాదుల చొప్పున నియ్యవలయును. విరేచనము క్రమముగా నగుచుండి, మూత్రము సాధారణ వర్ణముతో కూడి క్రమపరిమాణముల యందుండినయెడల, వేడికాపడములతో గాచుట మిగుల నుపయోగముగ నుండును. మస్టర్డ పట్టీలను వేయవచ్చును. వెన్నుపైపుల వేడి చమురుతో రుద్దియైనను రాత్రులయందు బాధ ఉద్రిక్తముగా నుండినయెడల పల్విస్ ఇపికాక్ కోను గాని, క్లోరల్ హైడ్రేట్ను గాని, ఉపయోగింపనగును.

మూత్రము తీవ్రవర్ణమును వహించియుండినచో కీళ్ళనొప్పుల కగు మందు నుపయోగించవలయును. జ్వరతగానుండినయెడల డయురెటిక్కులలో 2 వ ఔషధయోగము నుపయోగించవలయును. పైన రాయుటకు సమభాగములుగ కర్పూరతైలము నున్నను చమురు నున్నను కలిపి రాయవచ్చును. లినిమెంట్ అయొడిన్ నున్నను పైన రాయవచ్చును. లినిమెంట్ క్లోరోఫారమునున్నను లినిమెంట్ ఓపియమునున్నను గూడ పైనరాయుట నుపయోగింపనగును. విద్యుచ్ఛక్తి సంబంధమగు బ్యాటరీని ఉపయోగించుటవలన నుపయోగముండ గలదు. అత్యుద్రేకావస్థలయందు మార్ఫియాను సూదిద్వారా లోనికి యింజక్టు చేయవలసి యుండును,

---

## నపుంసకత్వము.

జననేంద్రియావయవము యొక్క కామవ్యాపారములకు అవసరమగు నరముల సంబంధమగునట్టిగాని, విద్యుచ్ఛక్తి సంబంధమగునట్టిగాని, రాకపోకలకు ఆటంకము కలుగుటవలన, నీ అవయవమునందు గలిగెడి నిర్వ్యాపారత్వము నపుంసకత్వ మనబడుచున్నది. ఈ ఆటంకమువలన, నీ యవయవమునందలి నరములయొక్క అల్లికలుగాని, స్నాయువులుగాని, దుర్బలతనంది, తమ స్వభావసిద్ధమగు శక్తిని నష్టమందుచున్నవి. ఈ అస్వస్థత,

సామాన్యముగ పురుషులయందు కలుగుటను గురించి మాత్రమే, వాడుకలోనున్నది. కాని స్త్రీలయందును యిట్టివిధమగు నస్వస్థత యుండియుండుటకు ఆస్పదము ఉండియున్నట్లు, శారీర శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. స్త్రీలయందిట్టి అస్వస్థత ఉండుటకు వీలు ఉండియున్నదని తెలియనంతున, స్త్రీలయందు కలుగు యీ విధమగు అస్వస్థతా లోపమునకు సరియగు పదము, ఆంధ్రభాషయందు నిర్మాణము నందియుండలేదు.

కామోద్రేకత యందు జననేంద్రియ భాగములు ఘనతనందుటకు గాను, స్నాయువులు, రక్తనాళములు, నరములు — యివియన్ని సమకూడి పనిచేయవలయును. వీటిఅన్నిటిలోను ముఖ్యమయినవి, నరముల సంబంధమగు — మెదడునందలియు, వెన్నుపాము నందలియు, మూపకమునందలియు — నరములయొక్క మధ్యస్థానములను, వీటినుండి యీ అవయవభాగములకు వ్యాపించు నరములయొక్క అవసానభాగములును, అయియున్నవి. కొన్ని నరములు తెగిపోవుట వలన నపుంసకత్వమేర్పడ వచ్చును. ఈ నరములయొక్కయు, నరముల మధ్యస్థానముల యొక్కయు పరస్పరసంబంధములు, కొద్దికాలమువరకే చెడుటవలన గాని, వ్యాధివలన స్థిరముగ చెడుటవలన గాని, యీ అస్వస్థత యేర్పడవచ్చును. ఈ నరముల యొక్క మధ్యస్థానముల యందుండెడి శక్తి ఉడిగిపోయినప్పుడు, యే మందుల వలనను యీ నష్టమును పూర్తిపరచుటకు వీలుండజాలదు.

నపుంసకత్వము కలుగుటకు సామాన్యమయిన కారణములు — ఇంద్రియమును దీవి చేయుటయందలి కొన్ని దురభ్యాసములు, అధిక సంభోగము, సుఖసంబంధ వ్యాధులు — అయియున్నవి. గనోరియా వ్యాధియొక్క అతిశయ గతులందు నపుంసకత్వము కలుగును. కొలుకు రోగమునందును, ఒకానొకస్థితియందు నపుంసకత్వము తటస్థించును. ఈ రెండు వ్యాధులకును హక్కుదారుల విషయమై చెప్పనే అవసరములేదు. ఇట్టి వారలు తమవ్యాధి ఫలితములను సంతానములకు వ్యాపింపజేయుటకు వీలులేకుండ నపుంసకత్వ మేర్పడుట లోకమునకు మేలు కలుగుటయే గదా? ఒక పక్షవాతమునందును, పాండురోగమునందును, అతి మూత్రమునందును, ధాతు నష్టముయొక్క తీవ్రదశయందును, సీసపు సంబంధమగు విషప్రయోగము లందును, ఒకప్పుడు నపుంసకత్వము తటస్థింపవచ్చును. ఇట్టి విషయము లందు ఆయా వ్యాధులకగు చికిత్సలను జేయవలయునుగాని, నపుంసకత్వమునకై చికిత్స జేయుచు అసలు వ్యాధిని అశ్రద్ధ జేయుట కూడదు. చుట్టకాల్చుటయు, నల్లమందును వాడుటయు, అలవాటు అయినవారలయందు యీ అస్వస్థత యేర్పడుట కలుగవచ్చును. గవదవ్యాధి యందు ఒకప్పుడు వృషణములు అస్వస్థత నందుటమూలమున, నపుంసకత్వ మేర్పడవచ్చును. గుఱ్ఱపుసవారీ చేయుటయందును, బైసికిల్ సవారీ చేయుట యందును, జీనులు సరిగా లేక జననేంద్రియములయొక్క మృదుభాగముల కొత్తిడి దగులుటవలన, నీవ్యాధికి ఉద్యుక్తత యేర్పడ వచ్చును. —

బలప్రదమగు చికిత్సను చేయుటకు గాను, మెదడునందలి భాగములకు బలమును గలుగ జేయు మందుల నుపయోగింపవలయును. అనుక్రమణిక యందు యీ వ్యాధి క్రింద సూచింపబడిన ఔషధములను బహు జాగ్రత్తతో వాడవలయును. ఇందు, డామియానా సంబంధ

మగు యక్ట్రాన్స్టు డామియానా (సాలిడ్)ను మాత్రల గాజేసి పుచ్చుకొనుటవలన, మిగుల ఉపయోగముగ గనుగొనబడెను. మెదడునకు బలమును గలుగజేయుటకు స్ట్రిక్నీన్ (విషముష్టి) నున్నూ, ఉపయోగింప నగును.

---

## నాడీ వ్యాధి.
## (తలనొప్పి చూడుడు)

---

## నా లి కు రు పు.

నాలికురుపు సంబంధమగు నాలిపురుగు, ఆఫ్రికా, దక్షిణ అమెరికా ఖండము బందును, యిండియా, పర్షియా, తురుష్కస్థాన, అరేబియా దేశములందును వ్యాపించి యున్నది. ఈపురుగు, ఒక అడుగు మొదలు ఆరు అడుగులవరకు పొడుగగును, 1/10 అంగుళము లావును, అగువరకు యెదుగును. ఈ పురుగుల యందు మగపురుగు తెలియబడి యుండలేదు. ఈపురుగు మనుష్యశరీరమందు త్రాగెడు మంచినీళ్ళద్వారా ప్రవేశించును. ఈపురుగు శరీరమునందు ప్రవేశించిన పిమ్మట మూడుమాసములకును పండ్రెండు మాసము లకును గల మధ్యకాలములో నభివృద్ధినంది కురుపుగా బయటికి దేలును. ఈకురుపులు సామాన్యముగా కాళ్ళపైనగాని పాదములపైనగాని దేలును. నాలి పురుగు, యిట్లు యేర్పడిన కురుపుద్వారా బయటికి మార్గమును గనుగొనిన పిమ్మట సుమారు పదునైదుదినములకు దాని యొక్క గర్భాశయమునుండి అండములను వెలిబుచ్చి మనుష్యశరీరమునుండి వెలుపడి పోవు టకు పంసిద్ధమై యుండును. ఈస్థితియందు దీనిని బైటికి లాగుటకు వీలగనుండును. సాధారణముగ నొక్కసారి ఒక పురుగుమాత్రమే గనబడుచుండును; రెండు మూడు కనబడు టయు సామాన్యమయి యున్నది. ఒక్కొకప్పుడు డజనుల కొలదియు కనబడవచ్చును. ఈ పురుగు బయటికి దేలు ముందర జ్వరమును దద్దురును కలుగవచ్చును. అస్వస్థతభాగ సమీపమున సన్నని దారమువలె నుండును. ఈపురుగు తెల్లగా నుండును.

### చి కి త్స.

నాలిపురుగు వ్యాపించియుండిన ప్రదేశమునందు అనుమానస్థలముల యందలి మంచి నీళ్లను గాచి త్రాగవలయును. మంచినీళ్ళ స్థలములకు సమీపమున నీవిధమగు కురుపులను గడగనియ్యగూడదు. పురుగుయొక్క కొన బయటపడగనే ఒక చిన్న పుల్లకు దీనిని జుట్టి, యీ పుల్లలో బురుగును అనుదినమును కొంచెముగా బయటికి లాగుచుండవలయును. పురుగు తెగి పోకుండునటుల పటికనీళ్ళతో దడిపి లింటును గట్టవలయును. ఇట్లు చేయుటవలన పురుగు తెగిపోకుండ గట్టిపడగలదు. పుల్లతో నీపురుగును బైటకులాగుటలో బహు నెమ్మదిగా లాగవలయును; ఒకప్పుడు ఒక అంగుళము మాత్రమే బైటికి వచ్చును; ఒక అడుగువచ్చినను రావచ్చును. పురుగుయొక్క మార్గమున గొంచెము చమురుతో నయిన దుష్టుటవలన దానిని సడలింపు నంద జేయును. అస్వస్థతభాగమున భావిగా నీళ్ళను బోయుటవలన, పురుగును బయ

టికి లాగుటయందు వీలుకలుగును. పురుగు తెగిపోయినయెడల కురుపుగాదేలి జ్వరము ప్రారంభింపవచ్చును. అంతట పిండికట్లను గట్టి మాలిన్యమును తొలగింపవలయును; పురుగుయొక్క కొన మరల నందినయెడల వెనుకటివలెనే జేయవలయును.

1 కి 1000 చొప్పున చేయబడిన మెర్క్యూరీ పెర్క్లోరెడ్ సొల్యూషనును హైపోడెర్మిక్ పిచికారీతో పురుగుయొక్క శరీరములోనికి బంపినయెడల, పురుగు చనిపోవును. అంతట దానిని బయటికి తేలికగా పైవిధమునవే లాగవచ్చును. ఒకచుక్క కార్బాలిక్ ఆసిడ్ నైనను పురుగులోనికి పిచికారీచేసి దానిని చంపి పిమ్మట బయటికి లాగవచ్చును.

---

## నిద్రరామి.

నిద్రించుటకు యిష్టములేకుండ నుండవచ్చును; లేక, నిద్ర కలతజెంది యుండవచ్చును. పగటియందు నిద్రగలిగి రాత్రియందు నిద్రపట్టక పోవచ్చును. రక్తహీనతతో గూడియుండిన పాండురోగము మొదలగు వ్యాధులందు నిద్ర పట్టదు. అజీర్ణత, మనోవ్యాధి, మనోద్రేకత, ఆలస్యభోజనము, సారాయి, పొగాకు, రాత్రులందు ఘాటయిన తేయాకునీళ్ళు, కాఫీలను ద్రాగుట, శరీరసాధకము లేకపోవుట, గాలి క్రమముగా జొరని గదులు, మిగుల కఠినమైన పాన్పులు, అతివేడిమి, దోమలు — యీకారణములలో దేనివల్లనైనను నిద్రపట్టక పోవచ్చును. అజీర్ణ వ్యాధికలవారు, భోజనము వెంటనే నిద్రింప యత్నించరాదు. రాత్రులయందు సారాయి, పొగాకు, తేయాకునీళ్ళు, కాఫీలను త్యజించవలయును, ఇట్టి వారియందు శరీర సాధకము అవసరమయి యున్నది. దినవ్యాపారమును గురించి రాత్రులలో మనమునం దుంచుకొనక, కల్పనా కథలను జదువుటయు మానవలయును. మనస్సునకు పరిపూర్ణమైన విశ్రాంతి నియ్య వలయును. శరీరముయొక్క బలము తగ్గుదల యందుండినపుడు, రాత్రులయందు తేలిక యిన పదార్థములను భుజించుటవలన తేలికగా నిద్ర కలుగగలదు. పరుండు గదిలోనికిగాలి బాగుగా వచ్చుచుండున ట్లుండవలయును. ముదుసలులు గాని, రక్తప్రచారము దుర్బలముగ నున్నవారలు గాని, పరుండునపుడు పాదములయొద్ద వేడినీళ్ళతో నింపియున్న సీసాలను బెట్టుకొనవలయును. పొటాసియం బ్రోమైడ్ (1 వ అల్టరెటివు)ను పరుండు ముందర దీసికొనవలయును. పగటి యందు నిద్ర కలుగుచు రాత్రియందు నిద్ర రాకపోవుట యందు, యీ ఔషధము మిగుల ఉపయోగముగ నుండును. జీర్ణావయవములు స్వస్థతయందుండి, విరేచనము క్రమముగా నగుచుండిన యెడల, అప్పుడప్పుడు క్లోరల్ హైడ్రేట్ను వాడ నగును. క్లోరల్ హైడ్రేట్ను అలవాటగునటుల మాత్రము ఉపయోగింపగూడదు.

---

## నిద్రరోగము.

పశ్చిమ ఆఫ్రికా యందు వ్యాప్తతనంది యున్న యీ నిద్రరోగము మెదడు సంబంధమగునదిగా నెంచబడుచున్నది. ఈ కొన్ని నిర్దిష్టస్థలములకే చెంది యున్నదిగాని, యీ నిర్దిష్ట స్థలము లందలి మనుష్యులు యితరదేశముల కేగిన గొన్ని సంవత్సరముల

పిమ్మట నీ వ్యాధిని జెందవచ్చును. ఈ మధ్యకాలములో నీ వ్యాధి శరీరము నందు పక్వము నందుచుండ వచ్చును. కొంతకాలము క్రిందట నీగ్రోజాతివారలు మాత్రమే యీ వ్యాధి నందుచుందురని యొక అభిప్రాయ ముండెడిని. గాని, యిప్పుడు అట్లు అనుకొనుటకు వీలు లేదని స్పష్టమయినది. ఈ వ్యాధి గలుగుటకు కారణము ఇంతవరకు నిశ్చయింపబడి యుండలేదు.

### లక్షణములు.

నిద్రరోగము బహు నెమ్మదిగ బ్రవేశించును. క్రమముగా హెచ్చెడి మందత్వత, శరీరాయాసము, అప్పు డప్పుడు తలనొప్పి, తలతిరుగుట, జ్వరము, నిద్రమత్తుతోగూడిన ముఖము—యివి యీవ్యాధి లక్షణములై యున్నవి. క్రమక్రమముగా మైకము అధికమయి రోగి, తనపనిని మానివేసి; యింటిలో నేదియో ఒకమూల, పూర్ణమైన నిద్రనుగాని, అర్ధ నిద్రనుగాని, అందుచుండును. కొంతకాలము పిమ్మట భోజనము మానివేయును. రోగి యొక్క శరీరమునందలి దార్ఢ్యత తగ్గి, వణకుట, మూర్ఛయందలి గతులు, పక్షవాతము— యివి అన్నియు కలుగవచ్చును. వ్యాధియొక్క అభివృద్ధి యందు వెర్రివాని యందలి లక్షణములు తరుచుగ గనబడి పోవుచుండ వచ్చును ఒడలంతయు, పొడిగాను, మిట్టపల్లముగాను తరుచుగా పొక్కులతో గూడియు, ఉండును. మెడయొద్ద మేదస్సు పొరడు గాళములు సామాన్యముగ వాపుదలనందును, ఈ రోగి, నాలు గయిదు మాసములలో గాని, ఒకప్పుడు నాలు గయిదు సంవత్సరములలో గాని, మరణము నందును. సగటున ఒక సంవత్సరమునకును, పదునెనిమిది మాసములకును మధ్యకాలము యీ వ్యాధియొక్క కాలపరిమితి అయి యున్నది.

### చికిత్స.

ఈ వ్యాధికి యేమి చికిత్సయు స్థిరముగ నుపయోగముగ నుండినదిగ, యింతవరకు గనుగొనబడి యుండలేదు.

---

## నీరుడుతిత్తియొక్క వాపుదల.

గాయము వలన, గాని, చలిగాలికి లోనగుట వలనగాని, మూత్రకృచ్ఛ్రమువలని రేగుదల వలనగాని, గనోరియా వ్యాధియందలి "స్ట్రిక్చర్" వలనగాని, నీరుడు తిత్తియొక్క వాపుదల కలుగవచ్చును. కోపేబా యొక్కగాని, కంతారిడీస్ యొక్కగాని, అధిక మోతాదుల వలనను యీ వ్యాధి కలుగ వచ్చును. పనిముట్లుయొక్క ఉపయోగించుట యందలి నేర్పు తక్కువచేతను గూడ, యిట్లు కలుగ వచ్చును. స్త్రీలు అధికముగ నొప్పులు పడుట వలన గాని, ప్రసవమైన పిమ్మట మూత్రవిసర్జన చేయుటయం దశ్రద్ధ వలనగాని, యీస్థితి కలుగవచ్చును. వణకుటతో తరుచుగ ప్రారంభమయి, మనోవికారము, జ్వరము, దాహము బాధ, నీరుడుతిత్తిపైన ఒత్తిడివలన పచ్చిగా నుండుట—యీలక్షణములతో గూడి యుండును. ప్రయాసమీద మూత్రము కొద్ది పరిమాణములుగ తరుచుగ, వెలువడుచు, బాధఅధిక

మగుచు, మంటతో గూడియుండును. మూత్రమునందు పొగ సంబంధమగు పదార్థములును, ఒకానొకప్పుడు రక్తమును, ఉండియుండును. ఈ వాపువల, బహు అరుదుగ పేగులకు వ్యాపించుటయు, మూత్రగ్రంధులకు వ్యాపించుటయు కలదు. ఈ రెండవ గతియందు మూత్రము నిర్బంధిపబడి రోగికి సంధిగుణము జనించి రక్తమునందు మూత్రము కలియుటయు యేర్పడవచ్చును.

## చికిత్స.

ఉడుకునీళ్లలో స్నానము చేయుటవలన ఉపశాంతికలుగగలదు. పేగులయొక్క అడుగు భాగములందు వేడికాపడములను గాచవలయును. బార్లీ నీళ్లను ఆహారముగా నిచ్చుచు, జ్వరము ఉండినయెడల సిట్రేట్ ఆఫ్ మెగ్నీసియాను యియ్యవలయును విరేచనకారిగ 4 వ ఔషధయోగము నియ్యవలయును రాత్రులందు 10 గ్రెయినుల పల్వీస్ ఇపికాక్ కోను గాని, 15 గ్రెయినుల క్లోరల్ హైడ్రేస్ సు గాని, యిచ్చుటవలన గుణము కలుగగలదు. ఒడలు వేడిగానున్నా పొడిగానున్నా ఉండినయెడల, మొదటి ఔషధము మిగులఉపయోగ ముగ నుండగలదు. రోగి పరుండియే యుండునటుల జేసి, పాలు మొదలగు తేలిక పదార్థములనే ఆహారముగ నిచ్చుచు, మత్తుపదార్థములను సంపూర్ణముగ త్యజింప జేయవలయును.

---

## నీరుడుతిత్తియొక్క రోగుదల.

స్పష్టమగు కారణములేకుండ మూత్రము విసర్జింపవలయు ననెడి తరుచుగ గలుగు యిచ్ఛవలన నీరుడుతిత్తి రోగుదల నందియున్నట్లు గ్రహింపవచ్చును. మూత్రకృచ్ఛ్రమువల నను, నీవ్యాధి కలుగవచ్చును. పేగులయందలి పురుగులవలనను యిట్లు కలుగవచ్చును. ఋతువు మారి శీతలత ప్రవేశించినపుడు ఒకప్పుడు కొద్దికాలమువరకు యీమార్పు కలుగ వచ్చును. కారపుద్రవములను త్రాగుటవలనగాని, బలహీనత వలనగాని, ఒకప్పుడు యిట్టి రోగుదల యేర్పడవచ్చును. పెద్దవారలందు మూత్రమును నిలిపియుండుటకు శక్తి తప్పిపోయి నపుడును, యీలోపమును గలిగించుటకు స్పష్టమగు వ్యాధిగాని కారణముగాని కనుపడ నపుడును, రాత్రులందు 15 గ్రెయినుల క్లోరల్ హైడ్రేస్ ను యిచ్చుచుండుట వలన తప్పక గుణమియ్యగలదు. వ్యాధి తగ్గిన కొలదిని యీమోతాదును కూడ తగ్గించుచు, దీని అల వాటును దప్పించవలయును. రోగి టైపదార్థము పైన ఒకచుక్క క్రియసోట్ నువేసి మాత్రగా జేసి, పుచ్చుకొని వందువలనను గుణమియ్యగలదు. బిడ్డలు నిద్రలో మూత్రమును విసర్జించు టను అపు జేయుటకు, 5 మొదలు 10 చుక్కలవరకును టింక్చర్ బెలడోనాను యియ్య నగును.

---

## స్పెర్మటోరియా.

"డిప్లోకాకస్ స్పెర్మటోరియా" లేక "స్పెర్మోకాకస్" అనబడునట్టి పురుగుల యొక్క వ్యాపారమువలన, శ్వాసకోశముయొక్క స్థానికాభివృద్ధి యేర్పడిన గుస్తులతో

డను, లక్షణములతోడను, గూడియుండి, శరీరపరిస్థితిసంబంధమైన ఉద్రేకమగు కలతలలో రక్తప్రచార సంబంధమైనది ముఖ్యమయియుండిన, తీవ్రమగు అంటుసంబంధమైన జ్వరము— న్యూమోనియా జ్వరమని పిలువబడు చున్నది.

ఈ వ్యాధి సంబంధమగు పురుగులు శ్వాసమార్గముల ద్వారా శరీరమునందు ప్రవేశించును. ఆరోగ్యతయందున్న వారలయందును యీ పురుగు లుండియుండ వచ్చును. కాని, యీ పురుగులు సంఖ్యయం దెక్కువ అయియుండినపుడు గాని, యితర సహాయ కారణముల వలన యీ పురుగులు స్నాయువులయొక్క అల్లికలను దుర్బల పరచుటయందు జయమందుటవలన గాని, యీవ్యాధి కలుగుటకు మార్గమేర్పడవచ్చును. న్యూమోనియా జ్వరము తరచుగ వచ్చుచుండెడి గృహములయొక్క నట్టింటి యందును, కప్పుపైనయును, యీవ్యాధి సంబంధమగు పురుగులు గనుగొనబడి యుండినట్లు తెలియుచున్నది. ఈ పురుగులు శ్వాసమార్గము ద్వారా శ్వాసకోశములయందు ప్రవేశించి, ఈ అవయవములందు స్పష్టమగు హానిని గలుగ జేయుచున్నవి. మెదడు, మూత్రగ్రంధి, ప్లీహా, రక్తము యీ భాగములందును యీ పురుగు కనుగొనబడుట వలనను, యితర అస్వస్థతలు కలుగుచుండుట వలనను, యీవ్యాధియొక్క పర్యవసానము యింతటితో సమాప్తినందుటలేదని గ్రహింపనగును. ఈ వ్యాధి సంబంధమగు పురుగులు ఒకవిధమగు విషమును వెలిబుచ్చుటవలన నీశరీరకలత కలుగుచున్నదని ఊహింప బడు చున్నది. ఈ విషయమునకు విరుగుడుగా బని చేయుటకు, రక్తమునందు "ఆంటి న్యూమోటాక్సైన్" అనబడు మరియొక పదార్థము పుట్టుక నందుచున్నది. ఈవ్యాధి నుండి స్వస్థతనందిన వారలలో వారిఉమ్మియందు యీ వ్యాధిసంబంధమగు పురుగు ఒకసంవత్సరమునకు మించిన కాలము వరకు, ఉండియుండునని కొందరి వలన గనుగొనబడినది.

## సహాయ కారణములు.

1. శీతోష్ణస్థితి:—వాయువునందు గలుగుచుండెడి ఆకస్మికమగు మార్పుల వలన నీ వ్యాధికి ఉద్యుక్తత యేర్పడునుగాన, తరుచుగ చలిగాలికి లోనగు వారియందు యీవ్యాధియెడల నుద్యుక్తత తక్కువగా నుండును. నావికుల కంటె పట్టణములయందు నివసించు వారలు యీ వ్యాధియెడల నెక్కువ ఉద్యుక్తతను వహించి యున్నారు.

2. లింగము:— ఈవ్యాధి స్త్రీలయందుకంటె పురుషులయం దెక్కువ వ్యాప్తిగ నందియున్నది. కాని, స్త్రీలయందు గలిగిన విషయములందు మరణము నెక్కువగా నుండి యున్నవి.

3. వయస్సు:— పదిసంవత్సరముల లోపు వయసు నందు ఈవ్యాధి యెక్కువ తరుచుగ గలుగుచున్నది. పిమ్మట యిరువదియైదు సంవత్సరముల వరకును తక్కువ అయి యున్నది. తరువాత, నలుబదియైదు సంవత్సరముల వరకును సాధారణముగ గలుగుచున్నది. ఆటు తరువాత వయస్సునందు సర్వసాధారణమై యున్నది.

4. వెనుకటి ఆరోగ్యత:— యీ వ్యాధియందు వెనుకటి ఆరోగ్యత మిగుల ముఖ్యమయి యున్నది. ఇన్ఫ్లూయంజా, టైఫాయిడ్, రొమ్ముపడిసెము, శ్వేత ధాతునష్టము, అతిమూత్రము, మొదలగు వ్యాధులయందు, యీ వ్యాధియెడల నెక్కువ ఉద్యుక్తత యేం

ర్పడియుండును. ఈవ్యాధి ఒకసారి కలిగిన యెడల మరల మరల గలుగుట కుద్యుక్తత యే ర్పడియుండును గాని, యీవ్యాధియెడల రాహిత్యత కలుగనేరదు. ఒక మనుష్యునియందు యిరువదియెనిమిది పర్యాయములు యీవ్యాధి కలిగిన అంశము గ్రంథస్థమయి యున్నది.

శ్వాసకోశములు అస్వస్థత నందుటయందు ఒకప్పుడు ఒకకోశమే అస్వస్థత నందును; ఒకకోశము నందుచు, అస్వస్థతభాగము వృద్ధినందు చుండును. ఒకప్పుడు కొంతకాలము పిమ్మట రెండవకోశము అస్వస్థత నందును. ఈస్థితిని గురించి నిర్ణయించుటకు వీలైనది కాదు. శ్వాసకోశములయొక్క అస్వస్థత భాగములందు రక్తము కూడుకొని వాయుబిలముల యొక్క ఉపరి భాగములు మడ్డిగానుండి, రక్తమును యితర ద్రవపదార్థములను స్రవించు చుండి, యీమలినములన్నియు రక్తమును యితర ద్రవపదార్థములను స్రవించుచుండి, యీ మలినములన్నియు క్రమక్రమముగ శరీరమువలననే పీల్చుకొనబడి, స్వస్థావస్థ యేర్పడును. స్వస్థావస్థ దగు యీమార్పులు కలుగ నంతవరకును, శరీరము నందలి జ్వరము మొదలగు కలతలు తగ్గకనే యుండును.

లక్షణములు.

ఈవ్యాధియందలి లక్షణములు, ఋతువులను బట్టియు, స్థలములను బట్టియు, రోగి యొక్క వయస్సును బట్టియు, వ్యాధికి పూర్వమందలి రోగియొక్క ఆరోగ్యతను బట్టియు, నుండును. ఈవ్యాధి పక్వమందుటకు ఒకటిన్నర లేక రెండు దినములు పట్టును. వ్యాధి యొక్క ఆరంభమునందే ప్రక్క భాగములయందు ఉద్రేకమగు బాధ ప్రారంభమయిపోటు పొడిచినట్లుండును. ఈబాధ ఎదురొమ్మునందు గాని, ఎదురొమ్మునకు వెనుక వైపుల గాని, కొంచెము క్రిందుగా గాని, యేర్పడవచ్చును. ఉచ్ఛ్వాస నిశ్వాసము లధికములయి, ఆయాస మేర్పడి, మాటాడుట యందు యొగ ఊపిరిని బీల్చుచు — యీస్థితియందు పది నిమిషములు మొదలు యిరువది నిమిషముల వరకు ఉండిన పిమ్మట, అధికజ్వర ము ప్రారంభించును.

వ్యాధిప్రారంభించిన రెండవ దినమందే, కొన్ని చిహ్నములు సూచనగ నుండును. రోగి వెల్లకిలి పరుండి యుండును. నిస్త్రాణచే నధికముగ సాగిలపడిన స్థితియందుండును. ముఖము యెఱ్ఱబారి, కొద్దిగా వివర్ణముగ నుండవచ్చును. ఉచ్ఛ్వాస నిశ్వాసము లధిక మగును. ముఖవైఖరి, బాధతో గూడినట్లుగను, దీనత్వమును వహించినదిగను, ఉండును. నోరుచుట్టును పొక్కులు లేవవచ్చును. శరీరవేడిమి, 103, 104 డిగ్రీలవరకునుండవచ్చును ఉచ్ఛ్వాస నిశ్వాసముల ఆధిక్యతను సరిపోవునట్లు నాడియొక్క చురుకుదనము అతిశయత నందకపోయినను, నాడి తొందరతోగూడి, నిండుదై, ఉబుకుచుండును. దగ్గు కొద్దిగాను న్నను బాధతోగూడి యుండుటవలన, రోగికి కష్టముగా నుండును. తెమడ కొద్దియైయున్న ను, కొద్దియో గొప్పయో రక్తపుగీరలు కలిగి, వాయువుతో గూడియున్నందులకు గుర్తుగా బుడగలు గలిగి జిగటగా నుండుటవలన వెలువడుటయందు శ్రమతో గూడియుండును.

వ్యాధియొక్క పరిమిత కాలము సుమారుగా నేడుదినములై యున్నది. ఈకాల మందు శరీరవేడిమి ఆధిక్యతయందే ఉండి ఉదయపు వేళలందు ఒక డిగ్రీ ప్రాంతముల తగ్గు

చుండును. తుదకు అయిదవ లేక ఏడవ లేక తొమ్మిదవ దినమున, కొన్నిగంటల కాలములోనే సందిగ్ధస్థితి (Crisis) యేర్పడి, శరీరవేడిమి అకస్మాత్తుగ స్వాభావిక వేడిమికిగాని, దిగి పోవును. శరీరమునందు అధికజ్వరము ఉన్నంతవరకును, రోగియొక్క దురవస్థ యెడతెగ కుండును. రక్తప్రచారమునందు ప్రతికూలత కలిగి, నాడి మృదువై క్రమముదప్పియుండును సంధిగుణమును కొంతవరకు వ్యాపించియుండును. నాలుకపై తెల్లని పొరగప్పి యుండును. ఆకలియు జీర్ణతయు అనేక విధములగు అస్వస్థతల నందుచుండును. ఒకప్పుడు ఆకలి బహుఅద్భుతముగ స్వస్థత నందియుండును. మూత్రము తీవ్రవర్ణమును వహించి ఒకా నొకప్పుడు శ్వేతధాతువును గలిగియుండును, సందిగ్ధస్థితియందు శరీరవేడిమితగ్గగానే రోగి యొక్క దుస్థితి తగ్గిపోయి శరీరస్థితి ననుసరించి నాడి క్రమతనందును. కొన్ని గంటల కాలము లోనే ముఖము వికాసత నందును. ఈ వ్యాధియొక్క స్వస్థావస్థ యితర వ్యాధులయందు కంటె త్వరిత గలినంది తేలిక అయినదై యున్నది.

## సామాన్య లక్షణములు.

శరీరవేడిమి, యిదివరకు జెప్పబడి యున్నట్లు యెల్లప్పుడును యెడతెగక నుండక పోవచ్చును. కొన్ని విషయములలో—ముఖ్యముగా బిడ్డలయందు - న్యుమోనియా జ్వర మున కభివృద్ధి నందకముందు, యితరజ్వర ముండి యుండినపుడు శరీర వేడిమియొక్క హెం పందుట తక్కువ అస్పదము నందియుండును. అత్యధిక వేడిమి నందుసరికి ఒకటి రెండు దినములు పట్టవచ్చును. అప్పుడు జ్వరవేడిమి 106 లేక 107 డిగ్రీలవరకు వ్యాపింప వచ్చును. బిడ్డలయందును త్రాగుబోతుల యందును జ్వరము అతిశయగతుల నవలంబించును. అప్పుడప్పుడు జ్వరము మూడవదినముననే తగ్గవచ్చును. ఒకప్పుడు జ్వరము అకస్మాత్తుగ తగ్గిపోయి మరల హెచ్చవచ్చును. ఇది ద్రోహసందిగ్ధస్థితి యనబడుచున్నది. నిజమైన సంది గ్ధస్థితి అయిదవ దినమునకు లోపుగా గలుగ నేరదు. సందిగ్ధస్థితి బేసిదినముల గలుగునని పైన సూచింపబడిన విషయమందు యెక్కువ లక్ష్యముంచవక్కరలేదు. సందిగ్ధస్థితి కొరకయి యెదురు చూచుటలో నొకప్పుడు జ్వరము అనుదినమును కొద్దికొద్దిగా తగ్గుట యేర్పడి శరీ రవేడిమి కొన్ని దినములలో స్వాభావిక స్థితిని వహించును. ఇట్టివిషయములలో స్వస్థావస్థ కలుగుట ఆలస్యమగును. ఈ స్థితియందొకానొకప్పుడు జ్వరము మరల నంకురించవచ్చును. న్యుమోనియా జ్వరము నిజముగ తిరుగ బెట్టుట బహు అరుదయి యున్నది.

ఈ వ్యాధియందు దగ్గులో తెమడ గలుగుట సహజలక్షణమే గాని బిడ్డలయందు తెమడ కనుబడక పోవచ్చును.

రక్తప్రచార సంబంధమగు దుర్విషయములు ఈ వ్యాధియందు బహుముఖ్యములై యున్నవి. ఈ వ్యాధియందలి శ్వాసకోశాస్వస్థతలకంటె రక్తప్రచారము నందలి క్రమము దప్పుటలను యెక్కువశ్రద్ధతో గమనించవలయును. వార్ధక్యము కలవారియందుగూడ నాడి 100 కిని అంతకు మించియును అధికమగును. బిడ్డల యందింకను అధికమగును. పెద్దవారల యందు గలుగు నాడియొక్క అధికసంఖ్య విషయమయి బహుజాగ్రతతో జూడవలయును

నాడియొక్క సంఖ్య అధికమై నాడియొక్క మృదుత్వము అధికమగుచు, బలమునందును కాలపరిమితుల యందును క్రమము దప్పిన యెడలనున్నూ, మణికట్టునందు నాడిని స్పర్శించుటకు వీలులేక పోయినప్పుడున్నూ, సందిగ్ధస్థితి రాబోవుచున్నదని, దెలియవచ్చును. సందిగ్ధస్థితి వెంటనే గలుగక పోయిన యెడల కుదురుపాటునకు ఆశ వదలుకొన వలసినదై యున్నది. రక్తప్రచారమునందు భంగముకలుగుట వలనను, నే స్థితియందయినను మరణము సంభవింపవచ్చును. పాదములును హస్తములును జల్లబడి, స్మృతి తప్పిపోయి, రక్తము పరిశుద్ధము కాబడుట ఆగిపోవుటవలన మరణము సంప్రాప్తమగును. ఒకానొకప్పుడు అపాయము కలుగుట కేమియు తగు కారణముల గాంచకుండినపుడే అకస్మాత్తుగ గుండెయొక్క వ్యాపారము నిలుపు చేయబడుటవలన, రోగి తత్క్షణమే మరణము నందవచ్చును.

ఈ వ్యాధియందు మెదడు సంబంధమగు అస్వస్థతాలక్షణములు తరుచుగ స్ఫుటముగా గనబడుచుండును. బిడ్డలయందు యిట్టివి తక్కిన లక్షణముల గనబడకుండ జేయవచ్చును. తలనొప్పి, వాంతులు, మూర్ఛలు,—యీలక్షణములు కొద్దిగంటల కాలములోనే స్మృతిని దప్పింపవచ్చును. సంధిగుణమును కనుపడవచ్చును. శరీరవేడిమి అధికమయిన కొలదిని, సంధిగుణమును హెచ్చుదల నందుచుండును. న్యూమోకాకస్ పురుగులు మెదడు యందలి పొరభాగములకు వ్యాపించుట వలన ఆ యా భాగముల వాపుదల యేర్పడి వేరు విధమగు వ్యాధి (మెనింజైటిస్) గలుగవచ్చును.

శ్వాసకోశములయొక్క ఉపరిభాగములందు బరీక్షించుటవలల వ్యాధి యెంతవరకు వ్యాపించియున్నదియు కనుగొన నగును. చేతియొక్క తాకుడు వలనను స్టెతస్కోప్ వలనను యీ పరీక్షను జేయవలసియుండును.

## సూచనలు.

ఈ వ్యాధియందు మరణములు నూటికి పదునాలుగు మొదలు ఇరువదివరకును ఉండి యున్నవి. దేశకాలస్థితులను బట్టి యీ మరణప్రాప్తి మారుచున్నది. చుట్టుపట్ల అదివరకు ఉండిన యితర పరిస్థితుల ననుసరించి యీ వ్యాధియొక్క గతిని నిర్దేశింపవచ్చును. శ్వాసకోశముయొక్క స్థితికంటెను శరీరవేడిమికంటెను ప్రతిదినమునను ప్రతిగంటయందును ఉండు నాడియొక్కయు గుండెయొక్కయు స్థితినిబట్టి యీ వ్యాధియొక్క గుణాగుణములను నిర్ణయింపవచ్చును. యితర జ్వరములయందువలెనే యీ జ్వరమునందును శరీరవేడిమివలన గుండె కాయ అస్వస్థతనందుచున్నది. శ్వాసకోశముయొక్క విశేషభాగమునందలి పదార్థము పేరుకొనుట వలన గుండెకాయయొక్క పని అనేక విధములుగ హెచ్చుగుచున్నది. ఇది శాకవ్యాధి సంబంధమగు విష పదార్థములు రక్తప్రచారావయవములపైన ముఖ్యముగా బనిచేయుట వలన నవి దుర్బలత నందుచున్నవి. నాడియందలి మృదుత్వ మధికమగుచున్న యెడల రోగిని బహుజాగ్రతతో జూచుచుండవలయును. దగ్గుటవలనగాని కదలుట వలనగాని నాడియందు మార్పుకలిగిన యెడలనున్నూ, చెడుసూచనయై యున్నది.

మంచి ఆకలియు, యిచ్చిన ఆహారమును జీర్ణించుకొనుటయు, మంచి శుభసూచనలై యున్నవి. ముఖ్యముపయిన మిక్కుటముగ పొక్కులు గలుగుటయు మంచిసూచనయై యున్నది.

దుర్వాసనతో గూడిన నోటివారయువును, దుర్వాసనతో గూడిన కఫము వెలువడుటయును శ్వాసకోశమునందు వుండు యేర్పడి మాంసము కుళ్ళుచున్నదని తెలియ చేయును. ఇది అపాయముతో గూడి యున్నది.

త్రాగుబోతుల యందును, అతిమూత్రవ్యాధిచే బాధ నొందువారి యందును, గుండె కాయ మూత్రగ్రంధి లేక యితర అవయవములు దీర్ఘవ్యాపితనుగు అస్వస్థత నందియున్నవారియందును—యీ వ్యాధి కలిగినయెడల నెమ్మదించుట కష్టమైయున్నది.

చికిత్స.

ఈవ్యాధియందు జ్వరమునకు జికిత్స ఆరంభించుటలో మాత్రము, యితర జ్వరములందే చికిత్స జేయనగునో, యిందును అదే చికిత్సను జేయనగును. శ్వాసకోశ విషయికమగు వ్యాధిని గురించి యెక్కువగా నెంచ నక్కర లేదు. పరిశుభ్రమగు గాలి రోగి పరుండియుండు గదిలోనికి విశేషముగ వచ్చుచుండుట, ప్రాధాన్యమై యున్నది. గాలి రాకుండ మూయబడుట కంటె, ఉద్రిక్తమగు గాలి వీచుటయే తక్కువ అపాయముతో గూడి యున్నది. గదిలోనికి గాలి వచ్చుచుండ వలయును. గాని, రోగి గాలి వీచకుండు స్థలములో మాత్రము పరుండబెట్టబడి యుండవలయును. నూతనమగు శీతల వాయువు వలన రోగికి యెక్కువ అపాయము కలుగుననెడి ఊహామిగుల పొరబాటు అయియున్నది. కావున, పరిశుభ్రమైన విశేషమగు గాలియు-సాధ్యమయినంత వెలుతురును లోనకు వచ్చుట మిగుల ముఖ్యమయి యున్నది. ఇట్టి పొరబాటు జరుగుచుండిన యెడల, దానిని పనిచేయుట తోడనే రోగియొక్క అదివరకు నీరసతతో గూడిన రక్తప్రచారమునందు యెట్టి అభివృద్ధి కలుగునో చూచుటకు బహు వింతగా నుండును.

రోగియొక్క బలమును యెక్కువ జాగ్రత్తతో గాపాడుట రెండవ అంశమయి యున్నది. రక్తప్రచారము నందు భంగము కలుగకుండ గాలియుండుటయే ముఖ్యమయి యున్నది. ఆకలి యందును అహారమును జీర్ణము జేసికొనుట యందును పలువురియందు భేదములు కలుగుచుండును. కొందరు మొదటి ఒకటి రెండుదినములందు దేనిని బుచ్చుకొనుటకును యిష్టపడరు; మరికొందరు పాలు మొదలగు ఆహార పదార్థములను ఆతురతతో బుచ్చుకొందురు. మొదటివారలకు బలమగు ద్రవ ఆహార పదార్థములను కొద్ది పరిమాణములలో మందువలెనే ప్రతి మూడుగంటలకును యిచ్చుచుండవలయును. రెండవ తరగతివారలకు ఆహారమును భోజనక్రమముల ననుసరించి యియ్యవచ్చును. దుర్బలమగు ఆకలిగల వారలకు, ఒకప్పుడు ఒకగ్రయిను లేక రెండు గ్రయినుల క్యాలోమెల్ (రసభస్మము) ను గాని, హైడ్రార్జరై కం క్రిటా (గ్రేపవుడరు)ను గాని యిచ్చుటవలన మందగించిన ఆకలియందు ఆశ్చర్యకరమగు అభివృద్ధి కనుపడును.

చాల విషయములలో మొదటి రెండుమూడు దినములపిమ్మట బ్రాందీనిచ్చుట వలన మిగుల సహాయకారిగ నుండగలదు. బ్రాందీలో నీళ్లుకలిపి యిచ్చుటవలన దీని ఉపయోగ మధికముగ నుండగలదు; కాచినపాలతో గాని తేయాకునీళ్లతో గాని కాఫీతో గాని యిచ్చుటవలనను ఉపయోగకారిగ నుండగలదు. కొందరకేని విషయములలో అరఔన్సు గాని

పౌన్సుగాని ఆరుగంటలకొకసారి యిచ్చుట చాలును; రోగియొక్క స్థితి యెక్కువ అపాయముతో గూడియుండినయెడల అదే పరిమాణమును రెండుగంటలకొకసారియు, అవసరమయితే యెక్కువ తరుచుగను యియ్యనగును. కొందరు రోగులు, బ్రాందీయొక్కవాడుక లేకుండగనే, బాగుగ నుందురు. నాడియొక్క నడకనుబట్టి బ్రాందీని ఉపయోగించ వలసి యుండును. నిండుయయినట్టియు ఉబుకుచుండు నట్టియు మొదటి ఒకటిరెండు దినములయందుండెడి నాడి మృదువయి నీరసస్థితిని వహించినప్పుడు, బ్రాందీయొక్క ఉపయోగమునకు అవసరమును సూచించును. దగ్గుటమూలమునగాని, కదలుటమూలమునగాని, అస్వస్థత నంది యున్న నాడి మిగుల కలతనందుట ప్రారంభమయినపుడు, బ్రాందీని యెక్కువ తరుచుగ నిచ్చుచు, మోతాదునుకూడ హెచ్చింపవలయును. పెద్దవారలయందును, నీరసస్థితియందున్న వారలందును, త్రాగుట అలవాటు అయియున్న వారలందును, బ్రాందీని ఉపయోగించుట త్వరితముగ ప్రారంభించి, మోతాదులనుగూడ హెచ్చింప వలసి యుండును. త్రాగెడువారలందు బ్రాందీని నిలుపు చేసిన యెడల మిగుల అపాయము కలుగగలదు.

బ్రాందీకి పిమ్మట గుండె సంబంధమగు బలవర్ధకౌషధముల నుపయోగించుట యందు శ్రద్ధను వహింపవలయును. మొదటి రెండుమూడు దినములందును, సాధుగతుల యందైనయెడల జ్వరగతియందు దంతటను, యీ ఔషధములు అనవసరములయి యుండవచ్చును. రక్తప్రచారమునకు గలుగుహాని వృద్ధినందిన కొలదియు, నాడియొక్క నడకలయందు గలుగు మార్పులను బట్టి యీస్థితిని గనుగొనుచు, యీ ఔషధముల నుపయోగింప నగును. ఈఔషధములలో మిగుల ఉపయోగమయినది టింక్చర్ స్ట్రోఫాంతస్ అయియున్నది. ఈ మందును దినమునకు మూడు పర్యాయములు మొదలు ఆరు పర్యాయముల వరకును 10మినిముల మోతాదులలో నియ్యనగును. డిజిటాలిస్‌ను గూడ యదేవిధముగ నుపయోగింతురు గాని మొదటిదిదియే ఉత్తమముగ నెంచబడుచున్నది. కొన్ని విషయములలో స్ట్రోఫాంతస్‌తో కూడ లైకర్ స్ట్రిక్నీన్ హైడ్రోక్లోర్‌ను గలిపి వాడుటవలన నుపయోగముగ నుండును రక్తప్రచారలోపము ఉద్రముగా నున్న స్థితులయందు స్ట్రోఫాంతస్‌ను యెక్కువ తరుచుగ వాడవలయును.

చాలవిషయములలో ఎదురొమ్మునొప్పికి ఉపశాంతుల జేయవలసి యుండును. ఈ నొప్పిని తగ్గించుటవలన రోగియొక్క సామాన్యస్థితి అభివృద్ధినందును. ఇందుకొరకై, వేడి పిండికట్లును, కర్పూరతైలము రాసి వేడికాపడములను గాచుట, యీ పనులను జేయవలయును. మంచుగడ్డవేసిన సంచిని ఉపయోగించుట రోగికి యిష్టమయినయెడల దీనిని ఉపయోగించవచ్చును.

ఆయాసమును, నిద్రలేమియును, మిగుల విచారణీయాంశములయి యున్నవి. ప్రక్కగుడ్డలయొక్క తేలికతనము, పడకగదియొక్క చల్లదనము, పరిశుభ్రమగు గాలియొక్క వచ్చుదల — యీవిషయముల నెక్కువగ గమనింప వలసియున్నది. సందర్భముల ననుసరించి ఒడలంతటనుగాని, కొంతవరకేగాని, తడిగుడ్డలను జొట్టుటవలన యీవిషయములో మిగుల ఉపశాంతిగ నుండగలదు. ఇట్టి పనిని చేయుటయందు రోగికి యెంతమాత్రమును ఆయాసము కలుగకుండ బహుజాగ్రతతో జేయవలయును. వీటికి తోడుగా లైకర్ మార్ఫియా హైడ్రోక్లోర్‌ను సా

మాన్యమోత్తాదులలో నిచ్చుటవలనను ఉపయోగ ముండగలదు. క్లోరల్ హైడ్రేట్‌ను 15 గ్రేయినులు మొదలు 20 గ్రేయినులవరకు నిచ్చుటవలన కొన్నిగంటలసేపు నిద్రకలుగుటయే గాక, రక్తప్రచారమునకు స్థిరతను గలుగజేయును.

జ్వరమును తగ్గించుటకుగాను ప్రత్యేక ఔషధములు అవసరములేవు. పైన చెప్పబడిన తడిగుడ్డలతో జొట్టుట యీవిషయమునను బనిచేయును. ఇందు విషయమై ఔషధములు ఉపయోగించుట అవసరమయినయెడల, క్వినీన్‌ను అంటిపైరిన్‌ను ఉపయోగింపనగును. ఆరంభమునుండియు లైకర్ అమోనియా అసిటేటిస్ డైల్యూట్‌ను ఉపయోగించుట వలన కొన్ని విషయములలో రోగికి మిగుల ఉపశాంతిగ నుండగలదు.

వ్యాధియొక్క అభివృద్ధియందు గలుగు యితర అస్వస్థతలకు ఆయావ్యాధులకగు జికిత్సల జేయవలయును.

స్వస్థావస్థయందు రోగియొక్క స్థితినిబట్టి క్వినీన్, ఐరన్ (లోహము), స్ట్రిక్‌నీన్ (విషముష్టి), ఆర్సెనిక్ (పాషాణము), కాడ్‌లివర్ ఆయిల్ - యీమందులను యియ్యనగును. ఈ స్థితియందు బ్రాందీకూడ ఉపయోగింపనగును. స్వస్థావస్థయందలి అభివృద్ధి నాడియొక్క గతినిబట్టి కనుగొననగును. ఈ స్థితియందు స్థలమును మార్చుట వాంఛనీయము కాని, యిట్టి మార్పునందలి యేర్పాటు రోగియొక్క నివాసము, శరీర ప్రకృతి, అభిరుచుల ద్రవ్యశక్తి, ననుసరించి యుండును. వ్యాధి మరల ప్రకోపించుటకుండెడి ఉద్యుక్తతను గమనించుచు, రోగి పరిపూర్ణస్వస్థత నందినటుల వైద్యుడు నిశ్చయత నందవలయును. రోగినుండి వెలువడు కఫముయెడల నున్నూ, యితరవిధముగను, దుర్వాయువులను గొట్టుట కుపయోగించు కార్బాలిక్ ఆసిడ్ మొదలగు వాటిని వాడుకయందుంచుటలో లోపమును జేయరాదు.

---

## నేత్రరోగములు.

### 1. కనురెప్పయంచున వాపుదల.

కనురెప్పయంచున నుండెడి వెండ్రుకలయొక్క కుదుళ్ళలో నొకటి వాపుదలనంది, అచ్చటి గ్రంధికూడా అస్వస్థతనందుటచే నొక బాధకరమగు చిన్నకురుపు యేర్పడును. దీనిని ఉడుకు నీళ్ళతో బాగుగా కాపడములనుగాచి, కురుపు తేలిన పిమ్మట సూదితో గ్రుచ్చి మాలిన్యమును దీసివేయవలయును. అనారోగ్యస్థితివలన శరీరముయొక్క నీరస గతివలనను, తరుచుగ నిట్టి కురుపులు కలుగుచుండును.

### 2. కండ్లకలక.

కన్నుయొక్కగాని కనురెప్పలయొక్కగాని, పొరలు వాపుదల నందుటవలన యీ వ్యాధి యేర్పడుచున్నది. సాధుగతులయందు యీవాపుదల కంటియొక్క తెలుపు భాగము మాత్రమే ఆక్రమించియుండును కంటిలో యిసుక ఉండినట్లుగా నుండును. వెలుతురును జూచుట బహుకష్టముగా నుండి, కన్ను నుర్చులగను వహించియుండును. తలనొప్పి

కూడా ఉండి తరుచుగా కొంచెము జ్వరత వుండవచ్చును. కండ్లనుంచి మొదటగా పల్చనైన రసి కారుచు, పిమ్మట దళమైనట్టియు కొంచెము పసుపువర్ణముతో గూడినట్టియు రసి యేర్పడును. నిద్రయందు కండ్లుఅంటుకొనును. ఒక కన్నుగాని రెండు కన్నులుగాని అస్వస్థత నందవచ్చును. ఒక కన్ను మొదటగా అస్వస్థత నందినపిమ్మట రెండవకన్నును గూర్చి తగుజాగ్రత తీసికొనినయెడ దప్ప, రెండవకన్ను గూడ అస్వస్థత నందుటకు అనువు యేర్పడును. ఈ వ్యాధినిగురించి ఆరంభములోనే తగుచికిత్స జేసి యెడల త్వరలోనే నెమ్మదించగలదు, చీము పట్టువరకును ఆలస్యము చేసినయెడల యెక్కువ కఠినమై అంటుగుణమును వహించగలదు. కాబట్టి యీ సంబంధమగు వ్యాధులన్నిటిలోను వ్యాధిగ్రస్తులు ఉపయోగించు దువాళ్లు సబ్బులు నీళ్ళు మొదలగు నవి యితరులు ఉపయోగించరాదు. వ్యాధి యొక్క పరిమితి కాలము కొద్దిదినములేగాని లేక అనేక వారములు గాని పట్టవచ్చును.

చికిత్స.

రోగిని చీకటిగదిలో నుంచి కండ్లపైన ఆకుపచ్చనిగుడ్డను కట్టి తరుచుగా వేడినీళ్లతో గండ్లను గడుగుచుండవలయును. కండ్లు అంటుకొనకుండునట్లు రాత్రిలందు వాసలీన్‌ను గాని గ్లిసరీన్‌ను గాని కనురెప్పల అంచులకు రాయవలయును. కండ్లు అంటుకొని యుండినయెడల వాటంతట అవి యెడమిచ్చునట్లుగా దడుపవలయును. గాని బలవంతముగా కనురెప్పలను విడదీయగూడదు. మలబద్ధ మగుచినయెడల 4 వ ఔషధ యోగమును విరేచనకారిగ నియ్యవలయును. ఆరంభగతులయందు చిట్లాముదమును కనురెప్పలక్రింద రెండు చుక్కలను వేయుటవలన బాధకు ఉపశాంతి కలుగగలదు.

3. చీముతోగూడిన కండ్లకలక.

పైవిధమగు కండ్లకలకను అశ్రద్ధ చేయుటవలనగాని గనోరియా సంబంధమగు స్రావము కండ్లకు దగులుటవలన గాని చీముతోగూడిన కండ్లకలక యేర్పడవచ్చును. ఈకల మూలముగాయీ వ్యాధి వ్యాపింపజేయబడును. ఈ వ్యాధియందు వాపుదల అతిశయముగానుండి బాధయు హెచ్చుగా నుండును. ఈ గతియందు పల్చని ద్రవము వెలువడ కుండ కండ్లనుండి విశేషపరిమాణములుగ చీము వెలువడుచుండును. ఈ వ్యాధియొక్క పరిమితి కాలము పదిదినములు మొదలు రెండులేక మూడు వారముల వరకు వ్యాపించును. ఇందు మూలమున కనుపాపలో పుండ్లు యేర్పడుట గాని కనురెప్పలక్రింద సగ్గుబియ్యమువలె చిన్న అణువు లేర్పడుటగాని తటస్థించును.

చికిత్స.

ఔషధయోగములలోని వేడి యయిన బోరిక్ లోషన్‌తో కండ్లను గడుగ వలయును. ప్రతి రెండు లేక మూడుగంటలకును వేడినీళ్ళతో కాపడములను గాచవలయును. రోగిని చీకటిగదిలో నుంచవలయును. విరేచనము క్రమముగా గాకపోయినయెడల అందులకగు సాధకముల జేయవలయును. కండ్లు అంటుకొనకుండ కనురెప్పల కొనలకు రాత్రిలయందు వాసలీన్‌ను రాయవలయును. వాపుయొక్క ఆరంభఉద్రిత తగ్గగనే 2 ఔన్సుల జలములో 5 గ్రెయినుల జింక్ సల్ఫేట్ కలిసిన సొల్యూషనుతో కండ్లను దరుచుగ గడుగుచుండ వల

యును. వ్యాధి కాలమందు రోగికి బలమును గలుగజేయు ఆహారముల నియ్యవలయును. కన్నులనుండి వెడలు స్రావము ఆరుదలనాడి యీ సంబంధమగు అణువులు గాలిలోనికి జొచ్చి యితరుల నేత్రములలో బ్రవేశించుట వలన నీ వ్యాధి వ్యాప్తత నందజేయును. కాని, పరిశుభ్రమగు గాలి యొక్క రాకపోకలవలన నీ అపాయము తగ్గుదల నందగలదు.

పై సాధకముల వలన నుపయోగము లేకపోయినయెడల, ఒక ఔన్సు జలములో 10 గ్రెయినుల సిల్వర్ నైట్రేటును గలిపి సొల్యూషనుగా జేసి, అందలి ఒకచుక్కను బ్రష్‌తో దినమునకు రెండుసారులు కంటిలో వేయవలయును. దీనివలన మంటగానుండినను, తరచుగా నెక్కువ ఉపయోగకారిగ నుండగలదు. మంటలేకుండుటకుగాను, నూటికి పదివంతున జేయబడిన కొకేన్ సొల్యూషన్ రెండు లేక మూడు చుక్కలను కంటిలో ముందుగా వేసి, పిమ్మట సిల్వర్ నైట్రేట్ సొల్యూషనును వేయవచ్చును. సిల్వర్ నైట్రేట్‌నున్నా, తత్సంబంధమగు సొల్యూషనున్నా నీలపు సీసాలలో నుంచవలయును. లేనిచో చెడిపోగలదు.

### 4. కంటిపాపలోని పుండ్లు, పువ్వు వేయుట.

కండ్లకలకను గాని, కనురెప్పల క్రింద సగ్గుబియ్యమువలె చిన్న అణువు లేర్పడుటను గాని అశ్రద్ధజేయుటవలన కనుపాపలయందు పుండ్లు యేర్పడుట తటస్థించును. ఈ వ్యాధి యందు ఒకటిగాని, అంతకెక్కువగాని రక్తనాళములు అంచునుండి మధ్యభాగములకు పోవుటను గాంచవచ్చును. పాపయందు యెదిరో నాభాగమున తెల్లనిమచ్చ (పుండు) కనబడును. వెలుతురును జూచుట బహుకష్టముగానుండి, కండ్లవెంబడి నీళ్ళు కారుచుండును. దీనికి క్రమ కాలములో దగు చికిత్సను జేయని యెడల, వ్యాధి అతిశయమయి, క్రమముగా చూపు తగ్గిపోయి, అంధత్వము కూడ యేర్పడును.

### చికిత్స.

రోగి చీకటిగదిలో నుంచబడి, పరిశుభ్రమగు గాలి మాత్రము వచ్చునట్లుండ వలయును. కంటి యొక్క తెలుపు భాగము యొక్క యెరుపుదల తగ్గు వరకును తరుచుగ వేడినీళ్లతో కాపడములను గాచుచుండ వలయును. కంటియొక్క పరిశుభ్రత విషయమయి యెక్కువ జాగ్రతను బుచ్చుకొన వలయును. ఒక ఔన్సు జలమునందు రెండు గ్రెయినుల సిల్వర్ నైట్రేట్‌ను గలిపిన సొల్యూషను నుండి రెండు చుక్కలను పుండుపైన వేయవలయును. పదినిమిషముల పిమ్మట, 5 గ్రెయినుల బోరిక్ ఆసిడ్ ఒక ఔన్సు జలములో గలిపిన లోషనుతో కంటిని గడిగి, కాటన్ ఉల్‌తో పయిన కట్టును గట్టవలయును. ఇటు దినమునకు రెండుసారులును. పుండు పెద్దదైన యెడల యెక్కువ వ్యాయామములను చేయవలయును. బలము నిచ్చు ఆహారపదార్థముల నిచ్చుచుండవలయును. క్వినీన్‌ను లోనికి నియ్యవలయును. కంటికి వెలుతురు తగులకుండ గాపాడుచుండ వలయును.

ఈ పుండుయొక్క ఆరంభగతులయందు, ఒకఔన్సు జలములో రెండుగ్రెయినుల అట్రోపీన్ కలిసిన సొల్యూషనులో, ఒక చుక్కను దినమున కొకసారి గాని రెండు సారులు గాని కంటిలో వేయనగును.

(నేత్రసంబంధమగు యితరవ్యాధులందు శస్త్రము అవసరమయి యుండును, గాన సర్జనుకు జూపించవలసి యుండును.)

---

## పడిసెము ( శ్వాస సంబంధమగు )

### (రొమ్ము పడిసెము)

శ్వాసనాళము యొక్కయు, యీ నాళశాఖల యొక్కయు, ఆమమును గలుగజేసెడి నిర్మాణముల యొక్కయు, నిర్మాణముల అంతర్భాగముల యొక్కయు, జలుబుతో గూడిన ఉద్రేకమగు వాపుదల — రొమ్ముపడిసె మనబడుచున్నది. ఈవ్యాధి సామాన్యముగ చలిగాలివలన నేర్పడి, జలుబు లక్షణములతో నారంభమగును. మొదటగా ముక్కువెంబడి నీరు కారుచు, చేతులయందును కాళ్ల యందును చలిగలిగి, నొప్పులు పుట్టును. శరీరవేడిమి యందు కొద్దియగు హెచ్చుదల, దాహము, నిస్త్రాణ, తలనొప్పి, పొరగమ్మిన నాలుక, ఆకలి క్షీణించుట, ఆయాసము — యీ లక్షణములతో గూడియుండును. ఎదురొమ్ము యొక్క మధ్యగొముక వెంబడి పచ్చిగానుండి, ఎదురొమ్ము అంతయు బిగువుగా నుండును. శ్వాసము తరుచుగా నధికమయి, నాడి 120 వరకును గాని, అంతకు హెచ్చుగగాని, ఉండును. అనుకూల విషయములలో, మూడు నాలుగు దినములలో దగ్గు తెగుట ఆరంభించి, తెమడ వెలువడుట అధికమగును. ఆరంభగతులయందలి తెమడ నురుగుతో గూడి తెల్లగా నుండును. క్రమక్రమముగా తెమడ దళమయి ఆకుపచ్చ పసుపు కలిసిన వర్ణముతో గూడి— యీస్థితి యందు యెదురొమ్మునందలి పచ్చిదనము, బిగువును, తగ్గిపోవును. ఈవ్యాధి యొక్క తొర యందు, ఊపిరితో ఒక విధమయిన ధ్వని వినబడును. చేతితో యెదురొమ్ముపై దాకిన యెడల ధ్వనులను గనుగొనవచ్చును. తెమడ వెళ్ళిపోయినప్పుడు యీలక్షణములు తగ్గవచ్చును. గాని, తిరిగి తెమడ కూడుకొనిన వెంటనే మరల యీ లక్షణములను గనుగొనవచ్చును. శ్వాసనాళ శాఖలయందు నిండియున్న జిగటయైన తెమడ (ఆమము) గుండా వాయువు పోవుచుండుట వలన గలుగు ధ్వనులవలననే పైనచెప్పబడిన ధ్వని యేర్పడుచున్నది. పరిశ్రమ చేయుటవలనగాని, చలిగాలికి లోనగుటవలనగాని, దగ్గును, ఉచ్ఛ్వాస నిశ్వాసములయందలి ఆయాసమును, అధికమగును. అనుకూల విషయములలో, సుమారు యెనిమిదవ దినమునకు ఊపిరియందలి ఆయాసము తగ్గుదల నంది, విశేషకష్టము లేకుండ తెమడ వెలువడుచు, జ్వరము తగ్గుదల నందును. అననుకూల గతులలో ముఖవైఖరి ఆదుర్దాతో గూడి, నీలవర్ణమును వహించి, ఊపిరిని పీల్చుటయందు ఆయాస మధికమగుచు, పెదవులు నీలమును యెరుపును కలిసిన వర్ణమును గలిగియుండును. సంధిగుణము జనించి, రోగి ఆమమును దగ్గివేయుట కశక్తుడై, ఊపిరి తిరుగక మరణము నందును. రక్తప్రచారమున కాటంకము గలుగుట వలనను మరణము సంభవించును.

---

## చికిత్స.

రొమ్ముపడిసెము కలిగిన వెంటనే రోగిని వేడినీళ్లలో స్నానము చేయించి రాత్రి యందు 8 లేక 10 గ్రెయినుల పల్విస్ ఇపికాక్ కో ను యిచ్చి ప్రతి మూడు గంటలకును అరడ్రాము స్పిరిట్ ఈతరు నైట్రిస్‌ను రెండుఔన్సుల జలములో కలిపి యిచ్చుటచే, చెమటను వృద్ధిపరచవలయును. ఆరంభ గతులయందు వేడి ద్రవపదార్థములను ఆహారముగ నియ్యవలయును రోగికి చలిగాలి తగులకుండునట్లు జాగ్రత్తపరచి, గదియందు నీటి ఆవిరిని వదలుటవలన, వాయువునందు తేమ గూడి యుండునట్లు చేయవలయును నీటి ఆవిరిని లోనకు పీల్చుటవలనను ఉపయోగ ముండగలదు. ఎదురొమ్ముపైన వేడి కాపడములను గాచుచు వేడి పిండికట్లను గూడ కట్టవలయును. అవసరమయినచో విరేచనకారుల నిచ్చుచు, విరేచనము క్రమముగా నగుచుండునట్లు చేయవలయును. పైన జెప్పబడిన అనుకూల గతుల యందు, బ్రాంది, అమ్మోనియా కార్బొనేట్, స్ట్రిక్నీన్, యియ్యనగును, దగ్గు బాధకరముగానుండి నిద్ర పట్టుటలేదని రోగి యెక్కువగా మూలిగినను, పైన జెప్పబడిన పల్విస్ ఇపికాక్ కో యందు ఉండియున్న కొద్ది నల్లమందు కంటె నెక్కువ మోతాదులుగ నల్లమందు కలిసియున్న ఔషధముల నియ్యరాదు. నల్లమందు కలిసియున్న మందులను యెక్కువగ నిచ్చుటవలన నిద్ర అధికమయి, స్వేచ్ఛగా వెలుపడు తేమను ఆటంకపరచి యెక్కువ అపాయమును గలుగజేయును.

నీరసగతియందున్న రోగులయందు తెమడ అధికముగా వెలువడును. ఈ విషయములయందు టింక్చర్ బెలడోనాను 10 మినిముల మోతాదులలో నిచ్చుచు విరేచనము శుభ్రముగా నగునట్లు జూడవలయును. బిడ్డలయందు తెమడ వెడలు ప్రయత్నములు అసంపూర్తిగ నుండవచ్చును. ఇట్టి సందర్భమున వైనం ఇపికాక్‌ను తగు మోతాదులలో నియ్యవలయును. పెద్దవారలయందు గుండెకాయ నీరసత నందియున్నయెడల టింక్చరు డిజిటాలిస్ స్ట్రిక్నీన్, బ్రాందీ—వాడవలసి యుండును. ఈవ్యాధిలో సాధుగతియందు యీక్రింది ఔషధయోగమును వాడవచ్చును.

| | | |
|---|---|---|
| టార్టార్ ఎమిటిక్ | ... | గ్రెయిను 1 |
| టింక్చర్ క్యాంఫర్ కో | ... | డ్రాములు 2 |
| జలము (ఉడుకు) | ... | ఔన్సులు 12 |

బాగుగా కలిపినపిమ్మట చల్లార నియ్యవలయును. ప్రతి రెండు లేక మూడు గంటలకు ఒకఔన్సు చొప్పున యియ్యనగును.

శ్వాసనాళములయందు యీడ్పు గలిగినట్లు దోచినయెడల, నైట్రోగ్లిసరీన్ టేబ్లాయిడ్ (బిళ్లను) నుగాని, స్పిరిట్సు ఆఫ్ క్లోరోఫారంను గాని, టింక్చర్ ఓపియంను గాని టింక్చరు బెలడోనాను గాని, టింక్చరు లోబేలియాను గాని, ఈతరును గాని, వాడనగును.

వ్యాధిగ్రస్తుడు కీళ్ళనొప్పుల (వాతరోగము)తో గూడియున్నయెడల, సోడా సేలిసైలేట్‌ను గూడ వాడవలసి యుండును. రోగి గౌట్‌తో గూడియుండి యూరిక్ ఆమ్ల విష బాధితుడైనట్లు దోచినయెడల డయూరెటిక్సులో 3 వ ఔషధయోగమును వాడవలయును ఆహారమును గూడ ఈవ్యాధికి సరిపడునట్లు యియ్యవలయును.

## పచ్చకామాల.

ఈవ్యాధియందు చర్మము పసుపువర్ణమును వహించి యుండును. కారిజమునుండి పిత్తద్రవముయొక్క పారుదలకు, కారిజముయొక్క వెలుపలి ఆటంకమువలనను ఒకప్పుడు కారిజమునందే గలుగు ఆటంకమువలనను, పిత్తద్రవము రక్తముచే పీల్చుకొనబడి, యీవ్యాధి కలుగుచున్నది. కండ్లలోని తెలుపులు, ఆకుపచ్చవి లేక పసుపు వర్ణమును దాల్చియుండును చూచుటకుకండ నొకప్పుడు ప్రతివస్తువుయును పసుపువర్ణమును గలిగియుండునట్లుండును. ప్రేగులయందుండు పురుగుల్ని శాంటొనీన్ ను పుచ్చుకొనుటవలనను యొకప్పుడు యిట్లు కలుగవచ్చును. ప్రేగులయందు మలబంధ మేర్పడి, విరేచనము తెల్లగాగాని రేగడియొక్క వర్ణముగాగాని యుండి, మూత్రము ఉద్రిక్తమగు పసుపువర్ణముతో గూడి యుండును. ఒడలంపై దురదగానుండి, నోటిలో చేదుగానుండి, నాలుకపై పొరగప్పి, ముఖ్యముగా ఉదయము లందు త్రిప్పుటతో గూడియుండును. వీటి కన్నిటికిని కారణము రక్తమునందు పిత్తద్రవము కలిసియుండుటచే అయియున్నది. అనేక కారణములలో నేదియోయొక కారణమున పిత్తద్రవము రక్తములోనికి పీల్చుకొనబడి, మూత్రగ్రంథుల వలన మూత్రముద్వారా వెలుపరింపబడును. ఈ అస్వస్థస్థితి స్థిరముగ నుండినను ఉండవచ్చును. లేక కొన్ని దినములలోనే అంతరింప వచ్చును.

స్థిరముకానట్టి పచ్చకామాలవ్యాధి, కారిజమునందు రక్తము కూడుకొని యుండుట యొక్క ఫలితమయి యుండవచ్చును. పైత్యవాహిక యొపదలి రక్త ప్రవాహమునకు పైత్య శిల (Gallstono) అడ్డుపడుటవలనను, యీవ్యాధి కలుగవచ్చును. సామాన్యముగ చిన్న దైన పిత్తనాళములయందు రక్తము కూడుకొని యుండుటవలన నీ అస్థిర పచ్చకామాల కలుగుచుండును. ఇందులకు 4 వ విరేచన కారిని ఉదయమునను సాయంకాలమునను కొన్ని దినములపాటు వాడుటవలన నుపయోగించగలదు. కారిజముపయిన మస్టర్డుపట్టీని అప్పుడప్పుడు వేయుచుండ వలయును. ఆహారము తేలికయినదియును బలము నిచ్చునట్టిదియును అయి యుండ వలయును. బ్రాందీ మొదలగు మత్తుపదార్థముల నుపయోగింప గూడదు. 8 వ విరేచన కారిని గూడ వాడనగును. అజీర్ణవ్యాధితో గూడియుండినయెడల పొటాష్ బై కార్బనేట్, పొటాష్ నైట్రిసు, టింక్చర్ ఆఫ్ జింజర్ గలిసిన ఔషధమును వాడనగును.

## పక్షవాయువు.

ఈవ్యాధియందు, యేదైన నొక అవయవముయొక్కగాని, శరీరములోని సగభాగముయొక్కగాని, కదలికకు వలయు శక్తియొక్క నష్టమును సూచించును ఈ వ్యాధిఅనేక తరగతులుగ నుండియున్నది.

1. మెదడు యొక్క అస్వస్థతవలనగాని, మెదడునకు గలుగు హానివలనగాని యేర్పడు పక్షవాయువు; ఇది అంగవికృతి రోగమునకు విరుద్ధముగాని, లేక, కేవలము మెదడు యొక్క అస్వస్థత వలననేగాని కలుగుచుండును.

2. వెన్నుపామునకు గలుగు హానివలనను పక్షవాయువు కలుగుచుండును.

3. వెన్నుపాముయొక్క అస్వస్థతవలనను పక్షవాయువు కలుగుచుండును. నడుము యందును కాళ్ళయందును నిస్త్రాణతోడను, స్పర్శములందు జలపరమతోడను, యీవ్యాధి ప్రారంభమగును. ఊరువులయందును కాళ్లయందును నొప్పులు ప్రారంభమయి, తెరలు తెరలుగా పోట్లు పొడుచుచు, విద్యుచ్ఛక్తివలన గలుగు అదరుపవలె నుండును. ఇది, మొదటగా కీళ్ళనొప్పులుగా భ్రమింపబడును. ఇది, సామాన్యముగ కొఱుకురోగము యొక్క ఫలితముగ గలుగుచుండును. వ్యాధి అభివృద్ధినందిన కాలదిని స్నాయువులు క్షీణతనందుచుండును. కొన్ని విషయములలో, దృష్టి చెడిపోయి, రాత్రులయందు మూత్రమును నిలుపు చేసికొనుటయందు స్వాధీనము తప్పిపోయి, బహుశః జననేంద్రియమునుండి స్రావములు కలుగుచు, నడుము ప్రక్కల అణచి పట్టినట్లుండును. పోట్లు అధికమయిన కాలదియు, రోగి యొక్క కాళ్ళపై స్వాధీనము తగ్గిపోవుచుండును. నడువబోయినపుడు తూలుటయు ఆరంభించును. ఆసాన లేకుండ నడువజాలడు. పాదములను అనవసరముగ మిగుల యెత్తున కెత్తి ముందువైపులకు కాలిమడమలను విసురుతో క్రిందవేయును. పాదములవైపుకు జూచుచున్నపుడు క్రమముగా నడువవచ్చును. కండ్లు మూసికొని నడుచుట యందుగాని, చీకటిలో నడుచుటయందుగాని, బహుశః క్రిందపడును. స్పర్శయొక్క ఇంద్రియజ్ఞానముగూడ అస్వస్థత నందియుండును. నీరడుతిత్తియొక్క నాపుదల యేర్పడవచ్చును. కాని, సామాన్యముగ ఎదురొమ్ము అస్వస్థత యేర్పడదు. ఈ వ్యాధులయొక్క పరిమితికాలము కొన్ని సంవత్సరములు పట్టినను పట్టును. బలమగు ఆహారముల నిచ్చుటయందును, బలవర్ధకౌషధముల నిచ్చుటయందును, చికిత్స యిమిడియున్నది. కొఱుకురోగముగాని, శరీరప్రకృతి సంబంధమగు యితర వ్యాధులుగాని, ఉండినయెడల, అందులకగు ప్రత్యేక చికిత్సలను జేయవలయును.

ఈ పైవిధములగు పక్షవాయువు, కొఱుకురోగముయొక్క సాధుగతియందైన తప్ప, కుదురుబాటు అగుట అరుదైయున్నది. సాధారణఆరోగ్యత కగుశ్రద్ధను పుచ్చుకొనుచుండవలయును.

4. మత్తుపదార్థముల నుపయోగించుటవలన గలిగెడి పక్షవాయువు, మత్తుద్రవముల నెక్కువగ నుపయోగించుటవలన, ముఖ్యముగా సాదువారలయందు పక్షవాయువు కలుగును. ఈ వ్యాధి క్రమముగా హెచ్చును. బాధతోగూడి, కాళ్లయందును పాదములయందును తిమురులేర్పడి, మోకాళ్ళయందు బలహీనత గలిగి, శక్తిహీనమయి, నడుచు రీతియందు వికృతి కలిగియుండును. వ్యాధి అభివృద్ధి నందినకాలదిని రోగి మంచము పట్టును. ఈ వ్యాధి చేతులకు సాధారణముగ వ్యాపించదు. ఈ వ్యాధి ఆ స్థానమందలి నరముల ననుసరించియే యుండును. గాని మెదడును వెన్నుపామును అస్వస్థతనందియుండవు. మత్తుద్రవములను పూర్ణముగా త్యజించవలయును. మంచిఆహారము, బలవర్ధకౌషధములు, యెలెక్ట్రిక్ బ్యాటెరీ—ఉపయోగింపనగును. వ్యాధి మిగుల అభివృద్ధి చెందినను స్వస్థత నందుటకు వీలుకలదు. 1 గ్రెయిను ఫాస్ఫరస్, 12 గ్రెయినులు యక్స్ట్రాక్టు ఆఫ్ నక్స్‌వామికా, 50 గ్రెయినుల ప్రెసిపిటేటెడ్ కార్బొనేట్ ఆఫ్ జింక్,—వీటినన్నిటిని గలిపి

50 మాత్రలుగా జేసి దినమునకు మూడుమాత్రలను సేవించవలయును. కొద్దిమోతాదు లలో నైకర్ స్ట్రిక్నీన్ కూడ ఉపయోగముగ నుండును.

5. రంగుపని చేయువారలును సీసపు సంబంధమయిన పనులను జేయువారలును మణి కట్టుయొక్క పక్షవాతమును గలిగి చెయ్యి పడిపోవును. ఈ విధమగు పక్షవాయువు నందు పండ్లచిగుళ్ళపైన నీలపురీత కనుపడును. ఇట్టివ్యాధియందు ఆపనిని మానివేసి విరేచనకారుల నుపయోగింపవలయును. పిమ్మట 3 వ అల్లరెటీవునందలి పొటాసియం అయొడైడ్ ను ఉప యోగింప నగును.

6. ముఖసంబంధమగు పక్షవాయువు శరీరమునందలి పక్షవాయువుయొక్క ఒకభాగ ముగ గాని; చలిగాలి సోకుటవలనగాని, యీ వ్యాధి కలుగవచ్చును. ముఖము నందలి యొక నైపుల స్నాయువులు అస్వస్థత నందుటవలన ఆ భాగము కదల్చుటకు వీలులేకుండ నుం డును. ఒకవిధమగు కీళ్ళనొప్పులవలన యీ వ్యాధి కలుగవచ్చును. వేడి కాపడములను గాచుచు బైకార్బనేట్ ఆఫ్ సోడా, కాల్చికం వైన్, స్పిరిట్ ఈతర్ నైట్రిస్, గలిసిన ఔషధయోగమును వాడవలయును.

7. బిడ్డలయందు గలుగు పక్షవాయువు : పుట్టుకతోడనే నొకప్పుడు బిడ్డలకు యీ వ్యాధి కలుగుట గలదు. పండ్లు వచ్చునపుడుగాని, సరిపడని ఆహారము నిచ్చునందు వలనగాని, నీరసత వలనగాని, పేగులయందు బురుగు నుండుటవలనగాని, యీవ్యాధి కలుగవచ్చును. జంటపండ్లు వచ్చునపుడును యిది సంభవింపవచ్చును. కొన్నిదినములు జ్వరముగా నుండిన పిమ్మట మామూలు విధముగనే నిద్రపోయిన తరువాత అకస్మాత్తుగ నొకదినమున ఒక చెయ్యియేగాని, ఒక చెయ్యియు రెండు కాళ్ళుగాని స్వాధీనము తప్పినట్లు కనుగొననగును. ఈ స్థితి కొద్దిదినములేగాని, కొద్దివారములుగాని యుండినపిమ్మట బిడ్డయొక్క ధారకమునందు క్రమము కలిగినపిమ్మట నెమ్మదించిపోవును. పుట్టుకతోడనే యీ వ్యాధికలిగి యుండిన యెడల స్వస్థత కలుగుట మిగుల కష్టమయి యున్నది. బిడ్డను పరిశుభ్రమగు గాలిలో తరు చుగ దిప్పుచుండ వలయును. కాళ్ళను చేతులను దరుచుగ బట్టుచుండవలయును. సిరప్ ఫెర్రయి అయొడైడ్ ను వయసును బట్టి తగుమోతాదులలో నియ్యవలయును.

8. హిస్టీరియా సంబంధమగు పక్షవాయువు : హిస్టీరియా వ్యాధియందు, కీలుగాని మోకాలుగాని, కాళ్ళుగాని, యీ వ్యాధి నందవచ్చును. ఆరోగ్యమున కగు పద్ధతుల నవ లంబించుటవలన దీనికి నెమ్మది కలుగవచ్చును.

9. వ్రాయుట యందలియు, టెలిగ్రాఫ్ కొట్టుట యందలియు, పక్షవాయువు వ్రాత పని అధికముగ గలవారియం దొకానొకప్పుడు మణికట్టుయందు పక్షవాయువు కలుగ వచ్చును. ఇట్టిఅస్వస్థత యేర్పడుచున్నదని సూచనలు కనుపడగనే, ఆపనులను ఆపివేసి విశ్రాంతి దీసికొనుచు బలవర్ధకౌషధముల వలనను, పరిశుభ్రమగు గాలివలనను, శరీరసాధ కము వలనను, అస్వస్థత భాగమున కన్నివైపు లను దరుచుగ బట్టుచుండుటవలనను, నెమ్మది గలుగగలదు.

## ప్రసవ సంబంధమగు జ్వరము.

ప్రసవమైనపిమ్మట నొకానొకప్పుడు మిగుల అపాయకరమగు జ్వరము తటస్థించుట కలదు. గర్భాశయమునందు నిలువయున్న కుళ్ళిపోయిన పదార్థము శరీరములోనికి పీల్చుకొనబడుటచే రక్తము విషయుతమగుటవలన నీ జ్వరము కలుగుచున్నది. ప్రసవమయిన కొద్దికాలములోనే చలికలిగి శరీరవేడిమి అధికమయి, చెమటపోసిన పిమ్మట స్రావము క్రమముగ నగుచు, స్తనములు ఉబ్బుదలనందిన వెంటనే ఉపశాంతి కలిగినయెడల—యిది పాలజ్వర మనబడును. చెమట పోసిన పిమ్మట ఉపశాంతి కలుగక స్తనములు బిగిసి చిన్నవై స్రావము తగ్గుదలనందిగాని లేక అసలే ఆగిపోయిగాని, నాడియొక్క దెబ్బ నిమిషమునకు 120 కంటె హెచ్చియున్నయెడల ప్రసవసంబంధ జ్వరమే అని ధృవపర్చవచ్చును. నిస్త్రాణ యేర్పడి ఊపిరియందాయాసము కలిగి, పాలు నిలుపు కాబడినయెడల, యీవిధమగు జ్వరమునుగూర్చి నిశ్చయతనంది, అనుమానము నెంతమాత్రమును ఉంచుకొన నక్కర లేదు. పేగులయెడల బాధయు, పచ్చితనమును—తరుచుచుండునట్టియు ప్రాముఖ్యమైనట్టియు లక్షణములైయున్నవి. పైత్యసంబంధమగు వాంతి, దాహము, దుర్గంధమగు చెమట—ఇవియు కూడియుండును. నాలుకపై మాలిన్యమేర్పడి నోరు అసహ్యముగానుండి ముఖము పాలిపోయి, బహుశః అతివిరేచనము లేర్పడి విరేచనమందు గట్టిపడిన మలపదార్థము వెలువడుచుండును. ఈ విధమగు జ్వరము అంటుగుణమును గలిగియుండును. గాన ఒక బాలింతరాలు నుండి యింకొక బాలింతరాలునకు వ్యాపించకుండ జాగ్రతలను అవసరమునుబట్టి పుచ్చుకొనవలసియుండును. విరేచనమగుటకును చెమట పోయుటకును అవసరమగు ఔషధముల నారంభమునందే యియ్యవలయును. 4 వ ఔషధయోగమును విరేచనకారిగ నియ్యవలయును. రెండు ఔన్సుల చిట్లాముదమును పది లేక పండ్రెండు ఔన్సుల సబ్బుతో గలిసిన నీళ్ళను—యెనీమాగా ఉపయోగించవలయును. జ్వరవేడిమిని తగ్గించుటకు గాను సిల్ఫేట్ ఆఫ్ మెగ్నీసియాను గలిపిన జలమును ప్రతి నాలుగు గంటలకును త్రాగవలయును. ఉడుకు నీళ్ళను భగరంధ్రము ద్వారా పిచికారీని జేయవలయును. ఉదరముపైన వేడియైన అవిసిపిండి కట్టులను గట్టవలయును. గదిలోనికి గాలియొక్క రాకపోకలకు వీలుగ నుండవలయును. దుర్వాసనను బోగొట్టునట్టి పదార్థముల విరివిగ నుపయోగింపవలయును. బలమునిచ్చు పాలు మొదలగు ఆహారపదార్థముల నియ్యవలయును.

---

## పంటి నొప్పి.

పంటియొక్క నరము రేగుదల నందుటవలనగాని, వాపుదల కలుగుటవలనగాని, పంటి నొప్పి కలుగును. నరము బయట బడునంతవరకును పన్ను క్షీణించియుండుట సామాన్య కారణమైయుండును. పంటియొక్క క్షీణత బయటి వైపుననగాని కుదురువయిపునగాని పుట్టి లోనకు ప్రవేశించును. పండ్ల మధ్యనుండెడి ఆహారము కుళ్ళుటవలన ఆమ్లములవలెనే ఈకుళ్ళ పదార్థము పండ్లపయిన పనిచేయును. నోటియందుండెడి పుట్టకొక్కుజాతి సంబంధమగు ఒక పురుగు పుచ్చిపన్నుల నావరించి క్షీణస్థితికి సహాయము చేయును. పంటియొక్క క్షీణతయొక

ప్పుడు నొప్పి వలనమాత్రమే తెలియదగి యుండును. గర్భవతిసమయమున ఆడువారల యొక్క పండ్లు చెడిపోవుటకు యెక్కువ యుద్యుక్తతను వహించును. కావున నీ సమయమునందు స్త్రీలు యెక్కువగ జాగ్రతను వహించియుండవలయును. పండ్లసందు లయందు ఆహారమును అనుమానును యిరుక్కొనకుండ జూడవలయును. దళమయినట్టియు జిగట యయినట్టియు ఉమ్మినీరు యేర్పడునప్పుడు మంచి పండ్లపొడి నుపయోగించుచు, బ్రష్‌తో బండ్లు దోముటకు ప్రారంభించవలయును. చాల పండ్లపొడులు మిరయముగానుండి పండ్లను గీరున్థితి యందుండును గాన, నవి హానికరములైయున్నవి. వీలయినయెడల ప్రతిభోజనము పిమ్మటను పండ్లను శుభ్రము చేయవలయును.

పండ్లను శుభ్రము చేయుటకు ఉపయోగించెడి పండ్లపొడి పండ్లకు ఒరయిక కను గలుగజేయునట్టిది గను, పురుగులను నాశనము చేయునట్టిదిగను పండ్లచిగుళ్ళకు రేగుదలను బుటించనిది గను, ఉండ వలయును. ఈ అన్ని గుణములును కాల్వర్ట్స్ కార్బాలిక్ టూత్ పవుడరు నందు కలవు. కావున యీ పండ్లపొడిని ఉపయోగింపనగును. ఒకానొకప్పుడు నరములసంబంధమగు ఒక విధమయిన తలనొప్పికలిగినప్పుడు ఆరోగ్యతను వహించియున్న పంటియందుగూడ నొప్పియున్నట్లు గాన్పించును. ఇందులకు ముందుగ విరేచనకారి నుపయోగించి పిమ్మట క్వినీన్‌ను సేవించవలయును.

పంటియందు గుంటపడి, బాధ అధికముగా నున్నయెడల, గుంటయందు లింటుతో గాని కాటన్ ఊల్‌తోగాని పొడిగానుండునటుల దుడిచి, ఒక గ్రెయిను క్యాంఫరు (కర్పూరము), ఒక గ్రెయిను ఓపియం (నల్లమందు), ఈ రెంటితో గలిపి చేసిన పేస్టుతో ఆ గుంటను పూడ్చవలయును. లేక స్పిరిట్సు ఆఫ్ క్యాంఫరు కొన్ని చుక్కలను లింటుతో నద్దినను అద్దవచ్చును. ఒకటి రెండు చుక్కలను క్రియసోట్, క్లోరోఫారం, టింక్చర్ ఓపియం, పెప్పర్‌మంట్ ఆయిల్, క్యాజిపట్ ఆయిల్, వీటిలో దేనినైనను కూడ నద్దవచ్చును క్లోరల్ హైడ్రేన్‌నున్నూ, క్యాంఫరునున్నూ సమానభాగములుగ గలిపి, యీద్రవమును పంటియందు ప్రయోగింపనగును. బరోస్ వెల్కం అండ్ కంపినీయొక్క కొకేన్ టేబ్లాయిడ్‌ను (1/6 గ్రెయిను) పంటిరంధ్రము దుంచి కాటన్ ఊల్‌తో గప్పియుంచవలయును పంటియొక్క క్షీణత నొప్పుదల జేయుటకు వీలులేనంతవర కభివృద్ధినొంది యున్నపుడు పంటిని దీయించివేయుటయే ఉత్తమమయినది.

---

## పంటిచిగురుల వాపు.

పంటియొక్క చిగురులు వాపునందిన పిమ్మట, కొన్ని విషయములలో కురుపులుగా దేలవచ్చును. అశ్రద్ధ జేసినయెడల నీకురుపులు చెంపగుండ కూడ దేలవచ్చును. అస్వస్థత భాగమునందు బిగుసు పోటుతో గూడియుండును.

వేడి కాపడములను గాచుటవలనను, వేడినీళ్లను నోటిలో పోసికొని పుక్కిలించి ఉమ్మివేయుటవలనను, ఆరంభమునందుపయోగముగ నుండగలవు. వాపుదలను గలుగజేసిన

పన్ను యొక్కువ క్షీణగతి నందియున్నయెడల, దానిని తొలగించుటయే మంచిది. లేనిచో యీవురుపులు మరల మరల కలుగగలవు.

---

## పాముకాటు.

ఇండియాదేశమునందు 213 తరగతుల పాములు కలవు. ఇందు 33 మాత్రమే విష సంబంధమైనవై యున్నవి. ఈవిష సంబంధమైన వాటియందు, వైపరీస్ కలుబ్రీస్ అని రెండు తెగలు గలవు. మొదటివాటికి మొండితోకలును త్రికోణాకారమును వహించిన తలలును యుండును, రెండవతెగవాటికి పడగలుండును. నీటికి సంబంధించు త్రాచుపాములుందును. ఈ త్రాచుపాములందు రెండే విష సంబంధమగు కోరలుండును. అంగిలియందు వేరుపండ్లు ఉండి యుండును గాని, యివి విషమునకు సంబంధించి యుండవు.

## లక్షణములు.

విషసర్పములు కరచుటవలన, కాటుయొక్క గుర్తులు రెండు మాత్రమే కనుపడును. రెండుగుర్తులకంటె నెక్కువగ నున్నప్పుడు, విషసర్పము కరువలేదని గాని, విష సంబంధములగు కోరవలన కాటు గలిగియుండలేదని గాని యెంచవచ్చును. పాము కరువగనే, యేదియో కుట్టినట్లుండును గాని, ఆరంభమునందు విశేషబాధ యుండనేరదు. నిస్త్రాణ, వాంతి వచ్చునట్లుండుట, కాళ్ళు నిలువలేకపోవుట, మత్తు, ఒకప్పుడు వాంతికలుగుట, — యివి తరువాత శీఘ్రముగ గలిగెడి లక్షణములై యున్నవి. పిమ్మట, ఉచ్ఛ్వాస నిశ్వాసములై ఆయాసముతో గూడి యుండి, నాడి చురుకుదనము కలతనొందియుండి, మాట్లాడుటకును, మ్రింగుటకును, శక్తులు నశించి, నాలుక ముందుకు త్రోసికొనివచ్చి, నోటినుండి నురుగులు వచ్చుచుండును. చేతులను, కాళ్ళను కదల్చుటకు శక్తి తప్పిపోవును. చల్లని చెమట పోసి తెరలుగా మూర్ఛలు కలిగి, రోగికి స్మృతితప్పిపోయి, కొద్దిగంటలలోనే క్షీణగతి నొందును. అయినను, చాల విషయములలో రక్తము విషపూరితమై, వ్యాధి చాల దినములకు వ్యాపించుటయు గలదు. కాటుగలిగినచోట వివర్ణమై, అవయవము ఉబ్బుదలనంది యుద్ధియో యొక భాగమున గురుపుగా దేలవచ్చును. ఒకానొకప్పుడు అతి విరేచనములు కలిగి, కాటు కలిగిన స్థలమునుండి రక్తము కారవచ్చును. ఇంకొన్ని విషయములలో మూత్రము రక్తయుతమై యుండవచ్చును. లేక ముక్కువెంబడి ప్రేగులవెంబడి పండ్లచిగుళ్ల వెంబడి రక్తము కారవచ్చును. భయమువలన గలిగెడి మనోకలత విషప్రేరేపణకు సహాయము చేయును. గాయములోనికి జొచ్చిన విషముయొక్క పరిమాణమును బట్టి, వ్యాధియొక్క లక్షణములు ఉద్రేకమును వహించి యుండును.

## చికిత్స.

ఈ విషయమునకు సరియగు విరుగుడు యింతవరకు గనిపెట్టి యుండలేకపోయినప్పటికిని, శీఘ్రమైనట్టియు సామర్థ్యముతో గూడినట్టియు చికిత్సను జేయుటవలన ప్రాణమును

గా పొడవచ్చును. ఈక్రింద జెప్పబడిన పనులను వెంటనే జేయవలసి యుండును. కాటు కాలుమీదగాని చేతిమీదగాని అయి యున్నయెడల, గాయమునకు కొన్ని అంగుళములపైగా కట్టును గట్టవలయును. ఈకట్టు రక్తప్రచారమున కాటంకము గలుగునంత గట్టిగా గట్టవలయును. కట్టునకు క్రిందిభాగము యెఱ్ఱబడి, పిమ్మట నల్లపడుటవలన కట్టు క్రమముగా గట్టబడినట్లు గ్రహింపనగును. దీనిపిమ్మట కాటు భాగమునుండి రక్తమును నోటితో పీల్చవలయును. ఈపీల్చినదానిని ఉమ్మివేసి నోటిని శుభ్రముగా గడుగుకొన వలయును. ఇట్లు చేయువానికి నోటియందుగాని పెదవుల యందుగాని యేవిధమయిన పుండుయును లేకుండజూడవలయును. అస్వస్థభాగమున అనగా కాటుగలిగిన భాగమందు కత్తితో కొంచెము యెక్కువగా గీసి, వేడినీళ్లలో ముంచుటవలనగాని, వేడినీళ్ళను పైన బోయుచుండుట వలనగాని, రక్తస్రావము నభివృద్ధి పరచవలయును. కట్టుకట్టిన ఒక అరగంట కాలములో పైన జెప్పబడిన లక్షణము లేమియు గనబడని యెడల, అస్వస్థతభాగమును గడిగినపిమ్మట కట్టును. ఊడదీయవచ్చును. లేనిచో, నంతట ఇది యుపయోగము లేక పోవుటయే గాక, అపాయకరము గూడ గావచ్చును. కాని, అవయవము వాపుదలనంది చల్లదనమును వహించి యుండిన యెడల, వైద్యచికిత్సను జేయకపోయినప్పటికిని కట్టు విప్పవలసి యుండును. పైన జెప్పినటుల కాటునందు ఒకచుక్క నైట్రిక్ ఆసిడ్ గాని కార్బాలిక్ ఆసిడ్ గాని వేయవలయును. లేక ఒకడ్రామునీళ్ళలో 5 గ్రెయినుల పొటాష్ పర్మాంగనేట్ కలిపిన సొల్యూషనును గాని గాయములోనికి పోనియ్య వచ్చును.

చురుకునుబుట్టించు పదార్థములలో బ్రాందీ, స్పిరిట్సు అమ్మోనియా అరోమేటిక్, లైకర్ అమ్మోనియా (యూడిల్యూస్) వీటిలో నేది అందుబాటు నందుండినయెడల దానిని వెంటనే యియ్యవలయును. యూడిల్యూస్ 30 చుక్కల మోతాదును ఒక అరఔన్సు జలమునందు గలిపి యియ్యవలయును. స్పిరిట్సు అమ్మోనియా అరోమేటిక్‌ను పెద్దమోతాదులో జలమునందు గలిపి యియ్యవలయును. విషముయొక్క ఉద్రేకఫలితమునందు తగ్గుదల కనుపడునంతవరకును యేఔషధము నుపయోగించినను ప్రతి పదునైదు నిమిషములకును దానిని మరల మరల యిచ్చుచుండవలయును. నిస్త్రాణ అధికముగా నుండినయెడల చల్లనినీళ్ళను ముఖముపైనయును శిరముపైనయును జల్లి మస్టర్డుపట్టీలను గుండెపైనయును జీర్ణాశయముపైనయును వేయవలయును. అంతకాలమందునను, రోగికి విశేషముగు పరిశుభ్రమయిన గాలి వచ్చునట్లు చేయవలయును. ఒడలంతయును ముఖ్యముగ పాదములవైపులను వెచ్చగానుండునట్లు చేయవలయును. అనంతర స్థితియందు గాయమునకు పిండికట్లును గట్టవలయును. విషముయొక్క ఉద్రేకలక్షణములు తగ్గగనే బలమును గలుగజేయు ద్రవపదార్థముల నాహారముగ నియ్యవలయును. అవయవము వాచినంతవరకును యేమియు చికిత్స నొందియుండని యెడల పైన జెప్పబడిన చురుకు బుట్టించు ఔషధములును, పిండికట్లును ఉపయోగించ వలసి యుండును.

---

## పాండురోగము.

పాండురోగమునందు రక్తహీనతను సూచించునుగాని, రక్తమునందలి దౌర్బల్యత దీనియొక్క ప్రధానమగు సహజ లక్షణమయి యున్నది. ఆరోగ్యతయందుండెడి రక్తము

సంపు యెఱ్ఱనికణము లధికముగ నుండుటవలన రక్తమునకు యెఱుపురంగు కలుగుచున్నది. ఈ యెఱ్ఱని రక్తకణముల సంఖ్యయందు తగ్గుదలనందుట వలనను, ఐరన్ (లోహము)ను గలిగి యుండినట్టియు, ఊపిరితిత్తులలోనికి పీల్చు ప్రాణ వాయువును శ్వాసకోశమునుండి శరీరమునందలి యన్ని భాగములకును గొంపోవుటకు శక్తిగలిగి యుండినట్టియు, హోమోగ్లోబిన్ అనబడు యీ యెఱ్ఱని కణముల యందలి యొకభాగము తగ్గియుండుట వలనను — యీ పాండురోగము యేర్పడుచున్నది. రక్తమునందు జలభాగము అధికమయి రక్తమునందలి మఱికొన్ని పదార్థములును వాటి గుణములయందు మార్పును జెందుచున్నవి.

చాలని ఆహారము; సూర్యరశ్మి చాలినంత లేకపోవుట; చీకటిగదులలో నివసించుట; చాలినంత పరిశుభ్రమగుగాలి, శరీరసాధకము లేకపోవుట — యివి అన్నియు ఆకలికి క్షీణతను గలుగజేసి, శరీరమునకు బలమును గలుగజేయవు. అతి బహిలికవలన జీర్ణావయవములు కూడ దీయగలుగు దానికంటె శరీరమునం యెక్కువ నష్టమును గలుగజేయును. అలవాటుగ నేర్పడిన మలబంధమునందు, మలమునందలి కొన్ని దుష్ప్రపదార్థములు శరీరములోనికి పీల్చుకొనబడి, విషములుగ బని చేయును. అధిక మనోపరిశ్రమవలన, నిద్రకు భంగము కలిగి జీర్ణాస్వస్థలు గలుగును. మనోవిచారము వలన మనుష్యులు పాలిపోవు విషయమై మనము తరుచుగ వినుచునేయుంటిమి. చెమ్మతో గూడినట్టి ప్రదేశములును మన్యప్రదేశములును యీ వ్యాధి కుద్యుక్తతను, బుట్టించును. మూత్రగ్రంథులయొక్క క్షీణదశ, మూల శంక, ప్లీహవ్యాధి, ప్రకోపించుచుండెడి చలిజ్వరము, అధిక బుతుస్రావము — దీర్ఘ వ్యాపితమైన యీ అన్ని వ్యాధులయందును పాండురోగము ఫలితముగ గలుగవచ్చును.

## ల క్ష ణ ము లు.

ఈ వ్యాధియందు ఒడలు పాలిపోయి యుండును. స్వదేశీయుల యందు చర్మమునందలి మెరుపు తగ్గిపోయి, అరచేతులు యెక్కువ తెల్లదనమును వహించి యుండును. నేత్రములలోను తెలుపులు యెక్కువ తెలుపులై, కనురెప్పలు, ముక్కు, నోరు, — వీటియొక్క లోపలిభాగములును, నాలుకయు, పెదవులును పాలిపోయి యుండును. చెంపలయందు రక్తము హీనమైనను శరీరమంతయు బరువునందు తగ్గిపోయినను ముఖము నిండుగానుండి ఉబ్బుదల నందినట్లుండును. రోగి నిస్త్రాణనంది చలితోగూడి పరిశ్రమను అయిష్టపడి యుండును. అరచేతులు తరుచుగా మండుచుండును. పాదములు సాధారణముగ జల్లగనుండును. జలుబు ప్రవేశించి గొంతునందు పచ్చి యేర్పడి, శ్వాసనాళములు తఱచుగ నస్వస్థతస్థితియందుండును. వాయువునందు గలుగు మార్పువలన అతివిరేచనము లేర్పడవచ్చును. ఆకలి సామాన్యముగ మందగించి యుండును. మూత్రము సాధారణముగ తెల్లగాయుండి, ప్రేగులయందు మలబంధ మేర్పడును. కణతలసమీపమున తలనొప్పియు పోటుతో గూడి యుండవచ్చును భోజనము చేయుటవలనను పరుండి యుండుట వలనను యీనొప్పి నద్దుకొనవచ్చును కూర్చుని యుండుటవలన గాని, పరిశ్రమను జేయుటవలన గాని, యీ నొప్పి అధికమగును కాళ్ళును చేతులును లాగుట తరుచుగా నుండును స్త్రీలలో బుతుస్రావమునం దస్వస్థత యేర్పడును. కుసుమవ్యాధి(లుకోరియా) తరుచుగ గలుగుచుండును. గుండెయొక్క అదర

యేర్పడును. వ్యాధి అభివృద్ధి నందిన కొలదిని ఉచ్ఛ్వాస నిశ్వాసముల యందు ఆయాస మేర్పడును. నిస్త్రాణ అతిశయమగును. జీర్ణ మండలి అస్వస్థతయు హెచ్చుగ నుండును. చెడిపోయిన రక్త ప్రవాహమువలన మెదడును అస్వస్థతనందుట కారంభించును. రోగికి కోపము అధిక మగుచుండును. జ్ఞాపకశక్తి తక్కువయి దేనియందైనను దృష్టినిలుపుట యందలి శక్తి హీనత నందును. వ్యాధి కొంత కాలమువరకు వ్యాపించిన పిమ్మట ప్లీహ ఘనతనంది పాదములను మడమలను వాచుట యేర్పడవచ్చును.

పైన జెప్పబడిన లక్షణములు అన్నియు ఒకేమారుగా గనబడునని గాని ఒకటి తరువాత నొకటి కనబడునని గాని యెంచరాదు. రక్తముయొక్క క్షీణగతినందుట, ఒకప్పుడు ఒక అవయవమును, యింకొకప్పుడు యింకొక అవయవమును అస్వస్థత నందుచు, కొన్ని మాసములుగాని, ఒకప్పుడు కొన్ని సంవత్సరములు గాని పట్టవచ్చును. పాండురోగము అనేక అంచెలతో గూడిన స్థితులతో శరీరమునందు ప్రవేశించును. అనేకలక్షణము లతిశయత నంది, కేవలము నిస్త్రాణ వలననేగాని, లేక అంగవికృతిరోగమో పక్షవాయువో ప్రవేశించుట వలనగాని రోగి మరణము నందవచ్చును. ఈ వ్యాధియొక్క సూచన లేమాత్రము గనబడినను నిర్లక్ష్యము చేయరాదు.

## చికిత్స.

ప్రతిదినమును సామాన్యమగు శరీరసాధకమును బుచ్చుకొనుచుండవలయును. రోగి నివసించుచుండు, నిద్రించుచుండు, పనిచేయుచుండు స్థలములందు పరిశుభ్రమగు గాలియొక్క రాకపోకల కనువు లేర్పడియుండవలయును. ఆహారము బలమయి నదిగ నుండవలయును. అజీర్ణమును గలుగజేయు వాటిని త్యజింపవలయును. సారాయి మొదలగు వాటిని బహుమితముగా బుచ్చుకొనవచ్చును. చన్నీళ్లలో స్నానముగాని గోరువెచ్చని నీళ్ళలో స్నానముగాని మిగుల ఉపయోగము గ నుండగలదు. వాయువు నందు మార్పులు గలుగుటకై యితరప్రదేశముల కరుగుటయు మంచిది. పైనజెప్పబడిన కారణమువలన ఐరన్ (లోహము) కలిసియుండు బలవర్ధ కౌషధములు యెక్కువ ముఖ్యములై యున్నవి. ఈ లోహము శరీరమునందు పట్టుపట్టుటకుగాను ఆరోగ్యత కవసరమగు యితరపద్ధతులను అవలంబింపవలయును. ఐరన్ సంబంధమగు మందులలో సల్ఫేట్ ఆఫ్ ఐరన్‌ను ముఖ్యముగ నుపయోగింపనగును. దీనిని 2 మొదలు 5 గ్రయినులవరకు రెండు లేక మూడు ఔన్సుల జలములో గలిపి యివ్వవలయును. నాలుక బండబారి వెడల్పుగను, తెల్లగను, పండ్లచే నొక్కులు పడుచుండు స్థితిలో నుండినపుడు, యిది యెక్కువ ఉపయోగముగ నుండును. మలబంధ మేర్పడి యుండినయెడల విరేచనకారుల నవసరమునుబట్టి ఉపయోగింపనగును. ఋతుస్రావ అస్వస్థతతో గూడియుండిన యెడల అందులకగు చికిత్సలనే జేయవలయును.

పాండురోగము స్థిరతనంది చాలకాల ముండియుండినపుడు నీలగిరి పర్వత ప్రాంతములందు కొన్ని దినములు నివసింపబోవుట వలన మిగుల ఉపయోగముండగలదు. కొద్దిపాటి సముద్రప్రయాణమువలనను గుణమియ్యగలదు. ఔషధయోగముల క్రిందచూడనగును. ఋతుస్రావసంబంధమగు అస్వస్థతతో గూడినయెడల గేవ బలవర్ధ కౌషధమును వాడవలయును.

శరీరముయొక్క వర్ణము తిరుగుదల నందుచున్నప్పుడు. లైకర్ ఆర్సెనికాలిస్ 40 మినిములను 8 ఔన్సుల జలములో గలిపి ఒక ఔన్సుచొప్పున దినమునకు మూడు పర్యాయములు భోజనానంతరము పుచ్చుకొనవలయును. మలబంధముండినయెడల అందులకగు చికిత్సను జేయవలయును. ఆకలి సరిగా లేనియెడల ఆహారముతో ఫేర్‌చైల్డ్స్ పెప్సిన్ గ్లిసరాయిడ్సు నుపయోగింపనగును. బిడ్డలకు ఒకగ్రేయిను మొదలు రెండు గ్రేయినులవరకు దినమునకు మూడు సారులు కాల్సియం ఫాస్ఫేట్‌ను యియ్యవలెను. ఈ వ్యాధియందు బరోస్ వెల్కం అండ్ కంపెనీయొక్క బీఫ్ అండ్ ఐరన్ వైన్ మిగుల ఉపయోగమగు ఆహారముగ నుండగలదు.

— —

## ప్లీహవ్యాధులు.

ప్లీహ అనెడి అవయవము ఎదుటిపైపున జీర్ణాశయమువలనను, వెనుక పైపునప్రక్క యెముకలవలనను మూయబడి, ఆరోగ్యస్థితియందు తాకుటవలన తేలికగా గనుగొన వీలుండదు. ప్లీహయొక్క అనేకవ్యాధులు చలిజ్వరమువలన గలుగుచున్నట్లు యెంచబడుచున్నవి. ప్లీహవ్యాధులయందు ముఖ్యమయినవాటియందు రక్తము కూడుకొనుట యేర్పడుచున్నది. ఈరక్తము కూడుకొను స్థితి ఉద్రిక్తగతియు దీర్ఘవ్యాపకగతియు అని రెండు గతులుగ నేర్పడియున్నది.

ఇందు ఉద్రిక్తస్థితి, చలిజ్వరమందు యెక్కువ తరుచుగ నకస్మాత్తుగ గలుగుచుండును. చలిగతియందు పైభాగమునుండి రక్తము అంతరావయవములకు గొంపోబడి ప్లీహయందును అధికరక్తము ప్రవేశించి యందలి అల్లికలు విస్తరింపునందు, యెక్కువ ఒత్తిడిని బొందుచున్నవి. ఎడమపైపునందలి ప్రక్కయెముకలక్రింద బాధగనుండి పచ్చదనముతో గూడి బాధ నడుమువరకుగాని యెడమ భుజమువరకుగాని వ్యాపించియుండుటవలన రోగి యెడమపైపుల స్వస్థతగా బరుండుటకు వీలుండదు. త్రిప్పటయు వాంతియు నుండవచ్చును. వాంతియందు రక్తముండవచ్చును గాని విరేచనమునందు తరుచుగా రక్తము కనుపడును. చలిజ్వరము రానివారలయందు యీవ్యాధి కలుగుట బహు అరుదై యున్నది. ఉద్రిక్తస్థితి నివహించిన యీవ్యాధి కొద్దిదినములు చెమటపోయుట వలనను అతివిరేచనము లగుటవలనను మూత్రమునందు దళమయిన గసి తేలుటవలనను నశించిపోవును. మొదటిపర్యాయము యీవ్యాధి కలిగినపిమ్మట రక్తము కూడుకొనుట పూర్ణముగా సద్దుగొనును గాన తరుచుగ నిట్లు కలిగినయెడల యీ అవయవమునందలి ఒత్తిడిగలిగిన అల్లికలలో రక్తసంబంధమగు పదార్థములు నిలువయుండుటవలన నీ అవయవము మరల స్వాభావిక పరిమాణము నందజాలదు. ఇందు మూలముననే ప్లీహస్థిరముగ ఘనతనందుటను గలిగి చేతితో దాకుట మూలమున దీనిని గనుగొనవచ్చును.

———

దీర్ఘవ్యాపక గతియందున్న యీవ్యాధి, యీవ్యాధియందలి ఉద్రుతస్థితి అనేక మాసములు కలిగినదాని ఫలితముగ గలుగవచ్చును. కాని తరుచుగా నీస్థితి క్రమక్రమముగను బాధలేకుండగను బ్రవేశించి చాలా కాలము అశ్రద్ధ జేయబడుటవలన, తుదకు ఘనత నందిన యీ అవయవము బరువై యెడమ వైపుల బండనొప్పి ప్రారంభమగును. ఈ అవయవము యొక్క అస్వస్థత అధికమయినప్పుడు మిగుల పెద్దదియై, ముఖ్యముగా బిడ్డలయందు ఉదరము విస్తరించి పొడుచుకొని వచ్చినట్లుండును. ఈస్థితియందు శరీరవేడిమి సామాన్యముగ సాయంకాలమునందు 100 డిగ్రీలవరకు హెచ్చును. ఈ హెచ్చుదల విడువకుండ గలుగుచుండినయెడల వ్యాధి వెంపొందుచున్నదని తెలుపవచ్చును. బిడ్డలయందును పెద్దవారలయందును ప్లీహ ఘనతనందియున్నపుడు పచ్చిగాను పెళుసుగాను ఉండి బ్రద్దలగుటకు యెక్కువ అనువు ఏర్పడి యుండును.

ఈ అవయవముయొక్క అస్వస్థతచే రక్తమునందలి యెఱ్ఱని కణములు తగ్గుదలనందుటవలన పాండురోగము ప్రవేశించి మనిషి పాలిపోయి నాలుక తెల్లనై వణుకు స్థితియందుండి కండ్లయందలి తెలుపులుకూడ మెరయునట్టి వర్ణము కలిగి అతివిరేచనములు తరుచుగ గలుగవచ్చును. కొంత స్థితివరకును నెమ్మదించుటకు వీలు ఉండును. ప్లీహ యొక్క ఘనతనొందుట అధిక్యమయి, రోగి మరియు నీరసతనంది ఉదరమునకును కాళ్ళకును నంజు చూపి అతివిరేచనములు గాని ఆమవిరేచనములు గాని స్థిరములై రోగి మరణము నందును.

ప్లీహ ఆకస్మికముగా బాధనందినపుడు వేడి కాపడములను గాచవలయును అతివిరేచనములు లేకుండినపుడు 6 వ విరేచనకారిని వాడుటవలన విరేచనము లగునట్లు చేయవలయును. అతివిరేచనము లుండియుండిన యెడల అదే ఔషధ యోగమును సోడాసల్ఫేటు లేకుండ వాడవలయును. చలిజ్వరముండిన యెడల, అందులకగు చికిత్సను జేయవలయును. జ్వరము లేకుండ ప్లీహ వ్యాధులయందును విరేచనము క్రమముగా నగుచుండుట అవసరముగాన జరూరునుపట్టి 6 వ విరేచనకారిని వాడవలయును. బిడ్డల పాలు విశేషముగ పుచ్చుకొనుచుండవలయును. ఇందుతో లైంవాటరును కొంచెముగా గలుపనగును. సల్ఫేట్ ఆఫ్ ఐరనును 2 మొదలు 5 గ్రెయినుల వరకును 2 లేక 3 ఔన్సుల జలములో గలిపి యియ్యనగును. ఉదరము వైపుల ఫ్లానల్ గుడ్డను సామాన్యమగు బిగింపుతో గట్టుట వలన నుపయోగముండగలదు.

వీలున్నచో 40 గ్రెయినుల పల్వస్ జాలప్ కో తో గూడ 5 గ్రెయినుల సల్ఫేట్ ఆఫ్ ఐరన్‌ను గలిపి ప్రతి ఉదయమునను యిచ్చుచు 3 వ బలవర్ధ ఔషధమును దినమునకు మూడు పర్యాయములు వాడవలయును. దీర్ఘవ్యాపక స్థితులయందు 10 గ్రెయినుల ఫెర్రయి ఆర్సెనస్, 1 గ్రెయిను స్ట్రిక్నీన్, 40 గ్రెయినుల క్వినీన్—వీటి నన్నిటిని గలిపి 40 మాత్రలుగా భాగించి, దినమునకు మూడు మాత్రల చొప్పున సేవించవలయును. లినిమెంట్ ఆయొడిన్‌ను, పుండు పడకుండునట్లు జాగ్రతతో నెమ్మదిగా పైన రాయవలయును. హైడ్రార్జరై అయొడైడ్ అయింట్మెంటును ప్రతిదినమును రుద్దనగును. బిడ్డలకైనచో సోప్ లినిమెంటును పైభాగమున నెమ్మదితో రుద్దవచ్చును.

## పులిపిరి కాయలు.

స్పష్టమగు కారణ మేదియును లేకయుండ ముఖ్యముగా పడుచువారల యొక్క చేతులపైన పులిపిరి కాయలు లేచును. తరుచుగా వాటంతటవే అవియే క్రమముగా నశించును. ఈ పులిపిరి కాయలు యెదుగుటలో చర్మముపైన నెత్తుగా నుండిన యీ వేళ్ల బల్లపైన భాగమును నకు మైనమురాసి వాటిచుట్టును బిగించి కట్టినచో ఒకటి రెండు దినములలో నవి తెగి పడిపోవును పిమ్మట ప్రతిదినమును వాటిని పటికతో నద్దవలయును. వేడినీళ్లతో గడిగి, ప్రతి రాత్రియును గుడ్డను వినిగర్‌లో ముంచి పైన వేయుటవలన కొన్ని పులిపిరి కాయలు యెండిపోవును. వాటిని కోయుటగాని రేగుడులను గలుగ జేయుటగాని, కూడదు.

---

## పాదములమీద నరయొత్తు కాయలు.

పాదములపైన రాయుత్తయిన భాగములయందు ఒత్తిడితగులుటవలన కాయలుగ నేర్పడును వీటిని యెప్పుడును కోయగూడదు. మిగులబిగువైనబూట్సుగాని స్టాకింగ్సుగాని వేసికొనుటవలన నిట్లు కలిగినయెడల, వాటిని సరిచేయుటవలన నయము కాగలవు. మెత్తనైన కాయలు అయిన యెడల, ఒత్తిడిని తొలగించుటవలన నవి సర్దుకొనగలవు. వినిగర్‌లో ముంచినగుడ్డను కాయలమీద రాత్రులయందు ఒక వారమువరకు గట్టినయెడల, ఉపశాంతి గలుగగలదు. ఈ పైపనులవలన నుపయోగము లేక పోయినయెడల, అసిటిక్ ఆసిడ్‌నుగాని నైట్రిక్ ఆసిడ్‌నుగాని తేలికగాపైన అద్దవలయును. ఈ ప్రకారము కాయయొక్క మధ్యభాగమును మాత్రమే అద్దవలయును. దానిచుట్టును చమురునుగాని వాసలిన్‌నుగాని రాయుటవలన, ఆసిడ్ ప్రక్క భాగములయందు తగులకుండ చేయవలెను.

---

## పురుగులు.

మనుష్యునియొక్క పేగులయందు పీడించునట్టి పురుగులు మూడు సామాన్యజాతులుగ నేర్పడియున్నవి. (1) టేప్ పురుగులు—ఒక విధమయిన ఏలికపాము (Tape- worm); ఈపురుగులు సామాన్యముగ పెద్దవారలయందు మాత్రమే గలుగు చుండును. (2) గుండ్రని పురుగులు (Round-worms): ఈ పురుగులు బిడ్డలయందు ఎక్కువగను గలుగుచుండును. (3) నులిపురుగులు: బిడ్డలయందేగాని పెద్దవారలయందుగాని గలుగుచుండును.

### 1. టేపు పురుగులు.

ఈ విధమగు పురుగునందు అనేక తెగలు గలవు. ఇది చిన్న పేగులయందు గాని, పెద్ద పేగులయందుగాని, నివసించుచు. ఒక్కొక్కప్పుడు పేగుల యంతటను వ్యాపించియుండును. దీనియొక్క పొడుగు విశేషముగనుండి, ఆరు అడుగులు మొదలు ఇరువది యడుగుల వరకును, ఒక్కొక్కప్పుడు యింతకు మించియును ఉండును. ఈ పురుగునున్నపై, తెల్లగానుండి, టేపుదారమునుబోలి, కొలంకులుగ ముక్కలు నొకదానికొకటి గలిగి, మూడు ఒక ...

తునుకలుగా నెంబడియును, ఒకటొకటి యొకదానికి తగులుకొని యుండును, సంపూర్ణముగ నభివృద్ధియైన పురుగునందు యీ తునుకలు 1,100 వరకుగూడ వ్యాపించి యుండును.

ఈ పురుగుయొక్క ప్రతితునుకయందును పురుషభాగమును స్త్రీభాగమును గూడ గలవు. కాబట్టి ప్రతిపురుగును అనేక పురుగులతో యేర్పడిన పంక్తిగా నెంచదగి యున్నది. ఈపురుగుయొక్క తలవైపున సన్నమై అదోకగానుండును. శిరము త్రికోణాకారముగనుండి సుమారు గుండుసూదియొక్క తలయంత యుండి, నాలుగు నల్లనిమచ్చలుండి యీభాగములతోనే పేగులను బట్టియుండును. ఈపురుగు పెద్దదయ్యెడు కొలది తునుకలు యేర్పడుచుండుటవలన పొడుగునం బెరుగుచు, తోకయొద్ది సంపూర్ణాభివృద్ధినందిన తునుకలు, మలముతో బడిపోవుచుండును. ఇట్లు బయలు వెడలిన తునుకలయందు యీపురుగుతో సంబంధించిన అండము లనేకము లెక్క లేకుండనుండును. ఈ అండములయందలి పిల్లలకు బొరియలను జేయుట కనుకూలమగు ఉపకరణము యేర్పడియుండును. మలముతో వెలువడిన యీపురుగుయొక్క తునుకలు పగుల్చుట, యారంభించగనే, అండలి గుడ్లు, గాలితో గాని, నీటితో గాని, యితరమగు కారణముల మూలమునగాని, ఆకస్మికముగ నెట్లో గొంపోబడిన నట్లు తమ గమ్యస్థానమును జేరుచున్నవి. ఈగుడ్లు ఆహారముతో, పశువులయొక్కయు, పందులయొక్కయు మేకలయొక్కయు, యితరజంతువులయొక్కయు, జీర్ణాశయములందు జేరవచ్చును. జీర్ణాశయమునందు యీగుడ్లు పగిలి పిల్లలయి బొరియలు జేయుటకగు పనిముట్లతో మాంసములోనికి మార్గములజేసికొని. అందు తిత్తిసంబంధమగు పదార్థముగా నభివృద్ధినందుచుండును. మాంసమును దినుటలో యీ పదార్థమును భుజించినవారల యొక్క పేగులందు యిది టేపుపురుగుగా నెదుగును. కూరగాయలయందును ఆకస్మికముగ నీసంబంధమగు పురుగు స్థానము నేర్పరచుకొని యుండినయెడల, నట్టివానిని దినుటవలనను యీ వ్యాధి సంభవింపవచ్చును. ఎట్టి పదార్థములను బాగుగా నుడికించిన యెడల, అందుండు రోగసంబంధమగు పురుగులును గుడ్లును నశింపునంది తీరవలయును. కాబట్టి సగము ఉడికిన పదార్థముల భుజించుట పనికిరాదు.

పేగులయందు నొప్పి, విరేచనము క్రమముగా గాకపోవుట, విరేచనమగునపుడు ముక్కుట, ఊపిరిగాలియందు దుర్వాసన, నాలుకపై పొరగప్పుట, క్రిందుమీద వ్వాచుండుట ఆకలి, మూత్రాశయముయొక్క రేగుదల, ముక్కుయొద్దను ఆసనముయొద్దను దురద—యీలక్షణములతో గూడియుండును. నిద్రయందు పండ్లుకొరుకుట, బిడ్డలు భయముతో నేడ్చుచు నిద్రలేచుట—యీ అంశములును గమనింపదగియున్నవి. తలనొప్పి, వికారము, పొడిదగ్గు, గుండెదడరు, నిద్ర—వీటినిగూడ నీ వ్యాధిలక్షణములుగా నెంచవచ్చును.

## చికిత్స.

పురుగులకై ఉపయోగించెడి మందులు ఆ పురుగులకు క్రమముగా దగిలిన యెడల చావనైన చచ్చును. లేక వెలువడనైన వెలువడును. టేపుపురుగు విషయములో ముఖ్యముగా మందులు పురుగుయొక్క శిరమునకు దాకవలయును. లేనిచో, యీ పురుగుయొక్క పొడుగునం దెన్నిగజములు వెలువడిపోయినను, శిరము నిల్చియుండిన యెడల పురుగు మరల అభి

వృద్ధినంది వెనుకటి లక్షణములతో మరల ప్రారంభమగును. ఈ పురుగుయొక్క శిరము పేగుల యందలి ఆమమునందు గట్టిపట్టును బట్టియుండును. కావున యిట్టిపురుగునకు మందు నిచ్చునపుడు కొన్ని ముందు జాగ్రత్తలను బుచ్చుకొనవలసి యున్నది. మూడుదినములు ముందుగా పాలు రొట్టె మొదలగు తేలిక పదార్థములను భుజించవలెను. బంగాళాదుంపలు, పిండివంటలు మొదలగునవి త్యజింపవలయును. మూడవదినము రాత్రియందు చిట్లాముదమును గాని, 4 వ ఔషధయోగమునుగాని, విరేచనకారిగ బుచ్చుకొనవలయును. మరుచటి ఉదయమునగాని, యీ విరేచనకారి పని చేసిన పిమ్మట గాని యిందుల చెప్పబడిన మందును ఉపయోగించవలయును.

ఈ క్రింద చెప్పబడబోవు ఔషధములు దొరకనియెడల దానిమ్మకషాయమును వాడవచ్చును. (దానిమ్మవేళ్ళయొక్క బెరడు, పచ్చిదైన యెడల 2 ఔన్సులును యెండినదయిన యెడల 3 ఔన్సులును 2 పయింట్ల నీళ్ళలోవేసి ఒక పయింటు అగునట్లుగా కాచి వడపోయవలయును. దీనిని మోతాదు ఒకటికి రెండు ఔన్సుల చొప్పున నుపయోగించవలయును. దానిమ్మకాయయొక్క బెరడు అయినచో అదేప్రకారముగా కాచి దీనియొక్క మోతాదు ఒక ఔన్సు మొదలు ఒకటిన్నర ఔన్సువరకు మాత్రమే అయియున్నది. ఈ కషాయమును మొదటి విధముగా జేయబడిన యెడల 2 ఔన్సుల చొప్పునను రెండవవిధముగా జేయబడిన దైనయెడల మోతాదును తగ్గించియును, అరగంటకొకపర్యాయము చొప్పున ఆరు మారులు పుచ్చుకొనవలయును. ఆటుతరువాత నాలుగు గంటలవరకును విరేచనము గాకపోయినయెడల చిట్లాముదమును బుచ్చుకొనవలయును. ఈ విరేచనములగుండా పురుగు పడిపోవును. పురుగుయొక్క శిరము విరేచనములందు గనబడక పోయినయెడల మరుసటి వారమునందు మరల యిదేపద్ధతి ప్రకారము పనిచేయవలయును).

పైదానికంటె మంచిమందులు:—(1) మేల్‌ఫరన్‌యొక్క చమురు (లిక్విడ్ యక్స్ట్రాక్టు); (2) స్పిరిటు ఆఫ్ టర్పన్‌టైన్; (3) కౌసో (Kousso) పొడి. మొదటి మందు ఒక డ్రామును మూడు భాగములుగా జేసి గంజినీళ్లలో గాని జావలో గాని గలిపి అరగంటకొక మోతాదు చొప్పున ముమ్మారు యివ్వవలయును. రెండవమందు అరఔన్సును రెండు మోతాదులుగా జేసి జావలో గలిపి అరగంటకొక మోతాదు చొప్పున రెండుమారు లివ్వవలయును మూడవమందు (కౌసో) పొడి అరఔన్సును ఒకటుంబ్లరు ఉడుకునీళ్ళలో అయిదునిమిషములుంచినపిమ్మట అంతయు గలిపి గోరువెచ్చని వేడిగానున్నపుడు ఒక్కమారుగా త్రాగవలయును. ఈ మందులను పైనజెప్పిన క్రమమును గమనించినపిమ్మట మరగడుపున బుచ్చుకొనవలయును. మందులేక నాలుగు గంటలపిమ్మట చిట్లాముదము నొక మోతాదును బుచ్చుకొనవలయును. పిమ్మట పండ్రెండు గంటలవరకును ద్రవపదార్థములను మాత్రమే ఆహారముగ బుచ్చుకొనవలయును మూడవమందు (కౌసో) ను బిడ్డలకు నియ్యరాదు. పైపదార్థముల పైన ఏ సాంటోనిన్‌ను గూడ నిచ్చి పిమ్మట చిట్లాముదమును యిచ్చుటవలన నొకప్పుడు గుణమియ్యగలదు, థైమాల్ (వాముపువ్వు) 20 గ్రైనుల వరకును మాత్రగా జేసి పుచ్చుకొనుటవలన నొకప్పుడు గుణమియ్యగలదు.

## 2. గుండ్రని పురుగులు.

వీటినే సామాన్యముగ ఏలికపాములు అని వాడుచుందురు. ఇవి ప్రేగులను జీర్ణాశయమును ఆశ్రయించి యుండును. ఇవి ఒకప్పుడు వాంతియగుటలో బయటికి వచ్చును. ముక్కులోనికి జొచ్చుటయు గలదు. ప్రేగులలోనికి జొచ్చుటవలన ప్రేగుల యొక్క వాపుదలను బుట్టించును. కాలిజములోనికి జొచ్చుటవలన పచ్చకామెల వ్యాధిని బుట్టింపవచ్చును. ఈ వ్యాధియందలి లక్షణములు పేపపురుగు నందువలెనే యుండును. ఈ పురుగులవలన బిడ్డలయందు మూర్ఛలు కలుగవచ్చును.

ఈ క్రింది ఔషధము దొరకనపుడు పేపపురుగు వ్యాధిక్రింద యేర్పరుప బడిన రీతిగనే దానిమ్మ కషాయమును యియ్యనగును. నాలుగు గ్రైనుల సాంటొనీన్‌ను రాత్రి పరుండు ముందర యిచ్చి మరునాటి ఉదయమున ఒక అర ఔన్సు చిట్లాముదమును యియ్యవలయును దీనివలన నుపయోగము లేక పోయిన యెడల పేపపురుగు వ్యాధిక్రింద చెప్పబడిన రీతిని టర్పన్‌టైన్‌ను ఉపయోగింపనగును. రెండు సంవత్సరముల బిడ్డకు రెండు గ్రైనుల సాంటొనీన్‌ను యియ్యనగును ఇందుపయిని ప్రతిసంవత్సరము వయసునకు ఒక పావుగ్రైనును చొప్పున మోతాదును హెచ్చింప వలయును. సాంటొనీన్‌ను చక్కెరలో గలిపి పవుడరుగా దీసికొనగును. సాంటొనీన్‌ను యిచ్చిన దినమున బిడ్డలకు ద్రవాహారములను మాత్రమే యియ్యనగును. సాంటొనీన్‌కు వెలుతురు తగిలినయెడల చెడిపోవును గనుక యిది యుంచబడిన బుడ్డిపయిన బ్రౌనుకాగితము నంటించ వలయును. సాంటొనీన్‌ను ఉపయోగించిన పిమ్మట మూత్రము తీవ్రవర్ణమును వహించి యుండును. నేత్రము కూడ నొకప్పుడు అస్వస్థత నందవచ్చును. ఈ ఫలితములు శీఘ్రముననే అంతరింప గలవు.

## 3. నులిపురుగు

నులిపురుగులు, సుమారు మూడవవంతు అంగుళము పొడుగుగలిగి కొంచెముగా వంగి యుండి, తెల్లనై యుండును. ఇవి మలముతో బయట పడి పోవుచుండును. వీటివలన విరేచనము అమముతో గాని, రక్తముతో గాని గూడి యుండునటుల జేయుచుండును. దుర్బలములైనట్టియు, పోషణముగా నుండనట్టియు బిడ్డలయందు యివి విశేషముగ వందల కొలదియు వేలకొలదియు ఉండును.

### చికిత్స.

ప్రిస్క్రిప్షనులలో 5 వ విరేచనకారిని వాడవలయును. బిడ్డలకు చిట్లాముదము నియ్యనగును. శరీర పరిశుభ్రత మిగుల అవసరమయి యున్నది. రెండు ఔన్సుల వాసలీన్‌లో ఒక డ్రాము కార్బాలిక్ ఆసిడ్‌ను గలిపిన ఆయింట్‌మెంటును ఆసనము చుట్టును రాయుటవలన అచ్చటనుండెడి యీసంబంధమగు దురద నశింపు నందును.

యందును, వెండ్రుకలు ఊడిపోవుట తటస్థించును. మొదటగా అన్ని వెండ్రుకలను విడదీసి దుర్బలమైన పొట్టివెండ్రుకలను ప్రతి తొమ్మిదిదినములకును కత్తిరించుచుండ వలయును. ప్రతిఉదయమున రుపోకచెక్కనీళ్లతో తలను గడిగి, ముతుక గావంచాతో తల వేడియెక్కునట్లును రుద్దవలయును. బ్రష్‌తో తరుచుగ దువ్వుచుండవలయును. ఈ పైప్రకారము ఉపయోగింపకపోయిన యెడల, యీ క్రింది ఔషధయోగముల నుపయోగింపనగును. ఆలివ్ ఆయిల్ రెండుఔన్సులు, పొటాష్ బైకర్బొనేట్ రెండు డ్రాములు, అమ్మోనియా సొల్యూషన్ రెండుడ్రాములు, టించర్ కంతారిడీస్ రెండు డ్రాములు — వీటి నన్నిటిని బాగుగా కలిపి, చన్నీళ్లతో గడిగిన పిమ్మటను, వెండ్రుకలయొక్క కుదుళ్లలోనికి దీనిని బాగుగా రుద్దవలయును. రెండుఔన్సుల యూడికొలోన్ రెండుడ్రాముల టింక్చర్ కంతారిడీస్, పదిమినిముల రోజ్ మెరీనా ఆయిల్ పదిమినిముల లవండర్ ఆయిల్ — వీటినన్నిటిని కలిపియు పైవిధముననే ఉపయోగింపనగును.

## 2. బట్టతల.

శరీరప్రకృతివలన గాని, యితరకారణముల వలన గాని బట్టతల యేర్పడుచుండుట తటస్థించునపుడు, మందులు యెక్కువగ బనిచేయజాలవు. అయినను, వెండ్రుకల యొక్క కుదుళ్లయందు చురుకును బుట్టించి, వెండ్రుకలను మరల మొలిపింపజేయు శక్తి కొన్ని ఔషధములందు గలవు. అట్టివి, క్లోరల్ హైడ్రేట్ గాని, రిసార్సిన్ గాని, కలిసియున్న లోషన్లు అయియున్నవి. ఈలోషన్లను యీ క్రింది ప్రకారముగ జేయవలయును.

(1) క్లోరల్ హైడ్రేట్ రెండుడ్రాములు, రెక్టిఫయిడ్ స్పిరిట్ నాలుగు డ్రాములు గ్లిసరీన్ ఒకటిన్నర డ్రాము, జలము ఆరుఔన్సులు.

(2) చిట్టాముదము ఒకడ్రాము, టింక్చర్ క్విల్లా నాలుగుడ్రాములు, రిసార్సిన్ ఒక డ్రాము, స్పిరిట్ రోజ్ మెరీనా నాలుగుడ్రాములు, జలము ఆరుఔన్సులు.

(3) బీటా నాఫ్తాల్ అయిదు గ్రెయినులు, ఆల్మండ్ ఆయిల్ (బాదంనూనె) ఒక ఔన్సు.

ఈఔషధములను అస్వస్థత భాగములయందు మాత్రమే ఉపయోగించిన జాలును.

---

## వణుకులు.

స్నాయువులయొక్క గాని, స్నాయుబంధముల యొక్క గాని, నరముల యొక్క గాని, ఉద్రిక్తమగు విస్తరింపు నందుటవలన వణుకులు కలుగుచున్నవి. ఈవణుకులు సామాన్యముగ మణికట్లు, మోకాలు మొదలగునట్టి కీళ్లయందు గలుగుచుండును. దీనియొక్క లక్షణములు, ఉద్రిక్తమగు బాధ, తరుచుగ నిస్త్రాణ, వాపుదల, వివర్ణము — అయి యున్నవి. అస్వస్థతభాగమునకు విశ్రాంతి నియ్యక పోయినను, అభాగము బలహీనమైయున్నను, రక్తము పరిశుద్ధముగా లేక పోయినను, మోకాలు గాని మరియొక పెద్దకీలుగాని అస్వస్థత నంది

యున్నపుడు, వాపుదలయును జ్వరమునుకూడ కలుగవచ్చును. వీటిని నిర్లక్ష్యము చేసినయెడల, ఇంకను యెక్కువ దుష్ఫలితము కలుగ వచ్చును.

### చికిత్స.

అన్నిటికంటె ప్రధానమైనది, అస్వస్థతా భాగమునకు పరిపూర్ణమైన విశ్రాంతినిచ్చుట యైయున్నది. బెణుకు ఉద్రుతస్థితిని వహించియుండిన యెడల, అస్వస్థత భాగమునకు కొయ్యబద్దవేసి కట్టవలసియుండును. మణికట్టునకు బెణుకుబట్టిన యెడల, దానిని ఒడిసెలలో మోపవలసియుండును. మడమ అయియున్నయెడల కాలును మంచముపైనగాని బల్లపైనగాని పెట్టి రోగి పరుండిగాని కూర్చుండిగాని యుండవలయును. చల్లని లోషనులను రాయుటకంటె వేడి కాపడములవలన యెక్కువ ఉపశాంతి కలుగగలదు. అయినను, యీవిషయమున రోగి యొక్క మనస్సును కనుగొన వలసి యుండును. పెద్దకీలు అస్వస్థత నందియుండిన యెడల, మలిన రక్తమును దీసివేయుటకు గాను జలగలను పట్టించవలసి యుండును. జ్వరతను దగ్గించుటకు గాను అగుమోతాదులలో సిట్రేట్ ఆఫ్ మెగ్నీసియాను యివ్వనగును. పిమ్మట సోప్ లినిమెంటుతో తోమనగును. కొంత కాలము పిమ్మట, అనగా సుమారు పదునైదు దినముల పిమ్మట, అస్వస్థతాభాగమును మెల్లగా కదుపుటవలనను, సామాన్యముగ పనులను ఉపయోగించుట వలనను, బ్యాండేజియొక్క ఆసరావలనను క్రమముగా నయముకాగలదు. కొద్దిబెణుకులకు వాజలీన్‌తో తోమనగును.

---

### బొబ్బలు.

(బిళ్ల సంకటము)

గజ్జలయందలి గ్రంథులయొక్క వాపుదలస్థితికి బిళ్లసంకటమందురు. ఇది, తరుచుగా సుఖసంబంధ వ్యాధియొక్క ఫలితముగ కలుగును. ఇతర కారణముల వలనను, అనగా పాదముమీదనుగాని, కాలిమీదనుగాని, కురుపు వేయుటవలనను, గుఱ్ఱపుసవారీ చేయుట, మొదలగు పనులయందు ఆభాగములకు ఒత్తిడి కలుగుటవలనను, గజ్జలలో బిళ్లలు కట్టవచ్చును. ఎట్లు కలిగినను, యీ బిళ్లలవలన వేడిపుట్టి, అస్వస్థత భాగము వాపుదలనొంది, పిగులపోట్లుపొడుచుచు, ఆభాగమున నొక్కుటవలన గాని, నడుచుటకు యత్నించుట వలనగాని, బాధ అతిశయము హెచ్చుచుండును. తరుచుగా, బిళ్లలయందు మాలిన్య మేర్పడును; ఒకానొకప్పుడు, యెక్కువ బాధకలిగి వాపునందిన పిమ్మట, దానంతట అదియే అంతరించి పోవును. ఈవ్యాధియందు పరుండి యుండి, అస్వస్థతభాగమునకు కదలిక కలుగనియ్యకుండ నుంచుట, మిగుల ముఖ్యము. అస్వస్థత భాగముపైన చల్లనైన లోషనులో ముంచిన గుడ్డను వేసి, అందు మీద తరుచుగా నీలోషనును పోయుచుండుట వలన, కొంతవరకు మాలిన్య మేర్పడకుండ చేయవచ్చును. పొటాష్ నైట్రేట్ అరఔన్సు హైడ్రోక్లోరేట్ ఆఫ్ అమ్మోనియా అరఔన్సు, సామాన్య లవణము అరఔన్సు, జలము పండ్రెండు ఔన్సులు, వీటినన్నిటిని కలిపినచో, చల్లనయిన లోషను యేర్పడగలదు. ఈలోషనును యెప్పటికప్పుడు చేసికొనవలయును.

ప్రారంభ గతియందు, వాపుదలపయిన ఫ్లెక్సిబిల్ కలోడియంను రాయుటవలన నుపయోగముండగలదు. వాపుదలయును పచ్చిదళయును అధికమయి, బాధ యెక్కువ పోటుతో గూడియుండినయెడల, వేడి కాపడములనుగాచి, వ్రణములకగు చికిత్సను చేయవలయును. ఇట్టి వాటికి కట్టుటయందు 8 అంకె అడ్డముగా నుండురీతిని కట్టు కట్టవలయును.

---

## బొబ్బ రోగము.

### ( బ్యూబానిక్ ప్లేగ్ )

బొబ్బరోగము క్రీస్తుశకమునకు కొన్ని శతాబ్దములు పూర్వమే ఐరోపాఖండమునకు తూర్పుదేశమునుండి గొంపోబడి యుండినటుల వినుచున్నాము. 1664-65 సంవత్సరముల లో యీవ్యాధివలన లండను పట్నమందలి 4,60,000 జనమునందును 70 000 జనులు మడిసియుండిరి. ఇంగ్లాండు దేశమునుండి యీవ్యాధి 1679 వ సంవత్సరమునందు అంతరించిపోయెను. ఐరోపా ఖండమునందు ఆఖరుగా తురుష్కస్థానములో మాత్రము 1841 వ సంవత్సరమునం దీవ్యాధి కనుపడియుండెను. అప్పటి నుండియు ఐరోపాయం దీవ్యాధి కనుపడియుండలేదు. 1899 వ సంవత్సరము వరకును అమెరికా ఖండమునం దీవ్యాధి అగుపడియుండలేదు. ఇటీవల కొంతకాలము వరకును యీవ్యాధి, అరేబియా, పర్షియా, చీనా, ఇండియా దేశములందు మాత్రమే వ్యాపించి యుండెను.

ఈ వ్యాధివలన బొంబాయిపట్నము నందును ఆరాజధానియం దనేక యితర ప్రదేశములందును, యెక్కువజననాశనము కలిగియుండెను. కలకత్తా, పాట్నా, మొదలగు పట్నములందును యీవ్యాధి వ్యాప్తత నందియుండెను. గాని, గంగానదీ ప్రాంతములయం దీవ్యాధికి బొంబాయిరాజధాని యందువలె అనువుయేర్పడి యున్నట్లు కనుపడి యుండలేదు. చెన్నపురి రాజధానియందు, బళ్ళారి, అనంతపురం మొదలగు జిల్లాలయందును, మైసూరు సంస్థానమునందు కొన్ని ప్రదేశములయందును యీవ్యాధి వ్యాపించియున్నది. 1894వ సంవత్సరమునందు చీనాదేశమునందలి హాంకాంగ్ పట్నమునందు గలిగిన యీశవులనందు కైటశాటోయను యెర్సిన్ అనువారివలన నీవ్యాధి యొకవిధమగు పురుగువలన గలుగుచుండెనని కనుగొనబడెను.

ఈవ్యాధియందు మరణములు 100 కి 60 మొదలు 95 వరకును ఉండియున్నవి. వ్యాధియొక్క ప్రారంభమునందును, ఉన్నతదశయందును, మరణము లెక్కువగా నుండును.

### లక్షణములు.

ఈవ్యాధి సంబంధమగు పురుగు శరీరమునందు ప్రవేశించిన రెండు మొదలు యెనిమిది దినములలోపల, వ్యాధి వక్కాణనకు వచ్చును. అతినిస్త్రాణ, అధిక తలనొప్పి, మత్తు, తలత్రిప్పుట, వాంతియగుట, జ్వరము — ఈ లక్షణములతో వ్యాధి ప్రారంభ మగును.

ముఖమైఖరి శవాకారముగ నుండును. కండ్లు లోతునకుబోయి యుండును, రోగి నడచుటకు యత్నించినయెడల తూలిపడును. శరీరశీతము 103 లేక 104 డిగ్రీలకు హెచ్చి, ముఖము ఉబ్బుదలనంది, నేత్రములు యెర్రనయి, చెవుడు యేర్పడును. నాలుక వాపుదలనంది, ప్రారంభమైన త్వరలో నారుపలగలిగి నోరువెంబడి మాలిన్య మేర్పడి, దాహము అతిశయమయి రోగియొక్క కుంగుదలస్థితి సంపూర్ణమగును. సంధిగుణము త్వరలో జనించును. కారిజమును ప్లీహయును వాపుదలనందును. మూత్రము హీనమగును. ధాతునష్టము ఒకప్పుడు కలిగినను కలుగవచ్చు. మొదట నిండుగా నుండునట్టియు ఉబుకుచుండునట్టియు నాడి నీరసతనంది దడదడ కొట్టుకొనుచుండును. ఈస్థితియందు, నిస్త్రాణ వలనగాని, మూర్ఛ వలనగాని, త్వరిత గతిలో క్షీణదశనంది, రోగి మరణము నందవచ్చును. రోగి సజీవుడై యుండినయెడల విశేషగతులలో రెండవ దినమునకు అయిదవదినమునకు మధ్యనున్నా కొద్ది విషయములలో యెనిమిదవ దినమునగాని లేక తొమ్మిదవ దినమునగాని యున్నా, బిళ్లలు (గడ్డలు) బయలుదేరును, ఈబిళ్లలు 100 కి 70 విషయములలో గజ్జలలోనున్నా 20 విషయములలో చంకలలోనున్నా 10 విషయములలో దవుడల క్రిందనున్నా గలుగు చుండును. అప్పుడప్పుడు ఆరంభమునుండియు యీబిళ్ళలు ఉండి యుండవచ్చును. ఈబిళ్లలు పరిమాణమునందు అనేకవిధములుగ నుండవచ్చును. అనుకూల విషయములలో బిళ్ళగనపడగానే మిక్కుటమగు చెమట ప్రారంభమయి, శీఘ్రగతితో జ్వరము తగ్గిపోయి, తక్కిన లక్షణములును తేటపడును. బిళ్ళ ప్రమాణము వృద్ధినందుచు, తుదకు మెత్తబడి, పగిలి, చీమును, దుర్వాసనతో గూడిన యితర మలినములును, వెలువడును. కొన్ని విషయములలో చీము పట్టుట కొన్ని వారములకు నిలుపుదలకా బడవచ్చును. లేక చీముపట్టకుండగనే బిళ్ళ కరిగిపోవచ్చును. స్వస్థావస్థ సామాన్యముగ నారు పది దినములకు మధ్యగా నేర్పడును.

గర్భిణులగు స్త్రీలలో పిండమునందు గూడ వ్యాధిసూచనలు కనుపడుచు, గర్భస్రావము సామాన్యముగ గలుగుచుండును. కొన్ని విషయములయందు న్యూమోనియా, రక్తముగ్రక్కుకొనుట, యితర విధములగు రక్తస్రావములు — వీటితో గూడి యుండును. ఈవ్యాధియందు మరణము సాధారణముగ మూడు అయిదు దినములకుమధ్యగా దటస్థించును. ఈవ్యాధియందలి కొన్ని ఉద్రిత విషయములయందు మరణము యిరువది నాలుగు గంటల లోపుగను ఒకప్పుడు పండ్రెండు గంటల లోపుగను, దటస్థించుచుండును.

చికిత్స.

ఎక్కువ జాగ్రత్తతో రోగికి సంరక్షణ చేయుటయు, ఆహారము నిచ్చుటయు, చురుకుబుట్టించు పదార్థముల నిచ్చుటయు — యీవ్యాధియొక్క చికిత్సయందలి ప్రధానాంశములయి యున్నవి. ఆరంభమునందు మలబాధ యుండినయెడల వాంతిని నిలుపుచేయుట యందు క్యాలొమెల్ (రసభస్మము) యొక్క నిండుమోతాదు మిగులయుపయోగముగ నుండినట్లు తెలియుచున్నది. ఆయాసము, సంధిగుణము, నిద్రరామి — యీగుణములకు వ్యాధియొక్క ఆరంభగతియందు మార్ఫిన్ను హైపోడెర్మిక్ పిచికారితో యింజక్టుచేయుట బహు ఉపయోగమని లోసన్ అనునాయన చెప్పుచున్నాడు; కాని, దీనిని యితరస్థితిగతుల గమనించి మరియు పరిశీలించవలయును. గుండెకాయ దుర్బలత నందియుండిన యెడల బ్రాండీ,

## మద్యపాన సంధి.

త్రాగుబోతులయం దొక విధమగు సంధిగుణము జనించును. మత్తుపదార్థము లధికముగా త్రాగుటవలనను, ఒకప్పుడు ఒక సారిమాత్రమే త్రాగినను యెక్కువగా త్రాగుటవలనను, ఈవ్యాధి జనించుచున్నది. త్రాగుబోతులకు యేదయిన దెబ్బ తగిలినప్పుడుగాని, యేదయిన వ్యాధి సంభవించినప్పుడుగాని, ఈ అస్వస్థత కలుగుచున్నది. ఇట్టి వారలందరి యీ అస్వస్థత మెదడునకు వ్యాపించుచున్నది. ఈ సంబంధమగు సంధిగుణమందు తలనొప్పి యుండదు. ఇతరవిధమైన దైనచో తలనొప్పి యుండును. అననుకూలగతులలో సంధిగుణము వెంబడి స్మృతితప్పిపోయి చేతులును కాళ్ళును యీడ్చుకొని, మలము వెలువడుటయందు స్వాధీనము తప్పి, మూర్ఛలుంకలిగి, రోగి మరణమునందును.

## చికిత్స.

రోగికి నిద్రను గలిగించుట మిగుల ముఖ్యమయి యున్నది. ఇందులకు 30 గ్రయినుల పొటాసియం బ్రోమైడునున్ను 10 గ్రయినుల క్లోరల్ హైడ్రేట్ నున్ను గలిపి, రోగికి నిద్రించునంతవరకును, నాలుగుగంటల కొకపర్యాయము యియ్యవలయును. అజీర్ణలక్షణ ముంచినయెడల ఆరంభమునందే 4 వ ఔషధయోగమును విరేచనకారిగ నియ్యవలయును. తేలికయిన ఆహారము నిచ్చుచుండవలయును. ఆహారము జీర్ణత నందుచుండిన యెడల ప్రాణభయములేదు. ఆహారమునకు తోడుగా కొంచెము బ్రాందీ నిచ్చుచుండవలయును. బ్రాందీని పూర్ణముగా నిలిపివేయగూడదు.

— —

## మద్యపానస్థితి (దీర్ఘవ్యాపకమగు.)

మత్తుపదార్థములను త్రాగుట మిక్కుటముగ అలవాటయిన వారలందు ఒకప్పుడు యొకవిధమగు స్థితి సంభవించును. ఈ స్థితియందు—అయాసము, నిద్రలేమి, స్థిరబుద్ధిలేక పోవుట, మనశ్శక్తి నశించుట, యీలక్షణములు కనబడవు. నేత్రములు యెర్రనై నీర్సు కారును. చేతులు వణకుట ఆరంభించును. జీర్ణాస్వస్థతకూడ యేర్పడ, ఆహారమునందసహ్యము పుట్టి కడుపుబ్బుట కలుగును. నాలుకపై పొరగప్పి నోటియందు దుర్వాసనపుట్టి విరేచనబద్ధ మేర్పడును. ఈత్రాగుట అలవాటును దప్పించనియెడల, కాలిజము యొక్కగాని, జీర్ణాశయముయొక్కగాని అస్వస్థత యేర్పడును. త్రాగుటను నిలిపివేయుటవలన నీవ్యాధిని మాన్పవచ్చునుగాని, త్రాగవలెనను అభిలాష ఉండుటవలన, వీరు యెట్టి వాగ్దత్తము లెన్ని చెసినను త్రాగుటను మానరు. ద్రవపదార్థముల నాహారముగ నియ్యవలయును. చికిత్సయందలి ముఖ్యాంశము త్రాగుటను నిలుపుచేయుటయును, మంచి ఆహారము నిచ్చుటయును, అయియున్నవి. సంపూర్ణమయిన విశ్రాంతియు అవసరమయి యున్నది. ఉదయమున సరిగాడి కడుపు త్రిప్పునను సోడావాటరును పాలను సమానభాగములుగ గలిపి పుచ్చుకొనవలయును. ఒకచుక్క వైనం ఇపికాక్ ను నీళ్ళతోగలిపి ప్రతిరెండు గంటలకును యిచ్చుచుండ

వలయును. త్రాగుటయందుండెడి అభిలాషను మాన్పుటకు టింక్చర్ కాప్సికంను గాని టింక్చర్ జింజరును గాని 30 మినిముల మోతాదులలో ప్రతిమూడు గంటలకును యియ్యవలయును. ఈ క్రింది ఔషధయోగము నన్ని విషయములందును వాడవచ్చును.

పొటాసియం బ్రోమైడ్ ఒకడ్రాము, టింక్చర్ కాప్సికం ఒకటిన్నర డ్రాము, స్పిరిటు ఆమ్మోనియా ఆరోమేటిక్ ఆరుడ్రాములు, జలము ఆరుఔన్సులు, వీటినన్నిటిని గలిపి దినమునకు మూడుపర్యాయములు ఒక ఔన్సుమోతాదు చొప్పున పుచ్చుకొనవలయును.

---

## మలబంధము.

మలబంధము అనేకులకు స్వాభావిక మయియుండి, ముఖ్యముగా బహుచు స్త్రీలయందు గలుగుచుండును. ఇది అనేక కారణములవలన గలుగవచ్చును. గాని ఇందు ముఖ్యమయినవి కారిజాస్వస్థతయు, చిన్నప్రేగులయొక్క గాని పెద్దప్రేగులయొక్క గాని పని లోపమును అయియున్నవి.

ప్రతిదినమును అధమపక్షము ఒక్కమారైనను విరేచనము కావలయును. ఇందులకు భేదించినయెడల అసౌఖ్యముగ నుండును. ఇట్టివారలు తగు శరీర సాధకమును పుచ్చుకొనుచు ఫలములను మాత్రమే ఆహారముగ గైకొనినయెడల, స్వస్థత కలుగగలదు.

కారిజాస్వస్థత వలన మలబంధ మేర్పడినయెడల, కారిజవ్యాధుల క్రింద చికిత్సను జేయవలయును.

చిన్నప్రేగులయొక్క అస్వస్థత వలన మలబంధ మేర్పడిన యెడల, విరేచన ప్రమాణము మితమై మిగుల పొడిగానుండి వర్ణమునందు సాధారణముగ తేలికయైనదిగ నుండును. కారిజమునందు మాంద్యతగూడ బహుశః కలసియుండును. తలకు వెనుకవైపున బరువు, నొప్పి యేర్పడి, నాలుకయొక్క కొనయందును అంచులయందును యెర్రగానుండును. నోరు జిగట పారుచుండును. ఉత్సాహము తగ్గిపోయి, ఆకలిమందగించి, కడుపునందు ఉబ్బరమేర్పడి, అప్పుడప్పుడు శూలనొప్పి కలుగుచుండును. అనారోగ్యమగు మన్యప్రదేశములందు యీ విధమగు మలబంధము సాధారణముగ గల్గుచుండును. ఇట్టివిషయములలో విరేచనకారు లవసరము లేదు. చిన్నప్రేగులయందు యెక్కువ ద్రవపదార్థముయొక్క అవసరము మాత్రమే సూచింపబడుచున్నది. నిద్రలేవగానే యేడెనిమిది ఔన్సుల చన్నీళ్ళు గాని వేడినీళ్ళు గాని త్రాగవలయును. ఇది ఉపయోగించని యెడల, 2 డ్రాముల సోడా సల్ఫేటును 2 గ్రెయినుల క్వినీన్ను, ఒక పైంటు జలములో గలిపి ఉదయముననే పుచ్చుకొనవలయును.

పెద్దప్రేగులు అస్వస్థతయందుండినయెడల, నాలుకపై పొరగమ్మి, ఊపిరిగాలి దుర్వాసనతో గూడి, ముఖము పసుపువర్ణమును వహించి, ఒకప్పుడు పచ్చకామాల ప్రవేశించవచ్చును. అప్పుడప్పుడు శూలనొప్పి కలిగి, విరేచనము నల్లబారి విరేచనముయొక్క మొదటి భాగము మిగుల గట్టిగానుండి, పిమ్మట మృదువుగను లేక ద్రవముగను ఉండవచ్చును.

ఆసనమునకు సమీపమున, నల్లని ఉండలుగా బిడచగట్టి నిలువయుండిన మలపదార్థము వలన కలుగు మలబంధము యిట్టిదై యున్నది. ఈ విధమగు మలబంధమునకు చిట్లాముదముగాని, సల్ఫేట్ ఆఫ్ సోడాను గలిగియున్న 5 వ ఔషధయోగమును గాని, ఉపయోగముగ నుండును. పిత్తద్రవము లేకపోవుటవలన గలిగిన అస్వస్థత అయినయెడల, ఒక గ్రెయిను పల్వీస్ ఇపికాక్‌ను ఉదయమున నుపయోగింపనగును. విరేచనకారుల దరుచుగా నిచ్చుటకంటె అప్పుడప్పుడు యెనీమాను ఉపయోగించుట శ్రేష్ఠమయి యున్నది. పెద్దప్రేగులకు యెక్కువ పనిని గలుగజేయకుండ, ఆహారముయొక్క జీర్ణత యెక్కువగా నగుటవలన గానియ్య వలయును. ఆహారమునందు మార్పు అవసరమయిన యెడల మార్చవలయును. ఔషధములు అవసరమైనయెడల, వెంటనే తగు ఔషధముల నుపయోగింప వలయును. బలమైనట్టియు, సామాన్యముగ నారోగ్యమునందుండు నట్టియు, వారలకు, యక్స్ట్రాక్టు కాలోసింత్ కో 5 గ్రెయినులును, పల్వ్ హైడ్రార్జరై 5 గ్రెయినులును. గలిపి రెండు మాత్రలుగా జేసి, అప్పుడప్పుడు ఒకమాత్రను ఉపయోగింప వలయును. మూలశంక యుండినయెడల 8 వ విరేచనకారిని వాడవలయును. ఈ స్థితియందు యక్స్ట్రాక్టు ఆఫ్ కాస్కారా సాగ్రిడా లిక్విడ్ 30 మినిముల మోతాదులలో కూడ నుపయోగింపనగును. ప్రాముఖ్యమగు కారణమేమియు గనబడకుండ, ముఖ్యముగా స్త్రీలయందు గలుగు మలబంధమునకు, యక్స్ట్రాక్టు ఆఫ్ అలోజ్ అరద్రాము, యక్స్ట్రాక్టు ఆఫ్ నక్సువామికా ఆరు గ్రెయినులు యక్స్ట్రాక్టు ఆఫ్ హాయొసామస్ యిరువది గ్రెయినులు, పల్వీస్ ఇపికాక్ ఒక గ్రెయిను — వీటినన్నిటిని గలిపి 20 మాత్రలుగాజేసి, ప్రతిరాత్రియును ఒకమాత్రను సేవించ వలయును.

---

## మశూచి.

మశూచియొక్క పుట్టుకకాలము తెలియరాకున్నది. దీనియొక్క జన్మస్థానము చీనా, ఇండియా, మధ్య ఆఫ్రికా, ప్రదేశములై యున్నట్లు తెలియుచున్నది. క్రీస్తుశకము 570వ సంవత్సరమున, ఫ్రాన్సు, స్విట్జర్లండు, ఇటలీదేశములం దుండి యున్నట్లు, చరిత్రవలన తెలియుచున్నది. ఇంగ్లాండుదేశమునం దీవ్యాధి 900 సం॥ ప్రాంతముల కనుపడియున్నట్లు వినుచున్నాము. క్రీస్తుశకము యెనిమిది పదునైదవ శతాబ్దములకు మధ్యకాలములో, ప్రపంచమునం దీవ్యాధివలన కోట్లకొలది జనులుచచ్చుచుండిరి. జెన్నరువలన గనుగొనబడిన టీకాలు వేయుట వాడుకలోనికి వచ్చిన పిమ్మట, యీవ్యాధి చాలవరకు అంతరించిపోయెను. 1890వ సంవత్సరమునం దింగ్లాండులో నీవ్యాధివలన నింతకు డెబ్బదిరెట్లు జనము చనిపోవుచుండెడివారు.

టీకాలు వేయబడని, 5 సంవత్సరములలోపు వయసుబిడ్డలయందును, 30 సంవత్సరములపై వయసుగల పెద్దవారలయందును, యీవ్యాధి ఉద్రితస్థితిని వహించి యుండును. ప్రక్కలు కలిసిపోవునస్థితియందు 100 కి 50 మంది మరణము నందుదురు. అత్యుద్రితావస్థయందు అందరును మడియుదురు. టీకాలు వేయబడని వారియందు 100 కి 50 మరణములును, టీకాలు బాగుగా వేయబడని వారియందు 100 కి 26 మరణములును, టీకాలు బాగుగా వేయబడినవారియందు 100 కి 2 మరణములు మాత్రమును, గలుగుచుండుటవలన, టీకాలు వేయుటవలన ఉపయోగమును గూర్చి వేరుగ విశేషించి చెప్పనక్కరలేదు.

అంటు సంబంధమైనట్టియు, పొక్కులు లేచునట్టియు, జీవితమునందు సామాన్యముగ నొకపర్యాయము మాత్రమే గలుగునట్టియు జ్వరము — మశూచి అనబడుచున్నది. ప్రారంభ లక్షణములు కనుపడినది మొదలు పదివారములవరకును యీవ్యాధి యందలి అస్వస్థత ఉండి యున్నను, మాలిన్యమేర్పడుట ఆరంభించినది. మొదలు చర్మమునుండి పక్కులు పరిపూర్ణముగ వదలిపోవువరకును, యీ వ్యాధి విశేషమంటు గుణమును వహించియుండును. ముఖ్యముగా గుడ్డలమూలమునను, యితరవస్తువుల మూలమునను, యీవ్యాధి వ్యాప్తినందును. ఈ వ్యాధిసంబంధమగు పురుగు శరీరమునం దావహించినది మొదలు సామాన్యముగ పండ్రెండు దినములలో పక్వమునకువచ్చును. వణకుట, మధ్యమధ్య వేడికలుగుట, మత్తు, వాంతివచ్చు నట్లుండుట, తరుచుగ వాంతికలుగుట, తలనొప్పి, వెన్నునడుము పైపులనొప్పి, అప్పుడప్పుడు పచ్చిగొంతు—యీ లక్షణములు ఆరంభమునందు గన్పట్టును. పిమ్మట, జ్వరము ప్రారంభమయి, నాడి చురుకుబారి, చర్మము వేడియొక్క శరీర వేడిమి బహుశః 104 లేక 105 డిగ్రీల వరకు హెచ్చును. రెండు, లేక, బహుశః మూడుదినములపిమ్మట, యెత్తయినఎఱ్ఱని చుక్కలు ముఖముపైనయును నుదురుపైనయును గనబడును. ఈ స్థితియందు గొంచెము కాలమువరకు జ్వరము 101 మొదలు 102 డిగ్రీలవరకు తగ్గిపోవును. పొక్కులు లేచుకాలము అధికమయిన కొలదియును, వ్యాధియొక్క ఉధృతి తగ్గిపోవును. మూడు నాలుగు దినములందు పొక్కులు శరీరమునకు గూడ వ్యాపించును. అయిదవ దినమున ప్రతి పొక్కుయును నీరుపట్టి, అడుగు భాగమునందు గుండ్రనై, మధ్య భాగమునందు సొట్టపడి, చుట్టు భాగములు యెఱ్ఱనై యుండును. మధ్యభాగమునందలి సొట్ట యీ వ్యాధియొక్క సూచనలక్షణమై ఆటలమ్మకును యీ వ్యాధికిని భేదించుటకు యిదియే గుర్తుయై యున్నది. తరువాత మూడు దినములలో పొక్కులయందలి మాలిన్యమేర్పడి, అవి మిగుల యెత్తుగ నుండును. మాలిన్యమేర్పడిన పిమ్మట, మశూచి యందలి వాసన స్పష్టముగ గనబడుచుండును. వ్యాధి ఉధృత గతిని వహించి యుండినయెడల, ముఖము వాపుదలనంది, వాపుదల వలన నేత్రములు మూసికొనిపోవును. పదవ దిన ప్రాంతముల, మొదలుగా ముఖముపైనవియును, పిమ్మట కాళ్ళుచేతుల పైనవియును, పొక్కులు యెండుట ఆరంభించి, పదునాలుగవ దినప్రాంతములకు పక్కులు కట్టును. ఇరువది ఇరువదిమూడవ దినములకు మధ్యగా ఈ పక్కులు ఊడిపోయి, ఒడలంతయు యెరుపు గోధుమ గలిసిన వర్ణమును గలిగియుండును. ఈపొక్కులు మానుదల నందినపిమ్మట, తరుచుగా మచ్చలుగాని గుంటలుగాని యేర్పడియుండును. పొక్కులు వృద్ధినందుచున్నప్పుడు, సామాన్యముగ రెండుమూడు దినములవఱకు జ్వరము మిగుల యెక్కువయి, మరల 104 లేక 105 డిగ్రీలకు హెచ్చును. మశూచియందు రెండవమారు గలుగు యీజ్వరము సామాన్యముగ పదునొకండవ దినప్రాంతముల గలుగుచు. ఉధృతగతులయందు, శోషణమువలన ప్రాణాపాయము కలుగు సమయమిదియే అయియున్నది. నాలుకపై పొరగమ్మి, గొడుగునను తెల్లగానుండి, ఒకప్పుడు వాపుదల నందియుండును. పెద్దవారలందు పొడుగునను సామాన్యముగ మలబంధ మేర్పడి యుండును. బిడ్డలయం దారంభమున తరుచుగ అతివిరేచనము లుండియుండును.

అత్యుద్రిక్తగతియందు పొక్కులు మిగుల దళముగానుండి, దాదాపుగాగాని పూర్ణముగాగాని కలిసిపోవును. అట్టి విషయములలో జ్వరము అతిశయస్థితి యందుండి సంధిజనించి స్మృతితప్పిపోయి, రోగి మరణము నందవచ్చును. ఉద్రుత విషయములలో, నాసికారంధ్రములయందును, నేత్రములలోను, నాలుక పైనయును, నోటి యందును, గొంతుక యందును, పొక్కులేర్పడి, నోటినుండి విశేషద్రవము వెలువడుచు, హస్తములును పాదములును మిగుల వాపుదల నందును. బిడ్డలకు పండ్లు వచ్చుచుండిన యెడల, పొక్కులు కలుగుట కారంభమున మూర్ఛలు కలుగవచ్చును. ఈవ్యాధియొక్క తదనంతరము, నేత్రములయందుగాని, కర్ణములయందుగాని, కీళ్లయందుగాని, అస్వస్థతలు తరుచుగ నేర్పడుట గలదు.

చికిత్స.

రోగిని సాధ్యమయినంతవరకు విడిగానుంచి, వీలైనచో ప్రత్యేకగృహమునం దుంచవలయును. గదిలోనికి పరిశుభ్రమగు గాలి, వచ్చుచుండవలయును గాని, అతిచల్లగామాత్ర ముండగూడదు. 1 కి 40 పాళ్ళు నీళ్లు కలిసిన కార్బాలిక్ లోషన్‌ను పరిచారకుల యొక్క చేతులు కడుగుకొనుటకును, రోగి సంబంధమగు గుడ్డలను, యితరవస్తువులను, కడుగుటకును విరివిగ నుపయోగింప వలయును. రోగి యొక్క ఊపిరి గాలిని పీలువకుండ పరిచారకులు జాగ్రత్తగ నుండవలయును. విరేచనము సాధువుగ నగుచుండునటుల ఔషధముల నియ్యవలయును. కాళ్ళను చేతులను ఉడుకునీళ్ళతో ప్రతిదినమును స్పంజి చేయవలయును. నేత్రములను ప్రతిదినమును అనేకమారులు వేడిపాలతోడను, వేడినీళ్ళతోడను, కడుగుటను అద్దుటను జేయవలయును. నేత్రములు అస్వస్థత నందియుండినయెడల, వేడి పటిక సొల్యూషన్‌తో నేత్రములను దడుపవలయును. ప్రతి తడుపుట పిమ్మటయును వాసలీన్‌ను కనురెప్పల యంచులకు రాయవలయును. ఆహారముగా, పాలు, జావ, మొదలగు ద్రవపదార్థముల నియ్యవలయును. నాడి నీరసత వహించి బలము తప్పిపోయి నపుడు, బ్రాందీ మొదలగు జొరుకుపుట్టించు ఔషధముల వాడవలయును. పక్కులు యెండిపోవు సమయమున బట్టలను దరుచుగా మార్చుచు, రోగి అతి బలహీనతచేయుం దుండకపోయిన యెడల, అను దినమును వేడినీళ్లతో స్నానము జేయింపవచ్చును. స్వస్థావస్థయందు క్వినీన్ ఉపయోగముగ నుండును.

ఈవ్యాధియందు గుంటలును మచ్చలును పడకుండ ననేక పరిశోధనలు చేయబడెను. స్రావమును మెల్లగ స్పంజితో దుడిచివేయుచు, ఒడలును సాధ్యమయినంతవరకు పరిశుభ్రముగా నుంచవలయును. వరిపిండిని, ముఖముపైనయును శరీరమంతటను విరివిగ జల్లుటవలన దురదకు ఉపశాంతిని గలుగజేయ వచ్చును. ఒకభాగము కార్బాలిక్ ఆసిడ్‌యును పదిభాగములు ఆలివ్ ఆయిల్‌యును గలిపి, శరీరమునందలి సగము భాగమున కొకదినము చొప్పున రాయవలయును. కార్బాలిక్ ఆసిడ్, దుర్వాసననుదగ్గించి, చీముపట్టుటయందలి ఉద్రిక్తను సాధుపరచును. పొక్కులు చిదికినపుడు కలుగు దురదను అణచివేయుటకుగాను వయొలెట్ పవుడరును గాని జింక్ ఆక్సైడ్‌ను గాని, యీరెంటిని గలిపినదానిని గాని, చల్లవలయును. రోగి గోకకుండునట్లు చేయవలయును. బిడ్డలయినచో చేతులకు గుడ్డలను గట్టవలయును.

---

## ఆటాలమ్మ.

ఈవ్యాధికి చిన్నమ్మవారనియు, అట్లమ్మవారనియు, నూకలమ్మ అనియు, వివిధములగు పేర్లుకలవు. ఇది పొక్కులతో గూడిన అంటు సంబంధమగు జ్వరముయి యున్నది. సామాన్యముగ బిడ్డలయందు గలుగుచుండును. మశూచియందలి కొద్దిపాటుగా నిది కొందరిచే భావింపబడుచున్నది. ఈవ్యాధి సంబంధమగు పురుగు శరీరమునందు ప్రవేశించిన పిమ్మట పది పదునారు దినములకు మధ్యగా పక్వమునందును. ఇరువదినాలుగు గంటల కాలములో కొంచెము జ్వరము కలిగి మొదటగా వీపుమీదను, పిమ్మట ముఖము శరీరము యొక్క యితర భాగములమీదను, యెర్రని పొక్కులు లేచి కొంచెము దురదతో గూడి యుండును. ఈపొక్కులు ఒకతెరగానే రావచ్చును. లేక మూడు నాలుగు దినములవరకు అనుసరణముగ క్రొత్త పొక్కులు కలుగుచు, జ్వరముకూడ నధికమగుచు, పొక్కులు కనుపడిన పిమ్మట జ్వరముతగ్గిపోవును. మూడవదినమున పొక్కులయందు ద్రవమేర్పడును. నాలుగవదినమున పొక్కులు పగిలిపోయి పక్కులు కట్టి, యీ పక్కులు ఆరవదినమున ఊడిపోవును. మశూచియందలి పొక్కులవలె, యీ పొక్కులయందు చీము ఉండదు. సిట్రేట్ ఆఫ్ మెగ్నీసియాను విరేచనకారిగ నుపయోగించి ఒక్క గదిలోనే ఉండుటకంటె వేరు చికిత్స అవసరములేదు. పొక్కులు ఆరంభమయిన మూడువారముల పిమ్మట నీ వ్యాధియొక్క అంటుగుణము ఉండనేరదు. ఇండియా దేశమునందు, యీ వ్యాధి చలికాలములో వ్యాపించియుండును.

---

## మూత్రసంబంధమగు వ్యాధి (యురేమియా).

మూత్రగ్రంధులనుండి మూత్రము స్రవించుటయందుగాని, మూత్రాశయము నుండి మూత్రము వెలివడుటయందుగాని, ఏదైన ఆటంకము కలిగినయెడల, మూత్రసంబంధమగు పదార్థములు రక్తమునందు గలియుటవలన, గలిగెడి వ్యాధికి యురేమియా యందురు. మూత్రగ్రంధులయొక్క క్షీణదశయందు గలుగు ధాతునష్టము యొక్కయు, అతిమూత్రము యొక్కయు, అనంతర గతులయందు యీ స్థితి సంభవించును. రక్తప్రచారమునందు మూత్రమునందలి విషపదార్థములు మెదడునకు వ్యాపించుటవలన అంగవిక్షేపరోగము (పుట 107) యేర్పడును. మూత్రము పరిశోధించుటకును, చెమట పట్టుటకును, తగు పనులను చేయవలయును. నడుముపయిన వేడి కాపడములను గాచవలయును. రోగి మింగగలిగినయెడల వయోజన చీటిలో 1 వ ఔషధయోగమును ఉపయోగించవలయును. విరేచన సాధకములను గూడ జేయవలయును.

---

## మూర్ఛ.

అజీర్ణత, కోపగుణము లేక ఉద్రేకత, తలనొప్పి, మలబంధము—యీ లక్షణములు ముందుగా గనపడవచ్చును. తలత్రిప్పుట, వాంతివచ్చునట్లుండుట, చెవిలో ధ్వనులు, చేతి యందుగాని పాదమునందుగాని లాగుట ప్రారంభించి, పైకి యెక్కుచున్నట్లుండుట—యీ

లక్షణములును పిమ్మట కనబడవచ్చును. ఈ విధమగు లక్షణముల పిమ్మట రోగి స్మృతి తప్పి పోయి, శరీరబలము నశించి, నిల్చియున్నయెడల క్రిందపడును. మూర్ఛకలుగుటకు ముందుగా తరుచుగ పెద్దకేక వెయ్యవచ్చును. కాళ్ళును, చేతులును, ఉదరమును, కొట్టుకొనుచు ముఖముయొక్కయు నేత్రములయొక్కయు స్నాయువులయందు యీడ్పుకలుగుచు, ముఖము వికారముగ నుండును. కనుబొమలు ముడివేయబడి కనుపాపలు స్థిరతనందిగాని, కనుపాపలు కనురెప్పల క్రిందికి బోవుటవలన కండ్లలోని తెలుపులు మాత్రమే గనబడుచుగాని, యుండును. కనుగుడ్లు గుండ్రముగా దిరుగుచు, కనుపాపలు విస్తరింపునందుట వలన దృష్టిశక్తి తప్పిపోవుచుండును. కాని, తెరయొక్క అంతిమగతియందు యీస్థితి క్రమతనందును. ముఖము మొదటగా పాలిపోయి తరువాత యెఱ్ఱనగును. ఒడలు చల్లగాను, జిగటగాను యుండును. హస్తములు పట్టుపట్టి బొటనవ్రేళ్ళు కొట్టుకొనును. పండ్లు బిగిసికొనిపోయి, నాలుక కరచుకొనుటవలన రక్తముతోగూడి, నోటినుండి నురుగు వెడలును. మూర్ఛలో ఒకటి మొదలు రెండు, అయిదు, పది, నిమిషములవరకు ఒకప్పుడు కొన్ని గంటలవరకును, రోగి కదలకుండ స్మృతి తప్పియుండును. ఒకప్పుడు యీ స్థితినుండి గాఢనిద్రలోనికి మరల వచ్చును. ఇట్టిస్థితి ప్రతిదినమును గాని, ఒకప్పుడు కొన్ని నెలలకును కొన్నిసంవత్సరములకును, మరల రావచ్చును.

కారణములు.

ఈ వ్యాధి వంశపారంపర్యముగ రావచ్చును. పేగులయందుండెడి పురుగుచే గలిగెడి రేగుదలవలనను, అధిక శరీర సంబంధమైనట్టిగాని మనస్సంబంధమైనట్టిగాని ఉద్రేకతవలనను, బిడ్డలకు పండ్లువచ్చునపుడును, మెదడుయొక్క వ్యాధివలనను యీ అస్వస్థత కలుగవచ్చును. మూర్ఛలకు లోనైనవారియందు నిరసత్వము, దుష్ప్రవర్తనము, భయము, కోపము, పురుగులు, రక్తవృద్ధి, అజీర్ణత, స్త్రీలయందు ఋతుస్రావ సంబంధమగు నిలుపుదల—యీ కారణము లన్నియు ఉద్యుక్తతను బుట్టించును.

చికిత్స.

మూర్ఛకలుగు లక్షణములు కనుపడగనే జీర్ణాశయము నిండుగ నుండినయెడల మస్టర్డు వాంతికారి నిచ్చుటవలన మూర్ఛ నిలిచిపోవచ్చును. జీర్ణాశయము నిండుస్థితి యందుండినను చన్నీళ్ళను దాహముగా నియ్యవలయును. మూర్ఛయందు రోగిని వీపుపయి బరుండబెట్టి, శిరమును కొద్దిగా నెత్తియుంచవలయును. పరిశుభ్రమగు గాలి వచ్చునట్లు జేయుచు, ముఖముపయిన విసరుచు చన్నీళ్ళతో ముఖమును దడుపుచుండవలయును. ఈ చన్నీళ్ళచే గలుగునంత మేలు యిక దేనివలనను గలుగనేరదు. మెడవైపులగాని, యెదురొమ్ము వైపులగాని, మరియెచ్చటగాని, బిగువయిన గుడ్డలు ఉండియుండినయెడల, వీటినన్నిటిని వదులు చేయవలెను. చేతులతో రోగి తనకు అపాయమును గలుగ జేసికొనకుండునట్లు చేతులను గట్టిగ బట్టుకొని, ఎదురొమ్ము పయిన ఒత్తిడి కలుగకుండ చేయవలయును. తెరసమయముల రోగి నాలుక కరచుకొనకుండునటులు చెంచాకాడను పండ్లసందున బెట్టవలయును అప్పుడు త్రాగుటకేమియు నియ్యగూడదు. తెరపిమ్మట రోగిని నిద్రపోనియ్యవలయును. నిద్ర

రాకపోయినయెడల, వేడిపాలలోగాని, నీడిగాగాని, ఒకడ్రాము పొటాసియం బ్రోమైడును యియ్యవలయును. మత్తుపదార్థముల నెన్నడును నియ్యరాదు.

మూర్ఛలను మధ్యకాలమునందు, మలబద్ధము, పురుగులు, ఉండియుండిన యెడల, చికిత్స చేయవలసియుండును. ఋతుస్రావ సంబంధమగు అస్వస్థత యుండి యుండినయెడల అందులకగు చికిత్సను జేయవలయును. 1 వ అల్సరేటివునందలి పొటాసియం బ్రోమైడును అను దినమును దీసికొనవలయును. రోగి బలహీనముగ నుండినయెడల బలవర్ధక ఔషధముల నియ్యవలయును. విరేచనము క్రమముగా నగుచుండునట్లుల జాగ్రతను బుచ్చుకొనవలయును. శాక పదార్థముల నెక్కువగ బుచ్చుకొనవలయును. మాంసపదార్థములను త్యజించుట మంచిది. ఈ క్రింది ఔషధయోగమువలన గుణము కనుపడువఱకును, మూర్ఛలకు మధ్యకాలమున వాడవలెను. ఒకడ్రాము పొటాసియం అయొడైడ్, ఒకడ్రాము పొటాసియంబ్రోమైడు, అరడ్రాము అమ్మోనియం బ్రోమైడ్, నలుబది గ్రెయినుల అమోనియా కార్బొనేస్, ఎనిమిది ఔన్సుల జలము — వీటినన్నిటిని గలిపి, భోజన పూర్వము అరఔన్సు చొప్పునను, నిద్రపోవుముందర ఒకఔన్సు చొప్పునను, అనుదినమును బుచ్చుకొనుచుండవలయును.



## మెదడు మృదువగుట.

మెదడు పదార్థమునకు వలయు పోషణము క్రమముగా జరుగక పోవుటవలనగాని మెదడునకు రక్తమును గొంపోవు రక్తనాళములయొక్క అస్వస్థతవలనగాని, మెదడు మృదువగుట యేర్పడవచ్చును. మత్తుపదార్థముల నెక్కువగా త్రాగుటవలనను యీ స్థితి యేర్పడవచ్చును. అతి మనోవిచారము, అధికచింతన శోక విద్యాభ్యాసము వలనను, యీవ్యాధి కలుగవచ్చును. ఉత్సాహము తగ్గిపోవుట, తలనొప్పి, తలతిప్పు, జ్ఞాపకశక్తి తగ్గిపోవుట, భావములయొక్క అస్పష్టత, తుదకు బుద్ధిమాంద్యము, పక్షవాయువు — యీ లక్షణములతో గూడియుండును. ముఖ్యముగా మెదడునకు బోవుశుద్ధ రక్తనాళము లస్వస్థత నందియుండిన యెడల, చికిత్స యేమియు ప్రయోజన ముండజాలదు. విశ్రాంతి, బలవర్ధక ఔషధములు, చల్లదనముండు ప్రదేశములకు బోవుట — వీటివలన సుఖయోగ ముండగలదు. కొఱుకు సంబంధమగు అస్వస్థత ఉండినయెడల, పొటాసియం అయొడైడ్తో నెక్కువకాలము చికిత్స జేయవలసి యుండును.

### మెనింజైటిస్.

మెదడుయొక్క వివిధములగు పొరభాగములు వాపుదల నందుటవలన గలుగు వ్యాధి మెనింజైటిస్ అనబడును. జ్వరము, తలనొప్పి, సంధిగుణము, మూర్ఛలు, పక్షవాయువు — యీ లక్షణములు కలుగుచుండును.

### చికిత్స.

ఈవ్యాధి కలుగుటకు కారణము — గాయము, ఎముకయొక్క అస్వస్థత, కొఱుకు రోగము — వీటిలో నేదైన యుండినయెడల, అందులకగు చికిత్స జేయవలయును. వీటి

పట్టుట తటస్థించినయెడల శస్త్రముచేసి చికిత్స జేయవలసియుండును. రోగికి పరిపూర్ణమైన విశ్రాంతి నియ్యవలయును. సాధ్యమగు నంతవరకు జ్వరమును బుట్టించు పదార్థములను, గుండె సంబంధమగు బలవర్ధకౌషధములను, ఉపయోగించ గూడదు. విరేచనము క్రమముగా నగునటుల జాగ్రత్తను బుచ్చుకోవలయును. వాంతియగు చుండినయెడల, బిస్మత్ సబ్ నైట్రేస్‌ను యిచ్చుటవలన నుపయోగ ముండగలదు.

## మూత్రకృచ్ఛ్రము. (Gravel)

మూత్రకృచ్ఛ్రము, మూత్రమునందు యేర్పడిన మన్నును సూచించును. మూత్రకృచ్ఛ్రము ఎరుపు వర్ణముకలదియు, తెలుపువర్ణము కలదియు, అయి రెండువిధములుగ నున్నది.

ఎరుపు మూత్రకృచ్ఛ్రము, యూరిక్ ఆమ్లము లేక యూరేట్ సంబంధమగు లవణ పదార్థములు మూత్రమునందలి వర్ణపదార్థములతో గూడి యుండుటవలన కలుగు చున్నది. ఇట్టి మూత్రమునందు యెర్రనైన గసి తేలుచుండును. ఈ మూత్రము ఆమ్లహితమయి నల్లనై బంగారు వర్ణముతోగూడి ఆరోగ్యతయందలి మూత్రమును కొంచెము నిలువయుండిన పిమ్మట యెర్రని గసి తేలును. ఇట్టి విషయములందు మూత్రగ్రంథులయందు శిలయేర్పడ బోవునని తెలియవలయును.

తెల్లని లేక కొంచెము పసుపువర్ణము కలిగిన మూత్రకృచ్ఛ్రము, సున్నము సంబంధమగు పదార్థములయొక్క కూడికవలన గలుగుచుండును. ఇట్టి మూత్రము మడ్డిగా నుండును దీనిని గాచినను శుభ్రపడదు.

ఎరుపు మూత్రకృచ్ఛ్రమునందు, గుండెమంట, అజీర్ణత, కాలిజాస్వస్థత —. యీలక్షణములతో గూడియుండును. తీవ్రదశయందు వాతరోగముతో గూడియుండును. ఈవ్యాధియందొకానొకప్పుడు నడుముయందు బండనొప్పి ప్రారంభమయి మూత్రము విడుచుట కవసరము తరుచుగ గలుగవచ్చును.

పురుషులయందు వృషణములు పయికి లాగవచ్చును. వాంతియు కలుగ వచ్చును. కొంచెము జ్వరముకలిగి వెన్నువైపులను నడుమువైపులను అధికమగు పోటుపుట్టును. ఉద్రిత స్థితియందు మూత్రము తీవ్రవర్ణమును వహించి రక్తమువలెనుండును. ఇట్టిస్థితిలో కత్తిపోటు తగిలినట్లుండి, నొప్పి తగ్గిపోవును. ఈ సమయమున మూత్రగ్రంధినుండి ఒక చిన్నదైనరాయి మూత్రాశయములోనికి జొచ్చినదని తెలియ వలయును. ఈరాయి మూత్రాశయమునందు నిలువయుండి క్రమముగా వృద్ధియగు చుండును. చిన్నదయినయెడల మూత్రద్వారమున బయటికి వెడలిపోవును.

### చికిత్స.

మూత్రకృచ్ఛ్ర సంబంధమగు తెర కలిగినపుడు బాధ నుపశాంతిని గలుగ జేయవలయును. రోగిని వేడినీళ్లతొట్టిలో గూర్చుండబెట్టి 25 గ్రెయినుల క్లోరల్ హైడ్రేస్‌ను యియ్యవలయును. బాధ తగ్గనియెడల, 8 గంటలకు మరల నియ్యవలయును. నడుముపైన వేడి కాపడములను గాచవలయును. మలబంధ ముండినయెడల 1 వ ఔషధయోగమును విరేచనకారిగ నియ్యవలయును. బార్లీనీళ్లను విశేషముగ ద్రాగవలయును.

ఎరుపు మూత్రకృచ్ఛ్ర ముండినయెడల, శాక సంబంధమగు ఆహారములను మాత్రమే భుజింపవలయును. 10 గ్రెయినుల పొటాష్ బైకార్బనేటును ఒక ఔన్సు జలములో గలుపుచు, దినమునకు మూడుపర్యాయములు పుచ్చుకొనవలయును. 3వ ఔషధ యోగమును విరేచనకారిగ నప్పుడప్పుడు ఉపయోగించుచుండవలయును. క్యుపరబీస్ అను ఔషధము మిగుల ఉపయోగము. దీనియొక్క మోతాదు 4 గ్రెయినులవరకు అయియున్నది.

తెలుపు మూత్రకృచ్ఛ్రమునందు, డైల్యూట్ (నీటితోగలిసిన) నైట్రిక్ అసిడ్ 20 మినిములను నాలుగు ఔన్సుల జలములో గలిపి యియ్యవలయును. క్వినీన్ను బలవర్ధకౌషధముగ నియ్యనగును.

మూత్రకృచ్ఛ్రము యొక్క అన్ని తరగతులయందును మంచినీళ్ళు నెక్కువగ త్రాగవలయును. ఒక టంబ్లరు ఉడుకునీళ్ళను, ఉదయమునను, మధ్యాహ్నమునను సాయంకాలమునను, త్రాగుచుండవలయును. భోజనమునకు ద్రవరితముగ జేయవలసి యుండును. విస్తారము సేపు పరుండియుండ కూడదు. అట్లు చేసినయెడల, మూత్రకృచ్ఛ్ర మేర్పడుట కనువు యెక్కువగును. వేడిస్నానములు, బొంగటు తువ్వాళ్ళతో నెక్కువగ నుడుచుకొనుట, ఫ్లానల్ దుస్తులు, నిస్త్రాణను గలుగజేయని శరీరసాధకము, అవసరములయి యున్నవి.

## మూలశంక.

మూలశంక వ్యాధిని గ్రహించుటకు ముందుగా, రక్తము గుండెకాయనుండి శుద్ధరక్తనాళములద్వారా శరీరమునందలి యన్నిభాగములకును గొంపోబడుచున్నదనియు, మరల నపరిశుద్ధ రక్తనాళములచే గుండెకాయకు జేరుచున్నదనియు — యీ సంగతులను గమనించియుండవలయును. ఆసనమువద్ద స్నాయువుల యొక్క వదులైన అగ్గిళలు విశేష పరిమాణముగ నావరించియుండి, యింకను అనేక శుద్ధ రక్తనాళములను అపరిశుద్ధ రక్తనాళములను జేరియుండును. ఈస్థలమందు, రక్తము భూమియొక్క ఆకర్షణశక్తి కెదురుగ పైకిపోవలయును. కాబట్టి, మలబంధము వలనగాని, కాలిజాస్వస్థత వలనగాని, యేయితర కారణముల వలనగాని, యే ఆటంకము కలిగినను రక్తము ప్రవహించకుండ నిచట నిలిచిపోవును.

మూలశంక, 'వెలుపలి' 'లోని' అని రెండువిధములై యున్నది. వెలుపలి మూలశంకయందు, కొందటుగా నొక అపరిశుద్ధ రక్తనాళము ఘనతనంది, ఆసనద్వారాంత్యమున ఒక గింజవలె వాపుదల నందియుండును కొద్ది కాలములో నీ ఉబ్బుదల అంతరించి, చర్మము, పేగుతో గలియుచోట దళముగ మాత్రముండును. ఈ "వెలుపలి" మూలశంకయందు, మిగుల పచ్చిగానుండి, యెక్కువబాధతో గూడి, ముఖ్యముగా విరేచన మగునప్పుడు ఆసనము సమీపమున మంటయును పోటును బుట్టుచుండును. ఇందు రక్తము కారుట అరుదైయుండును.

"లోని" మూలశంకయందు, మలాశయము ననుసరించియుండు అవభాగము నందలి ఘనతనందిన అపరిశుద్ధ రక్తనాళము, పేగుయొక్క పొరను పైటికి నెట్టుటవలన దయముగ

నీ అస్వస్థతభాగము బేరిపండు ఆకారమును వహించి యుండును. ఈ విధమగు మూలశంక యందు, ఒకానొకప్పుడు రక్తముకారుట మూలమున మాత్రమే మన మీ వ్యాధిని గూర్చి తెలియదగియుండును. మూలశంకవ్యాధి అధికమయిన కొలదియు, పేగుయొద్ద మంటబుట్టి, విరేచనకాలమున ముక్కుట యేర్పడి, మూత్రవిసర్జనేచ్ఛ అధికమై, ఒకప్పుడు మూత్రమును విసర్జించుటకు శక్తితగ్గి, నడుమునందును తొడలక్రిందను బాధకలిగి, స్త్రీలయందు కుసుమవ్యాధిని బుట్టింపవచ్చును. ఇది కురుపుగా దేలుటవలన విరేచనమందు చీము, రక్తము, వచ్చును. ఈవిధమగు మూలశంక ఒకప్పుడు బయటికి దేలి, యెక్కువబాధ గలిగింపవచ్చును. ఈవిధమందు కొద్దియో గొప్పయో రక్తము కారుచు ఒకప్పుడు విశేషముగ రక్తము స్రవించును. తరుచుగా విరేచనము పిమ్మట రక్తము స్రవించుచుండును. అత్యుగ్రమైన గతులయందు, విరేచనసంబంధము లేకుండగనే, రోగి అకస్మాత్తుగా నిల్చుండుటవలన గాని, కనుపడని యేయితర కారణమువలనగాని, రక్తస్రావము కలుగవచ్చును. రక్తస్రావ మధికముగ లేనపుడు అంతయెక్కువ తొందర లేకపోవచ్చును గాని, రక్తస్రావ మధికమగుచు, అనుదినమును గలుగు రక్తనష్టమువలన, శరీరమునందు నీరసత యేర్పడును.

ఒకప్పుడు రెండు విధములగు మూలశంకయును ఒకసారియే గలుగవచ్చును. వీటియందు యెల్లపుడును రక్తస్రావమును, వాపుదలయు, లేక పోయినను తరుచుగ నసౌఖ్యతకు కారణమగుచుండును గాన సమయోచితమగు చికిత్స జేయుట మంచిది.

మలబంధమూలమున విరేచనమగునపుడు ముక్కుటమూలమునను, యెక్కువగా కూర్చుండి పనులజేయు అలవాటువలనను, అధికముగ గుఱ్ఱపుసవారీ చేయుటవలనను, కుదుపుగల బండ్లలో ప్రయాణము చేయుటవలనను, బలమగు విరేచనకారుల నధికముగ నుపయోగించుట వలనను, యీవ్యాధి కలుగవచ్చును.

చికిత్స.

వెలుపలి మూలశంకయందు దుబ్బుదల గనబడినపుడు, వేడి కాపడములను గాచుచు, పిండికటును గట్టవలయును. 1వ ఔషధయోగమునుగాని, చిట్లాముదము గాని వాడుటవలన విరేచనమగునట్లు చేయవలయును. రోగి విశ్రాంతిని దీసికొనుచు పరుండియే యుండవలయును. అస్వస్థతభాగముల చల్లని నీళ్లతో గాని, చల్లని పటిక నీళ్లతో గాని, కడుగవలయును మలబంధ మేర్పడకుండ సాధువిరేచనకారుల నుపయోగింప వలయును. తరుచుగా కొంచెము శస్త్రమవసరమయి యుండును. ఈవిధమగు మూలశంకయందు, ఒకటి చుక్కల కార్బాలిక్ ఆసిడ్‌ను వాపుదల భాగములోనికి యింజక్టు చేయుటవలన నెమ్మది యందబడెను. దీనివలన బాధయేమియు కలుగదు.

వాపుదల నందిన "లోని" మూలశంకయందు, వెంటనే చిట్లాముదమునిచ్చి వేడినీళ్లను లోనికి యింజక్టు చేయవలయును. ఈవ్యాధియందీసందర్భమునను మత్తుపదార్థముల నియ్యరాదు. విరేచనానంతరము, లోని మూలశంక బయటకు వచ్చిన యెడల, దానిని చల్లనినీళ్ళతో నద్దవలయును. ఇది తిరిగి లోనికి పోనియెడల రోగి విశ్రాంతకాలము పరుండి యుండుట

వలన, పేగులయొక్క వ్యాపారము మూలమున దానంతట అదియే లోనకు బోవును. లేని యెడల, మెల్లగా దానిని లోనికి ద్రోసి వేయవలయును. అధికరక్తస్రావమును చల్లనినీళ్ళను గాని, హాజలీనును సమానభాగములుగ గలిపిగాని, యింజక్టు చేయుటవలన, రక్తస్రావ మాగి పోవచ్చును.

ఈవ్యాధియందు, మందులకంటె ఆహారమును క్రమపరచుట యందును ఆరోగ్యతా పద్ధతుల నవలంబించుట యందును, చికిత్స యిమిడియున్నది. శాకపదార్థముల నెక్కువగ భుజించుచు, మాంస పదార్థములను పిండివంటలను మత్తుపదార్థములను త్యజించ వలయును. Iవ ఔషధయోగము నుపయోగించుటవలన విరేచనము క్రమముగ నగుచుండునటుల జూడ వలయును. ప్రతివిరేచనము పిమ్మటయును ఆసన భాగమును చన్నీళ్లతో బాగుగా కడుగ వలయును. హాజలీన్ అనుఔషధమును అనుదినమును మూడు నాలుగు పర్యాయములు ప్రయోగించుటవలన, నుపయోగముండ గలదు. సంధ్యాకాలమందు గుడ్డనుగాని గాజుగానుగాని దీనిలోముంచి కట్టియుంచ వలయును.

## రాచపుండు.

రాచపుండు అనునది కురుపు సంబంధమైనదై యున్నది, అయితే పరిమాణమునం దిది పెద్దదిగా నుండును. రాచపుండు, సామాన్యముగ, మెడమీదను, వెన్నుమీదను, పిరుదుల మీదను, లేచుచుండును. మిగుల అపాయకరమైన గతి యందు ఒకప్పుడు ముఖముపైన గూడ లేచును. మూత్రగ్రంధి వ్యాధివలనగాని, అతిమూత్ర వ్యాధివలనగాని, బాధనొందు వారి యందు, ముఖ్యముగా నలుబదియైదు సంవత్సరములు దాటి నీరసస్థితి యందున్నయెడల సాధారణ ముగ రాచపుండ్లు కనుపడుచుండును. రక్తము మాలిన్యముతోగూడి నీరసస్థితి యందుండిన పుడు, ఆకస్మికముగ నేదయిన గాయము తగిలిన యెడల, రాచపుండు యేర్పడవచ్చును. ఈ రాచపుండ్లు పరిమాణమునందు మిగుల మారుచుండును. ఒకప్పుడు నారింజపండంత పరిమాణమును గూడ గలిగియుండును. ఇవి మొదటగా, మిగుల గట్టిగానుండి, యెక్కువబాధతో గూడి, పైచర్మము పల్లనైన యెరుపువర్ణమును వహించి, యీవర్ణమును క్రమముగా నొడలు యొక్క వర్ణములో గలిసిపోవును. రాచపుండు యేర్పడినకొలదియు, అనేక చిన్నవైనద్వార ములనుండి మాలిన్యమును పక్కలను వెడలివచ్చుచుండును. వ్యాధి మెల్లగా నభివృద్ధినందు చు కొంతకాలము పిమ్మట, అనగా రెండుమూడు వారముల తరవాత, అస్వస్థతభాగముల నుండి మాలిన్యము వెడలిపోయి, లోతైనట్టియు, క్రమముగా లేనట్టియు, రంధ్ర మేర్పడి, యీరంధ్రము చుట్టుపట్లు చర్మముక్రింద నావరించి యుండును. రాచపుండ్లయందు, సాధా రణముగ జ్వరము, చెమట, నీరసత, కూడియుండును. బలమగు ఆహారపదార్థములను, పోర్టు వైనును, క్వినీన్‌ను, ఐరన్ (లోహము)ను, అతి మూత్రమందు నల్లమందును, యిచ్చుచుండ వలయును. వేడికాపడ ములను గాచుచు, మాలిన్యము బయలు వెడలునట్లు చేయుటవ గాను, క్రమకాలమున అస్వస్థతభాగమును గోయవలసియుండును. మాలిన్యము వెడలుట ఆగి పోవునపుడు సాధారణ పుండువలె తగు చికిత్సను జేయవలయును. + గురుతుగల కోతను సాధ్య మయినంత త్వరలో గోసి ఒక భాగము కార్బాలిక్ ఆసిడ్ తో ఐదు భాగములు గ్లిసరీనును గలిపి పుండుయొక్క రంధ్రమునందలి లోపలి భాగమును తుడుపవలయును.

---

## రాత్రి చెమటలు.

క్షయవ్యాధివలన, రాత్రి చెమటలు కలుగుచుండును. ఈగతి శరీరముయొక్క నీరసస్థితిని తెలియజేయును.

క్లోరల్ హైడ్రేట్ రెండు డ్రాములు, బ్రాందీ మూడుఔన్సులు, జలము మూడు ఔన్సులు — వీటినన్నిటిని గలిపి ఒడలుయొక్క ఉపరిభాగమును స్పంజి చేయవలయును.

క్వినీన్ సల్ఫేట్ అయిదు గ్రెయినులు, జలము ఒకపైంటు — యీరెంటిని గలిపి స్పంజిచేసినను చేయవచ్చును.

---

## రికెట్సు.

భూసంబంధమగు లవణములు తక్కువగుటచే ఎముకలు సంపూర్ణాభివృద్ధి నొందక పోవుటవలన, మెత్తనయినట్టియు వంగుదలనందినట్టియు స్థితియందుండిన అస్వస్థత రికెట్సు అనబడును. ఈ వ్యాధి పసితనమునందు గలుగుచు, ఒకప్పుడు బిడ్డ నడుచు స్థితిలోనికివచ్చునంతవరకును, యీ వ్యాధిని గనుగొనుటకు వీలులేక పోవచ్చును. ఈ వ్యాధి సామాన్యముగ నారుమాసముల వయస్సునుండి, పండ్లు అన్నియు వచ్చు నంతవరకును, వ్యాపించియుండును. ఒకప్పుడు పుట్టుకనుండియే యుండవచ్చును. జీర్ణాశయ అస్వస్థతలు దీర్ఘకాలము వ్యాపించియుండుటవలన, శరీరపోషణము సరిగా నుండకపోవుటచే నీ వ్యాధి కలుగుచుండును. అనారోగ్యస్థితులు యీ వ్యాధి కెక్కువ ఉద్యుక్తతను గలుగజేయును. సరియైన ఆకలి లేకపోవుట, విరేచనక్రమము తప్పుట, నీసపురంగుగల విరేచనములు, దళమయిన మూత్రము, చిక్కిపోవుట, చిటచిటలాడు గుణముకలుగుట, శిరముపైన రాత్రులందు చెమటపోయుట, కొంచెము జ్వరము, మణికట్లు చీలమండ మోకాళ్ళు పచ్చిదనమును వహించి, వాపుదలతోగూడి చుట్టుకొనియుండుట, కాళ్ళు ముందుకు వెనుకకు వంగియుండుట, ఒకప్పుడు వెన్నుపూస వంగిపోవుట, శిరము విస్తరింపునందుట, గుండెయెముకలు అస్వస్థత నందుట — యీలక్షణములతో గూడియుండును.

### చికిత్స.

1 వ ఔషధయోగమును బలవర్ధకౌషధముగ నియ్యనగును. లైంవాటరు. (సున్నపునీళ్ళు)ను పాలను గలిపి యియ్యవలయును. పరిశుభ్రమగు గాలి, చెమ్మలేకుండుట, వెచ్చని దుస్తులు, అవసరములై యున్నవి. ఉప్పునీళ్ళతో స్పంజిచేయుట ఉపయోగముగనుండును. బిడ్డను యెక్కువకాలము కూర్చుండనియ్యరాదు. సాఫయిన పాన్పులపయిన బరుండబెట్టవలయును. ఎముకలకు సత్తువ వచ్చువరకును బిడ్డను నడువనియ్యరాదు. కాడ్ లివర్ ఆయిలును 3 వ బలవర్ధకౌషధమును వాడవచ్చును. పేగులయొక్క అస్వస్థత ఉండినయెడల సిరప్ ఫెర్రియి ఆయొడైడ్ ను తగు మోతాదులలో నుపయోగింపనగును.

---

## వాతరోగము.

(కీళ్లనొప్పులు.)

వాతరోగమును, ఉగ్రస్థితియు, దీర్ఘవ్యాపకస్థితియు అని రెండుగతుల ననుసరించి యుండును.

### I. ఉద్రుత వాతరోగము.

మూత్రముగుండ వెలువడెడి యూరిక్ ఆమ్లము అధికముగ ప్రకోపించుట వలన, పడుచువారలయందు యెక్కువ తరుచుగ నీవ్యాధి కలుగుచుండును. చలిగాలి సోకుట వలనగాని, చెమ్మ తగులుటవలన గాని, యీవ్యాధి తరుచుగ నారంభ మగుచుండును. జ్వరము, నిండుగ్రమనట్టియు చురుకుబారినట్టియు నాడి, పొంగియున్న నాలుక, యెఱ్ఱనైన గసి కలిగినట్టి మూత్రహీనత — యీ లక్షణములతో గూడియుండును. పెద్దకీళ్లలో నొకదాని యందు బాధ ప్రారంభమయి, ఆ భాగము వాపుదలనుండి యెఱ్ఱనై కదపుటకు వీలులేని స్థితి లోనుండి, ముట్టుకొనుట గూడ భయమును గలుగజేయును. ఈ వాపుదల ఒక కీలునుగాని అన్ని కీళ్లనుగాని, గలదు. పులుపువాసనతో గూడిన చెమటలు పుట్టి, చిన్నపొక్కులు యుండవచ్చును. ఈ పొక్కులవలన అపాయమేమియును లేదు. ఈవ్యాధి రెండు భాగములు లేక మూడు భాగములు వ్యాపించినపిమ్మట, సంపూర్ణ స్వస్థత కలిగినను కలుగవచ్చును. లేక, కీళ్లయందు బిగువులు, నొప్పియును, అటులనే యుండినను యుండవచ్చును. శరీరవేడిమి 105 డిగ్రీలను సమీపించినయెడల, గుండెఅస్వస్థతను సూచించు అపాయకరమగు లక్షణముగా నెంచవలయును. ఎడమవయిపుల ఉమ్రితమగు బాధయేర్పడి, దీర్ఘముగ ఊపిరిని తీసికొనుటవలన బాధ అధికమగును, కొద్దిదగ్గుకూడ కలుగుచు, ఊపిరియందు కొద్దియో గొప్పయో ఆయాసము కూడియుండును. గుండె అదరుకూడ అప్పుడప్పుడు కలిగి, నాడి క్రమము తప్పి, సన్ననై యుండును. కీళ్లనొప్పి సంబంధమగు జ్వరమునందు గుండె అస్వస్థత యేర్పడుట కనువు గలుగును. గాన, యీ జ్వరమునుగూర్చి అశ్రద్ధ చేయరాదు. గుండె అస్వస్థత వలన కొంతకాలమునకు నంజువ్యాధి ప్రవేశించి యిందు వలన త్వరగనో ఆలస్యముగనో మరణము కలుగవచ్చును.

## చికిత్స.

సామాన్యవిషయములలో రోగి ఫ్లానల్ వస్త్రములను గరించవలయును. వ్యాధి కాల మందంతటను రోగి విశ్రాంతిగ నుండవలయును. రెండు పైంట్లు ఉష్ణజలము నందు అరపౌను సోడా కార్బనేటును గలిపి, యీ లోషనులో గుడ్డను దడిపి అస్వస్థత భాగములపయి బెట్టవలయును. జలమునందు ముందుగా రెండుపౌనుల సోడా కార్బనేటును గలిపిన 98 ఫారన్‌హీట్ డిగ్రీల వేడిమిగల, అనగా స్వాభావిక శరీర వేడిమికి సమీపముగనున్న, జలము నందు తొట్టిస్నానమును జేయవలయును. విరేచనము క్రమముగా గాకపోయిన యెడల, 1 వ ఔషధయోగము నుపయోగించవలయును. 3 డ్రాముల సోడా సేలిసిలేటును 12 ఔన్సుల జలములో గలిపి, ప్రతి మూడుగంటలకును ఒక ఔన్సు చొప్పున నియ్యవలయును. బాధ

మిక్కుటముగానుండి కీళ్లవాపుయును అధికముగా నుండినయెడల సేలిసైలిక్ ఆసిడ్ 40 గ్రెయినులును హైడ్రోక్లోరేటు ఆఫ్ మార్ఫియా 1 గ్రెయినును, గలిపి 8 మాత్రలుగా జేసి నాలుగుగంటల కొక మాత్రచొప్పున నియ్యవలయును. సోడా సేలిసైలిస్‌ను గాని, ఆసిడ్ గాని, యెక్కువగ నుపయోగించుటవలన మూత్రమునందు శ్వేతధాతువు (అల్బుమిన్) కనుపడగలదు. దీనిని గనుగొనుటకయి మూత్రమును 249 వ పుటయందు జెప్పబడిన ప్రకారము దినమునకు రెండుసారులు బరీక్షించి శ్వేతధాతువు కనుపడినయెడల యీ మందును నిలిపివేసి 2 వ డయాఫొరటిక్కు ఔషధమును వాడవలయును. బాధవలన రాత్రులందు నిద్రపట్టక పోయినయెడల పల్విస్ ఇపికాక్ కోను పదిలేక పదునైదు గ్రెయినుల మోతాదులను పెద్దవారలకు యియ్యవచ్చును. జ్వర తీవ్రతవలన, వ్యాధిగుండెకు వ్యాపించులక్షణములు సూచించినయెడల, రోగిని మాట్లాడనియ్యక — పల్విస్ఇపికాక్ కో ను రాత్రులయందిచ్చుచునే యుండి 1వ డయాఫొరటిక్కు యౌషధమును మూడుగంటలకొకసారి ఇయ్యవలయును. తేలికయిన ఆహారమును నిచ్చుచు మత్తుపదార్థముల ద్యజించవలయును.

## 2. దీర్ఘవ్యాపక వాతరోగము.

ఎండ వానలకు దడియుటయు, క్రమముకాని ఆహారము తినుటయు, వారముతో ముఖ్యముగా నీ వ్యాధి వయసు చెల్లినవారియందు వ్యాప్తత నందియుండును. కీళ్లయందలి యెముకలుగాని స్నాయువులుగాని యీ సంబంధమగు అస్వస్థత నందును. పెద్దపెద్ద కీళ్ళయందు బాధకలిగి వాపుతో గూడియుండును. కాని, వేళ్ళయొక్క కణుపులు యెల్లప్పుడును యీ బాధనుండి తప్పించుకొనజాలవు. ఈ వ్యాధియందు జ్వరమును చెమటయును ఉండవు. ఒకప్పుడు కాపడములవలన దగ్గవచ్చును. ఇంకొకప్పుడు హెచ్చవచ్చును. ఈ వ్యాధిని గాపాడెడి కారణముల దప్పించుట ముఖ్యాంశమయి యున్నది. చెమ్మతో గూడిన ఇండ్లు, గోడలు, చాలని దుస్తులు, ఫ్లానలును ధరించకుండుట, నీరసమైన ఆహారము—ఇవి ముఖ్య కారణములై యున్నవి. ఈ లోపములను దొలగించుచు అప్పుడప్పుడు రాత్రులందు పల్విస్ ఇపికాక్ కోను బుచ్చుకొనుచు, అస్వస్థత భాగములపైన లెమన్ గ్రాస్ ఆయిల్‌ను రుద్దవలయును. కీళ్లనొప్పులకై లోనికిచ్చుటకును పైనరుద్దుటకును మందులకై ఔషధయోగముగ భాగములో జూడనగును.

---

## వాంతులు.

వాంతియగుట వ్యాధి లక్షణమై యున్నది. జీర్ణాశయము నందలి పదార్థము వెలువడుట యేర్పడి నిస్త్రాణకు గూడ గారణమగును. రోగహితమగు పదార్థము బుచ్చుకొనుట వలనగాని, ఆహారమునం దమితత్వమును వహించుట వలనగాని యిట్లు గలుగవచ్చును. ఇట్టిది సామాన్యముగ జీర్ణాశయము యొక్కయు పేగులయొక్కయు అస్వస్థతను సూచించునుగాని, బిడ్డలయందు ముఖ్యముగా దరుచుగ కడుపునొప్పి, మూత్ర

కృచ్ఛ్రము, కామలరోగము — యీవ్యాధుల యందును గనబడును. తరుచుగా జ్వరములకు ఆరంభమునందు, వాంతులు కలుగుచుండును. గురకదగ్గు యొక్క ఉద్రేకమందు గలుగుచుండును. ఆర్సెనిక్ అంటిమొనీ సంబంధమగు విషప్రయోగముల వలనను వాంతులు కలుగును. సముద్ర ప్రయాణమునందును గర్భవతిస్వమయమునను తరుచుగ బాధకరముగనుండును. పేగుల యందు అడ్డుపడినయెడల మలపదార్థము కూడ వాంతియగును. పిత్తము వాంతి అయినయెడల చేదుగను అమ్లహితముగను ఉండి, పసుపువర్ణము కలిగియుండును. కొన్నివిధములగు అజీర్తుల యందు, నీళ్ళవలె నుండునట్టియు ఘట్టిగా నుండునట్టియు దగ్గినపదార్థము వెలువడును. జీర్ణాశ్వస్థత యందు బిస్మత్ సబ్నైట్రేట్ బహు ఉపయోగముగ నుండును. తెల్ల సవిషయము అలాగే ఆయా వ్యాధులయందు దగు చికిత్సను చేయవలయును.

---

## విరేచనములు (చీము నెత్తురులతో గూడిన)

### (ఆమ విరేచనములు)

ఆమవిరేచనవ్యాధి ఇండియాదేశమునందును. యుత్తర ఉష్ణప్రదేశములందును, మిక్కుటముగ వ్యాపించియున్నది. వాయువు నందలి అత్యుష్ణత వ్యాధి యొడల సద్యశక్తిని గలుగజేసి, ఋతువు మారగనే యీ వ్యాధి అంకురించును. ఈ వ్యాధి అనేక కారణముల వలన గలుగవచ్చును. పెద్ద పేగులయందు యెల్లప్పుడు ఉండెడి యొకవిధమగు పురుగులయొక్క తీక్ష్ణతవలన నీ వ్యాధి కలుగుచుండును. చలిజ్వర వ్యాధికి లోనగుటవలన ఆమవిరేచనములు కలుగునని కొందఱకు నమ్మకము కలదు. ఇండియాదేశము నందలి గర్భిణీ స్త్రీలు తరుచుగ నీ వ్యాధికి లోనగుటవలన గర్భస్రావము కలుగుచున్నది.

బొడ్డు సమీపమున మెలిపెట్టునట్టి నొప్పి యేర్పడి తరుచుగ తీవ్రపుటతో కూడ గూడియుండు లక్షణములు ముందుగా గనబడును. నిద్రించునప్పుడు గాని, యితర కాలముల యందుగాని, ఉదరభాగమునకు జలిగాలి తగులుటవలన నీ నొప్పి యేర్పడుట కలుగును. పిమ్మట రెండు లేక మూడు దినములవరకు తరుచుగా పల్చని విరేచనము అగుచుండును. అంతట పొత్తికడుపుయొక్క నొప్పి అధికమయి, ఆసనము యొద్ద మంట కలుగుచు, పచ్చిగా నుండి తరుచుగా ముక్కుటతో గలిసియుండును. ఈసమయమునందు వెలువడు మలపదార్థము, ద్రవసహితమై చీమురక్తములతో గూడియుండును వ్యాధి ప్రబలినకొలదియు మలపదార్థము తగ్గిపోయి, పచ్చిమాంసపు ముక్కలను బోలిన పీలికలుగాగాని పెద్దులుగాగాని వెలువడుచు, దుర్వాసనసహిత మయియుండును. పగటియందు విసర్జనబాధ తొందరతో గూడియుండును. కొన్ని విషయములతో విరేచనమును బహు విశేషముగా నగుచుండును. మరికొన్ని విషయములలో నిరువదినాలుగు గంటలకాలములోను, పది మొదలు యిరువది వరకు విరేచనము లగుచుండును. మూత్రవిసర్జనేచ్ఛ అధికమగును. కొన్ని విషయములలో జ్వరము కనుపడకనే పోవచ్చును. మరికొన్ని విషయములలో, ముఖము యెఱ్ఱబారి, ఒడలు వేడిగా నుండి, నాడి చురుకుబారి నాలుకపై పొరగప్పియుండును. పేగులపై నొత్తినయెడల బాధ

గానుండును. బాధ లేక, పేగులయొక్క పచ్చిదనము లేక, మలపదార్థము లేకుండ చీము నెత్తురులు మాత్రము వెలువడు చుండినయెడల, పేగులయొక్క అంతిమభాగము మాత్రమే అస్వస్థతయందుండినదని తెలియ వలయును. మృతకళేబరముయొక్క వాసన, ముఖవైఖరి యందు వ్యాకులత, నీరసమైన నాడి, వెక్కిలి, స్వాధీనము తప్పిన విరేచనములు—యివి యన్నియు దుర్గుణములై యున్నవి. ఈ వ్యాధియందు పదార్థస్రావ మెక్కువగ లేక పోయినను, తరుచుగ మలవిసర్జనమునకు బోవుటకు యిచ్ఛయుండును.

ప్రతి అమ విరేచన విషయమునందును, కాలిజము అస్వస్థతనందు అపాయము కలుగ వచ్చును. ఇట్టిస్థితి సంభవించినయెడల వెంటనే దగు చికిత్సను జేయవలసి యుండును.

## చికిత్స.

ఈవ్యాధిని చికిత్స జేయుటయందు, పరుండియుండి విశ్రాంతి దీసికొనుటయు, ఆహార పదార్థములయందు జాగ్రత్తను వహించియుండుటయు, ప్రధానాంశములై యున్నవి. ఆహారము కొద్ది పరిమాణములుగ నియ్యవలయును. ఇది తేలికగ జీర్ణమగునట్టిదిగ నుండవలయును. పాలు, బార్లీనీళ్ళు, మంచి ఆహారములైయున్నవి. వీటిని కొద్ది పరిమాణములుగ నిచ్చుచు, గోరువెచ్చన గలిగి యుండవలయును. సాధుగతులయందు ౫ గ్రెయినుల పుల్విస్ యిపికాక్ ను దినమునకు మూడు పర్యాయములు యియ్యవలెను. దీనివలన వాంతికలుగుట కుదుర్చుట యేర్పడునుగాని, పరుండి యుండుటవలన సాధ్యమయినంతవరకు వాంతి కాకుండునట్లు జాగ్రతను బుచ్చుకొన వలయును. కొన్ని విషయములలో నిది మంచిగుణము నిచ్చును. విరేచనము పల్చనై మెరయునట్టి పసుపువర్ణము కలుగుట యేర్పడగనే యీ ఔషధము పనిచేయు చున్నట్లు తెలియవలయును.

---

ఇంకొక విధమగు చికిత్స ప్రతి అరగంటకును డ్రాము మోతాదులోగాని, ప్రతిగంటకును రెండు డ్రాముల మోతాదులోగాని, సోడా సల్ఫేటును జలములో గలిపి యిచ్చుచు పల్చనైనట్టియు మడ్డియైనట్టియు విరేచన మగువరకును యీ మందును యిచ్చుచుండ వలయును. బిడ్డలకు వయసు ననుసరించి మోతాదును దగ్గించవలయును. (ప్రతిదినమును రెండు లేక మూడు పల్చనైన పెద్దవిరేచనము లగునట్లు కొన్నిదినములవరకు యీ మందును ప్రతి దినమును సేవించనగును.) ఈ చికిత్సవలన విరేచనములయందు చీముమ రక్తమును పడుట మాని, విరేచనము మడ్డిగా నేర్పడిన తోడనే, బిస్మత్ సేలిసైలిస్ ఒక డ్రాము, లైకర్ మార్ఫియా హైడ్రోక్లోర్ అరడ్రాము, కొంచెము తుమ్మజిగురు, 6 ఔన్సుల జలము — వీటినన్నిటిని గలిపి నాలుగు గంటల కొక ఔన్సు చొప్పున విరేచనము గట్టిపడునంత వరకు యియ్యవలయును. ఉదరముపైన వేడికాపడములను గాచుటవలనను ఉపయోగముండగలదు.

ఈవ్యాధి దీర్ఘవ్యాపితమయి యున్నయెడల ఆహారమును బహు జాగ్రత్తతో నిచ్చుచు, అనేకవిధములగు మందుల వాడి చూడవలసి యుండును. కేవలము పాలను మాత్రమే ఆహారముగ నిచ్చుపద్ధతి యొకటైయున్నది, ఫలములయొక్క రసములును, శాకపదార్థము

యుండియుండుట వలన నిద్ర కలిగినయెడల, మస్తిష్కశాంతికారి నియ్యనగును. స్పిరిట్సు ఆఫ్ క్యాంఫర్, క్లోరోడీన్, స్పిరిట్సు అమ్మోనియా అరోమేటిక్, యివియును మంచి ఔషధములై యున్నవి. కొద్దితెర అయినపుడు దీర్ఘమగు ఉచ్ఛ్వాసము (లోవూపిరి) ను దీసికొని ఊపిరిని సాధ్యమగునంతవరకు నిలిపి యుంచుటవలన, శాంతి కలుగగలదు. పొత్తికడుపుపైన ఒత్తిడి కలుగునట్లు పటకాను బెట్టుటవలన నొకప్పుడు వెక్కిళ్లను కట్టుబాటు చేయవచ్చును.

## వెఱ్ఱి.

మనస్సునకు గలుగు ఆయాసమువలన మెదడునం దస్వస్థత యేర్పడి, వెఱ్ఱి కలుగవచ్చును. వ్యాపారమునందు నష్టమునందు సంభవించుట, అత్యధికమగు విద్యాపరిశ్రమ, మిక్కుటమగు శరీరకష్టము, విసుగుదలతో గూడిన మనస్సు, వ్యాకులతతో గూడినబుద్ధి — యీ కారణములు వెఱ్ఱి కలుగుట కుద్యుక్తిను బుట్టించును. వలపు సంబంధమగు ఆశాభంగమువలనను, దైవసంబంధమగు అతిచింతనవలనను, కామవ్యాపారములయం దధికలోలతవలనను, యీవ్యాధి సంభవింపవచ్చును. ఈ అన్ని కారణములయందును మెదడునం దొకవిధమగు అస్వస్థత యేర్పడుచుండును. మనస్సున కేవిధమగు చింత కలిగినను మెదడున కక్కువపరిశ్రమ కలుగుచు, మెదడుతో సంబంధించిన విద్యుచ్ఛక్తి సంబంధమగు వస్తువులు విశేషముగా వ్యాకులతయెడలను అధిక చింతనయెడలను వెచ్చపెట్టబడుట మూలమున, గుండెకాయ, కాలేజము, శ్వాసకోశములు, మూత్రగ్రంథులు మొదలగు అవయవములకు గావలసిన విద్యుచ్ఛక్తి సంబంధమగు శక్తులను అందిచ్చుటయందు లోపము కలిగి, మరల నా అవయవములును తత్ఫలిత నీరసత్వమువలన మెదడునకు వలయు పోషణమును దగ్గించుటచే, మెదడు స్వస్థావస్థను దప్పుచుండును. ఈస్థితియందు మున్నత స్వభావముతో గూడిన శరీరప్రకృతి గలిగిన మనుజుడు ప్రపంచమునం దున్మత్తుడుగా దెలును. బలశాలియగు మానవుడు రొద్దియొక్క ఉద్రిక్తమైనట్టిగాని దీర్ఘవ్యాపకమైనట్టిగాని వ్యాధికి లోనగును.

అనుక్రమణికయందు సూచింపబడిన ఔషధములు యెల్లప్పుడును ఉపశాంతిని గలుగ జేయజాలవు. వెఱ్ఱివానియొక్క మనోవికలతను బోగొట్టుటకు అవసరమగు బుజ్జగింపు మాటలను జెప్పవలయును. స్థలమార్పువలనను ఉపయోగ మూండగలదు. ఇట్టివారలయొక్క మనస్సునకు ఆయాసమును గలుగజేయునట్టి వ్యాపారములు గలిపింపవలయును. విడిగా నిట్టి యేర్పాటుల జేయుట మిగులకష్టముగాన, మనరాజధానియం దిట్టివారలకు చెన్నపట్టణమునందును, విశాఖపట్టణమునందును యేర్పరుపబడి యున్నఆసుపత్రులందు స్వస్థత నందుట యే మంచిది

---

## వెఱ్ఱికుక్క కాటు.

(హైడ్రోఫోబియా)

పిచ్చికుక్క కరచుటవలన నొకవ్యాధి కలుగవచ్చును. దీనికి హైడ్రోఫోబియా అందురు. జిల్లలు, తోడేళ్ళు, గుంటనక్కలు, కరచుటవలనను యిట్టివ్యాధి కలుగును, కుక్క కంటె, తోడేలు, పిల్లి, కరచుటవలన నెక్కువ అపాయకరమై యున్నట్లు లెక్కలవలన దెలియుచున్నది.

లక్షణములు.

వ్యాధి పక్వమునకు వచ్చు కాలమున రోగియొక్క సాధారణ ఆరోగ్యత క్రమముగా చెడి కనబడును. అప్పుడప్పుడు, గాయమునందు తిమ్మిరులు పుట్టుట మొదలగు లక్షణములు వ్యాపించిన కాలదయా, నొప్పులు గలిగి వచ్చును. అస్తిమితముగనుండుట, కలతనిద్ర, ద్రవపదార్థములను మ్రింగుటకు కష్టత, చూచుటవలన భయము, గొంతుకలో గట్టిన ఉచ్ఛ్వాసనిశ్వాసములు, మనోవ్యాకులత, మతిభ్రమము, దేహమునందు దీర్ఘమయిన ఉష్ణ మేర్పడుట, యీ లక్షణములతో గూడియుండును. శ్వాస సంబంధ స్నాయువులు, ఉదర సంబంధ మయినట్టియు, స్నాయువులయొక్క ఈడ్పులు కలుగుటవలన, మూర్ఛ తటస్థించి రోగి మరణము నందవచ్చును, సాధారణముగ అలుపువలనను రోగి మరణము నందును.

## చికిత్స.

చేతిమీదను గాని కాలుమీదను గాని కరువబడియున్న గాయముల, కాలునకు పైగా బిగువైన కట్టును గట్టవలయును, అంతట పొటాసియం పర్మాంగనేట్ సాల్యూషనును (ఔన్సు జలమునందు 6 గ్రేయినుల చొప్పున కలిపిన)తో పుండును కడిగి, సిల్వర్ నైట్రేటును పూతమందుగా నుపయోగింపవలయును. మనోవ్యాకులతను తగ్గించుటకు, ప్రతి ఆరు గంటలకును 10 గ్రేయినుల పొటాసియం బ్రోమైడును రెండు దినములవరకును నియ్యవలయును. రోగి, భయ మందకుండ ఉత్సాహమును గలిగి యుండునట్లు చేయవలయును.

ఈ పైచికిత్సలవలన నెప్పుడు యెక్కువ ఆశల నుంచుకొనగూడదు. 1885 వ సంవత్సరమున లూయీ పాస్ట్యూర్ అనునొక ఫ్రెంచి వైద్యశాస్త్రజ్ఞుడు, పిచ్చికుక్కలయొక్క విషప్రయోగమువలన చంపబడిన కుందేళ్లయొక్క వెన్నుపాములనుండి దీయబడిన రసములో టీకాలను వేయుటవలన, నీవ్యాధిని బాగుచేయుట కొక మార్గమును కనుగొనెను. దీనివలన యీ వ్యాధియందు 100 కి సామాన్యముగ గలుగు 15 మరణములు, 1 కంటె తక్కువగ గూడ చేయబడెను. ఈ సంబంధమగు చికిత్సను చేయుటకు యిదివరలో ఇండియా దేశమునందు పంజాబురాజధానిలో సిమ్లా ప్రాంతముల కసౌలి పట్టణమునందును, నీలగిరి ప్రాంతముల కూనూరు పట్టణమునందును, ఆసుపత్రులు నిర్మింపబడి యున్నవి. ఇప్పుడు జిల్లా రాజధానుల యందును యీ యేర్పాటు చేయబడియున్నది.

## శ్వాసకోశములనుండి రక్తము గ్రక్కుట.

శ్వాసకోశమునుండి వెలువడు రక్తము యెఱ్ఱనై నురుగుగా నుండును, సాధుగతుల యందు చికిత్స అవసరములేదు. రక్తస్రావము అధికముగ నున్నయెడల రోగికి పూర్ణమయిన విశ్రాంతి నియ్యవలయును. రోగి, ఒరగుకొని పరుండి, తలయెత్తుకొని యుండునట్లు దిండ్లపైన ఆని యుండవలయును. గదియందు చల్లగా నుండునట్లుచేసి, దుస్తులను తేలికగా నుండునట్లుచేసి, కాళ్లను చేతులను వేడినీళ్లతో నింపబడిన సీసాలతో కాచవలయును. చల్లని పాలను త్రాగుట కియ్యవలయును. మంచుగడ్డ దొరకిన యెడల, దీనిని పాలలో గలిపి

యియ్యవలయును. ఉదుత గతులయందు ఎదరొమ్ము భాగములకు మంచును ప్రయోగింప వచ్చును. ఇతర భాగములయందు, అనగా, జననేంద్రియ భాగములు మొదలగు స్థలములందు మంచును ప్రయోగించుట [illegible] నుపయోగముగ గనుగొనబడెను.

క్యాలోమెల్ (రసభస్మము)ను యిచ్చుటవలన ప్రేగులయందు ఉపశాంతి గలుగజేయు టయేగాక, రక్తప్రచారమునందు ఉద్రేకతను గొంతవరకు తగ్గింపజేయును. రక్తప్రచారము నందధిక ఉద్రేకత ఉండినయెడల, మాంద్యతను గలుగజేయుట కుపకరమగు మందుల నియ్య వలయును. ఈ విషయమున టింక్చర్ అకొనైట్ బాగుగా పనిచేయును. నొప్పియందు శాంతిని గలుగజేయుటకు లైకర్ మార్ఫియా హైడ్రోక్లోర్ నుపయోగింపనగును. అత్యధికముగ రక్తస్రావములయందు తప్ప తక్కిన విషయములలో దీనిని విరివిగ నియ్యవచ్చును. దీనికి తోడుగా టింక్చర్ డిజిటాలిస్ ను గలిపి యిచ్చినయెడల మంత్రమువలె పనిచేయును. మార్ఫియా (నల్లమందు) యందుగల మలబంధ గుణమునకు ప్రతిహతముగ క్యాలోమెల్ ను తగ్గిన పరిమాణములుగ నుపయోగింపనగును. ఆహారపదార్థములు సుళువుగ జీర్ణమగునవిగ నుండవలయును. పుష్టిపదార్థములు పరిపూర్ణముగ త్యజింప వలయును.

ఈ సందర్భమున జీర్ణాశయమునుండి రక్తమును గ్రక్కుకొనుటను గురించి ఆలోచింపవలసి యుండును.

### జీర్ణాశయమునుండి రక్తమును గ్రక్కుకొనుట.

జీర్ణాశయమునుండి వచ్చు రక్తము నల్లగనుండును. జీర్ణాశయమునందలి కురుపు వలన రక్తనాళము తెగుటచేయేర్పడి, యీ రక్తస్రావము కలుగును. ఒకప్పుడు కాలిజము ప్లీహ అస్వస్థత నందుటవలనను యిట్లు తటస్థింప వచ్చును. జీర్ణాశయ అస్వస్థతయందు రక్తము అధికముగానుండి, శ్వాసకోశాస్వస్థత యందువలె నురుగుతోగూడి యుండక ఆహారముతో గూడ గలిసియుండి, విరేచనముతోగూడ రక్తముపడుట కలుగును. ఈ వ్యాధియందు శరీర మునకును, జీర్ణాశయమునకును, విశ్రాంతి నియ్యవలయును. రోగి, పరుండబెట్టబడి, గది యందు చల్లగానుండునట్లు చేసి, స్నేహితులు మొదలగువారు వచ్చి చూచుటవలన ఉద్రేకత గలుగకుండ జేయవలయును. నోటిద్వారా ఆహారము నిచ్చుట నిలిపివేయ వలయును. దాహ ము నణచివేయుటకు మంచుగడ్డ నుపయోగించ వచ్చును. మత్తుపదార్థముల నేమియు నోటి ద్వారా యియ్యగూడదు. నోటిద్వారా ఆహారపదార్థముల నిచ్చుట మానుజేయుట వలననే రక్తస్రావము నిలుపుచేయవచ్చును. కాని, టానిక్ ఆసిడ్ నుగాని, గ్యాలిక్ ఆసిడ్ ను గాని, 2 మొదలు 5 గ్రెయినుల వరకును, లేక లెడ్ అసిటేటును 1 గ్రెయిన్ మోతాదులలోను, మాత్రలుగాజేసి ప్రతిరెండు లేక మూడు గంటలవరకును, నోటవెంబడి యిచ్చుటవలన గుణ ముగ నుండగలదు. నిద్రపట్టక అధిక ఆయాసముగ నుండినయెడల 2 మినిముల లైకర్ మా ర్ఫియాను హైపోడర్మిక్ పిచికారితో రక్తనాళమునందు యించెక్టు చేయుటవలన గాని, 10 గ్రెయినుల క్లోరల్ హైడ్రేటునుగాని 30 గ్రెయినుల పొటాషియం బ్రొమైడునుగాని ఆ సనముద్వారా పిచికారీ చేయుటవలన గాని, ఉపయోగముగ నుండగలదు.

---

## శ్వాసకృచ్ఛ్రము

ఆహారము తప్పుమార్గమున బోవుటవలనగాని, మరియేయితర కారణమువలన గాని, స్వరపేటికగాని లేక శ్వాసనాళముగాని అడ్డగింపు నందినపుడు, రక్తమునందు అంగారక్షార వాయుభాగము అధికమగుచు, ప్రాణవాయు భాగము తక్కువగు చుండును. ఈ అడ్డుబాటును దొలగించుటకు తీవ్రతమగు ఊపిరివిడుచు ప్రయత్నములు జరుగుచు, దగ్గుకూడ యేర్పడును. ఈగతియందు రక్తమెక్కువగా నపరిశుద్ధమగుచు రక్తము సిగతినుండి దప్పించుటకుగాను బలమగు ఉచ్ఛ్వాస నిశ్వాసములు యేర్పడును. ఈస్థితియే శ్వాసకృచ్ఛ్రమన బడును. ఈవ్యాధి కగు కారణమునుదొలగింప యత్నించుచు అనుక్రమణికలో నీవ్యాధిక్రింద సూచింపబడిన ఔషధములను జాగ్రత్తతో నుపయోగింప వలయును.

---

## సోరియేసిస్.

ఇది ఒకవిధమగు చర్మవ్యాధియై యున్నది. ఇది మూడువిధములుగ గలుగు చుండును. మొదటి విధమందు గుండ్రనైనట్టియు, దురదతోగూడిన మచ్చలుగలిగి యుండుపైన తెల్లని పొట్టుగా నేర్పడి పొట్టు రాలిపోయినపిమ్మట చర్మము పచ్చిగాను యెర్రగాను ఉండును. ఈమచ్చలు యెదుగుచు గుండ్రముగానే యుండి అనేక అంగుళముల కైవారము వరకు వ్యాపించి, అంతట పగిలి పక్కులతోగూడిన గుబురులుగా నుండును. రెండవ విధమగు నీవ్యాధియందు ప్రారంభము నందుండెడి గుండ్రని మచ్చలు లేకుండ పొర సంబంధమగు పక్కులతోగూడి వంకరలుగా నుండును. ఈరెండు విధములగు వ్యాధియును, చంకయందును, గజ్జలయందును, అరచేతులమీదను, గోళ్లమీదను, గలుగుచుండును. దీనియందు దురద ఉండదు. మొదటి రెండు విధములగు వ్యాధియును జీర్ణాస్వస్థతల వలన గలుగు చుండును.

### చికిత్స.

మలబంధ ముండినయెడల అందులకగు చికిత్సను చేయవలయును. పొటాష్ బైకార్బనేట్ ఒక డ్రామును అయిదు ఔన్సుల జలములో గలిపి, యీ లోషనును, పైన రాయుచుండ వలయును. అరఔన్సు స్పిరిట్సు ఆఫ్ వైనును అరఔన్సు టింక్చరు ఓపియంను పండ్రెండు ఔన్సుల జలములో గలిపి, లోషనుగా జేసి రాయుటవలన దురద తగ్గగలదు. టార్ ఆయింట్ మెంటునున్నూ రాయవచ్చును. అంగ్వెంటం హైడ్రార్జిరయను సింపిల్ ఆయింటు మెంటునున్నూ సమాన భాగములుగ గలిపి రాసినను రావచ్చును.

---

## స్క్రోఫ్యులా.

ఈవ్యాధి శరీరముయొక్క నీరసస్థితిని తెలియజేయును. ఈవ్యాధి రెండుతరగతులుగ నుండినను, యీరెండు తరగతులను గూడ, క్షయవ్యాధి సూచనలుగా నెంచబడుచుండును. ఒక

తరగతియందు, మందమైన నల్లని వెండ్రుకలు, దళమైన పై పెదవి, వెడల్పయిన నాసికా రంధ్రములు, విస్తారమైన ముఖాస్థులు, వికారములయిన హస్తములు, గీతలతో గూడినట్టి మొద్దయిన గోరులు, సౌష్ఠవములేని శరీరావయవములును — యీ లక్షణము లుండును. బుద్ధియందు మాంద్యత, మెడయొద్ద గ్రంధులయొక్క వాపుదల, చెవులలోనుండి స్రావము కండ్లకలక, కంటిలో పువ్వు, పేనుగుగజ్జి, మొదలగు చర్మవ్యాధులు, కీళ్ళవ్యాధులు, రికెట్సు—యీ గుణములును గనబడు చుండును. ఇట్టిబిడ్డ యెదిగినపుడు పొలిపోయి యుండ వచ్చును.

రెండవ విధమగు నీవ్యాధియందు, కొందరిలో చక్కదనముగా నెంచుగుణము లుండును. పల్చనయిన చర్మము, స్వచ్ఛమయిన శరీరచాయ, గులాబివర్ణముగల చెక్కిళ్ళు పెదవులు, నీలమైనట్టియు నిగనిగలాడు నట్టియు నేత్రములు, విస్తరింపు నందిన కనుపాపలు, దీర్ఘమయిన కనుబొమ్మలు, మృదువైన వెండ్రుకలు, గుండ్రనిముఖము సుకుమారమగు ముఖలక్షణములు, చిన్న ఎముకలు, చర్మముగుండ స్పష్టముగ గనబడునట్టి అపరిశుద్ధ రక్తనాళములు, వికాసతనందిన బుద్ధిసూక్ష్మత, —యీ లక్షణములతో గూడియుండును. ఇట్టి బిడ్డలు, రొమ్ముపడిసెము క్షయ మొదలగు వ్యాధుల కెక్కువగా లోనగుదురు. ఈవ్యాధి వంశపారంపర్యముగ శరీర ప్రకృతి వలన గలుగుచుండును. కాని, ఆహారలోపము వలనను, చెమ్మ ప్రదేశములలో నివసించుటవలనను, త్రాగుబోతుతనము కొరుకువ్యాధి యొక్క కల్మషము లంపై కారణములకు సహాయము మొనర్చుట వలనను, యీవ్యాధి కలుగవచ్చును. పరిశుభ్రమగు గాలి, మంచి ఆహారము, కాడ్‌లివరు చమురు, శరీరసాధకము— యీవ్యాధి కల్మషమును బోగొట్టుటయందు గాని, ఉద్రితావస్థ గల్పించ కుండుటయందు గాని, సహాయ మొనర్చును.

---

## స్తనములయొక్క వాపుదల.

స్తనములయొక్క వాపుదల యెక్కువ తరుచుగ పాలనిచ్చుచున్న స్త్రీలయందు గలుగుచుండును; కాని యితరస్త్రీలయందును ఈవ్యాధి తటస్థింపవచ్చును. దెబ్బవలనను, జలుబువలనను, బిడ్డను అకస్మాత్తుగ పాలు త్రాగు అలవాటునుండి దప్పించుటవలనను, శిశుపోషణము చేయుటయందు క్షీరవృద్ధివలనస్తనముల నధికముగ విస్తరింపునొందుట కెడమిచ్చుట వలనను, బిడ్డయొక్క మరణము వలనను, యీవ్యాధి సంభవించు చుండును.

### చికిత్స.

వేడి కాపడములను గాచవలయును. తరుచుగా గాకుండ అప్పుడప్పుడు, బిడ్డవలన గాని, బ్రెస్టు పంప్‌ను ఉపయోగించుట వలన గాని, పాలను దీసివేయ వలయును. రోగియొక్క చిత్తవృత్తుల ననుసరించి పాలుయొక్కువగ నున్నపుడు మాత్రమే, తీసివేయ వలయును. అధికముగా దీసివేయుటవలన, వాపుదల యెక్కువగును గాన యీపనిని జాగ్రత్తతో జేయ వలసియుండును. వేడి కాపడములయొక్క మధ్యకాలములో వాపుదల స్థలమందు సోప్

లినిమెంటును రాయుచు, చుట్టుప్రక్కలనుండి స్తనాగ్రముల ప్రక్కలను నెమ్మదిగా రాయవలయును. ఎక్కువగా రుద్దుటవలన నరుపు ఏర్పడుట కనువగును గాన రాపిడి అధికముగ దగులకుండ జూడవలయును. స్తనమునకు కదలిక లేకుండుటకు గాను గాఁగి పట్టుడిచేసి యుండవలయును. విరేచనమగుటకు గాను చిట్టాముదము నియ్యవలయును. 5 గ్రెయినుల క్వైనీన్ను ప్రతి ఆరుగంటలకును ఇచ్చుచుండవలయును. స్తనాగ్రములకు పగుళ్లను రెండు లేక మూడు అంగుళముల వరకును లినిమెంటు బెల్లడోనాను రాయనగును, బెల్లడోనా లినిమెంటును రాయుట వలన పాలు ఏర్పడుట తగ్గిపోవును. స్తనము మిక్కిలి గట్టిపడి నొప్పియున్ను అధిక బాధగా నున్నయెడల ప్రతి రెండు లేక మూడు గంటలకును ఒకటి లేక రెండు దినముల వఱకు, రాయుటవలన, త్వరగ వాపుదల తగ్గి నరుపు ఏర్పడనీయకుండ జేయును. ఔషధము విష సంబంధమైనది గాన, యీమందును రాయబడిన స్తనమును బాలుని త్రాగ నియ్యరాదు. నేత్రదృష్టియందు మసగ యేర్పడి, గొంతునందు తడియారిన యెడల, దీనియొక్క ఉపయోగమును నిలుపుచేయవలయును.

---

పై చికిత్సలవలని ప్రయోజనము లేనప్పుడు గాని, వ్యాధిని గురించి అశ్రద్ధజేసి యుండు నపుడు గాని, నరుపు ఏర్పడుట తటస్థమగును. జ్వరము, పోట్లు పొడుచుట, చలి తగులుట, స్తనముయొక్క ఒకభాగమునందు వాపుదల కలుగుట, చర్మము ఎఱ్ఱపడుట— యీలక్షణములతో గూడియుండును. ఈ వాపుదల భాగమును లాన్సెటుతో చీరచుటవలన, రాబోవు ఉద్రిక్తబాధను తగ్గింపవచ్చును. గాయమును చీరచినపిమ్మట పిండి కట్టును కట్టిగాని, వేడినీళ్లలో ముంచిన గుడ్డతో దుడిచి గాని, మాలిన్యము నంతయు తొలగించిన పిమ్మట, పట్టీని వేయుటవలన మాన్పును గలుగ జేయవచ్చును. ఇట్టి వ్యాధివలన బాధనొందు స్త్రీలు బలహీనులుగ నుందురు. గాన 1 వ బలవర్ధకౌషధము నిచ్చుచు, పాలుమానిచ్చి, ఆహారములు నియ్యవలయును. రోగి పాలిపోయి యుండినయెడల, లోహము కలిగియున్న 3 వ బలవర్ధకౌషధమును వాడనగును.

పైన జెప్పబడిన విధముగు పుండు కాక క్యాన్సర్ అనబడు మఱియొక విధమగు పుండు, కొందరి స్త్రీలయందు 35 సంవత్సరములు దాటిన పిమ్మట గలుగుచుండును. దీనికై యెన్ని మందులు నియోగింపబడినను, శస్త్రమే మిగుల యవసరమయి యున్నది. ఇది ఒకసారి కలిగినపిమ్మట మఱలమఱల కలుగుట నద్వ్యక్తి శరీరమునందు ప్రవేశించి యుండును.



## స్ప్రూ.

స్ప్రూ అనబడు వ్యాధి ఇండియా దేశమునందు విశేషముగ వ్యాప్తినంది యుండ వలయును. ఈ వ్యాధిలో రక్తమునందును, యావచ్ఛరీరము యొక్క అల్లికల యందును, మార్పులగలుగును. ఇండియా దేశములో గొన్ని ప్రదేశముల యందు, నవీనముగు కాకప వార్ధ

ములు దొరకకపోవుటచే, నీవ్యాధి జనించుట కుద్యుక్తతను గలుగజేయుచున్నది. శాకపదార్థములు ఆహారముగ నున్నవారియందీ వ్యాధి కలుగనేరదు. ఈవ్యాధి అంతర్గతముగ నుండుటయు గలదు. ఈ దేశములందు కొన్ని ప్రదేశములలో నీవ్యాధి అంతర్గత స్థితియందు మాత్రమే, మిక్కుటముగ వ్యాపించి యున్నది. పండ్లచిగుళ్లయొక్క పచ్చిదనము, నిస్త్రాణ, ఉత్సాహము తగ్గియుండుట, అవయవములలో బంగ్లపోట్లు, గుండె అదరు, హ్రస్వనిశ్వాసములు, పాలిపోయిన నాలుక, మకిలి అయిన శరీరకాంతి, నీలవర్ణమును వహించిన పెదవులు, పండ్లచిగుళ్ళు వాచుటవలన చిగురుగానుండి రక్తముకారుట, యీలక్షణములతో గూడియుండును. ఏ తమాత్రము దెబ్బతగిలినను గాయముగా నేర్పడి, కీళ్ళు వాపుదలనంది పట్లుపట్టి, మిగుల శుష్కించినంజారియేర్పడి, అతివిరేచనములు గాని ఆమవిరేచనములు గాని పుట్టి పండ్లచిగుళ్ళ వెంబడియు, ముక్కువెంబడియు, ప్రేగుల వెంబడియు రక్తము వెలువడుచు, నిస్త్రాణచే రోగి మరణము నందును.

## చికిత్స.

వ్యాధి లక్షణములు కనుబడినపుడు గాని, వ్యాధి యేర్పడినపుడు గాని, నవీనమగు శాకపదార్థములు, ముఖ్యముగా బంగాళాదుంపలు, ఉపయోగింపనగును. భోజనమునందు విశేషముగ నుప్పును వాడవలయును. పాలను విరివిగ బుచ్చుకొనవగును. కొబ్బరికాయలోని నీళ్ళు మిగుల ఉపయోగముగా నుండగలదు. ప్రతిదినమును రెండు లేక మూడు ఔన్సుల నిమ్మరసమును త్రాగనగును. ఇది అందుబాటుకాని విషయములలో, 10 గ్రైనుల మోతాదులలో పొటాష్ సిట్రేస్ను దినమునకు రెండుసార్లు బుచ్చుకొనవగును. నారింజ ఫలములు, నిమ్మకాయలు, ద్రాక్షఫలములు, క్యాబేజి, నీరుల్లి వీటినికూడ ఉపయోగింపనగును. పండ్ల చిగుళ్ళవాపుదలకు పటిక గండూషము నుపయోగింపనగును. అతి విరేచనములుండిన యెడల, పాలనుమాత్రమే ఆహారముగ నుపయోగించుచు, జెల్ శాప్ (మాంసపు మరబ్బా) ను ఔషధముగ నుపయోగింప వలయును. పరిశుభ్రత, గాలియు వెలుతురును జక్కగా బొచ్చు గృహములు, చెమ్మలేకుండుట— ముఖ్యములగు అంశములై యున్నవి.

---

## స్కార్లెట్ జ్వరము.

స్కార్లెట్ జ్వరమనునది ఇండియాదేశమునందు వ్యాప్తినొంది యుండలేదు. ఈవ్యాధి సామాన్యముగ పొంగును బోలియుండును. ఈవ్యాధియందును ఒడలుపై పొక్కులు లేచును గాని, పొంగునందువలె పొక్కులు యెత్తుగానుండవు, ఈవ్యాధియందు గొంతు అస్వస్థత యేర్పడియుండును. పొంగునందు ఎదురొమ్ము అస్వస్థత కలుగుట కుద్యుక్తత ఉండును. స్కార్లెట్ జ్వరము అంటుగుణమును వహించి, యుండును. గొంతునందు ఆవిరిపట్టవలయును 2 డ్రాముల బోరిక్ ఆసిడ్ను 1 ఔన్సు గ్లిసరీన్తో గలిపి దీనిని గొంతునకు రాయవలయును. వేడినీళ్ళస్నానమును జేసినపిమ్మటగాని, వేడినీళ్ళతో స్పంజిచేసిన పిమ్మటగాని, 30 గ్రైనుల కార్బాలిక్ ఆసిడ్ను 10 గ్రైనుల థైమాల్ను, 1 డ్రాము వాసలీన్ను, 1

ఔన్సు సింపిల్ ఆయింట్‌మెంటును —— వీటినన్నిటిని గలిపి చేసిన ఆయింట్‌మెంటును పొక్కులకు రాయవలయును. విరేచనబద్ధమాగా నుండినయెడల 4 వ విరేచనకారిని వాడవలయును.

—— (•) ——

## ప్రసవ సంబంధమగు రక్తస్రావము.

గర్భిణికాలమందు గలుగు రక్తస్రావమునందు పరిపూర్ణమగు విశ్రాంతి మిగుల అవసరమైయున్నది. యీస్థితియందు రోగి పరుండియుండు గదిలో పరిశుభ్రమగు గాలి వచ్చుచుండవలయును. రహస్యభాగములయందు చల్లని ప్రయోగములు జేయవలసియుండును.

ప్రసవమైన పిమ్మట గలుగు రక్తస్రావము అధికముగ నుండినయెడల బ్రాందీ మొదలగు మత్తుపదార్థముల నియ్యగూడదు. రోగిం లేవదీసినయెడల మూర్ఛ కలుగ వచ్చునుగాన, అట్టి పనిని జేయగూడదు. లిక్విడ్ యక్స్‌ట్రాక్టు ఆఫ్ యెర్గాట్‌ను మూడుగంటలకొకడ్రాము చొప్పున ఒక ఔన్సు జలములో గలిపి యివ్వవలయును.

—( ... )—

## హైపోకాండ్రియా

సదా రోగభీతితో నుండెడి స్థితికి ఆంగ్లేయ భాషయందు హైపోకాండ్రియా అందురు. స్త్రీలయందు గలుగు హిస్టీరియా వ్యాధికి అనుగుణ్యముగానుండి పురుషులయందీ వ్యాధి కలుగుచుండును. భోజనము బలమై, శరీరపరిశ్రమ లేకుండి, మనస్సునకు యేవిధమగు వ్యాపకమును లేకుండినపుడు, యీవ్యాధి కలుగవచ్చును. అధిక మనో పరిశ్రమవలన గాని, క్రిములవలనకాని, యీవ్యాధి గలిగినను కలుగ వచ్చును. ఈస్థితియందు కారిజాస్వస్థతయు, అజీర్ణతయు, ప్రవేశించవచ్చును. సాధు విరేచన కారులను, శరీరసాధకములను, యీ అస్వస్థతను బోగొట్టును. మంటతోగూడిన తలనొప్పి యుండవచ్చును. నిర్వ్యాపారముగనున్న యీ రోగికి వ్యాపారమును గలిగింప వలయును. స్థలమును మార్చుటవలనను, అలవాటులను స్వస్థత కలుగగలదు. కొందరకు స్వస్థాన బెంగవలన నీవ్యాధి కలుగవచ్చును. అట్టి స్థితియందు, యితర ప్రదేశములయందుండినయెడల స్వస్థలమునకు పోవుటవలన కుదిరికనొందగలరు. ఈవ్యాధియందు మందులు యెక్కువ ఉపయోగములు కావు.

---

## క్షయ వ్యాధి.

క్షయవ్యాధి, ఇండియాదేశములో బంగాళా రాజధానియందు మిక్కుటముగ వ్యాపించియున్నది. శ్వాసకోశములయందు ఒక విధమగు పురుగు ప్రవేశించుటవలన క్షీణతయేర్పడి, యీవ్యాధి కలుగుచున్నది. రోగియొక్క ఉమ్మియందును, ఊపిరియందును, యీపురుగు వ్యాపించియుండును. ఈవ్యాధియందు ప్రారంభ లక్షణముగ, ఉదయపు పూటలందు

మిగుల బాధకరమగు పొడిదగ్గు ప్రవేశించును. పనిచేయుటయందు, యీ రోగి త్వరలో ఆయాసమునంది మెట్లపై నెక్కుటయందు కష్టముగ కనుగొనును. అంతట తెమడ వేయుట ఆరంభమయి, నురుగుతో గూడిన యెఱ్ఱని రక్తము యీ తెమడతో గలిసియుండుట తటస్థించును. నాడి చురుకుబారి, సాయంకాల సమయములందు శరీర వేడిమి హెచ్చును. ఈస్థితి కొన్ని వారములు కొన్ని మాసములు, ఒకప్పుడు కొన్ని సంవత్సరములు గూడ, వ్యాపించును. వ్యాధి ముదురక మునుపే అతిశీతల ప్రదేశములు కానట్టియు, ఆరోగ్యముగ నుండు నట్టియు, నీలగిరి పర్వత ప్రాంతములందలి, కూనూరు, కోటగిరి, అనబడుస్థలములకు బోయి నివసించుటవలన మిగుల ఉపయోగముగ నుండగలదు. సముద్ర ప్రయాణములును ఉపయోగకరములై యున్నవి.

ఈవ్యాధియొక్క రెండవగతియందు, దగ్గు అధికమయి, తెమడ కూడ హెచ్చునొంది పసుపువర్ణమును వహించి, రక్తపుగీరలతో గూడి, నీటియందు దేలును. రాత్రులయందు జ్వరముకలిగి, మిక్కుటమగు రాత్రిచెమటలు కలుగును. ఆకలి క్రమముగా నుండినను, రోగి కృశించి బలహీనత నందుచుండును. ఎదురొమ్మునందు చురుకైన పోట్లుపుట్టి, రోగియొక్క కంఠధ్వని నశించి, అతి విరేచనములు పుట్టి, వ్యాధి గొంతులోనికి పేగులలోనికి వ్యాపించినట్లు సూచించును. తుదకు శోషణమువలనగాని, శ్వాసకోశములందు పెద్ద రక్తనాళము విచ్ఛేదమందుటచే అధిక పరిమాణములుగ యెఱ్ఱని రక్తము నోటివెంబడి గ్రక్కుటచేత గాని, రోగి మరణమునందును. ఒకప్పుడు, మరణము గలుగకుండగనే, రక్తస్రావము మాత్రము అనేకసారులు కలిగినను కలుగవచ్చును. ఈవ్యాధియందలి చిత్రము, రోగి మరణము నందు ముందుగూడ, తన అంత్యావస్థను తెలిసికొనలేక కుదిరికనుగూర్చి బహు ఆశతోనుండును. చివరకుకూడ రోగియొక్క మనశ్శక్తులు యేవిధమగు అస్వస్థతను అందనేరవు. ఈవ్యాధి గ్రస్తులు వివాహము చేసికొన గూడదు. అందువలన నితరులకును, యీవ్యాధిని వ్యాపింపజేయు వారలగుచున్నారు.

### చికిత్స.

ఈవ్యాధిగ్రస్తులు పరిశుభ్రమగు గాలి వచ్చు గదులలో నిద్రించవలయును. రాత్రులం దెక్కువసేపు మేల్కొనగూడదు అమిత భోజనము జేయగూడదు. వ్యాధి స్థిరపడినపుడు కాడ్‌లివర్ ఆయిల్‌ను సేవించవలసి యుండును. ఫెల్లోజ్ కాంపవుండు సిరప్ ఆఫ్ హైపోఫాస్ఫయిట్సు వలనను మిగుల ఉపయోగ ముండగలదు. అతి విరేచనములు ఆరంభమయినయెడల కాడ్‌లివర్ ఆయిల్‌ను నిలుపవలసి యుండును; ఈఆయిల్ అనేకరకములుగ నుండును. డి జాంగ్స్ కాడ్‌లివర్ ఆయిల్ అన్నిటిలోను శ్రేష్ఠమైనదై యున్నది. క్రియసోట్ అను ఔషధము యీ వ్యాధియందు యిటీవల యెక్కువ వాడుకను కలిగియున్నది. దీనిని పాలతో కలిపి పుచ్చుకొనుట బాగుగానుండును. ప్రారంభమునందు 1 మినిముచొప్పున దినమునకు మూడు పర్యాయములు పుచ్చుకొనవలయును. పిమ్మట దీని మోతాదును 2 మినిములకు హెచ్చించి, క్రమముగా 10 లేక 15 మినిములవరకు హెచ్చింపవలయును. ఈ మందు భోజనానంతరము పుచ్చుకొనవలయును. దీనివలన ఆకలి అభివృద్ధి నందగలదు.

క్రియసోట్ లో ఒక భాగమైనట్టి గ్వాయికల్ యును, గ్వాయికల్ కార్బనేటును గూడ, ఈవ్యాధి యందింతను యిటీవల నుపయోగింప బడుచున్నవి. మొదటిది క్రియసోట్ మోతాదులలోనే యియ్యనగును; రెండవది 5 మొదలు 15 గ్రెయినుల వరకగు మోతాదులలో నియ్యవలయును. ఇవి క్రియసోట్ కంటె నెక్కువ విలువ గలవియును, నోటికి రుచికరముగను ఉండును; గుణమునందు సమముగ ఉండినట్లు కనుపడెడు.

వెల్లుల్లికూడ క్రియసోటు వలెనే పనిచేయునట్లు తెలియుచున్నది; దీని వాసనను కొందరు భరింపలేకుందురు. ఇక్ తియాల్ మంచి ఫలితముల నిచ్చినట్లు కొందరు వైద్యశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు కాని, దీనియొక్క అసహ్యమగు రుచియు, వాసనయు, దీనివాడుకను దగ్గించి యున్నవి. ఇది జిగురులలోనికి బోవు వరకును గరగనుండునట్లు గట్టికట్టుతో మూయబడిన మాత్రలుగా వాడనగును. దినమునకు 20 గ్రెయినులు మొదలు 60 గ్రెయినుల వరకు నియ్యవచ్చును.

రొమ్ముపడిసె మొండిన యెడల శ్వాసకోశముల పైన, లినిమెంటే కాంఫర్ అమ్మోనియేటాను గాని, లినిమెంటు టెరిబింత్ అసిటికంను గాని, రాయనగును.

ఆహారము, తేలికయినదియు, బాగుగ పచనమయినదియు, బలము నిచ్చునదియు, అయియుండవలయును. ఇతర ఆహారము కొద్దియై యున్నపుడు, పాలను మెండుగా త్రాగవచ్చును. పైన చెప్పబడిన కాంపవుండు సిరప్ ఆఫ్ హైపోఫాస్ఫేట్స్ ఫెలోస్ ను సేవించుట వలనయే అజీర్ణత సద్దుకొనగలదు. పరిశుభ్రమగు గాలిలో దిరుగుటవలన, ఆకలి బహు ఆశ్చర్యముగ వృద్ధినందును. ఊరుగాయలను చిరితిండి మొదలగు పదార్థములను, వర్జింపవలయును. జాగ్రత్తతో నుండిన భోజన మీవ్యాధియందు మిగుల ముఖ్యమైయున్నది. జ్వరము విడువకుండినపుడు సంపూర్ణమగు విశ్రాంతి అవసరమై యున్నది. సాయంకాలమందు ఒక డిగ్రీమాత్రమే శరీరవేడిమి హెచ్చుచుండినపుడు, మిగుల జాగ్రత్తతో శరీరసాధకమును బుచ్చుకొనవలయును. ఈవ్యాధియందు నడచుట మంచిసాధకముగ నిగ్గయింపబడెను.

దుస్తుల విషయములో, ఫ్లానెల్ దుస్తులను ధరించుట మిగుల మంచిది. ఇవి మిక్కిలి బరువులేకుండ నుండవలయును.

రోగి నివసించియుండు గదిలో పరిశుభ్రమగుగాలి వచ్చుచుండుట యెంతయు ముఖ్యమయి యున్నది.

దగ్గు విషయములో, నిద్రను గలుగజేయు మందులను గాని, కఫహరములను గాని ఉపయోగించగూడదు. మెంతాల్, క్రియసోట్, స్పిరిట్సు ఆఫ్ క్లోరోఫారం — యీ మూడును 100 కి 20 వంతున ఆల్కహాలులో కలుపబడిన సొల్యూషనును వాసన జూచుటవలన నుపయోగముగ నుండగలదు. ఒక పింటు ఉష్ణజలములో ఒక డ్రాము టించర్ బెంజోయిను కోను గలిపిన దానిని వాసనజూచుట వలనను ఉపశాంతిగ నుండగలదు. దగ్గువెంబడి, గొంతుకయందు అడ్డుపడునట్టిగాని, పోటుపొడుచునట్టి గాని అనుభవ ముండినయెడల, గొంతుకపై వేడిపిండికట్టును గట్టుటవలన ఉపశాంతి కలుగగలదు.

దగ్గుయొక్క తెరతో వాంతి కలుగుచు, యది భోజనము వెంటనే కలుగుచుండిన యెడల, లైకర్ పొటాస్ 5 మినిములు, ఆలం (పటిక) 5 గ్రెయినులు, కలిపి, భోజనము నకు కొద్దికాలమునకు పూర్వమే యిచ్చుచుండినయెడల, దగ్గుయును వాంతియును గట్టిపోవును కొన్ని విషయములలో, టింక్చర్ ఓపియంగాని, క్లోరోడీన్ గాని, టింక్చర్ నక్సువామికా గాని, కొద్దిమక్కలను భోజనముకుముందర నిచ్చుట వలన నుపయోగముగ నుండగలదు.

నాలుక పొరగమ్మి, మలబంధ ముండినయెడల, క్యాలోమేల్ (రసభస్మమును)యి య్యనగును. ఇతర విషయములలో కార్మినేటివ్ మిక్స్చర్ ను ఉపయోగింప నగును.

రాత్రిచెమటలకు చికిత్సగా, రోగియొక్క దుస్తులను, రోగి పరుండియుండు గదిలోనికి గాలివచ్చుటను, సరిచేయ వలయును. ఉదయమున గలుగు చెమటను గోరువెచ్చని నీళ్ళతో తుడువవలయును. రాత్రిచెమటలను నిలుపుచేయుటకు 5 గ్రెయినుల జింక్ ఆక్ సైడ్ ను అర గ్రెయిను యక్ట్రాక్ట్ అఫ్ బెలడోనాతో గలిపి మాత్రగాజేసి యియ్యనగును. లైకర్ స్ట్రిక్నీన్ హైడ్రోక్లోర్ ను 5 మినిముల మోతాదులో నిచ్చుటవలనగాని, క్యాంఫారిక్ ఆసిడ్ ను 15 గ్రెయినుల మోతాదులో నిచ్చుట వలనగాని, గుణము నియ్యవచ్చును.

---

## సప్తదిన జ్వరము (Seven-day Fever)

ఇండియాదేశమునందును బర్మాదేశమునందును సముద్రతీర పట్టణములందు అచ్చటచ్చ ట ఈజ్వరము కలుగుచున్నది. కలకత్తా,మద్రాసు,బొంబాయి,రంగూన్ పట్టణములందు ఈ జ్వరము సామాన్యముగ గలుగుచున్నది. ఈవ్యాధియందు శరీరవేడిమి అకస్మాత్తుగ అభి వృద్ధినంది, పోచ్చుదలతో ప్రారంభమగుచు, పిమ్మట తగ్గుదలనందుచు, యీస్థితిమారుగ నేడుదినములవరకు వ్యాపించి, వేడిమికి దగినట్లుగ నాడితీవ్రత నందక, ఉద్రేకమగు తలనొ ప్పి వెన్నుపోటులతో గూడియుండును. రక్తమునందు శ్వేతకణములు తగ్గుదల నందును. ఈ వ్యాధి ఇండియనులయందు కంటె నైరోపియనులయం దెక్కువ సామాన్యమై యున్నది. రేవు పట్టణములయందు పనిచేయువారలలో నీవ్యాధి ప్రారంభమై జనవ్యాప్తి నందుచున్నది. ఇతర స్థలములనుండి వచ్చువారలు యీవ్యాధి కెక్కువ శీఘ్రముగ లోనగుదురు.

### లక్షణములు.

ఈవ్యాధి, విశేష విషయములలో వణకుదలలతో గూడి, అకస్మాత్తుగ ప్రారంభమ గును. ముఖము యెర్రబారి, తలయందు నుదురుపైపుల నెప్పియును, వెన్నుపోటునుకుండి, ముఖవైఖరియందు నిర్లక్ష్యభావమును మాంద్యతయును గనిపించును. నాలుకపైన పొరగమ్మి యుండి, కొనలు కూత్రము చెరుర్రగనుండును. వాంతి వచ్చునట్లుండుట గాని, వాంతి కలుగుట గాని, కలుగ నేరదు. ఒడలుపైన నేవిధమగు పొక్కులును గనిపించవు. కారిజము గాని, ప్లీహ గాని అభివృద్ధినందవు. ఉదర భాగము విస్తరింపునది, ఒకానొకప్పుడు స్పర్శకు మృదువుగ నుండును.

రెండవ దినమున శరీరవేడిమి సామాన్య శీఘ్రగతిని 102 లేక 103 డిగ్రీలకు అభివృద్ధినంది, పిమ్మట 100 డిగ్రీలకు తగ్గి, కొద్దిదినములు 100 డిగ్రీల సమీపప్రాంతముల సంచలించుచు అయిదవ లేక ఆరవదినమున 103 డిగ్రీలకు హెచ్చునల కనుగుణ్యముగ నాడియొక్క తీవ్రత కనుపించదు. నాడి నిమిషమునకు 100 దెబ్బల కంటె నెప్పుడును సామాన్యముగ హెచ్చదు. శరీరవేడిమి 100 మొదలు 103 డిగ్రీలవరకు నున్నతస్థితిలో నాడియొక్క సంఖ్య సామాన్యముగ 60 మొదలు 70 వరకు నుండును. శరీరవేడిమి సామాన్యస్థితికి దిగినపిమ్మట రోగి శీఘ్రముగనే కుదిరిక నందగలడు. ఈవ్యాధి తిరుగబెట్టుట అరుదైయున్నది. తక్కిన కొన్ని అంటు వ్యాధులవలెగాక దీనియొక్క వ్యాప్తత నెమ్మదిగా గూడియుండును. ఈవ్యాధియందు జీర్ణకోశాస్వస్థతలు కలుగవు. క్వినీన్ పుచ్చుకొని నందువలన వ్యాధియొక్క నడకయం దేవిధమగు మార్పును కలుగనేరదు.

## చికిత్స.

జ్వరముయొక్క ప్రారంభ గతియందు రోగి పరుండుట కారంభించి, శరీరవేడిమి సామాన్యస్థితికి దిగునంతవరకును పరుండియే యుండి, పాలను ఆహారముగ బుచ్చుకొనవలయును. జ్వరగతియందంతటను సామాన్యమగు జ్వరమును తగ్గించుమందును దేనినైనను యియ్యవలెను. శరీరవేడిమి 104 డిగ్రీలకు మించినయెడల చల్లని నీళ్లలోగాని గోరువెచ్చని నీళ్లలోగాని స్పంజిని ముంచి శరీరమును దుడువవలయును. శరీరవేడిమి 105 డిగ్రీలకు మించియున్నపుడు చల్లని నీళ్లలో స్నానమును జేయుట వలనగాని, తడిగుడ్డలను శరీరమునకు జుట్టుట వలనగాని, శరీరవేడిమిని తగ్గింపవలయును.

## కాలా అజార్ Kala Azar

ఈవ్యాధి ఇండియా దేశమునందును, సింహళమునందును, బర్మాయందును యనేక భాగములలో వ్యాప్తతనంది యున్నది. కలకత్తాయందును, చెన్నపట్టణము నందును, యీపట్టణములకు సమీపమునందును, యీవ్యాధిని గనుగొననగును. శరీరమునందలి ప్లీహము, కాలిజము, మేదస్సు సంబంధమగు గ్రంధులు, రక్తనాళములు, రక్తము---విటిలో స్థిరమైనయీ సంబంధమగు జీవాణువులచే నంటుదల నందుటచే నీవ్యాధి ప్రవేశించుచున్నది. ప్లీహయును కాలిజమును అభివృద్ధినందుట, క్రమముదప్పి అప్పుడప్పుడు జ్వరమువచ్చుచుండుట, పాలిపోవుట, ముఖమునందలి వర్చస్సు తగ్గి నల్లబడుట, రాత్రిచెమటలు, ఆమ విరేచనములు లేక అతి విరేచనములు కలుగుట--- యీ లక్షణములతో గూడియుండును. ప్రారంభమునందు యీవ్యాధి చలిజ్వర లక్షణములనే వహించి యుండునుగాని రక్తమునందు మాత్రము చలిజ్వర సంబంధమగు జీవాణువు లుండనేరవు.

ఈవ్యాధిని శరీరమునందు బ్రవేశపెట్టుటకు మార్గము, మంచములను పరుపులను ఆశ్రయించియుండు నల్లులవలన గలుగుచున్నదని కొందరి వైద్యశాస్త్రజ్ఞుల అభిప్రాయమైయున్నది. ఒక విధమగు దోమలవలనగూడ గలుగుచున్నదని యిటీవల కొందరు అభిప్రాయ పడుచున్నారు.

ఈవ్యాధి ఒకరినుండి మరియొకరికి వ్యాప్తత నందుటయందు గొంత కాలము పట్టును. ఒక్కొకప్పుడు కుటుంబమునం దంతటను వ్యాపించును. బీదవారలయందును పరిశుభ్రతను గమనించని వారియందును విశేషవ్యాప్తత నందును. ఋతువు ననుసరించి యుండదు. ఈ వ్యాధి అనుసరించియున్న గృహము నుండి దగ్గర గృహములకు వ్యాధి వ్యాప్తతనందును.

ఈ సంబంధమగు పురుగు శరీరమునం దావహించినది మొదలు వ్యాధి పక్వమునందు వరకు మూడు వారములు మొదలు కొన్ని మాసముల వరకు పట్టును.

ఈ వ్యాధియందు మరణములు 100 కి 98 చొప్పున నున్నవి. అన్ని వయస్సుల యందును అన్నిజాతులయందును స్త్రీపురుషులకు వివక్షతలేకుండ గలుగుచుండును.

లక్షణములు.

ముఖ్యలక్షణములు, జ్వరమును, ప్లీహయొక్కయును కారిజము యొక్కయును అభివృద్ధియును, అయియున్నవి. క్రమక్రమముగ ప్లీహ ఉదరభాగమునందు సగము వరకుగాని అంతకుక్కుడుగ గాని ఆవరించియుండును. జ్వరము సామాన్యముగ క్రమతప్పి వచ్చుచుండును. కాని యొకప్పుడు అనుదినమును రావచ్చును; లేక క్రొత్తవిధముగ వచ్చినను రావచ్చును. మరియొకప్పుడు కొన్ని వారములవరకును గూడ జ్వరము రాకుండగనే యుండవచ్చును. ఇంకొకప్పుడు చలితో ప్రారంభమయి చలిజ్వరమును బోలి వచ్చి చెమ్మట పోవుటయును గలుగవచ్చును. ఈ జ్వరమునందు క్వినీన్ ఉపయోగింప జాలదు. వ్యాధియందంతటను క్రమతప్పిన జ్వరము వచ్చుచునే యుండును. శరీరవేడిమి 101 మొదలు 103 లేక 104 డిగ్రీలవరకు నుండును. వ్యాధి అతిశయత నందినపుడు అతివిరేచనములు గాని అమ విరేచనములు గాని కలుగ వచ్చును. విరేచనమునందు రక్తమును చీమును ఉండును.

రక్తము చెడిపోయి రోగి పాలిపోవుట అధికమైన కొలదియు ముక్కువెంబడి రక్తము కారుట ప్రారంభమగును: పాదములకు నంజు కనబడును. శ్వాసయందు అయాసము కలుగును. ముఖము నల్లపడును; శరీరమంతయు కుషిక్కుంచును. రోగి మంచము నంటియుండి క్రమముగా క్షీణించి మరణము నందును. వ్యాధి కొన్ని మాసములవరకు గాని, ఒకప్పుడు ఒకసంవత్సరము నకు మించి గాని, వ్యాపించియుండును. వ్యాధిని స్పష్టముగ గుర్తించుటకు మార్గము రక్తమును సూక్ష్మదర్శిని యంత్రము క్రింద బరీక్షించుట వలనదై యున్నది.

ఈవ్యాధికిని చలిజ్వరమునకును భేదముండియున్నను యొక్కొక్కప్పుడు యీరెండు యొకేసారిగ దటస్థింప వచ్చును.

చిక్కుస్థితులు.

వ్యాధియొక్క గతియందు అనేక చిక్కుస్థితులు సంభవింప వచ్చును. రక్తము గక్కుట, ప్రేగులనుండి రక్తస్రావము, ముక్కునుండి రక్తము స్రవించుట, అతివిరేచనములు, అమ విరేచనములు, రొమ్ముపడిసెము, న్యుమోనియా—యివి యన్నియు చిక్కుస్థితులు గా నెన్నవగును.

రక్తముయొక్క స్వభావమంతయు మారిపోవును. రక్తమునందలి శ్వేతకణములు తగ్గిపోవును. రక్తమునందలి యెర్రనికణములు గూడ తగ్గుదల నందును.

### చికిత్స.

ఆరంభమునందు బలమునిచ్చు ద్రవాహార పదార్థము లియ్యవలయును. పిమ్మట మామూలు ఆహారముతోఁగూడ విశేషముగ పాల నియ్యవలయును. స్ఫోటయును కారిణమును అభివృద్ధి నందినపుడు కొంతకాలమువరకు లవణ సంబంధమగు విరేచన కారకముల నియ్యవలయును. వ్యాధియందంతటను బలవర్థకౌషధముల నియ్యవలయును. కాని ఆయా సందర్భముల యందలి లక్షణముల ననుసరించి చికిత్స చేయవలసి యుండును.

ఇంతవరకును దినము ఒక్కింటికి 60 మొదలు 90 గ్రెయినులవరకు క్వినైను యిచ్చుటవలన మంచి ఫలితముల నందినట్లు తెలియుచున్నది. శరీరవేడిమి బాగుగ తగ్గుదల నందువరకును యీప్రకార మియ్యవలయును. పిమ్మట ప్రతి ఉదయమునను 20 గ్రెయినుల నియ్యవలయును. ఈ చికిత్సాపద్ధతివలన యీ వ్యాధియందలి మరణములు 100 కి 98 నుండి 70 వరకును తగ్గినట్లు వినుచున్నాము. ఆర్సెనిక్ (పాషాణము) నిచ్చుటవలన గూడ వ్యాధి యొక్క దీర్ఘగతిని తగ్గింపవచ్చునని తెలియుచున్నది.

నల్లుల వలనయును దోమల వలనయును యీవ్యాధి వ్యాప్తత నందుచున్నటుల తెలియుచున్నది. గనుక నల్లులను జంపుటకు వీలుగనుండునట్లు ముక్కలుగ నూడదీయుట కనువగు మంచముల నుపయోగింప వలయును. దోమలనుండి కాపాడుకొనుటకు దోమ తెరల నుపయోగింప వలయును. ఈవ్యాధి వ్యాప్తతనందియున్న ప్రదేశములయం దీవ్యాధినుండి కాపాడుకొనుటకు యీపద్ధతుల నవలంబించుటవలన జాలవరకు ప్రయోజనకారిగ నుండ గలదు.

---

## హార్పిస్ Herpes. (చెల్లి)

చెల్లిలో వివిధము లున్నవి. చర్మముపైన పొక్కులవలె లేచుచు, జ్వరవ్యాధుల యందు గాని, సామాన్యముగ జలుబువ్యాధి అనంతరము గాని, పెదవులపైన చిన్న పొక్కులు లేచును. ఈపొక్కులు ఒకటి రెండు దినములనుండి పక్కులుగట్టి యూడిపోవును. పక్కులు యూడినపిమ్మట కొంచెము దురద కలుగవచ్చును.

ఇదిరెండవ విధమైన పక్కులు పది లేక పంద్రెండు నుదుటిపైన నొకప్పుడు కలుగ వచ్చును. ఇవి యెక్కువ పోటుతో గూడియుండును. ఒకఔన్సు రెక్టిఫయిడ్ స్పిరిట్‌ను, 5 గ్రెయినుల హారతి కర్పూరమును, 5 గ్రెయినుల కాపిలపొడి (కమల)ని, గలిపి పైనరాసినయెడల పక్కులుగట్టి త్వరలో మానుదల నందునని బాల్ఫరుగారు చెప్పుచున్నారు.

మూడవ విధమైనది, ఉదరమునకు క్రింది భాగమున ఒకప్రక్కన మాత్రమే కలుగు చుండును. ప్రారంభలక్షణము పోటుతో గూడియుండును. ఉద్రిక్తమగు విషయములలో మాత్రమే జ్వరలక్షణముతో గూడియుండును. రెండు లేక మూడవ దినముల పిమ్మట గుబురులుగా పొక్కులు యేర్పడును. ఈ పొక్కులు మొదటగా మొదలియందుండి క్రమముగా తెల్ల

బడి, పిమ్మట చీముపట్టి, అనంతరము పక్కులుగట్టి ఊడిపోవును. సామాన్యముగా యీ పొక్కులు రెండువైపులను కలుగవు కాని, ఒకవైపునకు మించి యీపొక్కులు కలిగిన విషయములును గ్రంథస్థములై యున్నవి. ఈపొక్కులు శీఘ్రముగ పగులనేరవు. వాటంతట అవియే ఏడునుండి పదిదినములలో పక్కులు ఊడిపోవును. ఒకప్పుడు పగులుట తటస్థించినయెడల పుండ్లుపడి మానుగల నందిన పిమ్మట మచ్చలు పడును. ఈవ్యాధివలన బాధ ఉదృతముగా నుండును. నరములసంబంధమగు పోటు పొడుచుచుండును ఈపోటువలన బాధను సహింపజాలక ఒక రోగి ఆత్మహత్యను గావించి యుండెనని గవర్సు అనునాయన చెప్పుచున్నాడు.

## చికిత్స.

మొదటి రెండు విధములకును చికిత్స ఆసందర్భముననే జెప్పబడి యుండెను. మూడవ విషయములో పక్కులు పగులకుండునట్లు జాగ్రత్తను బుచ్చుకొన వలయును. ఆరంభమునం దైనయెడల ఫ్లెక్సిబిల్ కలోడియం (Flexible Collodium) గుణమియ్యగలదు. పటిక నీళ్ళను (1 వ గండూషము) పైన రాయవచ్చును. చీము పట్టినయెడల సేలిసైలిక్ ఆసిడ్ నద్దవలయును. బాధ ఉదృతముగా నుండిన యెడల యెలెక్ట్రిక్కు బ్యాటరీని దినమునకు రెండుసారులు ప్రయోగించుట వలన గుణముగా నుండగలదు. విరేచనము క్రమముగా నగు నటుల జూడవలయును. తేలికగా జీర్ణమగు ఆహారపదార్థములను యియ్యవలయును.

---

## తెల్లని బొబ్బలు (Contagious Impetigo)

చర్మముపైన గుండ్రనైనట్టియు, ఉబ్బుదలనందు నట్టియు, చీముతోగూడి యుండు నట్టియు, లోతుగ లేకుండ పైపైన మాత్రమే అస్వస్థతతో గూడినట్టియు బొబ్బలు లేచును ఇది శీఘ్రముగనే అరుదలనంది పసుపువర్ణమును వహించిన పల్చని పక్కులుగట్టును. ఇవి సామాన్యముగ ముఖముపైనయును, చేతుల పైనయును లేచును; పేదవారల బిడ్డలకు యీవ్యాధి ముఖ్యముగ గలుగుచుండును. ఈబొబ్బలు పావులా సైజునగాని అంతకు పెద్దవిగయే గాని యుండును. వీటిలో గొన్ని కలిసిపోవుటచే నొకే అట్టగా గట్టవచ్చును. కొన్ని దినముల వరకును క్రొత్త బొబ్బలు కనపడుచు చిట్టచివరకు వాటంతట అవియే పక్కులుగట్టి ఊడిపోవును. పక్కులు ఊడిపోయిన పిమ్మట చర్మము కొంచెము యెర్రగానుండి యీ యెరుపు దానంతట అదియే అంతరించిపోవును. ఈవ్యాధియందు సామాన్యముగ జ్వరము కలుగదు దురద యొకప్పుడు ఉండినను, వుండును. లేదా లేక పోవచ్చును.

ఈవ్యాధి మిగుల అంటుదలతో గూడియుండును. ఒక పొక్కులోని చీము మరియొక చోటున దగులుటవలన వ్యాధి వ్యాప్తినందును. ఒకప్పుడు ఒకయింటిలోని బిడ్డలకు ఒకరి నుండి మరియొకరికి వ్యాప్తి నందగలదు.

పరిశుభ్రతను గమనించు విషయములలో కొద్దివారములలో నీవ్యాధి దనంతట అది

రేమ సమసిపోవును. దురదతోగూడిన విషయములలో మాత్రము మానుటకు యెక్కువ దినములు పట్టును.

### చికిత్స.

అస్వస్థత భాగములనన్నిటిని సబ్బు నుపయోగించుచు వేడినీళ్ళతో కడుగవలయును. 15 గ్రెయినుల అమ్మోనియేటెడ్ మెర్క్యురీని 1 ఔన్సు లానొలీనులో గాని వాసలీనులో గాని కలిపి యీ ఆయింటుమెంటును అస్వస్థత భాగములపైన రాయవలయును. పరిశుభ్రతను విశేషముగ గమనింప వలయును.

---

## నల్లని మచ్చలు (Pitriasis Nigra)

ఇండియా దేశమునందు సామాన్యముగ నన్ని భాగములయందును ఇండియనులలో పెద్దవారలయందు యీవ్యాధి వ్యాపకమునందును, మెడమీదనయును, వీపుమీదనయును, చంకలలోను, గుండ్రనైనట్టియు నల్లనైనట్టియు మచ్చలు యేర్పడును. ఈస్థలములయందు దురదయుండదు గాని, చూచుట కసహ్యముగ నుండును; చికిత్స చేయక పోయినయెడల కొన్ని మాసముల వరకును ఒకప్పుడు కొన్ని సంవత్సరముల వరకును, వ్యాపించి యుండును. ఈమచ్చలు ముఖముపైన బహు అరుదుగా గలుగును. ఈమచ్చలు ఒక సంబంధమగు పుట్టగొడుగు జాతి క్రిమిజాలములవలన గలుగుచుండును. ఈపురుగుల నంటి సన్నని దారములవలె నుండును; ఈ దారములవలె నుండు కొనలయందు నల్లని వర్ణముండును.

ఈక్రింది ఔషధయోగమును దినమునకు రెండుసారులు రాయవలెను.

| | | | |
|---|---|---|---|
| ఇక్తియాల్ | ... | ... | 10 గ్రె॥ |
| గంధకము | ... | ... | 10 గ్రె॥ |
| లానొలీన్ లేక వాసలీన్ | ... | ... | అర ఔన్సు. |

---

## ఒళ్ళు పట్టుట – Massage. (మెసాజ్)

భారత దేశమునందు ఒళ్ళుపట్టుట యొక్క విధమగు చికిత్సాపద్ధతిగ చిర కాలమునుండి యుంచబడు చున్నది. ఈ వైద్య సంబంధమగు కసరత్తులు అనాదిగ హిందువులలోను చీనా దేశీయులలోను మాత్రమే గాక గ్రీకులలోను రోమనులలోను గూడ వాడుకయందుండియున్నవి. 1723 సం॥ ప్రాంతములనే యీవైద్యపద్ధతి ఇంగ్లాండునందు వ్యవహరింపబడెను గాని 19 వ శతాబ్ద ప్రారంభమునగాని డెన్మార్కు దేశములో కీళ్ళనొప్పి, నాడీవ్యాధి, నడుమునొప్పి, మొదలగు వ్యాధులకు యీ చికిత్సాపద్ధతి అనుచరణీయం యుండలేదు. ఈ "మెసాజ్" పద్ధతిలో శరీర సాధకమును రోగి తనంతట తాను చేయుటకు బదులుగా మరియొకరు తన శరీరముపై పనిచేయుట లక్ష్యించుచున్నది. బెణుకులు, కీళ్ళవాపులు, కీళ్ళు బిగుసుకొని పో

పుట, నరముల సంబంధమగునట్టియు అజీర్ణ సంబంధమగునట్టియు అస్వస్థతల యందును, మలబద్ధము నందును, వెన్నెముక వంకరతిరిగిన సందర్భములందును, యీ చికిత్సా పద్ధతులుపయోగించు చున్నవి.

ఈ ఒళ్ళు పట్టుటయొక్క యుద్దేశము — (1) శరీర మంతటియొక్క గాని లేక శరీరముయొక్క యే ప్రత్యేక భాగముయొక్కగాని పోషణమును బలపరచుటయును, (2) వ్యాధివలన శరీరముయొక్క యే ప్రత్యేకస్థానమునందైనను కలిగిన వాపులను, ఫలితములను, తొలగించెడి కార్యక్రమములం దధికోద్రేకతను గలిగించుటయు — అయియున్నవి. ఇదిగాక యిందుమూలమున స్నాయువులయొక్క ముడుచుకొనుశక్తి ఆదివరకు నశించియుండినయెడల మరల స్వస్థపడుచ బడును.

శరీరముపైన రుద్దినగాలి మెల్లగా చేతితో దుర్వినగాని రక్తప్రచారమునందు వెంటనే మార్పు గనిపించుచున్నది. చేతివ్రేళ్ళు చర్మముపైన కొంతబలముతో నొత్తిపెట్టి మెల్లగా నడిపినచో రక్తనాళములయం దుండెడి రక్తము ముందుకుపోయి మరల నాయొత్తిడిని తీసివేయగనే రక్తము తొందరగ వెనుకకుతిరిగి ప్రవహించుచున్నది. ఈ చురుకుదనమే రక్తప్రచారమునకు సహాయ మొనర్చుచున్నది. ఈ ఒడలు పట్టుటలో నెప్పుడును చేతుల నుండి గాని కాళ్ళనుండిగాని రక్తప్రవాహము గుండెవైపునకు బోవుటకు సహాయమును నొనర్చుటలయందును గాని యిందుల కెదురువైపుగా నీ చేతులతో బనిచేయరాదు. ఇటుల క్రమమార్గమున నొత్తుటమూలమున పైవిధమంగ రక్తప్రచార మధికమగుచున్నది. ఇందు మూలమున మేదోనాళముల యందలి వ్యర్థపదార్థములు గూడ వెలువరింప బడుచున్నవి. చర్మమును బొటన వ్రేలునకును చూపుడు వ్రేలునకును మధ్య గట్టిగా బట్టుకొని మెలివేసినయెడల నీ రక్తప్రచార మధికమగుచున్నది. చేతితోగాని వ్రేళ్ళతోగాని చరచినయెడల రక్తప్రచారముయొక్క చురుకుదన మధికమై ఆస్థాన మెరుపెక్కును.

గుద్దుటవలన నంతగా లాభముండనేరదు. ఈయొడలు పట్టు పనిలో నేర్పరియగువాడు ఎచ్చటు వాపుదల లున్నదియు తాకుటవలని దెలిసికొనగలడు. ఇందు — దువ్వుట, తోముట, పిసుకుచు నొక్కుట, గిల్లుట, ఒత్తుట, పిండుట, చిందరవందరగా నొట్టుట — యిన్ని విధములగు పద్ధతులు గలవు. ఈపద్ధతులన్నియు శరీరమర్దన మునకు సంబంధించియే యున్నవి. అంతరా భయమములయొక్క అల్లికలపై బనిచేయ వలయునన్న యెక్కువ బలము నుపయోగించ వలసియుండును; పాదముల యొద్దనుండి ప్రారంభించి క్రమముగా కాళ్ళవైపునకు రాయవలయును. పిక్కలయొద్ద రెండుచేతుల నుపయోగించవలసి యుండును.

శరీరమునందలి ప్రతిభాగమునకును ఈపద్ధతి నుపయోగింప వచ్చును, పొత్తికడుపు పట్టుటలో మొదట చర్మమును గిల్లుచు, పిమ్మట స్నాయు పరికరమును చేతులలో గుండ్రముగ ద్రిప్పుచు, పొత్తికడు పంతయు గదలునట్లుగ చేతులను త్వరితగతిని పేగులవైపులకు దీసికొని పోవలయును. ఈ కార్యక్రమమునం దెప్పుడును రోగి కే విధమగు బాధయును కలుగగూడదు. జీర్ణాశయము, కార్జము, పేగులు వీనియొక్క అస్వస్థతలయందును, అతిమూత్రమునందును, స్నాయువులయొక్క పక్షవాత స్థితియందును, యీ చికిత్సాపద్ధతి యుపయోగించునట్లు కనబడుచున్నది.

కాలుయొక్కగాని చెయ్యియొక్కగాని యెముక తొలగినప్పుడు గాని, విరిగినప్పుడు గాని, కొయ్యబద్దలతో గట్టి కొంతకాల ముంచి మరల బయటికి తీసినప్పుడు యీ "మెసాజ్" పద్ధతి నుపయోగింప వలసియుండును. ఇందుమూలమున నా అవయవము త్వరలో స్వాధీనమునకు రాగలదు. ఈచికిత్సా పద్ధతి పైవ్యాధులయందు చిన్నవయస్సువారి కెక్కువ యుపకరించును. ఈ చికిత్సామార్గమున రక్తప్రచారమే గాక నరములయొక్క స్వస్థతకూడ సరిచేయబడును. ఆంధ్రదేశమునందలి ఓఢ్రమంగలివారలీ చికిత్సాపద్ధతిని గొంతవరకు దెలిసి నట్లు గనబడుచున్నది. మళయాళ దేశమునందు యీ చికిత్సాపద్ధతి యెక్కువ వాడుకలో నున్నది. ఈపని చేయునప్పుడు చేతులం పట్టునకు వీలుగా నుండును.



# ఆంగ్లేయ వైద్య చింతామణి

## ఔషధ మిశ్రిత పద్ధతులు-ఔషధ యోగములు.

### కంపౌండింగ్ Compounding.

ఈ సందర్భమున నౌషధములను మిశ్రమము జేయు విషయమై కొంచెముగా జెప్ప దగియున్నది. దీనికి ఆంగ్లేయ భాషయందు కంపౌండింగు అందురు. ఈపనిని బహుజాగ్రత్త తోడను జేయుటయే గాక, తూనికయందు గాని, కొలతయందుగాని, కొంచెమైనను హెచ్చు తగ్గులు లేకుండగ నౌషధముల సేకరించుటయు ముఖ్యమై యున్నది. ఈపనిని జేయునప్పుడు పరధ్యానము లేకుండగ బహు శ్రద్ధాభక్తులను వహించియుండవలయును. ఏలనన, నొకవస్తువు నుపయోగించుటకు బదులుగ నింకొక వస్తువు నుపయోగించిన రోగుల ప్రాణాపాయము దటస్థించుటయు గలుగును.

### తూనిక.

ఔషధములను దూచుటయందు బహు ఖచితముగా నుండవలయును. ఒక ఔన్సు నకంటె నెక్కువగ దూచుట యెన్నడును సామాన్యముగ దటస్థించదు. కొన్ని విషయముల లో డ్రాములవరకు మాత్రము దూచుటయును, మఱికొన్ని విషయములలో గ్రెయినులవరకు మాత్రమే దూచుటయును, దటస్థించుచున్నది. ఈతూనికకొఱకై మధ్యస్తంభమును గలిగి యుండి యొకవైపున గాజుపళ్లెము గలిగియుండిన త్రాసును సంపాదించియుండుటమంచిది.

ఈ గాజుపళ్లెము యొక్క ముఖ్యతయేమనగా ద్రవపదార్థముల దూచినను మాలిన్య మేర్పడజాలదు. మందులను వేయుటకు గాజుపళ్ళెరమును, తూనికరాళ్ళను వేయుటకు రెండవదైన యిత్తడి పళ్ళెమును నుపయోగింప నగును. ప్రతి తడవయును తూనిక అయిన పిమ్మట రెండుపళ్ళెములను శుభ్రముగా గుడ్డతో తుడిచివేయుట మిగుల మంచిది. ఇందు వలన త్రాసునందు హెచ్చుతగ్గు తూనికలు రాకుండగ జాగ్రత్తగ జేయుటకువీలుగనుండును.

రెండు గ్రెయినులకు లోపుగ దూచనగు అభిని (Morphine) విషముష్టి (Strychnine) మొదలగు బలీయమగు ఔషధముల దూచుటకు బహు సున్నితమైన వేరుత్రాసు నుపయోగించుచు, డ్రాములను దూచుట కుపయోగించు త్రాసునే యీమందుల కుపయోగింపకుండ నుండవలయును.

### కొలత.

ఔషధములను గొలుచుట తేలికయే గాని, తక్కిన వాటియందువలె దీనియందును జాగ్రత్తయు నలవాటును నుండవలయును. ఈకొలతలు గుర్తు పెట్టబడిన వివిధాకారములు

గల గాజుకొలతలు అమ్మబడును. ఈకొలత గుర్తులను సూచించు గీతలు రెండు వైపులను అనగా ముందువెనుకవైపులను వేయబడి యుండవలయును. కొలగ్లాసును యెడమచేతియొక్క బొటన వ్రేలునకును పిమ్మట రెండువ్రేళ్ళకును మధ్యగా బట్టుకొని, కంటితో సమానమైన యెత్తునకు దీసికొని రావలయును. దేనినుండియైతే మందును బోయవలయునో ఆబుడ్డిని కుడి చేతితో బట్టుకొని, దానియొక్క మూతను యెడమచేతి చిన్నివ్రేలితో బట్టుకొని యుండ వలయును. ఈమూతను (కార్కు) ఈప్రకారము బట్టుకొనుటకై కొంతవరకు అలవాటు కా వలయును. గాన అట్లు చేయుటలో జారిపడి దానిని బగులగొట్టు అపాయమునుండి తొల గుటకు గాను, కొలుచునప్పుడు దానిని విడిగా నుంచుటయే యత్నము.

కొలతను సరిగా గుర్తించుటకు గాను ముందు వెనుకవైపుల గుర్తులకు రెండు వైపు లను లోని ద్రవపదార్థము సమానపు ఎత్తుగ నుండునటుల జూచుకొనవలయును. డ్రాము లను గొల్చుటకు పెద్దదైన ఔన్సు కొలగ్లాసు ఉండును. మినిములను గొల్చుటకు చిన్నదైన డ్రాము కొలగ్లాసు ఉండును. ఔన్సు కొలగ్లాసులో మినిములను గొల్చుట కుపయోగింప గలదు. ఇట్లు చేయుటలో ఖచితమైన కొలతకు భంగము కలుగుట తటస్థించును.

## మిశ్రితౌషధములు Mixtures.

మిశ్రితౌషధములను జేయుటయందు నియోగింపబడిన ఔషధములను కొల్తల ప్రకా రము ఒక పెద్దబుడ్డిలో గలుపుటయే అయియున్నది. కాని దీనిని పద్ధతి ప్రకారమును, బహు మెలకువతోడను జేయవలసియుండును. విశేషమైన యనుభవ ముండిననేతప్ప, నియో గింపబడిన ఔషధముల బుడ్లనన్నియు నొకచోట బెట్టుకొని క్రమప్రకార మొక్కొక దాని నుండియే వలసినదానిని గైకొనిన పిమ్మట యే మందు బుడ్డి దానిని స్థానమందుంచవలయును.

మిశ్రితౌషధములను చేయుటయందు క్రమము యేమనగా:— టింక్చర్లను గాని యి తర ద్రవపదార్థములనుగాని ముందుగా కొలచి, మందును బోయుటకు యేర్పడిన సీసాలో బోయవలయును. వీటిని ముందుగా గలిపి షరబత్ (syrup) వగైరాల చేరయినను కలు పుట అవసరమున్నచో పిమ్మట గలిపి, చివరగా నవసరమగు నీటినిగాని కషాయమును (Infusion) గాని కలుపవలయును. ఎక్కువ నీటిలో విడివిడిగా నీయౌషధములను గలు పుటకంటె పైపద్ధతి ప్రకారము చేయుట మంచిది. ఒకయౌషధయోగము (Prescription) నందు, 8 ఔన్సుల మిశ్రితౌషధమునకు రెండు ఔన్సుల టింక్చరులును, ఒక ఔన్సు జిగురు (Mucilage)ను 5 ఔన్సుల జలమును, నియోగింపబడి నయెడల, టింక్చర్లకు ముందుగా నీ జిగురును గలిపినయెడల నంతయు ముద్దయగును; అట్లు గాకుండునటుల నీటిని గలిపిన పిమ్మట నీ జిగురును చివరగా గలుపవలయును. లేదా, యీజిగురును అవసరమగు నీటిలో గలిపియుంచుకొని, అట్టి నీటిని యీటింక్చర్లను గలుపవలయును. ఇట్టి వేరు నితర బాధక మేదయినను, దటస్థించినచో సామాన్యజ్ఞానము వలనను అనుభవము వలనను గ్రహించి ఏర్పాటు చేసికొనవచ్చును. ఒక్కవిషయము మాత్రము, బహుజనులు అశ్రద్ధచేసెడిదైనను జాగ్రత్తను వహించవలసిన యంశమై యున్నది. మిగుల విషపదార్థమైన దానిని, అనగా

(Aconite) పాషాణము, (Arsenic) విషముష్టి (Strychnine), ప్రూసిక్ ఆసిడ్ (Prussic Acid) మొదలగునవి ఔషధ యోగమునందు నియోగింప బడినయెడల వీట్ని జవరగా చేర్చుటను ముఖ్యమాత్రముగా బెట్టుకొనవలయును. ఇట్లు చేయుటవలన నీయౌషధములను పొరబాటుగా నైనను రెండుసారులు చేర్చుట తప్పిపోవును. ఇట్టిది ఒకటికి రెండు సార్లు చేసినయెడల ప్రాణాపాయము తటస్థించును. అన్ని మిశ్రితౌషధములను జవరకు బాగుగ గలపబడుట మంచిది.

---

బిస్మత్ సబ్నైట్రస్ (Bismuth Subnitras) మొదలగు కొన్ని వస్తువులు నీటిలో గలువవు. అట్టివాట్ని నీటితో చేర్చి, జిగురుతో గలిసిన నీళ్ళను బోసి మార్టర్ (రాతిరోలు) లో గలియబెట్టినయెడల గలిసిపోవును.

## జలము.

మిశ్రితౌషధములయం దుపయోగింపబడు జలము, ఆవిరి చల్లార్చబడి చేయబడిన దైన యెడల శ్రేష్ఠము. అట్టిది వీలుకానియెడల సామాన్యముగ త్రాగెడినీటిని మసలగాచి చల్లార్చి ఉపయోగింపవచ్చును. ఇట్లు మసలగాచుటవలన నందలి జంతు జాలము లన్నియు నశింపు నందును.

## మోతాదు.

ఈ గ్రంథమునందలి మోతాదు ఇంగ్లాండు దేశమునందు సర్వజనులకు ప్రమాణ గ్రంథమగు "బ్రిటిషు ఫార్మకోపియా" ననుసరించి వ్రాయబడినవి. ఈ ఫార్మకోపియాతో సంబంధించని కొద్దిపాటి యితర ఔషధములకు నితర ప్రమాణ గ్రంథములను బట్టి మోతాదులు యేర్పరచబడినవి. ఇందలి మోతాదులు సామాన్యగతులయందు, పెద్దవాళ్ళకు యేర్పరుపబడి యున్నవి. శరీరతత్వమును, ఇతర సందర్భములను అనుసరించి మోతాదులందు నావశ్యకమగు కొద్దిమార్పులను జేసికొనినను జేసికొన వచ్చును. పటిమ తక్కువ వారికిని, దుర్బలులకును, పసివారలకును మోతాదులు తగ్గించవలసి యుండును. సుకుమారులగు స్త్రీలకును అదేప్రకారము మోతాదును తగ్గించవలసి యుండును.

---

డాక్టరు యంగ్ గారియొక్క పద్ధతినిబట్టి నిర్మితమైన మోతాదును

$$\frac{\text{రోగియొక్క వయస్సు}}{\text{రోగియొక్క వయస్సు} + 12}$$ చే గలిగిన భిన్నము ప్రకారము అసలు మోతాదునందు భాగము నేర్పరచి యియ్యవలయునని స్థిరపరచి యున్నారు. ఎట్లనగా వయస్సునకు 1 గ్రయిను మోతాదుగ నేర్పరుపబడిన ఔషధము, యీక్రింది ప్రకారము వయస్సుబట్టి మోతాదును స్థిరపరుప నగును.

| | | | |
|---|---|---|---|
| 1. సంవత్సరము వయసుగల బిడ్డకు | | $\dots\frac{1}{1+12}=\frac{1}{13}$ | గ్రెయిను |
| 2. సం॥ ల | ” | $\dots\frac{2}{2+12}=\frac{1}{7}$ | ” |
| 3. సం॥ ల | ” | $\dots\frac{3}{3+12}=\frac{1}{5}$ | ” |
| 8. సం॥ ల | ” | $\dots\frac{8}{8+12}=\frac{2}{5}$ | ” |
| 12. సం॥ – | ” | $\dots\frac{12}{12+12}=\frac{1}{2}$ | ” |

ఇందు ఈక్రింది సూచనాక్షరములను గమనింపనగును. డ్రా.=డ్రాము, గ్రె = గ్రెయిను, మి.=మినిము, మొ=మొందలు, సాలిడ్ అనగా ఘనపదార్థము లిక్విడ్ అనగా ద్రవపదార్థము.

## ఘనపదార్థముల తూనిక.

| | | | |
|---|---|---|---|
| 20 గ్రెయినులు | ... | ... | 1 స్క్రూపులు |
| 3 స్క్రూపులులు | ... | ... | 1 డ్రాము |
| 8 డ్రాములు | ... | ... | 1 ఔన్సు |
| 12 ఔన్సులు | ... | ... | 1 పౌను |

## ద్రవ పదార్థముల కొలత

| | | | |
|---|---|---|---|
| 60 మినిములు | ... | ... | 1 డ్రాము |
| 8 డ్రాములు | ... | ... | 1 ఔన్సు |
| 20 ఔన్సులు | ... | ... | 1 పైంటు |
| 8 పైంట్లు | ... | ... | 1 గాలను |

ఘన పదార్థములకు, త్రాసును తూనికరాళ్ళను ఉపయోగించవలసి యుండును. ద్రవ పదార్థములయందు, గ్రెయినులకు బదులుగా మినిములు వాడవలసి యుండును. ఓ మినిములకు లోపుగా సన్నరేడల చుక్కలుగా వాడవలసి యుండును.

# ఆంగ్లేయ వైద్య చింతామణి

---

## ప్రసిద్ధ ఆంగ్లేయౌషధ యోగములు.

### గర్భస్రావము (Abortion)

క్వినీన్ సల్ఫేట్ 10 గ్రా॥
యక్ట్రాక్టు యెర్గాట్ లిక్విడ్ 1 డ్రా
ఆసిడ్ సల్ఫ్యూరిక్ 30 మి.
టింక్చర్ డిజిటాలిస్ 20 మి.
జలము 3 ఔ.

ఒక ఔన్సు మోతాదులో దినమునకు మూడుసార్లు ఇవ్వవలయును.

---

### జలోదరము (Ascites)

1. పల్వీస్ డిజిటాలిస్ 1 గ్రా॥
పల్వీస్ స్కిల్లే 1 గ్రా॥
రసభస్మము 1 గ్రా॥

యక్ట్రాక్టు జన్షన్ మాత్రయగుటకవసర మగునంత. ఒక్కొక మాత్ర చొ॥ దినమునకు రెండు సార్లు.

(లేక)

2. పొటాస్ అసిటేస్ 45 గ్రా॥
కెఫీన్ సిట్రేస్ 6 గ్రా॥

ఒక ఔన్సు చొ॥ దినమునకు మూడు సార్లు.

---

### చుండు (Dandruff)

క్లోరల్ హైడ్రేట్ 1 డ్రా॥
టార్టారిక్ ఆసిడ్ 1 డ్రా॥
సీమ ఆముదము ½ డ్రా॥
ఆల్కహాల్ 1 ఔ॥
జలము 1 ఔ॥

---

### బట్టతల (Alopecia)

1. సల్ఫర్ ఆయింట్మెంట్ 4. డ్రా॥
క్రియసార్బయిన్ 1 డ్రా॥
ఆలివు ఆయిల్ 1½ ఔ॥

(లేక)

2. స్పిరిట్స్ అమ్మోనియా ఆరోమేటిక్ 1 ఔ॥
స్పిరిట్ రోజ్మేరి 1 ఔ॥
గ్లిసరిన్ 1 ,,
టింక్చర్ కాంథారిడీస్ 4 డ్రా
పన్నీరు 4½ ఔ॥

వీటిని బాగుగా కలిపి వెండ్రుకల యొక్క కుదుళ్ళలో బాగుగా రుద్దవలయును.

---

### ఋతుస్రావము యొక్క క్షీణత లేక నిలుపుదల [Amenorrhoea]

1. పొటాస్ పర్మాంగనేట్ 1 గ్రా॥

కెయోలిన్ - మాత్రగా జేయుటకు వీలగునంత దినమునకు రెండు సార్లు.

---

(లేక)

| | |
|---|---|
| 2. రిడ్యూస్డ్ ఐరన్ | 36 గ్రె॥ |
| ఫెర్రియి ఆర్సెనస్ | $1\frac{1}{2}$ గ్రె॥ |
| యక్ట్రాక్టు ఆఫ్ నక్సు వామికా | 3 గ్రె॥ |
| క్వినీన్ సల్ఫేట్ | 12 గ్రె॥ |

వీని నన్నింటిని గలిపి 13 మాత్రలుగా జేయవలయును. అరమాత్రనుండి ప్రారంభిచి క్రమముగా నొక మాత్రకు హెచ్చింపుచు దినమునకు మూడు సారులు భోజనానంతరమ యియ్యవలయును. ఈ మాత్రల నుపయోగించుట క్రమముగా మానవలయును గాని అకస్మికముగా మానవలదు, ఆర్సెనిక్ (పాషాణము) కొందరి జీర్ణతత్వమునకు సరిపడక పోవచ్చును. అట్టి విషయములలో దానిని మాత్రలనుండి పూర్ణముగా త్యజింపవచ్చును.

---

## ఉబ్బసము - Asthma

(ఉద్రుత గతియందు)

| | |
|---|---|
| పొటాస్ అయొడైడ్ | 9 గ్రె॥ |
| టింక్చర్ బెలడోనా | 15 మి॥ |
| టింక్చర్ లోబేలియా యీతర్ | 30 మి॥ |
| స్పిరిట్స్ అమ్మోనియా ఆరోమెటిక్ | 1 డ్రా॥ |
| స్పిరిట్స్ క్లోరోఫారం | 30 మి॥ |
| జలము | 3 ఔ॥ |

ఒకొక్కొక్క ఔన్సు చొ॥ దినమునకు మూడు సారులు.

---

## కురుపులు, వ్రణములు రాచకురుపులు.

## Boils, Abscesses, Carbuncles.

1. భాగము కార్బాలిక్ ఆసిడ్ను 10 భాగములు గ్లిసరీన్తో గలిపి పైన రాయవలయును.
2. వేడి కాపడములును. పిండికట్లును.
3. హోమియోపతీ వైద్యశాస్త్రజ్ఞులు టింక్చర్ ఆర్నికా ఒక చుక్కను, ఒక ఔన్సు జలములో గలిపి మూడు గంటల కొకసారి లోని కియ్యనగునని సూచించిరి.

---

## పాండురోగము (Anaemia)

| | |
|---|---|
| ఫెర్రియి యెట్ అమ్మోనియా సిట్రస్ | 10 గ్రె॥ |
| యక్ట్రాక్టు నక్సు వామికా ద్రవము | 2 మి॥ |
| లైకర్ ఆర్సెనికాలిస్ | 4 మి॥ |
| గ్లిసరీన్ | 20 మి॥ |
| జలము | 2 ఔ॥ |

1 ఔ. చొ॥ దినమునకు రెండుసార్లు భోజనానంతరము

---

## కురుపులు (Boils)

| | |
|---|---|
| 1. కాల్సియం సల్ఫైడ్ | 10 గ్రె॥ |

మాత్ర లగుటకు ఆవసరమైనంత య క్సాన్రిక్షి జన్షన్తో గలిపి 100 మాత్రలుగా జేయవలయును. దినమునకు మూడు మాత్రల నుపయోగింప వలయును.

| | |
|---|---|
| 2. బోరిక్ ఆయింట్ మెంట్ | 2 డ్రా॥ |
| ఇక్తియాల్ | $\frac{1}{2}$ డ్రా॥ |
| ప్లెక్సిబిల్ కలోడియం | 1 డ్రా॥ |

వీని నన్నిటిని గలిపి కురుపులకు పైన రాయ వలయును.

---

## 6 సం॥ల వయస్సుగల బిడ్డలకు ఉబ్బసము.

| | |
|---|---|
| పొటాస్ అయొడైడ్ | 6 గ్రే॥ |
| అమోనియా కార్బనస్ | 3 గ్రే॥ |
| వైనం ఇపికాక్ | 15 మి॥ |
| సిరప్ టోలు | 10 మి॥ |
| స్పిరిట్స్ క్లోరోఫారం | 10 మి॥ |
| జలము | 3 ఔ॥ |

ఒక్కొక ఔన్సు చొ॥ దినమునకు మూడుసారులు.

---

## కనురెప్పల ఉబ్బుదల

## Blepharitis

| | |
|---|---|
| బొరిక్ ఆసిడ్ | 5 గ్రే॥ |
| లానొలీన్ | 1 డ్రా॥ |

కనురెప్పల అంచులకు రాయవలయును.

## గొంతు బొంగు పోవుట (హిస్టీరియా సంబంధమగు)

## Aphonia

| | |
|---|---|
| జింక్ వెలిరియేనస్ | 1 గ్రే॥ |

కెయోలిన్ మాత్రయగుటకు అవసర మగునంత. ఒక్కొక మాత్ర చొ॥ దినమునకు రెండుసారులు.

---

## కాలినగాయము (Burns)

1. అవిసెనూనె (లేక కొబ్బరినూనె) సున్నపు నీళ్ళను సమాన భాగములుగ కల్వములో వేసి మర్దించి - దీనిని గాయములపైనరాయ వలయును. దీని కేనవనీత మందురు.

| | |
|---|---|
| 2. బోరిక్ ఆసిడ్ | 15 గ్రే॥ |
| గ్లిసరీన్ | 1 డ్రా॥ |
| ఆలివ్ ఆయిల్ | 1 ఔ॥ |

వీని నన్నిటిని గలిపి పైన రాయవలయును.

---

## రొమ్మునొప్పడిసెము (Bronchitis)

| | |
|---|---|
| పొటాస్ సిట్రస్ | 1 డ్రా॥ |
| లైకర్ అమోనియా సిట్రిను | 6 డ్రా॥ |
| వైనం ఇపికాక్ | 30 మి॥ |
| స్పిరిట్స్ క్లోరోఫారం | 5 మి॥ |
| జలము | 3 ఔ॥ |

ఒక్కొక ఔన్సు చొ॥ దినమునకు మూడుసారులు లియ్యవలయును.

## రొమ్ముపడిసెము.

(1 సం॥ వయసుగల బిడ్డకు తీవ్రస్థితి యందు)

పొటాసు సిట్రేసు 5 గ్రా॥
లైకర్ అమ్మోనియా సిట్రేసు 1 డ్రా॥
వైనం ఇపికాక్ 10 మి॥
సిరప్ టోలు 30 మి॥
ఆక్వాక్లోరోఫారం 5 ఔ॥

3 గంటల కొక ఔన్సు చొ॥ యియ్యవలయును.

---

## రొమ్ముపడిసెమునకు లోనకు వాసన చూచుట

టింక్చర్ బెంజాయిన్ కో 3 డ్రా॥
యూకలిప్టస్ ఆయిల్ 1 డ్రా॥
క్రియసోట్ $\frac{1}{2}$ డ్రా॥

ఈమిశ్రితౌషధమునుండి ఒక డ్రామును ఉడుకునీటిలో వేసి వాసన జూడవలెను.

---

## బాధతోగూడిన పుండు (Cancer)

బాధను తగ్గించుటకు గాను $\frac{1}{2}$ డ్రాము సిట్రిక్ ఆసిడ్‌ను 4 ఔన్సుల జలములో గలిపి – లింటును యిందులో దడిపి పుండుపైన వేయవలయును.

---

## ధాతునష్టము.

(మూత్రగ్రంథుల యొక్క క్షీణదశ)

(Bright's Disease)

1. ఫెర్రియి రెుట్ అమ్మోనియా సిట్రేసు 15 గ్రే॥
లైకర్ స్ట్రిక్నిన్ 6 మి॥
గ్లిసరీన్ 45 మి॥
స్పిరిటస్ క్లోరోఫారం 20 మి॥
జలము 3 ఔ॥

ఒక్కొక ఔన్సు చొ॥ దినమునకు మూడుసారులు.

2. తియోసిన్ సోడా ఆసిటేట్ 15 గ్రా॥
కఫీన్ సిట్రేసు 9 గ్రే॥
టింక్చర్ డిజిటాలిస్ 15 మి॥
జలము 3 ఔ॥

ఒక్కొక ఔన్సు చొ॥ దినమునకుమూడు సారులు.

## తేనటీగ కాటు.

దాల్చిన అరకు (Cinnamon Oil) ను పైన రాయవలయును.

---

## నల్లులు (Bed bugs)

1. పెట్రోలియం 3 ఔన్సులను 100 ఔన్సుల జలములో గలిపి నల్లులుండు స్థానములలో బోసిన నవి నశించగలవు.
2. గంధకపు పొగవలన గూడ నల్లులు నశించి పోవును.

---

## తిమురువాయువు (Beri beri)

1. టింక్చర్ నక్సువామికా 15 మి॥
టింక్చర్ స్ట్రోఫాంతను 15 మి॥
స్పిరిటస్ క్లోరోఫారం 30 మి॥

జలము 3 ఔ॥

ఒక్కొక్క ఔన్సు చొ॥ దినమునకు మూడుసారు లియ్యవలయును.

2. ఫెర్రియి రూట్ క్వినీన్

సిట్రిసు 10 గ్రా॥
లైకరు ఆర్సెనికాలిసు 4 మి॥
గ్లిసరీన్ 20 మి॥
స్పిరిట్సు క్లోరోఫారం 20 మి॥
జలము 2 ఔ॥

ఒక్కొక్క అవున్సు చొ॥ రెండు సారులు భోజనానంతరము యియ్యవలయును.

......

## దగ్గు (Cough)

1. టింక్చరు క్యాంఫరు కో 3 డ్రా॥
స్పిరిట్సు అమ్మోనియా ఆరోమేటిక్ 1 డ్రా॥
జలము 8 ఔ॥

దీర్ఘవ్యాపితమయి శ్వాస సంబంధము లగు దగులయందు ప్రతి రెండు లేక మూడు గంటలకు ఒక ఔన్సు చొ॥ యియ్యవలయును.

1. టింక్చరు క్యాంఫరు కో 3 డ్రా॥
వైనం ఇపికాక్ 1 డ్రా॥
స్పిరిట్ ఈతరు నైట్రిసు 3 డ్రా॥
జలము 8 ఔ॥

జలుబువలన గలుగు దగ్గుయందును, యితర విధములగు దగ్గులందును, కఫము వెలు [illegible] ప్రతిమూడు లేక నాలుగు గంటలకొక ఔన్సు చొ॥ యియ్యవలయును. ఇంతకు మించిన ప్రతి సంవత్సరము వయస్సునకును మోతాదు న సంవత్సరమున కొక డ్రాము చొ॥ హెచ్చింప వలయును.

3. హెరాయిన్ హైడ్రోక్లోరు ½ గ్రా॥
జలము 10 ఔ॥

ఒక్కొక్క ఔ॥ చొ॥ దినమునకు మూడు సారులు.

---

## రొమ్ముపడిసెము (తీవ్రమగునట్టి ప్రారంభస్థితి యందు)

ఆంటిమొనీ టార్టరేట్ 1 గ్రా॥
పొటాసు నైట్రిసు 2 డ్రా॥
టింక్చరు క్యాంఫరు కో 4 డ్రా॥
జలము 12 ఔ॥

అరఔన్సు చొ॥ 3 గంటల కొకసారి యియ్యవలయును.

---

## శీతకాలపు గజ్జి (Chilblains)

1. కార్బాలిక్ ఆసిడ్ 1 డ్రా॥
టింక్చర్ అయొడిన్ 2 డ్రా॥
ట్యానిక్ ఆసిడ్ 2 డ్రా॥
ఆముదము 4 ఔ॥

వీని నన్నిటిని కలిపి పైన రాయవలెను.

2. అమ్మోనియం క్లోరైడు 4 డ్రా॥
వినిగర్ 2 ఔ॥
జలము 6 ఔ॥

వీని నన్నిటిని గలిపి పైన రాయవలయును.

3. గుడ్డను పెప్పరుమెంటు ఆయిలులో దడిపి పైని వేయనగును.

## మలబంధము. (Constipation)

| | | |
|---|---|---|
| పల్వీసు ఇపికాక్ | 1 గ్రే॥ | |
| యక్ట్రాక్టు కాస్కారా సాగ్రిడా | 3 | ,, |
| ,, బెలడోనా | 1 | ,, |
| ,, నక్సువామికా | 1 | ,, |

మాత్ర యగుటకు వీలైనంత యక్ట్రాక్టు జన్షన్‌ను గలుపవలయును. వీని నన్నిటిని గలిపి 6 మాత్రలుగా జేసి దీర్ఘ వ్యాపితమగు మలబంధ విషయములందు రాత్రి నిద్రించు ముందు 1 లేక 2 మాత్రలను సేవించ వలయును.

## అధిక కాలము మంచము పట్టుట వలన గలుగు పుండ్లు.

## (Bed sores)

1. పటిక 2 డ్రా॥
టింక్చర్ క్యాంఫర్ కో 1 ఔ॥
ఒక కోడిగ్రుడ్డు తెలుపుతో బాగుగ గలిపి పుండ్లకు రాయనగును.

2. పుండ్లు పడుటకు ముందు యెర్రగానున్న ప్రదేశములందు ల్యానొలిన్‌ను బాగుగా రుద్దినయెడల పుండ్లు పడకుండును.

## బ్రాంకో న్యుమోనియా

## (Bronchopneumonia)

(1 సం॥ వయసుగల బిడ్డలయందు వచ్చు న్యుమోనియావలె నుండునట్టి జ్వరము. బ్రాంకై మొదలగు వ్యాధుల పిమ్మట వచ్చును.

| | | |
|---|---|---|
| అమ్మోనియా కార్బనస్ | 1 | గ్రే॥ |
| లైకర్ అమ్మోనియా అసిటేటిసు | 40 | మి॥ |
| టింక్చర్ బెలడోనా | 4 | మి॥ |
| టింక్చరు సిల్లా | 2 | మి॥ |
| సిరప్ టోలు | 20 | మి॥ |
| ఇన్ఫ్యూజన్ సెనిగా | 4 | డ్రా॥ |

నాల్గవ వంతు చొ॥ 3 గంటల కొకసారి యియ్యవలయును.

## కాలిజముయొక్క క్షీణత (సామాన్యముగ త్రాగుబోతులలో గలుగును).

## (Cirrhos of the Liver)

| | | |
|---|---|---|
| అమ్మోనియం క్లోరైడ్ | 10 | గ్రే॥ |
| టింక్చరు జన్షన్ కో | 20 | మి॥ |
| ఇన్ఫ్యూజన్ సెనా | 1 | ఔ॥ |

ఒక ఔన్సు చొ॥ దినమునకు రెండు॥ సారు లియ్యవలయును.

## పురుగు కాటు.

(నల్లులు, దోమలు, ఈగలు మొదలగు పురుగుల వలన)

చిట్లాముదమును గాని వంట ఆముదమును గాని రుద్దనగును.

......

## శూలనొప్పి (Colic)

| | | |
|---|---|---|
| మెగ్నిసియం కార్బనేటు | 1½ | డ్రా॥ |
| అమ్మోనియం కార్బనేటు | ½ | డ్రా॥ |
| టింక్చర్ లావండ్యూలా కో | 2 | డ్రా॥ |
| పెప్పర్మెంట్ ఆయిల్ | 2 | మి॥ |
| జలము | 6 | ఔ॥ |

నొప్పి తగ్గు వరకును రెండు గంటలకొకసారి అరఔన్సు చొ॥ యియ్యవలయును.

......

## మూత్రాశయ సంబంధమగు

## శూలనొప్పి (Renal Colic)

| | | |
|---|---|---|
| టింక్చరు బెలడోనా | 10 | మి॥ |
| ఆక్వా క్లోరోఫారం | 1 | ఔ॥ |

మూడుగంటలకొకసారి ఒక ఔన్సు చొ॥ యియ్యవలయును.

......

## కొరుకుపుండు (Chancre)

| | | |
|---|---|---|
| ఆరిస్టాల్ | 1 | డ్రా॥ |
| బోరిక్ | 1 | డ్రా॥ |

ఈ రెండును గలిపిన పొడిని పుండు పైన జల్లవలయును.

......

## కొలరా (Cholera)

1. టింక్చరు కాప్సికం 5 డ్రా॥
స్పిరిట్సు క్యాంఫరు 4 డ్రా॥
టింక్చరు క్వయినం 3 డ్రా॥

వీని నన్నిటిని గలిపి రెండు లేక మూడు గంటలకు ఒకసారి ఒక డ్రాము కొలత ప్రకారము కేడిసికళ్ళలో వేసి యియ్యవలయును.

2. టింక్చరు కాప్సికం 2 డ్రా॥
టింక్చర్ ఓపియం 2 డ్రా
టింక్చరు రీయై కో 2 ,,
పెప్పర్మెంట్ ఆయిల్ 2 ,,
స్పిరిట్సు క్యాంఫరు 2 ,,

15 మొదలు 30 చుక్కల వరకును ప్రతి గంటకు యియ్యవలయును.

3. రసభస్మము. 1 గ్రె॥
సోడా బైకార్బొనేట్ 8 గ్రె॥

దీనిని 4 భాగములుగా జేసి గంటకొకసారి పొట్లము నియ్యవలయును.

4. లైకరు స్ట్రిక్నిన్ 15 మి॥
టింక్చరు డిజిటాలిసు 40 మి॥
ఆక్వా క్లోరోఫారం 6 ఔ॥

కాళ్ళును చేతులును చలువలు గ్రమ్ముటకారంభించినప్పుడు మూడు గంటలకొకసారి ఒక ఔన్సు చొ॥ యియ్యవలయును.

---

## పసిబిడ్డలయందు కాలరా

## Cholera Infantum

1. టింక్చర్ అకొనైట్ 4 మి॥
జలము 4 ఔ॥
అరఔన్సు చొ॥ ప్రతి గంటకు ఒక సారి యియ్యవలెయును.

2. హైడ్రార్జిరై కం క్రీటా 1 గ్రే॥
మూడు గంటలకొకసారి యియ్యవలెయును.

---

## కాళ్లు చేతులు స్వాధీనము నుంచి తప్పి గంతులువేయుట (Chorea) (ప్రారంభ గతియందు)

1. సోడా సాలిసైలస్ 1 డ్రా॥
స్పిరిట్స్ అమ్మోనియా ఆరొమేటిక్ 1½ డ్రా॥
ఆక్వా క్లొరోఫారం 6 ఔ॥
ఔన్సు చొ॥ దినమునకు మూడు సారులు.

2. (అనంతర గతులయందు)
లైకర్ ఆర్సెనికాలిస్ 3 మి॥
ఆక్వా క్యాంఫర్ 1 ఔ॥
ఒక ఔన్సు చొ॥ దినమునకు రెండు సారులు భోజనానంతరము యియ్యవలెయును.

క్రమముగా లైకర్ ఆర్సెనికాలిస మోతాదును దినమునకు 15 మినిములకు హెచ్చింపవలెయును.

---

క్లోరల్ హైడ్రేట్ 2 గ్రే॥
పొటాసు బ్రోమైడ్ 8 ,,
టింక్చరు హాయసామి 10 మి॥
సక్కెర - (కొంచెముగా)
జలము 1 ఔ॥

వెంటనే ఆవశ్యకముగా నుండినప్పుడు ఈ మందును యియ్యవలెయును.

---

## జీర్ణకారి (Carminative Mixture)

స్పిరిట్స్ అమ్మోనియా ఆరొమేటిక్ 3 డ్రా॥
సోడా బైకార్బొనేట్ 90 గ్రే॥
టింక్చర్ కార్డమం కో 6 డ్రా॥
స్పిరిట్స్ క్లొరోఫారం 3 డ్రా॥
జలము 10½ ఔ॥

బాగుగా కలుపవలెను. మూడు గంటలకొక ఔన్సు చొ॥ తీయవచ్చును.

అజీర్తికి ఉపయోగపడును. బలముకు భోజనము పిమ్మట ఒక మోతాదు పుచ్చుకొనవలెను. 4 లేక 5 చుక్కలు పెప్పరుమెంటు ఆయిలు కలుపవలెను.

---

## త్రాగుడునందు అభిలాషను మాన్పుటకు (Drunkenness)

టింక్చర్ నక్సువామికా 20 మి॥
టింక్చర్ జెన్షన్ కో 2 డ్రా॥
టింక్చరు కలంబా 2 ,,
జలము 4 ఔ॥

1 జౌన్సు చొ॥ భోజన పూర్వము ఆకలి బుట్టించుటకు గాను యియ్యనగును.

## త్రాగుబోతునకు కలుగు సంనిపాతము.

## (Delirium Tremens)

| | |
|---|---|
| సోడా బ్రొమైడ్ | 45 గ్రా॥ |
| క్లోరల్ హైడ్రేటు | 45 గ్రా॥ |
| టింక్చరు హాయొసామసు | 45 మి॥ |
| నారింజ రసము | 4 మి॥ |
| ఆక్వా క్లొరొఫారం | 3 జౌ॥ |

జౌన్సు చొ॥ దినమునకు మూడుసార్లు యియ్యనగును.

## అతిమూత్రము — మధురపదార్థముతో గూడినది.

## (Diabetes Mellitus)

| | |
|---|---|
| 1. ఆసిడ్ ఆర్సెనియసు | 1/50 గ్రె॥ |
| కోడీనా ఫాస్ఫసు | 1/4 ,, |
| అలొయిన్ | 1/2 ,, |
| స్ట్రిక్నీన్ ఫాస్ఫస్ | 1/60 ,, |

ఈపాళ్ళ ప్రకారం ఒక్కొక్క మాత్రలో నుండునట్లు యక్ట్రాక్టు జన్షను తో గలిపి మాత్రలుగా జేసి భోజనానంతరము ఒక్కొక్క మాత్ర చొ॥ దినమునకు రెండు మాత్రలను సేవించవలయును.

2. యక్ట్రాక్టు జాంబలీనా లిక్విడ్ 1 డ్రా॥

జలములో గలిపి దినమునకు రెండు సార్లు పుచ్చుకొనవలయును.

3. ఆసిడ్ ఫాస్ఫారిక్ డిల్యూటెడ్ 15 మి॥

దీనిని ఒక జౌ॥ జలములో గలిపినాహారానంతరము పుచ్చుకొనవలయును.

## మధు పదార్థము లేకుండ వెలువడు అతిమూత్రము.

## (Diabetes Insipidus)

జింక్ వెలిరియెనసు 4 గ్రా॥

పై మోతాదు ప్రకారం మాత్రలుగా జేసి దినమునకు మూడు మాత్రల నియ్యవలయును.

## అతివిరేచనములు (Ciarshoea)

| | |
|---|---|
| 1. బిస్మత్ సబ్నైట్రేటు | 20 గ్రె॥ |
| సలోల్ | 15 ,, |
| సోడా బైకార్బనసు | 15 ,, |

3 భాగములుగా జేసి మోతాదున కొక్కొక్క పొట్లము చొప్పున దినమునకు మూడుసార్లు యియ్యవలయును.

| | |
|---|---|
| 2. పల్వీసు ఇపికాక్ కొ | 15 గ్రె॥ |
| బిస్మత్ సాలిసైలసు | 15 ,, |

మూడు భాగములుగా జేసి మోతాదున కొక్కొక్క పొట్లము చొ॥ దినమునకు మూడు సారు లియ్యవలయును.

1 సం॥ వయసుగల బిడ్డకు అతివిరేచనములు.

పల్విసు క్రేటా ఆరోమేటిక్ 6 గ్రే॥
బిస్మత్ సాలిసైలసు 6 ,,

ఆరు పొట్లములుగా చేసి 3 గంటలకొక పొట్లము నియ్యవలయును.

---

## 1 సం॥ వయసుగల బిడ్డకు ఆకు పచ్చరంగు విరేచనములు (Green Diarrhoea)

ఒక ఔ॥ జలములో 20 మినిములు ల్యాక్టిక్ ఆసిడ్ను గలిపి మూడేసి గంటలకొకసారి ఒక డ్రాము చొప్పున యియ్యవలయును.

---

## 2 సం॥ వయసుగల బిడ్డకు అతి విరేచనములు.

సలోల్ 3 గ్రా
బిస్మత్ కార్బనసు 12 ,,
పల్విసు క్రేటా ఆరోమేటిక్ 12 ,,

---

## మలబంధము.

(సంవత్సరములోపు వయసుగల బిడ్డలకు)

మెగ్నీసియం కార్బనసు 4 గ్రా
మెగ్నీసియం సల్ఫేట్ 16 ,,
సోడా బైకార్బనసు 4 ,,
పల్విసు రియై 4 ,,
టింక్చర్ కార్డమం కో 20 మి॥
టింక్చర్ జింజిబరిసు 8 మి॥
ఆక్వా అనీతి 4 డ్రా॥

ఒక డ్రాము మోతాదు చొ॥ దినమునకు రెండు సారు లియ్యవలయును.

---

## చిన్నబిడ్డ గుణము (Convulsions)

(1 సం॥ వయసుగల బిడ్డకు)

పొటాసు బ్రోమైడ్ 4 గ్రే॥
టింక్చరు బెలడోనా 4 మి॥
క్లోరల్ హైడ్రేసు 2 గ్రే॥
ఆక్వా క్లోరోఫారం 4 డ్రా॥

ఒక డ్రాము చొ॥ మూడు గంటలకొకసారి యియ్యవలయును. చక్కెర కొంచెముగా చేర్చుదురు.

......

## విరేచన కారులు.

1. చిట్లాముదము 2 లేక 3 డ్రాములు తే మకగమగు విరేచనకారిగ సేవింపనగును. ఒక గ్లాసునకు లోపల నిమ్మరసమును రాచి ఆముదమును బోసి అటు పిమ్మట నీయాముదము ను డ్రాగుట వలన నీసువాసనచే నందలి అసహ్యమును అరుచియును తగ్గును.

---

2. టార్టారిక్ ఆసిడ్ 1 డ్రా॥
సోడా కార్బనసు 1 డ్రా॥
క్రీం ఆఫ్ టార్టార్ 1 డ్రా॥
మెగ్నీసియం సిట్రేసు 1 డ్రా॥

మెగ్నీసియం సల్ఫేటు 1 డ్రా
చక్కెర (మెత్తనిపొడి) 1 ,,

ఒక టీ స్పూను కొలతనుగాని కొంచె మెక్కువగా గాని నీటిలో కలిపి పుచ్చుకొన వలయును. ఇది "ఈనోజ్" ఫ్రుట్ సాల్ట్ వలె సాధు విరేచనకారిగ బనిచేయును.

---

3. హైడ్రార్జిరై కం క్రేటా (గ్రే పౌడరు) ½ గ్రా॥ మొదలు 2 గ్రా॥
సోడా కార్బొనేటు 6 ,,

బిడ్డలకు నీళ్ళ విరేచనము లగుచు విరేచనము తెల్లగా కుదపలుగా నుండి, పాలు అజీర్ణస్థితిలో వెలువడు చుండిన యెడల యీ మందు వెంటనే పనిచేయును. ఉదయమున ఒకపొట్లమును సాయంత్రి మొకపొట్లమును యియ్యవలెను. 1 మొదలు 6 నెలల వయసుగల బిడ్డకు అరగ్రెయిను గ్రే పౌడరు, 6 గ్రె. సోడా, 6 మొదలు 12 నెలల వరకు 1 గ్రె. గ్రే పౌడరును 6 గ్రె సోడా, 1 సం॥ మొదలు 3 సం॥ ల వరకును 1½ గ్రె గ్రేపౌడరు 6 గ్రె. సోడా; 4 మొ॥ 8 సం॥ ల వయస్సు వరకును 3 గ్రె గ్రే పౌడరును 6 గ్రె సోడాయును, యీ మోతాదుల ప్రకారము యియ్యవలయును.

---

4. సోడా సల్ఫేటు 4 డ్రా
టింక్చర్ ఆఫ్ జింజర్ 20 ని
జలము 2 ఔ

సామాన్యముగ విరేచనమగుటకు దీనిని ఉపయోగింపవచ్చును. శరీర తత్వమును బట్టి సోడా సల్ఫేటు అధికముగ దొరికిన యెడల ఒకటి రెండు డ్రాములు తగ్గింపవచ్చును.

......

5. సోడా సల్ఫేటు 4 డ్రా॥
టించ్చర్ సింకోనా 4 ,,
సల్ఫేటు ఆఫ్ ఐరన్ 15 గ్రె॥
జలము 8 ఔ॥

బాగుగ కలిపి నాలుగు గంటల కొకసారి ఒకఔన్సు పుచ్చుకొన వలయును. ప్లీహ వ్యాధులయందును బుతు స్రావము యెంక నిలుపుదల యందును. సులిపురుషులకును ఉపయోగింప నగును.

......

6. మెగ్నీసియా బైకార్బొనసు 10 గ్రె॥
సోడా బైకార్బొనసు 8 గ్రె॥
మిస్చూరా సెన్నాకో 1 ఔ॥

బాగుగా కలుపవలెను. అజీర్తికిని ఖాజ వ్యాధులకును ఉపయోగింప నగును.

......

7. రసభస్మము 5 గ్రె॥
పొంగు జాలప్ కో 1 డ్రా॥

బాగుగా కలిపి పప్పొడిగా చేయువలయును. బలమగు విరేచనకారి. మలము

నీటితో గూడ దయుంచునట్లు చేయును. సంబా వ్యాధుల యందు ఉపయోగింప నగును;

...  ...

3. పోడాఫైలం రెజిన్ 1½ గ్రే||
యక్ట్రాక్టు కాలొసింత్
కా 30 గ్రే||
పల్విసు ఇపికాకు 4 గ్రే||

కొంచెము జిగురుతో బాగుగా కలిపి 12 మాత్రలుగా జేయ వలయును. మోతాదు — రెండు దినముల కొకమాత్ర చొ|| కాలేజ వ్యాధులకును, విరేచన బద్ధమునకును ఉపయోగింప నగును.

...  ...

## జలుబు (Coryza)

(ప్రారంభ స్థితియందు)

| | |
|---|---|
| టింక్చర్ అకొనైట్ | 4 మి|| |
| టింక్చర్ బెలడోనా | 8 మి|| |
| స్పిరిట్సు క్యాంఫర్ | 8 మి|| |
| ఆక్వా క్లోరోఫారం | 2 ఔ|| |

అర ఔన్సు చొ|| మూడు గంటలకొకసారి యియ్యవలయును.

...  ...

## 2 సం|| ల వయసుగల బిడ్డకు అతి విరేచనములు

| | |
|---|---|
| కలోమెల్ | 3 గ్రే|| |
| బిస్మత్ కార్బనసు | 12 గ్రే|| |
| పల్విసు క్రీటా ఆరోమేటికస్ | 12 గ్రే|| |

ఆరు మోతాదులుగ జేసి మూడేసిగంటల కొక మోతాదు నియ్యవలయును.

...  ...

## ఋతుస్రావము నం దధికముగ నగుట, లేక తఱచుగ నగుట, లేక అధిక కాలము వరకు నగుట (Menorrhagia)

1 యక్ట్రాక్టు యర్గోటా లిక్విడ్ అర డ్రాము మొదలు ఒక డ్రాము వరకును జలములో గాని షరబతులో గాని కలిపి మూడు గంటల కొకసారి యియ్యవలయును.

2 టింక్చర్ హామామెలిసు 5 చుక్కలను మూడు లేక నాలుగు గంటల కొకసారి జలములో గలిపి యియ్యవలయును.

3. ఋతుస్రావము అధికముగ నగు విషయములో ఒకటి లేక రెండు నిమ్మ కాయల రసమును నోటితో పీల్చుటవలన మిగుల గుణముగా నుండునని యొక అమెరికా వైద్యశాస్త్రజ్ఞుడు చెప్పుచున్నాడు.

...  ...

## అజీర్ణ వ్యాధి. (Dyspepsia)

| | |
|---|---|
| 1 బిస్మత్ కార్బనసు | 30 గ్రే|| |
| పెప్సిన్ వైన్ | 1½ డ్రా|| |
| టింక్చర్ నక్సువామికా | 24 మి|| |
| పల్విసు ట్రాగకాంత్ | 12 గ్రే. |

నీటితో గూడి యిచ్చునట్లు చేయాలెను. సంబ… వ్యాధుల యందు ఉపయోగింప నగును;

......

| | | |
|---|---|---|
| 8. పోడాఫైలం రెజిన్ | 1½ | గ్రె॥ |
| యక్స్ట్రాక్టు కాలొసింత్ కా | 30 | గ్రె॥ |
| పల్విసు ఇపికాకు | 4 | గ్రె॥ |

కొంచెము జిగురుతో బాగుగా కలిపి 12 మాత్రలుగా జేయ వలయును. మోతాదు—రెండు దినముల కొకమాత్ర చొప్పు కాలేయజ వ్యాధులకును, విరేచన బద్ధమునకును ఉపయోగింప నగును.

......

## జలుబు (Coryza)

### (ప్రారంభ స్థితియందు)

| | | |
|---|---|---|
| టింక్చర్ అకొనైట్ | 4 | మి॥ |
| టింక్చర్ బెలడోనా | 8 | మి॥ |
| స్పిరిట్స్ క్యాంఫర్ | 8 | మి॥ |
| ఆక్వా క్లోరోఫారం | 2 | ఔ॥ |

అర ఔన్సు చొ॥ మూడు గంటలకొక సారి యియ్యవలయును.

......

## 2 సం॥ ల పసిబాలకుల బిడ్డకు అతి విరేచనములు

| | | |
|---|---|---|
| సలోల్ | 3 | గ్రె॥ |
| బిస్మత్ కార్బనసు | 12 | గ్రె॥ |
| పల్విసు క్రీటా అరోమేటిక్ | 12 | గ్రె॥ |

ఆరు మోతాదులుగా జేసి మూడేసిగంటల కొక మోతాదు నియ్యవలయును.

......

## ఋతుస్రావము సంపూర్ణముగ నగుట, లేక తఱచుగ నగుట, లేక అధిక కాలము వరకు నగుట (Menorrhagia)

1 యక్స్ట్రాక్టు యెర్గోటు లిక్విడ్ అర డ్రాము మొదలు ఒక డ్రాము వరకును జలములో గాని పరబతులలో గాని కలిపి మూడు గంటల కొకసారి యియ్యవలయును.

2 టింక్చర్ హామామెలిసు 5 చుక్కలను మూడు లేక నాలుగు గంటల కొకసారి జలములో గలిపి యియ్యవలయును.

3. ఋతుస్రావము అధికముగ నగు విషయములో ఒకటి లేక రెండు నిమ్మకాయల రసమును నోటితో పీల్చుటవలన మిగుల గుణముగా నుండునని యొక వైద్యశాస్త్రజ్ఞుడు చెప్పుచున్నాడు.

......

## అజీర్ణ వ్యాధి (Dyspepsia)

| | | |
|---|---|---|
| 1 బిస్మత్ కార్బనసు | 30 | గ్రె॥ |
| పెప్సిన్ పైన్ | 1½ | డ్రా॥ |
| టింక్చర్ నక్సువామికా | 24 | మి॥ |
| పల్విసు ట్రాగకాంత్ | 12 | గ్రె॥ |

ఆక్వా మెంతా పిప్ 3 ఔ॥

ఔన్సు చొ॥ దినమునకు మూడుసారు లి య్యవలయును.

---

2. సోడా బైకార్బనసు 45 గ్రే॥

పల్వినుక్రీమి 15 ,,

మెగ్నీసియం కార్బనసు 15 ,,

స్పిరిట్స్ క్లోరోఫారం 20 మి॥

టించ్చరు నక్సువామికా 15 మి॥

ఆక్వా మెంతాపిప్ .. ఔ॥

3 లైకర్ బిస్మత్ యెట్ అమ్మోనియా సైట్రేటిస్ (హామలిట్) 2 డ్రా॥

ఆక్వా అనీతి 1 ,,

జలము 3 ఔ॥

1 ఔన్సు మోతాదులో దినమునకు మూడుసారు లియ్యవలయును.

---

## ఋతుస్రావమునందు నొప్పి కలుగుట (Dysmenorrhoea)

లైకర్ కాలోఫిల్ రూట్ - పల్ సెటిల్లా ... మి॥

... (స్పిరిటీడేనిసు ... కంపెని) ... మి॥

... టింక్చరు ... డ్రా॥

... క్లోరోఫారం ...

ఒక ఔన్సు చొ॥ దినమునకు ... నొప్పి ... ఇయ్యవలయును.

## చెవిపోటు (Earache)

టింక్చర్ ఓపియం 1 డ్రా॥

గ్లిసరీన్ $1\frac{1}{2}$ ,,

కార్బాలిక్ ఆసిడ్ 24 మి॥

కొబ్బరినూనె 1 ఔ॥

ఈ మిశ్రితౌషధమును వెచ్చచేసి 1 లేక 2 చుక్కలను చెవిలో వేయవలయును.

---

## మూగగజ్జి (Eczema)

సాలిసైలిక్ ఆసిడ్ 15 గ్రే॥

జింకు ఆక్సైడ్ 40 గ్రే॥

వాసలీన్ 1 ఔ॥

ఈ ఆయింటుమెంటును పైన రాయవలెను.

......

## మర్మాయువులను క్రిమి జాలములను నశింపజేయు మందులు (Disinfectants)

1. కార్బాలిక్ ఆసిడ్ 1 డ్రా॥

జలము 1 పైంటు

కురుపులు, పుండ్లు గాయములు కడుగుట కుపయోగించును.

---

2. బోరాసిక్ ఆసిడ్ 4 గ్రే॥

జలము $1\frac{1}{2}$ డ్రా॥

నేత్రములను, మూత్రేంద్రియములను, భగ సంబంధమైనవాని ... శుద్ధిపరచుటకు కుపయోగించును.

ఓడలో గలుగు కడుపు త్రిప్పు—Sea-sickness.

అమిల్ నైట్రిసు; అంటిపయిరిన్, కోకా, కొకేన్, క్లోరల్, క్లోరోఫారం, నైట్రొగ్లిసరీన్; మార్ఫిన్ (సూదితో రక్తములోనికి యింజక్టు చేయుట.) బ్రోమైడ్లు సెట్రెట్లు, రిసార్సిన్, కోలా సంబంధములు.

కడుపు నొప్పి—Gastralgia.

స్పిరిట్ ఈతరిసు, కెనేబిసు; కోకా; కొడీన్; బిస్మత్ సంబంధములు; క్లోరోఫారం; టింక్చరు క్లోరోఫారం అండ్ మార్ఫియా; క్రియసోట్; పెప్సిన్.

కర్ణరోగములు—Ear-Diseases.

1. చెవిలోనుండి స్రవించుట :—

గ్లిసరీన్ ఆసిడ్ ట్యానికు; బోరికు ఆసిడ్.

2. చెవిపోటు:—కొకేన్; అట్రోపీన్.

కలరా—Cholera.

క్రియసోట్; గ్వాయికల్; టింక్చర్ క్లోరోఫారం అండ్ మార్ఫియా; కాంఫర్; హైడ్రార్జరి పెర్క్లోరిడ్; మార్ఫిన్; రిసార్సిన్: సాలోల్

కాలిజము యొక్క పుండు—Liver Congestion or Abscess.

పొటాషయిడిన్; హైడ్రార్జరి సబ్ క్లోరిడ్ (రసభస్మము).

పరుపుపుండ్లు (అధిక కాలము మంచము పట్టుటచే వీపుమీదగాని తుంటిమీదగాని లేచునట్టివి Bedsores.

కలోడియం; గ్లిసరీన్; గ్లిసరీనం ఆసిడ్ టానికు; అయొడొఫారం ఆయింటు మెంటు; జింకు ఆక్సైడు ఆయింటు మెంటు.

పరుపులు—రాచపుండ్లు—Boils or Carbuncles.

ఆర్సెనికు; ఫెర్రియి పెర్క్లోర్; సిరపు ఆఫ్ హైపొఫాసు ఫయిట్సు; సిరప్ ఆఫ్ సల్ఫైట్సు; సల్ఫయిడ్సు; కార్బాలికు ఆయిల్; బెలడోనా గ్లిసరీన్.

కుష్ఠరోగము—Leprosy

అనాకార్డియం; చాల్మం గర్జన్; ఓలియం గైనోకార్డి.

క్రిమికుండజేసెడు వస్తువులు—Antiseptics

ఆసిడ్ బోరికు; ఆసిడ్ కార్బాలికు, ఆసిడ్ సాలిసైలికు; క్యాంఫర్; క్యాంఫర్ ఫెనాల్; క్యాంఫర్ నాఫ్తాల్, క్లోరల్, క్రియసోట్; గ్వాయికల్, యూకలిప్టసు; హై

డ్రైజరీ పెర్క్లోర; అయొడోఫారం; నాఫ్తలీన్, పొటాసు పర్మాంగనేట్; రిసార్సిన్; సోడై బెంజోసు; సోడై సల్ఫిసు; టెరిబీన్; తైమాల్; జింకు క్లోరిడ్, జింకు సల్ఫిసు.

కొంకరులు వోపుట (చంటిబిడ్డ గుణము వగైరా)-Convulsions

సింకోనా సంబంధములు (క్వినీన్ వగయిరా), బ్రోమైడ్లు బెలడోనా, మార్ఫిన్, హాయొసామిన్: సల్ఫోనల్, వెలీరియనేట్సు.

కొరియా (ఒకవిధమగు కొంకరులు పుట్టించు రోగము)-Chorea

అర్సెనికు, కాల్సియం క్లోరిడ్, క్లోరల్, రుయెర్గాట్, హాయొసామిన్, కాడ్లివరు చమురు, ఫాసుఫరసు, ఈసరీన్, స్ట్రిక్నీన్: వెలీరియనేట్సు, సల్ఫోనల్.

కొఱుకు రోగము--Syphilis

అమ్మోనియా అయొడైడ్, గోల్డు క్లోరిడు; సోడియం క్లోరిడ్, ఫెర్రి అయొడీడ్, రస సంబంధములు, అయొడైడ్లు, అయొడిన్; రస సంబంధములు లేపనములుగా నుపయోగించ వలయును.

కొఱుకు సంబంధమగు చర్మరోగములు-Syphilitic Skin Diseases

రస సంబంధములు (అనగా ఆయింటు మెంటుగాని పలాస్త్రిలుగాని:) రిసార్సిన్, అయొడోఫారం.

కొఱుకు సంబంధమగు పుండ్లు--Syphilitic Ulcers

లైకర్ హైడ్రార్జరీ, నైట్రికు అసిడ్, రససంబంధమగు ఆయింటుమెంట్లు, లోషన్లు అయొడోఫారం, రిసార్సిన్, జింకు క్లోరిడ్.

కొఱుకు పుండు (మేహరోగము)--Cancer

అర్సెనికు, క్లోరల్, మార్ఫిన్: పాక్కమందులు, అయొడోఫారం; క్రోమికు అసిడ్, క్వినీన్ సాలిసైలిసు, జింకు క్లోరిడ్:

గనోరియా [సెగ]--Gonorrhoea

కోకేన్ ఇంజక్షన్; విరేచన సాల్టులు (లోహముతో గూడిన లవణములు:) పొటాసు సంబంధములు, ఓలియం సాంటాల్ (చెందినీ) బెలడోనా, ఓలియం యూకలిప్టసు: హైడ్రార్జిసు, అయొడోఫారం; పొటాసు పర్మాంగనేటు; జింకు క్లోరిడు: జింకు సల్ఫసు: జింకు పర్మాంగనేటు, సాలిక్సు నైగ్రా.

గర్భవతిసంబంధ మగు వాంతులు—Vomittings of Pregnancy

కోకేన్, బిస్మత్: క్రియసోటు, ఇన్గ్లూవిన్, మార్ఫిన్, పెప్సిన్, క్వినీన్.

వాంతులు—Vomittings:

బిస్మత్; కొకేన్, కార్బాలిక్ ఆసిడు, క్లోరల్, ఇన్గ్లూవిన్; నైట్రొగ్లిసరీన్; సోడా వాటర్.

గర్భస్రావము—Abortion.

అలెట్రిను, కొడీన్; హైడ్రాస్టిన్, మార్ఫీన్, వైబర్నం.

గర్భాశయము ముడుచుకొని పోవుటకు—Uterine Contraotors

యెర్గాటు సంబంధములు, హేమామిలిసు, హైడ్రాస్టిను.

గాయములు; బెణుకులు—Bruises & Sprains ✓

అమ్మోనియా క్లోరిడులోషన్, హేమామిలిసు, వాజలీన్; టింక్చర్ హైడ్రాస్టిస.

గాయములు (నిప్పువలన లేక మసలగాగిన నీటివలన]—Burns

ఆసిడ్ బోరిక్, తైమాల్ అయింటు మెంటు, వాసలీన్, జింకు అయింటు మెంటు, క్యారన్ ఆయిల్, ల్యానొలీన్.

గుండెరోగములకును గుండె కాయ యొక్క బలములు వృద్ధిచేయుటకును.

మందులు—Cardiac Tonics

కెఫీన్, డిజిటాలిను, స్ట్రొఫాంకసు.

గురకతో గూడిన దగ్గు - Whooping Cough

వేపర్ ఆసిడ్ కార్బాలిక్; అమ్మోనియా బ్రోమైడ్, అలం (పటిక) బెంజోయేట్లు, బ్రోమైడ్లు, కొకేయిను, క్లోరల్, యెర్గాటు, గ్రిండేలియా, స్ట్రమోనియం, ఫెనాసిటిన్, జింకు ఆక్సైడ్, జింకు సల్ఫేట్.

గొంతు రోగములు—Throat affections

1. కొండనాలుకయొక్క వాపుదల— Tonsillitis

ఆసిడ్ బోరిక్, క్రియసోటు; బెలడోనా, క్వనీన్ సాలిసైలిసు, బెంజోయేట్లు.

2. గొంతు సడలించుటకు—Relaxed Throat

కార్బాలిక్, ఆసిడ్తో చేయబడిన గండూషము [పుక్కిలించెడి మందు] కొకేన్, ట్యానిక ఆసిడ్ గ్లిసరీక, క్లోరేట్లుతో చేయబడిన గండూషములు అమ్మోనియా క్లోరిడ్ లోనికి పీల్చుట, ఫెర్రయి పెర్క్లోర్, హైడ్రాస్టిసు గండూషము.

3. స్వరపేటికయొక్క వాపుదల—Laryngitis ✓

అకొనైటు, ఆసిడ్ ల్యాక్టటిక [పైన రాయుటకు] క్రియసోటు (లోనికి పీల్చుటకు రసధస్మమము; మెంతాల్ [పైనరాయుటకు]

## గౌటు [వాతరోగము]—Gout

అమ్మోనియా బెంజోయేసు, లిథియం లవణములు, మెంగనీసు లవణములు, కొల్చికము, పొటాసు అయొడైడు, మార్ఫియ [సూదితో లోనికి చొచ్చునటుల చేయుట]

## గ్రహణి—Dysentery

ఆసిడు కార్బాలికు, ఆసిడు ల్యాక్టికు, బిస్మత్ సాలిసైలిసు, క్యాల్సియం సాలిసైలిసు, కలేబిసు, క్లోరొడిన్, యూకలిప్టసు ఆయిల్, ఫెర్రయి సాలిసైలిసు, పలిసు ఇపికాకువానా పొడొఫయిలిన్, ఓలియం రెసినా [చిట్లాముదము) సోడియై ఫాస్ఫసు, బేల్.

## చెంపపై పొక్కులు—Lupus

ఆసిడు సిన్నమికం, ఆసిడు ల్యాక్టికు (పిగ్మెంటు] ఫాస్ఫరసు, కాడ్ లివర్ చమురు, పొటాసు అయొడైడ్ న్యూ, హైడ్రార్జిరి పెర్ క్లోరిడ్ న్యూ, అయొడో ఫారం, జింకు అయింటుమెంటు.

## చర్మరోగములు [క్రిమిజాలములతో గూడినవి)—Parasitic Skin-diseases

కార్బాలికు ఆసిడ్ అయింటుమెంటు, క్రిసారోబిన్, క్యాల్సియం సల్ఫయిడ్ లోషను, క్రియసోటు అయింటుమెంటు, సోడా హైపోసల్ఫిస్, థైమాల్.

## దీప తెక గజ్జి—Itch.

వాసలీన్; జింకు ఆక్సైడ్; జింకు అయింటుమెంటు.

## చెమట (అధికమగు)—Excessive Perspiration

ఆసిడ్ సాలిసైలికు; ఆసిడ్ బోరికు; ఆసిడ్ కార్బాలికు; జింకు ఓలియసు.

## జ్వరనివారిణులు—Antipyretics.

క్రియసోట్; గ్వయికల్; ఫెనాసిటిన్; పొటాస్ సిట్రస్; క్వినీన్; సాలిసిన్; సాలోల్.

చలిజ్వరము:— [రిమిటెంటు=నడుమ నడుమ తగ్గుచు వచ్చుచుండును; ఇంటర్మిటెంటు = విడిచి విడిచి వచ్చును[—Malarial Fever.

అమిల్ నైట్రిస్ ఆర్సెనిక్; క్రియసోట్; గ్వయికల్; ఆసిడ్ సాలిసైలిక్; సాలిసన్; యూకలిప్టస్ గ్లాబ్యులస్; హైడ్రాస్టిస్; క్వినీన్; టింక్చర్ వార్బర్గ్; ఫెనాసిటిన్.

## టైఫాయిడ్ జ్వరము—Typhoid Fever

బిస్మత్ ఆసిడ్ కార్బాలికు; సాలిసైలేట్లు; అమ్మోనియా కార్బనస్, యూకలిప్టస్ గ్లాబ్యులస్; గ్వయికల్ కార్బనస్; నాఫ్తాల్; ఫెనాసిటిన్; థైమాల్.

నరములతో సంబంధించిన తలనొప్పి—Nevrous Headache

పైత్యసంబంధమగు తలనొప్పి—Bilious Headache

యూనమిన్; హైడ్రాస్టిసు; పొడాఫయిలిన్; సోడా సంబంధమగు పొంగువచ్చు పదార్థములు; మెగ్నీసియా సల్ఫేట్.

జలుబు, పడిసెము సంబంధమగు తలనొప్పి—Headache from Cold

అమ్మోనియా క్లోరైడ్; హైడ్రార్జరీ సబ్‌క్లోరిడు (రసభస్మము;) సాలిసైలేట్లు.

దగ్గు—Cough

బాల్సం కర్జన్; బెలడోనా యిపికాకు మాత్రలు; టింక్చర్ క్యాంఫర్ కో; క్లోరోడీన్; కొడీన్; జెల్సిమియం; మార్ఫిన్; ఇపికాకు; టెరిబీన్.

దద్దురోగము (ఎరీసిపిలాసు)—Erysipelas

ఆసిడు బోరికు, ఆకోనైటు; ఆసిడు పిక్రికు; అంటిఫిబ్రిన్; బెలడోనా; డిజిటాలిసు; యెర్గాట్; ఫెర్రియి పెర్‌క్లోర్; కలోడియం.

దాహము—Thirst

ఆసిడు ల్యాక్టికు; అసిడు ఫాసుఫారికు డిల్యూట్; కోకా.

ధాతునష్టము (మూత్రముద్వారా అల్బుమిన్ అనబడు శ్వేతధాతువు నష్టమగుట)—Albuminaria

ఆసిడు పిక్రికు; జాబరాండీ; అమిలు నైట్రైటు; నైట్రైట్సు

నంజు (గుండె సంబంధమగు)—Cardiac Dropsy

కెఫీన్; డిజిటాలిసు; స్ట్రోఫాంతసు.

నంజు (మూత్రాశయ సంబంధమగు)—Renal Dropsy

అమ్మోనియా బెంజోసు; పిల్యూలా హయిడ్రార్జరి; సోడా అయొడైడు

నడుము నొప్పి—Lumbago

లినిమెంటు బెలడోనా (పైనరాయుటకు); మెంథాల్ ప్లాస్టరు (పైనవేయుటకు)

నపుంసకత్వము—Impotency

ఆర్సెనికు; కనేబిసు; కోకా, కొకేన్, డామియానా; యెర్గాట్; ఫెర్రియి పెర్‌క్లోరు; కనేబిసు; ఫాసుఫరస్; స్ట్రిక్నీన్.

నరముల సంబంధమగు బలహీనత—Nervous Dedility

కోకా, ఆసిడ్ ఫాసుఫారికు డిల్యూట్, అమ్మోనియం బ్రోమైడ్, క్యాంఫర్, క్లోరల్, ఫాసుఫరసు, క్వినీన్ సంబంధములు, సాలిసిన్, స్ట్రిక్నీన్, సల్ఫొనల్, జింకు వాలిరియేనిసు.

## నాడీవ్యాధి — Neuralgia

అమ్మోనియా క్లోరైడ్, కెనేబిను, జెల్సిమియం, హాయొసామిన్, ఫెనాసిటిన్, నైట్రోగ్లిసరీన్, ఫాసుఫరసు, క్వినీన్, బ్రోమైడ్లు, సాలిసిలేట్లు.

పైపూతకు:— లినిమెంట్ క్లోరోఫారం, లినిమెంటు అకొనైట్, మెంతాల్ సంబంధములు.

## నిద్రరామి–Insomnia

కెనేబిను సంబంధములు, క్లోరల్, కొడీన్; హాయొసామిను, మార్ఫిన్, బ్రోమైడ్లు, ఫెనాసిటిన్; సల్ఫొనలు.

## నిస్సత్తువ — Debility

ఆర్సెనిక్; ఫాసుఫేట్లు; హైపోఫాస్ఫైట్లు; మాల్ట్, క్వినీన్; సింకోనా సంబంధములు; ఈస్టన్స్ సిరప్; ఐరన్ సంబంధములు; కాడ్ లివర్ నూనె; స్ట్రిక్నీన్, ఫాసుఫరసు.

## నీరుడు తిత్తియొక్క వాపు (కండుట మంటతో గూడిననొప్పి) — Catarrh of Bladder

బెంజోయేట్సు; యూకలిప్టసు; హాయిడ్రాస్టిసు.

## న్యూమోనియా — Pneumonia

ఆసిడు సాలిసైలికు; అమ్మోనియా కార్బొనసు; ఈథర్, మార్ఫిన్; క్వినీన్

## నేత్రవ్యాధులు — Eye-diseases

1. కనురెప్ప యందున వాపుదల.

ఆసిడ్ బోరికు; హాయిడ్రార్జరి అక్సైడు ఫ్లేవి ఆయింట్ మెంట్, అయొడోఫారం; ఆయింట్ మెంటు.

2. కనురెప్పలకు లోపలిభాగమున స్ఫటికమువలె చిన్న అణువులేర్పడుట.

ఆసిడ్ బోరికు; హైడ్రార్జరి ఆక్సైడ్ ఫ్లేవి ఆయింట్ మెంట్; జింకు సల్ఫాసు లోషన్.

3. కంటిలోని పొర Cataract

సినరేరియా.

4. కంటిపాపలోని పుండ్లు; పుళ్ళుపేయుట.

అట్రోపీన్; బెలడోనా; కొకేన్; ఈసరీన్; హైడ్రార్జరి అక్సైడ్ ఫ్లేవి అయింట్ మెంటు.

5. కంటిపాప చుట్టు తెల్లని పొరగప్పుట.

అట్రొపీను; బెలడోనా.

6. కనుపాపను ముడుచుకొనునట్లు చేయుటకు.

జాబరాండి; మార్ఫిన్; ఫైసోస్టిగ్మా; ఈసరీన్.

7. కనుపాపను విస్తరింప జేయుటకు.

అట్రోపీన్; బెలడోనా; కొకేన్; హాయొసామిన్; హాయొసీన్.

పడిసెము (శ్వాస సంబంధమగు)—Bronchitis

లిక్కరు అమ్మోనియా అసిటేటిస్; అమ్మోనియా క్లోరిడు; యూకలిప్టస్; గ్రిండే లియా; ఇపికాకు; మార్ఫిను; కాడ్ లివరు చమురు; కార్బాలికు ఆసిడ్; క్రియసోట్ లోనికి పీల్చి వాసనచూచుట; ఫెనాసిటిన్.

పచ్చకామాల వ్యాధి—Jsmndice

అమ్మోనియా క్లోరిడు; బెంజోట్లు; యూనమిను; రసభస్మము; హైడ్రాస్టిసుపాడా ఫయిలిసు; సెన్నా; పొంగువచ్చు సోడా సంబంధములు.

పక్షవాయువు —Paralysis

హైపోఫాస్ఫయిట్సు; హామొసామి; ఫాస్ఫరసు; స్ట్రిక్నీన్; ఐరన్; ఫెర్రి అయొడైడు; పెప్సిన్; కాడ్ లివరు చమురు; ఫయిజోస్టిగ్మా.

ప్రసవ సంబంధమగు జ్వరము — Puerperal Fever

ఆసిడ్ బోరికు; జాబరాండి; ఫెర్రయి పెర్ క్లోర్; క్వినీన్.

పంటి నొప్పి — Toothache

కొకేన్, జెల్సీమియం; ఆసిడ్ కార్బాలికు; మెంతాల్ సంబంధములు, క్రియ సోట్, పొటాసు పర్మాంగనేట్.

పంటియొక్క చిగుళ్ళవాపు — Inffamed Gums

అలం (పటిక); ఆసిడు కార్బాలికు; టింక్చర్ అయొడిన్; టింక్చర్ అకొనైట్; పొటాసు క్లోరసు.

పాముకాటు — Snake-bite

లిక్కరు అమ్మోనియా ఫోర్ట్; పొటాసు పర్మాంగనేట్; స్ట్రిక్నీను.

పాండురోగము — Anaemia

ఆర్సెనికు; హాయిపో ఫాసుఫయిట్సు; ఐరను సంబంధములు; ఫాసుఫేటు; ఫాసు ఫరసు; క్వినీను సంబంధములు.

ప్లీహావ్యాధులు...Spleen Affections

క్వినీను; ఐరను, టింక్చరు అయొడిను—పైన రాయుటకు,

పులిపిరికాయలు ... Warts

ఆసిడు క్రోమిక్; కొకేను; కార్బాలిక్, ఆసిడ్; లినిమెంటు అయొడిను.

పురుగులు ... Worms

రసభస్మము; ఫెర్రయి పెర్ క్లోర్; శాంటోనీను; యూకలిప్టసు; పమిగ్రనేట్.

పురుగుకాటు ... Insect Bite

కార్బాలిక్ ఆసిడ్ లోషను, క్లోరోఫారం, కొకేను, లిక్కరు అమ్మోనియా సోడా, బైకార్బనేటు, తేలకుట్టునకు ఇపికాకుతో ఉడుకబెట్టిన పిండికట్టు, తైలములు.

### పుండ్లు ... Wounds

ఆసిడు బోరిక్, కార్బాలిక్ ఆసిడ్ లోషన్; కలోడియం: అయొడోఫారం, ఇక్తియాల్, పొటాస్ పర్మాంగనేట్, రిసార్సిన్, థైమాల్, జింకు క్లోరైడు, సాలోల్, హైడ్రార్జరీ పెర్క్లోరైడు లోషన్.

### పైత్యోద్రేకము ... Billiousness

అమ్మోనియా క్లోరైడ్, యూనమిన్, హైడ్రాస్టిస్, పోడోఫైలిన్, సెడ్లిజ్ పవుడర్లు.

### పొక్కుమందులు ... Caustics

క్రియసోట్, ఆసిడ్ క్రోమికు, హైడ్రార్జరీ పెర్క్లోరైడు, పొటాసు పర్మాంగనేట్ జింకు క్లోరైడు, ఆసిడ్ ఆర్సినియసు.

### పొంగు లేక పేపపువ్వు ... Measles

అకోనైటు, లిక్కరు అమ్మోనియో ఆసిటేటిను, స్పిరిట్ ఈథర్ నైట్రొసు, ఇపికాక్

### బట్టతల ... Baldness

క్లోరల్, లినిమెంటు క్యాంఫర్ కో, లినిమెంటు క్లోరోఫారం, జాబరాండి.

### బూరకాలు ... Elphant Leg

కాల్సియం సలుఫైడు, ఈస్టన్సు సిరప్

### బొబ్బలు, తామర, దురదలు ... Herpes and Shingles

మెంతాల్, వాసలీన్, కలోడియం, జింకు ఆయింట్ మెంటు, హాయిడ్రార్జరీ అమ్మోనియో ఆయింటు మెంటు, సలీన విరేచన కారులు.

### బొల్లి ... Leucoderma

బాల్సం గర్జన్, ఓలియం గైనోకార్డి.

### మద్యపానము ... Alcoholism

ఆర్సెనికు, కాప్సికం, క్లోరలం, కోకా, కోకేన్, హైడ్రాస్టిసు, మార్ఫిన్, ఫాస్ఫరసు, క్వినీన్.

### మలబంధము ... COnstipation

కాస్కారా సాగ్రెడా, రసభస్మము పోడోఫయిలిన్, చిట్టాముదము, సెడ్లిజ్ పవుడర్లు, సునాముఖి సంబంధములు, పొంగువచ్చు సోడా సంబంధములు, పొంగువచ్చు మెగ్నీషియం సలుఫేటు సంబంధములు.

మశూచి ... Small-Pox

పైకిరాయుటకు--అంగ్యుయెంటం ఆసిడు బోరిసియో, కార్బాలిక్ అయిలు, అంగ్యు యెంటం అయొడోఫారం, అంగ్యుయెంటం హైడ్రార్జిరి, కలోమియం, అంగ్యుయెంటం జింకు ఓలియేటు.

లోని కిచ్చుటకు--అంటిఫిబ్రిన్, అంటిపయిరిను, క్వైనాలాలు.

మాంసగ్రంధులయొక్క వాపుదల--Enlarged Glands

కాల్సియం క్లోరిడు, అయొడైడ్లు, ఐరను లవణములు, అయొడోఫారం, అయొడీను-లోని కిచ్చుటకును పైనరాయుటకును, హైడ్రార్జిరి ఓలియేటు, సోడియమై అయొడైడు.

మూత్రకోశము యొక్క వాపుదల --Nephritis

గోకూర, ఓలియం సాంటాలం (చందనీ)

రక్తమునందు మూత్రము గలియునట్టి వ్యాధి (యురేమియా--Uraemia

అమిలు నైట్రిస్, కెఫీను, డిజిటాలిసు, జాబరాండి, నైట్రోగ్లిసరీను, సోడై బెంజోను.

మూత్ర గ్రంధులయొక్క క్షీణదశ--Bright's Disease

కెఫేను, డిజిటాలిసు, హైడ్రాస్ట్రిన్, జాబరాండి, నైట్రోగ్లిసరీను.

మూర్ఛ--Epilepsy

గోల్డుబ్రొమైడు, బ్రొమైడ్సు, అర్సెనికు సంబంధములు, ఐరను లవణములు కెఫేను నైట్రోగ్లిసరీను, సోడియమై బ్రొమైడు అండు నైట్రిసు, స్ట్రిక్నిను, వెలిరియనేట్సు, జింకు బ్రొమైడు, జింకుసిట్రిను, జింకు లాక్టను, జింకు సల్ఫను, సల్ఫోనలు.

మూలశంక -- Piles

కెనాబినిసు, అరిష్టాలు, అంగ్యుయెంటం కోసై, కాస్కారా సాగ్రాడా, హమా మిలిసు, సెన్నా.

మెదడు మృదువగుట--Softening of the Brain

హాయిపో ఫాసుఫయిట్సు, ఐరను సంబంధములు, కాడ్లివరు చమురు, ఫాస్ఫరసు

మొటిమలు--Acne

అంగ్యుయెంటం ఆసిడు సాలిసైలికు, ఫెర్రియి యెటు క్వినీను సిట్రసు, హైపో ఫాస్ఫయిట్సు, హైడ్రార్జిరి పెరక్లోరిడు లోషను, ఇకుతియోలు, తైలాలు అయింటు మెంటు.

### రక్తస్రావము —Haemorrhage

లోపలికి – ఆసిడు పైరోగాలిక, హామామలిసు, ఐరను లవణములు
వెలుపలికి — ఆలం (పటిక), ఫెర్రయి పెరుక్లోరు, హామామలిసు

### రాత్రిచెమటలు — Night- Sweats

క్యాంఫారిక ఆసిడు, క్లోరలు, పల్విసు యిపికాకు కో, హైపో ఫాసుఫయిట్సు ఐరను లవణములు, జాబరాండి, సల్ఫొనలు, జింకు ఆక్సైడు.

### రికెట్సు—Rickets

క్యాల్సియం లవణములు, ఫాసుఫేట్సు, ఆసిడు ఫాసుఫారిక డిల్యూటు, కాడ్ లివరు చమురు, లోహ సంబంధములు, హైపో ఫాసుఫయిట్సు.

### వాపుదల – Inflammation

1. శ్వాస సంబంధమగునది.
అమ్మోనియా క్లోరిడు ఆవిరి, స్పిరిటు ఈతరు నైట్రిసు.
2. అన్నకోశము, ప్రేగుల సంబంధమగునది.
బిస్మత్ సంబంధములు; కెఫీను, యూకలిప్టసు, హయిడ్రాస్టిసు.
3. నాసిక సంబంధమగునది.
కార్బలైజ్డు సాల్టులు, క్యాంఫరు, కొకేను.
4. గర్భాశయ సంబంధమగునది.
అయొడోఫారం, జింకు సల్ఫసు.

### వాతరోగము—Rheumatism

1. ఉగ్రమతస్థితిలో:- ఆసిడ్ సాలిసైలిక; ఆసిడ్ క్రియసోటిక, కోటో, ఫెర్రయి పెర్క్లోర, ఓజోనిక ఈతర్, పొటాసు సిట్రిసు, క్వినీన్, సాలిసైలేట్సు, సాలోల్, ఫెనాసిటిన్.

2. దీర్ఘవ్యాపక స్థితిలో:- ఆసిడ్ సాలిసైలికు, అమ్మోనియా అయొడైడ్, బెల్లడోనా, లినిమెంట్ కాప్సికం, లినిమెంటు క్లోరోఫారం, కోటో, జెల్సిమియం, యూకలిప్టసు, అయిల్ (పైపూతి), సోడాఫయులిస్, ఓలియం గైనోకార్డి, ఓలియం కాజుపట్, ఓలియం క్రోటోనిస్.

### వాంతి కట్టుటకు—Vomitting.

బిస్మత్, కొకేన్, ఆసిడ్ కార్బాలిక్; క్లోరల్; ఇన్గ్లూవిన్; నైట్రోగ్లిసరిన్ పొంగువచ్చెడి ద్రవపదార్థములు; సోడా వాటరు మొదలయినవి.

### వాంతి కారులు—Emetics.

ఆలం (పటిక) ;ఇపికాక్, ఆవపిండి; సల్ఫసు' జింకు అసిటస్.

### విరేచనములు (చీము, నెత్తురు, మలముతో పడుట)—Dysentery.

హమామెలిస్; హయిడ్రార్జిరి పెర్క్లోర్; పల్వీస ఇపికాకుఆన్; మార్ఫియ స్వచ్ఛమగు టెరిబిన్; బేల్; బిస్మత్; సాలిసైలిసు ఓపియం; లెడ్ అసిటేట్.

వీర్యనష్టము — Spermatorrhoea.

బెలడోనా; యెర్గాట్; ఫెర్రి యి పెర్క్లోర్; ఫాసుఫేట్సు ఆఫ్ ఐరన్ అండ్ క్వైనీన్ ఈస్టనును సిరప్; సాలిక్సు నైగ్రా; డామియానా.

వెక్కిలి — Hiccough.

స్పిరిట్ ఈతెరిసు; క్యాంఫర్; క్లోరల్; అమిల్ నైట్రిస్; సోడా బైకార్బనేట్; స్పిరిట్సు క్లోరోఫారం.

పెఱ్ఱి — Insanity.

కనేబిస్. బ్రోమైడ్లు క్లోరల్; డిజిటాలిసు; హయొసామిన్. హయొసీన్. జెల్సిమియం; మార్ఫియా:

వెఱ్ఱికుక్క కాటువలన గలిగెడి రోగము — Hydrophobia.

కొరారీ; క్లోరల్; కనెబిసు, మార్ఫియా: నైట్రోగ్లిసరీన్.

శ్వాసకోశములనుండి యెఱ్ఱనిరక్తము గ్రక్కుట — Haemoptysis.

ఆసిడ్ పైరోగాలిక్; అంటిపైరిన్; ఆలం; డిజిటాలిసు: ఎర్గాట్ హమామెలిస్.

శ్వాసక్రుచ్ఛ్రము — Dyspnoea.

ఆసిడ్ కార్బాలికు, స్పిరిట్ ఈతెరిసు, అమిల్ నైట్రిసు నైట్రోగ్లిసరీన్, సోడి యొడైట్రిసు.

శుద్ధ రక్తనాళము యొక్క ఉబ్బుదల — Aneurism.

అకొనైట్, అమిల్ నైట్రైట్, డిజిటాలిసు, నయిట్రోగ్లిసరీను. పొటాసు అయొడయిడ్.

శూలనొప్పి — Colic,

ఈతర్: అమిల్ వెలీరియనసు, క్యాంఫర్, క్లోరోఫారం, క్లోరోడీన్, మెంతాల్ ఆయిల్ (పిప్పరుమెంటు), కాజిపట్ అయిల్.

స్నాయువులఈడ్పు (రోగమువలన) — Spasm.

ఈథర్, స్పిరిట్సు అమ్మోనియా అరోమెటికు; అమిల్ నైట్రిసు, క్యాంఫరు, టింక్చరు క్లోరోఫారం యెట్ మార్ఫియా: ఓలియం మెంతాపిప్.

సోరియేసిసు — Psoriasis:

పైనరాయుటకు; — ఆసిడ్ కార్బాలికు, క్రియిసారోబయిన్, ఆసిడ్ సాలిసైలిక్ ఓలియం గైనొకార్డి, ఇక్తియాల్, బాల్సంగర్జన్.

లోనికిచ్చుటకు ;— ఆర్సెనికు ఓలియం గైనొకార్డి, లోహసంబంధములు, కాడ్ లివర్ నూనె, ఫాస్ఫరసు, క్వినీను.

## స్క్రోఫ్యూలా—Scrofula.

కాల్సియం లవణములు: ఫాస్ఫేట్లు హైపోఫాస్ఫైట్లు; అయొడైడ్, లోహసంబంధమగు లవణములు, అయొడీన్; అయొడోఫారం, కాడ్లివరు నూనె, క్వినీను.

## స్తనములయొక్క—Breast Affections.

1. వాపుదల:—బెలడోనా.

2. పాలను వృద్ధిచేయుటకు;—ఆసిడ్ ల్యాక్టిక; జాబరాండి; మాల్టుయక్కు స్ట్రాక్టు; ఆముదపు ఆకులు.

3 పాలను నిలుపుచేయుటకు;—బెలడోన; కోనియం: ఐయొడైడ్; సలీన విరేచన కారులు.

4. స్తనాగ్రములయొక్క పుండు:—గ్లిసరీన ఆసిడ్ ట్యానిక్; కొకేన హైడ్రోక్లోర్.

## స్మృతి తప్పించెడు మందులు—Anaesthetics.

లోనికి పీల్చుటమూలమున:— ఈథర్; అమిల్ హైడ్రైడ్; క్లోరోఫారం మెథిలీన.

ఆసిడ్ కార్బాలిక్; ఈథర్; కొకేన.

## స్వస్థావస్థయందు ఇయదగిన మందులు (వ్యాధి కుదిరిన పిమ్మట—Tonics.

మీట్ (మాంస) సంబాధములు, సింకోనా; ఈస్టనుస్ సిరప్; గ్లిసరీన, కాడ్లివర్ నూనె; మాల్టు యక్స్ట్రాక్టు.

## క్షయరోగము—Phthisis.

లోనికిపీల్చుటకు:—ఆసిడ్ హైడ్రోఫ్లూరిక్; క్రియసోట్; మెంథాల్; టెర్బీన,

లోనికిచ్చుటకు:—ఆసిడ్ సిన్నమికం; ఆర్సెనిక్; కఫీన; కాల్సియం లవణములు; కొడీన; క్రియసోట్; గ్వాయికల్ కార్బనేట్; యూకలిప్టస్; కాడ్లివరు నూనె; పేంక్రియాటిన; పెప్సిన; సాలిసైలేట్లు; హైపోఫాస్ఫయిట్లు; మాల్టు.

## క్షీణగతి—Collapse.

స్పిరిట్ ఈథరిస్; స్పిరిటస్ అమ్మోనియా ఆరోమేటిక్; అమ్మోనియా లోనికి పీల్చుట; అమిల్ నైట్రిస్; అల్కహాల్; టింక్చర్ డిజిటాలిస్; నైట్రోగ్లిసరీన; స్ట్రిక్నీన.

## పైత్యకృచ్ఛ్రము—Biliary Calculi.

(పైత్యసంబంధమగు రాళ్ళు యేర్పడుట)

స్పిరిట్ ఈథరిస్; అమిల్ నైట్రిస; క్లోరల్; మార్ఫీన; నైట్రోగ్లిసరీన;

మూత్రకృచ్ఛ్రము — Urinary Calculi.

(మూత్రసంబంధమగు రాళ్ళు యేర్పడుట)

అమ్మోనియా ఫాస్ఫసు; అమ్మోనియా బెంజోసు; లిథియం లవణములు; సోడా బెంజోసు; పైపరజీన్.

---

# సౌందర్యరహస్యము

---

ఆస్ట్రేలియా సమీపమున నున్న న్యూజిలాండు ద్వీపమునందలి స్త్రీలు మెడలంతటికిని బురదను బట్టించుకొని అదియంతయు నారునంతవరకును అటులనే యుండి అనంతరము పరిశుభ్రస్నానము చేసి దానిని కడిగి వేయుదురట. అదియే వారల సౌందర్యమునకును ఆరోగ్యమునకును కారణమని చెప్పబడుచున్నది. పంది బురదమెచ్చుటకు సరియగుకారణమును మనము గ్రహింపజాలక పరిహాసాస్పదముగ బలుకుచుందుము.

---

కొన్ని ఔషధముల యొక్క వివరములు.

1. అమ్మోనియం క్లోరైడ్ — మోతాదు 5 గ్రా॥ మొదలు 20 గ్రా॥ 8 లేక 10 గ్రెయినుల మోతాదులలో అల్టరెటివుగా బనిజేయును. పెద్దమోతాదులలో చెమటను కలుగజేయుచు గ్రంధులపై బనిచేయును. ప్లీహ కారిజములయొక్క దీర్ఘవ్యాపిత అస్వస్థతలయందును, నరముల సంబంధమగు తలనొప్పియందును, కీళ్ళనొప్పులయందును, అమెనోరియా యందును, బనిచేయును.

2. ఇంగువ — మోతాదు 5 గ్రె॥ మొదలు 10 గ్రె॥ మొదలు 4 గ్రె॥ చురుకును బుట్టించుటకును, ఉబ్బును బోగొట్టుటకును, పనిచేయును. హిస్టీరియా యందును, కడుపుబ్బరము నందును, స్త్రీలకు గలుగు నరముల సంబంధమగు అస్వస్థతలయందును, ఉపయోగించును.

3. కర్పూరము (క్యాంఫరు). మోతాదు 2 గ్రె॥ చురుకును బుట్టించి, చెమటను వృద్ధిచేయును. 2 డ్రాముల క్యాంఫరును 9 డ్రాములు రెక్టిఫయిడ్ స్పిరిట్ లో కలిపిన స్పిరిట్సు అఫ్ క్యాంఫరు అగును. దీనిని అయిదు చుక్కల మోతాదులలో ప్రతి గంటకును

యిచ్చినయెడల జలుబువలన శిరోభారమును పోగొట్టును. పైకి దేలని కురుపులకు దరుచుగ నుపయోగించిన యెడల, వాటియొక్క అభివృద్ధిని నిలుపుచేయును.

4. క్వినీన్ సల్ఫేట్... మోతాదు 1 గ్రె॥ మొదలు 10 గ్రె॥ ఇది చలిజ్వరములకు మిగుల ఉపయోగము, జ్వరమును దగ్గించు గుణముకూడ కొంతవరకు గలదు. (పుష్టి)కుండ జేయు గుణమును, జీర్ణతయందు సహాయము జేయు గుణమును, గలవు. కొన్ని విషయములలో క్వినీన్ గర్భాశయము పయిన బనిచేయునుగాన, గర్భిణీ స్త్రీలకు దీనిని బహు జాగ్రత్తతో నియ్యవలయును. కొందరియొక్క శరీరతత్వమునకు క్వినీన్ సరిపడక పోవచ్చును. అట్టి వారలందు యీమందును పుచ్చుకొనిన పిమ్మట చెవులలో ధ్వనులు చెవుడు తలనొప్పి నేత్రములు యెఱ్ఱనగుట కండ్లు మసగలు వోకరయుం దాయాసము అతివిరేచనములు నోరుయొక్క పచ్చిదనము... యీ లక్షణములు కనుపడవచ్చును. అజీర్ణ విఘ్నములగు అజీర్ణతలయందు క్వినీన్ పనిచేయును. మలబంధ ముండియుండిన యెడల విరేచనకారి నిచ్చినపిమ్మట మరియు క్వినీన్‌ను యియ్యవలయును. జీర్ణసహాయమునకు గాని, బలవర్ధకౌషధముగ గాని, పెద్దవారలకు 2 లేక 3 గ్రెయినుల మోతాదులలో నియ్యవలసి యుండును.

5. క్లోరల్ హైడ్రేట్— మోతాదు 5 గ్రె॥ మొదలు 20 గ్రె॥ తగ్గి మోతాదులలో శరీరతత్వమునందు శాంతతతో గూడిన గుణమును బుట్టించును. పెద్ద మోతాదులలో నరగంటలోపుగనే నిద్రను బుట్టించును. ఈనిద్రవలన నేదడీ సౌఖ్యముగ నుండును. ఈ నిద్రభోజనమునకుగాని దగ్గుటకుగాని మెలకువను బొందనీయనంత గాఢముగ నుండజాలదు. నిద్రవచ్చుటకుగాను నల్లమందునకు బదులుగా నిది చాల విషయములలో నియ్యబడును. నల్లమందు నుపయోగించుట యందువలె, దీనియందు సామాన్యముగ, పిమ్మట తలద్రిప్పుట, నరముల సంబంధమగు నిస్సత్తువ, ఆకలియొక్క క్షీణత, మలబంధము...యీ గుణములు కనుపడవు నరముల సంబంధములగు నొప్పులు కీళ్ళనొప్పులు మూర్ఛలు ఉబ్బసము దగ్గు నిద్రరామి... యీ వ్యాధులయం దీ ఔషధము వాడబడును. ఈ ఔషధము కొందరి తత్వములకు పడక పోవచ్చును, గనుక జాగ్రత్తతో నుపయోగించవలసి యుండును. ఎదరొమ్ము సంబంధమగు అస్వస్థతలలో చెమట యెక్కువగా వెడలిపోవుచుండు స్థితియందు దీనిని విశేషించి యిచ్చిన యెడల, నిద్రగుణము వలన చెమట వెడలుట అగిపోయి, ఊపిరియందు ఆయాస మధిక మగును. కాబట్టి, యిట్టి విషయములందు ఎక్కువ జాగ్రత్త అవసరమయి యున్నది. గుండె రోగములయందు దీనిని ఉపయోగించ గూడదు. ఉద్రేకతను దగ్గించుట కయినయెడల, పెద్ద వారలకు 5 గ్రె॥ మొదలు 10 గ్రె॥ వరకు నియ్యవచ్చును. నిద్రవచ్చుట కయిన యెడల, 15 గ్రె॥ మొదలు 20 గ్రె॥ వరకు నియ్యవలయును. త్రాగుడు అలవాటు అయినవారలకు యింతకు పెద్దమోతాదులలో నియ్యవలసి యుండును. తనిచో నుపయోగించ నేరదు. నీరస స్థితియం దున్నవారలకు తక్కువ మోతాదుల నియ్యవలసి యుండును. దీనిని కొంచెమునీళ్ళలో పంచదారనుగూడ గలిపి యియ్యవచ్చును. బిడ్డలకు సంవత్సరమునకొక గ్రెయిను చొప్పున మోతాదు నిర్ణయపడగును.

6. క్లొరొడీన్.

బాధ నణచివేయుటకును, చెమటను బుట్టించుటకును, దగ్గులు, జలుబులు, ఇన్ఫ్లూయంజా, చలిజ్వరము... వీటియందు మోతాదు 5 మొదలు 15 చుక్కలు.

ఉద్రుతవ్యాధులయందు ఊపిరిని దగ్గించుటకు, ఉబ్బసము, రొమ్ముపడిసెము, మొదలగు వాటియందు మోతాదు 10 మొదలు 25 చుక్కలు.

అధికస్రావముల నణచివేయుటకు కాలరా, ఆమ విరేచనములు, అతి విరేచనములు, కడుపునొప్పి, మొదలగు వాటియందు మోతాదు 15 మొదలు 30 చుక్కలు.

బిడ్డలకు

| వయసు | మోతాదు | వయసు | మోతాదు |
|---|---|---|---|
| 1 మా॥ మొదలు 3 మా॥ | 1 చుక్క మొ॥ 2 | 3 సం॥ మొ॥ 5 సం॥ | 3 చుక్కలు మొ॥ 8 |
| 3 ,, 6 | 2 ,, 4 | 5 ,, 8 | 4 ,, 10 |
| 6 ,, 12 | 2 ,, 5 | 8 ,, 12 | 8 ,, 12 |
| 1 సం॥ మొ॥ 3 సం॥ | 3 ,, 6 | 12 ,, 16 | 10 ,, 20 |

దీనిని నీళ్లలో వేసిగాని, కొద్దిమోతాదు అయిన యెడల చక్కెరపైన వేసిగాని, పుచ్చుకొనవచ్చును. దీనిని ఉపయోగించుటకు ముందుగా బాగుగ గలుపవలసి యుండును. లేనిచో అడుగున మడ్డి పేరుకొని మోతాదు క్రమముగా నుండకపోవును.

7. గంధకము— మోతాదు 20 గ్రె॥ మొదలు 60 గ్రె॥ బిడ్డలకు మోతాదు 2 గ్రె॥ మొదలు 5 గ్రె॥ టేబ్లాయిడ్ (బిళ్ళ)రూపమున నియ్యవలెను. మూలశంకయందు విరేచనకారిగ దీనిని లోనికియ్యవలెను. గజ్జి మొదలగు వాటికి ఉపయోగించు ఆయింట్ మెంట్లయందును ఉపయోగింతురు.

8. చిట్లాముదము ... మోతాదు పెద్దవారలకు అరఔన్సు మొదలు ఔన్సు వరకును, బిడ్డలకు అరడ్రాము మొదలు 2 డ్రాములవరకును; ఇది విరేచనకారి అయి యున్నది. గర్భిణీ స్త్రీలకు గూడ నుపయోగింపవచ్చును.

9. టింక్చర్ క్యాంఫర్ కో ... మోతాదు 30 మినిములు మొదలు 60 మినిములు. దీనిలో టింక్చర్ ఓపియం (నల్లమందు) కలిసియుండును. తెమడ వెడలి పోవుట కుపయోగించు మందులయందు దీనిని సామాన్యముగ వాడుదురు.

10. టింక్చర్ డిజిటాలిసు... మోతాదు 5 మినిములు మొదలు 10 మినిములు. డిజిటాలిసును ముఖ్యముగా గుండెరోగముల యందుపయోగింతురు. దీనివలన పరిశుద్ధ రక్తనాళముల యందలి రక్తప్రచార మధికమగును. ఇది యీ మందును వాడుటయందలి ప్రధమగతి అయియున్నది. ఈస్థితియందు గుండెదెబ్బల యొక్క సంఖ్య నిముషమునకు 60 వరకు దగ్గును. గుండెదెబ్బల యొక్క సంఖ్యతగ్గును. బలము మాత్రము హెచ్చును. దీనియొక్క వాడుకయందలి ద్వితీయగతి యందు, గుండెయొక్క స్థితిలో నేమియు మార్పులేక,

మూత్రాభివృద్ధి కనపడును. ఈ కారణమువలననే, నంజువ్యాధియందు టింక్చరు డిజిటాలిసును 10 లేక 15 మినిముల మోతాదులలో ప్రతి నాలుగు గంటలకును యిచ్చుచుండుట వలన సుపయోగముగ కనుగొనబడెను. తృతీయగతియందు గుండెదెబ్బలయొక్క సంఖ్య అధికమయి, దెబ్బలయందలి బలము తగ్గిపోవును, ఈస్థితియందు రక్తప్రచారము క్షీణతనందుట కారంభించును. చతుర్థగతియందు, గుండెదెబ్బ యొక్క క్రమత తప్పిపోయి, అరుచి, బలహీనతతోగూడి, శరీరమునందంతటను, రక్తప్రచార హీనత ప్రవేశించుట వలన, మరణము సంభవించును. తృతీయచతుర్థ గతులను జాగ్రతతో గమనించవలసి యుండును! బలమగునట్టియు జీర్ణమగునట్టియు జీర్ణత నందినట్టియు ఆహారములేకుండ డిజిటాలిసును యిచ్చిన యెడల గుండెకు అలసటను కలుగజేయును గాన జీర్ణాశయము యొక్కయు కాలిజము యొక్కయు పేగుల యొక్కయు క్రమస్థితులను గమనించుచుండ వలయును. గుండెయందు క్రొవ్వుయేర్పడిన స్థితియందు డిజిటాలిస్‌ను యిచ్చుటవలన క్రమత చెడిన మూర్ఛనమును పగులుటయును గలుగును గాన యీస్థితియందు నీ ఔషధమును సేవించరాదు.

11. టింక్చరు జింజరు... మోతాదు 30 మినిములు మొ॥ 60 మినిములు జీర్ణాస్వస్థతల కుపయోగింపబడును. మూప్పదిరెట్లనీళ్ళతో గలిపినపుడు, పచ్చిగొంతునందు గండూషముగ నుపయోగింపనగును. ఒక సంవత్సరము వయసుగల బిడ్డకు 1 మొదలు 4 చుక్కల వఱకు నియ్యవచ్చును.

12. పల్వెసు ఇపికాక్ కో... మోతాదు 5 గ్రా॥ మొదలు 15 గ్రా॥ దీనికి డోవర్సు పౌడరు అను పేరు పేరుకూడ గలదు. దీనిలో 10 వ వంతు ఓపియం (నల్లమందు) ఉండును. ఎదురొమ్ము అస్వస్థతలు, కీళ్ళనొప్పులు, అమవిరేచనములు, చలిజ్వరములు... యీ వ్యాధులయందీ ఔషధ మూపయోగింప నగును. దీనివలన కడుపులో దిప్పుట కలుగును గాన, ఈ మందు నుపయోగించిన వెంటనే యితర ఆహారము సేవించరాదు.

13. బేల్ (మారేడు) యక్స్ట్రాక్టు బేల్ లిక్విడ్... మోతాదు 1 డ్రాము మొదలు రెండు డ్రాముల వరకును, దీనియందు ట్యానిక ఆసిడ్ ఉండును. పేగులనుండి రక్తస్రావమును గట్టుబాటు చేయును; కొంచెము విరేచనకారిగ గూడ పనిచేయును. దీర్ఘవ్యాపితమగు అతివిరేచనముల యెడలను, అమ విరేచనముల యెడలను, ఉపయోగించును. బిడ్డలయందు దరుచుగ గలుగుచుండు పేగుల యందలి అస్వస్థతలు అనగా, అతి విరేచనములును మలబంధమును ఒకటి విడిచి యొకటి కలుగుచుండుటయందు, యీ ఔషధము బాగుగా పనిచేయును.

14. మెగ్నీసియం సల్ఫేట్ — మోతాదు 2 డ్రాములు మొ॥ 4 డ్రా॥ వరకు. ఇది యెప్సంసాల్టు అనియు పిలువబడును. బలమగు విరేచనకారి.

15. వైనం ఇపికాక్ — తెమడను వెడల జేయుటకు గాను 10 మినిములు మొదలు 30 మినిముల వఱకును; వాంతికారిగ 4 డ్రాములు మొదలు 6 డ్రాముల వఱకును, మోతాదుగ నుపయోగింప నగును. బిడ్డలయందు వాంతి కారిగ, పల్విస్ ఇపికాకును ఉపయోగించుట కంటె, వైనంఇపికాకును ఉపయోగించుట యెక్కువ మేలుగనుండును. పల్విస్ ఇపికాకునకును పల్విసు

ఇపికాకు క్రో కును భేదమనుగుర్తింపనగును; రెండవ దానియందు ఓపియం (నల్లమందు)ను పొటాస్ సల్ఫేటును గలిసియుండును.

16. మెగ్నీషియా సిట్రిస్—దీనిని నీటిలో వేయగనే పొంగును. ఒకటి లేక రెండు పెద్దచెమిచాలతో దీసి, దీనిని ఒక టంబర్లు నీటిలో వేసి పుచ్చుకొనుట వలన, సాధు విరేచనకారిగ బనిచేయును. నీరసస్థితిని వహించియున్న జనులు 20చుక్కల టింక్చర్ జింజర్ నుగూడ గలిపి పుచ్చుకొననగును. ఒక చిన్న చెమిచా కొలత గల దానిని పుచ్చుకొనుటవలన, జ్వరగతుల యందు జిల్లదనమును బుట్టించును; యీస్థితియందు 20 మినిముల స్పిరిట్ ఈథర్ నైట్రిస్‌ను గూడ గలుప వచ్చును.

17. లైకర్ స్ట్రిక్నీస్ హైడ్రోక్లోర్—మోతాదు 2 మినిములు మొ॥ 8 మినిములు. స్ట్రిక్నీసు, విషముష్టి (నక్సవామికా) సంబంధమైనదై యున్నది. ఇదినరముల రోగముల బలవర్ధకౌషధముగను; పక్షవాతమునందును; మద్యపాన స్థితియందును, బనిచేయును; లైకర్ ఆర్సెనికాలిసుతో గలిపి దీనిని యియ్యరాదు. క్షారసంబంధమగు పదార్థములతో గలిపియు; నియ్యగూడదు.

18. స్పిరిట్ ఈథర్ నైట్రిసు—మోతాదు, మరలమరల యిచ్చుటకు 20మినిములు మొదలు 40 మినిముల వరకును, ఒకటే మోతాదుగ నిచ్చునెడల 50 మినిములు మొదలు 90 మినిముల వరకును, యియ్యనగును, చెమటను వృద్ధిపరచి, మూత్రగ్రంథులపై బనిజేయుటవలన, మూత్రము నభివృద్ధి చేయును; జ్వరములందు మిగుల ఉపయోగముగ నుండును, ఆరు మాసముల బిడ్డకు 3 చుక్కలు మొదలు 5 చుక్కల వరకు నియ్యవలయును. ఒక సంవత్సరము వయసునందు 6 మొదలు 10 చుక్కలవరకు నియ్యవలయును.

19. స్పిరిటస్ అమ్మోనియా ఆరోమేటికు—మరల మరల యిచ్చుటకు 20 మినిములు మొదలు 40మినిములవరకును, ఒకటే మోతాదుగ నిచ్చు నెడల 60 మినిములు మొదలు 90 మినిముల వరకును, యియ్యనగును. హిస్టీరియా, తలనొప్పి, తలత్రిప్పుట, గుండెఅదరు మూర్ఛ, కొన్ని అజీర్ణములు, కడుపుబ్బరము—యీవ్యాధులయందు దీనౌషధము నుపయోగింపనగును.

20 సోడా సల్ఫేట్—మరల మరల యిచ్చునెడల దీనిమోతాదును అరడ్రాము మొదలు 2 డ్రాములవరకు నియ్యవచ్చును ఒకటేమోతాదుగ 3 డ్రాములు మొదలు 4 డ్రాముల వరకును. అవసరమయిన యెడల ఒకఔన్సువరకును గూడ నియ్యవచ్చును. ఇది నీళ్లవిరేచనము లగునట్లుచేసి, కొంచెముగా మూత్రగ్రంథులపైన గూడ పనిచేయును. పెద్ద మోతాదులుగ నిచ్చినపుడు శరీర వేడిమిని దగ్గించునుగాన, పేగులయొక్క వాపుదలయందును, యితర వాపుదలల యందును; జ్వరములందును గూడ దీనినియ్యవచ్చును. మెగ్నీషియం సల్ఫేట్ కంటె నిదితక్కువ అసహ్యముగ నుండునుగాన; సుకుమారులగువారు కూడ దీని నుపయోగింపనగును.

21. సెన్నా ఆకులు (సునాముఖి)—దీనిని విరేచనకారిగ; బిడ్డలకును పెద్దవారలకును, గర్భిణీస్త్రీలకును, యియ్యవచ్చును. స్తన్యము నిచ్చు స్త్రీలకు మాత్రము నియ్యరాదు. అట్లిచ్చుటవలన బిడ్డలయందతివిరేచనములు ప్రారంభమయి, కడుపునొప్పి యేర్పడవచ్చును.

సునాముఖి కషాయము జేసి, పాలను పంచదారను గలుపుట వలన, రుచికి తేయాకు నీళ్లవలె నుండును. ఒక ఔన్సు సునాముఖీ ఆకులను, 30 గ్రయినుల అల్లమును, 10 ఔన్సుల ఉడుకునీళ్లలో ఒకగంట కాలమునుంచి, పిమ్మట వడియగట్టి, దీనినుండి 1 లేక 2 ఔన్సులనుమోతాదుగ నుపయోగింపనగును. ఇది పెద్దవారల కుపయోగించు మోతాదు అయి యున్నది.

22. లిక్కర్ అమ్మోనియా ఆసిటేటిసు డిల్యూట్.

1 ఔన్సు అమ్మోనియా కార్బనసును 10 ఔన్సుల జలములో గలిపి, లిట్మసు కాగితమును దీనిలో ముంచినయెడల "బ్లూ" కాకుండు నంతవరకును, బ్లూలిట్మసు కాగితమును దీనిలో ముంచినయెడల యెరుపు కాకుండు నంతవరకును, దీనియందు ఆసిటికు ఆసిడును గలిపి, పిమ్మట నిది ఒక పైంటు అగునంతవరకును జలమును గలిపి, అమృతాంజనపుసీసాలో నిలువచేయవలెను. ఆసిటికుఆసిడును అవసరమైన దానికంటె నెక్కువ గలుపకుండునట్లు జాగ్రతను బుచ్చుకొనవలయును. దీనియొక్క మోతాదు 2 డ్రాములవరకు అయియున్నది.

## కల్పిత శ్వాసకృత్యము.

1 కల్పితమైన శ్వాసకృత్యమునందు, యీక్రింది అంశములను గమనింపవలయును. రోగియొక్క శిరమును భుజములను దిండ్లపైఆనిచ్చి పరుండబెట్టి, మొదటగా చేతులను పైకియెత్తి, నిశ్చలముగాను మెల్లగాను రెండుసెకనుల కాలములో చేతులను వెనుకకు పైపులకు జాచవలయును; ఇందుమూలమున శ్వాసకోశముల లోనికి పరిశుభ్రమగు గాలి ప్రవేశించును. పిమ్మట రోగియొక్క చేతులను ముందుకుద్రిప్పి మడచి, మెల్లగా రెండుసెకనుల కాలమువరకు ఎదురొమ్ముపైఆనిచ్చి ఉంచవలయును: ఇందుమూలమున శ్వాసకోశముల యందలి దుర్వాయువులు బయటికి దోలివేయబడును. ఈరెండువిధములగు పనులను నిమిషమునకు పదునైదు పర్యాయముల చొప్పున, ఉచ్ఛ్వాస నిశ్వాసములు వాటంతట అవి కలుగువరకును జేయవలయును.

ఈపనులను జేయుచున్నపుడు స్మెల్లింగ్ సాల్టును వాసన జూపుట వలనను, గొంతుకనందు యీకతో గిలిగింత పెట్టుటవలనను, ముఖమును ఎదురొమ్మును తోముటవలనను: వాటిపైన చన్నీళ్లను వేడినీళ్లను ఒకటి తరువాత నొకటి కొట్టుటవలనను, వేడిగుడ్డలతో ఒడలంతయు రుద్దుటవలనను, ఎలెక్ట్రికు బ్యాటరీ అందుబాటునం దుండినయెడల దానిని గుండెపైనయును మెడపైనయును ప్రయోగించుట వలనను, ఉపయోగ ముండగలదు. ఈప్రకారము ఒకగంటకాలము చేసిన పిమ్మట, ఉపయోగము లేకపోయినయెడల, మరణము కలిగియున్నదని నిశ్చయింపవచ్చును.

---

# మఱికొన్ని ఔషధయోగములు

## మూత్రబంధము.

| | | |
|---|---|---|
| స్పిరిట్సు జూనిపర్ | ... | డ్రాములు 3 |
| అసిటేట్ ఆఫ్ పొటాష్ | ... | డ్రాములు 4 |
| నైట్రేట్ ఆఫ్ పొటాష్ | ... | డ్రాములు 2 |
| స్పిరిట్ ఈథర్ నైట్రిసు | ... | డ్రాములు 6 |
| జలము | ... | ఔన్సులు 12 |

మూత్రము బంధించినప్పుడు మూడుగంటల కొక ఔన్సు చొప్పున నీయవలయును.

## ప్యాటర్సన్సు కాలరా మాత్రలు.

| | | |
|---|---|---|
| క్యాలోమెల్ (రసభస్మము) | ... | ఔన్సు 1 గ్రా॥ 20 |
| ఓపియం (నల్లమందు) | ... | ఔన్సు 1 గ్రా॥ 20 |
| క్యాంఫర్ | ... | ఔన్సు 1 గ్రా॥ 20 |
| అసిటేట్ ఆఫ్ లెడ్ | ... | ఔన్సు 1 గ్రా 40 |
| అసిటికు ఆసిడ్ | ... | డ్రాము 1 |
| పల్వెసు క్రీటా అరోమెటికు | ... | ఔన్సులు 4 గ్రా॥ 80 |
| జలము | ... | చాలినంతవరకు. |

అసిటేట్ ఆఫ్ లెడ్‌ను అసిటికు ఆసిడ్‌లో మిళితముజేసి కరగించి, రెక్టిఫయిడ్ స్పిరిట్ కొన్నిచుక్కలతో కాంఫరును పొడిచేసి, వీటినన్నిటిని మర్దన చేయవలయును. పిమ్మట అంతయు మృగన యగునటుల వలసినంత నీటితో క్యాలోమెల్‌ను, పల్వెసు క్రీటా అరోమెటికను నీటితో మిశ్రమముచేసి, అంతయు గట్టిముద్ద యగునటుల కల్వములోకొట్టి 1,000 మాత్రలుగా జేయవలయును.

ఒక్కొక మాత్రయందు అరగ్రెయిను క్యాలోమెల్, అరగ్రెయిను ఓపియం, అరగ్రెయిను క్యాంఫరు, ఒకగ్రెయిను అసిటేట్ ఆఫ్ లెడ్, గ్రెయినులు పల్వెసుక్రీటా అరోమెటిక, ఉండును.

మోతాదు:— 1 లేక 2మాత్రలు.

## నవనీతము,

సరిసమానములగు లిన్‌సీడ్‌నూనె లేక కొబ్బరినూనెయును, లైంవాటరు (సున్నపు నీళ్ళు) యును మర్దనచేసిన యెడల తెల్లని పదార్థము యేర్పడును. దీనికే నవనీతమని పేరు. దీనిని కాలిన పుండ్లకు ఉపయోగింపనగును.

---

## ముఖ సం. పుండ్లకు లోషన్

| | | |
|---|---|---|
| క్యాలోమెల్ (రసభస్మము) | ... | గ్రెయినులు 30 |
| లైంవాటరు | ... | ఔన్సులు 10 |

ఈరెంటిని బాగుగ కలిపి లోషన్‌గా చేయవలయును. రెంటిని కలుపుటలో నల్ల నిరంగు ఏర్పడును. ముఖసంబంధమగు పుండ్లను కడుగుటకు ఉపయోగింప నగును.

## నరముల నొప్పులు.

| | | |
|---|---|---|
| టింక్చరు ఓపియం | ... | డ్రాము 1 |
| టింక్చరు అకొనైట్ | ... | డ్రాము 1 |
| టింక్చరుక్లోరోఫారం | ... | డ్రాము 1 |
| సోప్ లినిమెంటు | ... | ఔన్సులు $1\frac{1}{2}$ |

పైచెప్పినన్నిటిని బాగుగ కలిపి నిలువయుంచి "విషము" అనిగుర్తుపెట్టుకొన వలయును. నరముల సంబంధమగు నొప్పులకు స్పంజితోగాని; నీటితోగాని పైన రుద్దవలయును.

## గజ్జి.

| | | |
|---|---|---|
| గంధకపు పలుకులు | ... | ఔన్స 1 |
| నైట్రేటు ఆఫ్ పొటాష్ | ... | డ్రాము $\frac{1}{2}$ |
| గ్లిసరిన్ | ... | డ్రాము 1 |
| లానొలీను | ... | ఔన్సులు 4 |

లానొలీనును నిప్పుపై కరగబెట్టిన పిమ్మట తక్కినవాటిని బాగుగ కలుపవలెను. గజ్జికి ఉపయోగించును. దీనికే గంధకపు ఆయింటుమెంటు అందురు.

## చెవిపోటు.

| | | |
|---|---|---|
| టింక్చరు ఓపియం | ... | డ్రాములు 4 |
| గ్లిసరిన్ | ... | డ్రాములు 4 |

ఈ రెంటిని కలిపి చెవిలో పోయుట కుపయోగింపనగును.

## కంటి దురదలు.

| | | |
|---|---|---|
| (1)అలం (పటిక) పొడి | ... | గ్రెయినులు 20 |
| జలము ... | ... | ఔన్సులు 8 |
| (2)బోరి కుఆసిడ్ | ... | గ్రెయినులు 30 |
| జలము | ... | ఔన్సులు 8 |

బాగుగా కలిపి లోషన్‌గా చేయవలయును. కంటి దురదలకు ఉపయోగింపనగును. పై 2 వ దానినే బోరికు లోషన్ అందురు.

## నేత్రవ్యాధులు.

| | | |
|---|---|---|
| సల్ఫేట్ ఆఫ్ జింకు | ... | గ్రెయినులు 8 |
| జలము | ... | ఔన్సులు 8 |

బాగుగా కలిపి లోషన్‌గా చేయవలయును. నేత్రవ్యాధుల కుపయోగింప నగును.

## గండూషములు.

### నోటిపూత.

| | | |
|---|---|---|
| ఆలం (పటిక) | ... | డ్రాము 1 |
| జలము | ... ... | ఔన్సులు 8 |

కలిపి గండూషముగా జేయవలయును. నోటిపూతకు ఉపయోగింప నగును.

### గొంతు సడలింపు.

| | | |
|---|---|---|
| టింక్చర్ జింజర్ | ... ... | డ్రాము 1 |
| జలము | ... ... | ఔన్సులు 8 |

గొంతుసడలింపునకు గండూషముగా నుపయోగింపనగును.

### ఉమ్మిఊరుట, నోటిపూత.

| | | |
|---|---|---|
| గాలిక్ ఆసిడ్ | ... ... ... | గ్రెయినులు 20 |
| బ్రాంది | ... ... ... | డ్రాములు 4 |
| జలము | ... ... ... | ఔన్సులు 6 |

ఈ మూటిని గలిపి గండూషముగా జేయవలయును. ఉమ్మిఊరుటకును, నోటిపూతకును, ఉపయోగింపనగును.

| | | |
|---|---|---|
| జింకు సల్ఫేటు | ... ... | గ్రెయినులు 30 |
| జలము | ... ... ... | ఔన్సులు 8 |

ఈరెంటిని గలిపి గండూషముగా జేయవలయును, ఉమ్మిఊరుటకును, నోటిపూతకును, గొంతునొప్పికిని ఉపయోగింప నగును;

### కాలరా డ్రాప్స్.

| | | |
|---|---|---|
| సల్ఫ్యూరిక్ ఆసిడ్ | ... ... | మినిములు 8 |
| రక్టిఫయిడ్ స్పిరిట్ | ... ... | మినిములు 24 |
| అనిసీ ఆయిల్ | ... ... ... | మినిములు 30 |
| క్యాజిపట్ అయిల్ (యూలక అరకు) | ... | మినిములు 30 |
| జూనిపర్ అయిల్ | ... ... | మినిములు 30 |
| ఈథరు | ... ... ... | డ్రాములు 4 |
| టింక్చరు సిన్నమన్ | ... ... | ఔన్సులు 2 |

మోతాదు:—2ఔన్సుల జలములో 10 మినిములు కలిపి యియ్యవలయును. గాజుకార్కు మూతగల సీసాలో వేసి నిలువ యుంచవలయును.

## కాలరా సెలైన్.

| | | |
|---|---|---|
| సోడియం క్లోరైడ్ ... ... | గ్రేయినులు | 150 |
| సోడా బైకార్బొనేట్ ... ... | గ్రేయినులు | 50 |
| సోడాఫాస్ఫేట్ ... ... | గ్రేయినులు | 50 |
| బైకార్బొనేట్ ఆఫ్ పొటాసు ... | గ్రేయినులు | 30 |
| క్లోరినేటెడ్ సోడా సొల్యూషన్ ... | డ్రాములు | 22 |
| జలము ... ... ... | ఔన్సులు | 10 |

మోతాదు:— అరఔన్సు మొదలు ఒకఔన్సు వరకును.

## కార్బాలిక్ ఆసిడ్ లోషన్.

| | |
|---|---|
| కార్బాలికు ఆసిడ్ ... ... | 1 భాగము |
| సామాన్యపు వేడినీళ్ళు ... ... | 40 భాగములు |

రెంటిని కలుప వలయును.

### కార్బాలిక్ ఆసిడ్ లోషన్ (గాఢమైన)

| | |
|---|---|
| కార్బాలికు ఆసిడ్ ... ... | 1 భాగము |
| సామాన్యపు వేడినీళ్ళు ... ... | 20 భాగములు |

## కార్బాలిక్ ఆయిల్.

| | |
|---|---|
| కార్బాలికు ఆసిడ్ ... ... | 1 భాగము |
| కొబ్బరినూనె ... ... | 20 భాగములు |

నోటు:— పై ఔషధ యోగములలో కలుపుటకు నియోగింపబడిన జలము, ముందుగా మసలకాగ బెట్టబడి చల్లార్చబడిన జలము అయి యుండవలయును. నీళ్ళు కాచబడి ఆవిరిగా మార్చబడి, చల్లార్చి తిరిగి నీళ్ళుగా మార్చబడినవి శ్రేష్ఠమైనవి గాని, యిట్టి దకము లభించుట కష్టము గాన, మసల గాచి చల్లార బెట్టిన నీళ్ళు వాడవచ్చును. లోపలికి పుచ్చుకొనదగిన ప్రతి ఔషధమును ముందుగా కలుపవలయును.

—•••—

## చికిత్సా వ్యాధి సూచిక